


# శ్రీ అక్కల్‌కోట
# స్వామి సమర్థ లీలామృతము



ఓం శ్రీ సాయిరాం ఓం అవధూత చింతన
శ్రీగురు దేవదత్త జయ ఓం

# శ్రీ అక్కల్‌కోట
# స్వామి సమర్థ లీలామృతము

## మొదటి అధ్యాయము

## ప్రార్థన

**ఓం** శ్రీం గం గ్లం గణేశాయ నమః ఓం మూలాధార నిలయ సంకల్ప దేవతా! మునుముందుగా నిన్ను పూజించి నీ కరుణచేతనే సమస్త దేవతలు, మహర్షులు సకల కార్యములలోను విజయము సాధించుచుందురు. విఘ్న వినాయకా! నీ కృపచేతనే ఈ విఠలానందుడు శ్రీ స్వామి సమర్థుల చరిత్రను వ్రాయబూనినాడు. స్వామీ గణేశా! దయాసాగరా! ఎటువంటి విఘ్నములు కలుగకుండా ఈ వచన కావ్యమును పూర్తిచేయు శక్తిని నాకు కలుగనిమ్ము.

ఓ శారదా! సకల విద్యలకు నిలయమై సకల కవితా స్ఫూర్తిని కలిగించు శక్తివి నీవు, అమ్మా! నీకు సాష్టాంగ ప్రణామములు అర్పించుచున్నాను. గైకొని ఈ అవధూత చరిత్రను వ్రాయు శక్తినిమ్ము. ఓ బ్రహ్మ-విష్ణు-మహేశ్వరులారా! మీమీ శక్తులను ఏకంచేసి అవతరించిన శ్రీ దత్తస్వామి అవతార కథ యిది. దీనిని వ్రాయు శక్తిని నాకు కలిగించ ప్రార్థన. పండరీశా! పాండురంగా! నీ గానమువలన మోక్షమును పొందిన భక్తులు ఎందరో కలరు. నిరంతరము నీ నామము జపించు ఈ విఠలుడు నీ నామధారకుడు ప్రారంభించిన ఈ కార్యమును సఫలము చేయుము. సద్గురుమూర్తి శ్రీ సాయినాథా! నీ చరిత్ర పారాయణముచే ముక్తిని పొందువారు ఎందరో కలరు. నిరంతరము నీ చరిత్రము గానముచేయు నీ దాసుడు నీ సమకాలికుడైన యోగిపుంగవుని చరిత్రను వ్రాయబూనినాడు. దయతో అనుమతి నొసంగి, కావ్యమును పూర్ణము గావించు శక్తి నొసంగుము. అవధూతలారా! పరమహంసలారా! మహర్షులారా! భాగవతులారా! సర్వ గురుజనులారా! మీ అందరికీ సాష్టాంగ దండ




ప్రణామములు. మీ దీవెనలు అమోఘములు. ఎట్టి కఠిన కార్యమైనా మీ అమృత ఆశీస్సులచే నిర్విఘ్నముగా నెరవేరును. మీరు అందరూ కరుణాసముద్రులు. అద్వితీయ శక్తిమంతులు. కారణజన్ములు, తత్త్వదర్శులు. మీ అనుగ్రహంతోనే నేను మీ అందరికీ ఆత్మవంటి ఈ కథను వ్రాయబూనితిని. ఆశీర్వదించండి. ఓ స్వామి సమర్థ! నీవు సకల జగత్తుకు కారణభూతుడవు. నీవు అండ పిండ బ్రహ్మాండములందు నిండియున్నావు. నీ చరిత్రను నీవే రచించుకొనవలయును. నేను నిమిత్త మాత్రుడను. సంకల్పం నీది. దయాసాగరా! భక్తులకు నీ లీలామృతమును అనుగ్రహించుము.

జన్మనిచ్చిన తల్లిదండ్రులారా! విద్యనొసగిన గురువులారా! పోషణము చేసిన మహాత్ములు శ్రీ పండరి నివాసుడు శ్రీ కైకాడి మహారాజునకు, సకల విద్యలను స్ఫురింపజేసిన గురువులకు, సన్యాసదీక్షనిచ్చిన శ్రీశ్రీశ్రీ స్వామి నిరంజనానంద సరస్వతీ మహారాజ్‌లకు సాష్టాంగ దండ ప్రణామములుచేసి, మీ అందరి కరుణతో, దీవెనలతో ఈ నాలుగవ దత్తావతారుని చరిత్రను వ్రాయబూనితిని, విజయము చేకూర్చండి.

త్రిలోకధామా! త్రివిద్యా ప్రదాత! త్రిపుర రహస్య ప్రబోధకా! అత్రి అనసూయ నందనా! శ్రీ దత్తాత్రేయా! నిన్ను నిత్యం స్మరించినవారికి సకల శక్తులను ప్రసాదించుట నీ నైజము. దేవాదిదేవా! ఈ విఠలుడు నిన్ను నిత్యం స్మరించుచు నీకు దత్తమై యున్నాడు. దీనదయాళో! నీవే నీ అవతార కథకు శక్తిని, పుష్టిని కలిగించి, నా కలమున నిలచి దివ్యమైన నీ గుణ గానమును సాగనిమ్ము. ఇది సకల భక్తులకు భక్తిని, శక్తిని, జ్ఞానమును, మోక్షమును కలిగించునట్లు ఆశీర్వదింపుము. అమ్మలగన్న యమ్మ మా యమ్మ లలితాంబికా! పద, పదములో నీవే నిలిచి వీనిని సత్యవచనములుగా, శక్తివచనములుగా చేయుము. నీకు నా శతకోటి వందనములు. ప్రకృతి శక్తులారా! త్యాగధనులారా! తత్త్వదర్శులారా! మీరందరూ నా వెంట నుండి స్వామి సమర్థుల విజయమును, లీలామృతమును సాగనిండు. మీకు నా మనఃపూర్వక వందనములు. చదువరులారా! మీరును శ్రద్ధగా శ్రీ స్వామి సమర్థులను మనస్సున స్మరించుకొనుచు జయఘోష చేసి ప్రారంభించగలరు.

**"జయ జయ స్వామి సమర్థ**
**అక్కల్ కోట స్వామి జయ"**



**శృతి వాక్యం :**

**సత్యం సత్యం పునః సత్యం - సత్యం సత్యం మ యోచ్యతే ॥**

**సత్యము, సత్యము, మరల సత్యము. ముమ్మాటికీ సత్యము నాచే వచింపబడుచున్నది** అని భగవంతుడు ప్రవచించిన రీతిని అనేకులు ఈ భారతావనిలో సత్యాన్వేషకులై, సాధకులై జీవించి తత్త్వమును, దానిలో సత్యమును గ్రహించి ముముక్షువులు అగుచున్నారు. ఇది కర్మభూమి, యోగభూమి, త్యాగభూమి, పుణ్యభూమి, మోక్షభూమి. ఇచ్చట మానవుని భగవంతుని దిక్కునకు త్రిప్పుటయే యగుచున్నది. పరమార్థములను బోధించిన భారత తత్త్వవేత్తలు మానవుని పశుత్వము నుండి మానవత్వమునకు గొనిపోవు తీవ్రప్రయత్నము అనాదికాలమునుండి చేయుచున్నారు. ఇటువంటి పుత్రులను గన్న భారతమాత ఎంతో అదృష్టవంతురాలు. ఇట్టి భారతదేశంలో జన్మించి, వర్థిల్లి, అందే లయించు భారతీయులు ఎంతో ధన్యాతి ధన్యులు. ఈ దేశమున గురుశిష్య సాంప్రదాయము అనాదిగా అత్యంత వైభవముగా విరాజిల్లుతున్నది. సద్గురువునకై సాధకులు ఈ దేశమున అన్వేషణ గావింతురు. వారి మనోవృత్తులన్నీ ఏ మహాపురుషుని దర్శనంచేత లయం అగునో, అదే తమ గురుస్థానమని నమ్మి వారిని ప్రత్యక్షంగానైనా, పరోక్షంగానైనా సేవించి ముక్తి నొందుచున్నారు. అందులకే ఈ భారతావని ముక్తిభూమి అని పేరొందినది. ఇట్టి స్థితి మరే దేశములందు కానరాదు. భారతజాతి జీవన విధానం సభ్యత, సంస్కారములతో కూడుకున్నది. ఇది పవిత్ర గంగాప్రవాహం లాంటిది. ఈ జాతి జీవన స్రవంతిలో ప్రతి బిందువూ పవిత్రత కలిగినదే. భారత ప్రజలు అనాది నుండి పెంపొందించుకొనుచు వచ్చుచున్న యోగ సాంప్రదాయము, వివిధ మార్గముల ద్వారా పయనించి చివరకు ఏకత్వం పొందును. నదులన్నీ ఎలా ఎంత దూరం ప్రయాణించినా చివరకు సముద్రుని చేరు రీతిని, వివిధ సాంప్రదాయములు ప్రబోధించే తత్త్వం, సత్యం యిదియే. ఈ విశ్వం, దాని నిర్మాణం, తత్త్వం, దాని మూలములను సంపూర్ణంగా తరచిచూచి, నిజ తత్త్వమును తెలిసికొని, ఈ పరమసత్యాన్ని ప్రబోధించు మహాపురుషులే ఈ జాతికి రక్షకులు. వారి ప్రబోధములును, వారి నిజజీవిత విధానములే ఈ జాతికి మార్గదర్శకములు. ఇట్టి మహనీయులెందరినో జగత్తుకు అందజేసినది

 

ఈ భారతదేశం. అనేకమంది అవధూతలు, తత్త్వవేత్తలు, తత్త్వాన్వేషకులు, యోగులు ఈ దేశంలో తమ తమ సాధనలతో జగత్తునకు, జగత్తులోని జీవరాశికి రక్షణ కల్పించుచున్నారు.

ఇటువంటి తత్త్వవేత్తలకు, అవధూతలకు, ఎందరికో గురువులైనవారు శ్రీ అక్కలకోట నివాసులు శ్రీ స్వామి సమర్థులు. వీరు చేతి స్పర్శతో, చూపులతో, సంకల్పంతో, మంత్రబలంతో, వాక్కులచేత శక్తి పాతము చేసి అనేక మంది సాధకులను, సాధారణ వ్యక్తులను మహాత్ములుగా, అవధూతలుగా తీర్చిదిద్ది, గురువులకే గురువులైనారు. అంతటి శక్తిపరులు అయిన శ్రీ స్వామి సమర్థులు 22 సం॥లు నివసించిన ప్రదేశమే ఈ అక్కలకోట. అందులకే స్వామిని అక్కలకోట మహరాజ్ అని భక్తులు పిలుచుకుంటారు. వీరు దత్తావతారులుగా కొనియాడబడినారు. అనేకమందికి శ్రీదత్తమూర్తి స్వప్నంలో కనుపించి వీరివద్దకు చేరమని తెల్పిరి. శ్రీ స్వామివారు దత్తాత్రేయులుగా, పాండురంగనిగా అనేక మందికి దర్శనమిచ్చినారు. వారి శిష్యులు ఈ దేశంలో దత్త సాంప్రదాయాన్ని ఎంతో ప్రచారంచేసి శిష్య జనులను ఉద్ధరించినారు. దిగంబరులుగా అనేక ప్రాంతములు సంచరించిన శ్రీ స్వామివారు ఎన్నో అద్భుతమైన లీలలను ప్రదర్శించి, శిష్ట జనులను రక్షించి, దుష్ట జనులను శిక్షించినారు. గురువులకే గురువైన శ్రీ జగద్గురువు, సద్గురుమూర్తి చరిత్రమును ముందు అధ్యాయములలో దర్శించగలరు.

## కథా ప్రారంభము

పవిత్రమైన ఈ దేశంలో కాశీయను పుణ్యక్షేత్రం గలదు. అది అన్నప్రదాత అయిన మాత శ్రీ అన్నపూర్ణకు, పరమదయాళుడు అయిన శ్రీ విశ్వేశ్వరులకు నిలయం. అనాదిగా అనేకమందికి ముక్తి నొసగిన పుణ్యస్థలం. అందు భారద్వాజస గోత్రికుడు, ధార్మికుడు, భక్త శిఖామణి, పరమ సాత్వికుడు, అతిథి అభ్యాగతులను సేవించువాడు అయిన శ్రీ దయాసాగరుడు అను బ్రాహ్మణుడు నివసించువాడు. అతని ధర్మపత్ని జ్ఞానేశ్వరి. ఈ దంపతులు అన్యోన్యముగా జీవించుచు, నిరంతరము విశ్వనాథుని, అన్నపూర్ణలను సేవించుచు, సాధు సత్పురుషుల సేవలో, వారి సాన్నిధ్యంలో గడుపు చుండెడివాడు. ఆ దంపతులకు వారి తపోబలం వలన ఒక కుమారుడు




జన్మించెను. అతనికి విద్యాసాగరుడు అని నామకరణం చేశారు. అతడు చిన్నతనముననే వినయ సంపన్నుడై గురువులవద్ద సకల విద్యలు నేర్చుకొనెను. విద్యల ప్రభావమున ఆధ్యాత్మిక విషయములు కొద్దికొద్దిగా బోధపడెను. ప్రతినిత్యం గంగాతీరమున కూర్చుని విశ్వేశ్వరుని ధ్యానించుచుండెను. అతని పుణ్యవశమున అతనిలో తత్త్వవిచారము ప్రారంభమయ్యెను. "ఇది ఏమి విచిత్రము? ఈ శరీరమేమి? ఈ సృష్టియేమి? ఈ పుట్టుట, చచ్చుట ఏమి? ఈ ప్రకారము కలకాలము జరుగవలసినదేనా? ఈ దుస్సహ యాతనా పరంపరను నిలుపుదల చేయుటకేదైనా ఉపాయము కలదా?" అని ఆలోచించ మొదలిడెను. దీనిని 'శుభేచ్ఛ' అనెదరు. ఇది సప్తజ్ఞాన భూమికలలో మొదటిది. బహుజన్మ పుణ్య విశేషముచేతనే ఇట్టి వివేకము అతనిలో జనించెను. ఈ విషయమై అతను తీవ్రముగా యోచించుచుండెను. కొలది కాలము గడచినది. ఆ యోచన అతి తీవ్రతరమైనది. దాని నివారణకు అతను అనేకమంది పుణ్య పురుషులను దర్శించి వారితో చర్చించెను. అతనికి సమాధానంకంటే ప్రశ్నలే అనేకం ఉత్పన్నం అయినవి.

ఆ రోజులలో కాశీక్షేత్రంలో యోగులు కొందరు కలిసి మణికర్ణికా స్నానఘట్టమువద్ద చాతుర్మాస వ్రతమును ప్రారంభించిరి. అందులో లోక కళ్యాణార్థం సుదీర్ఘ యాగమును సంకల్పించిరి. అందు ఈ విద్యాసాగరుడు తన జ్ఞానమునభివృద్ధి చేసుకొనుటకుగాను ఆ యోగులను ఆశ్రయించి వారిని సేవింప మొదలిడెను. ఆ నాలుగు మాసములు గృహమునకు వెళ్ళక, ఎట్టి శ్రమకైనను ఓర్చుకొని ఎల్లప్పుడూ వారి కనుసన్నలలో మెలుగుతూ, వారిచే నొసగబడు ప్రసాదమును, వారి ఉచ్ఛిష్టమును భుజించుచు, ఎండనక, వాననక వారిని సేవించెను. వారు ఈ బాలుని వినయ విధేయతలను చూచి ఆనందించి "సద్గురువుల అనుగ్రహం కలుగుగాక" అని దీవించిరి. అంతేగాక వారి ప్రవచనములచేత యితనికి గురుభక్తి కల్గినది. సద్గురువును పొందాలి అనే కాంక్ష మొదలైనది. దానికై ఎలా ప్రయత్నించాలి? ఎలా పొందగలను? అని మనస్సున తీవ్రముగ యోచించుచు, ఆ వ్రతము పరిసమాప్తి కాగా వయో వృద్ధులు, జ్ఞానస్వరూపులు అయిన ఆ యోగుల సన్నిధి చేరి నమస్కరించి "ఆచార్యులారా! మీరు సద్గురువు అనుగ్రహము కలగాలి అని దీవించినారు. చాలా ధన్యుడను. అయితే సద్గురువు ఎచ్చట లభించగలడు? వారిని గుర్తించుట

ఎట్లు? వారిని సేవించుట ఎట్లు? నాయందు దయచూపి తెలుప ప్రార్థన" అని చేతులు జోడించి ప్రార్థించెను.

అంతట ఆ యోగులలో అతి వృద్ధుడు అయిన శ్రీ నిరంజనానంద సరస్వతి అను సాధుపుంగవుడు విద్యాసాగరుని చూచి "వత్సా! నీ ప్రశ్నలు అత్యున్నతమైనవి. అనేక జన్మల సంస్కారముచేత, పుణ్యఫలంచేత నీలో ఈ తత్త్వ విచారణ మొదలైంది. ముక్తసంగుడవు అయినావు. అందుచేతనే యిటువంటి ప్రశ్నలు వేయగలిగినావు" అని దీవించి "వత్సా! సద్గురువు ఎచ్చట లభించును అని అడిగినావు. సద్గురువు ఒకచోట లభించును, ఒకచోట లభింపడు అని చెప్పలేము. గురువు సర్వాంతర్యామి, సర్వశక్తి స్వరూపుడు, వారు అంతటనూ వున్నారు, అన్నిటా వున్నారు. వారు తమను తాము ఈ జగత్తుకు ఏనాడో దత్తం చేసుకొనినారు. శిష్యుడుకూడ శ్రద్ధచేత, ఓర్పుచేత, నిరంతర అన్వేషణచేత, మనోవాక్కాయ కర్మలచేత తనను గురువునకు దత్తం చేసుకొనినప్పుడు, శిష్యుని సాధన, అతని పుణ్యఫలం పరిపక్వం అయినప్పుడు వారు లభించగలరు. దానికి ఒక నిశ్చితమైన స్థలం లేదు. అది ఎచ్చటైనా జరుగవచ్చును. మరియు బాలకా! వారిని గుర్తించుటెట్లు అని అడిగినావు. ఇన్ని ఆలోచనలతో నున్న నీ మనోవృత్తులన్నీ ఏ సత్పురుషుని సందర్శనముచేత శాంతినొంది నిర్మలమగునో, విషయేచ్ఛ తొలగిపోవునో, అంతఃశ్శుద్ధి ఏర్పడునో, పరిశుద్ధమైన శీలం అలవడునో, పరమసత్యమైన ఈశ్వరతత్త్వం గ్రాహ్యమగునో అదే నీ గురుస్థానంగా గుర్తించాలి. అక్కడే నీకు జ్ఞానప్రబోధం జరిగి పరమేష్ఠి అనుగ్రహం కలుగును. మరియు ఓ జిజ్ఞాసీ! నీవు అడిగిన ప్రశ్నలలో ఆఖరిది.

'గురువును సేవించుటెట్లు?' దానికి సమాధానంగా, తత్త్వదర్శి, యోగి అయిన గురువును ఎవరు శ్రద్ధతో, వినయముతో, తదేక నిష్ఠతో, పట్టుదలతో, ఏకాగ్రతతో, మనోవాక్కాయ కర్మలతో సేవించుచు, ఇంద్రియ నిగ్రహము పాటించెదరో వారికి గురువు అనుగ్రహం కలుగును. శ్రద్ధారహితునికి, సంశయచిత్తునికి, గురువు అనుగ్రహం కలుగదు. అంతియేకాదు. ఈర్ష్య, అసూయ, ద్వేషం కలవారికి గురుదర్శనమే దుర్లభం.* విషం శరీరమును నష్టపరిచితే, ద్వేషం విషంకంటే అధికంగా శరీరంతోపాటు జీవాత్మకు కూడా

---

* *ద్వేషం అనగా ద్వి-విషం (రెండు రకాల విషం).*



నష్టం కలిగించగలదు. అందువలన సాధకుడు వీటిని దూరంగా వుంచి, గురువునుచేరి, సాష్టాంగ నమస్కారమాచరించి, సేవించి, వారి ప్రబోధములను మననంచేసి, సాధనచేసి ముక్తుడు కావాలి. అంతియేగాక, అనన్య భక్తితో గురు శుశ్రూష చేయాలి, స్వార్థాన్ని త్యజించాలి. సుఖదుఃఖాలను సమభావంతో స్వీకరించడం అలవర్చుకోవాలి. సర్వభూతహితుడు కావాలి. పవిత్ర కార్యాచరణతో వ్యవహరించాలి. పరమ పవిత్రతో కలసి మెలసి చరించాలి. గురువైన మహాత్ముని పాదపద్మములనే ఆశ్రయించాలి. నేను, నాది అనే భావం త్యజించి, సర్వము గురువునకు సమర్పించి, త్యాగంతో, మౌనవ్రతంతో, పరమ గురువుపై పరిపూర్ణ విశ్వాసంతో, సహనంతో, ఆయనను పూజించి, ఆత్మజ్ఞానం పొందాలి. ఇట్లు ఆత్మజ్ఞానం పొందినవారికి అసాధ్యం అన్నది ఏదీ లేదు. వారు మృత్యువునుకూడా జయింపగలరు. మోక్షాన్ని పొందగలరు. వేదాంత శాస్త్రములో గురుసేవను నాలుగు విధములుగా చెప్పినారు.

**(1) స్థాన శుశ్రూష, 2) అంగ శుశ్రూష, (3) భావ శుశ్రూష, (4) ఆత్మ శుశ్రూష.**

1. **స్థాన శుశ్రూష :** అనగా, శ్రీగురుదేవుని ఆశ్రమమునుగాని, గృహారామములనుగాని పరిశుద్ధము చేయుచు, భద్రముగా రక్షించు చుండుట. అంతియేగాదు, శ్రీగురుదేవులు ఏయే దేశముల కరిగి భక్తులకు జ్ఞానబోధచేసి పవిత్రులను చేయుచున్నాడో, అట్లే తానుగూడ చేయుట స్థాన శుశ్రూష యగును.
2. **అంగ శుశ్రూష :** అనగా, గురువుయొక్క దేహమును సేవించుట, రక్షించుట మరియు శ్రీగురుమూర్తి ఏయే తపముల నాచరించి ధ్యానాదులచే శరీరమును పవిత్రముగా శుద్ధము చేసికొనెనో, తానట్లు తన శరీరమును తపోధ్యానాదులచే తేజోవంతముగ, నిర్మలముగను చేసికొనవలెను.
3. **భావ శుశ్రూష :** అనగా, గురుడే తల్లి, తండ్రి సమస్తమును ఆయనే అని భావించవలెను. శ్రీగురుడు ఎట్టి పరబ్రహ్మ తత్త్వమును నిరంతరము భావించుచుండెనో, అట్లు తానుకూడ భావించుటకు అభ్యాసము చేయవలయును.
4. **ఆత్మశుశ్రూష :** అనగా గురువునకు ఇష్టమైన పదార్థములను అడుగక మునుపే తెచ్చి యిచ్చుట మరియు గురుదేవుడెట్టి స్వరూప స్థితిలో నిలిచి



పరబ్రహ్మ స్వరూపుడై యున్నాడో, తానట్లు స్వస్వరూపమును మరువక సదా సర్వాత్మ భావముతో, పరబ్రహ్మ స్వరూపుడై యుండుటకు ప్రయత్నించవలయును. ఇదియే శాస్త్ర ప్రబోధము.

"ఓ బాలకా! నీవు భారతావనిలోగల అనేక పుణ్యక్షేత్రములను దర్శించి, అందు గురువును అన్వేషింపుము. నీ మనోవృత్తులు ఎచ్చట శాంతినొందునో, నీకు శాంతి ఎచ్చట లభించునో, అదియే నీ గురుస్థానమని గుర్తించి అచ్చటగల సద్గురువును సేవించి వారి ద్వారా నీవు ముముక్షత్వమును పొందుము. ఈ విషయమును తిరిగి చెప్పుచున్నాను గ్రహింపుము!" అని ప్రబోధించెను.

అంతట విద్యాసాగరుడు వారందరికీ పాదాభివందనముల నాచరించి, శెలవు తీసుకొని తన గృహమునకు వచ్చి, తల్లిదండ్రులకు తన సంకల్పము తెలిపి, వారి అనుమతినొంది, వారి ఆశీస్సులతో తన యాత్ర ప్రారంభించెను. మొదటగా కాశీ విశ్వేశ్వరుని, అన్నపూర్ణ మాతను దర్శించి తనకు సద్గురువు లభించు విధముగా దీవించమని కోరి, యాత్రను ప్రారంభించెను.

అనేకమైన దివ్యక్షేత్రములను దర్శించి, హిమాలయములకు చేరి అచ్చటగల తీర్థరాజములను, సాధకులను దర్శించి, అజ్మీర్ దగ్గరగానున్న పుష్కర క్షేత్రమును (బ్రహ్మకుండి) చూచి, బ్రహ్మ దేవాలయమును దర్శించి, అభూగిరి స్థానముచేరి శ్రీదత్త పాదుకలను దర్శించి, అచ్చటగల వారిచే శ్రీ దత్తాత్రేయ స్వామి లీలలను తెలుసుకొని గిరినార్ చేరి అచ్చట దత్తపాదుకలను పూజించి, అచ్చట దత్తావతారములను గూర్చి తెలుసుకుని, శ్రీ స్వామి సమర్థులను గురించి విని, గరుడేశ్వర్‌చేరి శ్రీ వాసుదేవానందుల సమాధిని దర్శించి, వారి దర్శనమును పొంది, షేగాంచేరి శ్రీ గజాననులను సేవించి వారి అనుగ్రహమును పొంది, షిరిడిచేరి సాయిబాబాను దర్శించి, వారి జీవిత చరిత్రను అక్కడ సప్తాహ రూపమున పారాయణము చేయుచు, ప్రతిదినం అన్ని హారతులకు, సేవలలో పాల్గొని, సాయి అనుగ్రహం పొంది, పండరిపురము చేరి చంద్రభాగలో స్నానముచేసి పండరినాథుని దర్శించి, అచ్చటనుండి దత్తస్థానమైన ఔదుంబరమును దర్శించి, అచ్చట శ్రీ నరసింహ సరస్వతీస్వామి వారిచే ప్రతిష్ఠితమైన కామ్యపాదుకలను సేవించి, శ్రీగురుచరిత్ర పారాయణ సప్తాహం చేసెను. అక్కడ నుండి నరసింహవాడి చేరి పరమ పవిత్రమైన కృష్ణా పంచగంగానదీ సంగమంలో స్నానంచేసి శ్రీగురుడు ప్రతిష్ఠించిన నయన



పాదుకలను దర్శించి, అక్కడగల శ్రీరామచంద్ర మహరాజ్, శ్రీ గోపాలస్వామి మహరాజ్‌ల జీవ సమాధులను దర్శించి, ప్రతిదినం నదిలో స్నానం చేసి పాదుకా మందిరమునకు, ఔదుంబర వృక్షమునకు 108 ప్రదక్షిణలు చేసి, అచ్చటనే శ్రీగురుచరిత్రను అత్యంత దీక్షతో, నియమనిష్ఠలతో పారాయణం చేయసాగెను. సప్తాహం పూర్తయిన తరువాత బ్రాహ్మణుల సహకారంతో పూర్ణాహుతిని పూర్తిచేసెను (ఆ రాత్రి స్వప్నంలో ఒక విచిత్రమైన ఆకారంతో ఆజానుబాహుడు, సరియైన ఆచ్ఛాదన లేని రూపంలో కనబడి) "నాయనా! నీవు అక్కల్‌కోటకు వెంటనే వెళ్ళుము" అని ఆదేశించెను. అక్కడి నుండి కొల్హాపురంలో శ్రీ మహాలక్ష్మిని దర్శించి, అచ్చటనేగల స్వామి సమర్థుల మందిరము దర్శించెను. ఆ స్వామి రూపమును చూడగానే అవ్యక్తానుభూతి కలిగెను. కనులనుండి ఆనందబాష్పములు రాలినవి. శరీరము పులకరించినది. నరసింహవాడిలో స్వప్నములో దర్శనమిచ్చినది స్వామి సమర్థులే అని అర్థమయినది. అచ్చట ఒక సప్తాహముండి శ్రీగురుచరిత్రను పారాయణముచేసి మనస్సును నిర్మలం చేసుకొనెను. స్వామి స్వప్న దర్శనమొసంగిరి. ఆ స్వప్నములో వారు "వత్సా! అక్కల్‌కోటకు నీవు వెంటనే చేరుము" అని తిరిగి ఆదేశించిరి. అచ్చట నుండి బయలుదేరి ఆనందముగా శ్రీ స్వామి సమర్థుల నామం జపించుచూ అక్కల్‌కోట చేరెను.

పాఠకులారా! గురువును పొందవలెను అంటే ఎంత ప్రయత్నం అవసరమో, ఎంత తపన అవసరమో, గురువును సేవించుట, వారిని గుర్తించుట మున్నగునవి తెలుసుకున్నారుగదా! రెండవ అధ్యాయములో విద్యాసాగరుడు అక్కల్‌కోట చేరి అక్కడ గురు అనుగ్రహం ఎలా పొందినాడో తెలుసుకొందాం!

**జై సమర్థ సద్గురు అక్కల్‌కోట మహరాజ్‌కీ జై**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ)*
*విరచిత* ***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***మొదటి అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం ఓం అవధూత చింతన
శ్రీగురు దేవదత్త జయ ఓం

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## రెండవ అధ్యాయము

**ఓ** స్వామి సమర్థా! నీవు అనంత ఘటనాఘటన సమర్థుడవు. నీవే వినాయకుడవై విఘ్నములను బాపుచుందువు. నీవే శ్రీవాణివై విద్యలకు నిలయమై సర్వుల వాణిని నడిపించెదవు. సకల దేవతా స్వరూపా! నీ సంకల్పంచేతనే జగత్తు నిత్యము తన కార్యక్రమములలో నిమగ్నమైయున్నది. ఇది నీ లీల. సర్వాంతర్యామీ! నేను అతి సాధారణుడను. విద్యాభ్యాసం యింకా పూర్తికాని వాడిని. అయినా నీ ప్రేరణచే నీ చరిత్ర వ్రాయబూనినాను. ఆదేశం నీది, అనుగ్రహం నీది, భక్తావళిని అనుగ్రహించి నీ చరిత్రను నీవే సంకల్పించు చున్నావు. నేను, నాది అను ఈ భావము స్థూలము. అంతా నీవే అయినపుడు నేను ఎక్కడ? అందుచేత నీవే ఈ శరీరమును ఉపయోగించుకొని నీ కార్యమును నిర్విఘ్నముగా, నిరాటంకముగా సాగనిమ్ము. ఓ సద్గురు సాయినాథా! నీవు తోడుగనిలచి కథను సాగనిమ్ము. జై దత్తావధూత!

విద్యాసాగరుడు పరమ పవిత్రమైన దత్తక్షేత్రము చేరినంతనే అతనికి మహదానందము కలిగినది. మొదట స్వామి నివసించిన చోళప్పమఠం (సమాధి మందిరం) చేరి శ్రీ స్వామివారి సమాధిని దర్శించి శ్రీవారి పాదుకలను శిరమున ధరించి ఆనందమును పొంది "హే! కరుణానిధీ! దివ్యపురుషా! అనాధనాథా! ఆదిమధ్యాంతరహితా! అద్భుతానంద చరితా! ఇంతకాలమునకు నన్ను అనుగ్రహించితివా!" అని స్వామిని స్తోత్రించి, అచ్చటగలవారిచే అచ్చటి విశేషములను తెలుసుకుని, వటవృక్ష మందిరము చేరి స్వామిని దర్శించెను. అచ్చట లభించు ప్రసాదమును స్వీకరించి, శ్రీగురుచరిత్ర పారాయణ చేయ మొదలిడెను. ప్రతిదినము క్రమము తప్పక స్వామి సేవలలో పాలుపంచు




కొనుచు, ధ్యానాది సాధనముల నిర్వర్తించుచు శ్రీగురుచరిత్ర పారాయణము చేయుచుండెను. అచ్చటనే అనేక సంవత్సరముల నుండి శ్రీ స్వామి సమర్థులను సేవించుచుండిన వయోవృద్ధులు, జ్ఞానస్వరూపులైన శ్రీ నిత్యానందుడు అను యోగిపుంగవుని పరిచయము కలిగెను. అతనితో అనేక ఆధ్యాత్మిక విషయములు చర్చించుచుండెను.

ఇట్లుండ, ఒకనాడు అతడు స్వామి సమర్థుల దర్శనం పొందాలి, వారి దీవెనలను పొందాలి అని నిర్ణయించుకొని శ్రీ స్వామి సమర్థులు శరీరమును విసర్జించిన వటవృక్షము క్రింద కూర్చొని పూర్వం యోగులు ఉపదేశించిన విధంగా, శ్రీ స్వామిని గురించి ధ్యానం ప్రారంభించినాడు. అట్లు ధ్యానం చేసుకొనుచుండగనే, అతని కండ్లవెంట ఆనందాశ్రువులు రాలినవి. ఒడలు పులకరించినది. అతనికి స్వామి సమర్థుల దర్శనం కలిగినది. అట్లు కొంత సమయము గడిచినది. ఆ మూర్తి కనుమరుగైనది. తిరిగి ఆ మూర్తిని దర్శించాలని అతను అనేక దినములు ఏకాగ్రచిత్తుడై అచ్చటనే ధ్యానమును నిరంతరము కొనసాగించినాడు. అతనికి బాహ్య విషయములపైన ధ్యాస లేకుండా పోయినది. నిత్యకర్మలు, ఆహారమును మరచినాడు. దేనిపైనా మమకారం లేకుండా నిర్మలచిత్తంతో ప్రవర్తించసాగాడు. శ్రీ స్వామివారి దర్శనం కోసం ఎదురుచూడసాగాడు. అతని ధ్యానతీవ్రత మరియు దర్శనాకాంక్ష ఎక్కువ కావటం మొదలిడినది. ఇట్లు కొంతకాలం జరిగిన పిమ్మట ఒకనాడు స్వామి తిరిగి దర్శన మొసంగినారు. అప్పుడు విద్యాసాగరుడు మనస్సులో స్వామిని అనేక విధముల స్తోత్రము చేసినాడు. దానికి స్వామి “వత్సా! నీ అభీష్టమేమి?” అని ప్రశ్నింపగా – “దేవాదిదేవా! నీ దివ్యదర్శనం లభించినది. నాకు సదా మీ అనుగ్రహం కావాలి. మీ దాసానుదాసుడను. మీరు ఎన్నియో అద్భుతమైన లీలలు చూపినారట. నాకు వానిని తెలుసుకునే మార్గం తెలియజేయగలరు” అని ప్రార్థింపగా స్వామి “వత్సా! నీ సంకల్పం శుభప్రదమైనది. ఇచ్చటనే అనేక సంవత్సరముల నుండి నన్ను సేవించుచున్న శ్రీ నిత్యానందయోగిని ఆశ్రయింపుము. వారిద్వారా నా లీలలను తెలుసుకొనుము. మీరిరువురూ నా సమాధి అనంతరము నన్ను చేరినవారు. అయినా నా సంకల్పము మరియు అనుగ్రహంతో నిత్యానందుడు నీకు నా దివ్యలీలలను తెలుపగలడు. వానిని లోకానికి వెల్లడి చేయండి” అని దీవించినారు. అప్పుడు విద్యాసాగరుడు స్వామి

దివ్యమంగళరూపమును చూచుచు ఆనందముతో "తండ్రీ! నీవు ఆదిపురుషుడవు. సృష్టి స్థితి లయ కారకుడవు. స్వయంజ్యోతివి. సచ్చిదానందమయుడవు. మనోబుద్ధి చిత్తేంద్రియాలకు అధీశుడవు. మహాభూత గణాలన్నింటికి ఆధారభూతుడవు. నీవు పరమాత్ముడవు. నీవు కానిది వేరు లేనేలేదు. నీవు ఆత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయమైన ఆత్మవు. సర్వార్థ సాధకులకు సాధనీయుడవు. ఆర్తజనుల కోరికలు తీర్చడంలో నీకు నీవేసాటి. నీవు కరుణాకరుడవు. అటువంటి నీవు నాకు సాక్షాత్కరించడం వలన నా జన్మ సఫలమయినదని నేను భావిస్తున్నాను. నా కోరిక తీర్చడానికి నీవు సంకల్పించావు. అది నాకు అమితమైన సంతుష్ఠిని కలిగించినది. నా సంకల్పం నెరవేరినది"అని ప్రార్థించినాడు. స్వామి చిరునవ్వు నవ్వి నిత్యానందుని చేరమని మరల పలికి అంతర్ధానమయ్యెను.

శ్రీ నిత్యానందునకు కూడా అదేరాత్రి స్వప్నమున స్వామి సమర్థులు దర్శనమిచ్చి విద్యాసాగరుని కోరిక తెలిపి "నీవు అతనికి నా లీలలు తెలుపుము. అవి నీకు సంపూర్ణముగా స్ఫురించగలవు"అని దీవించి వెళ్ళిపోయిరి. ఆ అనుగ్రహమునకు నిత్యానందుడు ఆనంద పరవశుడై తాను ఇన్ని సంవత్సరముల నుండి స్వామిని సేవించినందులకు స్వామి అనుగ్రహం ఈ రీతిని లభించినది, దీని ద్వారా తనకు ముక్తి కలుగునని సద్గురువు ఆదేశం వలన తన జీవిత లక్ష్యం నెరవేరినదని సంతసించి, అతడు నిద్ర నుండి పూర్తిగా మేల్కొని స్వామిని తలంచుకొని "తండ్రీ! నేను నీ దాసానుదాసుడను. నీవే నా ప్రాణానికి అధీశుడవు. నీ ఆదేశం నాకు శిరోధార్యం. నీ ఆకారం చూచుకునే కన్నులను, నీ గుణాలను తలచుకునే మనస్సును నీ లీలా విశేషాలను కీర్తించుకునే వాక్కునూ, నీ పరిచర్యకు వినియోగించే శక్తినీ నా ఈ శరీరమునకు ప్రసాదించుము. అది నాకు లభించే పక్షంలో నేను నీ నుండి కోరదలచినదేమియూ వుండదు. నీపై వుండు భక్తి, ప్రేమల వలన నీకు నాపై కలిగిన ఈ అనుగ్రహం ముందు ధృవపదంగానీ, బ్రహ్మలోకంగానీ, మోక్షంగానీ నాకు వాంఛనీయమైనవి కావు. తండ్రీ! లోకగురూ! సచ్చిదానంద స్వరూపా! త్రిగుణరహితా! రెక్కలురాని పక్షులు తల్లిపక్షి కొరకును, ఆకలిగొన్న క్రేపులు (దూడలు) తల్లి ఆవులకొరకును ఆత్రుత పడేటట్టుగా నా మనస్సు మీ దర్శనం కోసం నిరంతరం ఆరాటపడుతుంది. మీ ఆదేశానుసారం, మీ లీలలను గానం చేసెదను. సదా మీ అనుగ్రహాన్ని



నాకు కలిగించండి. నాలోని ప్రజ్ఞకు మీరే పరిపూర్ణ రూపులు. మీరే మీ చరిత్రను గానం చేయుచున్నారు. కేవలం నా శరీరమును కారణం చేయుచున్నారు. ధన్యుడిని!"అని ప్రార్థించి, కాలకృత్యములు తీర్చుకుని, వటవృక్షమందిరమున శ్రీ స్వామి సమర్థులను దర్శించి, తాను నిత్యము సాధన చేసుకునే ఏకాంత ప్రదేశమును చేరుకొన సద్గురుని ఆదేశమును, వారొసగిన అపూర్వమైన దర్శనమును మదిలో తలంచుకొనుచుండెను.

అంతట విద్యాసాగరుడు వేకువఝాముననే లేచి కాలకృత్యములను తీర్చుకొని, దక్షిణ తాంబూలములను, ఫల పుష్పములను తీసుకొని, శ్రీ నిత్యానందయోగి వద్దకు వెళ్ళి వారికి సమర్పించి, వారి పాదములవద్ద కూర్చొని, నిదానముగా వారిపై దృష్టి సారించగా, ఆ కరుణామయుడు "వత్సా! ఏమిటి ఈరోజున విశేషము. నీలో ఏదో తపన, యోచన కలిగినట్లున్నది. నానుండి ఏదో తెలుసుకోవాలని వచ్చినావు. నిస్సంకోచముగా చెప్పుము" అని మందహాసం చేసెను. అంతట విద్యాసాగరుడు మనసులో గురువులను, తల్లిదండ్రులను, దైవమును శ్రీ స్వామి సమర్థులను స్మరించుకుని, చేతులు జోడించి, "స్వామీ! శ్రీ స్వామి సమర్థుల మహిమలు, లీలలు గురించి ఎందరో చెప్పగా విన్నాను. పరమ భాగవతోత్తములయిన గురువులెందరో వారికి శిష్యులు అయినారని, వారు ఎందరికో స్పర్శమాత్రముచేత, తమ వాక్కుల ద్వారా, దృష్టిచేత యోగసమాధి స్థితిని అనుగ్రహించినారని విన్నాను. నేను భారతదేశమంతా సంచరించుచూ ఇట్టి సద్గురువు అనుగ్రహం కొరకు ప్రయత్నించుచున్నాను. ఇక్కడ శ్రీ స్వామివారి సమాధిని, ఈ వటవృక్ష మందిరమును దర్శించినంతనే నాకు ఎనలేని మానసిక ఆనందము కలిగినది. చంచలముగానున్న మనస్సు శాంతినొంది శ్రీ స్వామి సమర్థుల యొక్క రూపముతో లయమవుచున్నది. మాటలలో విశదీకరింపరాని దివ్యానుభూతి కలుగుచున్నది. ఎక్కడా లభించని ఈ స్థితి యిక్కడ నాకు లభించుటచేత ఇది నా గురుస్థానమని ఇక్కడే శ్రీవారి అనుగ్రహముతో యోగస్థితి కలుగునని విశ్వాసము కలిగినది.

స్వామీ! గురువు లేకుండా, గురువు అనుగ్రహం లేకుండా ఎవ్వరికీ కూడా సద్గతి కలుగదని, సద్గురువును ఆశ్రయించినవారికి సంపదలు, సౌఖ్యములు సిద్ధించునని పెద్దలు చెప్పగా విన్నాను. అనేక సంవత్సరముల

నుండి శ్రీ స్వామి సమర్థులను సేవించుచున్న మీరు శ్రీగురు విశిష్టతను తెలియజేయండి మరియు శ్రీ సద్గురు స్వామిసమర్థుల లీలలను తెలిపి నన్ను అనుగ్రహించండి” అని విద్యాసాగరుడు వినయపూర్వకముగా ప్రార్థించెను.

అంతట నిత్యానందయోగి వాత్సల్యముతో “వత్సా! నీవు సకల భారతావనిని సందర్శించి పరిశుద్ధుడవయినావు. ఈనాటికి నీ అన్వేషణ ఫలించినది. అందులకే నీవు శ్రీ స్వామి సమర్థుల సన్నిధానము చేరినంతనే ఆత్మానందము పొందినావు. ఎన్ని జన్మలలోనో చేసిన పుణ్యఫల విశేషముచేత నీకు ఈ సద్గురువుని అనుగ్రహం కలిగినది” అని ఆశీర్వదించినారు.

పాఠకులారా! మీరును అఖండమైన దీక్షతో సద్గురువుని ధ్యానించి స్మరించండి. వారితోను, వారి లీలలతోను సమ్మిళితం కండి. వారి అనుగ్రహమునకు పాత్రులు కాగలరు. ఇది సత్యం. ప్రయత్నించండి. ఫలితం పొందండి.

**జై సమర్థ సద్గురు అక్కల్‌కోట మహారాజ్‌కీ జై**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ)*
*విరచిత* ***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***రెండవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
"శ్రీ స్వామి సమర్థ జైజై స్వామి సమర్థ
శ్రీ స్వామి సమర్థ జైజై స్వామి సమర్థ"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## మూడవ అధ్యాయము

సాధకులారా! అనంతమైన ఈ విశ్వ నిర్మాణములో నిమగ్నమై వుండు పరబ్రహ్మ–మానవ లోకములోని, మానవులను మోక్షమార్గమువైపు నడుపుటకు తనను తాను సర్వులకు దత్తంచేసుకొని దత్త నామంతో సద్గురువుగా అవతరించినాడు. సాధకులు కూడా తమను తాము వారికి దత్తం చేసుకొని నపుడు వారి తత్త్వం అవగతమవుతుంది. గుర్తు చిక్కుతుంది. ఈ విశ్వనిర్మాణం దాని లక్ష్యం ప్రబోధము కాగలవు.

ఈ దత్తమూర్తి త్రివర్ణ, త్రిపద, త్రికూట, త్రిపుట, త్రిలోకాత్మకమై; త్రిమూర్తులకును, త్రిశక్తులకును కారణమై యుండును. అట్టి దివ్యస్వరూపుడే కలిలో అనేక అవతారములను ధరించి మానవజాతికి గురుతత్వ ప్రబోధము చేసే గురువుగాను, శిష్యలక్షణాలను తెలిపే శిష్యునిగానూ అవతరిస్తూంటారు. విశిష్టత పొందిన అనేక మంది గురుశిష్యులు ఈ కోవలోనికి చెందినవారే. తిరిగి వారు గురువులై ప్రబోధం గావించుతారు. దీపకుడు, జ్ఞానేశ్వరుడు, గోరకానాథుడు, ఆదిశంకరుల శిష్యుడు పద్మపాదుడు, వీరబ్రహ్మంగారి శిష్యుడు సిద్ధయ్య, మాణిక్యప్రభువు శిష్యురాలు వెంకమ్మ - నామధారకుడు - విద్యా సాగరుడు... మున్నగువారు ఎందరో ఈ విధముగా గురువుగా, శిష్యునిగా అవతరించే ఈ దత్తతత్త్వం సర్వకాలములలోను, అన్ని యుగములలోను తన అవతార కార్యక్రమములను నిరంతరము కొనసాగించుతూనే వుంటుంది. సాధువులుగా, బ్రహ్మవేత్తలుగా, అవధూతలుగా, దిగంబరులుగా, ఉన్మత్తులుగా మరియు అతిగోప్యముగా అనేక రూపాలలో వుంటుంది. దీనిని శుద్ధ భక్తిచేత, అంకిత భక్తిచేత తమను తాము ఆత్మతోసహా అర్పితం చేసుకొన్నప్పుడే




అర్థమవుతుంది, దర్శనం కలుగుతుంది. వారి అనుగ్రహం కలిగినప్పుడు మానవ జన్మ లక్ష్యం నెరవేరుతుంది. కావున మిత్రులారా! ఈరీతిన ప్రయత్నించండి. సద్గురువు అనుగ్రహం పొందండి! అని శ్రీ నిత్యానందులిట్లు చెప్పసాగిరి :

**విద్యాసాగరా!**

మానవులు ఎన్ని చదువులు చదివినా భగవత్ భక్తి అనేది, గురుభక్తి అనేది లేకపోతే ప్రయోజనం లేదు. ఈ భక్తిని అలవరచుకోవటానికి అనేక మార్గాలు వున్నాయి. వానిలో గురువుల కథలను వినుట (శ్రవణం), గురువుని స్మరించటం, గురుకీర్తన చేయటం, గురువును పూజించటం (అర్చన), గురుసేవ చేయటం, గురువుద్వారా ఆత్మజ్ఞానం పొందటం గురుభక్తులతో సఖ్యం చేయటం, గురువుకు తనను తాము సమర్పించుకోవటం, గురు ప్రబోధిత మంత్రమును నిత్యం జపిస్తూ వుండటం అనేవి ప్రధానమైనవి. ఈ తొమ్మిది మార్గాలలోను ఏదో ఒక మార్గాన భక్తి యోగాన్ని సాధించినవారికి, సర్వ సుఖములు సమకూరుతాయి.

ఓ జిజ్ఞాసీ! మనము గురు విశిష్టతను తెలుపు కథలవైపు వెళ్ళుదాము అని శ్రీ స్వామి సమర్థులను తలచి నిత్యానందులు బ్రహ్మ-కలి సంవాద రూప కథను తెలుపబూనినాడు.

"బాలకా! గురు విశిష్టతను తెలుపమనినావు. చాలా సంతోషం. నీవు బుద్ధిమంతుడవు. మంచి ప్రశ్న వేసినావు. లోకంలో గురువే సర్వస్వం, గురువే సకల జ్ఞాన ప్రదాత, గురువే సృష్టి, స్థితి, లయ కారకుడు, సకల చరాచర జగత్తుకు పోషకుడు, రక్షకుడు గురువే. వారి అనుగ్రహం లేనిదే ఏ కార్యము జరగదు. తత్వజ్ఞాన ప్రబోధం ద్వారా శిష్యునిలోని అజ్ఞాన లక్షణములను పారద్రోలి వానిని జ్ఞానిగాను, గురువుగాను, తీర్చిదిద్దు గురువే సచ్చిదానంద స్వరూపుడైన పరబ్రహ్మ!"

త్రిలోకాధిపతులు ఎవరైనా ఆగ్రహించినచో సద్గురువు తన శిష్యుని రక్షింపగలడు. కాని అట్టి సద్గురువు కోపించిన వానిని ఎవ్వరూ రక్షింపలేరు. అంతేకాదు సద్గురుని సంకల్పముచేత సర్వము లభించును. గురువులు శిష్యులను పరీక్షించి వారిలోని అజ్ఞాన లక్షణములను పారద్రోలి సంకల్పము మాత్రముననే పండితులను చేయగలరు. వారు ఎన్నడూ ఎవ్వరిపైనా కోపం చూపరు. వారు దయామయులు, నిత్యానంద స్వరూపులు, త్రిమూర్తి స్వరూపులు, అటువంటి



వారిలో అగ్రగణ్యులైన శ్రీ స్వామి సమర్థుల సన్నిధికి చేరినావు. నీ జీవిత లక్ష్యం నెరవేరగలదు అని పలికి దీవించెను.

అంతట ఆ బాలబ్రహ్మచారి వారి పాదములకు నమస్కరించి "దేవా! త్రిలోకాధిపతులు కోపగించినా సద్గురువు రక్షింపగలడు అనిరి. అది ఎట్లు సంభవము. అంతేకాదు సద్గురువు సంకల్పంచేతనే శిష్యుని పండితుని చేయగలరంటారే! అందులకు తార్కాణమేమి? పురాణ ప్రసిద్ధినొందిన అట్టి గురు – శిష్యులను గురించి తెలిపి నా మనస్సునకు స్థిరత్వమును ప్రసాదించండి" అని వేడుకొనెను.

శ్రీ నిత్యానందయోగి అతని జిజ్ఞాసకు సంతసించి ఇలా తెలిపిరి : "శ్రీ స్వామి సమర్థుల సమాధి వటవృక్ష మందిర సందర్శనముచేత నీకు మంచి బుద్ధి కలిగి యిటువంటి ప్రశ్న వేయగలిగినావు. శ్రీ స్వామి సమర్థుల అనుగ్రహంతో సృష్టి ప్రారంభమున కలి–బ్రహ్మ సంవాదరూపమైన గురుశిష్యుల కథను పురాణ ప్రశస్థమైన దానిని తెలిపెదను, శ్రద్ధగా ఆలకింపు"మని ఇట్లు చెప్ప మొదలిడెను.

"బ్రహ్మచారీ! పూర్వం ఒక్కరుగా వున్న పరమాత్మ తాను అనేకం కావాలని సంకల్పించినారు. దాని ఫలితమే మొదట నారాయణునిగా అవతరించినారు. వారి నాభి కమలము నుండి చతుర్ముఖుడైన బ్రహ్మ అవతరించినాడు. అతడు శ్రీమన్నారాయణునియొక్క ఆజ్ఞను అనుసరించి సృష్టి ప్రారంభించెను. మొదట అతని నుండి నాలుగు వేదములు ఉద్భవించినవి.

వేదములలో వివరింపబడిన రీతిలో వారు ఈ విశ్వమంతటిని సృష్టించినారు. మహర్షులు, దేవతలు, లోకములు, గ్రహాలు, సూర్యచంద్రాదులు, నానావిధమైన 84 లక్షల జీవరాశిని, మానవులను సృష్టించినారు. వారి వారి పూర్వజన్మ సంస్కారము ననుసరించి వర్ణాశ్రమ ధర్మములు ఏర్పరచెను. కాలమును, యుగాలను, ఋతువులను సృష్టించినారు.

అదేరీతిన మహాసృష్టిలో త్రి సృష్టులుగాను, ఒక సృష్టిలో తొమ్మిది కల్పములుగాను, ఒక కల్పములో 14 మన్వంతరములుగాను, ఒక మన్వంతరములో డెబ్బది ఒకటి మహాయుగములుగను, ఒక మహాయుగములో నాలుగు యుగములుగాను, అవి కృత, త్రేతా, ద్వాపర, కలియుగాలుగా సృష్టించెను. కృతయుగము 17 లక్షల 28 వేల (17,28,000)సంవత్సరములు. ఇది ధర్మయుగము. ఈ యుగములో ధర్మము నాలుగు పాదములలో నడచును.

జనులు సత్యవంతులుగాను, ధర్మపరులై, ధార్మికులుగాను వుందురు. ఈ యుగములో పరమాత్మను దర్శించుటకు అందరును ధ్యానాది తపములను చేసెదరు. తరువాత త్రేతాయుగము. ఇది 12 లక్షల 96 వేల (12,96,000) సంవత్సరములు, ఇది సత్యయుగము. ఈ యుగములో సత్యమునకు పూర్తి న్యాయము కలుగగా, ధర్మము మూడు పాదములలో నడచును. ప్రజలందరూ సత్యవంతులుగాను, ధర్మవంతులుగాను వుండి పరమాత్మ దర్శనమునకు యజ్ఞయాగములను ఆశ్రయించెదరు. తదుపరి ద్వాపర యుగం. ఇది 8 లక్షల 64 వేల (8,64,000) సంవత్సరములు. ఈ యుగములో ధర్మము రెండు పాదములపైనే నడుచును. రాజులు, రారాజులును. యుద్ధములతోను, అనేక తంత్రములతోను, మంత్రములతోను సమ్మేళనముగా జీవించెదరు. ఆయుధమునే నమ్మి వుందురు. ఈర్ష్య, ద్వేషములతో ఈ యుగమున ఎక్కువ కాముకులు పెరిగెదరు. పరమాత్మ దర్శనం కొరకు ప్రజలు సేవలను పూజాకార్యక్రమములను విశ్వసించెదరు. నాలుగవది కలియుగము. ఇది 4 లక్షల 32 వేల (4,32,000) సంవత్సరములు కలిగినది. ఇందు ధర్మము ఒక పాదమున నడుచును. సకల విలయములగు వికృతములగు - రాక్షస గుణ ప్రభావమునకు ఇది నిలయము. ఇందు ప్రజలు పరమాత్మను పొందుటకు నామ సంకీర్తనము ద్వారా సేవించెదరు.

వత్సా! నాలుగు యుగములలో ఈ విధముగా వ్యవహారములు జరుగుచుండును. తరువాత బ్రహ్మ కల్పాధిపతులను, మన్వంతరాధిపతులను, యుగాధిపతులను సంకల్పించి వారందరికీ వారి వారి ధర్మములను ప్రబోధించి భూమిపైన పాలన చేయ నియమించెను.

ధార్మికుడా! మహాసృష్టిలో ఒక సృష్టి పూర్తిగా అయిపోయినది, ఇది రెండవ సృష్టి. ఇందు అయిదు కల్పములు జరిగిపోయినవి. ఇప్పుడు నడచుచున్నది ఆరవ కల్పము. దీని అధిపతి శ్వేత వరాహమూర్తి. అందుచే ఈ కల్పమును శ్వేత వరాహ కల్పమంటారు. ఈ కల్పములో ఆరు మన్వంతములు జరిగిపోయినవి. ఇది ఏడవ మన్వంతరము. దీని అధిపతి వైవశ్వత మనువు. అందుచే దీనిని వైవశ్వత మన్వంతరము అంటారు.

ఇప్పుడు ఈ మన్వంతరములో 28వ మహాయుగంలో కలియుగం ప్రథమపాదంలోను, ప్రథమ భాగంలో, ప్రథమ అంశ అంతమై రెండవ అంశ ప్రారంభములో వున్నది. కలియుగము ఇంకా 63 అంశలు మిగిలి వున్నవి. ఒక అంశ అనగా సుమారు 6,750 సంవత్సరములు.



ఇందులోనే ఇరువది మూడవ మహాయుగములో, ద్వాపర యుగంలో భగవంతుడైన నారాయణమూర్తి వేదవ్యాసునిగా జన్మించారు. వారు వేదముల లోని ధర్మములను పదునెనిమిది మహాపురాణములుగా, పదునెనిమిది ఉప పురాణములుగాను రచించిరి. అందులో బ్రహ్మవైవర్తనము అను పురాణంలోని కథయే ఇది. బ్రహ్మదేవుడు కలిపురుషునికి శ్రీగురుని మహాత్మ్యమును తెలిపెను. అదియే చెప్పుచున్నాను, సావధానుడవై వినుము అని నిత్యానంద యోగి శ్రీ స్వామి సమర్థులకు, శ్రీ దత్తాత్రేయ స్వామికి జయజయ నాదముతో నమస్కరించుకొని బ్రహ్మ వైవర్తన పురాణములోని ఆ కథను మనస్సులో సంకల్పము చేసికొని చెప్పదొడంగెను.

విద్యాసాగరా! పూర్వము నైమిశారణ్యములో మహర్షులందరూ కూడ సత్రయాగం చేయుచుండగా అక్కడకు వచ్చిన పౌరాణికుడు, సకల శాస్త్రవేత్త వ్యాసమహర్షి శిష్యుడు అయిన సూతమహర్షిని పూజించి మునులు మహాత్మా! గురువు విశిష్టతను - వారి ప్రభావమును మరియు కలిపురుషుని మహత్తు ఎలాంటిది, వారు ఎవరి చెంతకు చేరరో విపులముగా తెలుపుమని ప్రార్థించిరి.

అందులకు సూతుడు సంతసించి, ఓ పుణ్యచరితులారా! మీరు అడిగిన విషయము చాలా గొప్పది. కలి-బ్రహ్మ సంవాద రూపంలో వున్న గురుశిష్య వైభవము అను కథ చెప్పెదను, సావధానులై వినండి అని సర్వేశ్వరుని ప్రార్థించి, తమ గురుదేవులైన వ్యాసమహర్షిని మనస్సులో తలంచి అపూర్వమైన కలి బ్రహ్మ సంవాద రూపమైన కథను చెప్పబూనినాడు.

సనాతనుడు అయిన బ్రహ్మదేవుడు చరాచర విశ్వమును, మానవులను సృష్టించి వారికి వారి ఆశ్రమముల ననుసరించి, వర్ణాశ్రమములను ఏర్పరచి, ఆ వర్ణాశ్రమముల యందలి ప్రాణులకు ధర్మనిర్ణయం చేసిరి. వారిని పాలించుటకై పదునాలుగు మనువులను కృత త్రేత ద్వాపర, కలియుగములను నాలుగు సృష్టించెను. ఆ బ్రహ్మ వారిని ధర్మాచార రక్షణకై మొదట కృతయుగ పురుషునిగా, మరల త్రేతాయుగ పురుషునిగా, ఆ తరువాత ద్వాపరయుగ పురుషునిగా సంకల్పించి లోకమునకు పంపెను. ఆ తరువాత సృష్టికర్త మరియొకనిని సృజించెను. కాని వానిని చూచి అసహ్యముగా అతడే కలవరపడెను.

అతనికి బ్రహ్మ 'కలి' అని పేరుపెట్టి పూర్వులకు వలెనే అతనికికూడ ఆధిపత్యమును యిచ్చెను. ఆధిపత్యమన్నది వివేకవంతులకు ఉత్తమ ఫలితము నిచ్చును. కాని అవివేకవంతులకు, అనాచారులకు అధఃఫలితమును కలిగించును.



ఆ కలిపురుషుడు అతి క్రూరుడు. అతడు పిశాచముఖుడు. కలహమాతనికి యిష్టమైన పని. ఆ పుట్టిననాడే బ్రహ్మ ఎదుటనే, ఒక చేతితో తన నాలుకను, రెండవ చేతితో తన పురుషాంగమును పట్టుకొని తూలుచూ, నవ్వుచూ, ఏడ్చుచూ, వికారచేష్టలు చేసెను.

అతని వికార చేష్టలను చూచి ఆ పద్మాసనుడైన బ్రహ్మ చిరునగవు నవ్వుచూ "ఓ కలీ! ఇట్టి వేషములతో, వికృతపు చేష్టలతో నృత్యమేల చేసెదవు! నిన్ను తప్పక వెంటనే భూలోకమునకు పంపవలసినదే" అనెను.

అందుకాతడు ఆశ్చర్యపడి, "ఓ బ్రహ్మదేవా! నన్నేల యిట్లాజ్ఞాపించుచున్నావు? నేను సర్వ విచ్ఛేదకుడను, నిరంకుశుడను, కలహ, నిద్రాప్రియుడను, కలుషాత్ముడను, పరుల ధనము నపహరించువాడను. మాత్సర్య, లోభ, దంబ ప్రియులకు స్నేహితుడను. నా పొట్టను మాత్రమే పోషించుకొనుచున్న స్వార్థపరుడను, ఖలుడను, మానవ లోకముమీద పెత్తనము చేయుటకై నన్ను అచ్చటికి పంపవలదు. ఒంటరిగా స్వతంత్రించు అవకాశమేర్పడినప్పుడు, కపటపు సన్యాస స్వీకారము వలన ప్రజలను మోసగించుచు, ఇహపరములకు చెందకుండా వారిని చెడుపుచుందును!" అని పలికెను.

అంతట బ్రహ్మ వానితో "ఓ కలీ! సాధుజీవులై శ్రద్ధ, భక్తితో, నిర్మల హృదయులై నిరంతరము పరమాత్మను ధ్యానించుచూ, వాని నామస్మరణలో నిమగ్నమై జీవితమును నడుపుకొనుచుండు పుణ్యాత్ములను మాత్రం విడిచిపెట్టి రాగపరులైన ఇతర జనులందరిని పట్టి పీడించుచుండుము" అనెను.

ఆ మాటలకు కలి "బ్రహ్మదేవా! యజ్ఞయాగాదులతో పవిత్రమై విరాజిల్లు భరతవర్షమునందు నాకు మహాబలశాలురైన శత్రువులున్నారు. వారున్న ఈ నేలలో నేనెట్లు అడుగిడగలను?" అనెను.

"ఓ కలిపురుషుడా! నీకాలోకమున శత్రువులెవరు? వారు నీకేమి ఎగ్గొనర్చిరి? నీవు నిర్దయుడవు, కాలరూపుడవు. ఏ బెదిరింపులకు లొంగని నీ గతిని పండితులు కూడా సరిగా తెలుసుకొనలేరు.

ఈ మాటలు విని కలి "దేవా! నా శత్రువులను గూర్చి వివరింతును వినుము. ఆ రిపులు అదయులై, నన్ను రేపును, మాపును భయపెట్టుచుందురు.

శివనామములు, హరినామములు, శివకథ, హరికథ, కాశీ, గంగా, గోదావరి, కృష్ణా, యమున, కావేరి మున్నగు పవిత్ర నదులయందు జరుగు ఉత్సవములు, యజ్ఞయాగాదులను, సత్సంగములు దాని గుణము మొదలగునవన్నియు నా శత్రువులే!

మనశ్చాంచల్యముగల వానిని, భార్యా పుత్రాదులయందు అత్యధిక లంపటుని, వేదమతము నొల్లనివానిని, అబద్ధములాడు మోసగానిని చూచినచో నాకు పండుగ యగునుకదా!

జితేంద్రియులు, వైష్ణవ, శైవ జపార్చనాపరులు, సాంప్రదాయకముగా శిఖలుగలవారును ఉన్నచోటులకు నేను వెళ్ళనే వెళ్ళను. అట్టి సత్పురుషులనిన నాకు ఎంతయో భయము" అని కలి చెప్పగానే మరల బ్రహ్మ వానితో నిట్లనెను.

"ఓ కలీ! నీ ప్రభావము వలన సత్పురుషుల సదాచారములు నిస్సంశయముగ తగ్గిపోవును. నిర్భయముగా భూలోకమునకేగి సుఖముగా నుండుము. నా మాటకు తిరుగులేదు" అని బ్రహ్మ ఆజ్ఞాపించగా కలిపురుషు డాతనికి మ్రొక్కి ఇట్లు ప్రశ్నించెను.

"ఓ ప్రభువా! ఆ సత్పురుషులకును మావంటి దురాచారులకునూ ఈ విరుద్ధ స్వభావములేల ఏర్పడినవి? నన్ను వారును, వారిని నేనును ఏల నశింపచేసికొనకుండలేము?" అని అడుగగా పితామహుడిట్లనెను.

"ఓరీ కలీ! నీవు కాలముయొక్క మూల స్వరూపుడవు. ఆచారవంతులకు వ్యతిరేకివి. ఇది నీ ధర్మము. నీవు ఉన్నచోట సర్వ మాలిన్యములకు నిలయము. మలమునకు శుద్ధియుండునా? నీ శత్రువులైన సత్పురుషులకు అట్టి మాలిన్యముండదు. కనుక మీ యిరువురకు వైరము తప్పదు. వివాదముండుటే నీ స్వభావము. వివేకవంతులకు నీవు మంచివాడవెట్లగుదువు? భగవద్భక్తులును, జ్ఞానులును నిన్ను మనసులోనైనను చేరనిత్తురా? కనుక అట్టి వివేకశీలురకు కలిబాధయును, శత్రువులు నుండరు మరియు పుణ్యక్షేత్రములలో నివసించు వారికి, జనార్ధనునిగాని, శివునిగాని తలంచు వారికిని, గురుసేవా పరాయణు లకును, గురువులను, తల్లిదండ్రులను గౌరవించువారికిని, ఈశ్వరార్పణ బుద్ధితో యజ్ఞములు చేయువారికిని, అతిథులను దేవతలుగా పూజించువారికిని, నీవు దూరముగా తొలగిపొమ్ము. వారి మహిమను నీవణగింపదలచినను అది రవ్వంతకూడా అణగిపోదు. వారెప్పుడునూ అభయస్థితియందే వుందురు. కాలము వారికెప్పుడును హితకరమై యుండును" అని బ్రహ్మదేవుడు పలుకగా కలి బ్రహ్మతో "ఓ దేవరా, గురువనగా నెవరు? ఎవ్వరెవ్వరికి గురువగును? గురు స్వరూప రహస్యమేది? ఆ గురుపదమునకు తాత్పర్యమేమి? ఆ ప్రశ్నలకు సమాధానమిమ్ము" అని ప్రార్థించెను.

అందులకు బ్రహ్మ "ఓయీ కలిపురుషుడా! గురువు అనగా గ, ర, ఉ కారముల కలయిక. గ+ఉ=గు, ర+ఉ=రు అగును. 'గ'కారము గణేశ బీజము. 'ర'కారము అగ్నిబీజము. ఓంకారములోని 'అ'కారము బ్రహ్మ, 'ఉ'కారము

విష్ణువు, 'మ'కారము శివుడు. 'గురు' అను పదములోని రెండక్షరములలోను హరియొక్క స్వరూపమైన 'ఉ'కారము కలసియున్నది. 'గ' కారము సిద్ధినిచ్చును. అశివముల నడంచును. 'ర'కారము 'ఉ' కారము హరియే. ఈ మూడు వర్ణముల సంపుటికి గురువని పేరు. గణేశాగ్ని బీజముల మధ్యనున్న అచ్యుతుడే రెండక్షరములతో మనుష్యరూపముననున్న గురువు. గురువు ధర్మార్థ కామ మోక్షములను వాత్సల్యముతో నొసగు సామర్థ్యము కలవాడు. మనువు, తండ్రి, తల్లి, బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు గురుపద వాచ్యులగుదురు. గురువు సర్వదేవతలకంటే శ్రేష్ఠుడు. అనగా బ్రహ్మ విష్ణువు మహేశ్వరులకంటే కూడ అధికుడు. అందువలననే గురువును శాస్త్రములు పరబ్రహ్మగా కీర్తించినాయి. సకల శాస్త్రములు గురు స్వరూపమే.

గురు సేవవలన శాస్త్ర రహస్యములును, తీర్థ వ్రత విధానంబులును, సద్యోగత తపోవర్ణాశ్రమ భక్తి వివరములును సదాచార వ్యవహారములును తెలియనగును.

ఈ విషయము తెలిసికొనిన కలి బ్రహ్మ నిట్లు మరల ప్రశ్నించెను. "దేవదేవా! గురువు సర్వదేవ సముడనియూ, శివుడంతటి వాడనియు చెప్పితివికదా? మానవమాత్రుడైన ఆ గురువు శివునంతటి వాడెట్లగును? నా యీ సంశయాలను తీర్చుడు!" అనెను.

కలి వేసిన ప్రశ్నకు సమాధానముగా బ్రహ్మ యిట్లు చెప్పసాగెను...

పాఠకులారా! కలి ప్రభావము తెలిసికొనినారుకదా! సద్గురుని సన్నిధిలో మాత్రమే వాని ప్రభావము ప్రవేశింపదు. అందువలన సద్గురువు చరణ సన్నిధిలో సద్బుద్ధిని పొందండి. సదాచారులై, సత్యవంతులై, సుఖశాంతులు పొంది మోక్షకాముకులు కండి. సద్గురు చరణాలను వదలకండి. ఆ చరణాలు మాత్రమే సద్గతిని కలిగించుతాయి.

**జై సద్గురు స్వామి సమర్థ!**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** *(శ్రీ విఠల్ బాబాజీ)*

*విరచిత* **శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**

**మూడవ అధ్యాయము** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం
ఓం దాం దత్తాత్రేయాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నాలుగవ అధ్యాయము

“విద్యాసాగరా! ఆ కథకు ముందు నీకు గురు లక్షణములను, గురు శబ్ద నిర్వచనమును తెలుపుదును శ్రద్ధగా వినుము!” అని పలికి సద్గురుదేవుడైన శ్రీ స్వామి సమర్థులను మనమున తలచి ఈ విధముగా చెప్పసాగినాడు.

“వత్సా! గృణాతి మాట్లాడుట అను ధాతువు నుండి గురువను పదముద్భవించినది. ఎవడెవరికి మేలు కోరునో వాడతనికి గురువగుచుండును. తల్లి, తండ్రి, హితాభిలాషి, మామ, పినతండ్రి, మేనమామ, అన్నలును, మాతామహుడు, పితామహుడు, మాతామహి, పితామహి, తల్లి చెల్లెలు (పినతల్లి) మొదలగువారు హితాభిలాషులు. కనుక జనులందరికీ వీరు గురువులు. మిత్రుడు పెద్ద గురువు. తండ్రి కుమారుని కని, పెంచి, ఉపనయనము చేసి సాంగో పాంగముగా వేదాధ్యయనము చేయించి వేదముయొక్క పథక్రమ పాఠములు నేర్పి, దర్శనముల నన్నింటిని బోధించుటో, బోధింపజేయుటో చేయును. కనుక అతడు మహాగురువనబడును. పై అవకాశము కల్పించిన వారెవరైనను మహా గురుపద వాచ్యులేయగుదురు. ఏ రకమైన శిల్పమును చాతుర్యమును నేర్పినను ఆ నేర్పినవాడు గురువే అగును. విద్యలు ఐహికములని ఆముష్మికములని రెండు విధములుగా నున్నవి. ఆ విద్యలలో ఏ ఒక్క అక్షరము చెప్పినను అతడు గురువే యగును. ఆ గురువుల అర్హతలనుబట్టి చాలా భేదము లేర్పడినవి. వేద వేదాంగములను నేర్పినవాడే పెద్ద గురువగును. వేద వేదాంగ రహస్యములను ముందుగా తెలుసుకొని, శిష్యులకు వాటిని స్పష్టముగా బోధించి వారిని సంసార సముద్రము నుండి దాటించి, సుఖశాంతులను చేకూర్చగలవాడే

పెద్ద గురువు. అట్టి గురువే బ్రహ్మ, విష్ణువు, శివుడు, కర్త, భర్త, హర్త కూడా యగును. అట్టివానికి మించిన తత్త్వమింకొకటి లేదు. స్థూల సూక్ష్మాది దేహ సంబంధములను విడిపించి, తన కారుణ్యంతో శిష్యులకు బ్రహ్మప్రాప్తి కలిగించువాడే శిష్యునకు పరబ్రహ్మమును పరమగతియును అగును. అంతకు మించిన తత్త్వమింకొకటి యుండదు. సద్గురుని సేవింపకుండ శ్రౌతోపాసనము, వేదోక్త దీక్షలు, శైవ, శాక్త దీక్షలును, సారూప్య, సామీప్య, సాలోక్యములను ముక్తులున్నూ, అభిలషితములైన ఐహిక సంపదలున్నూ మానవులకు సిద్ధింపవు. అందువలననే యిహపరానందములను గూర్చి సద్గురు చరణారవిందముల నాశ్రయింపవలెను. బద్ధకముతో ఆచార్య పాదారవిందములను సేవించుట మానినవారు ప్రాణాయామము, ఇంద్రియ నిగ్రహము మొదలగు సాధనములచే లొంగని అతి చంచలమైన మనస్సు అను గుఱ్ఱమును వశపరచుకొన ప్రయత్నించు యోగులుకానీ, ఏ జీవులుగానీ, సముద్ర మధ్యమున, నావికుడు లేని నావలో వ్యాపారము చేయబోవు వ్యాపారులవలె నశింతురు. నరదేహమే సున్నితమైన పడవ. దానిని నడుపు నావికుడు సద్గురువే. గాలియే దేవుడు. సంసారమే సముద్రము. పై సామాగ్రియంతయు ఉండికూడా అజ్ఞానులును, నాశనశీలురును, పశుప్రాయులును, ఆత్మ హంతకులును అగు మానవులు ఈ సంసార సాగరమును దాటుటకు ప్రయత్నింపరనుట ఆశ్యర్యకరమైన విషయము. సంసార సాగరమును మానవులు దాటి తీరవలెననియు, అందులకుపకారకుడు సద్గురువే యనియు వేదములన్నియు వివిధ విధముల ఉద్బోధించుచున్నవి. ఆ వేదములలో ఒకచోట "సగురు మేవాభి గచ్ఛేత్ సమిత్పాణిః" అని చెప్పబడినది.

అనగా సంసారమునుండి వెలువడదలచిన శిష్యుడు గౌరవ సూచకముగా సమిధలను చేతబట్టుకొని గురువును వెదకుకొనుచు వెళ్ళవలెనని దీని భావము. మరియొకచోట "తర్కేణ మతిరాపనేయ" అని శృతి చెప్పినది. వివేకము ద్వారా సంసార సాగరమును తరింపవలెనను బుద్ధి పొందవలెనని దీని భావము. ఇంకొకచోట ఆ వేదమే "ఆచార్యవాన్ పురుషో వేదః" అని పలికినది. గురువు కలవాడే పురుషుడని దీని అర్థము.

అందువలన విద్యాసాగరా! అపూర్వమైన ఈ గురుత్వమును అర్థము చేసుకొని శ్రీగురు చరణాలయందు పరిపూర్ణ విశ్వాసముంచి చరించుటే శిష్యుని



ముఖ్యమైన సాధన. దానివల్లనే అతడు పూర్ణపురుషుడు, ముక్తసంగుడు కాగలడు.

సూతుడు చెప్పిన కలి–బ్రహ్మ సంవాదరూప గురు విశిష్టతను తెలుపు కథను చెప్పెద నాలకించుమని ఇట్లు చెప్పసాగెను...

సద్గురుని భజించు శిష్యుని ఉదాహరణమును ఈ క్రింది విధముగ వివరించుచూ బ్రహ్మదేవుడు "ఓ కలీ! పూర్వము గోదావరీ తీరమున అంగీరస మహర్షి ఆశ్రమములో అనేకమంది సద్బ్రాహ్మణులు వ్రతదీక్షబూని బ్రహ్మచర్యము నవలంబించుచూ విద్యాభ్యాసము చేయువారున్నూ, విద్యాప్రబోధం చేయువారున్నూ, తాపసులున్నూ, వానప్రస్థులునూ ఉండేవారు. అందులో పైలుని కుమారుడు వేద ధర్ముడను మహర్షియుండేవాడు. అతడు వేద వేదాంగముల నధ్యయనంచేసి అనేక సంవత్సరములు ఎందరో శిష్యులకు విద్యా ప్రబోధము చేయుచుండెను. వారివద్ద విద్యనభ్యసించినవారు అనేకులుత్తమ అధ్యాపకులై, ఆచార్యులై విరాజిల్లిరి. వేద ధర్ముని కీర్తి దశదిశల వ్యాప్తి చెందెను. ఈయన ఒకసారి శిష్యుల భక్తి శ్రద్ధల పరీక్షింపగోరి తన శిష్యులందరిని ఒక్కచోటికి పిలచి ఇట్లనిరి : "శిష్యులారా! పుణ్యమువలన దేవతా జన్మలు, పాపము వలన హీనజన్మలు, క్రిమికీటక జన్మలు ప్రాప్తించును. పాపపుణ్యములు మిశ్రమముగా నున్నప్పుడు మానవజన్మ లభించును. ఈ జన్మలో పుణ్యము – పాపము ఏదియు మిగలకపోతే కలిగేది మోక్షం. కొందరు కర్మలను పాపకర్మలుగ, పుణ్యకర్మలుగ, విభజించుకొని ఆచరించెదరు. వారికి మోక్షఫలం లభించదు. అన్ని రకాల కర్మల ఫలమునూ త్యాగంచేసి ఈ సమస్తమునూ పరబ్రహ్మ ప్రసాదమని, దైవ సంకల్ప బలమనీ నమ్మి దైవబుద్ధితో భారము దైవముపై నుంచి తన నిత్యకృత్యములను నిస్వార్థ బుద్ధితో ఆచరించుట ద్వారా పాప–పుణ్యముల నిర్మూలనం చేసికొన్న మానవుడు ఏ జన్మములేక జన్మరాహిత్యమును పొంది పరబ్రహ్మ సన్నిధి చేరుతాడు. ఇదే మానవజన్మయొక్క లక్ష్యం. అన్ని సాధనలు దానికొరకే. కావున ప్రియశిష్యులారా! నేను అట్టి జన్మరాహిత్యం పొందడానికై ప్రయత్నించుచున్నాను. ఈ ప్రయత్నంలో నేను నా పూర్వజన్మ పాపాలలో యెక్కువ భాగము ఈ జన్మలో తపస్సుతో నశింపచేసుకున్నాను. మిగిలివున్న కొంచెమూ అనుభవిస్తేగాని తీరదు. ఒకవేళ దానిని నా తపఃశక్తితో పోగొట్టుకొన్నా అది నా మోక్షానికి విఘ్నం కలిగిస్తుంది. అందువలన నేను సర్వ పాపహరమైన కాశీనగరానికి వెళ్ళి ఆ కర్మ శేషాన్ని అనుభవించి దాన్ని నశింప జేసుకొన




దలచాను. అక్కడ నా పూర్వ పాపాన్ననుసరించి గళత్కుష్ట (కుష్టి) రోగిని, కుంటివాడిని, గ్రుడ్డివాడిని అయి 21 సంవత్సరములు కర్మఫలమును అనుభవించవలసియున్నది. అంతకాలము అక్కడ నాకు తోడుగా వుండి సేవచేయగలవారు మీలో ఎవరున్నారు?" అని ప్రశ్నించినారు.

గురుసేవలో లోపమొస్తే యేమి ప్రమాదమోనన్న భయంతో శిష్యులంతా మౌనం వహించారు. దీపకుడు అనే శిష్యుడు ఆయనకు నమస్కరించి – "స్వామీ! మోక్షానికి విఘ్నం కలిగించే పాపశేషం వుంచుకోరాదు. మీరనుమతిస్తే, మీ బదులు ఆ పాపం నేనే అనుభవించి మీకు సేవచేస్తాను అనుగ్రహించండి!" అని విన్నవించుకున్నాడు.

అపుడా గురువు సంతోషించి "ఈ పాపం నేననుభవించవలసిందే! వేరొకరు అనుభవిస్తే తీరదు. రోగికంటే అతనికి సేవచేసేవారి కష్టమే ఎక్కువ. అందులకు యిష్టమైతే నీవు నాతో కూడ రావచ్చు!"అన్నారు. దీపకుడు సంతోషముతో అంగీకరించినాడు.

గురుశిష్యు లిరువురు ప్రయాణమై సుదీర్ఘముగా ప్రయాణించి పరమ పవిత్రమైన కాశీక్షేత్రమును చేరుకొనినారు. అక్కడ మణికర్ణికా ఘట్టంలో గురుశిష్యులు ఇద్దరును గంగానదిలో స్నానంచేసి ఆ పవిత్రమైన మణికర్ణికకు నమస్కరించి విశ్వనాథుని మందిరం చేరి పూజాది అభిషేకములను నిర్వర్తించి అన్నపూర్ణ మాతను దర్శించి కంబలాశ్వతర ప్రదేశమును చేరుకొనినారు. ఆ పవిత్రస్థలం మణికర్ణికకు దగ్గరగానున్నది. అక్కడ దీపకుడు ఒక కుటీరమును నిర్మించినాడు. వేదధర్ముడు ఆ కుటీరమున ప్రవేశించి తన పాపమును సంకల్పించుకొనగానే భయంకరమైన గళత్కుష్టి (కుష్టి) రోగము, కుంటితనము, గ్రుడ్డితనము వచ్చాయి. ఆయన శరీరమంతా కుష్టురోగంతో, క్రుళ్ళిపోయి, పురుగులుపడి దుర్వాసన కొట్టసాగింది. దానికితోడు మతిస్థిమితము కూడా తప్పినది. సహజంగా ఎంతో ప్రేమమూర్తియైన ఆ ముని ఎంతో క్రూరంగా ప్రవర్తించసాగాడు. దీపకుడు మాత్రం తన గురువు సాక్షాత్తూ విశ్వనాథుడని విశ్వసించి, నిత్యమూ ఆయన శరీరం శుభ్రంచేసి, సర్వోపచారాలతో పూజచేసి అన్నం తెచ్చి పెడుతుండేవాడు. ఆ మునిమాత్రం అతనిని ఎన్నోరీతుల బాధిస్తుండేవాడు. అతడు మంచి అన్నం తెచ్చినా కూడా కొంచెమే తెచ్చాడని కోపించి, ముని దానిని నేలపై విసిరికొట్టేవారు. దీపకుడు ఎక్కువగా భోజనం



తెచ్చినపుడు, ఆయన దానిని రుచిచూచి బాగాలేదని విసిరికొట్టి, రుచికరమైన భోజనం తెచ్చిపెట్టమని వేధించేవారు. ఒక్కొక్కప్పుడు ప్రేమతో “అబ్బాయి! నీవు ఉత్తమ శిష్యుడవు. నాకోసం నీవెంతో కష్టపడుతున్నావు!” అని లాలించేవారు.

కానీ మరుక్షణమే కోపించి “దుర్మార్గుడా! నీవు నన్నెంతో పీడిస్తున్నావు. నీవు వెళ్ళిపో! నా శరీరంలో దుర్వాసన పోయేలా కడగడంలేదు. అందువలన ఈగలు నన్ను కుడుతున్నాయి. తోలకుండా చూస్తావేమి?” అని కసురుతాడు. దీపకుడు ఆ పని చేయబోతే ఆయన “దుష్టుడా! ఆకలితో నా ప్రాణం పోతున్నది. ఇంకా బిక్షకు పోయి అన్నం తీసుకొని రాలేదేమి?” అని తిట్టేవారు, కొట్టేవారు. దీపకుడు మాత్రం కొంచెం కూడా చలించలేదు. తమ గురుడు ఎంతో ప్రేమ స్వరూపుడని తమని కన్నబిడ్డలవలే ఇంతకాలము పోషించి విద్యను బోధించిరి. ఈ పాపఫలితము అనుభవించుటకు మునుపు వారు చూపిన కారుణ్యమును గుర్తు తెచ్చుకొని పాపము ఎక్కువగా వున్నవారికి కష్టాలతోపాటు, దుష్టత్వంకూడా కలుగుతుందని తెలుసుకొని దీపకుడు గురువును భక్తితో సేవిస్తున్నాడు. గురువే సకల దేవతా స్వరూపమని నమ్మిన అతడు కాశీక్షేత్ర యాత్రగూడ చేయక, అచటకల దేవతలను గూడా దర్శించక, గురుసేవలో లీనమయ్యాడు. అతడెవరితోనూ మాట్లాడేవాడు కాడు. తన శరీరానికి కావలసిన పనులు కూడా చేసుకునేవాడు కాదు. వానివలన గురుసేవ ఆలశ్యము అవుతుందని భావించేవాడు. గురువు వదిలిన భోజనమును కొద్దిగా త్వరత్వరగా తినేవాడు. ఒకనాడు కాశీవిశ్వనాథుడు అతని గురుభక్తికి మెచ్చి దర్శనమిచ్చి, వరం కోరుకోమన్నాడు. అతడు తన గురుదేవుని అనుజ్ఞ లేకుండా యెట్టి వరం కోరలేనన్నాడు. తన గురువువద్దకు వెళ్ళి, వారి వ్యాధి తగ్గేలా తాను వరం కోరడం ఆయనకు ఇష్టమేనా అని వేద ధర్మణ్ణి విచారించాడు.

అప్పుడాయన “ఏమిరా నా సేవ చేయటం నీకంత కష్టముగా వుందా? నాకోసం నీవు ఎట్టి వరమూ కోరనక్కరలేదు. వరం వలన ఈ రోగం పోగొట్టుకుంటే దానిని మరొక జన్మలో అనుభవించవలసి వస్తుందని శాస్త్రం చెబుతోంది. కనుక నేను ఈ జన్మలోనే ఈ పాపం అనుభవించి నా మోక్షానికి ఆటంకాన్ని తొలగించుకొంటాను” అన్నారు. కాశీ విశ్వనాథుడా విషయాన్ని దీపకుని ద్వారా విని, నిర్వాణ మండపానికి వెళ్ళి దేవతలందరి సమక్షంలో

ఆశ్చర్యంతో ఈ గురుశిష్యుల వృత్తాంతాన్ని చెప్పారు. అది విని ఆనందంతో విష్ణుమూర్తి ఆ గురుశిష్యులను చూడవచ్చినారు. చూడగానే దీపకుడు నారాయణమూర్తికి నమస్కరించి "దేవా! వరాలు కోరి మీ కొరకై తపస్సు చేసేవారిని ఉపేక్షించి మిమ్మల్ని ఎన్నడూ సేవించని నాకు దర్శనమిచ్చారేమిటి?" అని అడిగాడు. విష్ణుమూర్తి "నాయనా! గురువును భక్తితో సేవిస్తే నన్ను సేవించినట్లే! అట్టి శిష్యోత్తమునకు నేను అధీనుడను. తల్లిదండ్రులను, విద్వాంసులను, విప్రులను, తపస్వులను, యతులను పూజించేవారు, పతియే దైవమని విశ్వసించి, అతనిని సేవించే పతివ్రతలు గూడా నన్ను సేవించినవారే అవుతారు" అని చెప్పి వరం కోరుకోమన్నాడు. దీపకుడు ఆయనకు నమస్కరించి "గురువే సకల దేవతా స్వరూపమని, సకల తీర్థ స్వరూపియనీ వేదాలు, శాస్త్రాలు చెబుతున్నాయి. మీరిచ్చే వరం గురువు యివ్వగలడుకదా?" అన్నాడు.

శ్రీమన్నారాయణుడు "మేమిద్దరం ఒక్కటే. మా ఇద్దరి సంతోషం కోసం వరం కోరుకో. అది ప్రసాదించి యెల్లప్పుడూ నీ ఆధీనంలోనే వుంటాను" అన్నాడు.

"ఓ జగన్నాటక సూత్రధారీ! నీకు నాపై అంత అనుగ్రహం కలిగితే నీవు నాకు అతిపవిత్రమైన గురు హృదయమును ఉపదేశింపుము" అని కోరెను. అందులకు నారాయణుడు ఆనందపడి దీపకా! నీవు ఉత్తమ శిష్యుడవు. నీవు కోరిన గురు హృదయం తెలుపుతాను సావధానుడై వినుము.

గురువులలో చాలా భేదములున్నవి. వారివారి యోగ్యతనుబట్టి గురువులను వర్గీకరించి చెప్పెదను వినుము. లౌకిక బుద్ధిని, తాత్కాలికమైన హితవును బోధించువాడొక గురువు. ధర్మా, కర్మా, కృతిని వ్యాఖ్యానించువాడు అంతకంటే శ్రేష్ఠుడు. స్వంతముగా వేదవిద్యను చదివించువాడు అతనికంటే మేటి. ఆ వేదముల కర్థము కూడా చెప్పగలిగినవాడు అంతకంటే మిన్న. నా యదార్థస్థితిని తెలుపువాడు అందరికంటే గొప్ప గురువు. శుద్ధమైన నా స్వరూపములను ముందుగా తన బుద్ధితో తెలుసుకొని, శిష్యులకు బోధించు విహితుడగు గురువును నేనే యగుదును. అతని మాటలు అమృతము చిందించుచుండును. అతని ఉపదేశములు పాపములను పరిహరించును. ఆ గురువు నన్ను విడిచి, నన్ను తలవక క్షణకాలము కూడా యుండలేడు. అతడే నేను, నేనే అతడు. మానవుల మనస్సు పాములకు పుట్టవంటిది. ఆ మనస్సులోని



క్రౌర్యమే విషాగ్నివలె జీవులను బాధించుచుండును. కామ, క్రోధాదులే ఆ పాములు. దయతో శాస్త్ర, పురాణగాథల నుపదేశించి తద్వారా ఆ కామ క్రోధాది దుష్ట భుజంగములను, మాలిన్యములను నిర్మూలించి మనస్సును ప్రశాంతపరచ గలవాడే నిజమైన గురువు. ఓ శిష్యాగ్రణీ! మంచి చెడులను వేరుచేసి చూపి, కర్తవ్యమును చేయ నియమించి, కృత్యాకృత్య జ్ఞానము కలిగించి, భగవంతుని చేరు మార్గమును చూపు గురువును ఎల్లప్పుడు సేవించుటే మంచిపని, అట్లు చేయకుండుటయే స్వార్థము. శిష్య శ్రేష్ఠుడా! ఏ సాధకుడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల అనుగ్రహము పొందవలెనను దృఢదీక్షను బూనునో అప్పుడే అతనికి ఈ లోకమున సద్గురువు లభించును.

ఆ గురూపదేశములను శ్రద్ధతో విని, విశ్వసించి, ఆచరించువాడు సంసార సాగరమును తరింపగలడు. ఇదే గురు హృదయము. దీనిని విన్న నీవు నీకే వరము కావలెనో ఇప్పుడు కోరుకొనుము" అని విష్ణువు అనగా విని దీపకుడు మరల "ఓ జనార్థనా! నీ ప్రసాదమున తెలిసికొనవలసిన గురు హృదయమును తెలుసుకొంటిని. ఇదే నీవిచ్చిన వరము. కనుక నీవు యథా సుఖముగా నీ లోకమునకు బయలుదేరుము. నేనడుగవలసినది, నీవు ఈయవలసినది ఇంతకంటే వేరేమియూ లేదు" అని దీపకుడనగా అతని గురుభక్తిని, నిష్కామ బుద్ధికిని ఆశ్చర్యపడుచూ, నారాయణుడు వత్సా! నీవు నానుండి వరమును పొందియే తీరవలెను అని నిర్బంధించెను. అంతట దీపకుడు "దేవాదిదేవా! కర్మతంత్రంపట్ల అభిమానం కలవారు కమలాక్షుడవైన నీ తత్వాన్ని గ్రహించలేరు. నిష్కాములయినవారు మాత్రమే నిన్నాశ్రయించి, నీ పాదములను అర్చించి, నీ నిజతత్వాన్ని అవగతం చేసుకోగలుగుతారు. పంచభూతాత్మకమైన జీవి మాదిరిగా కనిపించటమే నీ మాయా విలాసం. నీ మాయద్వారా, నువ్వే ఆత్మ విభేదం కల్పిస్తూ వుంటావు. ఆ మాయకు లోబడని వారంటూ లేరు. నువ్వు సర్వాంతర్యామివి. విశ్వాత్ముడవు. అది గ్రహించి నీపట్ల ఆత్మభావంతో ప్రవర్తించేవారే నీ ప్రేమకు పాత్రులవుతారు. నువ్వు సత్వగుణాశ్రయుడవు. ధర్మ ప్రేరకుడవు. యజ్ఞస్వరూపుడవు. మరీచి మున్నగు మహర్షులు, బ్రహ్మ రుద్రేంద్రాదులు నీ అంశాంశాలు. ఈ ప్రపంచమంతా నీకు క్రీడారంగం. నీ మాయవల్ల పుట్టి పెరిగి అశాశ్వతమైన విషయాలపట్ల ఆసక్తి పెంచుకొని మానవులు నానావిధములైన బాధలు అనుభవిస్తుంటారు.




నీ కథామృతాన్ని సేవించే యోగ్యత కలిగించి వారిని నువ్వు సంసార సాగరం నుండి తరింప జేస్తుంటావు. అటువంటి దివ్యమూర్తివి నీవు నాకు దర్శనమిచ్చి నన్నుద్ధరించినావు. నీకు నా ప్రణామములు. నీవు నాకు అనుగ్రహంతో వరం ఇవ్వదలచిన యెడల ఇంతకంటే అధికంగా గురువుపైన శ్రద్ధను, భక్తిని కలిగించి వారిని సేవించు భాగ్యము కలుగనిమ్ము" అని ప్రార్థించెను.

విష్ణువు సంతోషించి "నీవు గురుసేవవలన తరించావు. నీవీ లోకంలోనే బ్రహ్మానందము పొందగలవు. నీవెల్లప్పుడూ నీ గురుదేవుణ్ణి యిలానే సేవిస్తూ వుండు. వేదము, వేదాంగాలు, వేదాంత వాక్యాల అర్థం తెలుసుకొని, గురువే పరమార్థమని, పరబ్రహ్మమని తెలుసుకొని గురువును యెవరైతే సేవిస్తారో, వారికి దేవతలందరూ వశమవుతారు. నిరంతరము సద్గురువుని సేవించేవారు కూడా లోకపూజ్యులే. నిన్ను స్మరించిన వారికిగూడ గురుభక్తి దృఢమై శక్తినియ్యగలదు. నీ అడుగుజాడలలో నడిచేవారు ధన్యులు. త్రిమూర్తుల మైన మా అనుగ్రహం వల్లనే మానవులకు సద్గురువు లభిస్తారు" అని చెప్పి విష్ణువు అంతర్ధానమయ్యాడు.

తరువాత దీపకుడు ఈ సంగతి చెప్పకముందే వేదధర్ముడు జరిగినదంతా చెప్పి, దీపకుని గురుభక్తికి మెచ్చి "చిరంజీవీ! నీవు కాశీలోనే నివసించు. అష్టసిద్ధులు, నవవిధులు నిన్ను సేవిస్తుంటారు. నిన్ను స్మరించినవారి కష్టాలుగూడా నశిస్తాయి" అని ఆశీర్వదించి, వెంటనే ఆరోగ్యవంతుడయ్యాడు. కాశీక్షేత్ర ప్రభావము తెలుపడానికి, శిష్యుణ్ణి పరీక్షించడానికి, స్వధర్మాన్ని, బోధించడానికి వేదధర్ముడు కుష్టురోగివలె కన్పించాడేగాని, నిజానికి ఆయనకు పాపమెక్కడిది? ఆయన తన శిష్యులనుద్ధరించడంలో అమిత కుశలుడు, లోకప్రియుడు, జీవన్ముక్తుడు. ఆదర్శప్రాయుడైన ముముక్షువు తన ప్రారబ్ధాన్ని సంతోషముగా ఎలా అనుభవించాలో, సాధకులకు తెలుపడానికి, శిష్యుని భక్తి, నిష్ఠ, ఓరిమిలను, విశ్వాసాన్నీ పరీక్షించడానికి మాత్రమే కుష్టురోగగ్రస్థుడయ్యాడు. ఇటువంటి గురుసేవా వృత్తాంతాలు అనేకమున్నాయి. ఇవి చెప్పేవారి దోషాలను, వినేవారి పాపాలనుగూడా పోగొడతాయి. "ఓ కలిపురుషా! కలియుగం ఆరంభం కావలసియున్నది, గనుక నీవు భూలోకానికి వెళ్ళు. కాని సద్గురు భక్తుని, నీవు కంటితోనైనా చూడవద్దుసుమా!" అని బ్రహ్మదేవుడు ఆదేశించాడు. అది విని



కలిపురుషుడు ఆయనకు నమస్కరించి భూలోకానికి వెళ్ళాడు” అని సూతుడు చెప్పినదానిని శ్రీ నిత్యానందుడు విద్యాసాగరునకు తెల్పెను.

సాధకులారా! ఈ అధ్యాయం గురువును ఎలా సేవించాలో తెలుపుతూ – కర్మఫలం అనుభవించడం శ్రేష్టం అని తెలుపుతూ వరాలవల్ల, కర్మనుంచి తప్పుకోవాలని ప్రయత్నించ గూడదు. దేవతానుగ్రహంతో కర్మను అనుభవించాలి. దానిని నిర్మూలం చేసుకోవడమే మానవలక్ష్యం. గురువు అనుగ్రహంతో దైవసహాయంతో జన్మ జన్మాంతరముల కర్మలను అనుభవించి దానిని పూర్తిగా తొలగించుకొని మోక్షపదం చేరాలి. దానికై ప్రయత్నించాలి. అదే మానవ లక్ష్యం. దానిని పొందేవరకు ఈ జనన మరణ చక్రంలో తిరుగుతూనే వుంటాము. ఇహపరమైన వాసనలు – విషయాలు కేవలం అసత్యాలు. శాశ్వతమైనవి సత్యం, ధర్మం, వానిచెంతకు చేర్చునది కేవలం గురుతత్వం మాత్రమే!

**జై సమర్థ సద్గురు అక్కల్‌కోట మహారాజ్‌కీ జై**

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహారాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

***నాల్గవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ గురుదేవదత్త
శ్రీ స్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఐదవ అధ్యాయము

విద్యాసాగరుడు "గురుదేవా! గురుపదమునకు మూలము ఎవరు? వారి తత్వం ఏమి? ఎవరు దీనిని ఆరాధించినారు. దయతో తెలపండి" అని ప్రార్థింప నిత్యానందుడు "నాయనా! నీవు అడిగినది అతి ప్రాచీనము – విశేషము అయినది. సర్వలోకాలకు దత్తాత్రేయస్వామియే గురువు – వారి తత్వమును, లక్షణములను, వారిని ఆరాధించిన వారిని గురించి తెలుపుతాను వినుము. పరమ పూజ్యుడైన దత్తప్రభువు స్వయంగా ఇలా తెలుపుచున్నారు. సాధకులారా!

*శ్లో॥ ఆది మధ్యాన్త ముక్తోహం*
*నబద్ధోహం కదాచన*
*స్వభావ నిర్మలః శుద్ధః*
*ఇతిమే నిశ్చితామతిః*

నేను ఆది, మధ్య, అన్తము లేనివాడను, బంధము లేనివాడను, సహజముగ నిర్మలుడను, శుద్ధుడను ఇది నా సిద్ధ నిశ్చయము.

*శ్లో॥జానామి సర్వదా సర్వ*
*మహమేకో నిరంతరమ్*
*నిరాలంబ మశూన్యంచ*
*శూన్యాది వ్యోమాది పంచకమ్*

"నేను అన్ని విధముల అన్నియు నెఱుంగుచున్నాను. నేను అంతర్భేదము లేనివాడను; ఆశ్రయాపేక్ష లేనివాడను; శూన్యమును, శూన్యము కానివాడను, ఆకాశాది పంచభూతములును నేనే. నన్ను తెలుసుకోకోవాలంటే...



శ్లో॥ రాగద్వేష వినిర్ముక్తః
సర్వభూత హితేరతః
దృఢ బోధశ్చ ధీరశ్చ
గచ్ఛేత్పరమం పదమ్ ।

రాగద్వేషములు లేనివాడును, సమస్త భూతములకు హితము చేయ పూనికగలవాడును, దృఢమైన జ్ఞానము గలవాడును, ధైర్యవంతుడును పరమపదమును పొందును. నన్ను చేరును" అని శ్రీ దత్తాత్రేయ ప్రభువు తెలిపెను.

పరమ సాధకా! దత్తాత్రేయ తత్త్వము అనంతమైనది. అగోచరమైనది. వినయ సంపన్నమైన సదాచారవంతుడు శ్రద్ధ - ఓర్పు కలిగిన శిష్యునికి మాత్రమే పూర్తిగా అనుభవమవుతుంది. అంతేకాని ఈ తత్త్వము వాక్కుతో విశదీకరింపరానిది. మరియొక వస్తు ప్రకాశములో దానిని గ్రహించుటకట్టి ప్రకాశమాన వస్తువు లేదు. అది సమస్త జ్ఞానమునందు నిండి స్వప్రకాశమై యున్నది. అదియే పూర్ణ గురుస్వరూపము. దానిని తెలుసుకొనుటకు సాక్షాత్కారము ఒక్కటియే మార్గము. అప్పుడది యద్వైతముగా తెలియబడును. అది అనాచ్ఛాదిత శుద్ధ నిర్మలమైన యవధూత భావంలో దిగంబరమని చెప్పబడింది.

దిగంబరము అనగా స్థూలంగా వస్త్రములు ధరించని స్థితి. కాని అవధూత సాంప్రదాయములో దిగంబరము అనగా పంచభూతముల సమీకరణలో నిర్మాణమైన దేహం కలిగివుండి ఈ భూతముల కలయికలో ఏర్పడిన ప్రకృతి శక్తులకు లొంగక తాను నిరంతరము పరతత్త్వములో లయించుటయే. అనగా ఈ సమాజములో వున్న అనేకమైన విషయ వాసనలకు అతీతంగా జీవించువారిని అవధూత అని దిగంబరులు అని సకలశాస్త్రములు, ఉపనిషత్తులు తెలుపుచున్నవి.

అలాగే ఈ సంప్రదాయమున శిష్యుడు కూడ తనకుగల సమస్తమైన సంపదలను, భార్యాపిల్లలను, బంధువులను, అధికారములను విసర్జించిన ఈ లక్షణమును దిగంబరము అని అందురు. దిగంబరుడైన గురువును దిగంబరుడైన శిష్యుడు చేరవలెను. అప్పుడు వానికి గురుతత్త్వము అవగతం కాగలదు. దానివలన వారుకూడా అవధూత కాగలరు.

మహోన్నతమైన సాధనవలన సాధకుడు దిగంబరుడైన గురువును తాను దిగంబర తత్త్వధారియై సేవించి అవధూత స్థితిని పొందును. ఇట్టి అవధూతల వలననే ఈ ప్రపంచములో అనేక విపత్తులు తొలగిపోవుచుండును. వీరి సాధనచేత తమకు, తమను ఆశ్రయించినవారికి యోగసాధనను లభింప జేయుదురు. వీరి వాక్కులు, స్పర్శనము, దర్శనము ద్వారా మానవులకు మహోన్నతస్థితిని స్థూలంగాను-సూక్ష్మంగాను అనుగ్రహించెదరు.

దత్త అనుపదానికి అర్థము వ్యవహారికములో దత్తం చేయుట, ధారాదత్తం అను పదములు కలవు. దత్తం అనిన పూర్తిగా యిచ్చుట. తమకు ఏ హక్కులు లేకుండా యితరులకు యిచ్చుట. దత్తుడు తనకుతాను యోగులకు, భక్తులకు సమర్పించుకొనును. యోగియు, భక్తుడును తననుతాను దత్తునకు దత్తమైనప్పుడే వానికి పూర్తిగా శ్రీదత్తతత్వం అవగతమగును. గురువు శిష్యునికి తన జ్ఞానభాండాగారము అంతయు ఇచ్చి అతనిని తనంతవానిగ తీర్చిదిద్దును. శిష్యుడు తనకు ఏ వ్యక్తిత్వము నుంచుకొనక పూర్తిగా గురువునకు అంకితము అగును. అప్పుడు వానికి గురు ప్రబోధము బోధపడును. ఈ విధంగా గురువు శిష్యులు ఒకరికొకరు దత్తం అగుటయే దత్తశక్తి అనబడును.

దత్తుని ఆత్రేయుడు అనుటలో పూర్ణమైన అర్థం, రహస్యం దాగివున్నది. ఇది యోగ లక్షణం. అత్రి అనగా త్రిపురములను దాటినవాడని, త్రిగుణరహితుడని అర్థము. త్రిపురమనగా యోగసాంప్రదాయమున సప్తచక్రములు గలవు. వానిలో త్రిపురములు కలవు. ఇవి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి.

ఇవి మూలాధార స్వాధిష్టాన మణిపూరకము - అనాహత - విశుద్ధ - అజ్ఞ సహస్రారములు అను సప్తచక్రములను కలుపునవి. వీనిని దాటుట అనగా కుండలిని జాగరణ చేయించి ఈ పురముల ద్వారా సహస్రార చక్రమును చేరి అమృతత్త్వమును పొందుట. ఈ తత్త్వమును పొందిన వారిని అత్రి అందురు. మరియు త్రిగుణ రహితుడు అనగా సత్వ తమ రజోగుణముల వ్యవహారములకు అతీతుడు.

సాధకుడు గురువుల ప్రబోధం (ఉపదేశం) పొంది ఈ యోగమార్గమును అవలంభించి సాధనచేత త్రిపురములను దాటి త్రిగుణరహితుడు అయి - అసూయ లేనివానికి శ్రీదత్తుడు తననుతాను దత్తము చేసుకొనును. గురుశిష్య సాంప్రదాయమునకు విశిష్టత కూర్చునదే ఈ దత్త సాంప్రదాయము.



శిష్యుడు తన మనస్సును, శరీరమును తన సంపదలు అన్నీ గురుప్రసాదితములే అని విశ్వసించి దానిని తిరిగి గురువునకే సమర్పించవలెను (దత్తం చేయవలెను). దీనిలో స్వార్థము ఉండకూడదు. త్యాగం వుండాలి. అటువంటి శిష్యునికి గురువు తన సర్వ జ్ఞానసంపదలు ధారపోయును (దత్తం చేయును). గురువు శిష్యుడు ఇరువురు పరస్పరము గౌరవించుకొనుచు ఈ విధంగా ఒకరికొకరు దత్తం అయినచో శ్రీ గురుదత్తుని దర్శనం పొంది వారికి దత్తం కాగలరు.

దత్తాత్రేయుడు అనగా పైన తెలిపిన యోగికి తాను దత్తం కావడమే శ్రీగురుదత్తుని అవతార విశిష్టత. వీరు అవధూతలుగా సంచరించుచుందురు. ఇంకను బాల ఉన్మత్త, పిశాచ రూపములోను భక్తులకు దర్శనము యిచ్చెదరు. వీరి కార్యము కేవలం సదా భక్తులను రక్షించి వారికి పరమపదము లభింపజేయడమే. దానికి వారు భక్తులను అనేక చిత్రవిచిత్రమైన రీతుల పరీక్ష చేయుదురు.

వీరిచే పరీక్షింపబడి పరీక్షలో జయించి వారి కృపకు పాత్రులైనవారు ఎందరో కలరు. వారు బ్రహ్మ, ఇంద్రుడు, వశిష్టుడు, ప్రహ్లాదుడు, పరశురాముడు, కార్త వీర్యార్జునుడు, అలర్కుడు, ఆయువు, యదువు, పింగళనాభుడు, శార్గదేవుడు, సాంకృతి, దలాధనుడు మున్నగువారు పురాణ పురుషులైతే, ఈ కలికాలంలో మత్స్యేంద్రనాథుడు, జనార్ధనస్వామి, ఏకనాథుడు, జ్ఞానదేవుడు, చాంగదేవుడు, తుకారాం, సమర్థ రామదాసు, విద్యారణ్యస్వామి, శ్రీ నారాయణ మహరాజ్, శ్రీ దాసోపంతు, శ్రీ జ్ఞానసాగర్, శ్రీ నిరంజన రఘునాథ్, శ్రీ దత్తనాథ్, అలరామప్రభు, బక ప్రభు నూరి మహరాజ్, వాసుదేవానంద సరస్వతి, శ్రీధరస్వామి, రంగావధూత, శ్రీ రమణమహర్షి, రామకృష్ణ పరమహంస, సద్గురు సిద్ధారూఢస్వామి, సద్గురు కృష్ణ సరస్వతి, సద్గురు చిదానందస్వామి, సద్గురు త్రైలింగస్వామి, సద్గురు చంద్రార్యస్వామి పంజాబ్, శ్రీ సద్గురు మలయాళస్వామి, శ్రీ మెహర్‌బాబా, శ్రీ గురుమహరాజ్, నరసింహస్వామి, శ్రీ శివానంద సరస్వతి, శ్రీ సత్యసాయిబాబా మున్నగు వారెందరో కలరు. వీరందరూ దత్తునికి దత్తమై దివ్యమైన సిద్ధులను పొంది గురుశిష్య సాంప్రదాయమును అభివృద్ధిచేసి అనేకమైన ఉత్తమ, ఆధ్యాత్మిక గ్రంథములను రచించి వానిద్వారా దత్త సాంప్రదాయమును ప్రచారము చేసినారు.

ఈనాటి కాలంలో అనేకమంది మహాత్ములు కలరు. కలియుగంలో శ్రీ స్వామి దత్తాత్రేయులవారు స్వయంగా అవతరించిన అవతారములు శ్రీపాద శ్రీవల్లభస్వామి, శ్రీ నరహరి నరసింహ సరస్వతి, శ్రీ మాణిక్యప్రభువు, శ్రీ స్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్, శ్రీ గజానన మహారాజ్, శ్రీ తాజుద్దీన్ బాబా కలియుగ పరిపూర్ణ అవతారం శ్రీ షిర్డీ సాయిబాబావారుగ ప్రసిద్ధి చెందినారు.

భగవాన్ శ్రీ దత్తాత్రేయ నామమును ధ్యానించుటకు, వారి అవతార విశిష్టతలను, మహాత్త్యములను కీర్తించుటకు మించిన మనోహరమైన విషయము ఏదీ జగత్తులో లేదు. వారు ఈ జగత్తునకు కారకులు, వారే జగత్తునకు నిర్మాతలు, కర్తలు. భగవాన్ దత్తాత్రేయుల నతి రమ్యముగా వర్ణించు శాండిల్యోపనిషత్తు యిట్లు గానం చేయుచున్నది.

*[1] దేవదేవుడు, శుభప్రదుడు, శాంతి స్వరూపుడు, ఇంద్రనీలకాంతివంటి దేహ కాంతిగలవాడు, ప్రభువు తన మాయయందు క్రీడించువాడు, లీలాప్రవృత్తి గలవాడు, అవధూత, దిగంబరుడు, సర్వావయవములు భస్మములతో నలంకరింపబడినవాడు, జడలు ధరించినవాడు. విభుడు, నాలుగు చేతులుగలవాడు, ఉదారమైన అవయవములు గలవాడు, బాగుగా వికసించిన కమలములవంటి కన్నులుగలవాడు, జ్ఞానమునకు యోగమునకు నిధియు, జగద్గురువు, యోగిజనులకు ప్రియుడు, భక్తులయందు దయగలవాడు, సర్వసాక్షి, సిద్ధులచే సేవింపబడువాడు.

---

1 *దత్తాత్రేయం శివం శాన్తం ఇంద్రనీలనిభమ్ ప్రభుమ్*
*ఆత్మమాయారతం దేవం అవధూతం దిగంబరమ్*
*భస్మోద్ధూళిత సర్వాంగం జటాజూటధరం విభుమ్*
*చతుర్బాహుమ్ ఉదరాంగం ప్రపుల్ల కమలేక్షణమ్*
*జ్ఞానయోగనిధిం విశ్వగురుం యోగిజన ప్రియమ్*
*భక్తానుకంపినం సర్వసాక్షిణం సిద్ధసేవితమ్*
*ఏవంయః సతతంధ్యాయే ద్దేవదేవం సనాతనమ్*
*సముక్త స్సర్వపాపేభ్యో నిశ్రేయసమ్ అవాప్ను*
*యాత్ ఇతి సత్యమిత్యుపనిషత్ –*

ఇట్లు భగవాన్ దత్తాత్రేయుల నుపనిషద్విధానమున ధ్యానించువాడు సమస్త పాపముల నుండి విడివడి పరమానందము నందును. ఇది సత్యము అని యుపనిషత్ భావము.

దత్తాత్రేయుడు స్మరణమాత్ర సంతుష్టుడు. స్మర్తృగామి అని అతనికి సార్థక నామధేయం. ఒకసారి ఆయనను మనసారా తలిస్తేచాలు, ఆయన దర్శనమిస్తాడు. దత్తప్రభువులో వున్న వేరొక విశేషమేమిటంటే ఆయన భక్తకీర్తి "వివర్ధనుడు'. తన మహిమను చూపుటకంటే తన భక్తుల మహిమలను అతిశయించేటట్లు చేయాలనీ, వాళ్ళ కీర్తిని విస్తరింపజేయాలనీ ఆయన ఆకాంక్షిస్తుంటాడు. ఆయన భక్తి ముక్తి ప్రదాత. ఆయన భక్తులకెల్లప్పుడూ స్వాధీనమై వాళ్ళ వాక్కును వేదవాక్కు చేస్తుంటాడు. తనకూ, తన భక్తులకు భేదం లేదని నిరూపిస్తుంటాడు. ఇది నాన్యతో దర్శనీయం.

ఒకప్పుడు బాలుడుగా, ఒకప్పుడు కుమారుడుగా, ఒకప్పుడు తరుణుడుగా, ఒకప్పుడు వృద్ధుడుగా ఆయన వుంటాడు. ఒకప్పుడు మద్యపాత్ర ధరించి, దివ్యాంగనాలింగితుడై, మదవిహ్వాలాక్షుడై వుంటాడు. ఒకప్పుడు బంగారు వన్నెగల శరీరంతో, చిత్రవిచిత్ర మాల్యాంబరాలతో శోభిల్లుతుంటాడు. ఒక్కొక్కప్పుడు కల్లు త్రావుతూ శరీరంనిండా బూడిద పూనుకొని, దిగంబరుడై తిరుగుతుంటాడు.

*[2] మందారవృక్షం, దానిక్రింద ఒక మణిపీఠం, దానిపై ఆసీనుడైన దత్తస్వామి. ఆయన జడలో మల్లెలూ... మొల్లలు... జాజులు.... మెడలో మణిహారములు.... ఫణిహారములు, మొలలో బంగారు మొలతాడు, వామాంకమున యోగలక్ష్మియైన అనఘా (మధుమతి) దేవి, వెనక కామధేనువూ, నాలుగువైపులా కుక్కల రూపంలో ఉన్న వేదాలు స్వామివారిని సనకసనందనాది సాధుసత్తములు, యోగులు, మహర్షులు, నవనాథులు మొదలైన వాళ్ళంతా పరివేష్ఠించి వుంటారు. పాశము, అంకుశము, పరాశక్తి, వాగేశ్వరి, కామేశ్వరి,

---

2 *"మందారమూలే మణిపీఠ సంస్థం*
*సువర్ణదానైక నిబద్ధ దీక్షం*
*ధారయేత్ పరీతం నవనాథ సిద్ధైః*
*దారిద్ర్య దావానల కాలమేఘం"*

భువనేశ్వరి, శ్రీదేవి, భూతజాలము, అష్టసిద్ధులు, ఐశ్వర్యములు, దేవతలు, దానవులు ఆయన ముందు చేతులు జోడించి నమస్కరిస్తూ వుంటారు. వరదులైన దత్తాత్రేయులవారు భక్తుల కోర్కెలను అనుగ్రహిస్తుంటారు. ఆ స్వామి శంఖుచక్రాలను, గదపద్మాలనూ, డమరు త్రిశూలాలను, మాలా కమండలాలను ధరించి వుంటారు. అత్రిమహర్షి, అనసూయాదేవి ఒక ప్రక్కన, దుర్వాసుడు, చంద్రుడు ఒక ప్రక్కన కూర్చొని దత్తవైభవాన్ని వీక్షిస్తూ వుంటారు. గంధర్వులు గానం చేస్తుంటే అప్సరసలు నాట్యం చేస్తుంటారు. ఈ విధంగా నైమిశారణ్యంలో దత్తాత్రేయులవారి కొలువు వుందని బ్రహ్మాండ పురాణంలో వర్ణించబడింది. ఈ వర్ణన దత్తాత్రేయులవారి పరబ్రహ్మ తత్వాన్ని, గురు స్వరూపాన్ని, విశ్వరూపాన్ని వెల్లడిస్తుంది. దత్తాత్రేయుడు ఎట్లా వుంటాడో? తెలుసుకోవాలనుకునేవారు "దత్తాత్రేయ కవచం"లోని ధ్యానం ఒకసారి చూస్తే బోధపడుతుంది. ఇంకా దత్తమంత్రాల్లో, స్తోత్రాల్లో ఆయన వర్ణన వుంది. దత్తుడి స్వరూప స్వభావాలు వర్ణించాలంటే అది మన శక్తికి మించినపని. ఓంకారం ప్రత్యగాత్మానం పరబ్రహ్మ స్వరూపిణం పరమాత్మాన మవ్యక్తం" అని నమస్కరించటం మాత్రమే మనం చేయవలసినది.

*[3] దత్తాత్రేయుడు సహ్యాద్రి నివాసి రాత్రి సమయంలో మాహుర్‌గఢ్‌లో శయనిస్తాడు. ఉదయం స్నానం కాశీలో గంగానదిలో చేసి, కురుక్షేత్రంలో ఆచమనం చేసి, గిర్నార్, గాణ్గాపూర్‌లలో మధ్యాహ్నికం నెరపి, దూతపాపేశ్వరంలో భస్మధారణ కావిస్తూ, కర్నాటకంలో సంధ్యావందనం చేస్తూ, కొల్హాపురంలో భిక్షను అర్థిస్తూ, తుంగభద్రలో నీళ్ళు త్రాగుచూ, బదరీనారాయణంలో శ్రవణం జరుపుచూ, గిర్నార్‌లో విశ్రాంతి తీసుకుంటూ, పండరీపురంలో కస్తూరీ తిలకము ధరిస్తూ, సాయం సంధ్యావందనం పశ్చిమ

---

[3] *యస్యాస్తి మహూరే నిద్రా, వాససహ్యా పర్వతే*
*భాగీరథ్యాం సదాస్నానం, ధ్యానం గంధర్వ పత్తనే,*
*కురుక్షేత్రే చాచమనం, ధూత పాపేశ్వరీ తథా*
*విభూతిధారణం, సంధ్యాకరహాటే, శ్రియఃపురే*
*బిక్షా, విఠల పురస్య సుగంధ ద్రవ్యధారిణం*
*భుక్తిస్పారపురే, సాయంసంధ్యా పశ్చిమసాగరే".*

సముద్రతీరంలో జరిపిస్తుంటాడని పురాణాలు ప్రవచిస్తున్నాయి. ఇందువల్ల ఆసేతు శీతాచలం దత్తుడు ప్రతిరోజూ తిరుగుతూ వుంటాడనీ, దత్తుడి పాద స్పర్శతో పునీతంగాని ప్రదేశం అంటూ భారతదేశంలో లేనేలేదని, యోగ్యులైన సాధకులకు ఆయన నిత్యం దర్శనమిస్తూ, అనుగ్రహిస్తూ వుంటాడని మనకు స్పష్టమౌతుంది. దత్తుడివల్లనే భారతభూమి “యోగభూమి”గా ప్రసిద్ధి గాంచింది.

జగత్తునకు మూలకారకుడైన పరమేశ్వరుడు పరమేశ్వరి ఈ విశ్వములో సృష్టిచేయ సంకల్పం చేసిరి. వారి ఇరువురి కలయికతోనే 3 అక్షరములతో కలసిన ఓమ్ (ప్రణవము) జన్మించినది. వారి ఇరువురి ప్రణయములో జన్మించుటచే అది ప్రణవము అయినది. అకార–ఉకార–మకారములు వెలసినవి. వీనినుండియే బ్రహ్మ–విష్ణు–మహేశ్వరులు ఉద్భవించిరి. వీరు వేరువేరుగా పనిచేయునప్పుడు సృష్టి స్థితి లయ కారకులుగా నున్నారు. వీరి మువ్వురి కలయికచేత పరమాత్మ తన ఏకైక తత్త్వము పొందును. అతడే మరల తనను తాను విభజించుకొని అనేక తత్త్వములుగా, దేవతలుగా, మంత్రములుగా, వేదములుగా, గ్రహములతో నిండిన ప్రకృతిగాను, దానిలో క్రీడించుచున్న పురుషునిగాను మారుచుండును. భగవంతుడైన ఈ పరమేశ్వరుడు సర్వైశ్వర్య సంపన్నుడు, సర్వవ్యాపి. సర్వభూతాన్తర్హృదయమున నుండువారు. మాయావి మాయతో క్రీడించును. సర్వదేవతలు, సర్వభూతములు, సర్వదిశలో వున్నది అతడే. అతనికి దేవదేవికి జన్మించిన ఓంకారం రూపుధరించినపుడు దాని స్వరూపమే దత్తాత్రేయుడు. దత్తాత్రేయ రూపం గురువుగా – శిష్యునిగా వుంటూ అనంత తత్త్వాలలో ఏకత్వాన్ని ప్రబోధించుచు కనిపించి, కనిపించక – తెలిసి – తెలియక “ఏమీ లేనిది ఏమీ కానిది ఏకమై ఉన్నది” అను రీతిన ఈ జగత్తును నిర్మాణం చేయుచు నిర్మూలనం చేయుచు క్రీడించుచున్న పరమతత్వం.

పరబ్రహ్మ–పరమేష్టి యొక్క చిత్ర విచిత్రమైన రూపం శ్రీ దత్తాత్రేయులు.

కావున ఆ పరమేష్టి తాను తన మాయలో క్రీడించుచు దత్తాత్రేయ రూపమును దాల్చెను. ఈ విషయం శాండిల్య ఉపనిషత్ (3 : 1) తెలుపుచున్నది.

ఈ పరమ రహస్యమును తెలుసుకొని దీనియొక్క అర్థము తెలిసినవారు

సర్వము తెలిసినవారలగుదురు. విద్యవల్లను చింతనవలనను పరబ్రహ్మను (దత్తాత్రేయులను) "నేనే" అని ధ్యానించువాడు బ్రహ్మవిదుడగును.

"విద్యాసాగరా! లఘువుగా శ్రీదత్తదేవుని తత్త్వము ఇది. దీనిని పఠించినను, స్మరించినను దత్తదేవుని అనుగ్రహం కలుగును. ఇక దత్తదేవుని జననం తెలిపెదను. సావధానుడై గ్రహించుము" అని శ్రీ దత్త జననమును చెప్పబూనినాడు.

**జై గురుదేవదత్త అవధూత చింతనం**

**జై సమర్థ సద్గురు అక్కల్‌కోట మహరాజ్‌కీ జై**

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ)*

*విరచిత* ***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

**ఐదవ అధ్యాయము** సంపూర్ణము



 



ఓం శ్రీ సాయిరాం
ఓం ద్రాం దత్తాత్రేయాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఆరవ అధ్యాయము

### శ్రీ దత్తదేవుని జననం

"విద్యాసాగరా!

అత్రిమహర్షి ఈ విశ్వమునకు కారణమైన శక్తిని దర్శించదలచి, అటువంటి శక్తివలన సంతానము పొందగోరి, ఋష్యాద్రి పర్వతముమీద, పంచాగ్నుల మధ్య నిలబడి, అతి తీవ్రమైన తపస్సు ప్రారంభించారు. ఆ విధముగా తపస్సు చేయుచుండగా, వందల సంవత్సరములు గడిచిపోయినవి. ఆ తపోనిధి శిరస్సు నుండి తపోగ్ని భయంకరమైన జ్వాలలుగా బయలుదేరి ముల్లోకాలను, ఈ విశ్వములోని అన్ని గ్రహములను, అన్ని జీవులను తమ జ్వాలలతో భయకంపితులను చేసింది. లోకరక్షకులైన త్రిమూర్తులు దీనిని నివారించి అత్రికి ఆనందము కలిగింప వారిముందు ప్రత్యక్షమై, "నాయనా! అత్రీ! నీ తపస్సునకు మెచ్చినాము లెమ్ము. ఏమి కావలెనో కోరుకొమ్ము!! అని పలికిరి. వారి రాకతో మనస్సునకు ఆనందము కలుగగా, తపమును చాలించి, అత్రి వారిని దర్శించి, "మహాత్ములారా! మీ దర్శనము వలన నేను ధన్యుడను అయ్యాను. అయినా నేను మిమ్ములను గూర్చి ఈ తపము చేయలేదు. నాకు ఈ విశ్వమును రచించినవాని దర్శనము కావలెను. మీరు కేవలము కారణభూతులని, ఆ విశ్వ విరాట్ పురుషునిచే నడిపింపబడుదురని, నా తపము వలన గ్రహించినాను. సృష్టి, స్థితి, లయములకు ఆ విశ్వవిరాట్ పురుషుని లీలావిలాసమే కారణము అని, ఆ పరంధాముని శక్తి అగ్రాహ్యంగా వుంటుందని, ఆయనే సర్వకారణము లకు నియంత అని, ఆయన ఇచ్ఛా మాత్రముననే ప్రాణకోటికి సుఖదుఃఖాలు సంభవిస్తూ వుంటాయని తపస్సు వలన

తెలిసికొనినాను. తండ్రులారా! దయతో నాకు వారి దర్శనము కలిగించండి!” అని ప్రార్థించెను. అది విని త్రిమూర్తులు ఒకరినొకరు చూచుకొని వారు “ఓ అత్రీ! సహనం, సర్వ సమత్వం, కనికరం, శ్రద్ధ, స్నేహభావం అనే సద్గుణాలవల్లనే సర్వేశ్వరుని ప్రసన్నం చేసుకోవచ్చు. అయితే ఆ దివ్యమైన శక్తి నిర్గుణ రూపంలో వుంటూ సగుణరూపం పొందినపుడే మేము ఏర్పడినాము. నీకు ఆ నిర్గుణరూపం కావాలి అంటే...” అని వారు ఆ సర్వేశ్వరుని స్మరించి అదృశ్యముకాగా, ఒక దివ్యమైన రూపం ప్రకటితమైనది. ఆ ఆకారం మూడు తలలతోను, ఆరు చేతులతోను ఒకే శరీరం, మూడు రంగులతో సమ్మేళనమై వింతగా మెరయుచున్నది. శంఖు, చక్రములు, త్రిశూల ఢమరుకములు, కమండలము జపమాలతోను, శిఖలు కలిగిన మూడు తలలతో, అందు ఒక శిఖయందు గంగ చంద్రులను ధరించి అతి గంభీరముగా నుండి, అతి చిన్నవయసుగల బాలునిగా దర్శనమిచ్చినాడు. అత్రిమహర్షి ఆశ్చర్యముగా చూచుచుండగా ఆ ఆకారం “తండ్రీ! నేను మీ దత్తుడను. నీ తపస్సు మూలమున నన్ను నేను మీకు సమర్పించుకొనుచున్నాను. గ్రహించండి” అని పలికెను. అంతట అత్రి మనస్సులోనే “తండ్రీ! నీవు మా దంపతుల గర్భములో జన్మించి మాకు ఆనందము కలిగింపలేవా!” అని ప్రార్థించెను. దానిని గ్రహించిన ఆ చిత్రమైన బాలదత్తుడు “తండ్రీ! నీ అభిమతం గ్రహించినాను. నాకు మీవంటి పుణ్యదంపతుల గర్భంలో జన్మించడం ఆనందదాయకమే. అయితే దీనికి కొంత సమయం కావాలి. నిరీక్షించండి” అని దీవించి అదృశ్యమయ్యెను. అంతట అత్రి అమితమైన సంతోషముతో తన ఆశ్రమమునకు చేరి అనసూయ మాతకు తపఃఫలమును, తన కోరికను వివరించెను. ఆ దృశ్యమును తలచుకొనుచు ఆ ఇరువురు ఆనందముగా నుండిరి.

ఇట్లుండ కొంతకాలమునకు ఆశ్రమమునకు దగ్గరగానున్న ప్రతిష్ఠానపురంలో కౌశికుడు అను బ్రాహ్మణుడు ఉన్నాడు. అతను విద్వాంసుడైనను, తన పూర్వకర్మలచేత కుష్టువ్యాధిగ్రస్తుడైనాడు. అతనికి సుమతి అను ఉత్తమ ఇల్లాలు కలదు. ఆమె పతిని అతి గాఢముగా ప్రేమించుచు, పతిసేవయే సతికి ధర్మము అని అతనిని సేవించుచుండెడిది. అయినా వ్యాధిగ్రస్తుడైన ఆ కౌశికుడు ఆమెను అనేక విధములుగా బాధించుచుండెడివాడు. అయినను అన్నింటిని ఓర్చుకొని ఆమె అతనిని పరమేశ్వర రూపంగా సేవించుచుండెడిది. ఆమె సహనశీలి, శాంతమూర్తి, శ్రద్ధ, ఓర్పులతో పతిని సేవించెడిది.



ఒకనాడు కౌశికుడు వీధి అరుగుపై కూర్చొని వుండగా, ఆ మార్గమున ఒక వేశ్య తన చెలులతో సాగిపోతూ వానివైపు చూచినది. ఆమె అందమునకు మోహావేశపరుడైన కౌశికుడు సుమతిని పిలిచి ఆమెను చూపి, ఆమె పొందు కావాలని కోరినాడు. భర్త కోరిక విని, వానికి అనేక హితములను తెలుపుచూ, ఆ కోరిక ధర్మంకాదని ఆ సతీమణి వివరించినది. నచ్చచెప్ప బూనినది. మూఢుడు, కామావేశపరుడైన కౌశికుడు ఆమె మాటలను చెవినిపెట్టక తన కోరిక తీర్చుమని లేనిచో ప్రాణత్యాగము చేసెదనని పట్టుపట్టెను. అంత ఆ సుమతి అంగీకరించి చీకటి పడునంతవరకు ఆగమని ప్రార్థించెను. అందులకు కౌశికుడు ఆనందముగా ఒప్పుకొని ఎప్పుడు చంద్రోదయమగునా అని ఎదురుచూడసాగినాడు.

మహాసాధ్వీమతల్లి అయిన సుమతి చీకటి పడిన తరువాత కొన్ని బంగారు వరహాలు కొంగున మూటగట్టుకొని, రోగి, నడువలేనివాడైన తన భర్తను ఒక వెదురు గంపలో కూర్చోబెట్టుకొని, అతి కష్టంమీద తలపైకి ఎత్తుకొని రాజమార్గంలో వెళ్ళినచో పరులు చూతురని, ఊరి బైటనుండి స్మశాన మార్గమున తీసుకొని పోవుచుండెను. ఆ ప్రాంతములో ఒక చెట్టుకు మాండవ్యుడు అనే మునిని అపరాధి అని భ్రమపడిన ఆ నగర రాజు వానిని విచారించకనే కొరత వేయించినాడు (అనగా ముళ్ళపంజరములో ఒక రాత్రి అంతయు వుంచుట). అది గాలికి కదిలినప్పుడల్లా ఆ ముళ్లు ఆ మహర్షి శరీరమును బాధించుచుండెను. ఆ బాధకు తాళలేక మహర్షి చాలా బాధపడుచుండెను. అంధకారములో సుమతి అదే మార్గంలో పోవుచుండగా, ఆనందముతో కౌశికుడు తన కాళ్ళు చేతులను గట్టిగా ఆడించుచుండెను. బరువుకు తాళలేక ఆ సాధ్వి తడబడుచూ నడుచుచుండెను. ఇంతలో మాండవ్యుని కొరతవేసిన పంజరము రాగా కౌశికుని కాళ్ళు దానికి గట్టిగా తాకినవి. అందువలన ఆ ముళ్ళ పంజరములోనున్న ఆ ముని శరీరము తీవ్రంగా గాయపడి అమితమైన బాధ కలిగించినది. దానికి మండిపడిన మాండవ్యుడు తీవ్రమైన స్వరంతో “నా కర్మకు నేను బాధపడుచు ఈ అకారణ శిక్షను అనుభవించుచుండగా నన్ను కాలితో తన్ని మరింత బాధ కలిగించిన మూర్ఖుడు ఎవడైనా సూర్యోదయంతో శిరస్సు వెయ్యి ముక్కలై మరణించుగాక!” అని శపించెను. వెంటనే సుమతి అమితమైన బాధతో “అట్లయిన సూర్యోదయమే కాకుండుగాక!” అని పలికెను.




ఈ సంఘటనకు బాధపడి భయపడిన కౌశికుడు తన వ్యామోహమును వదలి సుమతిని తిరిగి యింటికి తీసుకుని పొమ్మనినాడు. గృహమును చేరిన ఆ దంపతులు జరిగిన సంఘటనను తలుచుకొని ఆ పరమేశ్వరుని ప్రార్థింపసాగిరి. మరుసటి రోజున సూర్యోదయము కాలేదు. అట్లు పది రోజులు గడిచిపోయినవి.

ముల్లోకములలోను అందరూ ఆశ్చర్యంతోను, భయంతోనూ సృష్టిక్రమం ఆగిపోతుందని భయపడినారు. మహర్షులు, దేవతలు అందరూ నారదుని వెంటగొని బ్రహ్మదేవుని చేరి ప్రార్థించగా, ఆ ప్రజాపిత "అమరులారా! మునివరులారా! ఇది ఒక పతివ్రతామతల్లి సంకల్పం వలన ఏర్పడిన స్థితి. ఇది తొలగిపోవాలంటే పతివ్రతామతల్లులకే సాధ్యంగాన మీరు అందరూ సతీ అనసూయమాతను ఆశ్రయించండి. ఆమె ఈ ఆపత్సమయంలో సర్వజీవులకు రక్షణ కలిగింపగలదు" అని పలికి దీవించెను. అంతట అందరును సతీ అనసూయ, అత్రి మహర్షుల ఆశ్రమం చేరి అనసూయామాతను ఈ విధంగా ప్రార్థించిరి. "అమ్మా! లోకపావనీ! విశ్వమాతా! లోకానికి ఆపద కలిగినది. రక్షించండి" అని పలికి అంత ఆ మాత వెలుపలకు వచ్చి వారందరినీ ఆశ్చర్యంగా చూసి విషయం తెలుసుకుని "మహాత్ములారా! ఇది పతివ్రతా సాధ్వి అయిన సుమతి సంకల్పం. ఆమె వాక్కు అమోఘం. అదియే దేవదేవుడైన సూర్యభగవానుని గమనాన్ని ఆపినది. కనుక అందరమూ అక్కడి వెళ్ళెదము పదండి!" అని పతిదేవుని అనుమతిపొంది వారితో బయలుదేరి ప్రతిష్ఠానపురం చేరి, సుమతీ కౌశికుల గృహమును చేరి "అమ్మా! సుమతీ!" అని పిలిచినది. ఆ పలుకులు విని సుమతి వారికెదురేగి, వచ్చినది అనసూయ మాతయని గ్రహించి, దేవతలును, మునులను చూచి వారందరికీ నమస్కరించి, "అమ్మా! లోకపావనీ! సతీమతల్లీ! నీవు నా గృహమునకు వేంచేసినావా? ఒక్కమాట కబురు చేసిన నేనే నీవద్దకు వచ్చియుందునుగదా!" అని పల్కినది.

అంతట అనసూయమాత సుమతిని చూచి "అమ్మా! నీ వాక్కు ఫలితంగా సూర్యభగవానుని గమనము నిలిచిపోయినదికదా! మరి ఈ విశ్వములోని జీవములన్నీ సూర్యభగవానుని పైనే ఆధారపడియున్నవి. సకల జీవులకు అన్నప్రదాత ఆ భగవానుడు. ఆయనలేక, ఆయన దర్శనము లేక యజ్ఞ యాగాదులు అన్నీ ఆగిపోయినవి. కాలమానము గతితప్పిపోవును గాన నీవు నీ వాక్కును మరలించి జగతికి ప్రాణము పోయుము"అని కోరినది. అంతట



ఆ సుమతి "అమ్మా! ఆ మహర్షి శాపము మీకు తెలియనిది కాదు. నేను అలా కోరితే నా పతిప్రాణములకే ముప్పుగదా?" అని ప్రశ్నింపగా అనసూయమాత సుమతితో "నీ భర్తకు ఏమియు జరగదు. అటుల జరిగితే నేను, ఈ దేవతలు, మునులు చూస్తూ ఊరుకుంటామా? ఏమియు భయములేదు, నిర్భయముగా సూర్యభగవానునికి స్వాగతం పలుకు" అని ఆదేశించెను. అంతట ఆ సుమతి భర్త అనుమతిపొంది "ఓ సూర్యభగవానుడా! నా అవివేకాన్ని మన్నించి నీ గమనమును సాగించి లోకములను రక్షింపుము" అని ప్రార్థించెను. ఆశ్చర్యముగా సూర్యకిరణములతో ప్రకాశవంతముగా ఉషోదయం జరిగినది. వెంటనే సుమతి భర్త కౌశికుడు విలవిలలాడుతూ నేలకొరిగెను. అది చూచి సుమతి స్పృహ కోల్పోయినది.

వెంటనే అనసూయమాత "ఇంతవరకు తపఃశక్తి, పతివ్రతాశక్తి ఒకరితో ఒకరు ప్రభావితములైనారు. ఇప్పుడు పాతివ్రత్యశక్తి వీనికి భరతవాక్యం పలుకుతుంది. ఓ ఆదికూర్మమా! శ్వేతవరాహమా! ప్రకృతి శక్తులారా! దిక్పాలకులారా! త్రిమూర్తులారా! నేను ఇప్పటివరకు గతించిన జీవితంలో చేసిన తపస్సు పతిపూజ సత్యమైతే, ఈ కౌశిక బ్రాహ్మణుడు రోగరహితుడై, సుందర రూపుడై, ధర్మపరుడై వెయ్యి సంవత్సరములు జీవించుగాక!"అని ఆదేశించినది. ఆ తల్లి అమోఘమైన ఆ వాక్కులతో రోగరహితుడై, సుందర రూపముతో ఆ కౌశికుడు బ్రతికి లేచి, సుమతిని మేల్కొలిపి, వారిరువురును అనసూయ మాతకు, దేవతలకు, మహర్షులకు నమస్కరించినారు. ఇది చూసి త్రిమూర్తులు ప్రత్యక్షమై, "అమ్మా! అనసూయమాత! త్రిమూర్తులకు సహితము కష్టమైన కార్యాన్ని సాధించి జగత్తుకు మేలు చేకూర్చినావు. అమ్మా! నీ శక్తి భక్తి మాకు చాలా ఆనందము కలిగించినవి. నీవు ఏదైన వరమును కోరుకొనుము. దానిని నెరవేర్చి సంతుష్టులమయ్యెదము" అని పలుకగా, అనసూయమాత "త్రిమూర్తులారా! నేను నిర్వర్తించినది కేవలం నా కర్తవ్యం. ఇందులో నా ఘనత ఏమియులేదు. జన్మాంతరకారణంతోను, దేవీ లీలావిలాసంలో భాగంగా జరిగినది. నేను నిమిత్తమాత్రురాలిని. అయినా క్రొత్తగా నాకు ఏ వరమూ ఇవ్వనవసరం లేదు. పూర్వము నా పతి కోరిన కోరికను తీర్చండి" అని ప్రార్థించెను. అంత త్రిమూర్తులు "అమ్మా! దానికై సమయము ఆసన్నము కావలెను. మీ కోరిక నెరవేరి తప్పక ఆనందము పొందగలరు" అని దీవించి, సుమతి కౌశికులను ఆశీర్వదించి వెడలిరి. అంత అందరూ తమ తమ

ప్రాంతములకు వెళ్ళిరి. జీవకోటి యధాపూర్వకముగా తమ కార్యములను నిర్వర్తించుచుండెను. ఇట్లు కొంతకాలము గడిచెను.

విద్యాసాగరా! ఒకనాడు త్రిలోక సంచారి. నారాయణ మంత్రోపాసకుడు అయిన నారదమహర్షి త్రిమాతలు లక్ష్మి–సరస్వతి–పార్వతి కలిసియుండగా వారిని చేరి భూలోకములోని వింతలు తెలియజేయుచు లోకోత్తరమైన అత్రి, అనసూయల చర్యలను వివరించి, అనసూయ పతివ్రతామతల్లి మాహాత్మ్యం అద్వితీయము, అమోఘము, ఆనందదాయకము అని కీర్తించినాడు. దానికి ముగ్గురమ్మలు లోకమాతలమైన తమకంటే ఆ అనసూయమాత అంత శక్తివంతురాలా? అని అసూయపడి తమ శక్తులతో ఇనుప శనగలను సృష్టించి, "నారదా! ఆమె అంత శక్తివంతురాలయితే ఈ ఇనుప శనగలను ఉడికించి తినుటకు యోగ్యముగా చేయగలదా?" అని పలికెను.

అందులకు నారదుడు సందేహమెందులకు తల్లీ! ఆమె ఏమైనా చేయగలదు! సుమతి భర్తను బ్రతికించిన, ఉషోదయమును కలిగించిన ఆ ఆనసూయ మాత ఘనతను వివరింపగా, దానికి ఆ తల్లులు "అయితే ఈ శనగలను తీసుకొని వెళ్ళు! ఫలితం తెలుస్తుంది" అనగా, నారద మహర్షి ఆ ఇనుప శనగలను తీసుకొని భూలోకమునకు ప్రయాణమై నారాయణ గానంతో సాగిపోయెను.

అచ్చట నుండి నేరుగా భూలోకములో అత్రి మహాముని ఆశ్రమం చేరి, అనసూయమాతకు ఆ ఇనుప శనగలను యిచ్చి వానిని ఉడికించి యివ్వమని కోరినాడు. అందులకు ఆ మాత – అంతా ఆ పరమేశ్వరి లీలా విలాసం–అని వాటిని తీసుకొని నీరుచేర్చి పొయ్యిమీద పెట్టి పతిదేవుని ప్రార్థించినది. ఆశ్చర్యముగా అవి గుగ్గిళ్ళుగా మారిపోయి తినుటకు యోగ్యమైనవి. అవి నారదునకు యివ్వగా, వానిని అందుకొని నారదుడు అమితానందము పొంది వారిని దీవించి త్రిమాతలకు ఈ విషయం తెలుపుటకై వెడలినాడు. వారు అనసూయ శక్తికి ఆశ్చర్యపోయి, అసూయపడి ఆమెను కఠినమైన పరీక్షకు గురిచేయ సంకల్పించి, తమ పతిదేవులను ప్రార్థించి అనసూయను పరీక్షింపగా పంపినారు. త్రిమూర్తులు ఆ మాతశక్తిని వారికి తెలియజేయుటకై బయలుదేరి, భిక్షకుల వేషములో అత్రి, అనసూయల ఆశ్రమంచేరి, "భిక్షాందేహి, భిక్షాందేహి" అని గట్టిగా పలికి భిక్షకోరిరి. అనసూయమాత వచ్చిన అతిథులను గమనించి,




వారిని సాదరముగా ఆహ్వానించి, అర్ఘ్యపాద్యములనిచ్చి పూజించి, "ఆర్యులారా! నా పతిదేవుడు మధ్యాహ్న స్నాన సంధ్యలకై నదీ తీరమునకు వెళ్ళియున్నారు. వారు రాగానే అందరికీ కలిపి వడ్డించగలను, కొలదిసేపు విశ్రాంతి తీసుకొనండి" అని ప్రార్థించెను.

వారు తమకు కొన్ని కఠినమైన నియమములున్నవని, వాటిని పాటించినవారి ఇంటనే తాము భిక్ష స్వీకరిస్తాము. మీరు ఆ విధముగా చెసెదమనిన మేము మీ భిక్షను అంగీకరించెదము అని పలికిరి. అందులకు ఆ పరమసాధ్వి అతిథులు భగవత్ స్వరూపులు వారిని ఆదరించి సేవించుట, ఆతిథ్యము నొసగుట గృహస్థాశ్రమములోని వారికి పరమైన కార్యముగాన వారి నియమములు పాటించి తృప్తిపరచెదను అని సంకల్పించుకొని, అలాగే అని మాట యిచ్చినది. ఆమె వంటకములను సిద్ధముచేసి భర్తరాకకై ఎదురు చూడసాగెను. కాలము గడచినను ఆమె భర్త రాకుండెను. ఈలోగా ఆ అతిథులు 'అమ్మా! మాకు సమయం మించిపోవుచున్నది' అని గుర్తుచేయగా వారికి మాత్రమే భోజనము పెట్టుటకు విస్తళ్ళువేసి వారిని రమ్మని పిలిచినది. వారు విస్తళ్ళ వద్ద కూర్చుని వడ్డనకు ఉపక్రమించుచున్న ఆమెను చూచి, ఆ అతిథులు "అమ్మా! మీరు మా నియమమును పాటించి వడ్డించవలెను" అని కోరగా, అందుకు ఆ మాత "అయ్యలారా! మీ నియమము ఏమిటో శెలవియ్యండి అలాగే ఒనర్తును" అనిన వారు "అమ్మా! నీవు వివస్త్రవై మాకు భోజనము వడ్డించవలయును. ఇది మా నియమము!" అని పలికిరి. ఆ మాట వినుటతోనే ఆమె ఆశ్చర్యపడి, ఇది ఏమి వింత నియమము. మున్నెన్నడూ ఎక్కడా కూడా వినియుండలేదే! అని నివ్వెరపోయినది. ఆర్తితో ఆహారార్థం వచ్చిన అతిథి దేవతలను ఏమనాలి? ఈ పరీక్ష ఏమిటి? అని ఆలోచించినది. ఆమె మనస్సులో పతిదేవుని ధ్యానించినది. వెంటనే ఆమె మనోఫలకంపై వారు చిన్న బాలులవలె కన్పించారు. ఆమె ఆ దృశ్యమును చూచి, తన పతిని ప్రార్థించి వారిని శిశువులుగా మార్చుమని కోరింది. ఆమె మనస్సులో సంకల్పించినంతనే వారు అపుడే జన్మించిన శిశువులుగా మారిపోయినారు. ఆ ముద్దులొలికే బాలురను చూచిన వెంటనే ఆమె మదిలో అమితమైన వాత్సల్యం కలిగినది. ఆమె పాలిండ్లు పాలతో నిండినాయి. అదిగని ఆమె వివస్త్రయై వారి నియమమును పాటించి పాలతో ఆతిథ్యం యిచ్చినది. వారు సంతోషముతో కేరింతలు కొట్టినారు.




ఆమె పరశవముతో ఆ ముగ్గురికి ఉయ్యాలలను కట్టి, అందులో పడుకోబెట్టి జోలపాడి నిద్రపుచ్చినది.

ఇంతలో నదికి వెళ్ళిన అత్రిమహర్షి ఆశ్రమంచేరి అనసూయమాత ద్వారా విషయం తెలుసుకుని ఇటువంటి కఠోర నియమము కలిగిన వీరు ఎవరాయని తన యోగదృష్టితో చూచినాడు. అతనికి వారిలో బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు కనిపించినారు. ఆ త్రిమూర్తులు అనసూయను పరీక్షింపవచ్చి పసిబాలలైనారు అని సంతసించినారు. ఆశ్రమములోని వారందరు, మునులు, మునిపత్నులు మొదలైనవారంతా ఈ విషయం తెలిసి ఆనందించి వారిని దర్శించసాగినారు. అత్రి, అనసూయలకు ఆ చిన్నారుల ఆటలతోను, వారిని ఆడించడంలోను ఆనందము కలిగినది. అది వారి నిత్యకృత్యమైనది. కాలము గడచిపోసాగినది. ఆ ఆశ్రమవాసుల ఆనందమునకు మితిలేకుండా పోయినది. ఆ సృష్టి, స్థితి, లయకారులతో అందరికీ ఆటలే.

ఇట్లు కొంతకాలము గడచిపోగా, త్రిమాతలు అనసూయను పరీక్షింప వెళ్ళిన పతుల జాడ తెలియక, వారి రాకకై నిరీక్షించి నారదుని వలన జరిగిన విషయమంతయు తెలుసుకుని తమ ఈర్ష్యను, అసూయను వదలి అనసూయ మహాత్మ్యమును తెలుసుకుని విచారముతో అనసూయమాత ఆశ్రమం చేరినారు. అలా విచ్చేసిన జగన్మాతలను చూచి అత్రి, అనసూయలు సంతోషముతో అర్ఘ్యపాద్యములిచ్చి పూజించినారు. దీనవదనంతో వారు తమ రాకకు కారణము తెలిపి, ఆ పసిపాపలు త్రిమూర్తులు అని, తమను అనుగ్రహించి పతిభిక్ష పెట్టమని అనసూయ మాతను ప్రార్థించినారు. అందులకు ఆమె ఆశ్చర్యపడి "ఏమి? వారు త్రిమూర్తులా?" పతివైపు చూడగానే ఆయన చిరునవ్వునవ్వి అవును, వారు త్రిమూర్తులే అని కార్యార్థమై వచ్చినారని అన్నారు. ఆమె గ్రహించితినని మందహాసము చేసెను.

ఆశ్రమవాసులందరూ త్రిమూర్తులనే బాలలుగా మార్చివేసిన ఆ కథ తెలిసి అమితమైన ఆనందముతో అనసూయమాత మహాత్మ్యమును కీర్తించినారు. అనసూయ ముగ్గురమ్మలను చేరి "తల్లులారా! మీకు బాధ కలిగించినానా? వీరు మునికుమారులని, భిక్షకై వచ్చిన అతిథులని అనుకొనినాను. త్రిమూర్తులే నాకు బిడ్డలైనారా?" అని వారిని వెంటనిడుకొని పసిబాలలను చేరి, పతిదేవుని ప్రార్థించి, వారి అనుమతితో తన హస్తమును ఆ బాలుర శిరమున ఉంచగా వారు యథారూపమును పొందినారు. ముగ్గురమ్మలు తమ భర్తలను చేరి



ఆనందించినారు. త్రిమూర్తులు అత్రి, అనసూయలను, వారి ధార్మిక జీవిత విధానమును, తపశ్శక్తిని, అనసూయమాత పాతివ్రత్య శక్తిని ప్రశంసించి ఏదైన వరము కోరుకొమ్మనగా వారు “అయ్యలారా! పసిపాపలై కొంతకాలము తల్లిగా, తండ్రిగా మమ్ము అలరించినారు. అదే వరమును ప్రసాదించండి” అని కోరగా ‘తథాస్తు’ అని దీవించి తమ లోకాలకు వెడలిపోయినారు.

ఆశ్రమంలో ఆ దంపతులు నిరంతరము తమ ధ్యానాది కార్యక్రమములు నిర్వర్తించుచుండగా, ఒకనాడు మహర్షి అనసూయమాతను చూచి మనస్సులో ప్రేరణ కలుగగా, “అనసూయా! నేడు శుభదినము, మనము యోగముద్వారా దత్త జననమునకు నాంది పలుకుదము రమ్ము! నీవుకూడా యోగనిష్ఠలో కూర్చొని ఆ దివ్యమూర్తిని స్మరించు” అని పలికి ఇరువురు యోగనిష్ఠలో నిమగ్నులైనారు. కొంత సమయమునకు అత్రి శరీరములో మూడు దివ్యమైన శక్తులు ప్రవేశించినవి. అవి ఏకమై తిరిగి అనసూయ గర్భమున చేరినవి. ఆ దివ్యశక్తి ప్రభావంచేత తొమ్మిది రోజులలో అనసూయ దత్తాదులకు తల్లి అయినది.

అత్రి నేత్రములనుండి కొంత శక్తి బయటపడి దిక్–మాతల సంరక్షణలో వాయుదేవుని సహకారంతో అభివృద్ధి చెంది బ్రహ్మ అంశతో చంద్రుడు (సోముడు) అవతరించినాడు. రుద్రాంశతో దుర్వాసుడు అవతరించినాడు. వారిలో దత్తుడు పూర్ణస్వరూపుడైన గురువు కాగా, ఉన్నతమైన తత్త్వంతో దుర్వాసుడు తన కోప స్వభావంతో జగత్తుకు మేలు చేసేవాడు. చంద్రుడు ఓషధులకు, వనమూలికలకు, సర్వలోకాలకు తన చల్లని కిరణములతో ఆహ్లాదం కలిగించినాడు.

ఇలా ముగ్గురు మూర్తుల అంశలతో ముగ్గురు పుత్రులు కలిగిరి. చంద్రుడు, దుర్వాసుడు తమ అంశలను దత్తునకిచ్చి వారు తమ లోకాలకు వెళ్ళిపోయినారు. దత్తాత్రేయస్వామి లోకకళ్యాణం కోసం వంద (100) సంవత్సరములు పెద్ద కొలనులో వుండి తపస్సుచేసి యోగలక్ష్మిని, అనఘాదేవిని పొంది తన అవతార కార్యమును నిర్వర్తించుటకు సహ్యాద్రి పర్వతములకు చేరి ఆశ్రమము ఏర్పాటు చేసికొనినారు. మహర్షిలోకం, దేవతలు వారిని నిత్యం దర్శించుకొందురు. దేవేంద్రునికి సహాయంచేసి జంభాసురుడను రాక్షసుని సంహారం చేసినారు. కార్తవీర్యార్జునికి దివ్యశక్తిని ప్రసాదించి, అనేక యోగరహస్యములను తెలిపినారు. అణిమాద్యష్ట సిద్ధులు ప్రదానం చేసినారు. అలర్కునకు యోగవిద్యను ప్రసాదించినారు. సాంకృతి అను మౌనికి అష్టాంగ

యోగవిద్యను ప్రసాదించినారు. దలాదనుడు అను మునికి దత్త కవచం యిచ్చినారు. భార్గవరామునికి శ్రీవిద్యను త్రిపుర రహస్యము అనే పేరున ప్రబోధించినారు. ఇలా దత్తాత్రేయస్వామి శ్రీవిద్య, యోగవిద్య, రాజయోగవిద్య లన్నింటికీ మూలమైనారు. అవధూతగా, దిగంబరునిగా చిత్రవిచిత్రమైన రూపములతో తిరుగుచు గురుభక్తులను పరీక్షించి వారిని పవిత్రులను చేయుచు గురుశిష్య సాంప్రదాయమునకు మూలమై జగద్గురువులైనారు.

వారి అనుగ్రహం పొందిన గురువులు సద్గురువులైనారు. ఆ మహాత్ముడు అన్ని యుగములలోను అనేక అవతారములను ధరించుచూ ధర్మ ప్రబోధం కావించుచున్నారు. అటువంటి అవతారాలలో ఈ కలియుగంలో మొదటిది శ్రీపాద శ్రీవల్లభులు, రెండవ అవతారం శ్రీ నరసింహ సరస్వతిగాను, మూడవ అవతారం శ్రీ మార్తాండ మాణిక్య ప్రభువుగాను, నాల్గవ అవతారంగా శ్రీ స్వామి సమర్థులు, అయిదవ అవతారంగా శ్రీ షిరిడి సాయిబాబా మరియు వారి అంశావతారములు అనేక మంది అవధూతల రూపంలో ఈ యుగంలో కొనసాగుతూనే యున్నవి.

ఈనాటి సమాజంలోగల కుల, జాతి, మత ద్వేషములను నిర్మూలించే నిమిత్తం ఈ అవతారులలో స్వామి సమర్థుల నుండి ప్రబోధించిన తత్త్వం సకల మానవాళి ఒకే జాతి అని, అందరినీ ప్రేమించుట ధర్మమని, సర్వజీవులయందు దయ కలిగి వుండాలని, శాంతము, ఓర్పు, శ్రద్ధ, మొదలగు గుణములను అలవరచుకోవాలనేది వారి ఆదర్శం.

శ్రీ దత్తాత్రేయస్వామి జ్ఞానయోగనిధి, విశ్వగురువు, భక్తవత్సలుడు, సర్వసాక్షి, యోగిజనప్రియుడు, సిద్ధగణ సేవితుడు, వేద సంరక్షకుడు, వేదమూర్తి, వారి స్మరణ, ధ్యానం మానవాళికి శాశ్వత పరమ పదములను కలుగజేయగలదు.

***ఓం శ్రీ గురుదేవదత్త - అవధూత చింతనం***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

**ఆరవ అధ్యాయము** సంపూర్ణము





ఓం శ్రీ సాయిరాం
ఓం గురుదేవదత్త - అవధూత చింతనం

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఏడవ అధ్యాయము

### శ్రీ దత్తాత్రేయస్వామి లీలలు

“విద్యాసాగరా! త్రిమూర్తి స్వరూడు, అద్భుత మహిమాన్వితుడైన శ్రీ దత్తాత్రేయస్వామివారిని దర్శించడం, వారి అనుగ్రహం పొందడం - ఎంతో కఠినమైన కార్యము. శ్రద్ధ, భక్తి, విశ్వాసము లేనివారికి అది దుర్లభము, అనితరసాధ్యము. ఎంతో భక్తి కలిగి కూడా స్వామివారి తత్త్వమును అవగతం చేసుకోలేనివారు వారిని పొందలేరు. స్వామి ఎంత సులభుడో, అంత కఠినుడు. వారు శిష్యులను, భక్తులను అనేక విధముల పరీక్షించినగాని వారిని అనుగ్రహించరు. ఒక్కసారి వారి అనుగ్రహం కలిగితేచాలు అణిమాద్యష్ట సిద్ధులు వశమగుతాయి. ముక్తికాంత తప్పక వరించగలదు. అట్టి శిష్యులు - భక్తులు తప్పక ముక్త సంగులై సంచరించగలరు, అంతేకాదు, శ్రీ స్వామివారి పూర్ణ అవతారములు, అంశ, ఉప అవతారములైన అనేకమంది సద్గురువులు కూడా శిష్యులను పరీక్షకు గురిచేయుదురు. కడవరకు నిలిచిన వానినే శీఘ్రముగా అనుగ్రహించగలరు అని నిత్యానందుడు పలుకగా, విని విద్యాసాగరుడు “గురుదేవా! ఇంత విలక్షణమైన తత్త్వముతో నిండియుండు స్వామివారిని సేవించి వారి పరీక్షలకు నిలచి వారి అనుగ్రహము పొందినవారు ఎవరు? అలాంటి వారి కథను తెలిపి శ్రీ దత్తస్వామి లీలలను అనుగ్రహించండి” అని ప్రార్థింప నిత్యానందుడు “వత్సా! చాలా సంతోషము. నీవు అడిగితే గుర్తుకు వచ్చుచున్నది. మానవ లోకమునకు శ్రీ దత్తస్వామి మంత్రమును అనుష్ఠానమును అనుగ్రహించిన శ్రీ విష్ణుదత్తుని కథలను తెలుపుతాను వినుము. పూర్వము ఈ కథను ఇంద్రునకు బృహస్పతి తెలిపినారు. దానిని వివరింతును!”




పూర్వము సహ్యాద్రి సమీపంలో మాతాపురం అనే గ్రామం కలదు. అందు విష్ణుదత్తుడు, సుశీలయను బ్రాహ్మణ దంపతులు నివసించుచుండిరి. విష్ణుదత్తుడు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడు. వేదవేత్త. అపారమైన జ్ఞానమును సముపార్జించి, ధార్మికచారణలో వుండేవారు. వారి ఆరాధ్యదైవము శ్రీ దత్తాత్రేయ స్వామి. అతని భార్య సుశీలమ్మ పరమ పతివ్రత. నిరంతరము పతిసేవలో నిమగ్నమై వుండేది. వారు అతిథి, అభ్యాగతులను సేవించుచూ నిరంతరము హోమ అర్చనాదులతో భగవంతుడిని సేవించుచుండెడివారు. గ్రామంలోని జనులు ఉత్తమమైన బ్రాహ్మణ జంటగా వీరిని గుర్తించి, వారికి కావలసిన ధాన్యములను దానములుగా యిచ్చేవారు. అంతేకాని వారి ఇతర కార్యక్రమాలతో గ్రామస్థులకు సంబంధము వుండేదికాదు. గ్రామస్థులు యిచ్చినదే పరమా నందముగా స్వీకరించుట బ్రాహ్మణ ధర్మంగా భావించి గ్రామస్థుల క్షేమంకోసం, వారి పాడిపంటల అభివృద్ధి కోసం విష్ణుదత్తుడు జపతపములను చేయువారు. గ్రామస్థులు వారి దీవెనలకై ఎప్పుడూ ఎదురు చూచేవారు. నూతన కార్యములను – నూతన గృహములను ప్రారంభించుచున్నప్పుడు వారి సలహాను అనుసరించి ముహూర్త బలమును చూపించుకొని చేసేవారు. నూతన పంట ప్రారంభమునకు, వానిని పొందు సమయంలోను వీరి సలహాలు వారికి శిరోధార్యము. ఈ విధముగా ఆదర్శదంపతులుగా వీరు జీవించుచుండిరి.

ప్రతినిత్యం విష్ణుదత్తుడు దేవతార్చన–హోమము వెలిగించి ధూప నైవేద్యములు సమర్పించి–బయట ఒక రావిచెట్టు క్రింద అరుగుపైన వైశ్వ దేవమును భూతబలిగా సర్వజీవులకొరకు కొంత ఆహారం పెట్టేవారు. నిరంతరము గాయత్రి మంత్ర సాధకుడు, దత్తోపాసకుడు అయిన విష్ణుదత్తుని ప్రభావం వలన భూత ప్రేతములు కూడ దరిచేరేవికావు. అయినా మహాపాపమువలన బ్రహ్మరాక్షసుడిగా మారిన ఒకడు వారి ఇంటిదగ్గర వున్న రావిచెట్టుమీద నివాసంగా వుంటూ సమీప అరణ్యములో ఆహారమును తినుచు వుండేవాడు. వాడు అనేక జన్మలలో చేసిన కొద్ది పుణ్యం వలన విష్ణుదత్తునిచే సమర్పింపబడిన వైశ్వ దేవమును తినాలి అనిపించి ప్రతిదినము తినసాగినాడు. క్రమంగా దాని శక్తిచేత, ఆహార శుద్ధిచేత వానిలో క్రూరత్వం నశించి సాధు గుణము పొడచూపినది. దానితో తాను ఇతరులను పట్టి పీడించి, వేధించుట మహాపాపమని అనిపించసాగినది. ఇటువంటి ఆలోచనలు తనవంటి



బ్రహ్మరాక్షసునికి రావడం వాడికి చాలా ఆశ్చర్యమనిపించినది. క్రమంగా వాడు అన్ని హింసలను మానివేశాడు. సాత్వికబుద్ధి పెరిగినది. దానితో వానికి ఎంతోకాలముగా వున్న భయంకరమైన ఆకలి, అశాంతి నశించినవి. దీనికి అంతకు కారణము తాను భుజించుచున్న వైశ్వదేవమని, దాని నొసంగు విష్ణుదత్తుని శక్తి అని గ్రహించినాడు. సత్వబుద్ధి కలిగినదికదా! వాడికి కృతజ్ఞతాభావం పెరిగినది. విష్ణుదత్తునిపై భక్తి కలిగినది. తనకు ఇంత ఆనందము కలిగించిన వారికి ప్రత్యుపకారముచేసి రుణవిముక్తి పొందాలనే ఆలోచన కలిగినది.

ఒకనాడు ఆ రాక్షసుడు ధైర్యంతో వైశ్వదేవ బలిపెట్టుచున్న విష్ణుదత్తుని ఎదుట నిజరూపంతో కనిపించి “ఆర్యా!” అని పిలిచినాడు. వైశ్వదేవము పెట్టి వెనుదిరిగిన విష్ణుదత్తునికి ఆ పిలుపు వినిపించి “ఎవరు?” అనుచు వెనుకకు తిరిగినారు. అత్యంత సమీపంలో భయంకరమైన రాక్షస స్వరూపాన్ని చూచి తత్తరపడినారు. అయినా నిరంతరము సర్వజీవులు పరమాత్మ స్వరూపమే అని భావించు ముక్త సంగుడు, తత్త్వవేత్త అగుటచే వానిని పరిశీలనముగా చూచి “ఓయీ! నీవు ఎవరవు? నాతో నీకు ఏమి పని?”అని నిదానముగా అడిగినారు. అందులకు ఆ రాక్షసుడు “స్వామీ మీ దయవలన నేను చాలాకాలము నుండి పొందు అశాంతిని, ఆకలిని పోగొట్టుకొన్నాను. అంతేకాదు మీరు ఇచ్చట పెట్టిన భూతబలి అయిన వైశ్వదేవమును తిన్నందున నాలోని రాక్షసగుణములు హరించిపోయినవి. ధర్మము–అధర్మము–సత్యము, అసత్యములకు గల భేదము తెలిసినది. ఆ కారణమున జీవహింస మాని కేవలం మీ దర్శనం చేసుకొంటూ, మీ ప్రసాదమును తిని జీవించుచున్నాను. నాకు ఇంత మేలుగావించిన మీకు ఏదైనా మేలు చేయాలని నా మనస్సునకు తోచినది. ఇది ధర్మము అని కృతజ్ఞతతో సరియైన ప్రత్యుపకారము చేయదలచినాను. నేను అట్లు చేయనిచో రుణము పొందినవాడనగుదును. నాకు ఇంత చేసిన మీరు రుణ విముక్తి కలిగించండి” అని ప్రార్థించి వారి పాదములకు సాష్టాంగ వందనములను ఆచరించినాడు.

విష్ణుదత్తుడు వాని ఆకారమునకు, వాని సంభాషణమునకు గల తేడాను గమనించినారు. వాడి ధర్మబుద్ధికి ఆశ్చర్యపడినారు. ఆనందముతో “ఓయీ! సర్వేశ్వరుని అనుగ్రహంతో నీకు ఈనాటికి రాక్షసబుద్ధిపోయినది. ధర్మబుద్ధి అలవడినది. అందులకు చాలా సంతోషము. నీవు ఇలాగే జీవించుచు ఆ

దేవదేవుని చింతించుచు గడుపు. ఆ ఆకారము కూడా పోయి మంచివానిగా మారగలవు. అందుకు సద్గురుమూర్తి నిన్ను అనుగ్రహించుగాక! నేను నా ధర్మము ప్రకారము సర్వభూతముల కొరకు భూతబలిని పెట్టినాను. అందు నీకు సహజముగా హక్కు కలదు. ఏలననిన సర్వభూతములలో నీవు ఒక్కడవు కనుక. ఇందులో నీకొరకు ప్రత్యేకముగా చేసినది ఏమీలేదు. అందువలన నీవు ఋణగ్రస్తుడవు కాలేదు. కనుక నీవు నిశ్చింతగా నీ తావునకు బోయి సద్గతిని పొందుటకై, సద్గురువును స్మరింపుము, అని దీవించెను.

అంత ఆ రాక్షసుడు "మహాత్మా! తాము అలా ఆదేశింపవలదు. తప్పక ఏదైనా సహాయం నానుంచి స్వీకరించండి. మీకు ఏదైనా కోరిక కలదేని నాతో చెప్పండి. క్షణంలో దానిని నెరవేర్చి ఋణవిముక్తుడను కాగలను. నాపై దయతో అంగీకరించండి" అని చేతులు జోడించి అతి దీనముగా ప్రార్థించెను. అందులకు విష్ణుదత్తుడు ఎంత ఆలోచించినా అతనికి ఏ కోరిక తోచలేదు. ఆ రాక్షసుడేమో వారిని వదలలేదు. తుదకు తన భార్యను పిలచి ఆ వృత్తాంతము అంతా తెలిపి సలహా కోరగా ఆమెకు కూడా ఏ కోరిక తోచలేదు. ఆలోచించగా, ఆలోచించగా ఆమెకు తన భర్త అనేక సంవత్సరముల నుండి శ్రీదత్త దర్శనము చేయాలని తలంచుచుండుట గుర్తుకు వచ్చినది. ఆమె తన భర్తతో "ఏమండీ మీరు ఎప్పటినుండో శ్రీగురు దత్తాత్రేయ స్వామిని దర్శించాలనుకొన్నారుగదా! ఇతను బ్రహ్మరాక్షసుడు కనుక అనేకమైన దివ్యశక్తులు వుంటాయికదా! ఇతను ఎట్లైనా శ్రీ స్వామివారి దర్శనము కలిగించగలడేమో అడిగి తెలుసుకోమని ఆ కార్యమును నిర్వర్తించమని అడగండి" అని తెలిపినది. ఆమె తెలుపగా అతనికి కూడా అది అత్యంత ఉచితమైనదిగా తోచి ఆ రాక్షసునితో "ఓయీ! నీకు అంత సహాయం చేయాలని వుంటే పరమ పురుషుడు, పరంధాముడు అయిన జగత్‌గురు శ్రీదత్తస్వామిని చూపించు"అనగానే వాడు ఎగిరి వెనక్కి గంతేశాడు! "అమ్మ బాబోయ్!"అని కేకపెట్టి దూరంగాపోయి కొంత సమయం తరువాత వారివద్దకు తిరిగివచ్చి "ఆర్యా! నీవు చెప్పిన పేరు వింటే నాకేకాదు మహా భూత, ప్రేత, పిశాచాది గణములకు కూడా భయమే. ఆ పేరు, ఆ రూపం ఉన్న పరిసరములలో మేము వుండజాలము. ఎంత కఠినమైన పరీక్ష పెట్టినావయ్యా?" అన్నాడు. విష్ణుదత్తుడు "నీవు అతి మానుషమైన శక్తిగలవాడవుకదా అని, మీకు అసాధ్యమైన పని వుండదని అడిగినాను. పోనీ ఫరవాలేదు–నాకు ప్రాప్తం లేదు అనుకొంటాను.



నీవు ఏమీ కొరత పెట్టుకోవద్దు. నీవు నాకు సహాయం చేసినట్లే భావించెదను కంగారుపడకుము”అని విష్ణుదత్తుడనెను.

ఆ రాక్షసుడు “ఎంతమాట! అయినా ఏమిచేస్తాము? అడుగక అడుగక ఏదో ఒకటి కోరినావు. నీ కోరిక తీర్చి నేను విముక్తుడను అవుతాను. అయితే ఒక్కమాట ఆయన పెద్ద యోగి. అంతకంటే మహామాయాస్వరూపి. ఎప్పుడు చూచినా నమ్మటానికి వీల్లేని వేషాలతో దర్శించరాని ప్రదేశాలలో తిరుగుతూ వుంటాడు. ఈ ప్రాంతములలో వచ్చినప్పుడు నేను వెదికి నిన్ను తీసుకొని వెళ్ళి దూరంనుండి చూపుతాను. ఆయన అనుగ్రహం పొందడము నీ కర్తవ్యము. కేవలం మూడుసార్లు మాత్రమే చూపించుతాను. ఆపైన ఆ స్వామి దయ, నీ అదృష్టం!”అని అంతర్ధానమైనాడు.

ఇలా ఉండగా ఒకనాడు హడావుడిగా పరుగెత్తుకొనివచ్చి “స్వామీ! విష్ణుదత్తా! రావయ్యా! రా! నీవు కోరిన స్వామి ఈ పరిసరాలలోనే వున్నాడు. తొందరగా రా!” అని పిలిచినారు. విష్ణుదత్తుడు బయలుదేరగా వెనకనుండి అతని భార్య “ఏమండీ- కమండలము తీసుకొని వెళ్ళండి” అని కేకపెట్టినది. విష్ణుదత్తుడు “వెనుకకు పిలిచావా?” అనగానే “మీరు వెనుకకు రాకండి, నేను వచ్చుచున్నాను” అని ఆమె అతనికి దగ్గరగా వచ్చి కమండలమును అందించినది. దానిని అందుకొని విష్ణుదత్తుడు ఆ రాక్షసుని వెంట వెళ్ళినాడు. ఆ రాక్షసుడు వారిని మాంసము విక్రయించు ప్రదేశమునకు తీసుకొని పోయినాడు. సదాచార సంపూర్ణుడు, బ్రాహ్మణుడు అయిన విష్ణుదత్తుడు ఆ ప్రదేశమును, అక్కడి వాతావరణమును చూచి ఆశ్చర్యపడినారు. అతను అటువంటి ప్రదేశమును ఎన్నడూ చూచి ఎరగడు. అతను ఆశ్చర్యము నుంచి తేరుకొనక మునుపే ఆ రాక్షసుడు “బ్రాహ్మణోత్తమా! అదిగో అటుచూడు, ఆ కనిపించు పిచ్చివాడే నీవు కోరిన స్వామివారు” అన్నాడు. అటు చూసిన విష్ణు దత్తునకు అక్కడ ఒక పిచ్చివాడు కనపడినాడు. వాడు అక్కడ మాంసము విక్రయించు వారినుంచి మాంసము ముక్కలను అడుక్కొని తింటున్నాడు. ఆకారం వికారంగా వుంది. చింపిరి తలతో మాసిపోయిన అంగవస్త్రము, మెడలో విచిత్రమైన పూసల మాలలు, చేతిలో ఈతబెత్తము, ముఖం మహా భయంకరంగా ఉన్నది. కళ్ళు గుండ్రముగా బైటికి గ్రుడ్లు నెట్టుకొచ్చినట్టు వున్నాయి. తెగ తాగినట్లు వున్నాడు. ఒంటిమీదంతా కల్లు నురుగు కారుతోంది. తూలుతూ, పడుతూ, లేస్తూ

కనబడుచున్నాడు. అతను కదిలినప్పుడల్లా ఈగలు గుయ్‌మంటూ ఎగిరిపడుతున్నాయి. ఆ నిప్పులు క్రక్కుతున్నట్టు వున్న నేత్రాలతో అతను అటు ఇటు చూస్తూ వుంటే ఎవరికైనా మూడిందేమో వాని చేతిలో అనిపించుచున్నది. అలా వున్న వానిని చూసిన విష్ణుదత్తుడు అక్కడే ఆశ్చర్యముతోను, అసహ్యంతోను, భయంతోను నిలబడి పోయినాడు. ఆ రాక్షసుడు "ఏమయ్యా నిలబడిపోయినావు! కదలవయ్యా! భయపడకు! వారే నీవు కోరిన స్వామి. పోయి కాళ్ళు పట్టుకో, వదలబోకు, అదిగో ఇటు వస్తున్నాడు జాగ్రత్త!"అని దూరంగా పోయినాడు.

ఆ బ్రాహ్మణోత్తమునికి ఆ ప్రాంతములోని దుర్గంధం భరించడం కష్టంగా వున్నది. రాక్షసుడు చూపిన ఆకారంలో వానికి ఏమీ విశేషం కనబడలేదు. అంత దరిద్రంగా, అనాచారిగా వున్న వానిని శ్రీ దత్తాత్రేయస్వామి అని అంటాడేమి? జన్మంతా పవిత్రంగా గడిపి చివరకు ఈ రాక్షసుని సహవాసం వలన ఇలాంటి చోటును చూడడమే కాకుండా కాలుకూడా పెట్టవలసి వచ్చింది. అత్రీ అనసూయలకు జన్మించిన స్వామిని ఈ అనాచారియే అని అంటాడేమి? ఇది రాక్షసబుద్ధి కాదుకదా! ఎంత అవధూత అయినా ఇంత ఘోరంగా వుంటాడా? ఎలా నమ్మటం! ఈ రాక్షసుడు కూడా నమ్మకస్తునిలాగా వున్నాడు. నన్ను మోసంచేస్తే వానికి ఏమి వస్తుంది? వాడు నిజమని చెప్పుచున్నాడేమి? అయినా బ్రాహ్మణుడిని, సదాచార పరుడను, ఈ ప్రాంతములో వుండటము మరియు అనాచారి కాళ్ళు పట్టుకోవడమా? ఎవరైనా చూస్తే ఏమనుకుంటారు? ఇప్పుడు ఏమి చెయ్యాలి అని అనుకొనుచుండగానే ఆ విచిత్రమైన ఆకారం వారి ముందుకు వచ్చినది.

***మాయరా! మటుమాయరా! ఉన్నదంతా***
***మాయరా! మత్తులో మునిగి వున్నంతవరకు***
***అంతా మాయరా! మత్తు వదిలితేకాని పట్టు***
***దొరకదు – పట్టు దొరికితేనే పండుగరా!***

అని పదము పాడుకుంటూ విష్ణుదత్తునివద్దకు వచ్చి వాని చుట్టూ ఈతబెత్తము తీసుకొని నేలపై గట్టిగా కొడుతూ –

***నడయాడు వానిని నమ్మరా – నమ్మితేనే ఫలమురా***

అని అలా ముందుకుపోయి కనుమరుగైనాడు, విష్ణుదత్తుడు తేరుకొని ఏడీ! ఎటుపోయినాడు! అని ఇటు అటు చూచుచుండగనే ఆ రాక్షసుడు వచ్చి



“ఏమయ్యా స్వామీ! నేను ఎంత చెప్పినా వినలేదే, ఆ స్వామి మహా మాయగాడు – ఆయన అంత దగ్గరగా వస్తే పట్టుకోలేకపోయితివే! అలా చేశావు ఏమయ్యా! నన్ను నమ్మవయ్యా! నేను నీకు ఉపకారం చేస్తానుగాని, అపకారం చెయ్యనయ్యా!”అని సరే ఏమిచేస్తాము అయినదేదో అయినది మరియొకసారి చూస్తాములే పద”అని తిరిగి వచ్చినారు.

ఇంటికి వచ్చిన విష్ణుదత్తునికి మరీమరీ స్వామిరూపం గుర్తుకు రాసాగినది. తనలో తాను ‘అవును నిజమే! వారు నిశ్చయముగా స్వామివారే, నా బుద్ధియే వక్రించినది. నేను చేసినది తప్పు. స్వయంగా ధర్మాధర్మాలకు శాసకుడు స్వామి. వేదాలాయన నిట్టూర్పులే. లోకాలయన క్రీడా వస్తువులు. ఆచారములు, అనాచారములు అన్నీ ఆయన కల్పితాలే. స్వామి పెట్టిన పరీక్షలో నేను నిలబడలేకపోయినాను’ అని మనస్సులో మధనపడసాగినాడు.

ఇలా వుండగా ఒకరోజు రాత్రి సమయంలో బాగా ప్రొద్దుపోయిన తరువాత నిద్రకు ఉపక్రమించుచుండగా ఆ రాక్షసుడు వచ్చి “రావయ్యా స్వామీ, రా! స్వామివారు దగ్గరలోనే తిరుగుచున్నారు” అని పిలవగానే శ్రీ విష్ణుదత్తుడు ఆనందముతో తొలి అనుభవము నెమరువేసుకొనుచూ బయలుదేరినాడు. ఇంతలో సుశీలమ్మ “ఏమండీ కమండలం!”అని పిలిచినది. అక్కడ నిలబడి “తిరిగి వెనక్కు పిలిచావా?”అని ఆమె అందించిన కమండలము తీసుకొని గబ గబ ఆ రాక్షసుని వెంట వెళ్ళినాడు. వారిరువురు నడచి నడచి ఒక శ్మశానంలో చేరినారు.

అక్కడ ఒక కాటికాపరి వున్నాడు. అతి స్థూలము, దానికి తగ్గ ఎత్తు, నల్లగా వున్నాడు. చింపిరి శిఖతో, చేతిలో పెద్ద ఎముక, మెడలో అస్థి భూషణములు ధరించి, చుట్టూ కుక్కలు, చెవులకు ప్రేగులు పోగులు, ఒడలంతా ఎర్రటి రక్తపు చారలు, నోటిలో నుంచి సొల్లు కారుచున్నది. చూడటానికి అతి భయంకరంగా నున్నాడు. పెద్దపెద్ద కేకలు పెడుతున్నాడు. సగం కాలీ కాలని శవాల నుండి మాంసము పీకి కుక్కలకు వేయుచున్నాడు. కొన్ని శవాలపై చేతిలోని ఎముకతో కొట్టుచూ తిట్టుచున్నాడు. రాక్షసుడు విష్ణుదత్తునికి అతనిని చూపించి “ఈసారయినా పట్టుకో జాగ్రత్త!”అని దూరంగా పోయినాడు. ఈ బ్రాహ్మణుడు మొదటినుంచి బుద్ధిని జాగ్రత్త పరచుకొనుచునే వచ్చినాడు. ఆ ఆకారం చూచి భయం కలిగినా నిగ్రహించుకొన్న బుద్ధితో ధైర్యంగా దగ్గరకుపోయి

"స్వామీ! దత్తాత్రేయా పాహిమాం! పాహిమాం!"అంటూ సాష్టాంగ నమస్కారములు చేసినాడు.

ఆ కాటికాపరి వీనిని చూచి బిగ్గరగా అరచుచూ గట్టిగా చేతిలోని ఎముకతో కొట్టినాడు. ఈ బ్రాహ్మణునికి ప్రాణం దిమ్మెరపోయింది. ఇంతలో కుక్కలు 'భౌ, భౌ'మని అరచుకొనుచు వచ్చి చుట్టూ మూగినాయి. కుక్కల అరుపులు, ఆ కాటికాపరి కేకలకు, మనస్సులో నిగ్రహం సడలిపోయింది. భయంతో ఆ ప్రదేశం నుంచి అతి వేగంగా, శక్తినంతా కూడదీసుకొని ఇంటివైపు పరుగెత్తినాడు. వెళ్ళుచున్న వానిని చూచి ఆ భయంకర ఆకారం చిరునవ్వు నవ్వి దీవించినది.

అతి కష్టంమీద ఇంటికి చేరిన బ్రాహ్మణునికి శరీరం అదురుతున్నది. చెమటలు కారిపోవుచున్నవి. నోటివెంట నురుగు రాసాగినది. ప్రాణము పోతుందో ఏమో అన్నంత బాధ కలుగసాగినది. ఇంటి వాకిట్లోనే అరుగుపై కూలబడిపోయినాడు. సుశీలమ్మ ఇంటిలో నుండి ఆందోళనగా పరిగెడుతూ వచ్చి అలా వున్న భర్తను చూచి శైత్యోపచారాలను చేయసాగినది. ఇంతలో ఆ రాక్షసుడు వచ్చి ఆ స్థితిలో వున్న బ్రాహ్మణుని చూచి జాలిపడి, "అయ్యయ్యో! చాలా అలసిపోయినావే! పరుగిడకుండా అక్కడే స్వామిని ప్రార్థించకూడదా, ఈ బాధ తప్పేది. నీవు శాస్త్రములను చదువుకున్నావు గదా! ఆ స్వామిని గురించి, వారు చేయు మాయలను గురించి, వారు భక్తులకు పెట్టే చిత్ర విచిత్రమైన పరీక్షల గురించి, చదువుకోలేదా? అవి ఏమీ నీకు గుర్తుకు రాలేదా? నీవు ఉన్నత విద్యావంతుడివి అనుకొనినాను. నీవు కూడా సామాన్య మానవునిలాగా స్వామి తత్త్వాన్ని అర్థం చేసుకోలేదే! నిర్మలుడు, నిత్య సత్యస్వరూపుడు అయిన స్వామి నీకు అచ్చట గోచరించలేదా? ఆ బాహ్యామైన రూపము, ఆ వాతావరణము మాత్రమే కనిపించినదా? పోనీలే స్వస్థత చెందు, మరి ఒకసారి చూడగలవు. ఆ యవకాశమును పోగొట్టుకొనకుము"అని అదృశ్యుడైనాడు.

రాక్షసుని మాటలను విని వానిలోని మర్మమును గుర్తించి విష్ణుదత్తుడు సిగ్గుపడినాడు. తన అపరాధము తెలుసుకొని మరింత బాధపడసాగినాడు. సుశీలమ్మ చాలా బాధపడి "అయ్యో! లేనిపోని సలహాను చెప్పాను. ఇంత శ్రమపడినారా? దైవమే కరుణించలేదు, ఆందోళన చెందకండి. మనము



చేసుకొనిన పుణ్యము అంతే! ఆ స్వామి మహామాయావి అని ఆ రాక్షసుడు చెప్పుచున్నాడు కదా! పోనీయండి, మీకు మాయలు, మర్మాలు తెలియవు. మన ప్రాప్తం ఇంతే అనుకొందాము, అందని ద్రాక్షపళ్ళకోసం అర్రులు చాచడం ఎందుకు? మీరు ఇక నిశ్చింతగా మీ తపమును, సాధనమును సాగించండి. శ్రీ స్వామివారికి కరుణ కలిగినపుడే దర్శనము యిస్తారు!" అని హితము పలికినది. ఆమె చేసిన శైత్యోపచారాలు – ఈ తియ్యని మాటలు విష్ణుదత్తుని అలసటను తీర్చి ఆహ్లాదమును కల్గించినవి. కాని వారి మనస్సులో తాను దత్తస్వామి అనుగ్రహమును పొందలేకపోయినానే అను విచారము అధికము కాజొచ్చినది. అశాశ్వతమైన శరీరమునకు ఆపద సంభవించినదని భావించి శాశ్వతమైన దత్తానుగ్రహానికి దూరమైనాను. ఈ జన్మ ఎందులకు? జీవించి ప్రయోజనం ఏమిటి? అని నిరంతరము చింతించ సాగినాడు మరియు నా పూర్వ దుష్కృతముల కారణమున స్వామివారు అనుగ్రహించలేదేమోనని స్వామిని మదిలో తలచినాడు.

ఓ దేవాదిదేవా! నిరంతరము నిశ్చలమైన, సంపూర్ణ భక్తి, యుక్త సేవలో వుండు నేను ఏమి నేరము చేసితిని. నాయందు నీకు కనికరము ఏల కలుగలేదు. నీలోని శివాంశము ప్రతినిత్యము భూత ప్రేత పరివృతమై వుంటుందని, విభూదిని పూసుకొని అస్థి భూషణాలు ధరించి, ఉన్మత్తుని మాదిరిగా దిగంబరుడవై శ్మశాన భూములలో తిరుగుతుంటావని శాస్త్రములలో తెలుపగా తెలుసుకొన్నాను. అయినా నీవు ఆ రూపంలో వుంటే నీవేనని తెలుసుకోలేకపోయానే! నీ సన్నిధి పరమ పావనము, మధురము, ఆనందదాయకము. అయినా నేను నీ సన్నిధిలో భయమును పొంది దేహ భ్రాంతితో చరించితినే అని బాధపడుచూ –

"ఓ దత్త నిరంజనా! సృష్టికంతటికి మూలము నీవు, నీవే పరబ్రహ్మావు. పరమ పురుషుడవు–యజ్ఞస్వరూపుడవు. యజ్ఞ ఫలప్రదుడవు, యజ్ఞమయుడవు, సర్వజ్ఞుడవు. నీచే ప్రయోగింపబడు విష్ణుమాయను, శివమాయను దాటుట నీ అనుగ్రహము లేక జరుగదు. యజ్ఞేశ్వరా! నీవు అద్వితీయుడవు. మాయాతీతుడవై కూడా మాయను అనుసరించి, మాయా మానుష రూపంలో మానవులకు దర్శనమిస్తుంటావు. స్వతంత్రుడవై కూడా పరతంత్రుని మాదిరిగా గోచరిస్తూ వుంటావు. నిన్నే నమ్ముకొని జీవించు నిర్భాగ్యుడను. దయతో నా ఆఖరి ప్రయత్నమునైనా సఫలము గావించి నన్ను నీ సన్నిధిలో చేర్చుకొని

అనుగ్రహించు" అని ప్రార్థించి, తన నిత్యకార్యములలో క్రమంగా నిమగ్నుడైనాడు.

కొంతకాలము గడచినది. ఒకరోజున భార్యాభర్తలు ఆ మరునాడు చేయవలసిన పితృకార్యమును గురించి యోచించుచుండగనే బ్రహ్మరాక్షసుడు వచ్చి పిలచినాడు. ఆ బ్రాహ్మణుడు అతనికోసం రోజూ ఎదురు చూచుచునే వున్నాడు. ఈసారి వాడు హడావుడిగా లేడు. "మహాత్మా! ఈసారి నా మాటలను బాగా వినండి. స్వామి ఏ రూపములో కనిపిస్తారో ఆ రూపమును మనస్సులోనికి రానీయకండి, దానితో మీకు పనిలేదు. అందులో వుండు స్వామితో మాత్రమే మీకు పని. అందులో వుండు స్వామియే ముఖ్యం. ఇది గుర్తుంచుకొని ప్రవర్తించండి. ఇప్పటికి రెండుసార్లు విఫలమైనారు. ఇది మూడవ పరీక్ష. ఇంకా ఎక్కువగా నుండవచ్చు. ధైర్యముతో తండ్రి గృహమునకు వెళ్ళే తనయుడి లాగా – తల్లి కౌగిలిలోనికి పరుగిడు బిడ్డలాగా – తల్లి – తండ్రి – గురువు – దైవము అయిన ఆ స్వామి సన్నిధిని చేరండి, ఇక బయలుదేరండి" అని చెప్పినాడు. విష్ణుదత్తుడు ఇంటిలోనికి వెళ్ళి తన నిత్య ఆరాధ్యదైవములను హోమమును దర్శించి కమండలము తీసుకొని సుశీలమ్మకు చెప్పి బయలుదేరినాడు. పతివ్రతాతల్లి అయిన ఆమె శ్రీ దత్తస్వామిని తన పతిదేవుని కరుణించమని ప్రార్థించినది.

రాక్షసుని వెంట వెళ్ళుచూ 'ఈసారి స్వామి అనుగ్రహం పొందుటయో, స్వామి పరీక్షలో నా శరీరం ముక్కలు ముక్కలై మట్టిలో కలవటమో, రెండే మార్గాలు. దీనికి తిరుగులేదు' అని దృఢనిశ్చయముతో సాగిపోయినాడు. వారు ఇరువురు కలసి మెల్లగా ఊరు వెలుపలగల మాలపల్లిలోనికి చేరుకున్నారు. దూరంగా అచ్చట ఒకడు చచ్చిన గాడిద మాంసమును తీసి తోళ్ళు సరిచేస్తున్నాడు. చుట్టూ కుక్కలు మూగి వున్నవి. దూరంగా కాకులు, గ్రద్దలు గుంపులు గుంపులుగా వున్నవి. ఒంటినిండా ఇనుప నగలు ధరించి వున్నాడు. తలంతా చిందరవందరగా వుంది. శరీరం అంతా దుమ్ముకొట్టుకొని వున్నది. పనిచేయుచు నోటినుంచి పచ్చి బండబూతులను తిట్టుచున్నాడు. ఆ గాడిద మాంసమును ముక్కలుగా కోసి కాకులకు, గ్రద్దలకు, ప్రక్కన వున్న కుక్కలకు విసిరి వాటితో ఏదో మాటలాడినట్లు, కసురుకొన్నట్లు వుండి ఆడుకొను చున్నాడు. ఆ రాక్షసుడు ఆ వ్యక్తిని చూపించి "బ్రాహ్మణోత్తమా! అదిగో చూడండి. ఆ మనిషే మీరు కోరుకున్న స్వామి. నిశ్చలముగా, నిర్భయముగా ప్రయత్నించి



ప్రసన్నుడిని చేసుకోండి! నేను వెళ్ళుచున్నాను” అని వెళ్ళిపోయినాడు.

విష్ణుదత్తుడు ఆనందముతోను, నిర్భయముతోను ముందుకు చూశాడు. ఆ సమయంలో అతని మనస్సులో సందేహం లేశమైనా లేదు. అధైర్యం దరికి చేరలేదు. సంతోషంతో అణువణువు పొంగిపోయినది. స్వామి నిజస్వరూపమును హృదయంలో తలచుకొనుచూ ‘జై గురుదత్త! శ్రీ గురుదత్త!’ అను మంత్రమును జపించుచూ పారవశ్యంతో ముందుకు నడచి, అతను ఇటు చూచే లోపలే పోయి సాగిలపడి రెండుకాళ్ళు గట్టిగా పట్టుకొని “దేవాదిదేవా! దత్తదేవా! శరణు శరణు” అన్నాడు. ఆ కటికవాడు “ఎవరురా దేవుడు! ఏమిటి శరణు! వదులు! నన్ను వదులు!”అని విదిలించసాగాడు. కాళ్ళను లాగుకోడానికి ప్రయత్నించి నాడు. అయితే గట్టిగా పట్టుకొన్న విష్ణుదత్తుడు పట్టు వదలలేదు. అతనికి చాలా కోపం వచ్చినది. తిట్టాడు, ఉమ్మేశాడు, వీపు చితికేటట్టు చేత బెత్తంతో కొట్టినాడు. విష్ణుదత్తుని పట్టు తప్పించడం కోసం అమితంగా ప్రయత్నించినాడు. అతను ఎన్నివిధాల హింసించినను విష్ణుదత్తుడు అతని పాదాలను వదలలేదు. నోటినుండి “దత్తదేవ, శరణు, శరణు, పాహి, పాహి! రక్ష రక్ష!”అనే నామం వదలలేదు. ఇలా ఇరువురు ఎవరిపట్టు వారు వీడలేదు. కొంత సమయం గడచినాక కళ్ళుమూసుకొని స్వామి నామస్మరణలో వున్న విష్ణుదత్తునికి “నీకు నాతో ఏమిపనయ్యా? మూడుసార్లు నా చుట్టూ తిరిగి ప్రయత్నించినావు” అన్న మాటలు వినిపించాయి.

మృదుమధురమైన స్వరముతో వినిపించిన ఆ వాక్కులను విని విష్ణుదత్తుడు ఆశ్చర్యపడినాడు. అంతకు మునుపు వరకు ఉన్న శరీర బాధ – ఆవేదన – అంతా ఆ తియ్యని మాటలు వినటంతోనే తీరింది. స్వామి పాదాలు విడవకుండానే తల పైకెత్తి కళ్ళు తెరచి చూశాడు. స్వామి తన నిజస్వరూపంతో కనిపించినారు. స్వామి చిరునవ్వులు నవ్వుతున్నాడు. ఆశ్చర్యముతో అటూ ఇటూ చూచినాడు విష్ణుదత్తుడు. అతనికి అక్కడ శవము లేదు. కాకులులేవు. గ్రద్దలు లేవు. నాలుగు కుక్కలు మాత్రము స్వామికి సమీపంలో శాంతముగా వున్నాయి. ఆ ప్రదేశమంతా మనోహరమైన తపోవనంలాగా ప్రశాంతంగా వున్నది.

విష్ణుదత్తునికి అమితమైన ఆనందం కలిగినది. స్వామి “లేవయ్యా విష్ణుదత్తా! నీవు నాకోసం ఇంత కష్టపడుతున్నావు. ఎందులకు? లే!” అని స్వామి తన హస్తములతో విష్ణుదత్తుని భుజములను పట్టి లేవదీసినాడు.



ఆ బ్రాహ్మణునికి అమితమైన ఆత్మానుభూతి కలిగినది. స్వామివారి స్పర్శతో అతనిలోని జ్ఞాని మేలుగాంచి స్వామికి ప్రదక్షిణాలు చేసి సాష్టాంగ నమస్కారములను అర్పించి, అనేక విధముల చతుర్వేద మంత్రాలతో స్తోత్రించినారు.

స్వామి అతనిని శాంతపరచి "విప్రోత్తమా! నీకేం కావాలో కోరుకో!" అన్నాడు.

కోరికలు ఎందుకో? కోరుకోవటం ఏమిటో? అతనికి అర్థముకాదు. ఏ కోరిక లేనివానికి ఇహపరమైన వరాలతో పని ఏమి వున్నది. పరలోక కోరిక మోక్షమే. అటులగాక స్వర్గసౌఖ్యాలు కోరుకుంటే ఏమి ప్రయోజనం? అవి పుణ్యం హరించగానే వదలిపోతాయి. ఇక ఈ లోకానికి సంబంధించిన కోరికలా! ఇవి అశాశ్వతములు, అసత్యములు. స్వామి సన్నిధిని అనుభవించడంకంటే సుఖము-శాంతి ఏమి వున్నది. అందులకే స్వామివారికి ఏ సమాధానము యివ్వలేక మౌనముగా వారినే చూచుచు పరవశించి పోతున్న విష్ణుదత్తుని చూచి స్వామి మరల "ఏమయ్యా! ఇంత కష్టపడి నన్ను చేరుకొని అలా మౌనముగా వుంటావేమి. నీకు ఏదైనా కావలసి వున్నచో కోరుకో, తప్పక తీర్చెదను. నాపై నీకు అమితమైన ప్రేమ ఏర్పడినది. నీ శ్రద్ధ, ఓర్పు-నిర్మలమైన భక్తి నన్ను ఆకట్టుకొన్నది" అని చెప్పగనే విష్ణుదత్తునికి తమ తండ్రి ఆబ్దికము మరుసటి రోజున ఉన్న విషయం గుర్తుకు వచ్చినది. ఆయన వెంటనే శ్రీ స్వామివారిని "దివ్య పురుషా! లోకారాధ్యా! మీ అనుగ్రహంకంటే నాకు ఇంక ఏమికావాలి! నాకు ఏ కోరిక లేదు. నాకేమి కావాలో తెలియదు. నీవు అనుగ్రహిస్తానంటే ఒకటి మాత్రం కోరతాను"అని చేతులు జోడించాడు.

అందులకు శ్రీ దత్తమూర్తి 'అలాగే!' అనగా, ఈ బ్రాహ్మణుడు "స్వామీ! రేపు మా ఇంట పితృదినము, మా తండ్రిగారి తిథి. తమరు భోక్తగా రావాలి" అన్నాడు. స్వామికి పరమానందమైనది అతని కోరికలోని నిస్వార్థతను చూచి ఆయన అమితమైన సంతోషమును పొంది "అలాగే వస్తాను!" అన్నారు. స్వామి "రేపు మధ్యాహ్నం వేళకు మీ ఇంటికొస్తాను. నీవు అన్నీ సిద్ధంచేసుకో!" అన్నారు. విష్ణుదత్తుడు మహదానందం పొందాడు. స్వామివారు భోక్తగా వస్తే పితృదేవతలంతా తరిస్తారు. అదిచాలు తనకి పితృరుణము తీర్చుకోవటానికి అని భావించినాడు. స్వామి అతనికి సెలవునిచ్చి తాను ఆ తావునుంచి



అదృశ్యమైపోయినాడు. విష్ణుదత్తుడు తన గృహమునకు చేరుకొని భార్యకు జరిగినదంతా వివరించాడు. ఆ మహాసాధ్వి శ్రీదత్తస్వామి అనుగ్రహమునకు తన భర్త పాత్రుడైనందులకు చాలా ఆనందించి మనస్సులో ఆ స్వామికి శతకోటి వందనాలు సమర్పించుకొన్నది. ఆ దేవదేవుడు రేపు మన ఇంటికి వస్తాడని, వారిని ఏ విధంగా పూజించాలి? ఏమి వంటకాలు చేయాలి? ఎలా స్వాగతం చెప్పాలి? ఏ ఉపచారాలు చెయ్యాలి అనే యోచనతోనే వారు ఆ రాత్రి అంతయు గడిపినారు.

చేసిన ఆలోచనే మళ్ళీమళ్ళీ చేశారు. ఆ స్వామి రూపమును, అనుగ్రహమును తరచి తరచి చెప్పుకున్నారు. సమయమంతా ఆ స్వామి విశేషములతోనే గడచినది. వేకువజామున లేచి కార్యక్రమంలో నిమగ్నులైనారు. అయినా వారి ధ్యాస అంతా స్వామి రాకకోసం. అనేక రకముల పిండివంటలతో ఆనాటి కార్యమునకు భోజనము సిద్ధంచేసినది ఆ తల్లి. చీమ చిటుక్కుమంటే విష్ణుదత్తునికి స్వామి వచ్చినారేమో ననిపించసాగినది.

ఇంతలో మధ్యాహ్న కాలం సమీపించుచుండగా ఆ స్వామి రానే వచ్చినారు. వారికి అర్ఘ్యపాద్యములతో షోడశోపచార పూజ చేసినారు. తిథి కర్మ ప్రారంభమున స్వామి తాను ఒక్కడు వుండటము, వేరు బ్రాహ్మణులు లేకపోవటం గమనించి విష్ణుదత్తునితో “ఏమయ్యా, భోక్తగా నేను ఒక్కడినేనా, ఇంకెవరిని పిలువలేదా” అని అడిగినారు. అందులకు విష్ణుదత్తుడు ఆందోళన చెందినాడు. ఆ విషయం గుర్తులేక, స్వామి ఆలోచనలతోనే గడిపి ఎవ్వరినీ పిలువలేదు. వెంటనే తేరుకొని “స్వామీ! మా సోమిదేవమ్మ అన్ని ఏర్పాట్లు చేసియే వుంటుంది. ఆమెను అడిగివస్తాను”అని లోనికి వెళ్ళి తన భార్యతో విషయం చెప్పినాడు. స్వామివారు అడుగుచుండగనే ఆ తల్లికి అది గుర్తుకు వచ్చినది. భర్తతో “మరి ఒక బ్రాహ్మణుడు వస్తారుఅని స్వామికి తెలుపండి” అని పెరటిలోనికి నడచినది. అక్కడ ఆకాశంలో దేదీప్యమానంగా వెలుగుచున్న సూర్యదేవుని చూచి చేతులు జోడించి మనసారా ప్రార్థించి “సూర్యనారాయణ మూర్తీ! మా ఇంట భోక్తవ్యం స్వీకరించండి” అని కోరింది. వెంటనే సూర్యదేవుడు ప్రత్యక్షమై “అమ్మా! సాధ్వీమణి! నీవు కోరిన కోర్కె నాకు అనుగ్రహము. ఆ దేవాది దేవునితో కలిసి భోక్తవ్యము స్వీకరించుట నా అదృష్టము. నీవు చింతించవలదు. నేను ఇప్పుడే వచ్చెదను”అని దీవించి అదృశ్యమైనాడు.

 

ఆమె వారికి మనసారా వందనములు సమర్పించి తన కార్యములో నిమగ్నమైనది.

సూర్యభగవానుడు బ్రాహ్మణ వేషధారియై వచ్చి ద్వారమువద్ద నిలచి "విష్ణుదత్తా!" అని పిలిచినాడు. స్వామితో సంభాషించుచున్న విష్ణుదత్తుడు ఆ పిలుపు విని ద్వారముకడకు వచ్చి అక్కడ వున్న తేజస్వి అయిన బ్రాహ్మణుని భోక్తగా సిద్ధపడి వచ్చినవారని గమనించి ఆనందముతో నమస్కరించి స్వాగతము చెపుతూ వారిని స్వామివద్దకు తెచ్చి ఆసనం అలంకరింపజేసి, స్వామివైపు చూచి "స్వామీ! ఇక ప్రారంభించమంటారా?" అని అడిగినాడు. స్వామి చిరునవ్వు నవ్వి – "ఏమిటి! విష్ణుదత్తా! విష్ణుస్థానంలో భోక్త రావటంలేదా! ఏమయ్యా! సాధారణముగా ఇద్దరితో చేసినా ఫరవాలేదు. నావంటి వారిని భోక్తగా పిలచినపుడైనా పూర్తిగా శాస్త్రపద్ధతి వుండాలిగదా!" అని అడిగినారు.

అందులకు విష్ణుదత్తుడు స్వామి చెప్పిన విషయము గ్రహించి నిజమేకదా! అని లోపలికి పరుగిడి భార్యతో మూడవ బ్రాహ్మణుడు లేడేమని స్వామివారు అడుగుచున్నారు. ఏమి చెయ్యాలి?" అని అడిగినారు. అందులకు ఆ తల్లి "ఆందోళన పడకండి, మూడవ భోక్తగూడ నేరుగా వస్తాడు అని చెప్పండి" అని దేవతార్చన వద్దకు వెళ్ళి తమ ఇంటిలో నిత్యము చేయు హోమకుండం దగ్గర నిల్చి చేతులు జోడించి "స్వామీ అగ్నిదేవా! నీవు మాకు నిత్యార్చితుడివి. అందువలన మాకు బంధు సముడివి. ఈ సమయంలో నిన్ను ప్రార్థించు చున్నాను. నీవే మమ్ములను గట్టెక్కించాలి, మూడవ భోక్తగా వచ్చి మా ఆతిథ్యం స్వీకరించు" అని ప్రార్థించినది. ఆ ప్రార్థన విని వెంటనే అగ్నిదేవుడు ప్రత్యక్షమై "అమ్మా! నీ ఆజ్ఞ మాకు ఆనందదాయకము. మీకు సహకరించుట మాకు మేము చేసుకొను గౌరవము. నీవు కంగారు పడవలదు. మీ కార్యము దిగ్విజయముగా సాగిపోవును!"అని దీవించి అదృశ్యమైనాడు. వారు మూడవ భోక్తగా విచ్చేసినారు. అపుడు స్వామి కార్యము ప్రారంభించమని విష్ణుదత్తునికి ఆజ్ఞనిచ్చి ఆ సుశీలమ్మతల్లి ప్రభావమునకు ఆనందపడినారు.

శాస్త్రోక్తముగా తిథి జరిగినది. ఇందులకు దత్తుడు పరిపూర్ణంగా అనుగ్రహించి వారిని చెంతకు పిలిచి తన ఆనందము వ్యక్తంచేసి ఏమైనా కోరుకొమ్మన్నారు. వారు ఏ కోర్కెను కోరలేకపోయిరి. తమకు స్వామి దర్శనము కలిగించిన ఆ రాక్షసునికి ముక్తిని ప్రసాదించమని కోరిరి. దానికి దత్తస్వామి



"వాడికి ఎప్పుడో ముక్తి, కల్పాంతర స్వర్గలోకవాసం కల్గినది. ఇక వాడికి నేను ఏమి ఇచ్చేది? కావున మీరు కోరండి!" అనగా ఆ దంపతులు మౌనము వహించిరి. అపుడు దత్తదేవుడు "విష్ణు దత్తా! నీ పేరులోనే వున్నది. నువ్వే దత్తుడివి. నువ్వెంతో ఆమె అంత. ఈమె ప్రభావాన్ని నేను గమనిస్తూనే వున్నాను. ఈమెకు నీవే తగుదువు. నీకు ఈమె సరియైన ఇల్లాలు. ఈమె కూడా దత్తుడే. మీరు వేరే కోర్కెలు కోరుకోవలసినది ఏముంది? మీరు చేసిన ఈ పితృకార్యమువలన మీ పితృదేవతలంతా శాశ్వత బ్రహ్మలోక నివాసాన్ని పొందినారు. ఇక మీ వంశములో మోక్షకామి కానివారు ఎవరూ వుండరు. నీవు నిష్కామకర్మ చెయ్యటం ఎరిగినవాడివి. నిజానికి నీకు ఏమి ఇవ్వవలసిన పనిలేదు. అయినా నీతో నాకే పని వున్నది. నా పనిని నీవు కొంత చెయ్యాలి. నీకు ఒక దివ్యమైన మంత్రమును ఉపదేశించుచున్నాను. అది నా స్వస్వరూపమునకు మూలమైనది. దానిని జపించిన వారికి సర్వకార్యములు నెరవేరుతాయి. నీవు దానిని బాగా అనుష్ఠించి లోకంలో దీనులను, ఈతి బాధతలను పొందువారిని – గ్రహ పీడితులను అనుగ్రహించు. లోకములోని సత్యధర్మపరులైన వారికి ఉపదేశించు. ఈ విధముగా నా కార్యంలో భాగం పంచుకోండి" అని వారికా మంత్రము ఉపదేశించి మీ జీవితాలు ముగియగానే నా చెంతకు చేరుకోండి!"అని దీవించి అద్భుతమైన రూపమును ధరించినారు. ఆ దంపతులున్నూ, సూర్య, అగ్ని దేవతలున్నూ, ఆ అద్భుత రూపమును దర్శించి తన్మయులయినారు.

విష్ణుదత్తుడు అష్టోత్తర శతనామములతో స్వామిని స్తుతించినాడు. స్వామి, సూర్య, అగ్ని దేవతలు వారిని దీవించి తమ లోకాలకు వెళ్ళిపోయినారు. ఆ దంపతులు సర్వులకు అన్నివిధాల అనుగ్రహమును చూపుతూ–శిష్టులైన వారికి ఆ మంత్రమును ఉపదేశించి దత్తకార్యాన్ని కొనసాగించినారు.

అని బృహస్పతి దేవేంద్రునితో తెలిపినారు అని నిత్యానందులవారు విద్యాసాగరునికి తెలిపి – "నాయనా! ఇటువంటి భక్తుడు, అటువంటి తల్లి తిరిగి జన్మించుట చాలాకష్టం. వారు చేసిన తిథి ఈ లోకములో ఎవరూ చేసియుండలేదు. ఈ కథ విన్నవారికి దత్తానుగ్రహం – సూర్యానుగ్రహం – అగ్ని దేవతానుగ్రహం తప్పక కలుగుతుంది. గురుభక్తి, గురువుపైన విశ్వాసం కలుగుతాయి. మంచి 'భక్తు'లై సర్వ కార్యములలో విజయం సాధించగలరు.



ఈ అధ్యాయము పారాయణ చేసినచో గురు అనుగ్రహము కలుగును. సాధనలో ఆటంకములు తొలగిపోవును. సకల కార్యములు తీరును. 108సార్లు ప్రతిరోజూ పారాయణ చేయుచు, 108 రోజులు దీక్షగా చేసినచో దత్తదర్శనము కలిగి, వారి అనుగ్రహం కలుగును. 5, 6, 7 అధ్యాయములను కలిపి రోజు పారాయణము చేయుచు 49 రోజులు చేసిన దీర్ఘవ్యాధులు నయమై మృత్యువును జయించగలరు.

**ఇక స్వామివారి కలియుగ అవతారములను తెలుపుతాను.**

**"దత్తగురు దత్తగురు జై జై దత్తగురు"**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**

**ఏడవ అధ్యాయము** సంపూర్ణము





ఓం శ్రీ సాయిరాం శ్రీ గురుదేవదత్త
ఓం శ్రీస్వామి సమర్థాయ నమః
ఓం ద్రాం దత్తాత్రేయాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఎనిమిదవ అధ్యాయము

### శ్రీ దత్తాత్రేయస్వామి కలియుగంలో 'ప్రథమ అవతారం' శ్రీపాద శ్రీవల్లభులు

"పరమ భక్తశిఖామణీ! శ్రీ దత్తాత్రేయస్వామి కలియుగంలో ప్రప్రథమంగా శ్రీపాద శ్రీవల్లభులుగా అవతరించినారు. వారు తూర్పు సముద్రతీరం (బంగాళాఖాతం)లో ఆంధ్రప్రదేశ్‌లో తూర్పుగోదావరిజిల్లా ముఖ్యపట్టణమైన కాకినాడకు 15 కిలోమీటర్ల దూరంలోనున్న పిఠాపురం (పీఠికాపురం)లో శ్రీపాద అప్పలరాజు శర్మ - సుమతి అను దంపతులకు జన్మించినారు. ఈ దంపతులు నిష్ఠాపరులు, సనాతన సంప్రదాయకులు, శ్రీ దత్తాత్రేయస్వామి భక్తులు. శ్రీపాద అప్పలరాజు శర్మ వేదవేదాంగములు చదివిన ఉత్తముడైన బ్రాహ్మణుడు. అతని భార్య గొప్ప గుణవతి. అనసూయ మాతవలెనే గొప్ప పతివ్రతామతల్లి. తన భర్తకు నిత్యకర్మ అనుష్ఠానమందు భక్తితో సహాయము చేయుచు అతిథి అభ్యాగతులను సేవించుచు సంసారమును నడుపుచున్న గొప్ప ఇల్లాలు. వారికి యిరువురు కుమారులు జన్మించిరి. వారిరువురు వికలాంగులు. ఒకడు పూర్తిగా గుడ్డివాడు. రెండవవాడు కుంటివాడు. ఋణానుబంధముచే పూర్వకర్మ ఫలముగా వీరు జన్మించిరి. ఆ తరువాత యిద్దరు పిల్లలు పుట్టి చనిపోయిరి. ఆ దంపతులు నిష్కల్మషులుగా జీవించుచుండిరి. భిక్షకు ఎవరైనా వచ్చినయెడల వారిని దత్తరూపంగా భావించి, వారికి భిక్ష సమర్పించేవారు.

ఒక అమావాస్యరోజు వారి గృహములో శ్రాద్ధక్రియను నిర్వర్తించు చుండిరి. అలాంటి కార్యము జరుగు రోజున బ్రాహ్మణభోక్తలు భోజనం చేయక

ముందు మరెవ్వరూ భోజనం చేయరాదని శాస్త్రం. కాని ఆనాడు బ్రాహ్మణులు భుజించకమునుపే దండకమండల ధారియైన ఒక సన్యాసి వచ్చి భిక్షకోరినాడు. శ్రాద్ధక్రియల్లో నిమగ్నుడైయున్న అప్పలరాజుశర్మకు ఆ విషయం తెలియదు. సుమతి వెలుపలకు వచ్చి చూచినది. ఆ సన్యాసి ఆమెకు గొప్ప అవధూతగాను, అవతారపురుషునిగాను గోచరించినాడు. ఆమె వారు శ్రీ దత్తాత్రేయులేననీ, సాక్షాత్తు శ్రాద్ధభోక్తయైన పరమేశ్వరుడేనని తమ కులదైవమైన ఈ అవధూతకు భిక్ష యిచ్చినచో దానితో శ్రాద్ధదేవతలందరు సంతృప్తి పడగలరని గ్రహించి, ఆ విశ్వాసంతోనే వారికి భిక్ష యిచ్చినది. ఆమె భక్తి విశ్వాసాలకు సంప్రీతుడైన ఆ యతీంద్రుడు యదార్థమైన తన దత్తాత్రేయ స్వరూపంలో దర్శనమిచ్చినారు.

విద్యాసాగరా! ఆ దివ్యమైన రూపమును చూచుటకు వేయికనులు చాలవు. వర్ణించటానికి ఎన్ని వేల నాలుకలైనా సరిపోవు. రెండు చేతులలో శంఖుచక్రాలు, రెండు చేతులలో ఢమరు, త్రిశూలములు, రెండు చేతులలో జపమాల, కమండలాలు ధరించి ఆరు చేతులతోను, మూడు తలలతోను స్వామి దివ్యముగా ప్రకాశించుచున్నారు. వెండి కొండవలె తెల్లని కాంతితో ఆయన శుద్ధ సత్వ స్వరూపంగా గోచరించుచున్నారు. దీనుల నుద్ధరించుటకు ఆరుచేతులు చాలక అనేకమైన బాహువులే ఆయన శిరస్సునుండి వచ్చాయా అన్నట్లు ఆయన జటాజూటం నుండి జటలు పాయలుగా వేలాడుచున్నవి. ఆ తల్లి సుమతి తన జన్మ సార్థకమయ్యేలా ఆ అమృతమూర్తిని ఒడలెల్లా కళ్ళు చేసుకుని, ఆ కన్నులతోనే పానం చేయసాగింది. కొంత సమయం అట్లు స్వామిని చూచి ఆ సుమతి, ఆ మహాపురుషుని ఉద్దేశించి, "నాయనా! పురాణపురుషులు, యోగులు యోగమార్గాన నిన్ను దర్శించామంటారు. మాంస చక్షువులతో నీ నిజరూపాన్ని వీక్షించటం మాబోటివారికి సాధ్యంకాదు. నన్ను కరుణించి ఈ రూపాన్ని దర్శింపజేసినావు" అని స్తుతించినది.

అప్పుడా కరుణాకరుడు "తల్లీ! అచంచలమైన నీ విశ్వాసానికి సంప్రీతుడనయ్యాను. శ్రాద్ధ బ్రాహ్మణులు భోజనం చేయకముందే నేను పరమేశ్వరుడనన్న విశ్వాసంతో భోజనం పెట్టావు. నీ అభీష్టమేమిటో చెప్పు. నేను తప్పక నెరవేర్చగలను" అన్నాడు. స్వామి మాటలు అమృతధారలై ఆమె చెవుల ద్వారా శరీరంలోని సర్వధాతువులలోనికి ప్రవహించాయి. జగన్మోహన మైన శ్రీ దత్తాత్రేయ స్వామి దర్శనంతో ఆమె కన్నులు, ఆయనయొక్క అమృత



వాక్కులు వినడంవలన ఆమె చెవులు, బ్రహ్మవాక్కులైన వేదాలను వినిన ఋషి సత్తముల చెవులవలె పరమ పావనమయ్యాయి. ఆమె కృతజ్ఞతతో "పరమాత్మా! యోగులను కూడా ముగ్ధులను చేసేలా దర్శనమిచ్చావు. అంతేగాక నా చేతి అన్నం స్వీకరించావు. ఇంతకంటే నాకేమి కావాలి? నేను ధన్యురాలను. ఈనాటి శ్రాద్ధదేవతలైన మా పితృదేవతలు కూడా ధన్యులయ్యారు. నీవు భక్తుల కోర్కెలీడేర్చే కల్పవృక్షానివి. నీవు నన్ను తల్లీ అని సంబోధించావు. కనుక నేను ప్రత్యేకంగా నిన్ను వరమడుగవలసిన పనిలేదు. నీవిచ్చిన మాటను నిలుపుకో, చాలు!" అన్నది.

భక్తి శ్రద్ధల వలన జాగృతమైన ఆమె బుద్ధిశక్తికి ఆశ్చర్యచకితుడైన శ్రీ దత్తాత్రేయస్వామి ఇదివరకు అత్రి మహర్షి అడిగినట్లే ఈమెగూడ లోకానుగ్రహార్థమైన కోరిక కోరుతున్నది అనుకున్నాడు. ఆయన "అమ్మా! నాతో సమానుడైన పుత్రుడే నీకు జన్మిస్తాడు. కానీ నీవు పుత్రవ్యామోహంతో అతని మాటను పట్టించుకొనక నీవు చెప్పినట్లే అతడు చేయాలని నిర్బంధించకూడదు. అతడు చెప్పినదే అక్షరాలా అమలు జరపాలి" అన్నారు. ఆ దర్శనంతో మరింత నిశితమైన బుద్ధికలిగిన ఆమె "స్వామీ! నేను మానవమాత్రురాలిని. నాకు పుత్రవ్యామోహం కలగడం సహజం. అది లేక మాతృవాంఛ పరిపూర్ణ మయ్యేదెలా? కనుక పుత్రుడు జన్మించాక సమయానుకూలంగా అట్టి వివేకాన్ని నీవే అనుగ్రహించాలి" అని ప్రార్థించింది. ఆమె సమయస్ఫూర్తికి మెచ్చి దత్తస్వామి నవ్వి, ఆశీర్వదించి అంతర్హితులయ్యారు.

సుమతీదేవి ఆనంద పారవశ్యంతో యింటిలోనికి వెళ్ళి, పితృశ్రాద్ధాది కార్యకలాపాన్ని కొనసాగిస్తున్న భర్తను ప్రక్కకు పిలిచి "స్వామీ! నేనీనాడు ఒక అపరాధం చేశాను. చేసిన అపరాధం చెబితే దోషం పోతుంది. శ్రాద్ధ బ్రాహ్మణులింతవరకూ భోజనం చేయలేదుగదా? కాని యిప్పుడే ఒక సన్యాసివచ్చి బిక్షమడిగాడు. ఆయనే యజ్ఞపతి. శ్రాద్ధఫల భోక్త అయిన శ్రీ దత్తాత్రేయ స్వామియని తలంచి భిక్ష యిచ్చాను. ఆయన సంతోషించి తన నిజరూపమైన దత్తాత్రేయ స్వామిగా దర్శనమిచ్చారు"అని చెబుతూంటే ఆమె శరీరం రోమాంచితమై, కంఠం గద్గదమై కన్నులు ఆనంద బాష్పాలతో నిండాయి. ఆ మాటలు విన్న రాజుశర్మ ఆమె ముఖంలో తాండవిస్తున్న ఆనందపారవశ్యానికి ఆశ్చర్యచకితుడై, సంతోషంతో, "సాధ్వీ, మనము బ్రాహ్మణులకు భోజనంపెట్టి

ఆ శ్రాద్ధ కర్మను యజ్ఞభోక్తయైన విష్ణువుకేగదా అర్పిస్తాము! అటువంటప్పుడు నీవు పెట్టిన భిక్ష భగవంతుడే స్వయంగా గ్రహించాడంటే అది మనకు మహద్భాగ్యం. అది కేవలం నీ విశ్వాస ఫలమే. నీవు చేసిన ఈ మంచి కార్యంవలన నీవేగాక, అందరమూ కృతార్థులమయ్యాము. శ్రీ దత్తాత్రేయస్వామి మధ్యాహ్న సమయంలో అనేక రూపాలలో భక్తుల నుద్ధరించడానికి అతిథివలె సంచరిస్తుంటాడని విన్నాను. ఆచరణలో జరిగిన లోపం వలన అతిథి ఆకలితో తిరిగిపోతే సాక్షాత్తూ శ్రీహరే తిరిగిపోయినట్లు. నీవు చేసిన పని ఎంతో కళ్యాణకరమైనది" అని ప్రశంసించాడు.

అప్పుడా పరమసాధ్వి, తనకు స్వామి వరమిచ్చిన సంగతి వివరంగా చెప్పింది. రాజుశర్మ ఆనందభరితుడై "కళ్యాణీ! నీవు మన వంశానికి, ప్రపంచానికి గూడ మంగళకరమైనదే కోరావు, నేను ధన్యుణ్ణి!"అని మనసారా ఆమెను అభినందించి, మిగిలిన శ్రాద్ధకలాపాన్ని యధావిధిగా పూర్తిచేశాడు.

త్వరలో ఆ సాధ్వీమతల్లి సుమతీదేవి గర్భం ధరించి భాద్రపద శుక్ల చతుర్థినాడు ఉదయం ఒక శుభముహూర్తంలో కాలాతీతుడు, పుట్టుకలేనివాడూ అయిన భగవంతునికి పుట్టుకనిచ్చింది. దైవజ్ఞులు ఆ శిశువుయొక్క జన్మలగ్నము, గ్రహస్థితి గుణించి, సాక్షాత్తూ కల్పవృక్షమే వారి యింట వెలసినదని, సాక్షాత్తూ దత్తాత్రేయుడే అవతరించాడనీ అన్నారు. రాజుశర్మకు కల్గిన అదృష్టాన్ని పూర్వం అత్రి మహర్షికి ప్రాప్తించిన మహద్భాగ్యంతో పోల్చారు. ఆ శిశువు పాదాలలో దివ్య చిహ్నాలు, మొదలైన శుభలక్షణాలతోను, అసమాన తేజస్సుతోనూ ప్రకాశిస్తుండడంవలన అతనికి 'శ్రీపాదుడు' అని నామకరణం చేశారు. విద్యాసాగరా! అది కలియుగంలో శ్రీ దత్తాత్రేయస్వామియొక్క మొదటి అవతారం.

పుట్టినది మొదలు శ్రీపాదస్వామి శుక్లపక్ష చంద్రునిలా అందరికీ ఆహ్లాదాన్ని అందిస్తూ ఆనందం చిందిస్తూ, ముద్దులు మూటగడుతూ పెరిగి ఎనిమిదేండ్ల వాడయ్యాడు. అతని ముద్దుముచ్చటలు తల్లిదండ్రులేగాక, ఆ ఊరివారందరూ తనివితీరా అనుభవించారు. అతని పాద స్పర్శతో ఆ ఊరు, అతని జననము, బాల్య జీవితాలవలన ఆ పవిత్ర గోదావరీ ప్రాంతమూ ఎంత ధన్యత పొందాయో చెప్పతరమా? ఎనిమిదవయేట అతని తల్లిదండ్రులు ఒక శుభముహూర్తంలో అతనికి ఉపనయనం చేశారు. సామాన్యంగా అటు తర్వాత



వటువును తగిన గురువువద్ద అధ్యయనం చేయిస్తేగాని వేదం రాదు. కాని ఈ శ్రీపాదస్వామి తనకు ఉపనయనమైన మరుక్షణమే శిష్యులకు వేదపాఠాలు చెప్పి వెనుక శ్రీ దత్తాత్రేయ స్వామి సుమతీదేవికి యిచ్చిన మాట యదార్థమని నిరూపించుకున్నాడు. ఇది ఆ భగవంతుడికి తప్ప వేరొకరికి సాధ్యమా? ఇలా శ్రీపాదుడు పదహారేండ్ల ప్రాయము గలవాడయ్యాడు.

ఇంతలో రాజుశర్మ తన కుమారునికి వివాహం చేయాలని కన్యాన్వేషణ చేయసాగాడు. అది తెలిసి ఒకనాడు శ్రీపాదస్వామి తండ్రితో "నాయనా! నీవు నాకు వివాహం చేయడానికై తగిన కన్యకోసం అన్వేషించనవసరంలేదు. సర్వ శుభలక్షణాలూ కల్గి, నాకు తగిన కన్య సిద్ధంగా వున్నది. ఆమె పేరు యోగశ్రీ. నేను ఆమెను చేపట్టి సన్యాసినౌతాను. నేను శ్రీవల్లభుడను గనుక నాకు సంతానం లేకపోయినా నిత్యముక్తుడనే" అని నిశ్చయంగా చెప్పాడు. ఆ తండ్రికి ఆ మాటలు మనస్తాపం కల్గించాయి. కన్నుల నీరు కారుతుంటే రాజుశర్మ గద్గదస్వరంతో, పెల్లుబుకుతున్న పుత్ర వ్యామోహంతో, స్వామితో యిలా వాపోయాడు. "అబ్బాయి! నీవు గనుక సన్యసించి మా దగ్గర లేకుండా పోతే, మేము నీటినుండి బయటపడిన చేపపిల్లలవలె శోకంతో విలవిలలాడి మరణిస్తాము. నీవు సాక్షాత్తూ పరమేశ్వరుడవే అయినా, మా పుణ్యంవలన మాకు బిడ్డవై జన్మించావు. అట్టి నీవే తల్లిదండ్రులమైన మమ్ములను శోక సాగరంలో ముంచి వెడలిపోవడం ఉచితమేనా? భగవంతుడవు, ధర్మగోప్తవూ, ధర్మరక్షకుడవూ అయిన నీవే పుత్రధర్మాన్ని నిర్వహించకుంటే ఎలా?" అని వాపోయినాడు.

విద్యాసాగరా! ఈ దంపతులకు శ్రీపాద స్వామియేగాక కుంటివాడు, గ్రుడ్డివాడు అయిన మరి యిద్దరు కొడుకులున్నారుగదా! రాజుశర్మ ఆ యిద్దరినీ శ్రీపాదస్వామి వద్దకు తెచ్చి, "నాయనా! నిన్ను స్మరించడంచేతనే సంసార బంధం తొలగిపోతుంది. కాని అవిటివారైన నీ సోదరులిద్దరినీ చూచినప్పుడు మాత్రం మాకు మరలా ఈ సంసార బంధాలు పెనవేసుకుంటాయి. వీరితో మా గతి ఏమి?"అని దుఃఖించాడు. సుమతీదేవిగూడ పొర్లుకొస్తున్న దుఃఖం అణచు కుంటూ శ్రీపాదుని సమాధానంకోసం ఎంతో ఆర్తితో ఎదురు చూసింది. వారి బాధను గుర్తించిన శ్రీపాదస్వామి అన్నలిద్దరినీ తన అమృతహస్తంతో స్పృశించాడు. సంజీవినీ స్పర్శచేత చనిపోయినవారికి ప్రాణమొచ్చినట్లు, స్వామి

స్పర్శచేత తక్షణమే వారిద్దరూ పాద, నేత్రవంతులై సుందర, సుకుమారమైన రూపాలతో ప్రకాశింపసాగారు. సర్వతంత్ర స్వతంత్రుడు, సకల జగన్నియామకుడూ అయిన భగవంతుని మహిమకు సాధ్యాసాధ్యాలు లేవు.

ఆ అద్భుత సన్నివేశం కన్నులారా చూచిన ఆ తల్లిదండ్రులకు శ్రీపాదుడు కేవలం తమ పుత్రుడన్న భ్రాంతి పటాపంచలైంది. అతడు లేని చోటే లేదు గనుక, అతడు తమ దగ్గర లేకుండా పోతున్నాడన్న వ్యామోహం అంతరించింది. ఈ ప్రపంచమంతా ఆయన సంతానమే అయిన ఆ ప్రభువును తమ పుత్రుడని భ్రమించి ఇంట కట్టిపెట్టుకొనడం అపరాధమని తోచి, సుమతీదేవి స్వామిని ఇలా ప్రార్థించింది :

"ప్రభూ! నీ మాయచేత నా పుత్రుడవని భ్రమించాను. నీకు పాలిచ్చి పెంచడం వలన నీవు సర్వలోకాలను పాలించే జగన్మాతకు ప్రభువన్న సంగతి మరచాను. అనంతకోటి బ్రహ్మాండాలు నీయందే యిమిడి వున్నాయి. నా భ్రాంతి తొలగింపుము" అనెను.

అపుడు ఆయన తన యదార్థరూపాన్ని తల్లికి మరొకసారి దర్శింప జేశాడు. ఆ దివ్య మనోహర మంగళ సుకుమార సుందరమూర్తి ఆమె చూస్తుండగానే కోటి సూర్యుల కాంతితో, కోటి చంద్రుల చల్లదనంతో, చూచేవారి దేహాలలోని ప్రతి అణువునూ అమృతంలో ముంచివేసేలా దర్శనమైనది. అప్పుడు స్వామి అన్నాడు "అమ్మా! నీవిపుడు దర్శించిన రూపాన్ని నిరంతరమూ ధ్యానించు. త్వరలో నీవు అజ్ఞానాంధకారాన్ని దాటి, నా సాయుజ్యం పొందగలవు. ఈ కొడుకులిద్దరూ, నూరేండ్లు సుఖంగా జీవించి, మిమ్ములను భక్తితో సేవిస్తారు. వీరికి విద్య, సంపద, కొడుకులు, మనుమలు – అన్నీ పుష్కలంగా సమకూరుతాయి. వీరుగూడ లోకవంద్యులౌతారు".

ఆ సోదరులిద్దరూ శ్రీపాదస్వామిని భక్తితో స్తుతిస్తుంటే వారితో ఆయన "మీరు తల్లిదండ్రులను ప్రత్యక్షదైవాలుగా భావించి సేవించి తరించండి. నేను సన్యసించెదను" అని చెప్పి, తన తల్లిదండ్రులకు ముమ్మారు ప్రదక్షిణంచేసి, వారి అనుజ్ఞ తీసుకుని వెంటనే సన్యసించారు.

విద్యాసాగరా! శ్రీపాద శ్రీవల్లభుడు తన యోగశక్తితో, మనోవేగముతో ప్రయాణించి పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రం అయిన కాశీ చేరెను. అచ్చట అజ్ఞాతవాసిగా కొంతకాలం సాధన గావించుకొని, నరనారాయణుల

తపోభూమియైన బదరికాశ్రమమును చేరి అనేక సంవత్సరములు అచట దీర్ఘ తపస్సుచేసి, దక్షిణాపథమునకు బయలుదేరి, శివుని ఆత్మలింగము శ్రీ గణేశునిచే ప్రతిష్ఠ గావింపబడినచోట, అరేబియా సముద్రతీరంలో ఉత్తర కర్ణాటకలోని గోకర్ణక్షేత్రమును చేరెను. అచ్చట మూడు సంవత్సరములుండి, అచ్చటి జనులకు తమ దివ్యమైన లీలలు చూపి, వారికి యోగమార్గమును ప్రబోధించి, తమ ధర్మ ప్రచారం ప్రారంభించిరి. అచ్చటినుండి అనేక గ్రామములలో ప్రబోధం గావించుచూ, శృంగేరి చేరి శారదాదేవిని దర్శించి, అచ్చట కొంతకాలం అనుష్ఠానం చేసుకొని, ప్రజలకు ధర్మ ప్రబోధం చేసి అచ్చట నుండి శ్రీశైలక్షేత్రం (జ్యోతిర్లింగము) చేరిరి. అచ్చట నాలుగు మాసములుండి, అచ్చటనుండి కర్ణాటక, ఆంధ్రరాష్ట్రముల సరిహద్దులలో కృష్ణానది–భీమానదుల సంగమం (నివృత్తి సంగమం)లో స్నానమాచరించి కృష్ణానది మధ్య లంకగానున్న 'కురువపురం' అను ప్రదేశం చేరి దానిని తమ తపోభూమిగా చేసుకొనిరి. వారు అచ్చట అనేక దివ్యమైన లీలలు ప్రదర్శించి తాము దత్తావతారము అని జనులకు పరోక్షంగాను, స్వప్న దర్శనం ద్వారాను తెలియజేసిరి. అచ్చట శ్రీవారిని కలియుగావతారముగా జనులు గుర్తించి, శ్రీదత్తగురువే ఈ రూపమున వచ్చినారని విశ్వసించి పూజింపసాగిరి. శ్రీపాద శ్రీవల్లభులు భక్తుల మనోభీష్టము లన్నియు నెరవేర్చుచుండిరి.

కురువపురమున నొక బ్రాహ్మణ దంపతులకు సంతాన నష్టము కలుగుచుండెను. తుదకు వారికొక కుమారుడు కలిగెను. కాని అతడు స్వచ్ఛమైన వాక్కు లేక ఉపనయనమైన పిదప కూడా తండ్రి పలికిన మంత్రములు పలుకలేడాయెను. తండ్రి శిక్షింపసాగెను. కాని తల్లి బాలుని హింసింపనీయలేదు. అట్లుండగనే ఆ బ్రాహ్మణుడు మరణించెను. అతని భార్య భిక్షమెత్తి బాలుని పోషింపసాగెను. యుక్తవయస్సు వచ్చినను అతనికి పిల్లనిచ్చుటకు ఎవరూ యిష్టపడనందున అతనికి వివాహమగుట కష్టమయ్యెను. ఇరుగుపొరుగువారు అతనిని గేలిచేయసాగిరి. తుదకు తల్లి, కుమారులు నదిలో దూకి ఆత్మహత్య చేసికొన నిశ్చయించి కృష్ణానదికేగిరి. అచట శ్రీపాద శ్రీవల్లభులు వారి దీనచరిత్ర విని ఆ తల్లికి శివుని ప్రదోష పూజావ్రతము చేసికొన్న మరుసటి జన్మమున తనవంటి కుమారుడు కలుగునని చెప్పుచూ, మందమతియైన యువకుని శిరమున తన అమృతహస్తముంచిరి. అంత ఆ యువకుడు జ్ఞానవంతుడై, వేదశాస్త్రముల పఠించి, ప్రకాశించి, వివాహమాడి పుత్ర పౌత్రుల పొంది సుఖపడెను. అతని తల్లి ప్రదోషములందు శివుని పూజించెను.

శ్రీపాద శ్రీవల్లభులు నిత్యము కృష్ణానదియందు స్నానము చేసినంతనే రజకుడొకడు వారి వెంటనే యుండి వారి వస్త్రములనుతికి వారికి నమస్కరించి భక్తితో సేవించుచుండెను. స్వామివారతనికి రాజరికము బహుమతిగా నిచ్చెదనను చుండిరి. ఆ నదియందు విహరించుచున్న యొక మహమ్మదీయ రాజును చూచి, అతడు ఆ రాజు వైభవము తనకు కూడ కలిగిన బాగుండునని తలచెను. అది గ్రహించిన స్వామివారతనిని మరుసటి జన్మమున బీదర్‌ను పాలించు మహమ్మదీయ రాజుగ జన్మించునట్లు ఆశీర్వదించిరి. అతని కోరికపై తాము తమ మరుసటి యవతారమున శ్రీ నరసింహ సరస్వతిగా దర్శనమిచ్చెదనని వాగ్దానమొనర్చిరి. ఇట్లెన్నియో మహాత్మ్యములను చేసి శ్రీపాద శ్రీవల్లభస్వామివారు ఆశ్వయుజ బహుళ ద్వాదశినాడు హస్తా నక్షత్రమందున కృష్ణానదియందు శరీరమును అంతర్ధాన మొనరించిరి. వారి పాదుకలు వారి తపోస్థానమైన కురువపురమునందు ప్రతిష్ఠింపబడి యున్నవి. వారు యిప్పటికినీ భక్తులకు దర్శనమిచ్చుచు వారి అభీష్టములను నెరవేర్చుచున్నారు.

కురువపురమున భక్తులు వారిని త్రిమూర్తి స్వరూపులగు శ్రీ దత్తాత్రేయులుగా పూజించుచుండిరి. వారి జన్మస్థానమైన పిఠాపురమున కూడ నొక దత్తాత్రేయ మందిరము నిర్మించబడి యున్నది. దీనిని కూడ భక్తులు దర్శించి పూజించుచున్నారు. ఇచ్చట శ్రీపాద శ్రీవల్లభ మహాసంస్థానము కూడ కలదు. ఈ సంస్థానము వారు నిత్య పారాయణము చేయు భక్తులకు ఉచిత వసతిని కలిగించుచున్నారు. “విద్యాసాగరా! సతీ అనసూయకు జన్మించి శరీరమును ధరించిన శ్రీదత్తుడే తిరిగి అనేక యుగముల తరువాత, ఈ కలియుగములో ఆంధ్రదేశములో సుమతీ మాతకు జన్మించి శ్రీగురు సంప్రదాయమును పునరుద్ధరణ చేసినారు. వారు యింకను అధికంగా ఈ సంప్రదాయాన్ని ప్రచారం చేయ సంకల్పించి ఈ అవతారం పరిసమాప్తం చేసి తిరిగి మహారాష్ట్రలోని అకోలా జిల్లాలో కరంజ గ్రామంలో సతి అంబమాత గర్భంలో జన్మించాలని సంకల్పం చేసినారు” అని నిత్యానందుడు తెలిపినాడు.

***“దిగంబర దిగంబర శ్రీపాదవల్లభ దిగంబర”***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఎనిమిదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం ఓం గురుదేవదత్త
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## తొమ్మిదవ అధ్యాయము

### శ్రీ దత్తాత్రేయస్వామి 'ద్వితీయ అవతారం'
### శ్రీ స్వామి నరహరి నరసింహ సరస్వతి

విద్యాసాగరుడు శ్రద్ధా భక్తులతో వినయంగా "పరమపురుషా! యోగిరాజా! శ్రీ దత్తాత్రేయుల మొదటి అవతార కథను తెలిపినారు. రెండవ అవతారం ఎప్పుడు ఎలా జరిగినది! వారు ఏయే లీలలను ప్రదర్శించారు? ఆ గురు సార్వభౌముని, భగవంతుని లీలలు మీరు చెబుతూ వుంటే వినాలనే కోరిక నాలో పెరుగుతున్నదేగాని తరగడంలేదు. మహాత్మా! ఆ రెండవ అవతార విశేషాలు వివరించండి" అని ప్రార్థించగా, నిత్యానందునికి ఇటువంటి శ్రద్ధాళువైన శ్రోత లభించినందులకు సద్గురుని లీలలను తనివితీరా వివరించి చెప్పు అవకాశం లభించినది. ఇటువంటి అదృష్టానికి పొంగిపోయి నిత్యానందుడు "విద్యాసాగరా! దీనుల నుద్ధరించడానికి తనను తాను దత్తం చేసుకున్న పరమేశ్వరుని చేతలు యోగీశ్వరులకు కూడా ఊహించశక్యంగానివి. కనుక నేనెంత వర్ణించినా అగాధమైన ఆ కథలలో లవలేశమే అవుతుందిగాని, వారి లీలలన్నీ చెప్పినట్లు కాదుసుమా! అయినా యిక వినుము"అని యిలా చెప్పారు.

శ్రీగురు చరిత్రలోని 11వ అధ్యాయం నుండి శ్రీ స్వామి నరసింహ సరస్వతి చరిత్ర కలదు. శ్రీపాద శ్రీవల్లభుల ఆదేశానుసారం అంబిక తన జీవిత శేషమంతా శివపూజలో గడిపినది. ఆమె మరుజన్మలో మహారాష్ట్రలోని విదర్భలో అకోలా జిల్లాలో కరంజ అను గ్రామంలో వాజసనేయ శాఖకు చెందిన ఒక సద్బ్రాహ్మణుని కుమార్తెగా జన్మించినది.

 

తల్లిదండ్రులామెకు 'అంబ' అని నామకరణం చేశారు. ఆమెకు పూర్వజన్మ సంస్కారం వలన సౌశీల్యంతోబాటు శివభక్తి కూడ అబ్బినది. ఆమెకు యుక్త వయస్సు రాగానే అదే గ్రామంలోని మాధవశర్మ అనే బ్రాహ్మణోత్తమునికిచ్చి వివాహం చేశారు. అతడు మంచి శివభక్తుడు. ఆ ప్రాంతంలోని స్మార్తులకు శివవ్రతం చేసుకునే అలవాటుండేది. గనుక వారిని శివవ్రతులంటారు. పూర్వజన్మ సంస్కారానికి తోడు ఈ జన్మలో భర్తయొక్క సత్సాంగత్యమువలన ఆమె ప్రతిదినము సంధ్యాసమయంలో శివపూజ, భర్తతో కలసి శనిప్రదోష పూజ, శని త్రయోదశినాడు విశేషపూజ చేస్తుండేది. విశేషించి అంబ తన భర్తను, సూర్యుణ్ణి ఛాయాదేవివలె విడనాడక సర్వోపచారాలు చేస్తుండేది. ఇలా 16 సంవత్సరములు గడిచాక అంబ గర్భవతి అయినది. మాధవశర్మ సకాలంలో పుంసవనాది కార్యక్రమం నిర్వర్తించాడు. నెలలు నిండిన తరువాత మహిమాన్వితమైన ఒక శుభలగ్నంలో ఆమెకొక మగబిడ్డ కలిగాడు.

విద్యాసాగరా! ఆ పిల్లవాడు పుట్టగానే అందరి పిల్లలవలె ఏడ్వలేదు సరిగదా! స్పష్టంగా ప్రణవముచ్చరించాడు. అది విన్నవారు ఆశ్చర్యపోయారు. జ్యోతిశ్శాస్త్ర విద్వాంసులు అతని జాతకం చూసి "మాధవశర్మా! నీ భాగ్యం పండింది. ఆ శిశువు సాక్షాత్తు భగవంతుడే! ఇతడు మనవలె గృహస్థాశ్రమం స్వీకరించడు. చిన్నవయసులోనే సన్యాసం స్వీకరించి జగద్వంద్యుడౌతాడు. ఇతని చరణాలు ధ్యానించిన భక్తులకు కామధేనువౌతాడు. ఇతని దర్శనంచేతనే పతితులు పావనులవుతారు. ఇతనిని కన్నందువల్ల మీకు కీర్తిప్రతిష్ఠలు, దివ్యసుఖాలు లభిస్తాయి"అని దైవజ్ఞులు చెప్పారు. మాధవశర్మ ఆ విద్వాంసులను ఘనంగా దక్షిణ తాంబూలాలతో సత్కరించాడు. వారు శెలవు తీసుకుంటూ "మాధవశర్మా! ఈ బాలునికి శ్రీ సిద్ధులు దాస్యం చేస్తాయి. నవనిధులు పరిచారికలవుతాయి"అని ఆశీర్వదించారు.

ఆ బాలుడు పుట్టిన వెంటనే ప్రణవముచ్చరించిన సంగతి వాడవాడలా ప్రాకిపోయి, అతనిని చూడటానికి జనం యిసుకవేస్తే రాలనంతగా వచ్చారు. పిల్లవానికి దృష్టిదోషం తగులకుండా తండ్రి రక్షాబంధనం చేయించాడు. తల్లి అతనికి ఉప్పు, మిరియాలు, ఎండుమిరపకాయలు, వేపాకులతో దృష్టి తీసేది. తర్వాత ఒక సుముహూర్తంలో ఆ పిల్లవానికి 'శాల గ్రామదేవ' అని పేరుపెట్టారు. కాని ఇంట్లో అందరూ అతనిని 'నరహరి' అని పిలుచుకునేవారు. నరులంటే



అజ్ఞానబద్ధులైన మానవులు. హరి అంటే మానవుల అజ్ఞానం వలన కలిగిన దైన్య, తాప, పాపాలను పోగొట్టేవాడని అర్థం. ఆ పేరు ముందుగానే ఆయన అవతారపురుషుడని సూచిస్తున్నట్లున్నది.

బలహీనంగా వుండడంవలన, అంబవద్ద పిల్లవానికి చాలినన్ని పాలులేవు. పిల్లవానికోసం ఒక దాదినిగాని, పాడి మేకనుగాని ఏర్పాటుచేయాలని ఆ దంపతులాలోచిస్తూ వుండగా ఆ పిల్లవాడు తన చిన్నారి చేతులతో తల్లియొక్క వక్షస్థలాన్ని స్పృశించాడు. వెంటనే ఆమెకు స్థన్యం పెల్లుబికి, 32 ధారలుగా కారి నేలపై పడ్డాయి. ఆ విషయం అందరికీ తెలిస్తే బిడ్డకు దృష్టిదోషం తగులుతుందని వెఱచి అంబ యీ లీలను రహస్యంగా వుంచింది. ఆ పిల్లవాడు ఊయలలో పడుకోబెడితే ఏడ్చేవాడు. నేలపై పడుకోబెడితే ఆడుకొనేవాడు. ఇలాంటి లీలలెన్నో జరిగినప్పటికీ తల్లి వాటిని ప్రకటించలేదు. అందువలన ఆ ప్రభువుయొక్క సంపూర్ణమైన దివ్యత్వం అందరికీ తెలియలేదు.

ఇలా సంవత్సరము గడిచినా, అతనికి ఒక్క మాటగూడా రాలేదు. కులదేవతల నారాధించమని కొందరు, రావి ఆకుల విస్తళ్ళలో బ్రాహ్మణులకు భోజనం పెట్టించమని కొందరూ చెప్పారు. మాటలు చెబుతూ అతనిచేత అన్పించడానికి యత్నిస్తూంటే క్రమంగా వస్తాయని కొందరూ, అతను మాత్రం మాటలొచ్చినా కొంతకాలం తరువాతే మాట్లాడతాడని మరికొందరూ అనేవారు. వారందరి మాటలు విని నరహరి నవ్వేవాడు. ఎవరేమడిగినా 'ఓం' అన్నదే అతని సమాధానం. ఆ సంగతి విని కొందరు పెద్దలు "ఇతడు మాటలు వినగలుగుతున్నాడు. గనుక ఇతడు చెవిటివాడు కాదని స్పష్టమవుతున్నది" అనేవారు. 'అతడు మూగవాడైతే అంత స్పష్టంగా ఓం అనడం సాధ్యంకాదు. అతడు మాటలొచ్చిగూడ ఎందుకో మాట్లాడడం లేదు' అని కొందరు తల్లికి ధైర్యం చెప్పేవారు. ఆమె ఎవ్వరేది చేయమని చెప్పినా అలా చేసేది. తమ కులదైవమైన దత్తస్వామికి ప్రత్యేక పూజలు చేసేది.

ఇలా నరహరికి ఏడవ సంవత్సరం వచ్చింది. కాని అతడు మాట్లాడనేలేదు. బాలుడు మూగవాడౌతాడని తల్లిదండ్రులెంతో కలత చెందారు. ఒకనాడు అంబ అతని పరిస్థితికి కంటతడిపెట్టింది. అదిచూచి నరహరి సైగలతో ఆమెను వారించి, ప్రక్కనే వున్న యినుప వస్తువును తెప్పించి అది తాకాడు. తక్షణమే అది బంగారంగా మారింది. ఆశ్చర్యంతో తల్లిదండ్రులు మరికొన్ని

యినుప వస్తువులను అతనిచేత తాకించారు. అవికూడా బంగారంగా మారాయి. తమ పిల్లవాడు సామాన్యుడు కాదని, ఆజన్మసిద్ధుడనీ వారు గుర్తించారు. అయినప్పటికీ ఆ దంపతులు అతడు మాట్లాడకపోవడం గురించి దిగులు పడుతూనే వుండేవారు. అతడు వేదాధ్యయనం చేసి స్వధర్మాన్నెలా పాలించగలడన్నదే మాధవశర్మకున్న దిగులు. తల్లి ఒకరోజు అతనిని అక్కున జేర్చుకుని కన్నీరు కారుస్తూ, "నా తండ్రీ, నీ మాటలు విని ఆనందించే భాగ్యం మాకులేదా?" అన్నది. అది విని నరహరి నవ్వి, తనకు ఉపనయనం చేస్తే మాట్లాడుతానని, మొట్టమొదటిసారిగా ఆమెతోనే మాట్లాడుతాననీ సైగలద్వారా తెలిపాడు. ఆ సంగతి విని మాధవశర్మ ఆశ్చర్యపడి, అతని ఉపనయనానికి ఒక శుభముహూర్తం నిర్ణయించి, ఊరివారినందరినీ ఆహ్వానించాడు. గ్రామస్థులందరూ అతడి ఆశలు అడియాశలై, నలుగురిలో తలవంపులకు గురిఅవుతాడని తలచారు. కొందరు పెద్దలు మాత్రం 'అయ్యా! ఆ పిల్లవాడు గాయత్రీ మంత్రం ఉచ్ఛరించగలిగితే మనకేమి, లేకపోతేనేమి? మనకు మాత్రం మృష్టాన్న భోజనము, ఘనంగా దక్షిణ తాంబూలాలూ లభిస్తాయి గనుక ఈ ఉపనయన కార్యక్రమం జరుపుకోనివ్వండి' అన్నారు. అందరూ ఉపనయనానికి మాధవశర్మ ఇంట సమావేశమయ్యారు.

నరహరి ముండనము, మాతృభోజనము అయ్యాక జింకచర్మము, పసుపు వస్త్రము ధరించాడు. చెవిలో గాయత్రీ మంత్రము ఉపదేశించినపుడు నరహరి ఆ మంత్రరాజాన్ని మనసులోనే జపించి దీక్ష తీసుకున్నాడు. తర్వాత అతడు తల్లికి నమస్కరించి, ఆమెను 'భవతీ భిక్షాందేహి!' అని భిక్షకోరి, మొట్టమొదట ఆమెతోనే మాట్లాడుతానని తల్లికి తానిచ్చిన మాట నిలబెట్టుకున్నాడు. తల్లి మొదట భిక్ష యిచ్చి "ఋగ్వేదం పఠించు, ఆచారం పాటించు" అనగానే నరహరి 'అగ్నిమీళే పురోహితం' అని ప్రారంభించి ఋగ్వేదంలోని మొదటి మంత్రం చెప్పాడు. అంబ రెండవసారి భిక్ష యిచ్చి "యజుర్వేదం పఠించు, ఆచారం పాటించు"అనగానే నరహరి "ఇషేత్వా" అని ప్రారంభించి యజుర్వేదంలోని మొదటి మంత్రం పఠించాడు. తల్లి మూడవసారి భిక్షయిచ్చి "సామవేదం పఠించు, ఆచారం పాటించు" అనగానే నరహరి 'అగ్ని ఆయాహి' అని ప్రారంభించి సామవేదంలోని మొదటి మంత్రం గానంచేశాడు.

అది వినగానే తల్లిదండ్రుల ఆనందానికి, సభలోని వారి ఆశ్చర్యానికి



అవధులు లేవు. జీవితంలో మొదటిసారిగా మాట్లాడడం ప్రణవోచ్చారణ, తర్వాత వేదపఠనంతో గాని చేయకూడదని నరహరి అంతకాలమూ మాట్లాడలేదని అందరూ అనుకున్నారు. మూడు భిక్షలు అయ్యాక, ఆయన భగవదవతారమని తెలుసుకుని అచ్చటి బ్రాహ్మణులంతా నమస్కరించారు. సర్వశాస్త్రాలకూ జన్మస్థానమైన ఆ ప్రభువుకు యిది ఒక లెక్కలోనిదికాదు.

క్రతువు పూర్తిగావచ్చింది. మాధవశర్మ దంపతులు అమితోత్సాహంతో వున్నారు. వామనునివలె భాసిస్తున్న ఆ నూతన బ్రహ్మచారి నరహరిని తల్లి ఆశీర్వదించి "నాయనా! ఇకనుంచి నీవు భిక్షతోనే జీవించాలిసుమా!" అన్నది. వెంటనే అతడు తల్లికి నమస్కరించి "అమ్మా! నీ ఆజ్ఞమేరకు నేను భిక్షువునవుతాను. నేను సన్యాసాశ్రమం స్వీకరించడానికి అనుమతించండి" అని తండ్రివైపు తిరిగాడు. ఆ మాటలకాతల్లి నివ్వెరబోయి దుఃఖిస్తూ "నాయనా! ఒక్కగానొక్క మగబిడ్డవు. మేము 16 సంవత్సరములు ఎంతగానో ఎదురుచూసి, ఎన్నో వ్రతాలాచరించాక పుట్టావు. తర్వాత 7 సంవత్సరములు నీవు మాట్లాడనేలేదు. ఇంతకాలానికి పరమేశ్వరునికృపవలన నేను చేస్తున్న పూజలు, వ్రతాలు ఫలించి ఈరోజే మొదటిసారిగా నీ మాటలు వినగలిగాను. అందుకు నేను సంతోషిస్తూండగా నీవిలా అంటావేమి? అప్పుడే నీవు యిల్లు విడిచిపోతే మా గతేమిటి? నీవు గృహస్థువై బిడ్డలు కలిగిన తరువాత సన్యసించవచ్చుగదా!" అని బ్రతిమాలింది.

అప్పుడు నరహరి తల్లిని కౌగలించుకొని ఓదార్చి "అమ్మా! నా మాట విను, వివేకంతో ఆలోచించి ఈ వ్యర్థమైన దుఃఖాన్ని తొలగించుకో, నేను ధర్మరక్షణ కోసం అవతరించాను. నీకింకా నల్గురు బిడ్డలు కలిగి ప్రేమతో మీ సేవచేస్తారు. వెనుకటి జన్మలో నీవు నిష్ఠతో శంకరుణ్ణి పూజించడంవలననే నేను నీ గర్భాన జన్మించాను" అని చెప్పి ఆమె శిరస్సుపై తన చేతినుంచి ఆశీర్వదించాడు. వెంటనే ఆమెకు తన పూర్వజన్మ స్మృతి కలిగింది. అతడు శ్రీపాద శ్రీవల్లభుడుగా దర్శనమిచ్చాడు. ఆమె ఆనందంతో పరవశించి అతని పాదాలపైబడి యిలా అన్నది "స్వామీ! పూర్వజన్మలో కుపుత్రవతినైన నేను ఆత్మాహుతికి పాల్పడినప్పుడు రక్షించిన శ్రీపాదుడవు నీవే! బ్రహ్మాండాలన్నీ నీలోనే వున్నాయి. అట్టి నీవు నా గర్భాన పుట్టినందువలన నా భర్తృవంశము, పితృవంశము పావనమయ్యాయి" అన్నది.

అతడామెను లేవదీసి "అమ్మా! ఈ పూర్వ వృత్తాంతము వెల్లడిచేయవద్దు. నీకొక రహస్యం చెబుతాను గుప్తంగా వుంచు. నేను సంసారమంటని సన్యాసిని. నేను చేయవలసిన తీర్థాటనము మొదలైన కార్యాలెన్నో వున్నాయి. అవి నేను ప్రకటింప వీలులేనివి, రహస్యమైనవి. ఈ కర్తవ్యం నాకు తప్పదు. నేనీయింట్లో వుండుటకు వీలుపడదు. కనుక నీవు అనుమతి ప్రసాదించు" అన్నాడు.

అప్పుడా తల్లి పుత్రవాత్సల్యంతో యిలా అన్నది "నాయనా! నీవు లోకానికి ధర్మం చెబుతావుగదా! మరి నీవు 12 సంవత్సరములు బ్రహ్మచర్యం అవలంబించాక గృహస్థువై, బిడ్డలు కలిగాక సన్యసించి లోకానికి ఆదర్శం చూపాలిగదా! ఇలా క్షణికావేశంతో సన్యాసం స్వీకరిస్తే వాసనాక్షయమవక మానవులు పతితులవుతారని శాస్త్రాలు హెచ్చరిస్తున్నాయిగదా!" అని బ్రతిమాలింది. అపుడు వటువైన నరహరి, అలనాడు కపిలుడు తల్లికి జ్ఞానోపదేశం చేసిన విధంగా, ఆమెకు తత్త్వమిలా బోధించాడు.

"అమ్మా! భౌతికమైన శరీరాలు, వైభవము అశాశ్వతాలే. మరణంలేని వాడంటూ ఎవడూ లేడు. మృత్యుదేవత యెప్పుడూ జీవితాన్ని వెంటనంటే వుంటుంది. యువకులకైనా, వృద్ధులకైనా ఈ శరీరము ఎప్పుడు రాలిపోతుందో తెలియదు. అప్పిచ్చినవాడు తానిచ్చిన గడువు ఎప్పుడు తీరుతుందా అని లెక్కపెట్టుకున్నట్లు, మృత్యుదేవతగూడ మానవ జీవితకాలాన్ని లెక్కబెడుతుంటుంది. రాత్రి, పగలు అన్నవి మానవుని ఆయుర్దాయాన్ని ఎగురగొట్టుకొని పోతుంటాయి. ఈ శరీరము, భార్యాబిడ్డలు, గృహము, ధనము, జీవితము అశాశ్వతమని మరచి, అవే ప్రధానమనుకుని జీవించేవారు పశువులవంటివారు. కనుక ధర్మాచరణ యొక్కటే మానవుల కర్తవ్యం. అలాగాక మృత్యువును జయించినవారు మాత్రమే నీవు చెప్పినట్లు విరామంగా జీవించవచ్చు. కాని మానవులు కొద్దినీరు మాత్రమే ఉన్న సరస్సులోని చేపలవంటివారు. ఆ కొంచెం నీరూ ఇంకిపోయాక వాటి గతేమిటి?

ఈ కలియుగంలో మానవునికి నూరేండ్లు ఆయుర్దాయం. అందులో సగకాలం నిద్రలోనూ, బాల్యము, పరాధీనతలవల్ల కొంతకాలమూ గడచిపోతుంది. ఇట్టి జీవితంలో ప్రాప్తించే సంపద క్షణకాలముండి వాడిపోయేది. కాలచక్రం గర్భంలోని పిండములను, శిశువులను, బాలురను, యువకులను, విజ్ఞులను, దేవతలను సర్వజీవులనూ మ్రింగివేస్తుంది. దేనిమీదైనా మమకారం



పెట్టుకోవడం ఆత్మవంచనే. దుఃఖాన్ని కోరి తెచ్చుకోవడమే అవుతుంది. బయట చర్మం, లోపల మాంసము, ఎముకలూ, రక్తమూగల ఈ శరీరము నీటిబుడగ వంటిది. శరీరము జడము, నశ్వరమూ. ఆత్మ చిత్స్వరూపము, శాశ్వతము. దానికి సుఖదుఃఖాలు లేవు. ఉన్నాయనుకోవడం అజ్ఞానం మాత్రమే. సద్గురు కటాక్షంవలన మానవుడీ మాయను దాటాలి. ఉత్తమమైన మానవజన్మమెత్తిగూడ ఆత్మకు శ్రేయస్సు చేకూర్చుకోనివాడే నిజమైన ఆత్మవంచకుడు, ఆత్మఘాతకుడు, బ్రహ్మఘాతకుడు కూడా. అమ్మా! ఈ మాట సామాన్యుల విషయంలోనే యింత వాస్తవమైతే, కారణజన్ముడనైన నాకేది కర్తవ్యం.

విషయసుఖాలు వదలలేని వారికి నీవుచెప్పినట్లు గృహస్థాశ్రమం తర్వాత సన్యసించడమనే క్రమం తగియున్నది. నాకట్టి విషయ వాసనలే లేవు గనుక ధీమంతుడనైన నాకు ఎట్టి విఘ్నాలూ రాజాలవు. నేను బ్రహ్మచర్యాశ్రమము నుండే సన్యాసం తీసుకుంటాను. నన్ను ధ్యానిస్తూండు సంసారాన్ని దాటగలవు!" అని యశోదకు బాలకృష్ణుడు చూపినట్లు తన దివ్యరూపాన్ని దర్శింపజేశాడు. ఆయన ప్రసాదించిన యోగదృష్టితో ఆమె ఆ మూర్తిని కన్నులారా దర్శించి యిలా అన్నది. "స్వామీ! నీవు పుట్టుక లేనివాడవు. బ్రహ్మాండాలన్నీ నీలోనే వున్నాయి. బ్రహ్మకు కూడ నీ గుణరూపాలు కొంచెమైనా తెలియరానివి. మాయా మోహితురాలనైన మానవ స్త్రీని, నాకెలా తెలుస్తాయి? ఈ జ్ఞానమైనా నీవనుగ్రహించినదే! నీవు సత్యసంకల్పుడవు. నీ సంకల్పానికి నేను అడ్డుచెప్పను. లోకహితం చేయడానికే అవతరించిన నిన్ను నా పుత్రుడని తలచి యింట కట్టిపెట్టుకోవడం తగదు. అయితే నీ దివ్యమైన ఆకారం నా మనస్సులో స్థిరంగా నిలిచేటట్లు అనుగ్రహించు. నాకింకా పుత్రులు కలుగుతారన్నావు. మాకింకొక్క బిడ్డ పుట్టేవరకైనా నీవిక్కడే వుండు. అప్పటివరకు సన్యసించడానికి నేననుమతించను. నీవు నా మాట వినకుండా వెళ్ళిపోతే నేను మరణిస్తాను. నిన్ను విడిచి నేను బ్రతకలేను" అని ప్రార్థించింది. అప్పుడు నరహరి "అమ్మా! నీకొక సంవత్సరంలోగా కవలలు పుడతారు. అంతవరకూ ఉంటానుగాని ఆ తరువాత నా సంకల్పానికి అడ్డుచెప్పగూడదు!"అని ఆమెవద్ద మాటతీసుకున్నాడు.

అతడు పరమేశ్వరుడన్న జ్ఞానంతో స్వామిని, ఆ దంపతులు నిత్యమూ అర్చిస్తూండేవారు. చతుర్వేద పారంగతులు, షట్శాస్త్ర నిపుణులూ గూడ ఆయనవద్ద విద్యార్థులై కృతార్థులయ్యారు. ఆయన ఎందరికో వేదాలు

బోధించారు. పామరులకు ఆయన ధర్మసూక్ష్మాలు చెప్పేవారు. ఇలా సంవత్సరం గడిచేసరికి అంబకు యిద్దరు మగ కవలపిల్లలు పుట్టారు. వారికి మూడు నెలలు రాగానే ఒకరోజు అంబ పిల్లలనాడిస్తుంటే నరహరి వచ్చి "అమ్మా! నేను చెప్పినట్లే వీరిద్దరూ పుట్టారు. నీకింకా యిద్దరు కొడుకులు, ఒక కూతురు కలుగుతారు. నీకోరిక ఫలించింది. నా మాట నిలబెట్టుకున్నాను. కనుక నీవిచ్చిన మాట ప్రకారం నాకనుమతి యిస్తే నేను తీర్థయాత్రలకు బయలుదేరుతాను. అయితే నీవుమాత్రం నన్ను సంతోషంగా సాగనంపాలి!" అన్నారు. అప్పుడు తల్లిదండ్రులిద్దరూ ఆయనకు నమస్కరించి "మేమింతవరకూ మాయలో తగుల్కొని, నీవు మా బిడ్డవనే భ్రాంతితో ఎప్పుడైనా నిష్ఠూరాలాడివుంటే మమ్మల్ని క్షమించు. నీవే మా కులదైవమని యిప్పుడు తెలుసుకున్నాము. నీవు మా వంశాన్నుద్ధరించడానికి యిక్కడ జన్మించావు. నీవు మా రక్తమాంసాలు పంచుకొనడం ద్వారా మా దేహాలుగూడా పవిత్రమైనాయి. ఇకముందు మా గతేమిటి? మీ దర్శనం మాకింకెప్పటికీ లేకుంటే మేమెలా జీవించగలము?" అన్నారు. అప్పుడు నరహరి "మీరెల్లప్పుడూ నన్ను ధ్యానించండి. మీకిక జన్మ వుండదు. అమ్మా! నీకు నన్ను చూడాలని వుంటే నన్ను స్మరిస్తే తక్షణమే నీకు నా దర్శనమవుతుంది. 30 సంవత్సరముల తరువాత నేను మళ్ళీ మీ వద్దకు వస్తాను!" అని చెప్పాడు.

అలా తల్లిదండ్రుల అనుమతి తీసుకొని ఆయన తలపై శిరస్త్రాణము, కౌపీనము, కాషాయాంబరము, చేత దండమూ ధరించి చిరునవ్వు లొలికిస్తూ మహాసంతోషంగా బయలుదేరాడు. ఆ దృశ్యం చూసిన జనం "తొమ్మిది సంవత్సరముల పిల్లవాడు ఇల్లు విడిచి పోవడానికి ఆ తల్లి ఎలా అనుమతిస్తున్నది?"అని ఆశ్చర్యపోయారు. కొందరు "ఈయన అవతారమూర్తి. ఈయనను కన్న తల్లిదండ్రులు ధన్యులు" అన్నారు. సాధువులు ఆయన భగవంతుడనే భావంతో నమస్కరించారు. ఆ గ్రామస్థులందరూ కొంతదూరం వెళ్ళి ఆయనకు వీడ్కోలు చెప్పి తిరిగి వెళ్ళాక, తల్లిదండ్రులు మరికొంతదూరం ఆయనవెంట వెళ్ళారు. అక్కడ వారికి నరహరి కర్పూరమువలె తెల్లగానున్న తన దత్తాత్రేయ స్వరూపము, తర్వాత శ్రీపాద రూపములతో దర్శనమిచ్చారు. అది తమ శనిప్రదోష పూజ ఫలితమేనని తలచి, ఆ తల్లిదండ్రులు, "మా జన్మలు ధన్యమయ్యాయి. మీరు దయతో మాకు మళ్ళీ దర్శనమివ్వాలి" అని



వేడుకోగా, ఆయన "తప్పక మళ్ళీ దర్శనమిస్తాను!" అని మాటయిచ్చి, వాళ్ళను వెనుకకు పంపాడు. ఆ దివ్య ప్రభావంవలన వారు తమ పుత్ర వ్యామోహం మరచి, భక్తిభావంతో వెనుకకు వెళ్లారు.

నరహరి బదరీనాథ్ దిక్కుగా బయల్దేరి, దారిలో "ఆనందకాననము" అనబడే వారణాసి పట్టణం చేరారు. మొదట ఆయన గంగలో స్నానంచేసి, ఆత్మస్వరూపమైన విశ్వనాథుని దర్శించారు. తర్వాత అచట ఒక యోగ్యమైన స్థలంలో వజ్రాసనం వేసుకుని, ప్రాణవాయువు కుంభించి, ఖేచరీ ముద్రలో నాదాను సంధానపరులై కూర్చున్నారు. ఆయన నిత్యమూ మూడు వేళలా మణికర్ణికా ఘట్టానికి వెళ్ళి శ్రద్ధగా గంగాస్నానం చేసి వస్తూండేవారు. ఆ క్షేత్రంలో వున్న తపస్వులు, మునులు, సాధువులు ఆయనను చూసి ఆశ్చర్యచకితులయ్యారు. యవ్వనంగూడ పూర్తిగా రాకముందే అంతటి వైరాగ్యము, కఠోరమైన తపస్సు చూసి ఆయన యోగపూర్ణుడని తెలుసుకుని నమస్కరిస్తూండేవారు. అచ్చటి యతులలో వృద్ధుడూ, శ్రేష్ఠుడు అయిన కృష్ణ సరస్వతి ఆయనకు భక్తితో నమస్కరిస్తూండేవారు. ఆయన సాక్షాత్తూ అవతార పురుషుడని, సన్యాసమార్గాన్ని పునరుద్ధరిస్తాడని, ఆయన విశ్వగురువైనప్పటికీ లోకోద్ధరణకోసం మాత్రమే ఆదర్శప్రాయుడైన సాధకునిలా తపస్సు చేస్తున్నాడని, కనుక ఆయన వయస్సులో చిన్నవారైనా జ్ఞానంలో వృద్ధులే గనుక ఆయనకు యతులుగూడ నమస్కరించవచ్చుననీ కృష్ణ సరస్వతి చెబుతుండేవారు. చివరకు ఆ కృష్ణ సరస్వతీస్వామి ఆదేశానుసారం ఆయన శిష్యులు నరహరి వద్దకు వెళ్ళి నమస్కరించి "స్వామీ! మీరు పరమేశ్వరులేగాని, మానవమాత్రులుగారు. సజ్జనులనూ, ధర్మాన్నీ ఉద్ధరించడానికి భూమిపై అవతరించారు. శ్రీ ఆదిశంకరులు స్థాపించిన సన్యాసమార్గం దాదాపు లుప్తమైంది. దానిని మరల మీరే నిర్దిష్టంచేసి విస్తరింపజేయాలి. అధికారులు కానివారికి ఈ మార్గము భయంకరమైనదైనా బుద్ధిమంతులకు సులభంగా ఆత్మానందమిచ్చే ఈ సన్యాసమార్గాన్ని మీరు పునరుద్ధరించాలి. సన్యాసులమైన మేము యిప్పుడు మిమ్ములను సేవిస్తే లోకనింద ఏర్పడుతుంది. కనుక మీరుగూడ సన్యసిస్తే మేముగూడా మీ సేవ చేసుకొనవచ్చు" అని ప్రార్థించారు.

నరహరి వారి ప్రార్థనను మన్నించి సత్సంప్రదాయ సముద్ధరణ కొరకు శ్రీ కృష్ణ సరస్వతీ పాదులను గురువుగా స్వీకరించి, శాస్త్ర పద్ధతిన వారివద్ద



సన్యాసం స్వీకరించారు. అపుడు గురువిచ్చిన దీక్షానామం 'శ్రీ నృసింహ సరస్వతి' తర్వాత ఆయన కొంతకాలం కాశీపట్టణంలో వుండి మానవులకు నాలుగు పురుషార్థాలనూ ప్రసాదించగల వేదార్థాన్ని భక్తులకు ప్రవచించారు.

తర్వాత శ్రీగురుడు తాము స్వయంగానే పవిత్రులైనప్పటికీ అనేక పుణ్యతీర్థాలు దర్శిస్తూ బదరికాశ్రమం చేరారు. తర్వాత ఆయన మేరుపర్వతానికి ప్రదక్షిణగా సంచరిస్తూ, సర్వక్షేత్రాలూ దర్శిస్తూ, పుణ్యతీర్థాలలో స్నానంచేస్తూ శిష్యులతో కలసి గంగాసాగర సంగమం చేరారు. ఆయన మొదట గంగకు ప్రదక్షిణంగా ప్రయాగవరకూ తటయాత్ర చేశారు. అదికూడా గంగా ప్రదక్షిణతో సమానమే. అందుకే ప్రయాగనుకూడా గంగాసాగరమంటారు. ప్రయాగలో వారికి ఎంతోమంది శిష్యులయ్యారు. ఆ క్షేత్రంలో మాధవుడనే బ్రాహ్మణుడికి శ్రీగురువే స్వయంగా తత్త్వముపదేశించి సన్యాసమిచ్చారు.

***"జయ జయ నరసింహ సరస్వతీ***
***జయ జయ దత్తావధూత నమః"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***తొమ్మిదవ అధ్యాయము*** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం
శ్రీగురు దేవదత్త!
శ్రీ స్వామి సమర్థాయ నమః

దిగంబరా! దిగంబరా!
శ్రీ నరహరి నరసింహ సరస్వతి దిగంబరా!

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పదవ అధ్యాయము

### శ్రీ నరహరి నరసింహ సరస్వతి లీలలు

విద్యాసాగరా! శ్రీ స్వామివారు అనేక ప్రదేశములను దర్శించుచూ దేశమంతా తిరిగినారు. వారు తమ జన్మస్థానమైన 'కరంజపురము'ను చేరినారు. వారి రాక తెలిసి, వారి లీలలు, వారి మాహాత్మ్యము తెలిసిన ఆ గ్రామస్థులు వారిని వేరువేరుగా కలసి ఒకరికి తెలియకుండా మరియొకరు తమ ఇంటికి భిక్షకు పిలిచినారు. స్వామివారు వారందరి కోరికను మన్నించి అలాగే వస్తామని మాట ఇచ్చినారు. స్వామివారు ఒకే సమయంలో అన్ని రూపములను ధరించి, ఆ గ్రామ ప్రజలందరి ఇళ్ళకు వెళ్ళి భిక్షను స్వీకరించినారు. కొంతసేపటికి ఈ వింత విషయము ఊరిలోని వారందరికి తెలిసి ఆశ్చర్యపోయినారు. సూర్యభగవానుడు ఒక్కడే అయినా నీరుగల అన్ని సముదాయములలో ఏలాగున అగుపడునో అలాగే స్వామి అందరు భక్తులకు అనేకములుగా విభజింపబడి దర్శనము యిచ్చారు.

శ్రీ స్వామివారి ముఖ్య శిష్యులు ఏడుగురు. బాలసరస్వతి, కృష్ణసరస్వతి, ఉపేంద్ర సరస్వతి, మాధవ సరస్వతి, సదానంద సరస్వతి, జ్ఞానజ్యోతి సరస్వతి, సిద్ధపురుషుడు (సరస్వతి) - కరంజ గ్రామములోని వారంతా స్వామిని దత్తావతారంగా గుర్తించి పూజింపసాగిరి. స్వామివారి తల్లి తనకు సద్గతిని కల్గింపుమని ప్రార్థింప స్వామి "అమ్మా! ఎవరి వంశములోనైనా ఒకరు సన్యసిస్తే అతని ముందు ఆ వంశములో జన్మించిన 21 తరాలవారు ముక్తులగుదురు.

అందువలన నేను నీ గర్భమున పుట్టి సన్యసించి యుండుటచేత నీకు తప్పక మోక్షం కలుగుతుంది. నీవు ఈ సంసార సుఖమును పొంది, బిడ్డలతో, మనుమలతో కాలమును గడిపి కాశీక్షేత్రం చేరి శివునిలో ఐక్యం కాగలవు" అని పలికి వారందరివద్ద శెలవు తీసుకుని, అందరినీ దీవించి – బయలుదేరబోగా – స్వామి తరువాత పుట్టిన సోదరి స్వామిని తనకు ధార్మిక జీవనం కావాలని కోరగా, స్వామి "నీవు పూర్వజన్మలో ఒక గోవు మరణానికి కారకురాలివైనావు. అందువలన అది ఈ జన్మలో నిన్ను బాధించగలదు. నీకు కుష్ఠువ్యాధి రాగలదు. అందుకు భయపడవలదు. ఆ సమయంలో నేను "భీమా అమరజా" సంగమంలో వుంటాను. అక్కడి నదిలో స్నానం చేయగా నీకు కుష్ఠువ్యాధి నివారణ కాగలదు" అని దీవించిరి. అక్కడినుండి నాసిక్ చేరి అక్కడ ద్వాదశ జ్యోతిర్లింగములలో ఒకటైన త్రయంబక క్షేత్రమున మృత్యుంజయ లింగమును దర్శించి, గోదావరి జన్మస్థానము దర్శించి అందు స్నానముచేసి గౌతమీ తీరంలోని క్షేత్రములను దర్శించుచు, మంజరీకంలో మాధవారణ్యుడనే మునికి దర్శనమిచ్చి అతనికి ముక్తిమార్గం ప్రబోధించి, వారిచే పూజాది సత్కారములను పొంది శిష్యసమేతంగా గోదావరీ తీరంలోని 'బ్రహ్మేశ్వరక్షేత్రం' చేరినారు. ఇదియే ఇప్పటి 'బాసర'. ఇచ్చట వ్యాసముని తపస్సు చేసినారు. వారిచే ప్రతిష్ఠింపబడిన సరస్వతీదేవి మందిరము కలదు. స్వామివారు నదీతీరములో వుండగా, శూలవ్యాధితో బాధపడు బ్రాహ్మణుడు ఒకడు ఆత్మహత్య చేసుకొనబోగా, స్వామి వానిని రక్షించి, అచ్చటగల గ్రామాధికారి ఇంట భిక్షచేసి ఆ బ్రాహ్మణునికి విందుభోజనముతో ఆరోగ్యమును, సద్బుద్ధిని కలిగించిరి. 'సాయందేవుడు'అను గ్రామాధికారిని ఆ రాజ్యపాలకుడు అయిన యవనరాజు వలనగల ఆపదలను తొలగించి, కాలాంతరమున తనను భీమా అమరజా సంగమమున కలుసుకొనమని ఆదేశించిరి. వైద్యనాథ క్షేత్రమునకు చేరి, శిష్యులందరిని యాత్రలు చేయుమని అందరము 'శ్రీశైల' క్షేత్రమున కలుసుకొనగలమని ఆదేశించి పంపిరి. సిద్ధుడు ఒక్కడు మాత్రం స్వామి చెంత వున్నాడు. స్వామి ఆ క్షేత్రమున కొంతకాలము నివసించి, బయలుదేరి కృష్ణానదీ తీరంలో 'బిల్లవాడి' క్షేత్రానికి చేరుకొనినారు. ఆ క్షేత్రములో భువనేశ్వరీదేవి వెలసినది. కృష్ణానదికి పశ్చిమ తీరంలో ఒక 'ఔదుంబర వృక్షం' క్రింద స్వామివారు జపతపానుష్ఠానాలను చేస్తూ వుండిపోయారు. కరవీర నగరంలో ఒక పండితునికి ఒక కుమారుడు కలిగినాడు. వాడు ఎంత ప్రయత్నించినా చదువు అబ్బలేదు. తండ్రి



మరణించినాడు. ఇతనికి ఎవరూ లేని కారణమున ఆ వూరివారి ఆదరణ తగ్గినది. వారందరు అతనికి ఏవగించుకొనసాగిరి. అందువలన అతడు బాధపడి కృష్ణానది తూర్పుతీరంలో వున్న భువనేశ్వరీదేవి మందిరమునకు వచ్చి, అచ్చట మూడు రోజులు ఉపాసించి, ఆ దేవిని ప్రార్థింప, అవతలి తీరములో వున్న స్వామివారిని శరణుకోరుమని సలహా యిచ్చినది. ఆ బాలుడు ఆవలితీరముచేరి, పిమ్మట శ్రీ నరహరి నరసింహ సరస్వతిని దర్శించి, స్వామివారి పాదములపై వాలి – స్వామి కరుణాభిక్షతో పండితుడయ్యెను. గురువు అనుగ్రహం వుంటేనే సరస్వతీ అనుగ్రహం కలిగేది.

అక్కడనుంచి శ్రీగురుడు నరసింహవాడి క్షేత్రానికి చేరినాడు. అక్కడ 12 సంవత్సరములు వుండిరి. ఇది కృష్ణా–పంచ గంగ నదీ సంగమము. “శివ – భద్ర – కుంభీ – భోగవతీ – సరస్వతీ నదులు కృష్ణానదిలో కలియుచోటు ఇక్కడి మేడిచెట్టు (ఔదుంబరము) ఉన్నది. అది భక్తుల పాలిట కల్పవృక్షముగ భాసిల్లుచున్నది. స్వామి నరసింహ సరస్వతి ఇక్కడుండగా అమరపురం గ్రామంలో భిక్షకు వెళ్ళుచుండేవారు. ఆ గ్రామంలో ఒక బీద బ్రాహ్మణునికి ఇంటికి భిక్షకై వెళ్ళిన శ్రీగురుడు వారికి ఆధారమైన తంబచెట్టు తీగను పెళ్ళగించి వెళ్ళిపోయెను. బ్రాహ్మణ దంపతులు బాధపడి దానిని తిరిగి నాటుదామని ఆ ప్రదేశంలో త్రవ్వగా వారికి అందు గొప్ప నిధి దొరుకుతుంది. ఈ విధంగా స్వామి అనుగ్రహముతో వారి దారిద్ర్యం తీరి, భాగ్యవంతులై స్వామిని సేవించినారు. శ్రీగురుడు మేడిచెట్టు క్రింద యుండగా 64 మంది యోగినులు స్వామిని నిత్యం దర్శించి తమ స్థానమునకు తీసుకొనిపోయి, వారిని పూజించి సేవింపసాగిరి. ఈ విషయం గంగానుజుడు అనేవాడు చూచి చాలా ఆశ్చర్యపడినాడు. మరుసటి రోజున కూడ యోగినులతో స్వామివారు వెళ్ళుచుండగా వాడుకూడా వెళ్ళి అక్కడ స్వామికి జరుగు ఉపచారములను దర్శించి ఆనందపడినాడు. శ్రీగురుడు ఈ విషయం గ్రహించి అతనిని ఆశీర్వదించి ఈ విషయము ఎవ్వరికిని తెలియనివ్వవద్దని ఆదేశించినాడు. వాడు స్వామి శిష్యుడై సేవింపసాగినాడు. ఒకనాడు మాఘమాసంలో వాడు స్వామిద్వారా మాఘమాస ఫలితము, యాత్రా ఫలితము, నదులలో స్నానం చేయు విషయములు తెలుసుకొనెను. స్వామి నరసింహ సరస్వతి అక్కడ ‘నయన పాదుకలను’ ప్రతిష్ఠించి, వానిని పూజించుటకై బ్రాహ్మణుల నియమించి, ఆ యోగినీగణములను దానియందు సదా నివసించుడని, అచటికి వచ్చు

భక్తుల ఈతిబాధలను నివారించుచుండుమనిరి. స్వామి వారిని ఇచట సేవించిన శిష్యులు, శిరోల గ్రామవాసి గంగాధరుడనే వేదపండితుని భార్యను జన్మాంతర రుణముల నుండి కాపాడి రక్షించినారు. ఆమెకు సంతానమును ప్రసాదించినారు. అందులో ఒకడు ఏడు సంవత్సరముల వయసులో మరణింపగా ఆమె స్వామిని కోరగా వానిని బ్రతికించిరి. అక్కడినుండి భీమ–అమరజా సంగమమునకు జేరిరి. ఇది అతిపవిత్రమైన స్థానం. ఈ సంగమములో స్థూలంగా రెండు నదులు కలిసినట్లున్నా అనేక సూక్ష్మ తీర్థాలు వున్నాయి. శ్రీ స్వామివారు అక్కడ గుప్తంగా నివసింపసాగారు. మధ్యాహ్న సమయములో భిక్షకోసం పరిసర ప్రాంతాలలో తిరుగుతుండేవారు. గాణుగాపురం (గంధర్వపురం) సంగమానికి అతిదగ్గరలోనున్న గ్రామం. ఆ గ్రామంలో 100 బ్రాహ్మణ కుటుంబాలు వున్నాయి. అందులో ఒకడు అతి బీదవాడు. అతని ఇల్లాలు పతివ్రత. వారికి ఒక గొడ్డు గేదె వుండేది. ఆ వూరివారు దానిని పనులకొరకు తీసుకొనివెళ్ళి ఏదో కొంత రుసుము యిచ్చేవారు. దాని సహాయంతోను, భిక్షాటనతోను జీవించుచుండిరి. ధనము దొరకని రోజున తులసితీర్థము తీసుకొని పరమాత్మ స్మరణతో గడిపేవారు. వారు నిరంతరము శ్రీదత్తదేవుని పూజించుచుండువారు. శ్రీగురుడు వారింటికి భిక్షకు వచ్చినారు. ఆ ఇల్లాలు స్వామిని ఆదరముగా ఆహ్వానించి, సేవించి, పూజించి, స్వామితో – తన భర్త గ్రామంలోనికి భిక్షకు వెళ్ళినారని, వారు రాగానే మీకు భిక్ష ఇవ్వగలను, కొంచెం సమయము దయతో వేచి యుండుడని కోరినది. చాలా సమయము గడచినను ఆ బ్రాహ్మణుడు రాలేదు. స్వామి "అమ్మా! మధ్యాహ్న భోజన సమయము దాటిపోవుచున్నది. మీ శ్రీవారు రాలేదు. గేదెపాలు యిప్పించు చాలు!" అనగా ఆ ఇల్లాలు బాధపడి కనులనుండి నీరు కారుచుండగా "స్వామీ! మీకు తెలియనిది ఏమున్నది. మేము కడుపునిండా భోజనంగాని, పాలు పెరుగు త్రాగడానికి ఈ జన్మలో నోచుకోలేదు. మీరు చూచుచున్న ఈ గేదె పాడిగేదె కాదు. దానిని బాడుగకు త్రిప్పి కుటుంబ జరుగుబాటు పొందుచున్నాము. ఈ దినమున దానిని ఎవరూ తీసుకొని పోలేదు" అనగా, స్వామి మనసు జాలినిపొంది ఆమెతో "నీవు పాలు పితుకుము. అది ఎందుకివ్వదో నేను చూడాలి" అనగా, ఆమె దానిని గురుని ఆజ్ఞగా భావించి గేదె పాలు పితుకగా ధారాపాతంగా పాలు వచ్చాయి. రెండు కడవలు నిండిపోయాయి. ఆమె అమితమైన ఆనందముతో వారికి పాలను నైవేద్యముగా సమర్పించినది. స్వామి పాలు త్రాగుచుండగా ఆమె భర్త ఇంటికివచ్చి



జరిగినది తెలుసుకొని స్వామి పాదములకు సాష్టాంగ నమస్కారము చేసినాడు. స్వామి ఆ దంపతులను దీవించి సంగమమునకు వెళ్ళిరి. నాటినుండి వారి దారిద్ర్యము తీరిపోయి సుఖమందిరి. ఈ లీల గ్రామములో తెలిసి వారందరు స్వామివారి మహిమ తెలుసుకొని వారిని పూజింపసాగిరి. ఈ విషయము ఆ ప్రాంతపు రాజుకు తెలిసి ఆయన స్వామిని దర్శించి వారిని గ్రామములోనికి తెచ్చి ఒక మఠము నిర్మించి యిచ్చెను. ఆ మఠము నిర్మించు స్థలములో ఒక బ్రహ్మరాక్షసుడు వుండేవాడు. వానిని స్వామి అనుగ్రహించిరి. ఆ మఠంలో వుండగానే అనేకమందికి స్వామి అనుగ్రహం కలిగినది. స్వామి నిత్యం సంగమమునకు వెళ్ళి స్నానమాచరించి, అనుష్ఠానం చేసుకొని వచ్చేవారు. కొంతకాలం గడచినది. శ్రీగురుని దర్శించి అనేకమంది అనేక విధముల లాభములను పొందుచుండిరి. ఈ విషయములన్నీ దూరప్రాంతములకు వ్యాప్తించెందినవి. శ్రీగురుని అద్భుత లీలలను, జనులు మరీమరీ చెప్పుకొనెడివారు. ఆ కాలములోనే 'కుమసీ' గ్రామమందు త్రివిక్రమభారతి అనే యతిపుంగవుడు వుండేవాడు. అతడు శ్రీ నరసింహస్వామి అవతారమును అనుష్ఠాన దేవతగా వుంచుకొని సాధన చేసికొనుచుండెను. అతడు సామాన్య సాధువు. ఇతనికి శ్రీగురుని లీలలు తెలిసినవి. అతను సాధువులు ఇలా మహాత్మ్యములు చూపరాదు. అవి కేవలము గారడీ విద్యలు అని శ్రీగురుని కార్యములను నిందించెను. గాణుగాపురములోనున్న శ్రీగురునికి 'కుమసీ' గ్రామములోని త్రివిక్రమభారతి అంతరంగము తెలిసి వానికి జ్ఞానోదయము చేయదలచి తామా గ్రామమునకు బయలుదేరిరి. శ్రీగురుని ఆదేశముమీద రాజు సమస్త రాజలాంఛనాలతో అందమైన పల్లకిని ఏర్పాటు చేసిరి. వీరందరు ఆ గ్రామమునకు బయలుదేరిరి. 'కుమసీ' గ్రామములోని త్రివిక్రమభారతికి ఆ రోజున మనస్సున ఏకాగ్రత కుదరలేదు. ఏదో అపచారము జరిగినదని మనసునకు అనిపించసాగినది. అయినా ఆయన తన ఆరాధ్యదైవమైన శ్రీ నరసింహస్వామిని తెలియక ఏదైనా అపచారము చేసిన మన్నించమని ప్రార్థింపసాగినాడు. అతనికి శ్రీ నరసింహస్వామికి బదులు శ్రీగురు దర్శనము కాసాగింది. అతడు ఎంత ప్రయత్నించినను తన దైవమునకు బదులు శ్రీగురుడు కనిపించెను. ఇలా వుండగా గ్రామములో శ్రీగురుడు వచ్చుచున్నారన్న కోలాహలం వినిపించినది. త్రివిక్రమభారతి బయటికి వచ్చి చూడగా స్వామివారి పరివారమంతా కనబడింది. కాని ఆశ్చర్యకరంగా వారందరూ శ్రీగురు నరసింహ




సరస్వతి రూపంలోనే వున్నారు. రాజు, సేవకులు అందరూ శ్రీగురుని రూపమున కన్పించిరి. త్రివిక్రమభారతికి వారు సాక్షాత్తు భగవదవతారమే యను విశ్వాసము కలిగినది. తన అపరాధమును మన్నించమని శరణు వేడాడు. "గురుదేవా! మీ విషయములో నేను తప్పుగా భావించినాను. క్షమించండి, మీరు జగద్గురువులు, నేను శిష్యుడను, శిష్యుని తప్పును మన్నించడం గురు ధర్మంగదా! నా అజ్ఞానాన్ని మన్నించి నాకు పరమార్ధ జ్ఞానం ప్రసాదించండి" అని వేడుకొన్నాడు. వెంటనే శ్రీగురుడు తన నిజస్వరూపముతో దర్శనమిచ్చినారు. రాజు, సేవకులు పల్లకిని మోసేవారందరు మామూలుగానే కన్పించసాగిరి.

అంత శ్రీగురుడు అతనికి ముక్తిమార్గముపదేశించి, అతని పూజలందుకొని తిరిగి గంధర్వనగరము చేరినారు. ఆ కాలంలో వైధూర్య నగరాన్ని ఒక మహమ్మదీయుడు పరిపాలించేవాడు. అతడు బ్రాహ్మణద్వేషి. వీలున్నప్పుడల్లా బ్రాహ్మణ పండితులను అవమానింప ప్రయత్నిస్తుండేవాడు. అహంకారులైన ఇరువురు బ్రాహ్మణులు, వేదపండితులై యుండి విజ్ఞానము లేక ఆ రాజువద్దకు వచ్చి వానిని దర్శించినారు. రాజు వారిని విశేషములేమి? అనగా, "రాజా! మేము వేదపండితులం. వేద విజ్ఞానమంతా శోధించినాము. మమ్ములను ఎవరూ గెలువలేరు, కావాలంటే వేదపండితులను ఆహ్వానించి సభ చేయండి" అని తెలిపిరి. అజ్ఞాని, అహంభావియైన రాజుకు ఆ విషయము చాలా ఆనందము కలిగించింది. మంచి వినోదము అనుకొని తన దేశములోని వేదపండితులను అందరినీ ఆహ్వానించి సభ చేసినాడు. ఆ సభలో వీరు వితండవాదము చేసి, వచ్చిన పండితులను అవమానము చేసిరి. రాజు చాలా ఆనందపడి, వారు గెలిచినారని ప్రకటించి వారికి సన్మానము చేసెను. అలా ఆ రాజు చేసిన సన్మానమునకు ఆనందపడిన ఈ వేదపండితులు "రాజా! ఇక్కడకు రాకుండా ఇంకా ఎందరో పండితులు దేశంలో కలరు. మేము వెళ్ళి వారినందరినీ గెలిచి జయపత్రములను తేగలము!" అని అనుమతిపొంది రాజలాంఛనాలతో కొంత పరివారమును, సేవకులను, దానికి కావలసిన ధనమును తీసుకొని అనేక ప్రాంతములలో పర్యటించి, అచటగల పండితులను జయించి, విజయ పత్రములను స్వీకరించి 'కుమసీ' గ్రామమునకు వచ్చి, అచటి త్రివిక్రమభారతిని గురించి తెలుసుకొని వారివద్దకు వచ్చి అతనిని తమతో వాదము చేయమని కోరిరి. అందులకు త్రివిక్రమభారతి వారి ఉద్దేశ్యమును గ్రహించి, "నేను కేవలము తపమే చేసుకొనువాడను, పండితుడను కాను. అందువలన నాతో మీకు



వాదమేల?" అని పలుకగా వారు "వాదించు లేదా అపజయాన్ని అంగీకరించి జయపత్రమును ఇవ్వమని బలవంతము చేయసాగిరి. త్రివిక్రమభారతి వీరిని శ్రీగురుని దగ్గరకు తీసుకొని వెళ్ళి వారిచేత గుణపాఠం చెప్పించాలని తలచి "మీతో వాదులాడుటకు నేను తగను, మా గురుదేవులు ఈ ప్రాంతములోని గాణుగాపురంలో వున్నారు. వారే మీకు సమాధానం చెప్పగలరు. రండి!" అని వారిని గాణుగాపురం తీసుకొని వెళ్ళిరి.

నేరుగా శ్రీగురుని మఠం చేరుకొని వారికి పాదాభివందనము చేసి, ఈ ఇరువురు బ్రాహ్మణుల విషయం వివరింపగా – శ్రీగురుడు వారినిచూసి "ఓయీ! వేదములు అనంతములు, వానిని పూర్తిగా పఠింప ఎవరిశక్యమూ కాదు. దేవాదిదేవులే వానిలోని కొద్దిభాగములను పఠించెదరు. మహర్షులకు కూడా సాధ్యముకానిది మీకు సాధ్యమైనదాఏమి? అటుల గర్వింపగలదు" అనగా, వారు "ఇవన్నీ మాటలేల? మాతో వేదముల గురించి వాదించమనగా స్వామి కోపంతో "ఓయీ! మీతో వాదింపనేనేల? అదిగో అలా వెళుతున్న దళితుడు చాలును. అని ఆ దారిని పోతున్న దళితుని పిలిచి వానికి పూర్వజన్మ జ్ఞానము ప్రసాదించి, విభూతితో విజ్ఞానవంతుని చేసెను. ఆ బ్రాహ్మణులు ఆశ్చర్యపోవునట్లు ఆ దళితుడు వేదమంత్రములను పఠించెను. అద్భుతమైన ఈ చమత్కారమునకు ఆ వేదపండితులు భయకంపితులైరి. తమను క్షమింపుమని శ్రీగురుని శరణుకోరిరి. అప్పుడు స్వామి "మీరు చేసిన పాపములకు బ్రహ్మరాక్షసులు కండి!" అని శపించినారు. స్వామి విభూతి మహాత్మ్యమును బ్రాహ్మణులకు ప్రబోధించిరి. మాహూరపురమునందు గోపీనాథుడు అనే వానికి దత్తాత్రేయస్వామి అనుగ్రహమువలన ఒక కుమారుడు జన్మించెను. అతనికి దత్తుడు అని పేరు పెట్టినారు. అతనికి యుక్తవయసు రాగా 'సతి' అనే అమ్మాయితో వివాహము జరిపిరి. వారి దాంపత్యము కొన్ని రోజులైనా గడువకమునుపే దత్తునికి క్షయరోగము వచ్చినది. సతి తన భర్త అనారోగ్యంతో నుండగా అతనికి పరిచర్యలు చేసి ఎంతో ప్రేమగా చూచి సేవించేది. క్రమక్రమంగా అతని ఆరోగ్యం క్షీణించినది. శ్రీగురు నరసింహసరస్వతిని గురించి తెలిసిన ఆమె, దత్తాత్రేయుడే ఆ స్వామియని ఆయన వద్దకు తన భర్తను తీసుకొని గాణుగాపురం పొలిమేరచేరి, అక్కడివారిని శ్రీగురుడు ఎక్కడ వున్నారు అని అడుగగా – సంగమంలో యున్నారని తెలుపగా, ఆమె తన భర్త పల్లకిని అక్కడికి తీసుకొని వెళ్లబోగా, ఇంతలోనే దత్తుడు శరీరం వదిలినాడు. ఆమె అది గ్రహించి, పల్లకి



అక్కడే నిలిపి, స్వామిని అనేక విధముల స్తోత్రించి, ప్రార్థించుచు విలపించినది. శ్రీగురుడు ఒక యోగీశ్వరునివలె ఆమెకు ధర్మోపదేశము కావించెను. ఆమె సతీసహగమనము చేయబోగా, ఆ యతి ఆమెకు రుద్రాక్షమాలను ఇచ్చి, అది భర్తకు ధరింపజేయుమని, భస్మమునుకూడ ధరించమనెను. ఆ తరువాత శ్రీగురుని దర్శింపుమని తెలుపగా ఆమె అలాగే చేసెను. శ్రీగురుని దర్శింపగా ఆమెను 'అష్టపుత్రవతీభవ' అని దీవించిరి. ఆ తర్వాత ఆమె భర్త చనిపోయినది తెలుసుకొని, ఆ శవమును తమ సన్నిధికి తెప్పించిరి. శ్రీగురుని పాదతీర్థము ఆ శవముపై ప్రోక్షించగానే శ్రీగురుని కృపాదృష్టితో ఆ బ్రాహ్మణుడు జీవించి ఆరోగ్యవంతుడయ్యెను. ఆ దంపతులు స్వామిని సేవించి తరించిరి.

విద్యాసాగరా! శ్రీగురుడు ఇట్లు ఎన్నియో లీలలు చూపించి, భక్తులకు పరమ ధర్మమును ప్రబోధించిరి. భాస్కరుడు అను బ్రాహ్మణుని ద్వారా అతడు కేవలము ముగ్గురికి సరిపడు పదార్థములను తేగా వానితో వేలాదిమందికి భోజనము ప్రసాదించినారు. స్వామి వాక్కు అక్షయమైనది. అంతేకాదు, సోమనాథశాస్త్రి, గంగాదేవి అనే వృద్ధ దంపతులు స్వామివద్దకు రాగా వారికి స్వామి అనుగ్రహంతో ఉత్తమ సంతానము కలిగించారు. నరహరి అనువానికి కుష్ఠురోగమును నివారించిరి. తన సోదరి రత్నబాయికి పాపపరిహారార్థము స్నానము చేయించి, ఆమె కుష్ఠురోగమును నివారించిరి. సాయందేవునికి ధర్మోపదేశములను గావించి, అనుగ్రహించి, వానిచే అనంత పద్మనాభ వ్రతమును చేయించిరి. ఒక సాలెవానికి గాణుగాపురం నుండి అదృశ్యశక్తితో శ్రీశైలయాత్ర గావించిరి. నంది అను బ్రాహ్మణునికి కూడ కుష్ఠురోగము నివారించిరి.

శ్రీ నరసింహ సరస్వతి కామధేనువులాగ కోరిన వరాలనిచ్చుటయేకాదు, భక్తుల మనోరథమును ఎరింగి, వారిని అనుగ్రహించెడివారు. వారు ఇట్టి అనేక లీలలను చూపించి, గాణుగాపురం నుండి శ్రీశైల క్షేత్రము చేరి అచట కదళీఫల వనమునకు చేరిరి.

***"జయ జయ పరమహంస పరివ్రాజకాచార్య***
***శ్రీశ్రీశ్రీ నరహరి నరసింహ సరస్వతి గురు మహరాజ్"***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***పదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
శ్రీగురు దేవదత్త!

శ్రీ స్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పదకొండవ అధ్యాయము

### శ్రీ దత్తాత్రేయస్వామి అవతారం - శ్రీ మార్తాండ మాణిక్య ప్రభువు

"విద్యాసాగరా! శ్రీ దత్తావతార పరంపరలో శ్రీ నరసింహ సరస్వతి, అక్కల్‌కోట స్వామిగా అక్కల్‌కోట చేరుటకు ముందు దేశమంతటా పర్యటించుచుండగా అవతరించినవారు మార్తాండ మాణిక్య ప్రభువులు. వారు అపర దత్తావతారంగా వెలుగొందినారు. వారుకూడా అనేకమైన దివ్యలీలలను ప్రదర్శించినారు. చెబుతాను విను అని చెప్పసాగిరి.

కర్ణాటక, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రముల కూడలియైన గుల్బర్గా జిల్లాలో మాణిక్య నగరము వీరి తపోభూమి. వారి సంస్థానము అదియే. గుల్బర్గా - కళ్యాణి - బీదరు అను మూడు నగరముల మధ్యలో మణిచల అను త్రికోణాకార పర్వతము మీద ఈ సంస్థానము విరాజిల్లుతున్నది.

19వ శతాబ్దిలో కళ్యాణి నగరమునకు దగ్గర అద్వంతిలో 22-12-1817వ సంవత్సరమున శ్రీ మనోహర నాయకులు - శ్రీమతి బయాదేవి అను దంపతులకు ద్వితీయ కుమారులుగా ఈశ్వరనామ సంవత్సర మార్గశిర శుద్ధ చతుర్దశి మంగళవారమునాడు 'శ్రీ మాణిక్య ప్రభువులు' జన్మించిరి. ఆనాడే దత్తాత్రేయ జయంతి. వీరికి తల్లిదండ్రులు 'మాణిక్య' అని నామకరణము చేసిరి. కాని బంధువులు, మిత్రులు అందరు వీరిని 'రత్న' అని పిలుచుచుండిరి. మానవునిగా జన్మించిన వీరు మానవాతీత, అద్భుత, అతి

మానస క్రియలను ప్రదర్శించి చెప్పకనే తాము దత్తావతారులమని తెలుపు చుండెను. వారి లీలలు చూచి వీరిని ప్రజలు దత్తావతారులని గుర్తించి పూజింపసాగిరి.

వీరి తల్లిదండ్రులకు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. వారిలో మాణిక్య ప్రభువు రెండవవాడు. మొదటివారి పేరు హనుమంత్ (దాదా మహరాజ్), మూడవవారి పేరు నరసింహం. కుమార్తె కలిగిన కొలది కాలమునకే వీరి తండ్రి మనోహర నాయకుడు మరణించినాడు.

శ్రీ మాణిక్య ప్రభువులు ఎవ్వరివద్దను చదువుకొనలేదు. వీరు స్వయంగా ప్రకాశమాన విద్యావైభవోపేతులు. వీరి తండ్రిగారైన మనోహర నాయకుడే తన కుమారునికి ఉపనయనము చేసి గాయత్రీ మంత్రోపదేశము చేసిరి. అక్షరాభ్యాసమును కూడా చేసినారు. చిన్నతనము నుండి శ్రీ మాణిక్య ప్రభువులు మానవాతీతమైన లీలలను ప్రదర్శించేవారు. ఎల్లకాలము అడవులలో తిరుగుచూ పశుపక్ష్యాదులతో కాలం గడిపేవారు. అవధూత రూపమైన శ్రీ దత్తుడు యదుమహారాజుకు తెలిపిన విధముగా చిన్న, పెద్ద తారతమ్యం లేక సృష్టిలోని సర్వ పదార్థముల నుండి తాము జ్ఞానమును సంపాదించితిమని శ్రీ ప్రభువులు చెప్పేవారు, అలాగే నడచుకొనేవారు.

వారు చిన్నవయసులో వుండగానే వాని సహచరుడు గోవిందుడను యాదవుల పిల్లవాడు ఎప్పుడూ శ్రీ ప్రభువుల వారితో తిరుగువాడు. ఒకనాడు అకస్మాత్తుగా చనిపోయినాడు. మామూలుగా తనతో రాని గోవిందుని కొరకు వాని ఇంటికి వెళ్ళిన ప్రభువులను చూడగనే వాని తల్లిదండ్రులు బంధువులు బిగ్గరగా ఏడ్వసాగిరి. అపుడా ప్రభువు గోవిందా – గోవిందా"యని బిగ్గరగా పిలిచెను. నిద్రనుండి లేచినవానివలె, గోవిందుడు లేచి ప్రభువువెంట వెళ్ళిపోయాడు.

చనిపోయిన వానిని బ్రతికించిన ప్రభువుయొక్క అద్భుతశక్తి – అద్భుత వార్త అంతటా వ్యాపించినది. దీనిని తెలిసిన వారందరు శ్రీప్రభువుయొక్క ఈ లీలను చెప్పుకొని, ప్రభువు దైవస్వరూపులని, సామాన్యమైన బాలుడు కాదని వారిని దర్శింపసాగిరి.



మరియొక సందర్భములో శ్రీ ప్రభువు మామిడిపండ్లు అమ్మే ఒక స్త్రీని చూచి మామిడిపండ్లు ఇమ్మని కోరెను. అందులకు ఆ స్త్రీ నీకు ఎన్నిపండ్లు కావాలి అని అడిగినది. శ్రీ ప్రభువు మేము స్నేహితులం పదకొండుమందిమి ఉన్నామని అన్ని పండ్లు కావాలని అడిగెను. ఆ స్త్రీ పదకొండు పండ్లు యిచ్చినది. కాలక్రమమున ఆమెకు ఐదు మంది సంతానం వరుసగా కలిగిరి. ఆమె ప్రభువు దగ్గరకు వెళ్ళి సంతానము ఇక నాకు చాలును, మీరు ఇచ్చిన వాగ్దానము అనుగ్రహము యిక విరమించండి అని ప్రార్థించెను. ప్రభువు ఆమెకు అభయమిచ్చినారు. అటు పిమ్మట ఆ స్త్రీకి సంతానము కలుగలేదు. ప్రజలందరు వేడాభావ్ (పిచ్చి సోదరుడు) చెప్పినది జరుగునని వీరిని వేడాభావ్ అని పిలువసాగిరి.

మరియొకసారి శ్రీ ప్రభువువారు కళ్యాణి నగరమునకు కొద్దిదూరంలో ఉన్న సదానంద మఠంవద్ద పిల్లలతో ఆడుకొనుచుండగా, అప్పారావు అను ఒక బ్రాహ్మణుడు నిజాం ప్రభుత్వ సైన్యమునకు చెందినయొక అరబ్బుల కంపెనీలో జమాదారుగా ఉద్యోగం చేయుచుండెడివాడు. అతని భార్యపేరు భీమాబాయి. వారు చాలా ధనవంతులు. అయినా సంతానము లేక బాధపడుతున్నారు. వారికి ప్రభువు గురించి తెలిసి, వారి దర్శనము చేయ సంకల్పించి, భీమాబాయి భర్త అనుమతి పొంది, ఒక పల్లకినెక్కి హైద్రాబాదు నుండి కళ్యాణి నగరమునకు బయలుదేరినది. ఆమె వెంట దాసీ జనము, సిపాయిలు సహాయంగా బయలుదేరిరి. వారు ప్రభువు ఆడుకొను స్థలమునకు చేరగనే, అక్కడ ప్రభువు ఒక పిల్లవాడితో తగవులాడు చుండెను. వారు తగవులాడుట చూచి భీమాబాయి పిల్లలపైన ఉండు సహజ ప్రేమతో సిపాయిలను పంపి వారు ఎందులకు తగవులాడుచున్నారో తెలుసుకొని తగవును ఆపమనెను. సిపాయి వారివద్దకు వెళ్ళి కలహమునకు కారణమడుగగా, అంతవరకు దెబ్బలు తినుచున్న బాలుడు ముందుకు వచ్చి, "మేము బాలురము, మేము తగవులాడుకొనెదము. మాతో నీకు ఏమిపని? నీకు నిజముగా తగవును నిలిపివేయవలయుననే కోరిక వున్నచో, నేను వీరికి ఎనిమిది గవ్వలను బాకీ పడితిని. ఆ పల్లకిలోని స్త్రీ నాకు ఎనిమిది గవ్వలు యిచ్చిన యెడల ఆమెకు




ఎనమండుగురు బిడ్డలు కలిగెదరు" అని ఆ బాలుడు పలికెను. సిపాయి భీమాబాయికి ఈ విషయమును తెలిపెను. ఆమె అది శుభసూచకమని, బాలవాక్కు బ్రహ్మవాక్కు అని సంతసించి గవ్వలనిచ్చుటకు త్వరపడెను. కాని ఆమెవద్ద నాణెములు – రూపాయలే కలవు. కాని గవ్వలు లేవు. ఆమె గవ్వలకు బదులు రూపాయలను ఇచ్చెదనని అనగానే ఆ బాలుడు "నాకు రూపాయలతో ఏమిపని. గవ్వలే కావలెను" అని పలికెను. అంత ఆమె గవ్వలకొరకు అందరినీ విచారించి పల్లకీ మోయువానివద్దనుండి తీసుకుని ఆ బాలునికి యిచ్చెను. గవ్వలను తీసుకొనిన ఆ బాలుడు "నీకు ఎనిమిది మంది సంతానము కలుగును" అని పలికెను. అంత పిల్లలందరు సంతోషముతో పరుగిడి వారి చోటుకు వెళ్లిపోయిరి. ఆమె తన పరివారంతో కళ్యాణి నగరం చేరి శ్రీ ప్రభువు ఇంటివద్ద విచారించగా వారు ఎక్కడికి పోయినారో, ఎప్పుడు ఎక్కడెక్కడ తిరుగుచుండునో, ఎప్పుడు వచ్చెదరో తెలియదనిరి. శ్రీ ప్రభువును దర్శించకుండా భోజనం చేయకూడదని నిశ్చయించుకొని వుండుటచేత ఆమె ఉపవాసం చేసెను. మరుసటి దినమున అక్కడ బ్రాహ్మణ సమారాధన చేసినది. కాని శ్రీ ప్రభువుల వారి దర్శనం కాలేదు. ఆ విధముగా మూడురోజులు ఉపవాసము చేసిన పిమ్మట ప్రభువునకు అనుగ్రహము కల్గి హఠాత్తుగా ఇంటికి వచ్చి తనకు ఆకలిగా యున్నదని తల్లిని ఏమైనా పెట్టమనెను. తల్లి పెట్టినది తిని బయటకు వెళ్ళుటకు రాగా ఇంటివద్ద అతని రాకకై ఎదురు చూచుచున్న భీమాబాయి కనిపించినది. శ్రీ ప్రభువు వెంటనే "నీకిదివరకే ఎనిమిది మంది బిడ్డలను యిచ్చినాను. నన్ను తిరిగి ఏల బాధించెదవు" అని తక్షణమే వెడలిపోయెను. భీమాబాయి తాము గవ్వలిచ్చిన బాలుడే వీరు అని గ్రహించినది. ఆనందముగా ఆ గ్రామంలో ఒక దినము గడిపి హైద్రాబాద్ వెళ్ళిపోయినది. కాలక్రమమున ఆమె ఎనిమిది మందికి తల్లి అయినది.

ప్రభువు బాల్యస్నేహితులలో కాలాభట్ యనువాడు గలడు. అతడు ఒకనాడు శంకర దేవాలయములో శంకరునికి బిల్వపత్ర పూజ చేయుచుండెను. బాలభట్ అనునతడు వచ్చి పూజాభంగము గావించెను. దానికై ఇద్దరును తగవులాడుకొనిరి. కాలభట్ శ్రీ ప్రభువు వద్దకు వెళ్ళి బాలాభట్ తన పూజకు భంగము కలిగించెనని చెప్పెను. దానికి శ్రీ ప్రభువు "నీవక్కడ పూజ ఎందుకు



చేసెదవు, నిజమైన దేవునికి చేయరాదా?" యనెను. అందులకాతడు నిజమైన దైవమెవ్వరు నాకగుపించలేదు. నాకెవరు చూపించెదరని అడిగెను. అనగానే శ్రీప్రభువు అతని కన్నులు మూసుకోమనెను. వానికి జటాజూటధరుడైన శంకరునిగా ప్రభువులు దర్శనమిచ్చినారు. అమితమైన ఆనందముతో నాటినుండి శ్రీప్రభువులను శంకరునిగా భావించి బిల్వపత్రములచే అర్చించేవాడు. అతని అసలు పేరు 'మెల్ గిరి భట్' కాని ఇతడు చాలా నల్లగా వుండుటచేత శ్రీ ప్రభువే కాలాభట్టని పిలుచుచుందురు. ఇలాగే బాల్యములోనే స్వామి అనేక లీలలు చేసి చూపెడివారు.

కాలక్రమమున ఒకసారి మార్గశీర్ష శుద్ధ షష్ఠి రోజున తను శిష్యబృందముతో శ్రీ ప్రభువులవారు మైలారు అను ప్రాచీన పుణ్యక్షేత్రమును చేరిరి. అది 108 తీర్థములున్న క్షేత్రము. అచ్చట పెద్ద ఖండోబా దేవాలయమున్నది. శ్రీ ప్రభువుల రాకతో అనేకమంది భక్తులు రాసాగిరి. అక్కడ వారికి రెండు లాభములు కలిగినవి. ఒకటి ప్రభువుల దర్శనం, రెండు తీర్థస్నానం. అక్కడనే వెంకమ్మగారు మొదటిసారిగా ప్రభువులను దర్శించి తమ సర్వస్వం అర్పించి శరణాగతి చేసినారు. ఆమె శ్రీప్రభువుల తల్లిగారివద్ద వుంటూ, ప్రభువులను సేవించుచుండేవారు. జీవితాంతము అక్కడనే ప్రభువు సేవలోనే వుండి గొప్ప యోగినిగా మారినది.

మాణిక్య ప్రభువునకు యుక్తవయసు వచ్చేసరికి విద్యలేదు. అప్పటికే 16 సంవత్సరములు. ఒకరోజున ఆయన మేనమామకు కోపము వచ్చి గట్టిగా గద్దించెను. సర్వరక్షకుడు, లోకపోషకుడు, నన్ను కష్టకాలములో ఆదుకొను దేవుడు ఉన్నాడని చెప్పి తన పట్టుగుడ్డలు విడిచి, ఒక ధావలి కట్టుకొని ఇల్లు విడిచి వెళ్ళిపోయెను. ఇదియంతయు ఆయన దయ అనెను.

అంబిల్కూడ వద్దనున్న 'మంతలి' యందలి కారడవులలో మాణిక్య ప్రభువు తిరుగుచుండెడివారు. ఆ చుట్టుప్రక్కల గ్రామస్థులు ఆయనను అడవిలో తిరుగుట చూచుచుండెడివారు. కాని మరల అదృశ్యమగుచుండెడివారు. ఒక్కొక్కసారి గుట్టమునెక్కి మంతలి గ్రామమునకు వచ్చి ప్రజలతో కలసిమెలసి మాట్లాడి మరల మాయమగుచుండెడివారు. శ్రీ మాణిక్య ప్రభువు తల్లి తనయుని

చూడవలెననెడి కాంక్షతో బాధపడెడిది. ఒకరోజు బిడ్డను వెదకుటకై మంతలి వెళ్ళెను. కాని పని జరుగలేదు.

ఆమె అలసిపోయి, దుఃఖముతో నిరుత్సాహములో మునిగిపోయెను. అకస్మాత్తుగా శ్రీమాణిక్య ప్రభువు దర్శనమిచ్చెను. అంత ఆమె ఆ బిడ్డను కౌగలించుకొనెను. ఆమె ఆనందమును పట్టలేక ఆనందబాష్పములను ప్రవాహమువలె కార్చెను. ఈ వార్త అంతటా వ్యాపించెను. అంత జనులు శ్రీ మాణిక్య ప్రభువు దర్శనమునకు గుంపులు గుంపులుగా చేరిరి. చివరికి మంతలి గ్రామము పవిత్ర పుణ్యతీర్థమాయెను.

అంతకు ముందటి అవతార పురుషునివలె శ్రీ మాణిక్యప్రభువు ఆజన్మ బ్రహ్మచారి. ఆధ్యాత్మిక ధ్యాసలో ముష్టి చిప్పను చేతపట్టి లోకమంతా తిరుగుచుండెను. గొప్ప తపస్సు చేసెను. కొద్దికాలములోనే ఆత్మజ్ఞానము కలవాడై పూర్ణత్వము పొందెను. ఆయన ముఖకవళికలు మారి దేదీప్యమానముగా వెలుగజొచ్చెను. ఆయన నోట వచ్చు ప్రతిమాట దివ్యజ్ఞానమై యుండెను. ఆయన మరాఠి, పర్షియా, కన్నడ భాషలలో మాట్లాడెడివాడు. ఆధ్యాత్మిక చర్చలలో శ్రీశంకరాచార్య సముడు. ఎంతటి పండితుడినైననూ, తన విజ్ఞానవాదనతో వశపరచుకొనెడివాడు. ఆయన ఖ్యాతి నలుదిశలా వ్యాపించగా యావత్తు భారతదేశము నుండి ప్రజలు తీర్థయాత్రికులుగా, భక్తులుగా వచ్చెడివారు. వారి సమస్యలకు సమాధానమును పొందుచుండెడివారు. వారి కష్టములను తీర్చి వారి బాధలను తొలగించి వారికి ఊరట కలిగించెడివారు. లౌకిక, ఆధ్యాత్మిక సమస్యలు తీర్చెడివారు. ఆయన శక్తులు అద్భుతములు. ఇది అంతయు దైవకృప యనెడివారు.

అనుకోని విధముగా ధనము చేరెను. యాత్రికులు, భక్తులు, శిష్యులు వారి ఆస్తిలో కొంత భాగమును వారి పాదముల వద్దనుంచిరి. కాని ఆయన ఆ డబ్బును స్వేచ్ఛగా ఇతరుల అవసరములకు పంచిపెట్టెడివారు. అయినను ఖజానా నిండుగా వుండెడిది.

శ్రీ మాణిక్య ప్రభువు రాజయోగి. ఆయన యందు రాజఠీవి గలదు. ధనము, ఐశ్వర్యమును ఆయన చుట్టుముట్టెను. అందరును ఆయనను యోగిరాజ



మహారాజుగా గౌరవించెడివారు. ఆయన ఆధ్యాత్మిక ఖ్యాతి అనేక దేశముల వ్యాపించెను. దర్శనమునకు వచ్చినవారు ఆయన భక్తులై శిష్యులైరి.

ఒకనాడు మాణిక్య ప్రభువు బీదరు నుండి కళ్యాణికి పల్లకిలో పోవుచుండెను. రెండు సెలయేరులు కలియుచోట ఒక భయంకర అడవి కలదు. ఆ చీకటి అడవిలో పల్లకి పోవుటకు దారిలేకపోయెను. అక్కడనే మాణిక్య ప్రభువు నివాసమేర్పరచుకొనెను. అదియే మాణిక్య నగరమయ్యెను.

క్రమక్రమమున మాణిక్య నగరమభివృద్ధి చెందెను. గురుగంగ, విరజానదుల మధ్య ఆ నగరమేర్పడెను. కొద్దికాలముపాటు మాణిక్య ప్రభువు నివసించుటచేత అది ఒక పుణ్యతీర్థమాయెను. ఆ చుట్టు ప్రక్కల గజదొంగలు, దారిదోపిడీదారులు దగ్గర అడవుల నుంచి వచ్చి శ్రీ మాణిక్య ప్రభువు దర్శనము చేసుకొని ఆయన భక్తులుగా మారిపోయెడివారు.

శ్రీమాణిక్య ప్రభువు భక్తులు, బంధువులు, స్నేహితులు వచ్చి మాణిక్య నగరంలో స్థిరనివాసులైరి. వర్తకులు, వ్యాపారస్తులు, ధనవంతులు, భూస్వాములు వారిని అనుసరించి చేరి స్థిరనివాసులైరి. మాణిక్య నగరము ఆ చుట్టు ప్రక్కలకు పెద్ద నగరమాయెను. మాణిక్య ప్రభువు రారాజువలె దర్బారు నడిపెడివారు. వారి దర్శనమునకై క్రైస్తవులు, పార్సీలు, మహమ్మదీయులు మరియు ఇతర కులస్థులు వేనవేలుగా నిలుచుండెడివారు. అనేకమంది ఆ ఋషివర్యుని సపర్యలో అక్కడనే వుండగోరిరి. యోగసాధన వలన, భక్తివలన, నైతిక ఆధ్యాత్మిక జీవితము వలన వారు శాంతిని, సౌఖ్యమును పొందిరి. శ్రీ మాణిక్య ప్రభువు దర్బారులో ప్రవేశించు సమయంలో చక్రవర్తులకు చక్రవర్తిగా కనిపించెడివారు. ఆధ్యాత్మిక చక్రవర్తి ముందు సామ్రాజ్య చక్రవర్తి ఎంతటివాడు?

ఆ దర్బారుకు శాస్త్రులు, పండితులు, కళాకారులు, గాయకులు, నాట్యకోవిదులు, కీర్తనకారులు, సాధువులు వచ్చెడివారు. వారి వారి కళలను ప్రదర్శించెడివారు. గురు సముఖమున వారి నైపుణ్యము, చాకచక్యము ప్రదర్శించెడివారు. వారికి కావలసినన్ని బహుమతులు, బంగారు నాణెములు, వజ్రపు ఉంగరము, కంఠమాలలు అనేక విలువైన వస్తువులను వారి కృపకు చిహ్నముగా బహూకరించెడివాడు. ప్రతివారికి దర్బారులో ప్రవేశించు అర్హత

కలదు. వచ్చిన వారందరికి గురువు ఆశీస్సులు, ప్రసాదము పంచబడెడిది. ఆయన ప్రేమ ప్రతివారియందు స్పందించెడిది. అది విశ్వజనీనమైనది.

శ్రీ మాణిక్య ప్రభువుకు సమస్త శాస్త్రములు, వేద వేదాంగములు తెలియును. ఆయన సకల రస గుణధాముడు. ఆయన సర్వశక్తి సమన్వితుడు. ఇతరుల భావమును ఇటులనే కనిపెట్టెడివాడు. కొందరు దుష్టులు వారికి మాంసాహారము తీసుకొని వచ్చిరి. శ్రీ ప్రభువు ఆహారము గ్రహించు సమయమున అది అంతయు సన్నజాజి పుష్పములుగా మారిపోయెను. అంత ఆ దుష్టులు ఆశ్చర్యచకితులై సిగ్గుపడిరి.

శ్రీశ్రీశ్రీ జగదాంబ దేవతయే ఆయనకు భిక్షపాత్ర, దండము ఇచ్చెనని ప్రజల నమ్మకము. నగలుకాని, ధనముగాని, బట్టలుగాని ఆహారముగాని ఏవియు అచ్చట కొరత లేకుండెను. అన్నియు సమృద్ధిగా యుండెడివి. కాని ఆయన మధుకర వృత్తి వీడలేదు. నిత్యము భిక్షకు తగు సమయమున పోయెడివారు.

శ్రీ మాణిక్యప్రభువు ముఖముచుట్టూ అసాధారణమైన తేజస్సు వెలుగుచుండెడిది. పెద్ద కళ్ళతో, నిరంతర చిరునవ్వుతో మేలిమి శరీర ఛాయగలవాడై నిత్యానంద భరితులై దర్శనమిచ్చెడివారు. మృదుమధురభాషి, సౌమ్య, సౌందర్య ప్రవర్తన, ఆయన ఆనందమయ ఐశ్వర్యముక్తి అవతారము.

ఒకసారి శృంగేరి పీఠాధిపతి శ్రీ శంకరాచార్య మాణిక్య నగరం విచ్చేసిరి. వారిని ఆహ్వానించుటకు మహోన్నతమైన ఏర్పాట్లు శ్రీ మాణిక్య ప్రభువు చేసిరి. శ్రీ శంకరుల కిచ్చుటకై ఒక వజ్రాలహారము, వజ్ర కిరీటము సిద్ధము చేయబడినది. శ్రీ మాణిక్య ప్రభువు వారిని స్వయంగా ఆహ్వానించెను. ఆ ఉత్సవమునకు బంగారు సింహాసనము ఏనుగుపై సిద్ధం చేసిరి. ఆ సింహాసనము చుట్టూ బంగారు నాణెములు అతకబడెను. శ్రీ శంకరాచార్యులు ఆ వైభవోపేతమైన ఏర్పాట్లకు ఆశ్చర్యచకితులైరి. శ్రీ మాణిక్య ప్రభువు వారిని జగద్గురువుగా గౌరవించెను. పది వారములపాటు జరిగిన ఆతిథ్యమునకు శ్రీ శంకరులున్నూ, వారి సాన్నిధ్యమునకు శ్రీ ప్రభువున్నూ ఆనందించిరి.

శ్రీ మాణిక్య ప్రభువు యొక్క జీవితయాత్ర చివరి దశలో వారి సమాధికై తగిన స్థానమును చూచుకొనిరి, రహస్యముగా నుంచినప్పటికీ ఆయన సమాధి



దినమును నిశ్చయించుకొనిరి. శ్రీ మాణిక్య ప్రభువు నగర పరిపాలనకు కావలసిన ఏర్పాట్లు అన్నియు చేయబడెను. ఆ దినమున తమ్ముని కుమారుడైన మనోహరుని పిలిచెను. ఆయనకు తన జపమాలను, శాలువను యిచ్చెను. మార్గశిర ఏకాదశి దినమున క్రీ॥శ॥ 1787 (1865) తన 48 వ సంవత్సరమున జీవసమాధిలో ప్రవేశించిరి. గురు ఆజ్ఞానుసారము ఆ సమాధి ప్రవేశ ద్వారము సీలు వేయబడినది. జ్ఞానేశ్వర మహారాజువలె శ్రీ మాణిక్య ప్రభువు కూడ జీవసమాధి చెందెను. యోగశక్తితో పరమపురుషునిలో ఐక్యమందెను. ఆయన సమాధి వార్త దేశమంతటా వ్యాపించెను. అన్ని మతములు, కులములు, జాతులు భక్తులు వేలాదిగా వారికి అంతిమ నమస్కారము తెలుపుటకై బరువైన హృదయములతో అక్కడకు విచ్చేసిరి.

దత్తాత్రేయ సంస్కృతి వివిధ దేశముల వ్యాపించెను. ఈ సాంప్రదాయ పునర్జన్మకు శ్రీ మాణిక్య ప్రభువు ముఖ్యముగా బాధ్యులు. ఆయన లక్ష్యమును, భాషణమును సరిపోల్చ వీలులేదు. మత సామరస్యము, ఐక్యతను భక్తులలో నేర్పరచి, వారిలో ప్రేమను ప్రసరింపజేసి వారి కష్టసుఖముల నాదుకొనెడివారు. అనేక భాషలలో వందలకొలదీ కీర్తనలు రచించెను. అవి భక్తి, జ్ఞాన బోధలందు పేరుప్రఖ్యాతులుగాంచి, నేటికిని వ్యాప్తినొందినవి. ప్రతి కీర్తనయందు ఆయన పేరు అంత్యమున చరణ భాగముగా చేర్చబడెను. అక్కల్‌కోటకు చెందిన శ్రీ స్వామి సమర్థునకు శ్రీ మాణిక్య ప్రభువు సమకాలికుడు. వారి ఆధ్యాత్మికశక్తిని ఎంతో శ్లాఘించెడివారు.

**"దత్తగురు దత్తగురు జైజై దత్తగురు"**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***పదకొండవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"దిగంబరా దిగంబరా!

స్వామి సమర్థా దిగంబరా!!

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పన్నెండవ అధ్యాయము

### అక్కల్ కోటకు శ్రీ స్వామి సమర్థుని అత్యద్భుత ఆగమనము

నిత్యానంద యోగి, "విద్యాసాగరా! యమ నియమాది యోగాలవల్ల ఆత్మను నిగ్రహించుకోవటం సంభవమే. అయినా కామము, క్రోధము అనేవి అప్పుడప్పుడు ప్రతి మానవునిలోనూ, తలచూపుతూనే వుంటాయి. వాని మూలమున మానవులు అశాంతికి గురి అగుచుందురు. అశాంతిని తొలగించుకోవటానికి సుస్థిరమైన శాంతిని పొందుట కొరకు, వివేకులైన మానవులు శ్రీగురు చరణాల నాశ్రయిస్తారు. శ్రీగురుసేవకు తమ జీవితాన్ని అంకితము చేసుకుంటారు. శరీరత్రయము అనే సంసార సముద్రంలో మునిగి తేలుతూ విషయ వాసనల మూలంగా వేదన పొందుతూ వుండేవారికి సద్గురువు కీర్తన నావ వంటిది. సద్గురువును ఆశ్రయించడం చేతనే వారిలోని విషయ వాసనలు దూరమవుతాయి. తత్త్వం అవగతమవుతుంది. బుద్ధి స్థిరపడుతుంది. అప్పుడు సాధకుడు యోగ సాధనను పూర్తిగా అవగతము చేసుకుని సాధనచేసిన ఆత్మానందమును పొంది-పరమాత్మను దర్శించగలడు. వినయవంతుడైన బాలకా! రా! మనము శ్రీ స్వామి సమర్థుల అత్యద్భుతమైన ఆగమనమును దర్శించుదాము!"అని స్వామి అక్కల్ కోటలో ప్రవేశించినది చెప్పమొదలిడినాడు.

పరమ పవిత్రమైన మహారాష్ట్ర దేశంలో షోలాపురం జిల్లాలో అక్కలకోట గ్రామము కలదు. రెండవ దత్తావతారమైన శ్రీ నరహరి నరసింహ సరస్వతి స్వామి వారి తపోభూమి అయిన గంధర్వనగరం అనగా గాణుగాపురం కర్నాటకలోని గుల్బర్గా జిల్లాలో వున్నది. ఈ రెండు గ్రామముల మధ్య దూరము కేవలము 70 కిలోమీటర్లు మాత్రమే. అపురూపమైన దత్త అవతారుల



తపోభూములు ఈ క్షేత్రాలు. ఈ రెండు కర్ణాటక-మహారాష్ట్ర రాష్ట్రముల సరిహద్దులో గలవు.

అక్కల్‌కోట గ్రామములో సుమారు 23 సంవత్సరములు శ్రీ స్వామి సమర్థులు నివసించినారు. వారు నివసించుటచేత ఆ గ్రామం మహోన్నతమైన యోగభూమి అయినది. నేడు అనేక దివ్యమైన పుణ్యక్షేత్రములలో ఇది ఒకటి. శ్రీ స్వామి సమర్థుల అవతారం కలియుగంలో నాలుగవ దత్తావతారం. "వీరు దత్తావతారులు' అని నాడు-నేడు అనేకమందికి అద్భుతమైన నిదర్శనములు-అనుభూతులు కలుగుచున్నవి. భక్తులకు ప్రత్యక్ష నిదర్శనములను చూపించే గాణుగాపురంలోని శ్రీ దత్తమూర్తి పాదుకలు అనేకమంది సాధకులకు, భక్తులకు శ్రీ స్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ దత్తావతారులు అని నిదర్శనం యిచ్చాయి. అక్కల్‌కోటలో రాజే రాయన్ మఠం నిర్మాణం చేసిన నిజాం రాష్ట్రంలోని జాగీర్‌దారు అయిన శంకర్‌రావు రాజే గారికి గాణుగాపురంలో దత్తపాదుకలను సేవించుచుండగా అతని వ్యాధి నివారణకు శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థులను ఆశ్రయించమని శ్రీ దత్తాత్రేయస్వామి కలలో దర్శనమిచ్చి ఆదేశించినారు.

అలాగే శ్రీ మాలోజి రాజావారు గాణుగాపురంలో అత్యంత నిష్ఠగా శ్రీగురు చరిత్రను పారాయణం చేస్తుండగా ఒకరాత్రి స్వప్నంలో శ్రీ దత్తాత్రేయ స్వామి దర్శనమిచ్చి, "నేను మీ సంస్థానంలోనే వుండగా నీవు ఇక్కడకు రావలసిన అవసరమేమి?" అని అడిగి అంతర్ధానమయ్యారు. ఇటువంటి నిదర్శనములు వారి చరిత్రలో అనేకములు కలవు.

1856వ సంవత్సరము అశ్వని మాసం (శక సంవత్సరము 1779)లో పంచమి బుధవారంనాడు అక్కల్‌కోటలో ఖండోబా దేవాలయంలో స్వామివారు చిన్నపిల్లవాని మాదిరిగా ఆడుకొనుచు దర్శనమిచ్చినారు. వీరి అసలుపేరు, వయస్సు, తల్లిదండ్రుల పేర్లు, కులగోత్రాలు మొదలగు వివరాలు ఎవ్వరికీ తెలియవు. దత్తావతారులైన ఎందరో యోగి పుంగవుల, అవధూతల జన్మరహస్యం ఎవరికీ తెలియదు. వారి అవతరణ తరువాత వారి లీలలచేత వారు పరిచయమయ్యేవారు. వారు మొదట దర్శనమిచ్చినరోజే వారి అవతార జననం - దానినే జన్మదినంగా గుర్తించుట కూడా కలదు. అంతేకాని వారికి తల్లి, తండ్రి, వారి అసలు జననం ఎవరికీ తెలియదు. ఒక విధంగా చెప్పాలంటే వారికి జనన మరణాలు లేవు. వారు ఎల్లప్పుడూ ఈ జగత్తులో ఏదో రూపంలో

వుంటూనే వుంటారు. షిరిడి సాయిబాబావారు సమాధి పొందినపుడు శ్రీ అవధూత నానావలి “నీకు జననమే లేదు. నీవు మరణించావంటే నేను నమ్ముతానా?” అంటాడు. అందువలన వీరు ఎన్నడూ జన్మించలేదు, మరణించలేదు. జనన మరణ చక్రములకు వీరు అతీతులు. వీరు జగత్ గురువులు. జగతి నిర్మాణకర్తలు–పోషకులు. లయకారకులు. శ్రీ దత్తాత్రేయ స్వామి ప్రతిరూపాలు. ఇటువంటి మహాత్ములు – గజానన మహరాజ్ సేగామ్ – శ్రీ సాయిబాబా షిరిడి – శ్రీ స్వామి సమర్థులు. వీరు ముప్పురు సమకాలికులు. శ్రీ గజానన మహరాజ్ మొదటిసారి సేగాంలో ఒక బ్రాహ్మణుని ఇంట జరుగు శుభకార్యంలో భోజనములు జరుగు సమయంలో ఎంగిలి విస్తరాకుల దగ్గర దర్శనమిచ్చినారు. షిరిడి సాయిబాబావారు మొదట షిరిడిలో ఖండోబా మందిరమువద్ద మహల్సాపతికి దర్శనము యిచ్చినారు.

సోలాపురం భక్తులు చింతోపంతుతోల్ స్వామికై అక్కల్‌కోటలో వెదుకగా స్వామి ఖండోబా మందిరము దగ్గర దర్శనమిచ్చిరి. చింతోపంతుతోల్ స్వామిని తన వసతి గృహమునకు రమ్మని పిలువగా “నా ఇల్లు వేరే వుంది నీవు పో!” అనిరి. నిరాశతో అతడు తిరిగి వెళ్ళిపోయెను. అది సాయం సమయం, అడవి నుండి పశువులను గ్రామంలోనికి తోలుకొనిపోవు పశువుల కాపరులు స్వామిని చూచిరి. వారు దగ్గరగా వచ్చి స్వామిని దర్శించి, వీరు ఎవరో గొప్ప మహాత్ములు అని భావించి నమస్కరించిరి. అపుడు స్వామి “నేను మీ ఊరు రానా?” అని అడిగిరి. దానికి వారు చాలా సంతోషపడి “స్వామీ! మీవంటి వారు మా గ్రామంలోనికి రావడం మా భాగ్యము – మా గ్రామ ప్రజల పుణ్యము. తప్పకరండి!” అని అనిరి. అందు ఒకడు “స్వామీ! రండి మా ఇంట ఈ రాత్రికి బిక్షను స్వీకరించండి. మేము బీదవారము. మీకు కేవలం జొన్నరొట్టె, కూర పెట్టగలము. దానిని స్వీకరించి దీవించండి!” అని కోరగా స్వామి వాని వెంట వెళ్ళి వారి ఇంటివారు పెట్టిన రొట్టెలను తిని వారి ఇంటి అరుగుపైనే నిద్రపోయిరి. ఆ ప్రాంతము అక్కల్‌కోట గ్రామము పొలిమేర లోనిది.

మరుసటిరోజున ఉదయం అనగా అశ్వని మాసం శుద్ధ షష్ఠి గురువారంనాడు చింతోపంతుతోల్ స్వామిని గురించి తెలిసి తన స్నేహితుడు పాండురంగ పురాణిక్‌ను వెంటబెట్టుకొని స్వామివారి వద్దకు వచ్చి వారికి నమస్కరించిరి. అపుడు చింతోపంతుతోల్ ఈ సద్గురుమూర్తియే నాకు షోలాపురంలో దర్శనమును అనుభవమును యిచ్చినారు. వారు దివ్యమైన



దత్తావతారులు, అవధూతలు, దిగంబరులు అని చెప్పెను. అంత పాండురంగ పురాణిక్ స్వామి వద్దకు చేరి వారి పాదములకు నమస్కరించి, "ఓ గురుదేవా! మీరు ఈరోజు మా ఇంట భిక్షను స్వీకరించండి!" అని కోరెను. స్వామి వాని ఆహ్వానమును అంగీకరించి వారి వెంట వారి గృహమునకు వెళ్ళిరి. పాండురంగ పురాణిక్ అతని భార్య నీరాబాయి స్వామికి శ్రద్ధగా స్నానాదులు గావించి పూజించిరి. అచ్చటకు మహీపతి రామచంద్ర అనువారు కూడా వచ్చి స్వామిని చూచి ఆశ్చర్యపడి నమస్కరించి అచ్చట వారితో తాను శ్రీ స్వామివారిని మాణిక్య నగరంలో దర్శించితిని అని వారు అక్కల్‌కోట వచ్చెదరని శ్రీ మాణిక్య ప్రభువులు తెలిపిరి అని చెప్పెను. అందరూ భోజనమునకు కూర్చుండిరి. ఆమె వారికి అతి రుచికరమైన వంటలను వడ్డించెను. అందులో కోసుంబి – బాజి – రోటి – భేషన్ లడ్డూలు కూడా వున్నవి. ఆమె భేషన్ లడ్డూలను చాలా తయారుచేసి అందులో సగం అలమారాలో దాచినది. స్వామి ఆమెతో "అమ్మా నీవు ఇంకా కొన్ని లడ్డూలను దాచి వుంచినావు. అవి కూడా వడ్డించు" అనిరి. ఆమె స్వామి వారి సర్వజ్ఞతకు ఆశ్చర్యపడి, అవికూడా వడ్డించినది. స్వామి భోజనానంతరము అక్కడే విశ్రాంతి తీసుకొని వారి సేవలను అందుకొని దీవించి వెళ్ళిపోయిరి. ఆ రాత్రి స్వామి ఖండోబా దేవాలయమువద్ద నిదురించినారు.

మూడవరోజున కూడా చింతోపంతుతోల్ బాహు రాజ్ జ్యోషి అను వానిని వెంట తీసుకొని వెళ్ళి స్వామిని దర్శించెను. రాజాజ్యోషి కూడా స్వామిని తన గృహమునకు ఆహ్వానించెను. స్వామి అనుగ్రహించి వారి వెంట వెళ్ళిరి. అక్కడ కూడా స్వామివారికి మంగళ స్నానములు చేయించి, షోడశ విధానములతో పూజించి చక్కటి విందు భోజనము ఇచ్చినారు. అక్కడ నుంచి స్వామివారు రాజకుటుంబీకుల గణేశ మందిరము వద్దకు వెళ్ళి అక్కడ విశ్రాంతి తీసుకొనుచుండెను. చింతోపంతుతోల్, బాహురాజ్ జ్యోషిలు ఈ మహాత్ముని గురించి ఆ రాజ్యము పరిపాలించు రాజునకు తెలిపిరి. ఆ రాజు మాలోజీభోన్స్‌లే అతని తమ్ముడు దాజీభోన్స్‌లే ఇరువురును వచ్చి శ్రీ స్వామిని దర్శించి, వారికి పుష్పమాలను వేసి ఫలముల నొసంగి పాదాభివందనం చేసిరి. స్వామి వాని తమ్మునికి తన మెడలోని పూలమాలను తీసి అలంకరించిరి. మాలోజీ భోన్స్‌లే మహారాజుకు తనపైన ఉన్న పాత వస్త్రమును యిచ్చినారు. వారు స్వామి ఆశీస్సులను తీసుకొని ఆనందముగా అంతఃపురములోనికి పోయిరి.

ఆరోజు సాయంకాలము శ్రీస్వామి సమర్థులు ఖండోబా మందిరము

దగ్గరగానున్న గ్రామ ముఖద్వారము క్రింద అరుగుపైన కూర్చుని వుండిరి. ఆ సమయంలో మహమ్మద్‌ఖాన్ అను మహమ్మదీయుడు వారిని చూచుట తటస్థించెను. అతడు ఆ గ్రామమున రిసాల్దారుగా పనిచేయుచుండెను. అతనికి శ్రీస్వామిని చూచినంతనే ఒక విధమైన ఆత్మీయభావం కలిగినది. అతడు ధార్మికుడు, సాధు సంతులయందు, ఫకీరు హవలియాల యందు ప్రీతి కలిగినవాడు. స్వామియొక్క వింత ఆకారము, వారి చేష్టలు చూచి పిచ్చివాడేమో అని అనుమానము కూడా కలిగినది. మరల గొప్ప ఫకీర్లు, హవలియాలు కూడ ఇలాగే వుంటారని పెద్దలు చెప్పిన వాక్కులు గుర్తుకు వచ్చినవి. చాలాసేపు అలాగే స్వామిని పరిశీలించినాడు. అతనికి ఏమీ బోధపడలేదు. అతని మనస్సులో శ్రీస్వామిని పరీక్షించవలెననే భావం మొదలిడినది. దీనికి అతను ఖాళీ చిలుమును స్వామికి చూపుతూ "చిలుము తాగుతారా?" అని అడిగినాడు. స్వామి వానివైపు తీక్షణంగా చూచి మారు మాట్లాడకుండా చిలుము తీసుకొని దానిలో గంజాయి లేకుండానే వెలిగించి పొగపీల్చడం ప్రారంభించినారు. స్వామీజీ నోటినుండి దట్టంగా పొగరావడం చూసి స్వామి సిద్ధపురుషుడని గ్రహించినాడు. స్వామిపైన భక్తి కలిగినది. వారికి అన్నపానీయాలకు లోటులేకుండా ఏర్పాటు చేయాలి అని సంకల్పం కలిగినది. వారికి నమస్కరించెను. అతని వెంట అద్దకము పనులు చేయు రామ్‌చంద్ర రంగారి అనువాడు కూడా వుండెను. అతడు కూడా యీ అద్భుతమైన లీలను చూచి ఆశ్చర్యం, ఆనందం కల్గి స్వామి పాదములకు నమస్కరించి స్వామిని "మహాత్మా! ఈ ఊరిలో మీకెవరయినా బంధువులు వున్నారా?"అని అడిగెను. దానికి స్వామి పకపక నవ్వుచు "ఆ వున్నారు!" అని మౌనమును వహించిరి. కొంతసేపు వారిరువురూ స్వామివద్దనే వుండి వారి నుంచి ఇంకా ఏమీ సమాధానము రానందున గ్రామములోనికి వెళ్ళిరి. ఖాన్ అందరిని విచారించి భక్తుడు, నియమవంతుడు, బీదవాడు అయిన చోళప్ప అనే బ్రాహ్మణుని చేరి తాము చూసిన మహాత్ముని విషయమంతా చెప్పి వారికి బస, భోజనము ఏర్పాటు చేయుమని, దానికగు ఖర్చు తానే ఇచ్చెదనని మహమ్మద్ ఆలీఖాన్ చెప్పెను. దానికి చోళప్ప అంగీకరించెను. ఖాన్ చోళప్పను తీసుకొని స్వామివున్న ప్రదేశమునకు వెళ్ళిరి. చోళప్ప స్వామిని చూచినంతనే ఆనందపారవశుడై భక్తితో వారికి పాదాభివందనం చేసెను. చోళప్పను చూచినంతనే స్వామి "ఏమోయ్ చోళా! నన్ను గుర్తుపట్టినావా? మనది జన్మ జన్మల బంధం. పోయిన జన్మలో నీవు



రామచంద్రషరాబ్. నా భక్తుడివిగా వుండి నన్ను సేవించినావు" అని వాని శిరమున తన చేయి యుంచిరి. స్వామి చెయ్యి తగలగనే వానికి పూర్వ స్మృతి కలిగినది. వాడు స్వామిని గుర్తించి పారవశ్యంతో మందహాసం చేసినాడు. వెంటనే స్వామి తన చెయ్యిని తొలగించిరి. స్వామి చెయ్యి తొలగించగనే వాడు మామూలు స్థితికి చేరినాడు. వానికి తాను ఏమి చేసినది గుర్తుకురాలేదు. మహమ్మద్ ఆలీఖాన్ యిదంతా ఆశ్చర్యంగా చూస్తున్నాడు. అతనికి ఏమీ అర్థంకాలేదు. చోళప్ప, ఆలీఖాన్ యిరువురునూ స్వామిని ప్రార్థించి వారింటికి తీసుకొచ్చినారు.

చోళప్ప స్వామిని గృహములోనికి ఆహ్వానించి వారి పాదములను కడిగి, హారతి యిచ్చి లోనికి తీసుకొని వెళ్ళి ఉచితమైన ఆసనంపై కూర్చుండబెట్టి అర్ఘ్యపాద్యములతో షోడశ విధముల పూజించి ధూప-దీపములను సమర్పించి, మంగళహారతి చేసి వారి పాదములచెంత కూర్చుండి, వారి పాదములనొత్తుతూ "స్వామీ! మహాత్ములయిన మీ దర్శనమువలన నా జన్మ ధన్యమైనది. మీ పాద స్పర్శవలన నా గృహము పావనమయినది. ఏ గృహస్థుల ఇళ్ళలో మహాత్ములు పూజింపబడతారో, ఏ గృహస్థుని ఆతిథ్యాన్ని పొంది మహాత్ములు ప్రసన్నులవుతారో ఆ గృహస్థుడు దరిద్రుడైనా కూడా ధన్యుడే అవుతాడు అని కదా శాస్త్ర ప్రబోధం. మరియు ఏ గృహమేధి ఇంట్లో మహాత్ములు అడుగుపెట్టరో ఆ గృహమేధి ఇల్లు సర్వసంపత్సమృద్ధమై కూడా ఉరగ సంతానానికి అకరమైన వృక్షం మాదిరి వుంటుంది అని కూడా ప్రబోధించునుగదా!"

ఇంద్రియార్థాలనే పురుషార్థాలుగా భావించి వ్యసనార్ణవమయిన సంసారములో పడి తన్నుకులాడే మాకు మీబోటి పవిత్రమూర్తుల సేవయే తరణోపాయము. భక్తులననుగ్రహించే నిమిత్తం ఈశ్వరుడే అప్పుడప్పుడు మీవంటి సిద్ధుల రూపంలో దర్శనీయుడవుతూ వుంటాడు అనికదా వేదవాక్యం. మీరు ఆత్మారాములు. ఎప్పుడు కుశలురే. సుఖదుఃఖాలనేవి మాబోటి సంసారులకేగాని మీకు కావు. మీరు నిత్యానందులు, నిత్య సత్యస్వరూపులు, సద్గురువులు. నేను చేసుకొన్న అనేక జన్మల పుణ్యఫలముచేత మీకు సేవచేసుకొనే భాగ్యం కలిగినది. నాదస్వరూపా? నీవు అనుగ్రహించిన ఈ ఆహారం నీకు అర్పితము. స్వీకరించండి!" అని వినయముగా స్వామిని స్తోత్రము చేసెను. ఆ తరువాత భోజనము వడ్డించగా శ్రీస్వామి దానిని స్వీకరించక ఆలీని పిలిచి ఆ కంచాన్ని ముట్టుకొని ఆహారమును భగవంతునికి అర్పించమనెను. అప్పుడుగాని మనము భోజనము చేయకూడదనెను. ఇది సాంప్రదాయబద్ధమైన

ప్రార్థన. అహమ్మదాలీఖాన్ ఆశ్చర్యపోయెను. తాను మహమ్మదీయుడనని, ఇది బ్రాహ్మణ గృహమని వెనుకాడెను. స్వామి "భయంలేదు. కంచాన్ని ముట్టుకో!" అని అతనిని వత్తిడిచేసెను. అంత ఆ కంచముపై ఖాను తన చేతినుంచి ముసలమానులు దేవునికై నైవేద్యం అర్పించు సమయములో చదువు కల్మను చదువగా స్వామి ఆనందించిరి. అప్పుడుగాని వారు భోజనము చేయలేదు. అప్పుడు చోళప్ప వడ్డించుచుండగా స్వామీజీ సంతృప్తిగా భోజనము చేసిరి. స్వామివారికి కుల మత భేదము లేదని, దేవాలయమైనా – దర్గాయైనా, శ్మశాన వాటికయైనా – హిందువులైనా – మహమ్మదీయులైనా ఒక్కటే అని వారి చర్యల ద్వారా నిరూపింపబడెను. మరియు వారి ప్రబోధం "అన్ని వర్గముల ప్రజలు తమ తమ వర్గములను గురించి తగవులాడుట మాని మానవులందరు సమైక్యమై సంఘీభావంతో జీవించాలి" అనిరి. ఇది ఆనాటి కాలంలోని రాజకీయ పరిస్థితులకు అనుకూలముగా ఉండెను. ఆనాడు ఆంగ్లేయ పాలకులు మతముల మధ్య వైరమును కలిగించి వారిని విభజించుచుండిరి. మానవత్వము – మమత – అనురాగములు – పరస్పర ప్రేమ మానవులలో కరువైయుండెను. శ్రీస్వామి తన చర్యల ద్వారా మానవులందరు ఒకటే అని తెలియజేసిరి.

భోజనము చేసిన తరువాత స్వామి సమర్థులు చోళప్ప గృహములోనే వుండిపోయెను. అది వారికి నివాసమైనది. చాలావరకు అక్కల్‌కోటలో స్వామి సమర్థులు చోళప్ప గృహములోనే వుండేవారు. దైవముచే ముందుగానే ఈ బస నిర్ణయింపబడెనేమో! అందువలననే అచ్చట నివసించుటకు అంగీకరించినారు. లేనిచో స్వామి ఎప్పుడు ఎవరు చెప్పిన వినెడివారు కారు. ఆయన మనస్సునకు నచ్చినదే చేసెడివారు. చోళప్ప ఆనాటినుండి స్వామీజీకి అత్యంత ప్రీతిపాత్రుడైన శిష్యుడాయెను. స్వామికి ఎంతో భక్తిశ్రద్ధలతో సేవచేయువాడు. క్రమక్రమంగా శ్రీ స్వామిని గురించి చుట్టుప్రక్కల గ్రామములకు తెలిసింది. వారి లీలలతో ఆ గ్రామము పుణ్యక్షేత్రముగా మారినది. ఎక్కడెక్కడ నుండియో భక్తులు అక్కడకు రావడం మొదలిడినారు.

చోళప్ప, మరికొందరు భక్తులు శ్రీ స్వామిని దత్తావతారునిగా గుర్తించి – గురువులకు – సద్గురువులకు చేయు విధముగా వారికి పూజలు చేయసాగిరి. ఉదయం 4 గంటలకు ప్రభాతసేవ, కాగడ హారతితో మొదలు అయ్యేది. వారికిష్టమైన పెరుగన్నము, నిమ్మకాయ, భేసిన్ లడ్డూలను నైవేద్యముగా సమర్పించేవారు. జనం అనేక గ్రామములవారు ఉదయము నుండి సాయంత్రం



వరకు ఎడతెరిపి లేకుండా వచ్చేవారు. ప్రతి గురువారము స్వామివారికి విశేషమైన సుగంధ ద్రవ్యములతో మంగళాభిషేకము జరిగేది. స్వామిని రుద్రాంశ స్వరూపునిగా గుర్తించి కొందరు బ్రాహ్మణులు రుద్రంతో అభిషేకం చేసేవారు ఆరుబయట ఒక పెద్ద చెక్కబల్లను వేసి శ్రీస్వామివారిని అక్కడ కూర్చుండబెట్టి స్నానం చేయించేవారు. చక్కగా నలుగుపెట్టి నూనెలతో మర్దన చేసేవారు. దివ్యమైన ఆ అద్భుత శరీరము వీరి సేవలతో మరింత ప్రకాశించేది. చిరునవ్వుతో స్వామివారు సేవను స్వీకరించేవారు. స్నానానంతరము వారి నుదుటిపైన చందనము కస్తూరిని దిద్దేవారు. వారి భుజములపైన, గుండెలపైన నామములు పెట్టేవారు. రుద్రాక్షమాల, స్పటిక మాలలను వారి మెడలో అలంకరించేవారు. స్వామిని ఒక సింహాసనముపైన కూర్చుండబెట్టి పుష్పములతో, తులసి మాలలతో అలంకరించి స్తుతి కీర్తనములతో సేవించుచు హారతి యిచ్చేవారు. స్వామివారు ఎల్లవేళల తమలో తాము మాట్లాడుకుంటూ వుండేవారు. దర్శనార్థమై వచ్చిన భక్త జనులను దీవించి వారికి కలకండ లేక ఖర్జూరపండ్లు, మిఠాయిలను ప్రసాదముగా యిస్తూ వుండేవారు. పేదవారికి కడుపునిండా భోజనమే కాక వారి అవసరాలకు తగినట్లుగా కానుకలు కూడా యిస్తుండేవారు. దీపావళి వంటి పండుగల సందర్భములో భక్తులకు మరీ విశేషముగా కానుకలను యిచ్చి అనుగ్రహించేవారు. ముస్లిం పండుగలైన మొహరం–ఈదు–రంజాన్ సందర్భాలలో తన దర్శనార్థము వచ్చిన ఫకీరులు – హవలియాలను తగురీతిగా సత్కరించేవారు. అక్కల్‌కోటకు శ్రీస్వామి సమర్థులను దర్శించడానికి అన్నిమతాలవారు వచ్చేవారు. శ్రీ స్వామి సమర్థులకు తమ వేషధారణపైన, తాము భుజించే ఆహారముపైన ఏమాత్రము ఆసక్తి యుండెడిది కాదు. తమకు నచ్చితేనే భక్తులు ఇచ్చిన వస్త్రములైనా, నైవేద్యములైనా స్వీకరించేవారు. శ్రీస్వామివారు భక్తులు ఏ భాషలో మాట్లాడినా తేలికగా అర్థంచేసుకునేవారు. వారికి అవసరమైన సలహాలను కూడా యిచ్చేవారు. భక్తుల మనస్సులలోని ఆలోచనలను కూడా గుర్తించి తగు విధముగా అనుగ్రహించేవారు. వారు అందరి హృదయములలోను, మనస్సులలోను ఉన్న ప్రజ్ఞ తామేనని రుజువుచేసెడివారు. "ప్రజ్ఞానం బ్రహ్మ" అని కదా మహావాక్యముల ప్రబోధం. స్వామి సమర్థులను దర్శించే భక్తులలో అనేక విధములైనవారు అనేక సాంప్రదాయకులు ఉండేవారు. భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు...

 

**"చతుర్విధాభజన్తే మాం జనాః సుకృతినో అర్జున**
**ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ జ్ఞానీచభరతర్షభ"** *(భగవద్గీత 7 అ॥ 16 శ్లో॥)*

ఆపదలోనున్నవాడు, సంపదగోరువాడు, జ్ఞానమును వాంఛించువాడు, పరమాత్మ జ్ఞానము నన్వేషించువాడు – ఈ నాలుగు విధములైన భక్తులు నన్ను ఆశ్రయించెదరు అర్జునా! అని భగవానుడు వచించిన రీతిని స్వామి సమర్థులను భక్తులు దర్శించుచుండేవారు. వీరిలో అనేకులు క్రమక్రమముగా మార్పుచెంది శ్రీస్వామి సమర్థులకు పరమభక్తితో అంకితము అయ్యేవారు. అలా వచ్చిన వారిలో స్వామిని ఇంతకు మునుపు చూచి వారిని సేవించిన వారు, వారి వారి గ్రామములలో స్వామివారు చేసిన లీలలను పరస్పరం చెప్పుకొనేవారు. శ్రీ స్వామివారు అక్కల్‌కోట రాకమునుపు అనేక ప్రాంతములలో తిరిగినట్లు, వారు అనేక దివ్యలీలలను ప్రదర్శించినట్లు, అనేకమందికి అనేక విధముల అనుగ్రహం చూపినట్లు వారి మాటలనుబట్టి అచ్చటి భక్తులకు తెలిసినది. దీనితో స్వామి సాక్షాత్తు దత్తస్వరూపులు అని ప్రజలు, భక్తులు విశ్వసించి పూజింపసాగిరి" అని నిత్యానందులు తెలుపగా, విద్యాసాగరుడు "గురుదేవా! శ్రీస్వామి సమర్థులు ఎచ్చటనుండి వచ్చినారు?" వారు ఎన్నో గ్రామములను సందర్శించినారని తెలిపితిరిగదా! ఎచ్చటెచ్చట తిరిగినారు? వారి పవిత్ర పాదస్పర్శతో పునీతమైన భూములు ఏవి? వారు ప్రదర్శించిన లీలలు ఏమిటి? ఎచ్చట నుండి వారు అక్కల్‌కోట చేరినారు? మొదలగు విషయములను వివరముగా తెలిపి నన్ను అనుగ్రహించవలెనని" ప్రార్థించెను. దానికి నిత్యానందుడు వత్సా! శ్రీ స్వామి సమర్థులు ప్రారంభము నుండి అక్కల్‌కోట చేరిన వరకు గల కథలను తెలిపెదను వినుము అని శ్రీ స్వామిని ప్రార్థించి మొదలిడెను.

**జై దిగంబరా దిగంబరా! శ్రీ స్వామి సమర్థ దిగంబరా!!**

ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున
శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని
**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** (శ్రీ విఠల్ బాబాజీ) విరచిత
**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**
**పన్నెండవ అధ్యాయము** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం
శ్రీ గురుదేవదత్త-శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పదమూడవ అధ్యాయము

### శ్రీస్వామి సమర్థుని 100 సంవత్సరముల పర్యటనలు

**శ్రీ** స్వామి సమర్థులు ఖండోబా దేవాలయంవద్ద ప్రథమముగా దర్శనమిచ్చారుకదా! అందువలన శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోట ప్రవేశం, వారి ప్రభావం-వారి ప్రబోధం మాత్రమే భక్తులకు తెలుసు. ప్రభాతం (జననం) తెలియదు. ఆయన ఎవరికీ ఎప్పుడూ ఈ వివరాలు నిశ్చయంగా చెప్పలేదు. అరుదుగా అప్పుడప్పుడూ ఆయన తెలిపిన వివరాలు వున్నా కూడా అవి అన్నీ ఒకరీతిగా లేవు. ఒకప్పుడు భక్తుడైన చింతోపంత్ స్వామిని ఈ వివరములు అడిగినారు. దానికి స్వామి యిలా చెప్పారు : "నా తల్లిదండ్రులు మాదిగవారు, వృత్తి తోళ్ళపని". వేరే భక్తునితో "మేము కదళీవనం నుంచి వచ్చినాము" అన్నారు. కార్వే అను భక్తుడు ఒకసారి స్వామిని వారి కులగోత్రాలు, తల్లిదండ్రుల వివరాలు అడిగినాడు. దానికి స్వామి సమర్థులు "నేను యజుర్వేద బ్రాహ్మణుడను, కాశ్యపగోత్రం, పేరు నరసింహభాను, మీనరాశి. మళ్ళీ అడిగితే చెప్పు తీసుకొన్డతా!" అన్నారు. మరొక భక్తుడు అడిగినపుడు ఇలా అన్నారు "మూలపురుషుడు, వటవృక్షం - మూలం - మూలానికి మూలం" అని దీన్నిబట్టి చూస్తే వీరు మూలపురుషుడు అయిన దత్తాత్రేయస్వామియని - గురువులకు గురువుయని, వటవృక్షము అంటే సద్గురువు దత్తాత్రేయ స్వామియే అని, ఊడలు అవతారములనగా ఇతర గురువులు అని ఆ దత్తాత్రేయస్వామి నేను అని చెప్పుటయే అన్నిటికి మూలము. పరమసత్యం, మూలానికి మూలం పరమాత్మను నేనే అని వారి మాటలకు అర్థంగా గోచరించుచున్నది (శ్రీ భరద్వాజ వాక్యాలలో అతని భావం ఇదే).




కదళీవనం నుంచి వచ్చాము అని చెప్పటంవల్లను, మరికొన్ని ఆధారాలవల్ల కూడా వీరు శ్రీ నరహరి నరసింహ సరస్వతి స్వామివారే అని చాలామంది నమ్ముతారు.

విద్యాసాగరా! నామధారక సిద్ధముని సంవాదరూపమైన శ్రీగురుచరిత్రలో శ్రీగురుడు అయిన నరహరి నరసింహ సరస్వతి స్వామివారు గాణుకాపురంలో కొంతకాలం నివశించిన తరువాత అక్కడ తన నిర్గుణపాదుకలను ప్రతిష్ఠించి శ్రీశైలక్షేత్రానికి బయలుదేరినారు. అది 1456 వ సంవత్సరము. అనగా బహుధాన్య నామ సంవత్సరములో ఉత్తరాయణ పుణ్యకాలములో కుంభరాశిలోని సూర్యుడు, కన్యారాశిలోనికి బృహస్పతి (గురుడు) ప్రవేశించినారు. అది శిశిరఋతువు, మాఘమాసము, కృష్ణపక్షము, ప్రతిపద (పాడ్యమి) శుక్రవారము నాడు పుష్యమి నక్షత్రంలో కృత్తిక శుభసమయములో శ్రీశైలక్షేత్రం దగ్గరగా వున్న కృష్ణానది (పాతాళగంగ)లో ఒక పుష్పాసనములో కూర్చుని నదిమధ్యకు వెళ్ళి, సాగిపోతూ శిష్యులతో “మేము ఆనంద నిలయానికి వెళ్లుచున్నాము. అక్కడకు చేరిన తరువాత నాలుగు పుష్పాలు ఈ నదిలో కొట్టుకొని వస్తాయి. వానిని ప్రసాదంగా తీసుకొని మీరు భద్రపరచుకొనండి” అని దీవించి నదిలో సాగిపోయినారు. వారు అలా వెళ్ళి కదళీఫల వనంలోచేరి తపమును ఆచరించ మొదలిడిరి. వారు కదళీఫల వనములో ప్రవేశించినట్లు శ్రీగురుచరిత్ర ద్వారా తెలిసినదికదా! ఆ తరువాత వారిని గురించిన వివరములు ఎవ్వరికీ తెలియదు. స్వామి సమర్థులు చెప్పిన మాటలు ఈ వివరాలకు సరిపోవుచున్నవి.

మధ్య భారతములో అష్టవర్ష బాలకునిగా దేవకీనందనుడైన శ్రీకృష్ణునివలె శ్రీస్వామి సమర్థులు మొదట ‘చెలిఖేడా’ గ్రామమువద్ద కనిపించినారని – వీరు నరసింహ సరస్వతీ స్వాములవారేనని శ్రీస్వామి సమర్థుల శిష్యులలో ముఖ్యమైనవారు శ్రీస్వామిసుత తెలిపినారు. కాని వారు ఎక్కడ పుట్టినారు – వారి వారి తల్లిదండ్రులెవరు – ఆయన పేరేమి మొదలగు వివరములు ఏమీ తెలియవు. జన్మరాహిత్యుని జన్మను గూర్చి ఎవరు తెలుపగలరు. అక్కల్‌కోటలో ఆఖరి మజిలీలో అనేక సంవత్సరములు నివసించుటచేత శ్రీవారిని అక్కల్‌కోట స్వామి అని, సమర్థులైన సద్గురువు కావున స్వామి సమర్థులని ప్రజలు, భక్తులు పిలుచుకొనేవారు. అవే వారి పేర్లుగా స్థిరపడినవి.

శ్రీ నరసింహ సరస్వతిగా శ్రీశైలంలో కదళీవనం ప్రవేశించిన



కొంతకాలానికి వీరు హిమాలయపర్వతాలు చేరి, అక్కడొక అడవిలో సమాధి నిష్ఠలో మూడు వందల సంవత్సరాలపాటు తపస్సుచేస్తూ గడిపారు. వారిచుట్టూ పుట్టలు పెరిగిపోయినాయి. వానిపైన చెట్టూ, చేమలు, లతలు మొలచినాయి. కొంతకాలానికి అడవిలోని కట్టెలు కొట్టుకొనేవాడు ఒకడు ఈయన ఉన్న పుట్టపైన పెరిగిన చెట్టును నరికే ప్రయత్నములో గొడ్డలివేటు జారి పుట్టపైన పడినది. ఆ గొడ్డలి పెట్టుకు పుట్టలోని ఒక భాగం నుంచి నెత్తురు కారసాగింది. ఆ కట్టెలు కొట్టువానికి అమితమైన ఆశ్చర్యం కలిగి ఆ పుట్టను తొలగించగా సమాధిలో నిష్ఠలోవున్న స్వామి మేల్కొన్నారు. అతడు ఆ దివ్యమైన ఆకారం చూచి తన తప్పును మన్నించమని శరణు వేడాడు. స్వామి అతనికి అభయమిచ్చి, ఈ మేలుకొలుపు భగవంతుని ఆదేశముగా యెంచి, తన అవతార కార్యాన్ని కొనసాగించమన్న దివ్యప్రబోధంగా తీసుకొని తన పర్యటనను ప్రారంభించినారు.

విద్యాసాగరా! ఇది శ్రీ స్వామి అక్కల్‌కోట చేరటానికి సుమారు 100 సంవత్సరములకు పూర్వం జరిగినది. 1756 సంవత్సరము కావచ్చు. ఆ తరువాత వారు అనేక ప్రాంతములను సందర్శించినారు. అనేక ప్రాంతములలో భక్తులచేత, ప్రజలచేత అనేక రకములుగా పిలుబడుతూ స్వామి సంచారం సాగించినారు. వారు అంచెలంచెలుగా హిమాలయములలో ప్రయాణించు చున్నప్పుడు, అనేకమంది తాపసులు, యోగులు గుహలలోనుంచి వెలుపలకు వచ్చి భక్తిశ్రద్ధలతో నమస్కరించి స్వాగతము పలికి గుహలలోనికి తీసుకొనిపోయి అర్ఘ్యపాద్యములతో పూజించి తమవద్దగల ఆహారమును సమర్పించేవారు. వారికి సాధనలో కలుగు ఇబ్బందులను, యోగవిద్యలోని మర్మములను, ఆధ్యాత్మిక విజ్ఞాన విషయములను అడిగి తెలుసుకొనేవారు. శ్రీస్వామి వారందరికి కావలసినవి అనుగ్రహించేవారు. జగత్‌గురువైన దత్తావతారులు కనుకనే ఆ యోగులు వారిని పూజించి సంతుష్టి చెందినారు. వారు హరిద్వార్ – ఋషికేష్, బదరినారాయణ, కేదారనాథ్, గంగోత్రి, యమునోత్రి, నందాదేవి, కైలాసపర్వత ప్రాంతములలో పర్యటించి 1758లో జనపదాలకు చేరినారు.

ఒకసారి శ్రీస్వామి సమర్థులు నేపాలు దగ్గరగానున్న ఒక దట్టమైన అడవిలో సంచరించుచుండగా వనమూలికలను సేకరించు చైనీయ దంపతులు

చూచుట తటస్థించినది. సరియైన వస్త్ర ఆచ్ఛాదన లేని అనుమానాస్పద దృక్కులు గలవానిగా వీరిని తలంచిరి. వారు ఈ వింత పురుషుడు ఎవరో పిచ్చివాడై వుండవచ్చునని అనుకొని హేళన చేసిరి. మరియు వారు స్వామివారి ఎదుటనే కామక్రీడలతో ఆనందించసాగిరి. స్వామివారు ఆ సిగ్గు, లజ్జ లేని దంపతులను కోపముతో తీక్షణముగా చూచిరి. అంతట ఆశ్చర్యముగా వారి లింగములు మారిపోయెను. వారు స్వామివారిని మహాత్ములుగా గుర్తించి వారి మహిమ తెలుసుకొని పాదములపై పడి క్షమించమని వేడగా వారికి సహజస్థితి కలిగినది.

ఒకరోజు మామిడిచెట్టుక్రింద శ్రీస్వామి సమర్థులు విశ్రాంతి తీసుకొనుచుండగా కంగారుతో ప్రాణరక్షణకై ఒక లేడిపిల్ల అక్కడకు పరుగుపరుగున వచ్చి వారి వెనుకకు చేరినది. ఆ లేడిపిల్ల వెనుక దానిని తరుముచు ఇద్దరు వేటగాండ్రు వచ్చిరి. స్వామివారు దానిని దగ్గరకు తీసుకొని నిమురుచుండిరి. వేటగాండ్రు స్వామిని చూచి "ఆ లేడిపిల్లను విడువుము" అని పలికిరి. స్వామి వారి మాటలను లెక్కచేయలేదు. ఆ అమాయకపు లేడిపిల్లను తమ రక్షణ నుండి విడిచిపెట్టుటకు వారికి ఇష్టములేదు. స్వామి వారి మాటలను విననందున ఈయన ఎవరో సామాన్యుడని పొరబడి తుపాకులు ఆయనపై గురిపెట్టి పేల్చబోగా, అవి పేలకపోగా వారి పాదములు వారు ఉన్న స్థలమునకు, అంటుకొనిపోయి కదలలేని స్థితికి వచ్చినవి. అప్పుడు వారు స్వామివారిని మహాపురుషునిగాను, మహాత్మునిగాను గ్రహించిరి. తాము చేయబోయిన పనికి సిగ్గుపడి స్వామిని క్షమించమని ప్రార్థించిరి. వారిని స్వామి మన్నించి పంపివేసిరి. జీవజంతువులుకూడ వారిని రక్షకునిగా గుర్తించి శరణుజొచ్చేవి. ఇది వారి ఈశ్వరతత్త్వమునకు నిదర్శనము.

విద్యాసాగరా! హిమాలయములోనుండగనే ఒకసారి స్వామివారు చెట్టుక్రింద విశ్రమించుచున్న సమయంలో ఒక లేళ్ళ జంట తప్పిపోయిన తమ లేడిపిల్లను, వెదకుచూ వచ్చెను. స్వామి సమర్థులు వానిని చూచి ఎంతో ఆనందపడి వాని భాషలో దగ్గరగా పిలిచి ఆడలేడితో మాటలాడసాగిరి. అవికూడా తమ భాషలో వేరే ఆకారం మాటలాడుటచూచి, ఆనందముగా వారిచెంత చేరినవి, స్వామివారు ఆ లేడితో నీవు పోయిన జన్మలో పవిత్రమైన స్త్రీగా జన్మించియుంటివి. ఆ జన్మలో నీవు సాధుజంతువులను అగౌరవపరచుటచేత ఈ జన్మలో ఇట్లు లేడివై జన్మించితివి, అనేక జన్మల నుండి కలిగిన కొద్ది



పుణ్యంవలన ఈనాడు నన్ను కలుసుకొన్నావు. అందుచేత మీరిరువురు ఎంతో అదృష్టవంతులు అని పలుకుచుండగానే స్వామివారి సంకల్పముతో తప్పిపోయిన లేడిపిల్ల వారివద్దకు చేరినది. అవి మూడు కలిసి ఆనందించి, స్వామిని వినయంగా భక్తిపూర్వకంగా చూడగా, స్వామివారు మీ ముఖ్వరు రాబోవు జన్మలో మానవులుగా జన్మించండి అని ఆశీర్వదించిరి. అలా స్వామి సర్వజీవులయందు అపారమైన కరుణ కలిగియుండేవారు.

శ్రీస్వామి సమర్థులు అలా అనేక ప్రాంతములు దర్శించుచూ, బంగాళాఖాతము దగ్గరగానున్న పూరి జగన్నాథము అను దివ్యమైన శ్రీవైష్ణవ క్షేత్రము చేరినారు. బరోడాకు చెందిన అల్వాణి బువా అనే సన్యాసి దత్తోపాసకుడు. తన నలుగురు సహచరులతో తీర్థయాత్రలు చేయుచూ ఆ క్షేత్రమునకు వచ్చి అందరూ ఒకేసారి తీవ్రమైన అస్వస్థతకు గురియై బాధపడుచుండిరి. అందరు ఒకేసారి జబ్బుపడుటవలన వారి స్థితి యితరులకు తెలియక చూచువారు ఎవరులేక అనారోగ్యముతో రోజురోజుకు తీవ్రమైన బాధలు పొందిరి. దానికారణమున దాదాపు అందరూ మరణోన్ముఖులై తల్లడిల్లుచుండిరి. ఆ సమయములో వారందరు మానసికముగా లోక గురుడు అయిన శ్రీ దత్తాత్రేయస్వామిని వారి అవతారమైన శ్రీనరహరి నరసింహ స్వామిని ప్రార్థించిరి.

అత్యద్భుతముగా ప్రస్తుత శ్రీదత్తావతారుడు స్వామి సమర్థులు వారి ప్రార్థనలు విని వారిని రక్షించుటకొరకై పూరి క్షేత్రములో వారున్న ప్రదేశం చేరినారు. వారి హీనస్థితిని తెలుసుకొని స్వామి వారిని సమీపించినారు. ఆజానుబాహుడు, దివ్యమైన తేజముగల స్వామిని చూచినంతనే వారికి ఆనందము కలిగినది. శ్రీస్వామివారు వారిని చేరి తమ స్పర్శచేత వారికి ఆరోగ్యమును ప్రసాదించి స్వస్థత చేకూర్చినారు. వారు ఆశ్చర్యముగా లేచి స్వామిని సమీపించి, వారి పాదములకు సాష్టాంగ వందనములు చేసి "స్వామీ! మీరు ఎవరు? మా యీ స్థితి మీకు ఎలా తెలిసినది?" అని ప్రార్థించగా స్వామి చిరునవ్వులు నవ్వుతూ "ఈ విశ్వమంతా నాదే. నేను అన్ని ప్రాంతములలోను వుంటాను. అయితే నేను సహ్యాద్రి నివాసిని. ఎక్కువగా సంచారములో వుందును. గిరినారు, వారణాసి, మాతాపూర్, కరవీరపురము, కురువపురం, ఔదుంబర, నర్సోబవాడి, కరంజా, గాణుగాపురములోను,




గోదావరి కృష్ణా తీరములలో, నర్మదా, కావేరి తీరాలలో ఎక్కువగా సంచరిస్తూ వుంటాను” అని వారు పలుకగనే అల్వానిబువా తన ఎదుటనున్నవారు తమ ఆరాధ్యదైవమైన దత్తావతారులు శ్రీ నరసిహ సరస్వతిస్వామి అని గుర్తించి వారి పాదములకు భక్తిపూర్వకముగా నమస్కరించెను.

చాలారోజులు అనారోగ్యముతో వుండి శ్రీస్వామివారి స్పర్శచేత ఆరోగ్యము చేకూరినంతనే వారికి చాలాకాలముగా ఆహారము లేకపోవుటచేత తీవ్రమైన ఆకలి కలిగినది. ఒకవైపు శ్రీస్వామివారి సమాధానము వింటూనే వారి మనస్సులు రుచికరమైన భోజనము ఎక్కడ లభించునా అని ఆలోచించసాగినవి. శ్రీస్వామివారి సంకల్పముతో వారి మనస్సులోని కోరికలు తీరినవి. వారు ఇలా యోచించుచుండగనే పక్క యింటినుండి వారికి భోజనానికి ఆహ్వానము వచ్చినది. స్వామివారు కూడా వారిని వెళ్ళి భోజనము చెయ్యమని చెప్పినారు.

ఆ విధముగా వారికి స్వామివారి అనుగ్రహముతో ఆరోగ్యము, మంచి భోజనము దొరికినది. దానికి అల్వాని బువా ఇది అంతా శ్రీ దత్తాత్రేయుల అనుగ్రహమని వారే శ్రీస్వామివారుగా అవతరించి వచ్చినారని తలంచి శ్రీ స్వామివారిని మనఃపూర్వకముగా ప్రార్థించి భోజనమునకు వెళ్ళిరి.

కొద్ది సేపట్లో స్వామివారి కృపాదృష్టిచేత రోగులు తక్షణమే ఆరోగ్యవంతులైనారనే వార్త అందరికీ తెలిసినది. గ్రామములోని వారందరు తండోపతండములుగా వచ్చి స్వామిని దర్శించసాగినారు. అక్కడకు చేరినవారిలో ఒక అంధుడు కూడా వున్నాడు. అతడు స్వామివారిని చేరి వారి లీలల గురించి వినుటవలన తృప్తిచెందక స్వామివారి దర్శనము ప్రసాదించమని కోరినారు. స్వామివారు తన మెడలోని హారము తీసి అతనివైపు విసరినాడు. ఒక పండితుడు దానిని తీసుకుని ఆ అంధుని కళ్ళకు తాకించగా వెంటనే అతనికి దృష్టి వచ్చినది. అతడు ఆనందముగా స్వామిని దర్శించి, ప్రార్థించి తృప్తిగా ఇంటికి వెళ్ళినాడు. ప్రజలందరు స్వామి అనుగ్రహం పొంది వెళ్ళిపోయినారు. కాని ఒక వృద్ధుడు స్వామిని చేరి వారి చెవిలో తన భార్య కనిపించుటలేదని ఆమెను గురించి తెలుపమని మొరపెట్టుకొనినాడు. స్వామివారు వానిని తదేకముగా చూచి “వృద్ధుడా! మృత్యుముఖములో కూడా నీకు ఆశ, మమకారములు వదలడంలేదా! ఎప్పుడు వాటి నుండి విముక్తి పొందేది? గత జన్మలో నీవు ఒక నూనె



వ్యాపారస్తుడవు, నా భక్తుడవు. విషయ వాసనలవలన నీకు ఈ జన్మ వచ్చినది" అన్నారు. ఆ వృద్ధుడు శ్రీ స్వామివారి మాటలు నమ్మలేకపోయినాడు. అంతట శ్రీ స్వామివారు అతని నుదుట విభూదిని పెట్టి "గత జన్మలో నీవెవరో చెప్పు!" అన్నారు. వెంటనే అతని పూర్వజన్మ స్మృతి కలిగి నేను అప్పాతేలి (తేలి అంటే నూనె వ్యాపారి) మీరు నరసింహ సరస్వతి, నన్ను మీకు దూరం చేయవద్దు అని ప్రార్థిస్తూ స్వామి పాదాలమీద పడ్డాడు. స్వామి అతనిని తాకినంతనే తిరిగి బాహ్యస్మృతి కలిగినది. ఇంతలో అతని భార్య, పిల్లలు అక్కడికి రావడంతో గత వృత్తాంతమంతా మరచి సంతోషముతో స్వామి ఆశీర్వచనం తీసుకుని ఇంటికి వెళ్ళారు. ఈ సన్నివేశములు రెండూ శ్రీస్వామివారిని దత్తాత్రేయ అవతారంగాను, వీరు నరసింహ సరస్వతి అనీ ప్రచారంలోకి వచ్చినది. ప్రజలు వారిని జగద్గురువుగా గుర్తించి సేవించినారు.

విద్యాసాగరా! స్వామి నరసింహ సరస్వతి గాణ్గాపూరులో నున్నప్పుడు విద్యాగర్వితులైన వేదపండితులిరువురికి గర్వభంగముచేసి, వారు చేసిన తప్పును తెలియజేసి వారికి శాపమిచ్చిన సంగతిని తెల్పియుంటినిగదా! వారు ఎన్నో నీచజన్మల తర్వాత పెద్దపులులుగ జన్మించినప్పుడు గూడ శ్రీస్వామి సమర్థుల రూపంలో దర్శనమిచ్చి అనుగ్రహించిన విచిత్ర లీలను చెప్పెదను వినుము. స్వామివారు పూరీ జగన్నాథం నుండి పర్యటనా కాలములోనే ఒకసారి హిమాలయ పర్వత గుహలలో ఒక తపస్వి, దత్తోపాసకుడై ఎన్నో విధముల మనస్సును నిగ్రహించి, ఆత్మప్రాప్తికై తీవ్రమైన తపస్సు చేస్తున్నారు. అతడెంత కష్టతరమైన సాధనలు చేసినా తన లక్ష్యమైన ఆత్మసాక్షాత్కారాన్ని పొందలేక పోయినానని ఈ జన్మలో ఇది సాధ్యమగునో లేదోనని చాలా మధనపడుతుండే వాడు. ఈ ఆలోచనలతో మనస్సు వికారాన్ని పొందడం, అందువలన అశాంతికి గురియై మరల మరల తన తపస్సును కొనసాగిస్తుండేవాడు. అతడా గుహలో నిరంతరాగ్నిని వ్రేల్చుకొని తపస్సు చేసుకొంటున్నాడు. ఉన్నట్లుండి ఒకరోజు రాత్రి ఆ గుహలోనే ఆయన కెదురుగా స్వామి ఒక ఆసనంపై దర్శనమిచ్చారు. ఆ తపస్వి ఆనందానుభూతిని పొంది స్వామి దర్శనంతో పులకించిపోయినాడు.

స్వామివారికి అర్ఘ్యపాద్యాదులర్పించి, ఫలములను నివేదించినాడు. స్వామి ఫలహారానంతరం తపస్వి ఇలా వేడుకొన్నాడు. "స్వామీ! నేనెంతో శ్రమకోర్చి బాహ్యేంద్రియ అంతరింద్రియ నిగ్రహములు పాటించుచూ ఇచ్చట

తపస్సు చేస్తున్నాను. నాకింతవరకు ఆత్మసాక్షాత్కారం కలుగలేదు. శాస్త్రములో ప్రబోధించిన దానినే నేను అనుసరించినానుగదా! నా సరస్వమును త్యజించి ఈ గుహలో సాధన సాగించుచున్నాను. అనేక సంవత్సరముల నుండియు ఈ విధంగా కొనసాగుచున్నను ఆత్మప్రాప్తి యనునది గగనకుసుమమే అయినది. హే మహాత్మా! ఇప్పుడు నా సుకృతం పండి తమ దర్శనం కలిగింది. నా తపస్సు ఫలించినదనిపిస్తున్నది. మీరు నా ఆరాధ్యదైవమైన శ్రీదత్తమూర్తియేనని భావిస్తున్నాను. నా లక్ష్యమును చేరుకొని ఈ జన్మను సార్థకము చేసుకొనే మార్గముపదేశించి నన్నుద్ధరించండి స్వామి!" అని సంపూర్ణ శరణాగతి చేసెను.

అప్పుడు స్వామివారు కరుణాపూరిత హృదయులై "ఓ తపస్వీ! వైరాగ్య, బ్రహ్మచర్యాదుల పాటించుటయేగాదు, చిత్తశుద్ధితో, ఏకాగ్రతతో నీ దృష్టిని అంతర్ముఖం చెయ్యి. నీ లోపల జ్ఞానాన్ని జాగృతమొనర్చు. ఆస్తి, భాతి, ప్రియములనెడి నామరూపాత్మకమైన పరబ్రహ్మతత్త్వము యొక్క అనుభూతిని నీలోపలనే అనుభవించగలవు. నావంక తేరిపార చూడు. ఈ రూపమును ధ్యానించు"మని స్వామి ఆదేశించుచుండగనే ఆ తపస్వి స్వామివారిని చూచి కన్నులు మూసికొని సహజ సమాధిస్థితిని, ఆత్మసాక్షాత్కారమును పొంది కదలకయుండెను. ఆ సమయమున ఆ గుహాముఖమున రెండు పెద్దపులులు కూర్చునియుండెను. అవికూడా ఈ ఉపదేశమును వినుచుండెను. వానివైపు చూచుచూ స్వామి "ఏమోయీ! పండితులారా! మీరు మా ఉపదేశమెందులకు చాటునుండి వినుచున్నారు. ముందుకు రండి, వేదపండితులకు మీరు చేసిన అవమానములూ, అపరాధములూ గుర్తున్నవా? జయపత్రముల విలువ తెలిసినదిగదా!"యని హెచ్చరించుచుండగనే వాటికి పూర్వజన్మ స్మృతి కల్గెను. అవి లేచి రెండు కాళ్ళపై నిలబడి ముందు రెండు కాళ్ళను చేతులవలె జోడించి ప్రార్థించి స్వామి పాదములకు నమస్కరించినవి. కరుణాసాగరులైన స్వామి సమర్థులు ఆ పులులను సమాధిలోనున్న తపస్వి శిరమును స్పృశించి రమ్మనిరి. తర్వాత వాటి తలపై ఆయన వరదహస్తము నుంచి "రాబోవు జన్మలో కాశీక్షేత్రమున ఒక పుణ్యదంపతుల గర్భమున జన్మించి యోగులై వర్ధిల్లుదురుగాక!" యని దీవించి పంపిరి. తెల్లవారు సమయమున ఆ తపస్వి సమాధిస్థితినుండి బయల్పడి స్వామి సమర్థతను పూర్తిగా గుర్తించి అర్చించెను. స్వామివారు అచ్చటి నుండి వెంటనే బయల్దేరిరి.



శ్రీ స్వామివారు పూరీ నుండి హరిద్వారకు చేరుకున్నారు. అక్కడ యిద్దరు బ్రాహ్మణ సోదరులుండేవారు. వారిరువురు వస్తాదులు. బలగర్వముతో అక్కడకు వచ్చిన యాత్రికులను ముప్పతిప్పలు పెడుతూ అవమానకరంగా మాట్లాడుతూ వుండేవారు. కొంతకాలానికి వారి పాపఫలితంగా ఘోరమైన వ్యాధులకు గురియైనారు. వారు చేసిన పాపములకు తగిన శాస్తి జరిగినదని గ్రామంలోని వారంతా సంతోషించారేగాని వారినెవరూ ఆదుకోలేదు. వారుకూడ గతంలో చేసిన పాపాలకు పశ్చాత్తాపం చెంది జీవితాన్ని భగవన్నామ స్మరణతో పవిత్రం చేసుకొనుటకు ప్రయత్నించినారు. కాని వారి పాపపు అలవాట్లను మాత్రం మానుకోలేకపోయారు. ఆ స్థితిలో కూడ కొన్ని పాపములను చేస్తూ వుండేవారు. వారి పూర్వజన్మలలోని కొద్ది పుణ్యంచేత శ్రీస్వామివారిని చూడడం తటస్థించినది. అదీ స్వామివారు కొందరు భక్తులతో భోజనం చేస్తున్న సమయంలో. అప్పుడు శ్రీ స్వామివారికి వారిమీద అకస్మాత్తుగా కనికరం కలిగి మహావేగంగా వారిదగ్గరకు వెళ్ళినారు. భోజనం మధ్యలో లేచివచ్చిన స్వామిని చూచి ఆశ్చర్యపడుతూ స్వామిని మీరెవరని అడుగుతూ అర్థములేని అనేక ప్రశ్నలు వేస్తూ చికాకుపరచ ప్రయత్నించిరి. శ్రీస్వామి ఆ ప్రశ్నలకు సమాధానమివ్వకుండా వారితో "మూర్ఖులారా! బ్రాహ్మణ జన్మమెత్తిగూడ అనేక పాపములు చేసినదిచాలక, నిన్న రాత్రి రహస్యంగా ఆవును చంపలేదా?" అనగానే వారు నివ్వెరబోయి తెల్లముఖమువేసి స్వామి పాదాలపై పడి క్షమించమని వేడుకున్నారు. అప్పుడు స్వామి గోవును వుంచిన ప్రదేశమునకు, తమను తీసుకుని వెళ్లమనగా, వారట్లే తీసుకొని వెళ్ళి ఆ గోవును చూపిరి. అంతట శ్రీస్వామి సమర్థులు గోవును చంపినవానితో "ఓయీ! నా పాదములను నీటితో కడిగి ఆ జలమును గోవు కళేబరముపైన చల్లుము" అని పలికిరి. ఆ బ్రాహ్మణుడు అదేవిధముగా చల్లగానే ఆవు తిరిగి జీవించి శ్రీస్వామివారి వంక తదేక దీక్షగా పరికించినది. శ్రీస్వామి కూడా దానిని ఆశీర్వదించిరి. ఆ గోవు తన దారిన వెళ్ళినది. స్వామి వారితో సంభాషించుటచేత వారి పాదములను కడుగుటచేత అందొక బ్రాహ్మణునికి జ్ఞానోదయమైనది. గోహత్య మహాపాపమని – తాను ఇంతకాలముగా చేయుచున్న దుష్టకార్యముల వలన మహాపాపము పొందితినని ఈ మహాత్ముడు తమను గోహత్యా పాపమునుండి రక్షించినాడని వారిని సేవిస్తే మిగతా పాపములు తొలగిపోగలవని భావించి "మహాత్మా! మీ దర్శనముచేత




నాకు జ్ఞానోదయమైనది. నేను యింతకాలము చేసిన పనుల వలన పాపమును పొందినాను. ఏ జన్మలోనో నేను చేసిన పుణ్యంవలన మీ దర్శనభాగ్యం కలిగినది. మీరు సాధారణ పురుషులు కారు. సాక్షాత్ పరబ్రహ్మ స్వరూపులు, సద్గురువులు. నావంటి వారిని దండించి – మందలించి – శిక్షించి – ధర్మమార్గంలో నడిపించుటయే మీ ధర్మం. మీ రాకకు అదే పరమార్థం. సద్గురుమూర్తీ! మీ పాద దర్శనంచేత నేను చేసిన పాపములకు యమలోకములో పొందు శిక్షలుగూడ తెలిసినవి, అమాయకులను మోసగించినవారికి, హింసిచినవారికి, జీవప్రాణములకు హాని కలిగించినవారికి శూలమును గుచ్చి నిలబెడతారు. అలా నిలబడి వున్నవారిని పదునైన ముక్కులుగల పక్షులు పొడిచి పొడిచి వేధిస్తాయి. అందువలన పరమపావనమూర్తీ! మీరు మా గృహమునకు దయచేయండి. మా ఇల్లు పావనం చేయండి. నాచే నొసంగబడు ఆతిధ్యము స్వీకరించి, నన్ను తమ దాసునిగా స్వీకరించి పాపరహితుని చేయండి" అని పాదములపై వాలినాడు. వాని సోదరుడు కూడా స్వామిని శరణుజొొచ్చినాడు. స్వామివారు చిరునవ్వు నవ్వి వారిని దీవించి వారి ఆతిథ్యమును స్వీకరించ వారి వెంట నడచినారు. ఈ విషయం గ్రామమంతా తెలిసినది. గ్రామములోని బ్రాహ్మణులు – బ్రాహ్మణ సంఘముల వారు వాని గృహమునకు చేరినారు. శ్రీస్వామివారు వాని గృహమువద్దకు రాగానే వారు స్వామికి చేయు సత్కారములు చూచి వీరు బ్రాహ్మణులు కాదేమోనని అచ్చట చేరిన బ్రాహ్మణ సంఘంవారు మనసులో అనుకొనుచుండగనే శ్రీస్వామి వారివైపు చూచి వారితో "నేను యజుర్వేద బ్రాహ్మణుడను. నాది దత్త నగరము – నా వంశమూలము వటవృక్షము – పేరు నరసింహుడు" అని పలికిరి. అయినను వారి మనస్సులలోని శంక తీరలేదు. అపుడు శ్రీస్వామివారు యజుర్వేద సంహిత నుండి కొన్ని మంత్రములను వినిపించిరి. అంతట ఆ బ్రాహ్మణ సంఘము వారికి అనుమానము తీరిపోయి వారు సద్బ్రాహ్మణులని గ్రహించి వారుకూడ శ్రీస్వామివారిని శ్రద్ధాభక్తులతో పూజించి, నమస్కరించి శ్రీస్వామివారి సముఖమున అందరు గూర్చుండి జయజయ నాదముల చేసిరి. అపుడు శ్రీస్వామివారు వారి అందరినీ ఉద్దేశించి ఈ విధముగా ఉపదేశించినారు. "బ్రాహ్మణులారా! భక్తజనులారా! జన్మలన్నింటిలోను నరజన్మ ఉత్తమోత్తమమైనది. ఈ నరజన్మ లభించుటయే దుర్లభం. అనేక జన్మలలో చేసుకున్న పుణ్యంవలన



ఈ దుర్లభమైన నరజన్మ లభించును. లభించిన నరజన్మను సద్వినియోగం చేసుకోవాలి. అలాకాకుండ దుఃఖమయములయిన విషయాసక్తితో దానిని వ్యర్థం చేసుకోరాదు. కామక్రోధాలు – కోరికలు నీచమైనవి. వానిని ఆశించి వానికై జీవించు మానవులు దుర్లభమైన తమ నరజన్మను కించపరచినవారగుదురు.

ఉత్తములైన మానవులు సద్గురుచరణాలను ఆశ్రయించి తమ జీవితలక్ష్యం అయిన మోక్షపదం పొందడం కొరకు తపస్సు చేయడం – ధ్యానం చేయడం ప్రథమ కర్తవ్యం. తప, ధ్యాన, యోగాలవలన చిత్తశుద్ధి లభిస్తుంది. చిత్తశుద్ధి వలన బ్రహ్మపథం ప్రాప్తిస్తుంది. ఉత్తములైన సత్పురుషుల సేవ, సత్సాంగత్యము అనేవి వారిని పరమాత్మ నివాసానికి తీసుకొని పోతాయి. అపవిత్రుల సహచర్యం అథఃపతనానికి దారితీస్తుంది.

నరజన్మములో అతి ఉత్తమమైనది బ్రాహ్మణునిగా జన్మించడం – బ్రాహ్మణుడు ఎల్లవేళలా బ్రహ్మ మార్గావలంబిగా వుండాలి. శాస్త్రవిధులను అవలంభిస్తూ నిత్యం జపధ్యానాదులతో – తపస్సుతో – అత్యంత నిష్ఠ నియమములతో జ్ఞానమార్జించి అర్హతననుసరించి ఇతరులకు పంచిపెడుతూ వారికి ఆధ్యాత్మిక జ్యోతిగా, దైవముచే నియోగించబడిన సంరక్షకుడిగా జీవించాలి. బ్రాహ్మణుడు నిస్వార్థజీవిగా – సంఘ శ్రేయోభిలాషిగా జీవించి తరించాలి. పురజనులందరికి ధర్మమును, శాస్త్రమును అందించి పురోహితుడుగా వారు అందరూ ధర్మమార్గమున జీవించే విధముగా చూడాలి.

మృత్యువు ఏనాటికైనా తప్పదు అన్న విషయం తెలియాలి. సంసారంలో చిక్కుకుని అదే ఆనందము అనుకొని జీవించేవానికి భక్తి మార్గం చూపించడం, జ్ఞానులైన వారి ధర్మం. ఈ ధర్మం గుర్తించక, ఆచరించక జీవించేవారు జ్ఞానులైనా కూడా అజ్ఞానులే.

బ్రాహ్మణుడు ఉపనయనమును పొంది గురువులను చేరి వారిని సేవించి వేదములను, ఉపనిషత్తులను పఠించి త్రికాలములో సంధ్యావందనము నొనరించి గాయత్రిని జపించవలెను.

ఇతరులకు ఉపకారము చేయు శక్తిని జపతపాదుల ద్వారా పొందాలి. సుఖదుఃఖములను సమభావంతో స్వీకరించాలి. సర్వభూతహితులు కావాలి. సత్సాంగత్యము పొంది, సత్ ప్రవర్తన కలిగి – 'నేను' అను అహంకారము



తొలగించుకుని పరమాత్మయొక్క – సద్గురువుయొక్క పాదములను ఆశ్రయించి పట్టుదలతో – సంపూర్ణమైన విశ్వాసముతో – సహనంతో – శ్రద్ధతో వారిని ఆరాధించి ఆత్మజ్ఞానము పొంది – బ్రహ్మజ్ఞానియై జీవించాలి. అపుడు ఈ నరజన్మ పొందినందుకు అందులోను బ్రాహ్మణునిగా జన్మించినందులకు ఆ జన్మ లక్ష్యం నెరవేరుతుంది. ఆత్మజ్ఞానం కలవారికి అసాధ్యమనేది ఏదీ వుండదు. అటువంటి వారి వలన సమాజమునకు ఎంతో మేలు చేకూరగలదు. కావున బ్రాహ్మణులారా! ఇక మీదట మీరు అందరూ ఇలా జీవించండి!” అని హితబోధచేసి ఆశీర్వదించినారు. బ్రాహ్మణులందరు శ్రీస్వామివారి ప్రబోధము విని ఆదనందపరవశులై జయజయ నాదములు చెప్పినారు.

***జయ జయ స్వామి సమర్థ ! అక్కల్‌కోట స్వామి జై !***
***జయ జయ స్వామి సమర్థ ! అక్కల్‌కోట స్వామి జై !***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***పదమూడవ అధ్యాయము*** *సంపూర్ణము*







ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ గురుదేవదత్త
ఓం శ్రీ స్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పధ్నాలుగవ అధ్యాయము

### శ్రీస్వామి సమర్థులు 100 సంవత్సరముల పర్యటనలు

**అ**నేక ప్రాంతములలో స్వామివారు చేసిన పర్యటనలను, వారు చూపిన లీలలను విని విద్యాసాగరుడు పులకించుచుండెను. వానికి అత్యంత అద్భుతముగా, కన్నులకు కట్టినట్లుగా స్వామి లీలలను ప్రబోధం చేయుచున్న నిత్యానందుని చూచి "ఓ పావన పురుషా! మీరు మహానుభావులు. నా యదృష్టము కొలది నాకు లభించినారు. మీకు తెలియని విషయాలంటూ వుండవని కూడ నేను భావిస్తున్నాను. అందుచే ఈ సంసారార్ణవమును తరింపచేయగల ఈ దత్తావతారుని కథలను మీద్వారా గ్రహించాలని తద్వారా సద్గురుని దర్శించాలని మరీమరీ కోరుచున్నాను. తరువాత జరిగిన స్వామి లీలలను కూడా వినిపించి నన్నుద్ధరించ ప్రార్థన" అని వేడుకొన్నాడు.

నిత్యానందులు చిరునవ్వు నవ్వి "వత్సా! విద్యాసాగరా! మహాత్ములు తమ పర్యటనల ద్వారా లోకంలో ధర్మస్థాపన చేస్తూ, ధర్మ ప్రబోధంతో భక్తులను రక్షిస్తూంటారు. దండ ప్రయోగంతో దోషులను శిక్షించుచుంటారు. యోగి, సన్యాసి, బ్రహ్మచారి మున్నగువారు అన్ని తీర్థాలనూ, పుణ్యక్షేత్రాలనూ సేవించుచుందురు. ఎందుకంటే సామాన్యులు, పాపులు, దుష్టులు, భక్తులు అయినవారెందరో తీర్థములందు స్నానమాడి పవిత్రులగుచుందురు. క్షేత్రములను, దేవతలను సేవించి పాపపంకిలమును తొలగించుకొనుచుందురు. అందరినీ పవిత్రమొనర్చు క్షేత్రములు, దేవతలు, తీర్థములు, నదులు కళావిహీనము పొందకుండుటకై మహాత్ములు తమ స్పర్శతో మరల పవిత్రతను చేకూర్చి

 

శక్తివంతములుగా చేయుటకై తీర్థాటనము చేయుచుందురు. పుణ్యభూములను ఇంకనూ పునీతం చేయుదురు. అందులకే స్వామివారు కూడా భారతదేశమంతట పర్యటించి తమ స్పర్శతో పవిత్రమొనర్చినారు.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు ఆ బ్రాహ్మణుల సంఘమునకు ధర్మమార్గమున జీవించమని ప్రబోధించిరిగదా! ఆ బ్రాహ్మణ సోదరుల ఆతిథ్యమును స్వీకరించిన అనంతరం అదృశ్యులై గుజరాత్ రాష్ట్రములో కచ్ఛప్రదేశమున నారాయణ సరోవర్ అనే గ్రామములోగల శ్రీకృష్ణ త్రివిక్రమ మందిర సమీపమునగల "వాపి" తీర్థమును చేరినారు. అక్కడ పండాలు (బ్రాహ్మణులు) ఆ పవిత్ర తీర్థానికి స్నానానికి వచ్చిన యాత్రికులను దక్షిణలకై వేధించేవారు. దక్షిణ వసూలు చేసిగాని తీర్థస్నానమునకు అనుమతి యిచ్చేవారు కాదు. అలా అక్కడకు చేరిన స్వామి సమర్థులనుగూడ దక్షిణ ఇవ్వనిచో సరస్సులోనికి వెళ్ళనివ్వమని అడ్డగించారు. అంతట స్వామివారు నవ్వి వారు చూచుచుండగనే గాలిలో పైకిలేచి వారి తలలపై నుండి వెళ్ళి సరస్సు ఒడ్డున కూర్చున్నారు. ఆ దృశ్యమును జూచి అచ్చటి వారందరూ ఆశ్చర్యచకితులైరి. వీరు సామాన్యులు కారనీ, మహా మహితాత్ములని తెలుసుకొనిరి. ఏ సాంప్రదాయ చిహ్నములు శరీరముపై లేని ఈ మహానుభావుడు అవధూతయై యుండవలెనని నిశ్చయించుకొని స్వామివారికి జయజయ నాదములు చేసిరి. ఇదంతా గమనించిన పండాలు (బ్రాహ్మణులు) తమ తప్పును తెలుసుకొని భయంతో గజగజ వణికిరి. ఆ మహాత్ముడు శపించునేమోయని కంపించిపోయిరి. కొంత తేరుకొని ఆయన పాదములాశ్రయించి క్షమాభిక్షను కోరిరి. ఆ గ్రామస్థులు, భక్తులూ మహోన్నతమైన దివ్యపురుషుడు తమకు లభించినాడని వారికి స్నానాదులు గావించి అనేకవిధముల పూజించి స్తుతించిరి. భజనలు, సంకీర్తనలుచేసి ఆరాధించిరి. అనేకులు విరివిగా ప్రసాదములు పంచిరి. కొందరు సంతర్పణలు చేసిరి. స్వామివారు ఆ పండాలను దయతోచూచి ఇకపైన దక్షిణ ఇచ్చేవారివద్ద పుచ్చుకొనుడు, లేనిచో వేధించకుడని బుద్ధిచెప్పిరి. ఆ బ్రాహ్మణులు స్వామిమాటను ఆజ్ఞగా శిరసావహించెదమని మాట యిచ్చిరి.

ఇలావుండగా అదే గ్రామంలో నివశిస్తున్న ఒక పండితుడు తన విద్యా బలగర్వంతో అందరికన్న అధికుడననే భావముతో జీవించేవాడు. అతడు

శ్రీస్వామివారి మహిమ గురించి భక్తులు గొప్పగా కొనియాడుట సహింపలేక గర్వముతో వారిని పరీక్షించాలి అని వారిని సమీపించినాడు. పూజ్యులవద్దకు వచ్చినప్పుడు వారికి నమస్కరించుట ఉత్తమమని తెలిసికూడ నమస్కరింపక వారిని ప్రశ్నలతో పరీక్షింపబూనినాడు. వాని వైఖరిని గ్రహించిన స్వామి సమర్థులు అతని తల్లిదండ్రుల వివరాలు అడిగినారు. అందులకు అతను వారు 35 సంవత్సరముల క్రితమే మరణించారని బదులు యిచ్చాడు. స్వామివారు అతనితో నీ తండ్రి యిప్పుడు నీ ఇంటిలోనే వున్నాడు, నీ పిల్లవాని ఊయల ఊపుచున్నాడు, వెళ్ళి చూడమని అన్నారు. అందులకు అతను అంగీకరింపక తన తండ్రి మరణించి ఎంతో కాలము అయినది అని గట్టిగా జవాబు యిచ్చినాడు. స్వామివారు అతనిని కరుణతో చూచి, అతి నిదానంగా "నీవు ఇంటికి వెళ్ళిచూడు, ఒక పెద్ద సర్పము మీ పిల్లవాడి ఊయల ఊపుచున్నది. ఆ సర్పమే నీ తండ్రి" అని చెప్పారు. అయినా అతను నమ్మక వీరిని వింతగా చూచుచుండగా శ్రీస్వామివారి సంకల్పముతో కొద్దిక్షణాల్లో అందరు చూస్తుండగా ఆ సర్పం వారి వద్దకు వచ్చినది. అది చూచి అక్కడివారు దానిని చంపబోగా, స్వామీజీ వారిని వారించి సర్పాన్ని లేవనెత్తి దగ్గరకు తీసుకొని దానితో ఇట్లు అన్నారు. "ఓయీ నీవు పోయిన జన్మలో ఎవరికీ మేలు చేయనివాడవై స్వార్థముతో జీవించినావు. గత జన్మ వాసనల కారణంగా నీవు నీ పుత్రుని ఇంటిలో ఈ రూపంతో తిరుగుచున్నావు. ఇకనైనా వాటిని వదలుకొని నీ క్రూరస్వభావమును విడచి సాధువువలె జీవించు అని మందలిస్తూ దగ్గరలోని కోనేటిలో వదలినారు. అది నీటిలో ప్రవేశించి లోపలకు వెళ్ళిపోయింది. సర్పరూపములో వున్న ఆ జీవి మరుజన్మలో ఉత్తమమైన యోగిగా జన్మిస్తాడని స్వామివారు అక్కడ చేరినవారితోను, ఆ పండితునితోను చెప్పారు. స్వామివారు చూపిన ఈ కరుణకు అతను సంతసించి స్వామివారికి పాదాభివందనాలు చేసినాడు. అక్కడివారందరు స్వామివారి మహిమలకు ఆనందపడి జయజయ నాదములు చేసినారు.

అక్కడ నుండి స్వామి అకస్మాత్తుగా అదృశ్యులై ద్వారకలో కనిపించినారు. అక్కడ శ్రీ స్వామివారు అనేక లీలలు చూపారు. ఆ సమయములో అక్కడ బూర్వాబువా అనే దత్తభక్తుడు దత్తాత్రేయుని దర్శనము కొరకు తీవ్రమైన సాధన

చేస్తూ ఉన్నాడు. అతనికి అప్పుడప్పుడు స్వప్నంలో దత్తాత్రేయ స్వామివారి అవతారమైన శ్రీ స్వామి సమర్థులు దర్శనమిచ్చారు. అతను శ్రీ స్వామివారిని అక్కడ దర్శించినంతనే తాను స్వప్నంలో దర్శించిన దత్తాత్రేయస్వామి అవతారము వీరేనని గుర్తించి స్వప్నంలో దర్శనమిచ్చిన స్వామి ప్రత్యక్షముగా కనిపించుట చూచి ఆనందముతో స్వామిని చేరి వారికి సాష్టాంగ నమస్కారములు చేసి స్వామీ! అనేక సంవత్సరముల సాధనచేత మీ దర్శనం లభించినదని ప్రార్థించారు.

దేవాదిదేవా! సద్గురుమూర్తీ! నీ దర్శనంచేత నేను ఇన్ని సంవత్సరములు చేసిన సాధన సఫలమైనది. దుర్లభమైన ఈ మానవజన్మ సార్థకతను పొందినది.

దేవాదిదేవా! నీ కరుణచేత సమస్తజీవులు తమతమ కార్యములను నిర్వర్తించుకొనుచుండును. ఓ దత్తస్వరూపా – నిరంతరము నీ నామస్మరణయే నా జీవిత లక్ష్యం – నిన్ను దర్శించుట నా జీవిత గమ్యం.

సచ్చిదానందమూర్తీ! మానవుడనై పుట్టినందుకు మోక్షాన్ని సిద్ధింప చేసుకోవాలి. మోక్షాన్ని సిద్ధింప చేసుకోవటానికి – సద్గురు చరణాలనాశ్రయించాలి. నాకు మీ పాదములే శరణ్యం. నాకు ధ్యానమార్గంలో కలుగు అవరోధాలను తొలగించండి అని ప్రార్థించినారు. స్వామివారు అతని ప్రార్థనను విని ఆనందించి – "నాయనా! త్రిగుణాత్మకములయిన కర్మలకు అజ్ఞానమే మూలం. ఆ అజ్ఞానాన్ని దగ్ధం చేసుకోవడానికి ప్రయత్నించు – మానవకోటికంతటికీ ఆచరణీయాలయిన కొన్ని ధర్మాలు వున్నాయి. ఎల్లప్పుడూ సత్యవచనాన్నే పలకటం, సర్వభూతాలపట్లా సమభావంతో మెలగటం, వివేచనా జ్ఞానంతో వ్యవహరించటం, అరిషడ్వర్గాలను జయించడం, అహింసావ్రతాన్ని అవలంభించటం, ఇతర ప్రాణులపట్ల దయతో మెలగటం, దానధర్మాలు చేయుటం, గురువులపట్ల భక్తి గౌరవాలు చూపటం, సమాన బుద్ధిని పెంపొందించుకోవటం, సంతుష్టితో జీవించటం, సర్వేశ్వరుని ఆరాధించటం మొదలయినవి సర్వసాధారణమయిన ధర్మాలు. వాటిని అనుష్ఠించటం ద్వారా ఇహపరాలను రెంటినీ సాధించటం జరుగుతుంది.

అశాశ్వతమైన ఐహిక భోగాలమీద ఆసక్తిని దూరం చేసుకొని, అంతర్దృష్టితో వ్యవహరించేవారికి, పరమశాంతి లభించి తీరుతుంది. కామ్య



భోగలాలసులయినవారు. ఏదో ఒక విధమైన క్షణికసుఖాన్ని ఆశించి, శాశ్వతమైన దుఃఖాన్ని ఆర్జించుకున్న వారవుతారు.

అసంతుష్టి అనేది అశాంతికి మూలం. సంతుష్టిలేని జీవితం దుఃఖ భాజనం కాకతప్పదు. ఆ ప్రాణి కష్టించి పొందిన విద్యా, కీర్తి అన్నీ వ్యర్థమే అవుతాయి. అందువల్ల, అసంతుష్టిని త్యజించటంతో, ఏ విధమైన దురాశగాని వారిలో జనించటానికి అవకాశం వుండదు. సంతుష్టి కారణంగా వారు క్రోధదూరులు కావడం జరుగుతుంది. క్రోధాన్ని జయించినవారు నిర్భయులై చరించగలుగుతారు.

ధ్యాననిష్ఠావలంబులు మనస్సునూ, వాక్కునూ, నియమించుకోవడం అవసరం. మనస్సునూ, వాక్కునూ నియమించుకున్నవారికి, అన్యచింత అంటూ వుండదు. అదే ఆధారంగా వారు భగవంతునిలోనే బ్రతకటం సంభవిస్తుంది.

గృహస్థ ధర్మాన్ని అవలంభిస్తూ కూడా భగవంతునిలో బ్రతకటం సంభవమే. ఎప్పుడు ఏ కర్మనాచరించినా, దానిని దైవకార్యంగా భావించటం, ఎప్పటికేది లభిస్తే అది దైవదత్తమనుకొని, సంతుష్టితో అనుభవించటం, అవకాశం వున్నంతవరకు గురువులనూ, అతిథులనూ అర్చించటం, విరామ సమయాల్లో హరికథల శ్రవణం, హరినామ చింతనం చేయుటం, భాగవతుల గోష్ఠినాలకించటం వారిని గౌరవించటం, వారి అనుభూతులు గ్రహించటం మొదలయిన కార్యాలు, గృహస్థులందరకూ ఆచరణ యోగ్యమైనవే. వాటిని ఆచరించటం ద్వారా, ఒక విధమైన శాంతి లభిస్తుంది. ఆ విధమైన శాంతి, ఆత్మజ్ఞానోపార్జనకు అనువైన వాతావరణాన్ని మానసికంగా ఏర్పరుస్తుంది. అది పొందిన ప్రాణి కాలక్రమమున సక్రమమైన సాధన ద్వారా ముక్తిని సాధించటం జరుగుతుంది అని ప్రబోధించి శ్రీ స్వామివారు తన స్పర్శతో అతనిని అనుగ్రహించగానే అతను సమాధిస్థితిని పొందినారు. బూర్వాబువకు స్వామివారిలో శ్రీకృష్ణతత్త్వం – దత్తతత్త్వం గోచరించినది. అతను స్వామిని శ్రీకృష్ణ దత్తాత్రేయ నరసింహ ముని అని పిలిచినారు. ద్వారకలోనే శ్రీ స్వామివారు ఒక అంధునికి చూపు ప్రసాదించినారు. అతనికి పూర్వజన్మ విషయం, రాబోవు (పునర్జన్మ) విషయం వివరించినారు. అక్కడి ఆస్తికులకు దైవప్రసన్నత పొందేలా ఆశీర్వదిస్తూ కొన్ని లీలలను చూపడం జరిగింది.

ద్వారక నుండి శ్రీ స్వామివారు గోమతీ తీర్థాదులకు వెళ్ళినారు. అక్కడ పరమ పవిత్రమైన ఐదు సరస్సులు కలవు. అవి : (1) గోమతీ తీర్థము, (2) గోపీ తీర్థము, (3) చక్ర తీర్థము, (4) పద్మ తీర్థము, (5) శంఖ తీర్థము. వీనిలో భక్తులు స్నానమాచరించి తమ పాపములను ప్రక్షాళనము చేసుకొందురు. అందులో గోపీ తీర్థములోని మట్టిని తీసి తిలకముగా నుదుట నుంచుకొందురు. అదియే పవిత్రమైన గోపీ చందనమని భక్తుల భావన. ఈ తీర్థము గోపీ – చందన శిలలమధ్య నుండుటవలన దానికి విశిష్ఠత చేకూరినది. స్వామి సమర్థులు ఈ తీర్థములలో స్నానము చేసిరి. అయితే ఈ స్నానముల ద్వారా అనేక సంవత్సరముల నుండి భక్తుల పాపములను స్వీకరించుచున్న ఆ తీర్థములకు పాప ప్రక్షాళనం చేసి పవిత్రీకరించిరి. అచ్చట భక్తులకు అనేక ధర్మమార్గములను ప్రబోధం చేసిరి. అచ్చటి భక్తులు కూడ స్వామివారిని "శ్రీకృష్ణ దత్తాత్రేయ నరసింహముని" అని పిలువసాగిరి. స్వామి సమర్థులచట కొంతకాలముండిరి.

పిమ్మట అక్కడినుండి అదృశ్యులై పర్వత శిఖరాలలో యోగుల ఏకాంత తపోభూమి "గిర్నార్" చేరారు. గిర్నార్ శ్రీ దత్తాత్రేయ స్వామి ప్రధానస్థానము. "గిరినారాయణ్"అని "గిరినార్" అని ఈ స్థలమును పిలుస్తారు. ఇది రాజస్థాన్ 'జునాగర్' సమీపాన దట్టమైన అరణ్యప్రాంతము. ఇచ్చట గల మూడు పర్వతములమీద ముఖ్యమైన శిఖరములపై శ్రీ దత్తాత్రేయులవారు కూర్చున్న స్థలంలో వారి పాదుకలు కలవు. రెండవదానిపైన "అంబా భవాని" మందిరము ఉన్నది. మరియొక శిఖరముపై నవనాథులలో ముఖ్యుడైన "గోరక్‌నాథ్" స్థానం వున్నది. ఇది అతి పవిత్రమైన స్థానం. మొదట యాత్రను చేయువారు అంబా శిఖరము తరువాత గోరఖ్‌నాథ్ శిఖరం – తర్వాత శ్రీ దత్తాత్రేయ స్వామి శిఖరము చేరవలెను.

విద్యాసాగరా! ఈ పవిత్రమైన క్షేత్రములో సాధకులకు దత్త దర్శనం కలిగి – వారి అనుగ్రహం కలుగుచుండుట సర్వసాధారణము. శ్రీ దత్తావతారులైన శ్రీ స్వామివారు అక్కడికి చేరి అచ్చటగల "గోముఖ" తీర్థమునందు స్నానమాడిరి. యతివర్యుడు, గొప్ప మహాత్ముడైన శ్రీ శేషనారాయణస్వామివారి పాదుకామందిర పరిసరముల సంచరించిరి. అచ్చటినుండి "హనుమాన్‌దారి"



తీర్థమును చేరిరి. అది అతి సుందరమైన ప్రదేశము. అచ్చట శ్రీరామభక్తుడైన హనుమంతుని దివ్యమంగళ విగ్రహమున్నూ, మందిరమున్నూ గలవు. అచ్చట అనేక మంది సాధువులుండిరి. అందులో ఒకరు జన్మతః కుంటివాడు, రెండు కాళ్ళూ లేవు. అతడు స్వామివారిని దూరమునుండి చూడగానే వాని మనస్సులో ఒక మహోన్నతమైన భావము కల్గెను. దిగంబరులుగా, సరియైన ఆచ్ఛాదన లేకుండా పిచ్చివానివలె కన్పించుచున్న స్వామిలో దివ్యమైన దత్తరూపము దర్శించగల్గినాడు. ఆ భావాతిరేకముతో లేచి స్వామికి నమస్కరించ ప్రయత్నించి విఫలుడైనాడు. తన స్థితినెరిగి దీనవదనముతో చేతులు జోడించి “హే! అనంత బ్రహ్మాండ నాయకా! హే గురు! గిరిధారీ! దీనదయాళో! పరమేశ్వరా! నేను కాళ్ళు లేనివాడిని. నీ పాదములంటి ఎట్లు నమస్కరించగలను. ఆ భాగ్యం నాకు కలిగించండి. హే ! దయాఘనా! మీరు సామాన్య మానవులుగా అందరికీ గోచరించు చున్నప్పటికీ నాకు మాత్రం మీరు శ్రీ దత్తాత్రేయ స్వామిగా దర్శనమిచ్చుచున్నారు అని ప్రార్థించుచుండగా వాని కనుల నుండి ఆనందాశ్రువులు ధారగా కారుచుండెను. అతని దీనస్థితిని గ్రహించి దయాళుడైన స్వామివారు తన మధురమైన వాక్కులతో “ఓయీ! నీవు భయపడకు, నిర్భయుడవై చింతనువీడి, విశ్వాసముతో స్థిరమైన నమ్మకంతో, నీ రెండు చేతులతో నీ రెండు కనులను మూసికొని, తలను అటు, ఇటు త్రిప్పకుండా లేచి నిలబడే ప్రయత్నం చేయి అని స్వామి ఆదేశించుచుండగనే అచ్చట వున్న మిగిలిన సాధువులు వీరిరువురిని చూచి హేళనగా నవ్వి ఓ కుంటివాడా! నీవు మరీ మూర్ఖునివలె వున్నావు. ఎక్కడైనా కుంటివాడు లేచి నిలబడగలడా? ఇదేమైనా సత్యయుగమా? ఈ కలియుగములో ఇలాంటి విశేషాలు జరుగుతాయా? ఎందుకు నీవు ఆ పిచ్చివాని మాటలు వింటావు. ఇలాంటివి మేమింతవరకు కనీవినీ యుండలేదని అతనిని వారించబూనిరి.

అప్పుడా కుంటివాడు “ఓ సాధువులారా! ఆ దివ్యమూర్తి ఎవరో మీకు గోచరించుటలేదు. అతని ఆజ్ఞ పరమేశ్వరుని ఆజ్ఞ. నా ఈ శరీరమేమైపోయినా వారి ఆజ్ఞను మీరలేను. రక్షించువాడున్నూ, శిక్షించువాడున్నూ సర్వకాలములకు కారకుడు ఆ పరమాత్ముడే!” అని ఆనందాశ్రువులతో స్వామిని మనసారా తలచి కన్నులను మూసుకొని దృఢనిశ్చయుడై “జై గురుదేవదత్త” అని పెద్దగా

స్మరిస్తూ లేచి నిలబడినాడు. ఈ దృశ్యమును చూచిన సాధువులందరు ఆశ్చర్యముతోను, భయముతోను కంపించిపోయిరి. స్వామి సామాన్యవ్యక్తి కాదని, సాక్షాత్ దత్తాత్రేయ స్వామియేనని తెలుసుకొనిరి. అప్పుడు తాము హేళన చేసి నిందించినది తప్పని తెలుసుకొనిరి. వారికి వారు చెంపలు వేసుకొని పరుగుపరుగున వచ్చి స్వామి పాదములపై పడి క్షమాపణలు చెప్పుకొని మనసులోన మధనపడసాగిరి. స్వామివారు చిరునవ్వుతో వారిని క్షమించి దీవించిరి. స్వామితో కలిసి ఆ కుంటివాడు కూడా గిర్నార్ పర్వతము నెక్కగలిగినాడు. స్వామి వానికి గణేశ్‌పురి అని నామముంచి అనుగ్రహదీక్ష యిచ్చినారు.

స్వామి ఇంకా ముందుకెళ్ళి అంబా శిఖరము చేరిరి. అచ్చట జగదాంబ ప్రత్యక్షమై "స్వామీ! మీరు మీ నిజస్థానమును వదిలి ఎక్కడకెళ్ళినారు? ఎందులకై వెళ్ళినారు?" అని ప్రశ్నించినది. స్వామి "మాతా! నేను సకలతీర్థక్షేత్రములు సంచరించుచుంటిని. అది నా నైజము. నేను కలియుగములో భక్త సంరక్షణార్థం ఇలా సంచారం చేస్తుంటాను. ఎండిన బీడు భూములకు నీరెంత అవసరమో అటులనే ఆస్తికులకు ధర్మగుణప్రబోధం అంత అవసరం అమ్మా! ఈ పర్వతం కూడా నా స్థానమేగదా! అందులకై తిరిగి వచ్చినాను. మరల వెళ్ళుతూ వుంటాను. అమ్మా! ఇదేగదా నా కర్తవ్యము" అని పలికెను. ఆ తల్లి ప్రసన్నురాలై అదృశ్యమైనది.

అచ్చట నుండి స్వామి గోరక్షానాథ్, అఘ్బంగనాథ్ తపోస్థానముల మీదుగ దత్తాత్రేయ స్వామి శిఖరము వద్దనున్న కమండలు తీర్థమును చేరిరి. ఇది శ్రీ దత్తమూర్తి స్నానముచేయు తీర్థము. ఆ తీర్థమున స్వామి స్నానము చేసిరి. ఆ శిఖరముపైనున్న దత్తపాదుకా మందిరం చేరి అచ్చట కొంతకాలము నివసించిరి. స్వామిని అక్కడ సాధకులు భక్తులు దత్తావతారముగ గుర్తించిరి. అవధూతయని, యోగిరాజు అని వారిని పూజించి "చంచల భారతి"యని పిలువసాగిరి.

విద్యాసాగరా! అక్కడ అనేకమంది దత్త సాంప్రదాయ ప్రవర్తకులు ఇప్పటికీ ఆ నిర్జన, వన, పర్వతసీమలలో తమ యోగసాధనను కొనసాగిస్తున్నారు. వారు నిత్యము శ్రీ స్వామివారి లీలలను మననము చేసికొనుచుందురు.



నీవుకూడా అక్కడేగదా శ్రీ స్వామివారిని గురించి తొలిసారిగా విన్నది. అయితే స్వామివారు అక్కడ ఉండగానే సేవాదాస్ అను సాధకుడు, వాని అనుచరులు స్వామిని దత్తావతారులుగా గుర్తించి సేవించినారు. స్వామిని ఆశ్రయించి వారిద్వారా సాధనా రహస్యములను తెలుసుకొనవలెనని భావించి స్వామిని ప్రార్థింపగా శ్రీ స్వామివారు "సాధకా! ముందుగా చిత్తశుద్ధిని సాధించవలయును. సాధకులు తమ కర్మలను ఈశ్వరార్పణంగా చేసి ప్రతిఫలము కోరకయున్నచో చిత్తము శుద్ధమగునని తెల్పెను. స్వార్థము వీడి మన ధర్మములు మనము నెరవేర్చవలెననెను. అదియే దైవారాధనయనెను. దీనివలన క్రమముగా అహంకారము నశించుననెను. అప్పుడు విశాల దృక్పథమేర్పడవలెను. హృదయమే విశాలమగును. అట్లు చిత్తశుద్ధిని పొందిన పిమ్మట సద్గురువునకై చూడవలెననెను. వారి సేవలో పరిపూర్ణ అర్పితము గావించవలెను. ఆధ్యాత్మిక సత్యములను, దృఢముగా ధ్యానించి అంతఃమననము చేయవలెను. ఇది అనుసరించవలసిన పద్ధతి. దీనివలన తప్పుడు భావములు, మూఢవిశ్వాసములు నశించును. ఇదియే బ్రహ్మజ్ఞానము అని చెప్పుచూ సేవాదాసుకు శ్రీ దత్తాత్రేయ ప్రభువుగా దర్శనమిచ్చెను. ఆత్మజ్ఞానమున కవసరమైన సూచనలు, యోగసిద్ధాంతము తెల్పిరి. సేవాదాసు అతని అనుచరులునూ వారి అదృష్టమునకు సంతోషమున ఓలలాడి స్వామి సమర్థుల ఘనతను వేనోళ్ళ కొనియాడిరి.

గిర్నార్ నుండి స్వామివారు అంతర్థానమై అంబాజోగైలో దర్శన మిచ్చినారు. అంబాజోగై మహారాష్ట్రలోని పర్భనీ జిల్లాలోని పర్వతప్రాంతం. ఆ పర్వత ప్రాంతములో చాలా గుహలున్నవి. అది చాలా గొప్ప పుణ్యక్షేత్రం అంబజోగై - జోగులాంబ మందిరం కలదు. స్వామివారు అచ్చట చాలా సంవత్సరాలు నివశించారు. ఆ కాలంలో వారి లీలల లోని ఒక విచిత్రము, అద్భుతమూ అయిన లీల గురించి చెప్తాను ఆలకించు. ఆ పర్వతంపై గొర్రెలను మేపుకొని జీవించే యాదవుల కుటుంబాలు చాలా వుండేవి. అందులో ఒక యాదవ బాలిక స్వామిని నిత్యము దర్శించి వారితో ఎక్కువకాలము గడుపుతూ వుండేది. స్వామివారు చిన్నపిల్లలతో బాగా ఆడుకొనేవారు. ఆ బాలికయొక్క తల్లికి ఒక విచిత్రమైన కోరిక కలిగింది. ఆ పర్వతం క్రింది భాగమున గ్రామంలో ఒక షావుకారుకు సంతానము లేదని తెలిసి బాలికకు పురుషవేషము వైచి వారింట దత్తు యిచ్చినచో తన కుమార్తె ధనవంతురాలుగ సుఖపడగలదని




ఆలోచన కలిగెను. అట్లు తన కుమార్తెకు వేషము వైచి ఒక గుహవద్ద కూర్చుండబెట్టి ఆ షావుకారుకు వెళ్ళి చెప్పెను. ఎవరో దిక్కులేని పిల్లవాడనుకొని ఆ షావుకారు ఆ బాలుని తెచ్చి పెంచుకొనసాగెను. కొన్ని సంవత్సరములు గడిచెను. ఆ షావుకారు తన దత్తపుత్రునికి వివాహము చేయ నిశ్చయించెను. వివాహమునకు పెండ్లివారు తరలి గంగాఖేడ్ వెళ్ళిరి. ముహూర్తమునకు ముందు నలుగుపెట్టి మంగళస్నానములు చేయించుటకై ఆ పిల్లవాని వేషములోనున్న పిల్లని తీసుకొని వెళ్ళే ప్రయత్నము చేసిరి. అప్పుడాపిల్ల తన అసలు సంగతి బయటపెట్టెను. షావుకారునకు నిరాశ, నిస్పృహలతోబాటు అవమానభారము సహింపరానిదయ్యెను. అంత నాతడు గ్రామమునకు తిరిగివచ్చి తన అనుచరులను పిలిచి ఈ పిల్లను తీసుకెళ్ళి తల నరికి చంపవలసినదిగా ఆజ్ఞాపించెను. వారు ఆ పిల్లను వెంట తీసుకొని వెళ్ళుచుండగా వారిని ఆ పిల్ల బ్రతిమాలి తనను చంపబోయేముందు ఒక కోరిక తీర్చమని కోరెను. అది ఏమనగా ఈ పర్వతముపై నున్న స్వామివారినొకసారి దర్శించవలెనని కోరెను. వారు ఒప్పుకొని వెంటతీసుకొని స్వామివద్దకు వెళ్ళిరి అప్పుడా బాలిక తన ఆపదను స్వామి సమర్థులకు విన్నవించుకొనెను. తన తల్లి చేసిన తప్పుకు తాను శిక్షననుభవింప బోవుచున్నాని, తామే తన రక్షకులని నమ్మి ఇక్కడకు వచ్చినానని ప్రార్థించెను.

స్వామివారు బాలికవెంట వచ్చినవారి వంక తీవ్రముగా జూచుచు ఎందుకీ బాలుని చంప నిశ్చయించినారు. అట్లు చేయు అధికారము మీకెవరిచ్చినారు. మీ షావుకారును ఇచ్చటికి తీసుకొని రండి అని వారిపై కోపించి పంపివేయగా వారు వారి యజమానికి విషయమంతయును విన్నవించుకొనిరి. షావుకారు పరుగుపరుగున వచ్చెను. స్వామివారు అతనితో మర్యాదగా నీ కుమారుని తీసుకొని వెళ్ళి వివాహం వైభవంగా చేయించు అని ఆజ్ఞాపించిరి. ఆశ్చర్యముగా స్వామి కరుణతో ఆడపిల్ల మగపిల్లవానిగా మారిపోయినది. సత్యయుగంలో వైవస్వత మనువుకు జన్మించిన ఇల అను స్త్రీని పురుషునిగ మార్పు చేసిన వశిష్ఠాది మహర్షుల ప్రభావం మన అందరకూ తెలిసినదే. కాని కలియుగంలో శ్రీస్వామి సమర్థుల లీలతో ఇట్టి మార్పిడి జరిగినది. ఇది శ్రీ దత్తావతారులకు మాత్రమే సాధ్యము.



ఆ షావుకారు ఆ దత్తపుత్రుని తీసుకొనివెళ్ళి స్వామి కరుణతో గంగాఖేడ్‌లోని ఆ పిల్లతోనే వైభవంగా వివాహం జరిపించెను. స్వామి సమర్థుల కీర్తి ఎల్లెడల వ్యాప్తి చెందినది.

అలా అనేక ప్రాంతములలో తిరుగుచు భక్తులను, ఆర్తులను రక్షించుచూ సాధకులకు ధర్మ ప్రచారము చేయుచూ తమ స్పర్శలచేత – వాక్కుచేత – వారికి లోపాలను తొలగించుచూ క్రమంగా దక్షిణ ప్రాంతములోని అతి పవిత్రమైన క్షేత్రం అయిన రామేశ్వరం చేరారు. రామేశ్వరం ద్వాదశ జ్యోతిర్లింగ క్షేత్రములలో ఒకటి. ఇచ్చట త్రేతాయుగంలో శ్రీరాముడు, రావణుని సంహరించిన తరువాత స్వయంగా లింగమును స్థాపించి ప్రతిష్ఠించారు. అటువంటి దివ్యమైన క్షేత్రము శ్రీ స్వామివారి రాకతో మరింత ప్రకాశవంతమైనది.

రామేశ్వరం క్షేత్రంలో శ్రీ స్వామివారు దేవాలయం దగ్గరగా వున్న ఒక పెద్ద చెట్టుక్రింద తమ నివాసమును ఏర్పరచుకొని అన్న వస్త్రాదులపైన ఏమాత్రం ధ్యాసలేకుండా ధ్యానములోనే ఎక్కువగా కాలము గడుపుతూ వుండేవారు. శ్రీ స్వామివారిని దివ్యమైన పురుషునిగా గుర్తించిన జనులు వారిని ఆశ్రయించి సేవించి తమ బాధలకు నిష్కృతిని పొందేవారు. అనేక ప్రాంతముల నుండి జనులు వచ్చి శ్రీ స్వామిని దర్శించుచుండేవారు. ఆ దేవస్థానం గుమస్తా ఒకడు శ్రీ స్వామికి నిత్యం నైవేద్యం సమర్పించుతూ వుండేవారు. శ్రీ స్వామి అతని భక్తికి మెచ్చినారు. అతనికి సంతానమును కలిగేలా దీవించినారు. అనేక సంవత్సరముల నుండి సంతానములేక బాధపడు అతనికి స్వామివారి అనుగ్రహముతో సంతానం లభించినది. ఈ మహత్తరమైన దీవెనల గురించి అందరికీ తెలిసి జనులు విపరీతంగా వచ్చి చూచి వారిని సేవించి దీవెనలను పొందసాగినారు.

రామేశ్వరంలో "కోటి తీర్థము" అను ఒక దివ్యమైన తీర్థము వున్నది. ఆ తీర్థంలో స్నానంచేస్తే పాపముల నుండి విముక్తి కలుగుతుందని ఆ క్షేత్రవాసుల నమ్మకం. అనేక దూర తీరాల నుండి వచ్చిన యాత్రికులు అక్కడ స్నానంచేస్తూ వుండేవారు. అయితే యిక్కడ కూడా యాత్రికులను డబ్బు యిస్తేనే స్నానానికి బ్రాహ్మణులు అనుమతి యిచ్చేవారు. మరీ బలవంతంగా రుసుమును వసూలు చేసేవారు. దానివలన అనేకమంది బీదవారయిన యాత్రికులు – సాధువులు

– బ్రహ్మచారులు చాలా బాధపడేవారు. ఇది గ్రహించిన శ్రీ స్వామివారు ఈ చెడ్డ సాంప్రదాయమును తొలగించడానికి కోటి తీర్థానికి స్నానానికి వెళ్ళగా అచ్చటి బ్రాహ్మణులు స్వామివారిని కూడా దక్షిణకై పీడించసాగినారు. స్వామి దక్షిణ యివ్వడానికి నిరాకరించారు. అంతేకాదు వారితో "ఓ బ్రాహ్మణులారా! ఇది పుణ్యతీర్థము, దైవ ప్రసాదితము. దేవుడిచ్చిన నీటికి దక్షిణ ఎందుకు అడుగుచున్నారు? ఇది మీరు నిర్మించిన స్నానశాల కాదు రుసుము యివ్వడానికి" అని పలికిరి. వీరు ఇంత చెప్పినా వారు వినలేదు. శ్రీ స్వామి ఎన్నోమారులు వారికి నచ్చజెప్ప చూసినారు. అయినా వారు చెవిని వేసుకొనక శ్రీ స్వామిని "దక్షిణ యిచ్చి స్నానం చేయి లేనిచో వెళ్ళిపో!" అనిరి. అంతట శ్రీ స్వామివారు ఎదురుతిరిగి "ఈ తీర్థానికి వున్న పవిత్రత పోతున్నది" అని పలికి వెళ్ళిపోయినారు. వారు శ్రీ స్వామివారి ఈ పలుకులు లక్ష్యపెట్టలేదు.

కాని ఆశ్చర్యంగా ఆ క్షణం నుండే తీర్థములోని నీరు దుర్గంధపూరితమై పురుగులుపడి భరింపరానిదిగా మారిపోయినది. స్నానం చేయుటకు అందరూ భయపడిపోయినారు. ఆ బ్రాహ్మణులకు జ్ఞానోదయమై స్వామి చెప్పిన మాటలు గుర్తుకు తెచ్చుకుని వారి ప్రభావమువల్లనే ఈ సరస్సు ఈ విధముగా మారిపోయెనని గ్రహించి – శ్రీ స్వామివారి కోసం అంతటా గాలించగా వారు అనేక ప్రాంతములలో వెదుకుచూ క్రమముగా శృంగేరి శారదా పీఠాధిపతులు శ్రీ శంకరాచార్యులను చేరిరి. అక్కడ పరమ పూజ్యులైన పీఠాధిపతులను దర్శించి రామేశ్వరములో జరిగిన విషయములను విన్నవించినారు. స్వామి ఒక్క క్షణం కన్నులు మూసుకొని జరిగినవన్నీ తెలుసుకొని "ఓ అవివేకులారా! మీరు చేసిన పొరపాటువలన ఆ సరస్సుకు ఆ గతి పట్టినది. తిరిగి అది పూర్వస్థితిని పొందాలంటే మీరు సత్వరమే వెళ్ళి అక్కడనే వున్న దత్తావతారులైన ఆ స్వామిని శరణు వేడండి" అని వారికి బుద్ధిచెప్పి పంపినారు. వారు తిరిగి రామేశ్వరము రాగా వారికి స్వామివారు రామేశ్వరాలయంలో శివుని సన్నిధానంలో కనిపించినారు. బ్రాహ్మణులంతా వినయముతో చేతులు జోడించి స్వామీ! క్షమించు, అని వారి పాదములు ఆశ్రయించినారు. శ్రీ స్వామివారు వారిని దయతో ఆదరించి కేవలం ధనంకొరకు యాత్రికులను వేధించవద్దని ప్రేమతో, భక్తితో యెవరైనా యిచ్చిన దక్షిణలను స్వీకరించండి అని హితబోధచేసి తిరిగి ఆ తీర్థానికి పవిత్రత కలుగుతుంది అని ఆశీర్వదించినారు. వారి అమోఘమైన

దివ్యవాణి పలికినంతనే ఆ తీర్థములోని నీరు పవిత్రమై తిరిగి యథాస్థితికి చేరినది. బ్రాహ్మణులు స్వామిని అపర శివునిగా గుర్తించి స్నానమునకు ఆహ్వానించినారు. ఇది అందరికీ తెలిసినది. జనులు విపరీతంగా వచ్చుట చూచి స్వామివారు అక్కడనుండి బయలుదేరి కంచికి తరలి వచ్చినారు.

ఆ సమయంలో కంచిలో శైవులకు – వైష్ణవులకు తీవ్రమైన విభేదాలు చెలరేగి కొన్ని స్థలాలపై ఆధిపత్యము కొరకు రెండు వర్గాలవారు న్యాయస్థానాన్ని ఆశ్రయించినారు. వైష్ణవులకు సంబంధించిన అతిముఖ్యమైన పత్రాలు కనిపించక వారు సతమతమై శ్రీస్వామివారిని గురించి తెలిసి ఆశ్రయించగా – వారు నదిలో వెదకండి అని ఆజ్ఞాపించగా అక్కడొక రాతిపై శాసన రూపముగానున్న ఆధారాన్ని గుర్తించారు. దానితో అసలైన వారసులను గుర్తించి తమ వివాదాలను పరిష్కరించుకున్నారు. తరువాత శైవులకు – వైష్ణవులకు సామరస్యము కుదిరి ప్రశాంతంగా జీవించసాగిరి. అక్కడ నుండి స్వామివారు మహారాష్ట్రలోని బీడ్‌జిల్లా వడావత్ రాజూర్ గ్రామమును చేరినారు. అక్కడనున్న సాధు మఠమును చేరగా, అక్కడున్న సాధువులు స్వామివారు మఠప్రవేశం చేయడంతోనే ఒక దివ్యానుభూతిని పొందినారు. ఆ సాధకులందరికి శ్రీస్వామి దత్తావతారంగా కన్పించిరి. వారందరూ ఎంతో ఆనందాశ్చర్యములతో స్వామివారిని పూజించ సాగినారు. అందులో ఒకడు స్వామివారిని అత్యంత ప్రీతితో సేవించినాడు. అతనికి శ్రీస్వామి "లాల్ భారతి" అని పేరు నొసగి తమ పాదుకలను ఒసగినారు. అతడు ఆ పాదుకలను ఆ మఠములో ప్రతిష్ఠించి నిత్యపూజలు నిర్వర్తింప సాగినాడు.

విద్యాసాగరా! ఈనాటికీ అచ్చట పాదుకలకు నిత్యపూజాది కార్యక్రమములు వైభవముగా జరుగుచున్నవి. వాటి నిర్వహణకై స్వామివారి శిష్యుడైన లాల్‌భారతి ఆ ప్రాంతములో ప్రసిద్ధుడు. ప్రముఖుడైన నిజాము సర్కారు వారి దివాను శ్రీ చందూలాల్ దివాను వారిద్వారా ప్రయత్నించగా, నిజాము సర్కారు ఎనిమిది గ్రామముల జాగీరు శ్రీస్వామి సమర్థుల పేరుమీదుగ రాజముద్రతో యిచ్చియున్నారు.

శ్రీ స్వామివారు అక్కడనుండి అదృశ్యమై పండరిపురమువద్ద భీమానదిని చేరినారు. ఆ సమయములో నది వరదలతో పొంగిపొర్లుచున్నది. స్వామివారు

సునాయాసంగా నదిపై నడచి దాటి పండరిపురం చేరినారు. ఆ సమయంలో పండరీపుర యాత్రకు వచ్చిన అనేక ప్రాంతములవారు ఈ వింతను చూచి ఆశ్చర్యానందములు పొందిరి. వీరు సాక్షాత్ పాండురంగడేనని భావించి, ఆ వింతను మననం చేసుకుంటూ పాండురంగని దర్శనం చేసుకుని తిరిగి వెళ్ళిరి. అలా వచ్చిన వారిలో వడవల్ రాజూర్‌వారుగూడా కలరు. వారు తాము చూచిన అద్భుత దృశ్యమును గురించి ఆ వూరిలోని వారికి చెప్పిరి. లాల్‌భారతి వీరి ద్వారా ఆ మహానుభావుని రూపురేఖలు గురించి తెలుసుకొని వారు తనను అనుగ్రహించిన శ్రీస్వామి సమర్థులేని గ్రహించెను. పండరిపురములో ఆ వింత కార్యము జరుగు సమయములో శ్రీస్వామివారు రాజోర్‌లోనే వున్నారన్న విషయము వారికి తెల్పెను. స్వామి ఇక్కడ, అక్కడ ఒకే సమయములో వున్న విషయం అందరూ చెప్పుకొని ఎంతో విస్మయము చెందారు.

విద్యాసాగరా! స్వామి సహస్రరూపుడు, సర్వాంతర్యామిగదా! వారు ఎన్నిచోట్లనైనా వుండగలరు.

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***పదునాలుగవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం ఓం శ్రీ గురుదేవదత్త
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట
# స్వామి సమర్థ లీలామృతము

## పదిహేనవ అధ్యాయము

### శ్రీస్వామి సమర్థులు మంగళవేడాలో నివాసం

**బు**ద్ధిమంతుడైన విద్యాసాగరుడు స్వామి సమర్థుల వివిధ ప్రదేశముల పర్యటనను వారి లీలలను తెలుసుకొని ఆనందపడి భక్తి పారవశ్యముతో "స్వామీ! మీవలన సద్గురుమూర్తి లీలలను విను భాగ్యము కలిగినది. శ్రీస్వామివారు ఇంకను ఏఏ ప్రదేశములలో పర్యటించిరి. ఎక్కువకాలము ఏ క్షేత్రమును తమ పాద స్పర్శతో పునీతం చేసిరి. అక్కడ వారి లీలా విశేషములను తెలుపండి" అని ప్రార్థించెను. అంతట నిత్యానందుడను ఆ యోగిపుంగవుడు "నాయనా! విద్యాసాగరా! నీవు జ్ఞానివి. భగవంతుడు జ్ఞానులకు మాత్రమే గోచరిస్తారు. అందువల్లనే వివేకులయిన మానవులు పరమాత్మ జ్ఞానాన్ని పొందుట కొరకు సర్వకాల సర్వావస్థలలోను భగవంతుని స్మరిస్తూ వుంటారు. సద్గురువులను సేవించి వారి లీలలను - భగవత్కథలను ఆకర్ణిస్తూ వుంటారు. జ్ఞానిని రాగద్వేషాలు క్లేశ మోహ భయాదులు తాకలేవు. వారు ఎప్పుడు సర్వోత్తమమైన శుద్ధ సత్త్వగుణ ప్రధానులుగా వుంటారు. అటువంటి వారి మధ్య జన్మించిన విద్య లోకాలన్నింటికి వ్యాప్తి చెందుతుంది. అందువలన చిరంజీవీ! నీ మూలమున శ్రీస్వామి సమర్థుల లీలలను గానంచేయు అదృష్టం నాకు కలిగినది. అది నాకు అమితమైన ఆనందాన్ని - శాశ్వత సుఖాన్ని ప్రసాదించగలదు. ముక్తికాంత అవలీలగా నన్ను చేరుటకు అవకాశం ఏర్పడినది. భక్తులకు సర్వవిధముల క్షేమము - సౌఖ్యము చేకూర్చు స్వామి కథలను నీకు తెలుపుదును శ్రద్ధగా ఆలకించుము"అని స్వామిని ప్రార్థించి చెప్పబూనినారు.




శ్రీ స్వామివారు పండరీపురం నుంచి మంగళవేడా చేరిరి. 1838వ సంవత్సరం నుండి 12 సంవత్సరములు అనగా 1850 వరకు శ్రీస్వామి సమర్థులు మంగళవేడాలో నివసించిరి.

సోలాపూర్‌జిల్లా పండరీపురం క్షేత్రమునకు దగ్గరవున్న గ్రామము మంగళవేడా. ఇది భక్తవత్సలుడైన శ్రీ పాండురంగని క్షేత్రమునకు దగ్గరగా నుండుటచేతను మహాభక్తులైన మహాత్ములు నివసించుటచేతను గొప్ప ఆధ్యాత్మిక – సాంస్కృతిక సంస్కరణ కేంద్రముగా వికసించినది. ఇచ్చటి ప్రజలు సాంప్రదాయపరులు – సత్ప్రవర్తన కలిగినవారు. దయామయుడు – పరమభక్త శిఖామణి అయిన దామాజీపంత్ పరిపాలించిన ప్రదేశం. వారి సమాధికూడా యిక్కడ కలదు. అంతేకాదు, శ్రీకన్హోపాత్ర – భక్తచొకమేళ – శ్రీ గోవింద బువా – శ్రీ మౌనిబాబా – బాలకృష్ణ బువ మున్నగు పేరొందిన మహాత్ములు – సాధువులు నివసించిన ప్రదేశం. ఇటువంటి పుణ్యపురుషులు నివసించుటచేత వారి సాంగత్యంతో ఈ గ్రామం పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రమైనది. అక్కడ శ్రీ స్వామి సమర్థులు ఒక పుష్కరకాలముండుటచేత దాని కీర్తిప్రతిష్ఠలు నలుదిశలు వ్యాప్తిచెంది ఇనుమడించినవి.

ఓ బ్రహ్మచారీ! శ్రీస్వామి సమర్థులు మొదట ఈ గ్రామములోనికి వచ్చినపుడు వారిని గురించి మంగళవేడాలో ఎవరికీ తెలియదు. ఆ గ్రామ ప్రజలు వారిని పిచ్చివాడో – ముష్ఠివాడో అనుకొనిరి. కాని కొలది కాలమునకే వారిలోని ఆధ్యాత్మిక శక్తిని గుర్తించి వారి కీర్తిని గురించి తెలుసుకొనిరి. వారిని చేరువారు ఎక్కువైరి. వారిలో కొందరు వారికి శిష్యులు కూడా అయినారు. అందరికీ వారి అంతరంగం తెలిసేదికాదు. కొందరు వారిని దిగంబరుడని – చంచల భారతి అని – చైతన్య నరసింహ సరస్వతి అని రకరకాలుగా పిలిచేవారు. ఆయన పట్టణము బయట అడవిలో ఎక్కువగా వుండేవారు. అక్కడ అడవి తెగలవారు – గుంపులవాళ్ళు – పల్లెకారులు ఏమి పెడితే అది తినేవారు. దారిలో పోవువారు ఏమి యిస్తే అది తినేవారు గాని ఎప్పుడూ ఆహారమునకై ఆరాటపడలేదు. ఆయన భిక్షకు బయటకు వెళ్ళేవారు కాదు. ఆహారమునకై ఎదురు చూడలేదు. దొరికితే తినేవారు లేకుంటే లేదు. ఆయనకు ఆహారము అక్కరలేదేమో. ఆయన తమ దివ్యమైన ఆధ్యాత్మిక శక్తివల్ల సంపూర్ణులు. అందువల్ల వారి శరీరం నిత్యనూతనంగా వుండేది. ఎప్పుడూ అలసట అనేది



వుండేదికాదు. అంతేకాదు శ్రీస్వామి సమర్థులు దిగంబరముగా తిరిగేవారు. "బాలోన్మత్త పిశాచవత్" అనునట్లు పిచ్చివానివలె, పసిపిల్లవానివలె, దెయ్యం పట్టినవానివలెనూ, మహాక్రోధిగాను కనపడేవారు. మట్టిలోనే ఆడుకొనేవారు, ఎక్కడపడితే అక్కడ కూర్చునేవారు, పడుకొనేవారు. ఇది ఒక విచిత్రమైన తత్త్వం – సహజంగా సామాన్యులకు అర్థంకాదు. అందుకే వారు స్వామిని గుర్తించలేరు. అలా నిత్యానందులు తెలిపి ఆ దివ్యతత్త్వము మనస్సులో మెదలగా మౌనంగా దానిలో నిమగ్నమైయున్నారు.

మౌనం దాల్చిన నిత్యానందులవారిని చూచుచూ వారు తెలిపిన తత్త్వమును నెమరువేసుకొనుచూ విద్యాసాగరుడు "స్వామీ! అని పిలువగనే నిత్యానందయోగి కనులు తెరిచి విద్యాసాగరుని చూచి కనులతోనే ఏమిటి? అని అడిగెను. దానికి విద్యాసాగరుడు "గురుదేవా! ఇప్పుడు మీరు తెలిపిన శ్రీస్వామివారి ప్రవర్తన విచిత్రమైన తత్త్వం అని అంటిరే అది ఏమి వ్రతం, అలా వుండుటకు కారణమేదైనా గలదా? దయతో తెలపండి" అని అనగా –

నిత్యానందయోగి – "బాలకా నీ శ్రద్ధ నాకు చాలా ఆనందాన్ని కలిగించుచున్నది. నీవు బుద్ధిమంతుడవు. నీవు అడిగితే గుర్తుకు వస్తుంది. స్వామివారి ఈ తత్త్వమును "అజగర వ్రతం" అంటారు. విపులంగా నీకు బోధపడాలంటే ప్రహ్లాద అజగర సంవాద రూపమైన కథ తెలుపుతాను. జాగ్రత్తగా విను" అని శ్రీదత్తదేవుని ప్రార్థించి – "నాయనా! పూర్వం ఒకప్పుడు రాక్షసరాజైన భక్త ప్రహ్లాదుడు లౌకిక తత్త్వమును తెలుసుకొనవలెనను కోర్కెతో కొద్దిమంది ఆర్యజనులతో కలిసి గురువునొద్దకు బయలుదేరెను. అట్లు పోవుచూ కావేరి పావన సైకత స్థలములయందు చక్కగా పండిన నేల కాంతులను తన దేహకాంతులతో కప్పివైచుచు నేలపై పడియున్న మహాజగరాకారుడైన ఒక మునిని ఆ సహనశైల పాదభూమియందు ప్రహ్లాదుడు చూచెను. కాలమునుబట్టి వచ్చు గుర్తులచేతగాని, మాటలు, పనులు, అనుష్ఠానము మొదలగు గుణములచేత గాని పూర్వం తెలిసినవారు కూడా అతడెవరో గుర్తింపలేరు. అట్టి ఆకారము కలవానిని చూచి వినయముతో సమీపించి పూజచేసి, అతని పాదములకు తలను తాకించి, జిజ్ఞాసతో ఆ మహానుభావుడగు ప్రహ్లాదుడు ముందుగా ఇట్లు ప్రశ్నించెను.

"ఓ బ్రహ్మోత్ముడా! నీ శరీరమింతగా ఎట్లు బలిసినది? సంసారివలె సౌఖ్యవంతుడ వెట్లయితివి? ఏదియో ఒక పనిని విడువక క్షణకాలమైనను చేయని వానికి విత్తము కొంచెమైనను లభింపదుకదా! ధనహీనునకు ఇహపర భోగములు లభింపనేరవు! భోగములననుభవింపని పురుషుల దేహములయందు కాంతియు, కళయు గనపడదు. నీవేపనిని చేయుటకైనను కనీసము ప్రయత్నమైనను చేయవు. ఒకచోటనే కదలక మెదలక పడియుందువు దేవా. ఆకాశ కుసుమమైన భోగములు నీకెట్లు కలుగును? ఉద్యమమునుగాని, క్రియనుగాని చేయని నీ శరీరము ఈ విధముగా ఎట్లు బలిసినది? మాకు వినునర్హత యున్నచో ఈ మా సందేహమును తీర్చుము. ఓ కోవిదుడా! కవియును, సమర్థుడును, నిపుణుడును, సముడును, చిత్ర కథల కాధార భూతుడును అగు యతికి లౌకికబంధములు కర్మవశమున పోవునని పెద్దలందురుకదా! అతడు దేనిని స్వీకరింపదనియును అందురుకదా! ప్రవృత్తికిని, దానివలన మీరు అందుకొను ఫలితములకును కారణమేమి?" అని జిజ్ఞాసువగు ప్రహ్లాదుడు అమృతాయమానమగు పలుకులతో ప్రశ్నింపగా ఆనందించిన ఆ అజగర రూపియగు ముని ప్రీతితో చిరునగవును చిందించుచూ సత్యమునూ, హితకరమును అగు సమాధానము నిట్లిచ్చెను.

"ఓ రాక్షస శ్రేష్ఠుడా! ప్రహ్లాదా! నీవు తత్త్వార్థములను తెలిసినవాడవు. ఆధ్యాత్మిక దృష్టితో పరిశీలించి, కోర్కెలవలనను, వైరాగ్యము వలనను జనులెట్టి ఫలితములను పొందుదురో నీకు తెలియును కదా! ఈ విషయమును క్రొత్తగా యితరులు నీకు చెప్పవలసిన దేముండును? ఓ మాన్యుడా! నీ భక్తిపాశములకు బద్ధుడై, చీకట్లను సూర్యుడు పారద్రోలునట్లు, నారాయణ దేవుడు నీ హృదయమునందలి అజ్ఞానమును పటాపంచలు చేయుచుండును. ఆత్మశుద్ధికై నీవడిగిన ప్రశ్నకు నేనెటిగినంతగా సమాధానమిచ్చెదను వినుము. జన్మ జరా ప్రవాహముల వేగములను దూరము చేయకుండ, ఉదరపోషణ మాత్రమునకే ప్రయత్నించే వారెవరైనను ఈ సంసార సాగరమునుండి బయటపడలేరు. ఎన్ని భోగములననుభవించినను పొట్ట నిండనే నిండదు. తృప్తి కలుగదు, కామోప భోగములను మితిమీరి యనుభవింపవలెనని ప్రేరేపించు తృష్ణ నా విజ్ఞానమును మ్రింగివేసి, నన్ను కార్యోన్ముఖుని చేసి, వివిధ జాతులలో ఉద్భవించునట్లుగా



సంసారమువైపునకు త్రిప్పివైచినది. నే చేసిన కర్మబంధములలోపడి భ్రమించుచు నేనీ నరజన్మనందితిని, స్వర్గాపవర్గముల నందలేకపోయితిని. మరల పశుపక్ష్యాది జన్మలనందుటకై ఈ లోకముననే జన్మించుచుంటిని. దుఃఖములు తొలగి పోవుటకు, సుఖములనందుటకును, మానవజాతి విసుగు చెందకుండా కర్మములను కోరి చేయుచూ, ఆశించిన దానికంటె విపరీతమైన ఫలములను పొంది, దుఃఖించుటను గమనించి, జ్ఞానోదయమై వైరాగ్యము నలవరచుకొని మనస్సు భోగములను స్పృజించుచున్నది. కాని అవి యదార్థములు కావను జ్ఞానమును పొంది, లౌకిక భోగానుభవములపట్ల నేను నిద్రింపసాగితిని అనగా వాని జోలికి పోనైతిని, శరీరముతో అఖిలకామములను అనుభవింపక ఆత్మసుఖమునే పొంది, నేనెప్పుడును ఆత్మయందు రమించుచుందును. ప్రారబ్ధమందించునట్టి అవశ్యానుభవనీయములైనట్టి, భోగములను వానిపై ఆసక్తిలేక, అనుభవింపక తప్పదు కనుక అప్పుడప్పుడు వానిననుభవించు చుందును. ఔరా! ఈ లోక వ్యవహారమెంత విచిత్రమైనదో గమనించితివా? జీవుడు తానే సుఖస్వరూపుడై యుండికూడ, ఆ విషయమును మరచి హేయమైన, ఘోరమైన, ద్వైతమైన, అనంతమైన సంసారముపై మోజుపడుచు నాచుగప్పిన చల్లని నీరు ఎదుటనుండగా, అచట నీరు లేదనుకొని భ్రమించి, ఎండమావులవెంట పరుగిడు వెంగళివలె, అడ్డు ఆపులేని స్వతంత్రుడుగా ప్రవర్తించుచు, అర్థమునే అనర్థమనియు, అనర్థమునే అర్థమనియు భావించుచు, దుఃఖసాగరమున మునిగిపోవుచుందురు. దైవ, మానవ యత్నములను రెండింటి మూలమున మానవులు తమ దుఃఖములను తొలగించుకొని సుఖముల నందుకొన గోరుదురు. అందులకై వారు మాటిమాటికి అవశులై కొన్ని పనులను చేయుచుందురు. కొన్నిటిని మానివేయుదురు. తమ కర్మవలన తామే ఫలితమును సాధించుకొనగలుగుదుమని భ్రాంతిపడుచుందురు. మానవులు మత్తిల్లి సుఖముల పొందకోరుదురు. వాటికి బదులు అష్టకష్టములను పొందు క్రియా ఫలములను తెచ్చికొనుచుండును. వానివలన అతనికి అంతకు మించి మరే ఫలితమును వుండదు. ఆ క్రియా ఫలములు కూడ ఆధ్యాత్మిక, అదిదైవిక, అది భౌతిక, తాపాభిభూతములై అతని మానసమున కానందము నెవ్విధమునను అందింపజాలవు. ఇది ముమ్మాటికి నిజము. అజితాత్ములును, లుబ్ధులును అయిన ధనవంతులయొక్క ధనము అనర్థదాయకమగుట మనకు తెలియదా?




దొంగలు, రాజులు, శత్రువులు, తన బంధువులు ధనము నపహరింప గోరుచుందురు. అనుభవించు కొలది దినదినమున ఆ ధనము క్షీణించి పోవుచుండును. అంతేగాక భయమును, దుఃఖమును కూడా కలిగించు చుండును. పశువులు, పక్షులు, యాచకులు, సేవకులు, కాలము అతని కనుదినము అతి భయమును కలిగించుచుందురు. ప్రాణంమీద తీపితోను అర్థమునందలి యాశతోను మానవులకు శోకము, మోహము శ్రమ, భయము, దైన్యము, రాగము రోగము మొదలగు ఎన్నియో యనర్థములు కలుగుచుండును. ఆ ప్రాణముమీద తీపిని, అర్థముపైని ఆశను విడనాడిన మానవుడు అత్యంతా నందము నందుకొనును. మధుకరము (తేనెటీగ)నే గురువుగా భావించి, అది మధురముగా పాడి, పూవు పూవును వేడికొని తెచ్చి దాచుకొనిన తేనెను, దాని తలదన్ని మానవులు సమయమెరిగి అపహరించుటను చూచి, మానవులు వివిధ ప్రయాసములతో సంపాదించిన ధనమునకు కూడ యిట్టి గతియే పట్టునని తెలిసికొని, సర్వకామములను విడనాడితిని. ఏ వస్తువుపైననూ మనస్సు లగ్నము చేయక, దానిని పొందుటకై తహతహపడక, దానంతట అది సంప్రాప్తమైన పదార్థముతోనే నేను తృప్తిపడుచున్నాను. లేదా ఎన్ని దినములైనను తిండికై ప్రాకులాడక కదలక, మెదలక ఉన్నచోటననే పడియుందును. నాగరాజును (పామును) చూచి నేను నేర్చుకొనిన పాఠమిది.

నాయందలి సత్త్వగుణము వలన నాకుగా నేను ఏ క్రియను స్వతంత్రించి ప్రారంభింపను. ఎన్నడును ఏమరుపాటు చెందను. దైవవశమున ప్రాప్తించిన దానిలో మేలు, కీడుల నెంచక, స్వాతంత్ర్యమును విడనాడి, ఆ ఫలమును స్వీకరింతును. ఒక్కొక్కమాఱు లభించినచో అధికముగను, మరియొకమారు లభింపనిచో అల్పముగను భుజింతును. అర్హత్వమును అనర్హత్వమును, అన్నములో రుచ్యము, అరుచ్యము అను భావములను పరిగణింపను. శ్రద్ధగా తీసుకొని రాబడిన పదార్థమునే అమితముగా తినెదను. ముందుగా తిని మరల పదార్థము లభించినచో వెంటనే తిందును. అనుకోకుండా వచ్చిన పదార్థమును రాత్రింబవళ్ళు తినుచునే వుందును. అవమానమని భావింపకుండ మాసిన, చిరిగిన వస్త్రములను, పట్టుబట్టలను, నారబట్టలను, మృగచర్మములను, యితర వస్త్రములను కూడ ఏది లభించినదో దానినే ధరింతును. ఒక్కొక్కప్పుడు గడ్డి, బూడిద, రాళ్ళు, ఆకులుగల కటిక నేలపై పరుండుదును. లభించినచో



యింకొకపుడు పెద్ద పెద్ద సౌధములలోను మెత్తని శయ్యలపై పవళించు చుందును. ఒక్కొక్కప్పుడు క్రొత్తబట్టలను కట్టి, పూలదండలతో శరీరము నలంకరించుకొని, పన్నీటి స్నానమాడి, దివ్యసుగంధ ద్రవ్యములను మేనిపై అలదుకొని, వేగముగా పయనించు రథములు, ఏనుగులు, గుఱ్ఱముల మీద స్వారీ చేయుచుందును. ఇంకొకప్పుడు ఏ భోగములు లేక దిగంబరుడైన ఈగలు, దోమలు నా శరీరమును కరుచుచుండగా పిశాచమువలె ప్రర్తించుచుందును. నన్ను నిందించినవారి నిందలను నేను పట్టించుకొనను. పొగడినవారి ప్రశంసలకు పొంగిపోను. నేను వారును కలసిమెలసి శ్రేయముల నందవలెనను సమభావముతో మహదానందము నందుచుందును. సన్మునులైనవారు చిత్తమునందు పొడము భేదభావమును మనస్సులోనే ఆహుతి చేయవలెను. ఆ చిత్తిని (కోరికను) కూడ మనస్సును వికార కారణమునందు చేర్చి, అహంకృతిని మహత్తునందును, మహత్తును మాయయందును చేర్చి ఆ మాయను స్వానుభవాత్ముడగు భగవంతునియందు సంలీన మొనర్పవలెను. నిరీహుడై, విషసమములగు విషయ సమూహమును విడనాడి, సత్య దర్శియైన జీవునకు మానమేది? అవమానమేది? పొగడ్త ఏది? నింద యేది? ఈ ద్వంద్వముల కన్నింటికి అతీతుడై యుండువాడే సత్యదర్శి, యోగియగును. ఓ పావనమూర్తీ! ప్రహ్లాదా! నీవు భగవత్ప్రియుడవని నేనెఱుంగుదును. కనుకనే నీకు నా రహస్యమైన నిజకర్మ విధానమును ఎఱుగ చెప్పితిని. ఓ కోవిదుడా! ఈ యోగుల విచిత్ర ప్రవర్తనము లౌకిక దృష్టితో చూచువారలకు వెలివేయవలసినదిగా, విచిత్రమైనదిగా కనబడినను, యదార్థమును తెలిసికొనినచో, ఆ యోగుల ప్రవర్తనమిట్లే యుండును. ఇదియే మానవులు తెలిసికొనవలసిన తత్త్వము. ఈ విధముగా ఆ అజగరరూపియగు నా మునీశ్వరుడు పరమ రహస్య ధర్మమును చెప్పగా విన్న ప్రహ్లాదుడు సంతసించి ఆ మునిని పూజించి, అతని నుండి సెలవు తీసుకొని తన యింటికరిగెను. ఇది అజగర ప్రబోధము విన్నావుకదా! విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులది కూడ ఇటువంటి వ్రతమే, అంతేకాక తాము శ్రీదత్త స్వరూపులని తెలుపుట కూడ వారి ఆచరణలో గోచరిస్తుంది.

ఆ తరువాత కథ తెలుపుతాను విను అని –

మంగళవేడాలో బాలకృష్ణబూవా అన్న యోగిమాత్రం శ్రీస్వామిని




దివ్యపురుషునిగా గుర్తించినారు. వారు ప్రతిదినము స్వామిని పూజించేవారు, దర్శించేవారు. వారు దర్శనానికి వచ్చినపుడు స్వామి పాండురంగనిలాగ నడుముపైన చేతులుంచుకొని దర్శనమిచ్చేవారు. వారు శ్రీస్వామి సమర్థులలో శ్రీ దత్తాత్రేయస్వామిని చూచిరి. భక్తితో వారిని సేవించుచుండెడివారు. శ్రీ స్వామిని చూచినప్పుడల్లా బాలకృష్ణ బువాకు శరీరం రోమాంచితము అయ్యేది. కనుల నుండి ఆనందాశ్రువులు వచ్చేవి. తమను తాము మరచిపోయి ఆధ్యాత్మిక ఆనందముతో నిండిపోయేవారు. అది ఒక ఆధ్యాత్మికమైన అనుబంధం. ప్రేమతో ఎల్లప్పుడు అక్కడ వుండాలని అనుకొనేవారు సాధకునకు సద్గురువు దర్శనం లభించినపుడు ఇలాగే జరుగుతుంది. మనోవృత్తులను అణచి అన్నిరకాల ద్వంద్వాలను, దుఃఖాలను, మోహాలను వదిలించి సంసార సాగరాన్ని దాటించగల శక్తి శ్రీగురుచరణాలకే వుంది. అటువంటి దివ్యమైన అవధూతను దర్శించడంచేత బాలకృష్ణ బూవా నిత్యానందమును పొందుచుండెడివారు. స్వామిని దర్శించగానే వారిలో దివ్యమైన ఆధ్యాత్మిక శక్తి జాగృతమయ్యేది. బాలకృష్ణ బువా అద్భుతశక్తులు కలిగిన సాధుపుంగవుడు. అయినా వారిలో అనేక సంవత్సరముల నుండి సాధనలో కలుగు అవరోధములన్నీ శ్రీస్వామిని దర్శించడంతో వారి దివ్యమైన నేత్రముల నుండి వెలువడు ప్రకాశంతో తొలగిపోయినవి. స్వామివారి నేత్రములలోని శక్తి వారిని దివ్యపురుషునిగా తెలియజేసేది.

శ్రీస్వామి సమర్థుల నేత్రముల ద్వారా వెలువడు ప్రకాశము బ్రహ్మశక్తి. వారు మనోహరులు, తేజస్వీ, జగములన్నింటిలో వెలుగు తేజము వారే. నేత్రములందలి ప్రకాశము అనగా పవిత్రాత్మునికి లభించు ఒక విధమైన విచిత్రమైన ఆధ్యాత్మిక తేజస్సనియు సాధకుడు పవిత్రుడైనపుడు వానికి ఈ తేజస్సును దర్శించు శక్తి కలుగును. లేనిచో ఆ తేజమును దర్శింపలేరు. ఎందుకంటే గ్రహములందు, నక్షత్రములందు, సూర్యచంద్రాదులందు ప్రకాశించు తేజమువంటిదే ఇదికూడ. గొప్ప సాధకుడు, యోగి అయిన బాలకృష్ణ బువా శ్రీస్వామివారిలో ఇటువంటి దివ్యమైన చిత్రమైన శక్తిని గుర్తించెను. శ్రీస్వామి మంగళవేడాలో వున్న అన్ని సంవత్సరములు బాలకృష్ణబువా వారిని భక్తితో సేవించెను. స్వామివారు మంగళవేడాలో భక్తులను అనుగ్రహించిన విధానము చాలా గొప్ప ఆశ్చర్యకరమయ్యేను. తద్వారా శ్రీస్వామిని గురించి తెలుసుకొని



అనేక గ్రామముల నుండి జనము రావడం దర్శించడం అనుగ్రహము పొందడం జరిగేది.

మంగళవేడాలో కొంతకాలము గడచిన తరువాత ఒకనాడు స్వామి మహాత్ముడయిన "దామాజీ సమాధి" దగ్గర కూర్చొని ధ్యానములో నిమగ్నమై వుండెను. అలా ధ్యానములో నిమగ్నమైన స్వామిని కృష్ణాజిపంత్ అను ఒక బీద బ్రాహ్మణుడు చూచినాడు. స్వామివారి మంగళకరమైన దివ్య విగ్రహమును చూచి ఆశ్చర్యపోయెను. ఆనందముతో అతని మనస్సు నిండిపోయెను. ఆధ్యాత్మిక స్వరూపుడయిన శ్రీస్వామి సమర్థులవారు ఇది గమనించలేదు. కృష్ణాజిపంత్ సూర్యాస్తమయము వరకు అక్కడేవుండి ఆ దివ్యపురుషుని చూచుచూ అతిమానసికస్థితిని పొంది నిశ్చలుడై, స్వామి అనుగ్రహమునకు ఎదురు చూచుచుండెను. కొంత చీకటిపడిన తరువాత స్వామి కండ్లు తెరచి ఎదురుగా వున్న భట్‌ను చూచి చిరునవ్వు నవ్వి వానిని దీవించెను. కృష్ణాజి స్వామి పాదములకు వందనములు సమర్పించి స్వామిని చూచి "దేవాదిదేవా! సద్గురుదేవా నీవు లీలామానుషుడవు. సాధారణ మానవునిలాగ కనిపించుచున్న నీవు అవ్యక్తుడవు. ఆదిమధ్యాంతరహితుడవు. కోటిసూర్యాయతమైన తేజస్సు చెప్పకనే మీ దివ్యాంతరం గురించి తెలుపుతున్నది. ఓ లోకగురూ! దిగంబరా! నీ చర్యలు, విచిత్రమైన ఈ ఆకారం మీరు అవధూతలని తెలుపుచున్నది. నేను చేసిన అనేక జన్మల పుణ్యఫలంచే నిన్ను దర్శించు భాగ్యము కలిగినది. నన్ను అనుగ్రహించి మా ఇంట యీపూట ఆతిథ్యం స్వీకరించండి అని స్తోత్రముచేసి తిరిగి పాదములపై వ్రాలెను. స్వామి సమర్థులు చిరునవ్వునవ్వి అతనిని లేవదీసి "బ్రాహ్మణుడా! నేను వెర్రివాడను, నియమము లేనివాడను. నా మార్గము అందరికి బోధపడదు. నీకు ఏల శ్రమ? నాకు బిక్ష యిచ్చుటకు ఏల ప్రయత్నించెదవు? నీ దారిన నువ్వు పో!" అనిరి. అంతట ఆ బ్రాహ్మణుడు "స్వామీ! మీరు నా గృహమును పావనము చేయవలెను. అతిథి, అభ్యాగతుల సేవయే గృహస్థులకు ఉత్తమమైన వ్రతంగదా! దానిని నిర్వర్తించుట చేతనే గృహస్థునకు సద్గతి కలుగును అనికదా శాస్త్రవాక్యము. తాము నన్ను అనుగ్రహించి మా ఆతిథ్యము స్వీకరించండి అని మరీమరీ ప్రార్థించెను. అంత దయామయుడైన స్వామి వాని ప్రార్థనకు సంతుష్టులై అతని భక్తికి,

 

వినయమునకు సంతసించి వానిని చూచి "కృష్ణాజి! లే, అలాగే వచ్చెదను పద!" అని వానితో కలిసి వాని గృహమునకు బయలుదేరెను. వారిని అనుసరించి అతి గౌరవముగా తన గృహములోనికి తీసుకొని వెళ్ళెను. వారికి ఆసనముగా ఒక బల్లపైన దర్భచాపను పరచి కూర్చుండచేసి, ఆర్ఘ్యపాద్యములతో పాదపూజ చేసి దంపతులిరువురు పాదాభివందనములు చేసి పాదతీర్థమును తీసుకొనిరి. అంతట అతను తన భార్యయైన గీతాబాయిని స్వామివారికి పాలు, పండ్లు యివ్వమని కోరెను. అతి బీదవాడగుటచే పాలుగాని, పండ్లుగాని మరి యే యితర పదార్థములుగాని లేవు. దానికి ఆమె చాలా బాధపడి స్వామివారు చూడకుండా సైగలద్వారా యింటిలోని పరిస్థితిని భర్తకు తెలియజేయు ప్రయత్నం చేసెను. కాని స్వామి పాదముల చెంత పారవశ్యుడై కూర్చునివున్న అతను ఆమె తెలుపునది గమనించలేదు. దానికి ఆమె బాధపడి యిరుగు పొరుగువారి వద్దనైన పాలు తెచ్చుటకు పాత్ర తీసుకొని బయలుదేరగా వారి పరిస్థితిని తెలుసుకొన్న స్వామి "అమ్మా! ఒడిలో పిల్లవాని నుంచుకొని ఊరంతా వెదికినట్లు, ఇంట్లో ఆవునుంచుకొని ఎక్కడికి బయలుదేరినావు?" అన్నారు. అందులకు గీతాబాయి "స్వామీ! మా ఆవు నాలుగు సంవత్సరాలుగా కట్టలేదు. అందువలన పాలు యివ్వదు" అని విన్నవించుకున్నది. ఆ మాట వింటూనే శ్రీస్వామి సమర్థులు లేచి ఆవు దగ్గరకు వెళ్ళి ఆవు వీపుతట్టి "అమ్మా గాయత్రి! ఓ గోమాతా! నీవు కామధేనువు సంతతివి – తల్లివి, అమ్మా! ఈ బ్రాహ్మణుడు గుణవంతుడు, నిత్యము నిన్ను పూజించువాడు, అతి పేదవాడు, నీవు దయతో కృప చూపనిచో ఈయన యెట్లు జీవించగలడు? కుటుంబమును ఎట్లు పోషించుకొనగలడు? అందువలన నీవు పాలుయిచ్చి అతనిని కరుణించు" అని, గీతాబాయితో "అమ్మా! పాలు పితికి, పాలతో రొట్టె కాల్చుము, రాత్రికి వచ్చి రొట్టె తినగలను" అని వెళ్ళిపోయెను. కృష్ణాజిపంత్, గీతాబాయి స్వామివారి ఆజ్ఞగా భావించి పాలు పితుకుటకు ప్రయత్నించగా ఆ గోవు ధారాపాతముగా పాలు ఇవ్వగా కుండ నిండిపోయెను. ఈ విచిత్రమైన లీల వెంటనే గ్రామం అంతటా ప్రాకిపోయెను. ఈ లీలను చూచుటకు గ్రామస్థులందరు చేరి ఆ వింతను చూచి స్వామివారియొక్క అద్భుతశక్తిని కొనియాడి వారికి జయజయ నాదములు చేసిరి.



గీతాబాయి పాలతో రొట్టెనుచేసి శ్రీ స్వామివారి కొరకై ఎదురు చూచుచుండెను. రాత్రి పొద్దుపోయిన తరువాత శ్రీస్వామివారు వాగ్దానము ప్రకారం వచ్చిరి. ఆ బ్రాహ్మణ దంపతులు శ్రద్ధాభక్తులతో స్వామిని పూజించి ఆ రొట్టెను వడ్డించిరి. స్వామి ఆ దంపతుల విశ్వాసమునకు సంతసించి ఆ రొట్టెను తిని వారిని దీవించెను.

శ్రీకృష్ణునికి సుధాముడు (కుచేలుడు) అటుకులను తినుటకు ఇచ్చి బంగారు నగరమును పొందినట్లు ఆ బ్రాహ్మణ దంపతులకు గోమాతద్వారా జీవనము కలిగించిరి. ఆ బ్రాహ్మణ దంపతులు ప్రతిదినం స్వామిని దర్శించి సేవించుచుండిరి.

ఈ సంఘటన తరువాత మంగళవేడాలోను, చుట్టుప్రక్కల గ్రామములలో వారి మహిమ - మహత్తు లీలలు తెలిసి అందరు స్వామిని మహాత్మునిగా గుర్తించి సేవించ మొదలిడిరి. విద్యాసాగరా! స్వామి ప్రదర్శించిన ఈ లీలలాంటివే శ్రీ దత్తాత్రేయస్వామి చరిత్రలోను, శ్రీ నరహరి నరసింహ సరస్వతి చరిత్రలోను కలవు. ఈ లీలలచే వారు దత్తస్వరూపులుగాను, దత్తావతారులుగాను గోచరించు చున్నారు.

**జై గురుదేవదత్త శ్రీ స్వామి సమర్థ**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**

**పదిహేనవ అధ్యాయము** సంపూర్ణము





ఓం శ్రీ సాయిరాం
శ్రీగురు దేవదత్త!

శ్రీ స్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పదహారవ అధ్యాయము

**ఓ** నిర్మల హృదయుడా! విద్యాసాగరా! చితియనునది మృత కళేబరమును దహించితే, చింతయనునది జీవ కళేబరమును దహించును. చింతలన్నీ వదలి నిశ్చింతను బొంది సద్గురువును సేవించువారిని గురువులు నిరపాయమైన కరుణతో రక్షించి - వారి చింతలను మాపి వారికి శాశ్వత నిశ్చింత, నిశ్చలతనను కలిగించి సద్గతి కలిగించగలరు. స్వామి మంగళవేడాలో నుండగనే జరిగినటువంటి లీలలు కొన్ని తెలుపుతాను, సావధానుడవై వినుము అని శ్రీ స్వామి సమర్థులను ధ్యానించి "దేవాదిదేవా సర్వకార్యములకు నీవే కర్తవు, సకల కార్యములు నీ లీలలే. నీ చర్యలు తెలుసుకొనుట పామరుడనైన నాకు సాధ్యముకాదు. కరుణతో నీ లీలలలోని నిగూఢ రహస్యమును నాకు స్ఫురింపజేసి నీ లీలామృతమును, గానముచేయు శక్తినిమ్ము"అని ప్రార్థించి, చెప్పబూనినాడు.

వత్సా! ఒకనాడు శ్రీస్వామి మురికిగావుండే ప్రదేశాల్లోను, ముళ్ళ పొదల్లోను పడుకొని వున్నారు. ఆయన అలా ముళ్ళలో పడుకొని కూడా మహదానందముతో నుండిరి. వారి ముఖవర్చస్సు ప్రకాశవంతముగా నుండెను. వారు చాలా ప్రశాంతముగా పవళించి వున్నారు. ఆ సమయంలో ఆ గ్రామములోని బసప్పతేలి అనే నూనె వ్యాపారి వీరిని దర్శించుట తటస్థించినది. ఆ పరిసరములలో పవళించి మహా ఆనందముగా నున్నవానిని చూడగానే ఆశ్చర్యముతో వాని మనసులో ఈ మహా మహిమాన్వితుడు ఎవరైయుండవచ్చు. ఈయన సిద్ధపురుషుడా! మహనీయుడా! లేక పిచ్చివాడా! అని ఆలోచిస్తూ



ఆయనకు నమస్కరించినాడు. వెంటనే శ్రీస్వామివారు అతనికేసి తీక్షణముగా చూసి "నేను ఎవరైతే నీకెందుకు?" అని గట్టిగా అరచెను. బసప్ప శ్రీస్వామివారి సర్వవ్యాపకత్త్వ సర్వజ్ఞతను గ్రహించి ఈ మహానుభావుడు తన మనోభావాన్ని అంతలో గ్రహించిరి అనుకొని ఆయన గొప్ప మహాయోగి అని గుర్తించి భక్తితో ఆత్మానందభరితుడయ్యెను. ఆ క్షణం నుండి తన వ్యాపార వ్యవహార చింతలన్నింటిని వదిలి స్వామినే చింతించుచు వారివెంట వారు ఎక్కడికి వెళితే అక్కడికి వెళ్ళి ఆయన సేవకే అంకితమైనాడు. అలా బసప్ప స్వామిని సేవించుచుండగనే అనేకమంది స్వామిని సేవించుటకై వారిని చేరినారు. బసప్ప నిర్మల మనస్కుడై, నిస్వార్థంతో, భక్తితో స్వామిసేవలో లీనమై వుండేవాడు. బసప్పది అతి బీదకుటుంబము. ప్రతిదినం ఇంటింటా తిరిగి నూనె వ్యాపారం చేసి భార్యాబిడ్డలను పోషించుకొను వృత్తి. అతడు వ్యాపారమును మాని 'పిచ్చివాని' సేవకు అంకితమైనందున అతని భార్య చాలా బాధపడి కూలిపని చేసి కుటుంబమును పోషించుకొనుచున్నది.

సద్గురువుపైనగల భక్తి అమృతము వంటిది, దాన్ని ఒకసారి చవిచూసిన వారు ఎట్టి స్థితిలోను వదులుకోలేరు. దాన్ని త్రాగినకొద్దీ త్రాగాలనే అనిపిస్తూ వుంటుంది. తనివితీరడము అనేది దాని విషయములో లేనేలేదు.

గురుభక్తి జనించగానే మితభాషిత్వం, వినయం, ఓర్పు, శ్రద్ధ, ఇంద్రియ నిగ్రహం అలవడతాయి. వాని ద్వారా పాపాలు చాలావరకు క్షీణించిపోయి శిష్యుడు పరిశుద్ధుడు అవుతాడు. అలా పరిశుద్ధుడైన బసప్ప సద్గురుమూర్తి అయిన శ్రీస్వామి సమర్థుల సన్నిధిలో జీవించసాగినాడు. సద్గురువు తన శిష్యులను ఆధ్యాత్మికముగా ఆదిభౌతికంగా – ఆర్థికంగా రక్షించి కాపాడుతారు. బసప్ప కుటుంబస్థితి తెలిసిన స్వామివారు వానికి మేలుచేయ సంకల్పించారు.

ఒకరోజు అనేకమంది భక్తుల మధ్య కూర్చునివున్న స్వామి సమర్థులు అకస్మాత్తుగా లేచి అతి వేగంగా నడవడం ప్రారంభించారు. భక్తులందరూ స్వామివెంట పరుగెత్తవలసి వచ్చినది. అలా అతివేగముగా పోవుచున్న స్వామిని ఒక్క బసప్ప మాత్రమే అనుసరించగలిగినాడు. మిగతావారు పరుగెత్తలేక అలసి ఆగిపోయినారు. చివరకు అందరిని వదలి వారిరువురు ఒక దట్టమైన అడవిలోకి ప్రవేశించినారు. ఆ అరణ్యం అతి గాఢంగా, భయంకరంగా వున్నది. ఆ అడవిలో



శ్రీస్వామివారు అండగానుండటంతో బసప్పకు ధైర్యం వచ్చినది. అలా వారు వెళ్ళి వెళ్ళి ఒకచోట నిలిచిరి. అక్కడ నల్లటివి, పచ్చటివి రకరకాల పాములు అసంఖ్యాకంగా కనిపించాయి. మితిమీరిన భయంతో బసప్ప స్వామి పాదాలు గట్టిగా పట్టుకొన్నాడు. స్వామి చిరునవ్వుతో అభయమిచ్చి ఆ పాములను చూపుతూ, "నీకెన్ని కావాలో అన్నింటిని తీసుకో, ఈ అవకాశం మళ్ళీ తిరిగిరాదు" అని తొందర చేశారు. ఆయన మాటకు జవదాటని బసప్ప ధైర్యాన్ని పుంజుకొని తన ఉత్తరీయంలో నాలుగున్నర అడుగుల పొడవుగల ఒక పామును పట్టుకొని మూటగట్టి భుజాన వేసుకున్నాడు. తిరిగి వారు మంగళవేడా వైపు వచ్చినారు. అడవిదాటి గ్రామము చేరగానే స్వామి బసప్పతో "ఇంటికిపోయి మూటవిప్పి చూసుకో" అన్నారు. శ్రీస్వామివారి ఆజ్ఞతో కూడిన ఆశీర్వచనముతో బసప్ప ఇంటికి పోవుచుండగనే ఆ మూట బరువెక్కినది. ఇంటిలోనికి చేరి మూటవిప్పి చూచినపుడు అతని ఆశ్చర్యానికి అంతులేదు. అది ఒక బంగారపు కడ్డీ. జరిగిన ఉదంతము విని అతని భార్య శ్రీస్వామివారి కరుణను, శక్తిని గ్రహించినది. తరువాత ఆమెకూడా శ్రీస్వామివారిని భక్తితో సేవించేది. ఆ బంగారముతో బసప్ప కుటుంబమునకు దారిద్ర్యం తీరిపోయినది. వారి కుటుంబము అతిథి అభ్యాగతుల సేవలో శ్రీస్వామి అనుగ్రహంతో సుఖంగ జీవించసాగారు. ఈ అద్భుతమైన సంఘటన జరుగుటచే మొదట స్వామివారిని పిచ్చివాడు అన్నవారే వారి శక్తిని గ్రహించి భక్తులైనారు. వారిపేరు దేశదేశములకు వ్యాప్తిచెందినది.

బ్రహ్మచారీ! ఇటువంటిదే మరియొక సంఘటన మంగళవేడాలో జరిగినది వినమని యిలా చెప్పసాగారు.

ఒకనాడు వేసవిలో శ్రీస్వామి సమర్థులవారు బాబాజీభట్ అను బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళి త్రాగటానికి చల్లని మంచినీళ్ళు కావాలి అని అడిగినారు. ఆయన భార్య బయటకు వచ్చి శ్రీస్వామి సమర్థులను చూడగానే ఆనందముతో ఆమె మనస్సు పొంగిపోయినది. ఇంటిలో బిందెలో నీళ్ళు వేడిగా ఉన్నాయి. దొడ్లో బావి పూర్తిగా ఎండిపోయినది. మహాశక్తిసంపన్నుడైన శ్రీస్వామి అడిగినప్పుడు మంచినీళ్ళు చల్లనివి ఇవ్వలేనందుకు ఆ ఇల్లాలు బాధపడి నీళ్ళకోసం ప్రక్క ఇంటికి బిందె తీసుకుని బయలుదేరినది. అదిచూచి స్వామి సమర్థులు "అమ్మా! అది ఏమిటి మీ బావిలో నీరు వుందికదా!" అన్నారు.



దానికి ఆ ఇల్లాలు "స్వామీ! మా బావి పూర్తిగా ఎండిపోయినది" అన్నది బాధగా. అదివిని శ్రీస్వామి సమర్థులు తమ అలవాటు ప్రకారం చేతులతో తమ పెద్ద పొట్టను పట్టుకొని గట్టిగా పకపక నవ్వి, "అమ్మా! మీ బావిలో కావలసినంత నీరు వున్నది. లేదంటావేమి? ఇటురా! నేను చూపిస్తాను" అని ఆమెను బావిదగ్గరకు తీసుకెళ్ళినారు. ఆమె చూస్తుండగా పసిపిల్లవానివలె ఆయన ఆ బావి ప్రక్కనే మూత్రవిసర్జన చేశారు. ఆశ్చర్యంగా చుక్కనీరులేక అనేక రోజులుగా పూర్తిగా ఎండిపోయిన బావినుండి నీరు ఉబికి అతి వేగంగా పూర్తిగా నిండిపోయినది. ఆ సద్గురువుని దాహం తీర్చుటకు మహాగంగ అక్కడకు వచ్చినదా యన్నట్లాయెను. ఆమె అమితమైన సంతోషంతో ఆ నీటిని ముంచి స్వామి సమర్థుల పాదములను కడిగి వారికి త్రాగడానికి నీరు యిచ్చి పాదాభివందనము చేసి జయఘోషలు చేసినది. స్వామివారు నీరు త్రాగి తమ దారిన తాము వెళ్ళిపోయినారు. మంగళవేడా గ్రామస్థులు ఒకదాని తరువాత ఒకటిగా జరుగుచున్న సంఘటనలను చూచి అమితమైన ఆనందాన్ని పొంది స్వామివారిపై అనన్యమైన భక్తిని పెంచుకొని వారిని సేవించసాగిరి. భక్తులు యిప్పటికీ ఈ బావిని దర్శిస్తుంటారు.

స్వామివారి లీలలను గురించి తెలుసుకొని పొరుగు గ్రామమునుండి ఒకరోజు ఒక స్త్రీ, మధ్యలో అనారోగ్యముచేత చూపుపోయిన తన కుమారుని తీసుకొని వచ్చెను. ఆమె శ్రీ స్వామివారి దగ్గరకు చేరి పాదాభివందనములు చేసి తన కుమారునితో పాదాభివందనములు చేయించి వారి సమీపంలో కూర్చుని "బాబా! వీడు నా కుమారుడు, పూర్వం నేత్రములు బాగా వుండి చూపు వుండేది. మధ్యలో అనారోగ్యముచేత చూపు పోయినది. ఎన్నో వైద్యములు చేసినాము కాని ఫలితం కనిపించలేదు. సద్గురుమూర్తీ! మీరు కరుణామయులని, బీదలపాలిట పెన్నిధి అనీ, భక్తవత్సలులనీ తెలిసి మీ పాదములను ఆశ్రయించినాను. గురుదేవా! ఈ దీనురాలిని అనుగ్రహించి నా కుమారునికి చూపు కలిగించండి" అని ప్రార్థించగా ఆమె కుమారుని దీనావస్థకు స్వామి హృదయము కరిగినది. వారు దగ్గరగానున్న పొదలలోని ఆకులను తెప్పించి వానిని నలిపి ఆ బాలుని కండ్లకు కట్టుకట్టి ఆమెతో "అమ్మా! మూడు రోజులు ఉపవాసముండి తరువాత కట్లు విప్పమని" చెప్పెను. ఆమె అలాగే స్వామి తెలిపిన విధంగానే చేయగా వానికి చూపు వచ్చెను.

మంగళవేడా దగ్గరలోవున్న అడవులలో శ్రీస్వామి సమర్థులు ఎక్కువగా తిరుగుతుండేవారు. ఒక మహమ్మదీయుడు భిక్షాటనతో జీవించుచూ పిచ్చివానిలాగా తిరుగుతుండేవాడు. అతను క్రమం తప్పకుండా స్వామిని దర్శించేవాడు. మరియు భక్తిగా సేవ చేసేవాడు. గంజాయితో నింపిన చిలుమును తయారుచేసి యిస్తుండేవాడు. తానుకూడా జతగా చిలుము పీల్చేవాడు. ఒకనాడు స్వామి వాని భక్తికి సంతోషించి తన చేతిని అతని తలపై వుంచి తీక్షణంగా చూశారు. వెంటనే అతను అతీంద్రియ స్థితికి చేరి సమాధి స్థితిని పొంది బ్రహ్మజ్ఞాని అయినాడు. ఎంత అదృష్టము ఆ మహమ్మదీయుని వరించినదీ? కొంతకాలము తరువాత ఆ మహమ్మదీయ ఫకీరు సతారా జిల్లాలో కృష్ణానదీ తీరాన స్థిరపడెను. కొన్ని వేల మంది అతనిని దర్శనము చేసుకొనేవారు. ఆయన ఈ జన సమూహమునకు ఇష్టపడేవారు కారు. ఆయన ఒంటరిగా యుండుటకు ఇష్టపడేవారు. జనమును తోలివేయుటకుగాను పిచ్చివానిలాగా వారిపై రాళ్ళు విసిరేవారు. అయితే అవి సామాన్యంగా ఎవరికి తగిలేవి కావు. అవి ఎవరికి తగిలితే వారి కోరికలన్నీ పూర్తిగా నెరవేరేవి. వారు అదృష్టవంతులయ్యేవారు. ఆయనను 'హౌవలియా' అని పిలిచెడివారు. ఆయన ఎన్నో అద్భుతమైన లీలలను ప్రదర్శించేవారని జనము చెప్పుకొనేవారు. ఏ జన్మలోనో అతను చేసిన పుణ్యం వలన శ్రీస్వామి సమర్థుల దర్శనం, సేవ లభించినవి. దానిచేత అతను గొప్ప యోగి అవడమేకాదు, ముక్తసంగుడై శాశ్వత శ్రీగురు పథమును పొందినాడు.

విద్యాసాగరా! గురువుకు శిష్యునియందు, భగవంతునికి భక్తునియందు అమితమైన ప్రేమ ఉండును. తమ సేవతో, భక్తితో ఎవరు భగవంతునకు, గురువునకు చేరువగుదురో వారికి లేమి అన్నది ఏమీ వుండదు. వారు అమితమైన సిద్ధులను పొంది అనంతరము మోక్షము పొందగలరు. అటువంటి వారిని క్షణమైనా గురువుగాని, భగవంతుడుగాని వదిలి వుండలేదు. పూర్వము నారాయణుడు దూర్వాస మునికి ఈ విషయమునే తెలిపిరి. అని నిత్యానంద యోగీంద్రుడు ఒక్క క్షణం ఆగినాడు. వెంటనే తత్త్వజిజ్ఞాసి అయిన విద్యాసాగరుడు "గురుదేవా! నారాయణుడు ఎప్పుడు ఎందులకు దూర్వాస మహామునికి ఈ విషయము తెలిపినారో – సవివరంగా తెలియజేయండి" అని ప్రార్థించెను.



అంతట ఆ యోగిపుంగవుడు నాయనా! అది మంచికథ తెలుపుతాను విను అని ఆ పురాణ కథను మదిలో తలంచుకొని ఇట్లు చెప్పెను. పూర్వం అంబరీషుడు అను మహారాజు ఉండేవాడు. అతను మహారాజైనా తనదైన మహావైభవాన్ని ఏమాత్రం లక్ష్యం చేసేవాడుకాదు. "వైభవం తమోద్వారం" అన్న దృఢాభిప్రాయం ఆయనకుండేది. ఆయన రాజ్యపాలన సాగించుచు అశాశ్వతమైన భోగాలన్నింటిని త్యజించి అహోరాత్రులు, విష్ణుభక్తితో కాలం వెళ్ళదీసుకునేవాడు.

పరమభక్త శిఖామణి అయిన మహారాజును ఆదర్శంగా తీసుకుని, ఆయన ప్రజలు కూడా, భక్తియోగపరులై వ్యవహరించుచుండేవారు.

ఆ మహారాజు ఏపని చేసినా హరిపరంగానే చేసేవాడు. హరిభక్తులను చూసినప్పుడల్లా, హరిని దర్శించినంతగా ఆనందించేవాడు. అలా వుండికూడా ఆయన రాజ్యవ్యవహారాలన్నీ చూసుకుంటూనే వుండేవాడు. అందుకనే ఆయనకు రాజర్షి అన్న ప్రఖ్యాతి లభించింది.

అంబరీషుని భక్తిభావం శ్రీహరికి ఆనందము కలిగించింది. అది కారణంగానే ఆయన అతని రక్షణభారాన్ని తన చక్రాయుధానికి అప్పగించినాడు. అతణ్ణి తన భక్తులలో శ్రేష్ఠునిగా పరిగణింపసాగాడు.

అలా వుండగా, ఓసారి అంబరీషుడు విష్ణుప్రీత్యర్థం ఒక సంవత్సరము పాటు విద్యుక్తంగా, ద్వాదశీవ్రతం నిర్వహించటం జరిగింది. ఆ వ్రతాంతాన, అనగా మూడు రాత్రులు ఉపవసించి, నాల్గవనాడు ఉదయాన, ద్వాదశీ పారణకు తగిన ఏర్పాట్లన్నీ చేసుకున్నాడు.

ఆ సమయంలో, దూర్వాస మహర్షి అక్కడకు వచ్చాడు. అలా వచ్చిన దూర్వాసుని అంబరీషుడు భక్తిపూర్వకంగా పూజించాడు. ఆ పూటకు తన ఆతిథ్యాన్ని స్వీకరించవలసినదిగా కోరాడు.

దూర్వాసుడందుకు అంగీకరించి, మధ్యాహ్నిక క్రియలు నిర్వర్తించుకునే నిమిత్తం యమునానదికి వెళ్ళాడు. అలా వెళ్ళినవాడు ద్వాదశి ఘడియలు గడిచే సమయానికి కూడా తిరిగిరాలేదు.

ద్వాదశి అప్పటికింకా అర్థముహూర్తం కాలం మాత్రమే వుంది. ఆ లోపల పారణ చేయకపోతే వ్రతఫలము దక్కదు. అది గ్రహించిన అంబరీషుడు, వ్రతభంగం కాకుండాను, దూర్వాసునిపట్ల అపచారము సలిపినట్లు కాకుండాను వుండేవిధంగా, శాస్త్రచోదితమైన జలపారణం చేసి, మహర్షికోసం ఎదురుచూస్తూ ఉన్నాడు.

అంతలో దూర్వాసుడు వచ్చాడు. వచ్చి, తన దివ్యదృష్టితో అంబరీషుడు జలపారణం చేయటాన్ని గ్రహించి, అది తనపట్ల జరిగిన అపచారంగా భావించాడు. అంతే, ఆ వెంటనే "అతిథినైన నన్ను అవమానించిన ఫలం ఇప్పుడే అనుభవించి తీరెదవు" అంటూ గర్జించాడు. తన జటనొకదాన్ని పెరికి ప్రళయానల సదృశమైన కృత్యను సృజించి, వివిధాయుధాలంకృత అయినదాన్ని అంబరీషుని మీదకు వదిలాడు.

అది గ్రహించిన సుదర్శనం, దూర్వాసుని దురాగ్రహాన్ని వారించి, భక్తుడైన అంబరీషుని సంరక్షించే నిమిత్తం ప్రచండవేగంతో వచ్చి, ముని సృజించిన కృత్యను సంహరించింది. అంతటితో ఆగక, భక్తాపరాధానికి పూనుకున్న దూర్వాసుని మీదకు వెళ్ళింది.

దావానలం మాదిరిగా తనమీదకు వస్తున్న చక్రాన్ని చూసి, దూర్వాసుడు అమితంగా భయపడిపోయినాడు. దాన్ని నివారించే శక్తి తనకు లేదని తెలుసుకుని, ఆయన ప్రయత్నమంతా విఫలమైపోయింది. ఆ చక్రాయుధం ఆయన్ని అమితంగా పీడింపసాగింది. ఆయనకు మనశ్శాంతి లేకుండా చేసింది.

ఆ పరిస్థితిలో దూర్వాసుడు పోయిపోయి బ్రహ్మదేవుని శరణుజొచ్చాడు. తనను పీడించే విష్ణుతేజాన్ని నివారించి, తన్ను కాపాడవలసిందిగా ఆయన్ని ప్రార్థించాడు. కాని, చతుర్ముఖుడు తనకాశక్తి లేదని తెలిపాడు.

ఆపైన దూర్వాసుడు కైలాసానికి వెళ్ళాడు. అక్కడవున్న శంకరుని సమీపించి, తనను తరుముకు వస్తున్న చక్రాయుధాన్ని వారించవలసిందనీ తన భీతిని తొలగించవలసిందనీ వేడుకున్నాడు. అక్కడ కూడా ఆయనకు రక్షణ లభించలేదు. శంకరుడు కూడా చతుర్ముఖుని మాదిరిగానే తన అశక్తతను తెలియబరచుకున్నాడు. అంతేకాదు, ఆ చక్రాయుధాన్ని మరలించగలవాడు శ్రీమన్నారాయణుడొక్కడే అనికూడా తెలియపరచాడు.



శంకరుని పలుకులు విన్న దూర్వాసునకు గత్యంతరం కనిపించలేదు. అందుకనే ఆయన ఆ వెంటనే, పరుగు పరుగున వైకుంఠానికి వెళ్ళాడు. వెళ్ళి అక్కడ ఒక భద్రమణి సౌధంలో, శ్రీదేవితో ముచ్చటిస్తూ వున్న జగన్నాథుని సమీపించి, ఆయన పాదాలమీదపడి, "తండ్రీ! నీ చక్రాయుధ జ్వాల నన్ను భస్మం చేయకుండా చూడవలసింది. నీ భక్తునిపట్ల నేను చేసిన అపచారాన్ని క్షమించి, నన్ను రక్షించవలసింది" అని ప్రార్థించాడు.

దూర్వాసుని దీనాలాపాలు శ్రీమన్నారాయణునకు జాలి కలిగించాయి. వెంటనే శ్రీమహావిష్ణువు –

"మహర్షీ! నేను భక్త పరాధీనుణ్ణి, సాధువులయినవారు తమదైన భక్తిభావంతో, నన్ను వశీకరించుకుంటారు. పుత్ర మిత్ర కళత్రాదులనూ, గృహారామాది సర్వసంపదలనూ త్యజించి నేనే పరమగతి అని నమ్ముకున్న నా భక్తులను నేను క్షణకాలమయినా వదిలి వుండలేను. వారిని నేను నా హృదయంగా భావిస్తాను. వారుకూడా, నన్నే వారి హృదయంగా భావిస్తారు. వారికి నేను–నాకు వారూగా ప్రవర్తిస్తూ వుంటాము. అటువంటి భక్తులకు హాని కలిగించటానికి ప్రయత్నించినవారు తమ తేజాన్ని కోల్పోయి తీరుతారు.

ఆ విధమయిన తేజో హానివల్లనే నువ్విప్పుడిలాగ బాధపడుతున్నావు, నీ బాధను తొలగించే శక్తి నాకు కూడా లేదు. నువ్వు ఏ భక్తునికైతే అపకారం తలపెట్టావో ఆ భక్తుడు మాత్రమే నీకిప్పుడు అభయమివ్వటానికి అర్హుడై వుంటాడు. నువ్వు అతని శరణుకోరి అతణ్ణి ప్రసన్నుణ్ణి చేసుకోవటం ఎంతైనా అవసరం.

అలా ఉపదేశించిన శ్రీమన్నారాయణునివద్ద సెలవు తీసుకుని దూర్వాసుడు ఆ వెంటనే అంబరీషుని సమీపించాడు. ఆయన పాదాలమీద పడ్డాడు. తమ దోషాన్ని క్షమించవలసిందనీ, తన ప్రాణభీతిని తొలగించమనీ ప్రార్థించాడు.

మహాతపశ్శాలి అయిన దూర్వాసమహర్షి తన చరణాలను స్పృశించటం అంబరీషుడు సహించలేకపోయినాడు. అందుకనే ఆయన్ని లేవదీశాడు. గౌరవం చూపాడు. ప్రణామం చేశాడు. ఆ వెంటనే చక్రాయుధాన్ని స్తుతిపూర్వకంగా యిలా ప్రార్థించాడు. ఓ మహోన్నతమయిన శక్తి కలిగిన సుదర్శనమా! శరణాగతుడయిన మహర్షిని రక్షించడం ధర్మం. అందువలన

నీవు శాంతిని వహించుము. ఆ విధముగా భక్త శిరోభూషణుడయిన అంబరీషుడు ప్రార్థించగానే విష్ణుచక్రము ఎక్కడిదక్కడే నిలచిపోయినది. అది గ్రహించిన అంబరీషుడు శ్రీమన్నారాయణుని స్మరించుకుని ఆయనను స్తోత్రించెను. అంబరీషుడు అలా శ్రీహరిని స్తోత్రించగనే సుదర్శనచక్రము అంతర్థానమయింది. దూర్వాసమహర్షి అంతట శాంతమును పొంది, అంబరీషుని ఉద్దేశించి "మహారాజా! శ్రీమన్నారాయణున్ని అత్యంత భక్తితో సేవించు గొప్ప భక్తులకు ఈ జగత్తులో ఏదీ అసాధ్యము కాదు, నీవు పరమభక్త శిఖామణివి" అని భక్తులపట్ల తనకు కలిగిన అభిప్రాయాన్ని వ్యక్తపరచుకున్నాడు. ఆ తరువాత అంబరీష మహారాజు చేసిన పూజలందుకుని ఆయన ఆతిథ్యాన్ని పొంది వారిని దీవించి తమ తపో లోకాలకు వెళ్ళిపోయినాడు.

విద్యాసాగరా! విన్నావుకదా! శ్రీహరి భక్తులపట్ల వ్యక్తపరచిన అభిప్రాయాన్ని. అలాగే గురువులుకూడా తమ భక్తులపట్ల ప్రవర్తించెదరు. నాయనా! సద్గురు మూర్తియైన ఈ దత్తావతారుడు తమ భక్తులపైన యిటువంటి అపారమైన ప్రేమ కలిగి వారికి ముముక్షుత్వమును ప్రసాదించును.

విద్యాసాగరా! మంగళవేడాలోని స్వామివారి అనుగ్రహంతో సంతానం కలిగిన దంపతుల కథ వినుము. స్వామివారి భక్తుడైన బసప్ప ఇంటి దగ్గరలో ఒక బీద కుటుంబీకులు ఉండేవారు. వారికి పెండ్లి జరిగి అనేక సంవత్సరములయినది. కాయకష్టం చేసుకొని సంసారం చేసుకొనేవారు. ఒకనాడు బసప్పకు తమ బాధను వెల్లడి చేసినారు. బసప్ప వారిని సద్గురువైన స్వామిని ఆశ్రయించమని తెలిపి, వారిని స్వామి సన్నిధికి తీసుకుని పోయినాడు. గ్రామము వెలుపల ఒక వటవృక్షం నీడలో స్వామి ఆశీనులై వున్నారు. వారిని అనేకమంది భక్తులు సేవించుచున్నారు. కొందరు పాదములను వత్తుచున్నారు. కొందరు సంకీర్తనము చేయుచున్నారు. మరియొకరు స్వామికి ఆహారం తినిపించుచున్నారు. అట్టి సమయంలో బసప్ప స్వామిని సమీపించి ఆ దంపతులను పరిచయం చేసి వారి దుఃఖమును తెలియజేసెను. ఆ దంపతులు స్వామివారి పాదములను ఆశ్రయించిరి. అంతట స్వామి సమర్థులు వారి దుఃఖమును పారద్రోలదలచి నాయనా శిర్ష చెట్టుయొక్క జిగురులో కొంచెము పంచదార కలుపుకుని ఒక పక్షము రోజులు నీ భార్యచేత తినిపించు. మీ కోరిక తీరుతుంది అని వారిని దీవించిరి. ఆ దంపతులు స్వామివారి ఆజ్ఞను



అనుసరించి అలాగే చేసి నిత్యం స్వామిని సేవించుచుండిరి. కొద్దిరోజులకు ఆమె గర్భమును దాల్చి పుత్రసంతానము పొందెను. ఈ విధంగా స్వామి సమర్థులు తమను దర్శించిన వారి కష్టములను తొలగించి, వారి కోరికలు నెరవేర్చి, వారిపై తమ కృపను వర్షింపజేసి వారిని ఆనందముగా దీవించి పంపెడివారు.

మంగళవేడాలోనే ఒక అతి బీదవాడయిన సాలెవాడు గలడు. వాడు ప్రతిదినము స్వామిని దర్శించి సేవించేవాడు, కాని వారిని ఏమీ అడిగేవాడు కాదు. నిస్వార్థ బుద్ధితో ఆ పరమ గురువును సేవించెడివాడు. వాని భక్తికి సంతసించిన స్వామివారు ఒకనాడు వానికి కలలో కనిపించి ఓయి! మీ తండ్రి మీ ఇంటిలోని తులసి బృందావనము దగ్గర ధనమును పాతిపెట్టినాడు, దానిని నీవు తీసుకుని దారిద్ర్యాన్ని నిర్మూలనం చేసుకుని సుఖముగా జీవించమని తెలిపి దీవించి అంతర్ధానమైరి. తెల్లవారి ఆ సాలెవాడు నిద్రలేచి స్వామివారి ఆదేశం ప్రకారం తులసి బృందావనము దగ్గర త్రవ్వగా దానిలో వాని తండ్రి దాచిన ఆభరణములు, కొంతధనము దొరికినది. దానితో అతను వ్యాపారం చేసి తన దారిద్ర్యాన్ని నిర్మూలనం చేసుకొని దానధర్మములతో జీవించుచూ స్వామిని సేవించుకొనెను. ఈ విధంగా స్వామి సమర్థుల వారి కృపచేత ఆయన దారిద్ర్యము మటుమాయమాయెను.

విద్యాసాగరా! ఈ విధముగా శ్రీస్వామి సమర్థులు వారి దివ్యతత్త్వమును భక్తులపైన వారి అపారమైన కరుణను తెలియజేసిరి అవతారపురుషుడైన స్వామివారి అనంతమైన లీలలలో ఇవి మచ్చుతునకలు మాత్రమే!

***రామకృష్ణ హరీ! ముకుందా మురారీ!***

***పాండురంగ! పాండురంగ!! పాండురంగ హరీ!!!***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

***పదహారవ అధ్యాయము*** *సంపూర్ణము*








ఓం శ్రీ సాయిరాం
శ్రీగురు దేవదత్త!

శ్రీ స్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పదిహేడవ అధ్యాయము

### శ్రీస్వామి సమర్థులు - మంగళవేడాలో నివాసం

విద్యాసాగరుడు "ఓ పరమపురుషా! నీవలన శ్రీస్వామి సమర్థుల అద్భుత లీలలను, వివిధ పురాణ విషయములను విను భాగ్యము కలిగినది. నా జన్మ ధన్యమైనది. స్వామివారి లీలలు వినుకొలది నా మదిలో ఇంకను వినవలెనను కుతూహలము కలుగుచున్నది. దయానిధీ! ఇంకను శ్రీస్వామివారు మంగళవేడాలో ఏమేమి చేసిరో, ఎవరెవరిని వారి కృపతో పునీతులను చేసిరో తెలుపుడని" అంజలి ఘటించెను.

అంతట ఆ నిత్యానందయోగి వత్సా! పరమ పావనమూర్తి అయిన సద్గురుని లీలలు అనంతములు. అవి వర్ణింప ఎవరికీ శక్యముకాదు, వారి లీలలను వారే నీకు తెలుపుచున్నారు. నేను కేవలం నిమిత్తమాత్రుడను అని స్వామి సమర్థులను స్మరించుకుని ఓ ప్రభూ! నీ దాసానుదాసుణ్ణి, నీ మాయను గ్రహించే శక్తి నాకు లేదు. నువ్వు పరమ పురుషుడవు. లోకాలను సృజిస్తూ వుంటావు, లయింప చేస్తూ వుంటావు. అదంతా నీ లీల. నీ లీలలను గ్రహించటం కాని, నీ ప్రవర్తనను అవగాహన చేసుకోవటంకాని, నిన్ను కీర్తించటంకాని, బ్రహ్మాదులకు కూడా అసంభవమే.

నువ్వు మహానటుడవు, వివిధ రూపాలు ధరించి, అందరిని ఒప్పిస్తూ వుంటావు. అఖిలలోకాలు, లోకపాలురూ, లోకస్థులూ, సమసిపోయిన తరువాత



కూడ నువ్వు ప్రకాశిస్తూనే వుంటావు. నీ మంగళ వదనాన్ని వీక్షించే నిమిత్తం ముక్తసంగులయిన మునులు కూడా, అనితర దుర్లభమయిన వ్రతాలనాచరిస్తూ వుంటారు. నిష్ఫలులవుతూ వుంటారు. నీవు నామరూప రహితుడవు, నిన్ను గుర్తించటం, నీ అనంత శక్తిని గ్రహించటం, మావంటి సామాన్యులకు సంభవంకాదు. తండ్రీ! నువ్వు దీనరక్షకుడవు, సర్వాంతర్యామివి, సర్వశక్తి సంపన్నుడవు, సర్వజ్ఞుడవు, సర్వేశ్వరుడవు, సచ్చిదానందుడవు. మా అజ్ఞాన స్థితిని గురించి నేను మీకు వివరించవలసినది ఏమీలేదు. ఓ లీలావతారా! అత్రి–అనసూయావర నందనా! మాలోని త్రిగుణములను మాపి అసూయను ఈర్ష్యాద్వేషములను, కామ–క్రోధములను తొలగించి కావగరావా! దేవాదిదేవా! అని శ్రీస్వామి సమర్థులను స్తోత్రంచేసి ఆనందాశ్రువులతో ఒడలు పులకింపగా! వత్సా! మంగళవేడాలో శ్రీస్వామి లీలలు ఇంకా కలవు. వానిని విపులంగా తెలుపుతాను జాగ్రత్తగా–నిశ్చల ఏకాగ్రచిత్తుడవై వినుమని మంగళవేడాలోని లీలలను చెప్పబూనినాడు.

మంగళవేడాలో జనాబాయి అనే వార్కరి సాంప్రదాయ వృద్ధ స్త్రీ వుండేది. ఆమె పాండురంగని భక్తురాలు. ఆమె అనేక సంవత్సరముల నుండి ప్రతి సంవత్సరం ఆషాఢ శుద్ధ ఏకాదశికి పండరీపురమునకు వెళ్ళి పాండురంగని దర్శించేది. ఒక సంవత్సరం అట్లు బయలుదేరగా మార్గమధ్యములో పెద్ద వర్షము ఉరుములతో కురియుటచేత, ఆమె ప్రయాణం ఆగిపోయినది. ఆమె అక్కడి వాతావరణమునకు ఎంతో మానసిక వత్తిడికి లోనై చాలా నిరుత్సాహపడి "పాండురంగా! ఏమి నీ లీల, నీ దర్శనం లేకుండా ఎలా వుండగలను? ఏకాదశి సమీపించుచున్నది. ఈ వర్షము తగ్గడం లేదు. నేను ఎలా ప్రయాణించి పండరీపురం చేరుకొనగలను. నేను ఇన్ని సంవత్సరముల నుండి కాపాడుకొని వచ్చుచున్న నియమము విఫలము చేసెదవా? స్వామీ! నీ దర్శన భాగ్యము కలిగింపవా? నాపైన దయరాదా? కరుణాంతరంగా! చంద్రభాగ తరంగా! దీనదయాళూ! దీనజన రక్షకా! రంగరంగా! పాండురంగా – పండరివాసా! విఠోబా! పక్షివాహనా! భక్తజన సంరక్షకా! విఠలా నీ దర్శనము కలిగింపవా!

అని పలికి పాండురంగని నామస్మరణము చేయుచుండెను. అంతలో ఒక పెద్ద మెరుపు వచ్చెను. ఆ మెరుపులో స్వామి సమర్థులు ఆమె ఉన్న చెట్టు

మొదలులో నిలుచుండిరి. వారే పెద్ద స్వరముతో ఇక్కడ పాండురంగడు కనబడుటలేదా? ఆయన ఒక్క పండరీపురంలోనే వున్నాడా? అని అరచిరి. ఆ స్త్రీకి దివ్యదృష్టి నొసగిరి. వెంటనే ఆమెకు స్వామి సమర్థుల స్థానంలో పాండురంగ విఠలుడు పండరీపురంలోవలె నడుములపై చేతులు పెట్టుకుని నిలబడియుండి దర్శనమిచ్చినారు. అంతలోనే స్వామి సమర్థులు కనిపించిరి. తిరిగి పాండురంగడు తిరిగి స్వామి సమర్థులు దర్శనమిచ్చిరి. మెరుపులు నిలచిపోయినవి. ఆమె అమితమైన ఆనందముతో స్వామివారి పాదములపైబడి సమాధిస్థితి పొందెను. చాలా సమయము ఆ దివ్యానుభూతిలోనుండి స్వామివారిలోనే పాండురంగని దర్శించి తాదాత్మ్యము చెందినది.

"మహాదేవా! నీవీ ముల్లోకాలకు ఈశ్వరుడవు. ముల్లోకాలలోని బంధమోక్షాలకు ప్రభుడవు కూడా నువ్వే. నువ్వు సృష్టి స్థితి సంహారకర్తవై, బ్రహ్మవై, విష్ణుడవై, రుద్రుడవై పేర్కొనబడుతూ వుంటావు.

రంగా! పాండురంగా! నువ్వు సర్వశక్తిమంతుడవు. సర్వభూతాలు నీ నుంచి జనిస్తాయి. నీలో నివసిస్తాయి. నీలో లయము పొందుతాయి. నీ ఉదరమే వాటికి నిలయం. కాని నిన్ను గుర్తించటం మాత్రం ఎవరికీ శక్యంకాదు.

సర్వసంపదలకు – సర్వ కార్యములకు నీవే కారణభూతుడవు. నీకంటే వేరెవ్వరూలేరు. లోకంబులకు లోకేశులకు నీవే రక్షకుడవు! నిఖిల లోకస్తుత్యా! అని స్తోత్రముచేసి శ్రీస్వామి సమర్థుల పాదములకు నమస్కరించి వారికి ప్రదక్షిణములు చేసి వారి పాద తీర్థమును శిరస్సున చల్లుకుని తీర్థముగా స్వీకరించి తండ్రీ నీ దయచేత నా వ్రతము విఫలము గాకుండా సఫలము గావింపబడినది అని ప్రార్థించినది. అంత స్వామి అంతర్ధానమైరి. ఆమె ఆ లీలలను నెమరు వేసుకొనుచూ గ్రామమునకు చేరినది. గ్రామస్థులందరికి ఈ లీలలను తెలిపి వారినందరిని ఆశ్చర్య చకితులను చేసెను. జనాబాయి స్వామివారిని పాండురంగని అవతారంగా భావించి పూజించెను.

"వత్సా! దీపకుని వంటివాడా! శ్రీస్వామి సమర్థుల దయాకృపా రసములు అటువంటివి. అందరి యాశలను సఫలము చేసెడివారు. కష్ట దుఃఖములలో వున్నవారి కష్టములను, దుఃఖములను తొలగించెడివారు, భక్తుల ఇహలోక కోరికలను తీర్చెడివారు.

అనూహ్యముగా అప్పటికప్పుడు అనేక అద్భుతములను ఊహింప నలవికానివి చేసెడివారు. వారి ఉద్దేశ్యము ఒక్కటే. దైవమునందు, దైవ సంపదలయందు, జనులకు భక్తి విశ్వాసములు కలిగించుటయే - వారిని అసుర గుణముల నుండి తప్పించి దైవగుణ సంపన్నులను చేయడమే.

విద్యాసాగరా! ఒక గొప్ప సాధువు ఇలా అన్నారు. "నేను ప్రజలు కోరినది ప్రసాదించెదను. వారికి సకల క్షేమములను కలిగింతును, వారు క్రమముగా భక్తిని అలవరచుకొని, నిర్మలమైన నిశ్చలభక్తిని పొందెదరు. అదియే మా సంకల్పం - అదియే వారికి ఆధ్యాత్మిక మార్గము - అదియే వారికి రక్ష.

అందువలన అనేకమంది దత్తావతారులు ఇటువంటి లీలలను ప్రదర్శించి, మానవులను మానవునిగా, మహనీయునిగా, మహాత్మునిగా, మాధవునిగా తీర్చిదిద్దుతున్నారు. ఇదే ఈ అవతార విశిష్ఠత అని పలికి, నాయనా! మంగళవేడాలో జరిగిన మరియొక విశేషం చెబుతాను.

ఒకసారి మంగళవేడాలో ఒక విచిత్రమైన సంఘటన జరిగినది. దానిని దర్శించిన మంగళవేడాలోని ప్రజలు, భక్తులు అది తమకు కలిగిన గొప్ప అదృష్టముగా భావించిరి.

ఆరోజు స్వామి సమర్థులు గ్రామం బయట అందమైన ప్రదేశంలో నదీతీరాన కూర్చుని వున్నారు. వారి వెంట బసప్ప - బాలకృష్ణ బువా - కృష్ణాజిపంత్ మున్నగు భక్తులందరూ వున్నారు. అది ప్రభాత సమయం. బాలసూర్యుడు ఆకాశంలో తన తేజంతో వెలిగిపోతున్నాడు, ఇక్కడ భూమిపైన ఈ స్వామి మరో సూర్యునిలాగా ప్రకాశించుచున్నారు. అట్టి సమయంలో వారివద్దకు అకస్మాత్తుగా ఇద్దరు తేజోమూర్తులు అయిన యతిపుంగవులు వచ్చారు. అద్వితీయమైన ప్రకాశంతో వెలిగిపోతున్నారు. వారి ముఖవర్చస్సు తేజస్సుతో నిండియున్నది. వారి ముగ్గురి ప్రకాశం అద్భుతంగా యున్నది. వారు వింతభాషలో మాట్లాడుట మొదలిడిరి. అది యితరులకు ఏమీ అర్థంకాలేదు. వారిలో ఒక యతి "ఎందుకేడుస్తావ్?" అన్నారు. రెండవవారు "ఎందుకు పిలుస్తున్నావు?" అన్నారు. శ్రీస్వామి సమర్థులు సమాధానంగా "ఎందుకు చూస్తున్నావ్?" అన్నారు. అంతట వారు ముగ్గురు కలసి అక్కడికి

సమీపంలో వున్న ఒక చిన్న కొండపైకి వెళ్ళారు. అక్కడ ఏం సంభాషణ జరిగిందో ఎవరికీ తెలియదు. ఆ వచ్చినవారు కూడా ఫలానా అని తెలియదు. కొంత సమయానికి శ్రీస్వామి సమర్థులు మాత్రమే క్రిందికి దిగివచ్చినారు. వారు ఏమయినారో, ఎటు పోయినారో తెలియదు. అయినా ఆ వచ్చినవారు శ్రీ దత్తాత్రేయస్వామి, శ్రీపాదవల్లభులు అయి వుండవచ్చునని వారు నరసింహ సరస్వతి అయిన శ్రీస్వామిని కలుసుకొని రాబోవు కలియుగ ధర్మముల గురించి చర్చించి వుందురు అని ప్రజల నమ్మకము. ఈ విషయము గ్రామగ్రామములకు ప్రాకినది. అనేకులు దానిని గురించి చర్చించుట జరిగినది. కలియుగంలో మానవులను – భక్తులను, ఆర్తులను, రక్షించుటకై అవతరించిన అవతారమూర్తి శ్రీస్వామి సమర్థులు అని చెప్పుకొనుచు, వారిని దర్శించువారు ఎక్కువైరి. ఈ సన్నివేశం శ్రీసాయినాథుల అవతరణకై వుండవచ్చునని సాధకుల అభిప్రాయము.

మంగళవేడాలోనే ఇంకొక విశేషము జరిగినది. ఆ గ్రామమునకు దగ్గరగా వున్న భోసు అను నగరము నుండి శ్రీ యశ్వంత్ మహాదేవ్ అనే రెవిన్యూ అధికారి స్వామి సమర్థుల దర్శనార్థమై వచ్చి వారిని ప్రార్థించి ఆశీస్సులు పొందినాడు. ఆశీస్సు ఫలముగా శ్రీస్వామి సమర్థులు అతనికి పూజకై ఒక సాలగ్రామమును ప్రసాదించిరి. కొలది కాలమునకే ఆ అధికారికి మమల్తదారుడుగా ప్రమోషను వచ్చినది. ఆధ్యాత్మిక రంగమునందు కూడా మంచి పురోగమనము కలిగెను. అతను సమయం చిక్కినప్పుడల్లా శ్రీస్వామి సమర్థులను దర్శించి సేవించేవాడు. ఆయన తన అధికారంతో ప్రజలకు అనేక విధములుగా సహకరించుటచేత మంచి అధికారి అని పేరుగాంచెను. ఆయన ఠాణాజిల్లాలో బివండి తాలూకా మమల్తదారుగా వున్న సమయంలో వర్షములులేక పెద్ద కరువు వచ్చినది. ప్రజలు తిండి గింజలులేక ఎన్నో కష్టములకు గురి అయినారు. పశువులకు దాణా కరువై పెద్దసంఖ్యలో పశుసంపద నశించినది. ప్రజలందరు తమను కాపాడుము అని శ్రీయశ్వంత మహాదేవ్‌ని చేరి తమ కష్టములను తెలుపుకొనిరి. అందులకు ఆయన స్పందించి ప్రభుత్వపు అనుమతి పొందకనే తన ఆధీనములోనున్న గోదాముల నుండి ధాన్యమును ఉచితముగా ఆ పేద ప్రజలకు పంచిపెట్టి వారిని ఆదుకొనెను. ఆ పంచిపెట్టిన ధ్యానం వెల పది వేల రూపాయలు (10,000/–). అది చాలా ఎక్కువ ధనము. ఆ ధనము గవర్నమెంటు ట్రెజరీకి కట్టవలెను. శ్రీ యశ్వంతమహాదేవ్



సామాన్యుడైన కుటుంబీకుడు. ఉద్యోగము వలన లభించిన ధనముతో తన కుటుంబమును పోషించుకొనువాడు. అంత ధనము అతనివద్ద లేదు. అందుచేత ట్రెజరీకి ధనమును కట్టలేదు. ఈ విషయము ఆ జిల్లా కలెక్టర్‌గారికి తెలిసి పోలీసు సూపరింటెండెంట్‌తోసహా అక్కడకు విచారణకై వచ్చెను.

యశ్వంత మహదేవ్ కలెక్టర్‌గారితో "ఆర్యా! ఈ ప్రాంతములో వచ్చిన కరువు గురించి తెలుసుకదా! ఆ గోదాములలోని ధాన్యమును ఉచితముగా పంచనిచో ఇక్కడి జనులు ఆకలితో చనిపోయెడివారు. మానవ జీవితం ధాన్యం విలువకంటే గొప్పది. ఒక అధికారిగా నా పరిపాలనలో ఉన్న ప్రజలను ఆకలి బాధల నుంచి రక్షించడానికి నేను ఈ పని చేయవలసి వచ్చినది. నన్ను దయతో కరుణించి ఈ ధనమును కట్టుట రద్దు చేయవలసినదిగా కోరెను.

అందులకు ఆ అధికారి నిరాకరించి ట్రెజరీ అధికారిని పిలిచి లెక్కలు చూడగా ధాన్యము ఖరీదు పదివేల రూపాయలు జమచేసి వున్నది. అధికారులందరు ఆశ్చర్యముపొంది ధనమును జమచేసికూడ నీవు ఇలా మాటలాడుట తగదు అని ముందుగానే ఆ ధనమును ట్రెజరీకి జమచేసినందులకు అతనిని అభినందించి వెళ్ళిపోయిరి.

యశ్వంత్‌నకు ఇది ఏమీ అర్థముకాక ఆశ్చర్యపోయెను. కొంత సమయము తరువాత వాని మనస్సులో శ్రీస్వామి సమర్థులు పకపక నవ్వుతూ మెదిలిరి. అంత ఇది శ్రీస్వామివారి అనుగ్రహమేనని గుర్తించి వెంటనే శ్రీస్వామి దర్శనమునకు మంగళవేడా వచ్చి శ్రీస్వామి తనను రక్షించిన తీరు అందరికీ తెలిపి శ్రీస్వామి పాదములపై వాలెను. శ్రీస్వామి వాని మనస్సులో గోచరించిన రీతిని తన పెద్ద బొజ్జను చేతులతో పట్టుకుని పకపక నవ్విరి. తమకు ఆత్మ సమర్పణ చేసిన భక్తులకు అన్నివిధాల మేము రక్షించెదము. అన్న భగవానుని వాక్కులు ఇచ్చట రుజువు కాబడినవి. భగవత్‌గీతలో భగవానుడు –

***శ్లో॥ అనన్యాశ్చి న్తయన్తో మాంయే జనాః పర్యుపాస్యతే***
***తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్***

*(భగవత్‌గీత 9 అ, 22 శ్లో॥*

తా॥ ఎవరు ఇతర భయములు లేనివారై నన్నుగూర్చి చింతించుచు ఎడతెగక ధ్యానించుచున్నారో, ఎల్లప్పుడు నాయందే నిష్ఠగల్గియుండు భక్తులను

వారియొక్క యోగక్షేమములను నేను వహించుచున్నాను అని చెప్పిన విధముగా అవతార పురుషులు తమను నమ్మి సేవించిన వారిని అన్నిరకాల ఈతిబాధల నుంచి కాపాడెదరు. వారి తరువాత అవతారమైన షిర్డీ సాయిబాబాగారి అభయంగూడ అదే – "నేనుండ నీకు భయమేలా?", "మీ బాధలన్నీ నాపై వేయుడు – నేను మోసెదను" అన్నవి వారి వాక్కులు. వారి జీవిత చరిత్రలో ఇటువంటి లీలలు అనేకముగా కలవు. ఇటువంటి సన్నివేశం ఇదే మంగళవేడాలో పూర్వం జరిగినది. మహాత్ముడయిన దామాజీ సమాధి ఇచ్చట ఉన్నదికదా! వారు ఈ గ్రామ అధికారిగా నున్నప్పుడు జరిగిన విశేషమైన కథ అది. శ్రీ పాండురంగని దివ్యమైన లీల.

స్వామి సమర్థులు మంగళవేడా వచ్చుటకు చాలా పూర్వం – అనగా అప్పుడు ఆ ప్రాంతము రాజుల పరిపాలనలో నుండెను. బీదరి అను గ్రామనివాసి అయిన దామాజి పంతు అను బ్రాహ్మణుని, భక్తి సాంప్రదాయములుగల విజ్ఞానిని మంగళవేడా (మంగళవటము ఆనాటి పేరు)కు గ్రామాధికారిగా ఆ ప్రాంతమునేలు రాజు నియమించెను. దామాజి గ్రామాధికారం స్వీకరించి, పూర్వపు అధికారులవలెగాక, ధర్మముగా, న్యాయముగా, అక్రమము అను మాట రానీయక రాజకార్యములను, గ్రామాభివృద్ధిని చక్కగా నిర్వర్తించుచుండెను. దానిచేత గ్రామ ప్రజలు అందరు వారిపట్ల భయభక్తులతో మెలగుచుండెడివారు. దామాజి రాజకార్యములలో మాత్రమేకాక, భగవత్ ధ్యానాది కార్యక్రమములలో, సజ్జనసేవలోను, భాగవతుల సేవలోను కాలం గడిపేవాడు. తనకు వచ్చు వేతనములో కొంతమాత్రం తన కుటుంబ నిర్వహణకు ఉపయోగించుకొని మిగతాది దానధర్మములకు, భగవత్ విషయములకు ఖర్చుచేసెడివాడు. నిరంతరం పాండురంగని నామస్మరణము చేయుచు తను, మనఃప్రాణములను దైవానికి అంకితం చేసినాడు. అతడు పరమ భాగవతోత్తముడు.

ఇట్లుండగా ఒక సంవత్సరము ఆ ప్రాంతములో వర్షములు కురియక తీవ్రమైన కాటకము వచ్చినది. జనులు ఆహార ధాన్యములు లేక, పశువులకు గ్రాసములేక అన్నివిధాల బాధపడసాగిరి. కొందరు దూరప్రాంతములకు వలసపోయిరి. ఒకనాడు పండరిపురవాసుడైన ఒక బ్రాహ్మణుడు మంగళవేడాకు వచ్చి, ఆకలికి తాళలేక ఇంటింటికి భిక్షమునకై ప్రార్థించెను.



కరవు కారణమున ఆ బ్రాహ్మణుని ఎవరూ ఆదరించలేకపోయిరి. కడకు ఆ బ్రాహ్మణుడు దామాజీ ఇంటిముందుకు రాగా, దామాజి వానిని సాదరముగా ఆహ్వానించి మంచి భోజనము అతని ముందు వడ్డించెను. దానినిచూచి ఆ బ్రాహ్మణుడు కన్నీరు పెట్టుకొనెను. దామాజీ "ఓ బ్రాహ్మణోత్తమా! అన్నం చెంత కూర్చుండి అలా బాధపడెదవు ఏమి? నావలన ఏదైన అపచారము జరిగినదా? ఈ పదార్థములు నీకు హితమైనవిగావా! లేక పూర్వ శోకము ఏదైన జ్ఞప్తికి వచ్చినదా? ఏమిటో వివరంగా తెలపండి, నావలన చేయవలసిన సహకారమేదైనా చేయగలవాడను"అని ప్రార్థించెను. అంతట ఆ బ్రాహ్మణుడు "మహాత్మా! నీవు జనార్ధనుని అవతారం అని తోచుచున్నది. లేనిచో మానవులకు ఇంత భక్తి, ఇంత ప్రేమ, ఇంతటి వినయము, ఇంతటి యౌదార్యము కలుగనేరదు. మీరు వడ్డించిన పదార్థములు ఎన్నడూ చూచి ఎరుగను. మరియు అవి నాకు హితము కాకపోవటము అన్నది లేదు. నా దుఃఖమునకు కారణమేమనగా నా నివాసము పండరిపురం. నేను బయలుదేరి నాలుగు రోజులు అయినది. నాలుగు రోజులు అన్నము అన్నది ఎరుగను. నా భార్య బిడ్డల పోషణకు ఏమైన సంపాదించి తీసుకొని వెళ్ళవలెను అని బయలుదేరితిని. నా పరివారము అందరు పస్తులతో నాకై ఎదురుచూచుచు ఆకలితో బాధపడుచుందురు. ఈ అన్నమును చూచినంతనే వారందరు పస్తులతో వున్నది గుర్తుకు వచ్చినది. నేను ఒక్కడనే వారిని వదలి ఈ ఆహారము తినవలసి వచ్చినందుకు దుఃఖపడుచున్నాను అని పలికి, భగవంతునికి, దామాజీకి నమస్కరించుకొని ఆహారమును భుజించ ప్రారంభించెను. వాని పలుకులు దామాజి హృదయములో దూరినవి. అతిథికి కలిగిన బాధకు తాను బాధపడి "ఓ బ్రాహ్మణోత్తమా! నీవు దిగులు చెందకు. నీ సంసారమునకు ఒక్క సంవత్సర కాలము సరిపోవు ధాన్యమును యిచ్చెదను, నీవు నిశ్చింతుడవై భుజింపుము" అని చెప్పెను.

ఆ బ్రాహ్మణుడు ఆనందముగా భుజించెను. అంత దామాజి తమ సేవకులను పిలిచి "రాజుగారి గోదాముల నుండి నాలుగుపుట్ల ధాన్యమును తీసి దానికి కావలసిన సంబారములన్నీ చేర్చి, ఈ బ్రాహ్మణుని వెంట గొనిపోయి, వారి యింట అప్పగించి రండు" అని ఆదేశించెను. వారు ఆ సామాగ్రినంతయు

బండ్లకు ఎక్కించుకొని బ్రాహ్మణుని వెంట బయలుదేరిరి. వారు మార్గ మధ్యములో ఒక చిన్న అరణ్యము చేరినంతనే అది ఆహారపు సామాగ్రి అని తెలిసికొని ఆకలి బాధకు తాళలేక అధర్మము అని జంకక అందరును కలసి ఆ ధాన్యమును ఎగబడి తీసుకొని పోయిరి. ఆ దృశ్యమును ఆ బ్రాహ్మణుడు, దామాజి నౌకరులు చూచి, వారు ఆకలిచే మహారుద్రులవలె నుండుటచేత ఏమీ చేయలేకపోయిరి.

అంత ఆ బ్రాహ్మణుడు ఇలా ఎన్నిసార్లు దామాజివల్ల ధాన్యమును పొందినను కరువుకాటకములచే బాధపడు జనులు దానిని నా గృహమునకు చేరనీయరు. అందువలన నా కుటుంబమునే మంగళవేడా గొనిపోయిన దామాజి ఆశ్రయములో ఆనందముగా నుండవచ్చు అని భావించి, దామాజి నౌకరులను మంగళవేడా వెళ్ళమని తాను పండరిపురమునకు పోయెను. మంగళవేడాలో జరిగినదంతయు తన భార్య బిడ్డలకు ఎరిగించి, వారినందరిని బయలుదేరమని చెప్పెను. వారినందరిని తీసుకొని మంగళవేడా పురమును చేరి దామాజికి జరిగినదంతయు తెలిపి ఆశ్రయమును కోరెను. ధార్మికుడైన దామాజి పంతు వారిని ఆదరముతో ఇచ్చటనే వుండమని వారికి కావలసిన వసతి ఏర్పాటు చేసెను. అతనికి లభించిన ఆధారము దామాజి పంత్ అని, వారి ఔదార్యమును తెలుసుకొని పరిసర గ్రామములవారు, అందరును దామాజి గృహమునకు జేరి మా ఆకలి బాధలను తీర్చి మరణము నుండి కాపాడుము అని ప్రార్థించిరి. అప్పటికే ఆకలిచే అనేకులు మరణించిరని కూడా తెలిపిరి. అది విని దామాజీ వారి యాక్రందనము వలన హృదయము వివశము కాగా లోనికిపోయి భార్యను పిలిచి "సంగతియంతయు వింటివికదా? భయంకరమగు ఈ కరువు వలన అనేకులు మలమల మాడిపోవున్నారు. ఎందరు చనిపోయిరో లెక్కలేదు. ఈశ్వర సంతానము ఈ తీరున దఃఖము పొందుచుండగా, ఈ విపత్తును తప్పింప సమర్థులగువారు తమ్ము కానట్లు ఊరకుండుట రాక్షసత్వము. సర్వేశ్వరుడు, సర్వశక్తుడయినను, మానవుల ప్రవర్తనములు కనిపెట్టుటకై అపుడపుడిట్టివి తటస్థింప జేయుచుండును. రాజుగారి గాదెలిప్పుడు అనేకములు నా వశము నందున్నవి. వానియందు లెక్కలేనన్ని పుట్ల ధాన్యము కలదు. రాజు ప్రజల సౌఖ్యములను పరిగణింపవలసినవాడు, కావున నేనిపుడు స్వతంత్రించి ఈ



ధాన్యమంతయు జనులకు వినియోగించినో ఏమియు బాధింపదు" అని చెప్పి ఆమెచే అవుననిపించుకొని, గోదాముల వద్దకు వచ్చి అన్ని గాదెల తలుపులను తెరచునట్లు భటులను నియమించి "మహానుభావులారా! ఎవరికి కావలసిన ధాన్యము వారు నిస్సందేహముగా తీసుకొనుడు, ఎక్కువ తీసుకొనిన బాధలేదు; కాని తక్కువ మాత్రం తీసుకొనవలదు" అని చెప్పెను. అందుకు ఆ క్షుధార్తులందరును మిగుల ఆనందించి ఎవరెవరికి కావలసిన ధాన్యమును వారు తీసుకొని పోయిరి. ఈ తీరున ఎడతెగకుండ మూడు మాసములు ధాన్యమును పంచిపెట్టునప్పటికి గాదెలు ఖాళీ అయ్యెను. భగవంతుని యనుగ్రహంతో వర్షములు కురిసి కాటకము తొలగిపోయెను. అందరును కరువువలన బాధను తప్పించుకొనిరి. ఆ ప్రాంత వాసులు అందరు పరమానంద భరితులైరి. దామాజీ కీర్తి దశదిశల వ్యాపించెను.

లోకములో కొందరు మహానుభావులు ఇతరులు ధనవంతులైనచో తమదేమో పోయినట్లు దుఃఖింతురు. ఒరులు సుఖము అనుభవించుచున్నచో తమకు కష్టము సంభవించినట్లు వగతురు. ఒరుల యింట శుభములు జరిగినచో తమ యింట పీనుగు వెడలినట్లు ఆక్రోశింతురు. ఇతరులు కీర్తిశాలురైనచో తమకు అవమానము వచ్చినట్లు వాపోవుదురు. అన్ని విధములను ఎదుటివారు బాగుగనున్నచో తమ గ్రుడ్లు పెరికికొందురు. ఇట్టి అసూయాపరులకు ఏ దేశమునందును, ఏ జాతియందును, ఏ వర్ణమునందును, ఎప్పుడును కొదువలేదు. అప్పుడు కొందరిట్టివారు రాజుకు "దామాజి రాజు సర్వస్వమంతయు భక్తులకు పంచిపెట్టినాడు. మీ గాదెలన్నియు ఖాళీలు అయినవి. వానిలో ఒక దమ్మిడి ధాన్యమైనను లేదు" అని అర్జీలు వ్రాసిరి. దానిపై రాజు మహోగ్రుడై మండిపడి, దామాజిని కట్టి తెండని భటులకు ఆజ్ఞాపించెను. వెంటనే రాజభటులు మంగళవేడాకు పోయి ఆ సంగతి అంతయు దామాజికి ఎరిగించి మీరు మహానుభావులు, కావున ఇచ్చటనే మిమ్ము బంధింపజాలము; కాని రాజు ఆజ్ఞ ఉల్లంఘింపజాలము; కావున మాతో దయచేయుడు. రాజధానివరకు నిరాయాసముగా గొనిపోయి అచ్చట మాత్రమే మిమ్ము బంధించెదము" అని చెప్పిరి. దామాజి అందులకు భయపడక భార్యకు ధైర్యము చెప్పి వారివెంట బయలుదేరెను. గ్రామస్థులు పరిసరములవారు ఈ విపత్తును తెలుసుకొని ఏమి చేయలేక పాండురంగని – ఆ దామాజిని రక్షింపుమని ప్రార్థనలు చేసిరి.

మార్గమధ్యమున పండరిపురము తగిలెను. అచ్చట దామాజి భటుల యనుమతిపొంది ఆలయమునకు పోయి పాండురంగని సేవించి నిశ్చలచిత్తుడై ఈ తీరున ప్రార్థించెను. "శ్రీహరీ! సర్వలోక శరణ్యా! నీకు తెలియనిది ఏమిలేదు. అయినను విన్నవించుట మా పని. ప్రపంచమునందంతటను నీవు నిండి యున్నావు. ఆ శరీరమున ఉండి రాజు అని పిలిపించుకొనుచు, ఈ శరీరమున ఉండి దామాజి అని పేరుగొన్న నిన్నే నీవు శిక్షించుటకు పిలిపించు కొనుచున్నావు. నీ లీలలు అనంతములు కదా! నీకెట్లు క్రీడింప దలంపు గలిగిన అట్లు క్రీడింపుము; ఈ క్షుద్ర శరీరమునను స్వల్పాంశమును తుదకు నీయందే చేర్చికొనుము అని ప్రార్థించి అతడు మరల భటులతో కూడి రాజధానికి బయలుదేరెను. దామాజిని రక్షించుటకై భక్తవత్సలుడైన శ్రీ పాండురంగ విఠలుడు ఒక తలారివాని వేషము ధరించి, ఒకచేత దుడ్డుకర్రయు, ఒకచేత వరహాల సంచియు గైకొని వీరికంటే ముందుగానే రాజధానికి చేరి, రాజగృహద్వారమున నిలచి, తన రాకను లోనికి ఎరిగించెను. రాజు సెలవిచ్చెను. వెంటనే తలారి రాజు సన్నిధికిపోయి "మహారాజా! ఏలినవారి పాద పద్మముల సన్నిధికి నన్ను దామాజి పంపెను. మంగళవేడాలో నున్న తమ గాదెలలోని ధాన్యమును విక్రయించి సొమ్ము నాచేత పంపినాడు; కావున దానిని స్వీకరించి నాకు రశీదు దయచేయవలయును అని చెప్పి ఆ వరహాల మూటను ముందు పెట్టెను. అతనిని చూచి అతని మాటలు ఆలకించి, అతని రూపము తిలకించి, అయ్యా! నీవెవరో నా కనులకు విందుచేయుచున్నావు. మలిన వస్త్రములను ధరించినను నీ తేజస్సు సార్వభౌమ పుత్రులకు కూడ దుర్లభమై వున్నది. నిన్ను తలారి అని తలంచుటకు కూడా నా మనస్సు అంగీకరింపకున్నది. నిన్ను చూడగనే నా మనస్సు అవ్యక్తానుభూతికి గురియగుచున్నది. మాకు మంగళవటమున రావలసిన ధనము నాలుగు లక్షల వరహాలు, దామాజి అంతయు పంపెనని చెప్పుచున్నారు. ఆ మొత్తం అంతయు నేను చూసెడి సంచిలో కలదా! నీవు ఎవరవు, నీ ఊరేది? నీ పేరేమి? నీ తల్లిదండ్రులెవరు? నీకు నెలజీతమెంత?" అని ప్రశ్నించెను.

అది విని తలారి రూపముతో వున్న పండరినాథుడు అందలి వారికెల్లరకును యదార్థము తెలియకుండునట్లు మాయ కల్పించి, కేవలం రాజును చూచి "రాజా! నాకు ఏలికయగు దామాజీకి నీవు ఏలికవు కావున నీ



ప్రశ్నలకు ప్రత్యుత్తరము చెప్పుచున్నాను. నాకొక ఊరులేదు. కాని అన్ని ఊళ్ళు నావే. నాకొక పేరులేదు. అయినను అన్నిపేర్లును నావే. నాకు తల్లిదండ్రులు లేరు. అయితే అందరకును నేనే తండ్రిని, నేనే తల్లిని! ఈ ప్రపంచమున నేను కానిది ఏమియును లేదు. అది అట్లుంచుము, దామాజీ తన సర్వస్వమును నాకర్పించెను. నా సర్వస్వమును అతనికి యిచ్చితిని. ముందుగ నీ రొక్కమును నీవు గ్రహింపుము అని చెప్పి ఆ చిన్న వరహాల మూటను విప్పి అందలి వరహాలను అందరి ముందర పోయగనే ఆ చిన్న వరహాల రాశి కొండవలె పెరిగిపోయెను. మాయ తొలగెను.

రాజు అందులకు మిగుల ఆశ్చర్యపడి ఆనందముతో నాలుగు లక్షల వరహాలను లెక్కించి పుచ్చుకొనునట్లు కోశాధికారిని నియమించెను. కోశాధికారి ధనమును లెక్కించుకొని జమచేసుకుని రశీదు వ్రాసియిచ్చెను. రాజు తలారికి వస్త్రాభరణములను బహుమతిచేసి దామాజీ పండితులకు గాను అనేక గజాశ్వాదులను బహుమానము చేయవలసినదని కొందరు ఉద్యోగులను నియమించి తలారికి సెలవొసంగెను. మరునాడే రాజభటులు దామాజీని బంధించి తీసుకొని వచ్చి రాజు ఎదుట నిలిపిరి, వెంటనే రాజు గద్దెదిగి స్వయముగా అతని బంధములను విప్పి పాండురంగడను తలారి నీవు పంపితివని గత దినమున యిచ్చుటకు వచ్చి నీవు నాకు యివ్వవలసిన నాలుగు లక్షల వరహాలను చెల్లించి రశీదు తీసుకొనిపోయెను. అంతకు పూర్వమే నేను భటులను నియమించి వున్నవాడను. కావున వారు నిన్ను కట్టితెచ్చిరి. అందుకు నన్ను క్షమింపుము అని ప్రార్థించెను. దామాజీ అది విని కొంతసేపు నిర్విణ్ణుడై “శ్రీహరీ! ఈ క్షుద్రుని కొరకు నీవు ఎట్టి నీచవేషము ధరించితివి?” అని దుఃఖించి “రాజా! నీవు ఎంతటి అదృష్టవంతుడవు. లేకున్న సనకసనందనాదులకు కూడా అవాఙ్మానస గోచరుడగు భగవంతుడు నీకింత సులభముగా దర్శనమిచ్చునే?” అని కొనియాడెను. రాజు దామాజీ భక్తికి అతనిపై భగవంతునికి గల దయను తెలుసుకొని నిన్నటి దినమున వచ్చిన తలారి పలికిన పలుకులను గుర్తు తెచ్చుకొని వచ్చినవారు సాక్షాత్ పాండురంగడే అని గ్రహించి దామాజీని అతివైభవముగా సన్మానించి కొనియాడి, మహాత్మా! మీ వలన నేను అనితర దుర్లభమైన పాండురంగని దర్శించితిని. నా జన్మ ధన్యమైనది. మీవంటి మహాత్ముని




బాధించినందుకు నన్ను క్షమింపుడు అని పాదాభివందనము చేసెను. అంతట రాజును చూచి దామాజీపంత్ మహారాజా! ప్రకృతి శక్తులవలన విపత్తు కలిగినప్పుడు ప్రజల క్షేమమును విచారించి వారిని రక్షించటం రాజధర్మం – దుష్టులయిన అధికారుల నుంచి చోరుల నుంచి రక్షణ కల్పించి, ప్రజలు ధర్మపరులై నీతి నియమములతో జీవించుతూ భగవంతుని ఆరాధించేటట్లు చేయటం పృథ్వీపతుల కర్తవ్యం. ధర్మానుష్ఠానపరుడైన రాజు, భక్తిపరులైన ప్రజలూ, భూతభావనుడైన భగవంతుని ప్రేమకు పాత్రులవుతారు. అలా భగవంతుడు సంతుష్టి చెందడం మూలంగా, ఆ రాజ్యానికి, రాజుకూ సిద్ధించని అర్థమంటూ వుండదు. నిత్యధర్మాలను నియమబద్ధముగా ఆచరించి దేవతల సేవకై యజ్ఞయాగాది కర్మలను ఆచరించాలి. దానివలన సంతృప్తి చెంది దేవతలు సర్వవిధ సౌఖ్యాలను సమకూరుస్తారు. ఈ విధమైన సౌఖ్యానుభూతి నీకు ప్రాప్తించాలని నేను అభిలషిస్తున్నాను. ప్రజలను ఇకనైనా కరువుకాటకాల నుండి రక్షించండి – అని దీవించెను. పిదప రాజు "యథాపూర్వకముగా మంగళవేడాకు అధికారివై దానిమీద ఆదాయమును నీ చిత్తము వచ్చినట్లు వెచ్చింపుము" అని వారిని సాదరముగా రాజమర్యాదలతో మంగళవేడాకు పంపెను.

దామాజీపంత్ అనేక సంవత్సరములు మంగళవేడాలో జీవించి అనేక మందికి అనేక ధార్మిక ప్రబోధములు చేసి ఆధ్యాత్మిక శక్తిని బడసి శ్రీ పాండు రంగని ధ్యానముతో గడిపి రంగనికి తన ఆత్మను సమర్పించి సాయుజ్యమును పొందిరి. వారి సమాధిని నేటికీ అనేకమంది దర్శించుచుందురు.

"విద్యాసాగరా! వింటివికదా! మహాత్ముడైన దామాజీ కథను, వారిని పాండురంగడు ఎలా రక్షించాడో అలాగే శ్రీరామచంద్రుడు భద్రాచల రామదాసును రక్షించినాడు. దైవము తన భక్తులను కష్టములకు బలికానీయడు. యశ్వంత్ మహదేవ్ శ్రీస్వామివారి అనుగ్రహమును పొందిన తరువాత ఆధ్యాత్మిక సంపత్తియందు ఆపేక్ష అధికమగుటచేత తాను చేయు ఉద్యోగమునకు రాజీనామాచేసి భార్య గోపికాబాయితో శ్రీస్వామి సమర్థుల సన్నిధిచేరి వారి ఆశీస్సులను పొంది నాసిక్‌కు వెళ్ళిపోయెను. అక్కడ వారు కఠోర దీక్షతో గొప్ప తపస్సు చేసిరి. కాలక్రమమున గొప్ప మహాత్ముడుగా పేరుపొంది యిరువురును



మహాసమాధి పొందిరి. అతి పవిత్రమైన సత్పురుషులుగా వారు ప్రజలచే శ్లాఘింపబడిరి. సద్గురు మూర్తియైన శ్రీస్వామి సమర్థుల రక్షా కృపావరముచే వారు ఆధ్యాత్మిక పునీతులై, మహాత్ములుగా ప్రసిద్ధిచెందిరి.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు మంగళవేడాలో వున్న కాలములోనే కొన్ని రోజులు చెంబేరిలో వున్నారు. రాజా పట్వర్ధన్ ఆస్థానంలో రామదాసు అను ఒక సాధకుడు వుండేవాడు. అతను గర్విష్ఠి. అతని ఆధీనములో ఒక మఠం వుండేది. శ్రీస్వామి ఒకరోజు అతని మఠంలో పడుకొని నిద్రపోయారు. బయటకు వెళ్ళవలసిన రామదాసు శ్రీస్వామి లేస్తారేమోనని కొంతసేపు ఎదురు చూశాడు. ఎంతసేపటికీ శ్రీస్వామి లేవకపోయేటప్పటికి విసుగుతో ఆ రామదాసు మఠం బయట తాళం వేసుకుని వెళ్ళినాడు. పని తొందరలో మఠంలో శ్రీస్వామి వున్న సంగతి పూర్తిగా మరచిపోయి చాలాసేపు ఊళ్ళో తిరుగుతూనే వున్నాడు. అకస్మాత్తుగా ఒకసారి జ్ఞాపకం రాగానే రామదాసు మఠంవైపు పరుగెత్తాడు. దారిలో ఒక నదిఒడ్డున దూరంగా కూర్చుని పసిపిల్లవాడిలాగా ఆడుకుంటున్న శ్రీస్వామిని చూచి ఆశ్చర్యపోయాడు. అయినా తన కళ్ళను నమ్మలేక మఠం తెరిచి చూశాడు. లోపల ఎవరూ లేరు. ఎంత ఆశ్చర్యము. వెంటనే రామదాసు శ్రీస్వామివారి వద్దకు పరుగెత్తి శ్రీస్వామివారి పాదములపైబడి క్షమాపణ కోరెను. ముక్త ఆత్మను ఎవరు బంధించగలరు? ఈ వింతను షోలాపూర్ వాస్తవ్యుడైన పరుశురామ్‌భట్‌గోరీ అను శ్రీస్వామి భక్తుడు స్వయంగా చూచినారు.

1850లో శ్రీస్వామి మంగళవేడా వదిలి వెళ్ళిపోవడానికి సంబంధించి ఒక వింతైన సంఘటన వున్నది. ఎండలో శ్రీస్వామి ఊరి పొలిమేరల్లో తిరుగుతూ అక్కడి పొలిమేరల్లో పనిచేసుకుంటూ వున్న పండరీనాథ్‌ను చెప్పుల జత యివ్వమని అడిగారు. వెంటనే పండరీనాథ్ తాను తొడుక్కొనివున్న చెప్పులను శ్రీస్వామికి యిచ్చాడు. అవి వేసుకొని గబగబా నడుస్తూ శ్రీస్వామి కొద్ది నిమిషాల్లో వెళ్ళిపోయారు. అదిచూచి ఏక్‌నాథ్ పండరినాథ్‌తో "ఆ పిచ్చివాడికి నీ చెప్పులజత యిచ్చావు. ఇప్పుడతను యిక్కడ లేకుండా వెళ్ళిపోయాడు. మీ పెద్దవాళ్ళు నిన్ను తిడతారు" అన్నాడు. పండరీనాథ్ ఆందోళనపడ్డాడు. మరుక్షణమే శ్రీస్వామి వాళ్ళను సమీపించి చెప్పులు పండరీనాథ్‌కు అప్పజెప్పి "ఇక మీ పెద్దలు నిన్ను తిట్టరులే!" అని వెంటనే మాయమైపోయిరి. ఎటుల

వచ్చెనో అటుల మాయమైన ఈ వింతకు వారిరువురు ఆశ్చర్యపడిరి. వారు ఇంటికి బయలుదేరిరి. కొద్ది నిమిషాలలో షోలాపురం నుంచి వస్తున్న బాటసారులు వాళ్ళకు ఎదురై షోలాపూర్‌కు రెండు మైళ్ళ దూరంలో తాము స్వామిని చూచామని చెప్పారు. ఆ తరువాత శ్రీస్వామి తిరిగి మంగళ్‌వేడా ఎన్నడూ రాలేదు.

విద్యాసాగరా! ఇలా ఎన్నియెూ లీలలు శ్రీస్వామి సమర్థులు మంగళవేడాలో వుండగా జరిగినవి. దీనివలన శ్రీస్వామి లీలావతారుడని - సాక్షాత్ దత్తాత్రేయ స్వామి అని చెప్పకనే తెలియుచున్నదికదా! తరువాత శ్రీ స్వామి మొహల్‌లో ఐదు సంవత్సరములు నివసించిరి అని చెప్పి ఈ అధ్యాయమును ముగించెను.

***రాధే గోవింద! రాధే గోపాల! రాధే గోవింద! రాధే గోపాల!!***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

***పదిహేడవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం ఓం శ్రీ గురుదేవదత్త
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## పదునెనిమిదవ అధ్యాయము

### శ్రీస్వామి సమర్థులు మోహల్ - షోలాపూర్‌లలో నివాసం

**ఓ** పరమ ధార్మికుడా! శ్రీస్వామి సమర్థులు పండరిపురం తర్వాత మొహల్ అను గ్రామం చేరుకొనిరి. మార్గమధ్యంలో భీమానదిని దాటవలసి వచ్చెను. ఆ సమయంలో నదికి వరదలు వచ్చి భీకరంగా ప్రవహించుచుండెను. ఆ స్థితిలో పడవలవారు ఎవరినీ నది దాటించడం లేదు. శ్రీస్వామి సమర్థుడు పడవవారిని దాటించమని కోరెను. వారు ఎవరూ శ్రీస్వామిని ఎరుగరు. శ్రీస్వామివారి శక్తి గొప్పతనము వారికి తెలియదు. అందువలన వారు శ్రీస్వామిని సామాన్యునిగా తలచి ఈ భయంకర వరదలో పడవను నదిలో దించుటకు భయంతో ఎవరును ముందుకు రాలేమనిరి. శ్రీస్వామి సమర్థులు వారిని చూచి నవ్వి అందరూ ఆశ్చర్యముగా చూచుచుండగా శ్రీస్వామి నదిలో దిగి గబగబా ఆ మహాప్రవాహంలో భీమానదిని దాటెను. వారు నదిలో నడుచుచుండగా కేవలము మోకాలి లోతు మాత్రమే నీరు తగిలినది. ఈ జగత్తులో ఎందరో మహాత్ములు ప్రకృతిపై ఆధిపత్యం పొందిరి. యోగిరాజైన శ్రీ స్వామికి అది ఏమంత పెద్ద విషయం కాదు. ఈ సన్నివేశం చూచినవారందరు, వీరు సాక్షాత్ భగవత్ స్వరూపులని, పాండురంగడే ఈ విధంగా వచ్చినాడని భావించిరి. వారు అందరూ వందనములు సమర్పించుకొనిరి.

శ్రీస్వామి మొహల్ గ్రామంలో గణేశ్‌శోని అను మమల్తాదారు ఇంటిలో వున్నారు. ఆ వూరిలోనే 125 సంవత్సరములు వున్న గవేస్వామి అనే యోగి ఒకరుండేవారు. ఆయన అనేక సంవత్సరముల నుండి హఠయోగ సాధన

చేసేవారు. ఆయన ఆ యోగసాధన ద్వారా తన శరీరమును గాలిలో ఎనిమిది అడుగుల ఎత్తున తేల్చేవారు. వారికి శ్రీస్వామితో పరిచయం కలిగినది. వారు శ్రీస్వామి సమర్థులను పరిపూర్ణ యోగపురుషునిగా గుర్తించి వారి సన్నిధిలో గడుపసాగినారు. ఒకనాడు వారు ఇరువురు ఏకాంతముగా ధార్మిక విషయములను చర్చించుచుండగా, శ్రీస్వామి సమర్థులు "శ్రీ గవేస్వామీ! 125 సంవత్సరములు జీవించి నీవు కేవలం హఠయోగంలోనే వున్నావు. దానినుండి నిజయోగమునకు రా! యోగసాధన కేవలం శరీరమును అదుపుచేయుటకే కాదు, ఆధ్యాత్మిక విజయమునకు సాధనం కావాలి. కావున నీవు ముముక్షుత్వము నకై సాధన సాగించు" అని తెలిపిరి. శ్రీస్వామివారి మాటలను విని వారి ఆదేశమును, విజ్ఞానవంతుడైన ఆ యోగి అవగతము చేసుకొని శ్రీస్వామి సలహానను పాటించి, హఠయోగమును విడచిపెట్టి ఆధ్యాత్మిక సాధన ప్రారంభించెను. దానినే నిరంతరం తీవ్రము చేయసాగెను. అనతికాలములోనే శ్రీస్వామివారి కృపవలన బ్రహ్మజ్ఞానం కలిగినది. మహోన్నతమైన బ్రహ్మజ్ఞానం పొందిన తరువాత వారు శ్రీస్వామికి అత్యంత సన్నిహితులైరి.

మొహల్‌లో అనేక సంవత్సరముల నుండి వినాయకచవితికి గణేశ్‌శోని మమల్తాదారు పెద్దయెత్తున గణపతి ఉత్సవాలు చేయించేవారు. ప్రతిదినం శ్రీస్వామివారు కూడా హాజరయ్యేవారు. ఒకరోజు రాత్రి హరికీర్తన (భజన) జరుగుచున్నది. సంకీర్తన మధ్యలో శ్రీస్వామి లేచి వెళ్ళిపోతున్నారు. శ్రీస్వామివారిని వుండవలసినదిగా ప్రార్థించినారు. బయట చీకటిగా వున్నది. వర్షము కూడా పడుచున్నది అనెను. అయినను శ్రీస్వామి శోని మాటలను లెక్కచేయక "నీకు నైతిక విలువ లేదు" అని చెప్పి వెళ్ళిపోయిరి. శోని శ్రీస్వామికి తోడుగా వెళ్ళమని ఒక పనివానిని పంపగా వాడు "స్వామీ! తిరిగి ఎప్పుడు వస్తారు!" అని అడుగగా శ్రీస్వామి "వేసవి తరువాత" అని సమాధానమిచ్చిరి. ఆ తరువాత శోనీకి అనేక కష్టములు ఎదురైనాయి. వానిని ఉద్యోగము నుండి తీసివేసిరి. మొహల్ విడిచిపెట్టవలసి వచ్చెను. అసలు రహస్యమేమనగా, అధికార గర్వంతో శోనీకి ఒక ఉంపుడుకత్తెతో సంబంధం వుండేది. అధికారం పోగానే ఆ సాంగత్యం అతనిని విడిచిపోయినది. అతను ఆమెను పూర్తిగా విడిచిపెట్టిన తరువాత సహజముగా భక్తిపరుడగుటచే వేసవి ఎండలవంటి ఆ చిక్కులన్నీ



తీరినవి. తరువాత స్వామివారి దర్శనం అయినది. శ్రీస్వామివారి అనుగ్రహంతో శోనీకి బరోడా వెళ్ళగా అక్కడ మంచి ఉద్యోగము వచ్చి, గొప్ప ఐశ్వర్య వంతుడాయెను. క్రమము తప్పక శ్రీస్వామిని దర్శించుచూ ఆధ్యాత్మిక సాధనతో సత్సాంగత్యమువలన ఆధ్యాత్మికముగా కూడా గొప్ప అభివృద్ధి పొందెను. ఇది అంతయు శ్రీస్వామి కృపయే.

విద్యాసాగరా! మహాత్ములు భక్తుల లోపాలను ఎలా సరిదిద్దుతారో దీనివలన మనము గమనించవచ్చును. వారు భక్తులను కష్టాల నుండి రక్షించడమే కాదు, దుర్వ్యసనాల నుండి కూడా రక్షించి మంచి మార్గంలో నడిపించుతారు. అంతేకాదు తాహతుకు మించిన కోరికలను కోరేవారిని ఎలా అదుపులో వుంచుతారో మొహల్‌లోనే జరిగిన ఈ కథను తెలియజేయుదును ఆలకించుము అని తిరిగి చెప్పసాగిరి.

ఆ గ్రామంలో ఒక సాలెవాడు (పద్మశాలి) శ్రీస్వామి వారిని తరచు దర్శించి తనకు బ్రహ్మ సాక్షాత్కారం కావాలని శ్రీస్వామిని వేధించడం మొదలుపెట్టినాడు. చాలారోజులు అతని మాటలను శ్రీస్వామి పట్టించు కునేవారు కాదు. అయినా ఆ సాలెవాడు శ్రీస్వామిని బ్రహ్మదర్శనము కలిగించమని వెంబడించేవాడు. ఒకసారి శ్రీస్వామి నాగనాథుని దేవాలయంలో కూర్చుని వుండగా ఆ సాలెవాడు శ్రీస్వామిని దర్శించి తిరిగి బ్రహ్మసాక్షాత్కారం కలిగించమని అడిగినాడు. అప్పుడు శ్రీస్వామి వానికి వేలితో ఒక దిక్కు చూపించి "అదిగో బ్రహ్మం చూడు" అన్నారు. ఆవైపున అతనికి భయంకరముగా బుసలు కొడుతూ తోకతో నేలను కొడుతూవున్న నాగరాజు (త్రాచుపాము) కనిపించగా అతడు భయపడిపోయినాడు. ఆ తరువాత వానికి సర్వవేళలలో అదే దృశ్యం గోచరించసాగినది. దానితో వాడు పిచ్చివాడుగా తయారయ్యాడు. ఆ అనుభవం అతనికి చాలా రోజులు వుండిపోయింది. ఈ విషయం పూర్తిగా తెలుసుకున్న గవే స్వామికి జాలి కలిగినది. వారు అతనిని శ్రీస్వామి సమర్థుల సన్నిధికి తీసుకుని వెళ్ళి వానిని రక్షింపమని ప్రార్థించినారు. దానికి కరుణాసముద్రుడయిన శ్రీస్వామి సమర్థులు వానికి స్వస్థత చేకూర్చిరి. అంతలో వాడు తిరిగి మామూలుగా ప్రవర్తించసాగినాడు. మరల శ్రీస్వామిని ఎప్పుడూ బ్రహ్మసాక్షాత్కారం కావాలని అడుగలేదు. అర్హత లేనిదానికొరకు అడుగకూడదనటానికి ఈ దృష్టాంతము చాలును.

విద్యాసాగరా! ప్రతివ్యక్తి తన హద్దును తెలుసుకొని ప్రవర్తించాలి. బ్రహ్మసాక్షాత్కారం కొరకు నిరంతరం సాధన చేయవలెను. అర్హత లేకుండా అందలం ఎక్కాలనుకోరాదు. ఎవరైనా ఏమయినా పొందుటకు దానికి కావలసిన అర్హత సంపాదించుకొనవలెను. ఈ జగత్తులోని మానవులందరూ బ్రహ్మ సాక్షాత్కారం పొందవచ్చును. అయితే దానికై ముందు వారు శ్రద్ధతో, వినయంతో గురువును సేవించి తపస్సు చేయవలెను. మనము సాధారణముగా కనులతో సూర్యుని చూడలేము. మరి కోటి సూర్యప్రభా సమానమైన తేజస్సు కలిగిన బ్రహ్మను ఎలా చూడగలము? దానికి పూర్తి వైరాగ్యం, పవిత్రమైన లక్ష్యం, పవిత్రమైన హృదయము, నిశ్చలమైన సాధన కావాలి. మామూలుగా ఏదో ఆటపాటగా దానిని పొందాలనుకోవడం మూర్ఖత్వమే అవుతుంది. సాలెవాడు కూడా కేవలం అందరు అనుకునే మాటలు విని, అది ఏమిటో అనుకుని, ఏ లక్ష్యం లేకుండా శ్రీస్వామిని వేధించినాడు. అందులకే శ్రీస్వామి సమర్థులు వానికి అలా గుణపాఠం నేర్పినారు. అది వానికేగాదు అటువంటి వారు ఎవరైనా వుంటే వారికిది గుణపాఠమే. నాగుపాము దర్శనమిచ్చుటచేత బ్రహ్మ సాక్షాత్కారమునకు కుండలిని సాధన - యోగసాధన చేతనే సాధ్యం అని తెలుపుటయే శ్రీస్వామివారి భావము కావచ్చును.

ఒకనాడు శ్రీస్వామి సమర్థుల దర్శనమునకై తండూలవాడి నుండి ఒక బ్రాహ్మణుడు వచ్చెను. అతడు పండరిపురం పాండురంగ విఠోభా భక్తుడు. అతడు సంవత్సరమునకు రెండుసార్లు యాత్ర చేసేవాడు. పండరిపురం వెళ్ళుచుండగా మోహల్‌లో వున్న శ్రీస్వామి సమర్థులను చూచుట సందర్భపడినది. ఆశ్చర్యకరమగు ఆయన వ్యక్తిత్వం, దివ్యమైన ఆయన చూపులు, వీనిని ఆకర్షించినవి. ఆయన తన యాత్రను మరచిపోయి శ్రీస్వామితో వుండిపోయినాడు. అతడు శ్రీస్వామి సన్నిధిలో భక్తితో తన్నుతాను మరచిపోయి కమ్మని గాత్రముతో పాటలను పాడుచూ భజన చేసేవాడు. ఆ భజనలో అందరు చేరెడివారు. ఇతని రాకతో అక్కడి వాతావరణము నిరంతరం నామసంకీర్తనలతో వుండేది. ఇలా వుండగా ఒకరోజు ఆ బ్రాహ్మణుడు మైమరచి భక్తిపాటలు పాడుచూ అతీంద్రియ స్థితికి వెళ్ళిపోయెను. ఒక గంట గడిచిన పిమ్మటగాని ఆయన మామూలు స్థితికి రాలేదు. అతని కనులలో యింకను ఆ దివ్యమైన



అనుభూతికి సంబంధించిన తేజస్సు, ఆనందము నిండియుండెను. అక్కడకు చేరిన భక్తులు మీరు పొందిన అనుభూతి ఏమిటి? ఏమి చూచినారు? దానిని మాకు వర్ణించండి అని ప్రార్థించిరి. అతను శ్రీస్వామి సమర్థునిలో పాండురంగ విభుని దర్శించినాను. అదియొక అద్భుత దర్శనం. శ్రీస్వామివారు సాక్షాత్ విఠలుడే, వేరుకాదు. వారు పండరిపురంలోనేకాదు, యిక్కడ కూడా వున్నారు.

*"అక్కడ వుండే పాండురంగడు ఇక్కడ వున్నాడే!*
*ఇక్కడ అక్కడ ఎక్కడ చూసినా తానై యున్నాడే!"*

అని గానము చేసెను. స్వామి పాదముల చెంతచేరి, "ఓ దివ్యస్వరూపా! పాండురంగ విఠలా! నన్ను అనుగ్రహించి దర్శనమిచ్చినావా! తండ్రీ నీవు సర్వత్రా నిండి వున్నావు. 'ఈశ్వర స్సర్వ భూతానాం' అను సూక్తి ననుసరించి నీవు సర్వకాల సర్వావస్థలయందు పూర్ణముగా వున్నావు. యజ్ఞేశ్వరా! నీవు అద్వితీయుడవు. మాయాతీతుడవు అయికూడా, మాయను అనుసరించి, మాయామానుష రూపంలో మానవులకు దర్శనమిస్తుంటావు. స్వతంత్రుడవై యుండికూడా పరతంత్రుని మాదిరి గోచరిస్తూ వుంటావు. అందుకనే నువ్వు ఒక్కడవే ముల్లోకాలకు ఈశ్వరుడవని, నీ మాయా విభూతులైన విష్ణు బ్రహ్మ రుద్రాదులూ, దిక్పాలురూ నీకు అన్యులనీ మాయా మోహితులమైన మేము భావించటం జరుగుతుంది. యదార్థానికి సకల చరాచర జంతు సంతానం కూడా నీవేకాని అన్యంకాదు. ఓ పరబ్రహ్మ స్వరూపా! పరమాత్మా! నీ చరణ సన్నిధి చేరిన నా జీవితం ధన్యమైనది" అని అనేక విధాల శ్రీస్వామిని స్తోత్రము చేసి వారి దీవెనలు పొంది – ఆనందభరితుడైనాడు. జీవితకాలమంతా శ్రీస్వామి సమర్థులపై భక్తితో అతని గ్రామంలోను, ఇతర గ్రామములోలోను శ్రీసద్గురుని గూర్చి కీర్తనలు చేయుచూ జీవించసాగెను అని మోహల్‌లోని విశేషములను తెలిపి నిత్యానందయోగి శ్రీస్వామివారి ఈ సన్నివేశంలో లీనమై వారికి నమస్కరించిరి.

ఓ శ్రీస్వామి సమర్థా! సద్గురుమూర్తీ! నీవు పరమపురుషుడవు. మాయవల్ల కప్పబడి వుండే మాబోటి వారికి నీ దివ్యరూప దర్శనము దుర్లభం. నువ్వు అఖిల భూతాలలోను వర్తిస్తూ విశ్వమంతటా వెలుగును చిమ్ముతూ వుంటావు. ఆత్మానాత్మ వివేకం గలవారు, అరిషడ్వర్గాలను జయించినవారు, నిర్మలాంతః

కరణ కలవారు అయిన పరమహంసలకు మాత్రమే నీవు నీ నిజ తత్త్వముతో దర్శనీయుడవవుతావు, నువ్వు ప్రకృతికి పరుడవు–అవ్యయుడవు. పరమేశ్వరుడవు, అయినా స్మరణ మాత్రముచేత సంతుష్టుడవగుటచే నీ స్మరణ చేయు భక్తులకు నీ దర్శనం – స్వప్నంలోనైనా లభించుచున్నది. దానికి నిదర్శనము నీ కరుణయే.

సచ్చిదానంద సద్గురుమూర్తీ! నీ లీలలు అనంతములు, నీ దయతో నీ లీలలను స్మరించు భాగ్యము కలిగినది. ఓ దత్తమూర్తీ! నిర్మల హృదయములో నీవు నిత్య నివాసముంటావు. నీ లీలలను గానంచేయు శక్తి మాకు కలిగించుము. నీ లీలలను వినువారికి నీ అనుగ్రహము – దర్శనము కలిగించుము. ఓ సహస్రనేత్రా – సహస్రాకారా – సత్యస్వరూపా నీకు మా శతకోటి వందనములు" అని వారిని ప్రార్థించెను. అంత విద్యాసాగరుడు కూడా శ్రీస్వామిని స్మరించుకొని నమస్కరించుకొని స్వామీ! శ్రీస్వామి సమర్థులు మోహల్‌లో ఎంతకాలము వుండినారు? తరువాత కథ ఏమి? తెలియజెప్పుమనిన – శ్రీనిత్యానందుడు శ్రీస్వామిని స్మరించుకొని చెప్పబూనెను.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు మొహల్‌లో 1850 నుండి 1855 వరకు ఐదు సంవత్సరములు వుండిరి. షోలాపురమును కూడా పవిత్రపరచ వలెనని సంకల్పము అయినది కాబోలు! వారు మోహల్ నుండి షోలాపురం చేరిరి. అక్కడ వారు దత్తమందిర ప్రాంగణములో నివసించసాగిరి. వారిని అచటి వారందరు ఎవరో పిచ్చివాడనుకొనిరి. అచ్చట ప్రతిరోజు మధ్యాహ్నము భక్తులకు దేవుని ప్రసాదముగా భోజనం పెట్టేవారు. శ్రీస్వామి అచ్చట చేరిన రోజున భోజన సమయములో, భోజన హాలులో అందరికీ విస్తర్లు వేసియుండిరి. శ్రీస్వామి సమర్థులు తిన్నగా లోపలికి వెళ్ళి మొదటి ఆకువద్ద కూర్చుండిరి. అందులకు అక్కడ వున్న అధికారి అంగీకరించలేదు. అక్కడ నుంచి లేచిపొమ్మని శ్రీస్వామి సమర్థులను గట్టిగా గదమాయించెను. అఖరిలో ఎక్కడైనా కూర్చోమనెను. శ్రీస్వామి వెంటనే లేచిపోయి దేవాలయమును విడిచిపెట్టి ప్రక్కనవున్న మఠము చేరెను. అక్కడ ఒక స్థంభము వద్ద కూర్చుని చిన్నపిల్లవానివలె ఆడుకొను చుండెను. ఆ సమయంలో అక్కడకు వచ్చిన ఒక స్త్రీ ఆయనను చూచి ఆశ్చర్యపడెను. శ్రీస్వామి సమర్థులయొక్క స్థానమునందు ఆమెకు దివ్యమైన అలంకారములతో దత్తాత్రేయ స్వామివారి మంగళ విగ్రహము



కనబడెను. తిరిగి అదేస్థానములో శ్రీస్వామివారు కన్పించెను. మరల చూడగా విగ్రహము, తిరిగి శ్రీస్వామివారు కన్పించిరి. ఈ అద్భుతమైన దృశ్యమునకు ఆనందపరవశురాలైన ఆమె వీరెవరో మహాత్ములని, వారి పాదములపై వ్రాలెను. ఆమె అమితమైన ఆత్మానందముతో వారి పాదముల చెంత కూర్చొని యుండగానే మందిరములోని అధికారులు కూడా శ్రీస్వామివారు భోజనం చేయకుండా వెళ్ళిపోవడం వారి హృదయములో ఏదో వెలితిగాను, బాధగాను అనిపించినది. వారు తాము గర్జించిన వ్యక్తి సామాన్యుడు కాదని ఎవరో మహాపురుషులై వుండవచ్చునని ఊహించిరి. వారందరును స్వామిని వెదకుచు వచ్చి తమను క్షమించమని ప్రార్థించిరి. అచట శ్రీస్వామివారి దివ్యదర్శనము పొందిన స్త్రీ వారితో తన దర్శనము గూర్చి తెల్పెను. వారందరును ఆశ్చర్యముతోను, భక్తి ప్రపత్తులతోను, 'జయజయ శ్రీగురుదేవదత్త'యని శ్రీస్వామివారికి పాదాభివందనములు చేసిరి. తమను క్షమించి భోజనమునకు రావలసిందిగా ప్రార్థించిరి. శ్రీస్వామివారు వారి ప్రార్థనను మన్నించి వెళ్ళి భోజనం చేసిరి.

విద్యాసాగరా! ఇప్పటికీ షోలాపూర్‌లోని సుబ్బారాయ మఠమునందు శ్రీస్వామివారు కూర్చునిన స్థంభమువద్ద శ్రీస్వామివారి భక్తులు దత్తాత్రేయ స్థానముగా పూజించుచునే వున్నారు. ఇట్లుండ ఒకనాడు చింతోపంత్‌తోల్ అను ధార్మికుడు శ్రీస్వామివారిని దర్శించడం జరిగింది. వారిని నిశితముగా పరిశీలించి జనులు అనుకొనుచున్నట్లు వారు పిచ్చివారుకాదు, ఎవరో మహాత్ములై యుండవచ్చునని మనస్సులో అనుకొనుచుండగానే శ్రీస్వామివారు అతనిని చూచి "నాతో నీకేమి పని? నేను మహాత్ముండనైతేనేమి, పిచ్చివాడనైతేనేమి?" అని గట్టిగా అరచిరి. తమ మనస్సులోని మాటలను మనస్సులో వుండగానే తెలుసుకొన్న వీరు సర్వహృదయాంతర్యామి అయివుండవచ్చు లేక కొన్ని సిద్ధులున్న మహాత్ములైనా కావాలి అని అనుకొనుచుండగానే "నాకు సిద్ధులుంటేనేమి, లేకుంటే నీకేమి? నాతో నీకేమి సంబంధము?" అని అరచిరి. అంతట చింతోపంత్‌తోల్ ఈయన సాధారణ పురుషుడు కాడని తప్పక గొప్ప మహాత్ముడే! అని గ్రహించి, పాదములపై పడి ఆశీర్వదించమని ప్రార్థించెను. ఆయన ఆశీస్సులను పొంది ఆ బ్రాహ్మణుడు ఇంటికి వెళ్ళిపోయెను.




ఆ మరుసటి రోజున దత్త మందిరము దర్శించి శ్రీస్వామివద్దకు చేరి చింతోపంత్ శ్రీస్వామివారిని తన ఇంటికి భిక్షకు రావలసినదిగా కోరినాడు. అందులకు అంగీకరించిన శ్రీస్వామిని చింతోపంత్ తన గృహమునకు తీసుకొని వెళ్ళి శాస్త్రరీతిన వారికి ఆర్ఘ్యపాద్యములనిచ్చి, పూలమాలలను వేసి – గంధము, కస్తూరి వంటి సుగంధ ద్రవ్యములను పూసి – పూజించి మంగళహారతి ఇచ్చినారు. ఆరోజు స్వామివారితో గూడా మరికొందరిని భోజనానికి పిలిచినారు. శ్రీస్వామివారికి పూజ అగుసమయమునకు అందరూ సమకూడినారు. అందులో ఒకరిని సోహాని దాదాజి అనే అతిథి శ్రీస్వామి వాలకం చూచి ఏవగించుకొని, చింతోపంత్‌తోల్ చెవిలో ఇటువంటి అనాచారితో కలసి మేము భోజనం చేయలేము. ఇటువంటి పని సత్ బ్రాహ్మణులమైన మనకు తగదు" అని పలుకగానే, మరుక్షణమే వారి ఇంటిలో కూర్చున్న శ్రీస్వామి లేచి "నీ మనస్సులో వికల్పం కలిగినది, నేను వెళ్ళిపోతున్నాను" అని అక్కడ నుండి బయలుదేరగానే వెంటనే దత్తాత్రేయ అవధూత తత్త్వం గుర్తుకురాగా తన తప్పు తెలుసుకొని శ్రీస్వామివారి పాదములపై పడి తనను క్షమించమని కోరగా శ్రీస్వామి క్షమించిరి. శ్రీస్వామివారు చింతోపంత్‌తోల్‌తో "ఓ పంత్ దైవ దృష్టిలో అందరూ సమానమే. వర్ణ వివక్షత కూడదు, అందరూ దైవ సంతానమే. ప్రత్యేకముగా ఆహారము పంచునపుడు చిన్న, పెద్ద, కుల తారతమ్యములు పనికిరావు. ఆహారము పరబ్రహ్మ స్వరూపము. దానిని శ్రద్ధతో, భక్తితో, ఓర్పుతో అందరికీ అందించాలి. అంతేకాదు అతిథి స్వయంగా నారాయణుడు. ఇది దానము, ధర్మము అని భావించరాదు. సాక్షాత్ దైవమైన నారాయణునకు ఆహారము పెట్టు అవకాశముగా భావించవలెను. ఆ నారాయణుడు సర్వులయందు సముడే – సమభావం – సమదృష్టి – సర్వజీవులను సర్వేశ్వరుని రూపాలుగా భావించుట ముఖ్యము. ఇతరులకు భోజనం పెట్టుట నారాయణ సేవగా తలంచవలెను" అని ప్రబోధించి భోజనం చేసి వెళ్ళిపోయినారు. అంత చింతోపంత్ అక్కడకు విచ్చేసిన అతిథులందరికీ శ్రీస్వామి సాధారణ పురుషులు కారని, వారు అందరి హృదయాలలోని భావమును తెలుసుకొనగలరని – తనకు కలిగిన అనుభవమును తెలిపి లోకగురుడు అయిన దత్తమూర్తి తత్త్వం అందరికీ తెలిపి వారందరికీ శ్రీస్వామిపైన భక్తి కలిగించెను.



శ్రీస్వామి షోలాపురంలో వుండగా అనేకమంది శ్రీస్వామిని దర్శించేవారు. వారి దర్శన భాగ్యముచేత అనేక దివ్యమైన అనుభూతులు పొందేవారు. చింతోపంత్‌నకు శ్రీస్వామివారితో చాలా అనుబంధం కలిగినది. వారు శ్రీస్వామి వారికి అత్యంత శ్రద్ధగల భక్తులయినారు. వారు శ్రీస్వామిని అనేకసార్లు తమ ఇంటికి ఆహ్వానించి పూజించి భిక్షను యిచ్చినారు. ఒకసారి శ్రీస్వామిని చింతోపంత్ భిక్షకు ఆహ్వానించినారు. శ్రీస్వామివారు వచ్చారు. కాని ఎంతసేపటికీ కంచంముందు కూర్చోలేదు. ఆయన భోజనం చేస్తేకానీ ఇంట ఎవరూ భోజనం చేయడానికి వీలులేదు. షోలాపూర్ కలెక్టర్ ఆఫీసులో పనిచేయుచున్న చింతోపంత్ కుమారుడు దాజీబాపంత్‌నకు ఆఫీసుకు ఆలస్యమౌతుందని తొందరపడుతున్నారు. చివరకు చింతోపంత్ వండిన వంటకాలను కొద్దిగా తీసివుంచి భోజనం చేసి ఆఫీసుకు కుమారుని వెళ్ళమని చెప్పినాడు. కాని దాజీబాపంత్ ఏది ఏమైనాసరే శ్రీస్వామి భోజనం చేయకుండా తాను భోజనం చేయరాదని నిర్ణయించుకుని దత్తస్మరణ చేసుకొనుచు కూర్చుండినారు.

తుదకు శ్రీస్వామివారు పదకొండు గంటలకు భోజనం చేసినారు. తొందరగా దాజీబాపంత్ భోజనంచేసి శ్రీస్వామివారివద్ద సెలవు తీసుకొని ఆఫీసుకు వెళ్ళినాడు. త్వరత్వరగా హెడ్ గుమాస్తా దగ్గరకు వెళ్ళి తన ఆలస్యానికి క్షమాపణ చెప్పుకున్నాడు. అంతులేని ఆశ్చర్యముతో "హెడ్ గుమాస్తా దాజీబాతో నీవు సరైన సమయానికి వచ్చి సంతకం చేసినావుకదా! మరల ఇలా చెబుతున్నావేమిటి?" అని హాజరుపట్టిని చూపించినాడు. తాను రాకముందే తన సంతకం హాజరుపట్టిలో వుండటం చూచి, అది శ్రీసద్గురు శ్రీస్వామివారి మహిమ అని వెంటనే గుర్తించి మనస్సులోనే శ్రీస్వామిని స్మరించుకొన్నాడు. ఇది 1856వ సంవత్సరములో జరిగినది. సాయంకాలము ఇంటికి తిరిగివచ్చి తన ఇంటిలోని వారికి ఆనాడు జరిగిన సంఘటనను తెలిపినాడు. ఈ కథ చెప్పుచున్నంతసేపు వాని కళ్ళలో నీరు కారుతూనే వుండెను. 'భగవంతుడు ఎల్లవేళలా నా భక్తులను రక్షించుచుందును' అని భగవత్‌గీతలో యోగక్షేమం వహామ్యహమ్ అని చెప్పిన రీతిన శ్రీస్వామి సమర్థులు తనను విశ్వసించిన వారిని తప్పక రక్షించుచుండేవారు. ఇంటిలోని వారు అందరు ఆ పరమ గురుని లీలలను కీర్తించుకొని జయ జయ నాదములు చేసినారు.

శ్రీస్వామి సమర్థులు షోలాపూర్‌లో వుండగనే ఒకసారి ప్రసిద్ధి చెందిన శ్రీస్వామి సిద్ధేశ్వర మందిరమునకు వెళ్ళినారు. అచ్చట పెద్ద కొలను (సరస్సు) కలదు. ఎప్పుడూ జలముతోను, జలజంతువులతోను అందరికీ ఆకర్షణీయంగా వుండేది. దాని మధ్యలో శ్రీస్వామి సిద్ధేశ్వర మందిరము వున్నది. శ్రీస్వామి అక్కడికి వెళ్ళేనాటికి కొంతకాలముగా ఆ సరస్సు వర్షములు లేక పూర్తిగా ఎండిపోయి వున్నది. శ్రీస్వామి సమర్థులు మందిరములో శ్రీస్వామివారిని దర్శించి ఆవరణము అంతా తిరిగి నీరులేని సరస్సులో మూత్ర విసర్జన చేసిరి. వారు అలా చేయుచుండగనే ఆలయ అధికారులు చూచి కేకలు వేయుచు పరుగు పరుగున రాసాగిరి. ఇంతలో ఆశ్చర్యకరముగ సరస్సు అడుగునుండి నీరు పైకి రాసాగింది. అధికారులు, భక్తులు అచ్చటికి చేరి ఆ వింతను చూచి ఆనందాశ్చర్యములు పొంది శ్రీస్వామిని చూచి వీరు సామాన్య మానవులు కారని, సాక్షాత్తు ఆ సిద్ధేశ్వరులే ఈ రూపమున వచ్చి సరస్సునకు జీవము కలిగించుచున్నారని భావించి వారి పాదములపై వాలిరి.

అచ్చటనే ఒక గదిలో వుండి సాధన చేసుకొనుచున్న ముకుంద బ్రహ్మచారి శ్రీస్వామి వారి ఈ లీలను చూచి వీరు పరబ్రహ్మ స్వరూపులే అని భావించి వారి పాదములపై శిరమునుంచి నమస్కరించి –

"దేవాదిదేవా! సద్గురుమూర్తి! సచ్చిదానంద – ప్రణవ స్వరూపా! నీవు మంచివారికి మేలునూ, దుష్టులకు సద్బుద్ధినీ కల్పించే నిమిత్తం అనేక రూపాలు ధరిస్తూ వుంటావు. ఈ జగత్తుకు ఎప్పుడూ మేలు చేస్తూ వుంటావు. నీ మహాత్మ్యాన్ని ఎవరు గుర్తించగలరు? నా పుణ్య వశమున మీ దర్శనము కలిగినది. నన్ను ఉద్ధరించడానికే మీరు ఈ ప్రాంతము వచ్చినారు. గురుదేవా! నన్ను దీవించండి. సాధనలోని అవరోధములను తొలగించండి" అని ప్రార్థించెను.

శ్రీస్వామి వాని శిరముపై తన హస్తమును ఉంచి దీవించి వెళ్ళిపోయిరి. ఆ క్షణము నుండి ముకుందునకు అత్యుత్తమ అనుభూతి కలిగి సాధనలో ముందుకు సాగినారు. అతను ప్రతిదినము ఆ సరస్సులో స్నానము చేయసాగినారు. అందులకు ఆ ఆలయ పూజారి, అధికారులు అభ్యంతరము తెలుపసాగినారు. వారు వద్దని చెప్పినా ముకుంద బ్రహ్మచారి వినలేదు. దానికి తోడు తిరిగి శ్రీస్వామిని దర్శించాలి అని అంతవరకు మౌనముగా వుండాలి అని దీక్షబూనినాడు. అందువలన మాటలుకూడా లేవు. వారు చెప్పినది వినేవాడు



కాదు. అందులకు కోపగించిన పూజారులు, అధికారులు అతనిని కొట్టేవారు, తిట్టేవారు. కాని అతనికి శ్రీస్వామివారి కృపతో బాధ కలిగేదికాదు. అతను వారు ఇంతచేసినా తన మానాన తాను తన కార్యములలో నిమగ్నమై యుండేవారు. స్నానం మాత్రం మానేవాడుకాదు. ఒకరోజున రాత్రి వారు అందరు కలసి మాట్లాడుకొని అతని గదికి తాళం వేసినారు. ఉదయం వచ్చి చూడగా గదికి తాళం వేసినది వేసినట్లే ఉన్నది. కాని ముకుంద బ్రహ్మచారి మాత్రం బయట సరస్సులో స్నానం చేయుచు కనిపించినాడు. అది చూచి వారందరు నిర్ఘాంతపోయినారు. అతనికి శ్రీస్వామి సమర్థుల అనుగ్రహం లభించినది అని భావించి గౌరవించినారు. అందరు అతనిని బ్రహ్మచారి ముకుంద మౌనిబువా అని పిలువసాగినారు. అతను శ్రీస్వామిని అక్కల్‌కోట చేరిన తరువాత అప్పుడప్పుడు దర్శించేవారు.

చింతోపంత్ షోలాపురంలోనే రెవిన్యూ డిపార్ట్‌మెంట్‌లో మమల్తదారుగా పనిచేసినారు. ఉద్యోగమునుండి విరమణ జరిగిన తరువాతే శ్రీస్వామివారి పరిచయం కలిగినది. అతనికి అక్కల్‌కోట రాజావారి దర్బార్‌లో ఉద్యోగమునకై పిలుపు వచ్చినది. అక్కడ షాహాజీరాజు వారి నిపుణతను గుర్తించి, వారి సేవలను ఉపయోగించుకోవాలని నిర్ణయించి చింతోపంత్‌ను రావలసినదిగా కబురు పంపాడు. చింతోపంత్ శ్రీస్వామి వారికి ఈ విషయమును తెలిపి తనతో అక్కల్‌కోట రమ్మని ప్రార్థించాడు. అందులకు శ్రీస్వామివారు ఇప్పుడు ఎండలు బాగా కాస్తున్నాయి. తరువాత వర్షాకాలములో వస్తాను అని వాగ్దానము చేసి చింతోపంత్‌ను పంపినారు. పంచభూతాలను తమ ఆధీనంలో వుంచుకొనిన శ్రీస్వామివారికి భరింపరానిదేమి వుండును? వారు సర్వకాలములోను శరీరముపైన ఆచ్ఛాదన లేక హిమాలయముల నుండి రామేశ్వరం వరకు తిరిగినారు. అయితే వారి మాటలు అన్ని వేళలలోనూ ఏమో సంకేతాలుగా నుండేవి. చింతోపంత్ ఉద్యోగార్థమై శ్రీస్వామిని షోలాపురంలోనే వదలి అక్కల్‌కోట చేరి రాజు సేవలో నిమగ్నమైనారు. వేసవికాలంలో అక్కల్‌కోట రాజరికములో మార్పు వచ్చినది. షాహీజీరాజు అనారోగ్యంతో కాలంచేయగా వారి సోదరుడు మాలోజీరావు రాజైనాడు. ఇదియే శ్రీస్వామి చింతోపంత్‌కు తన మాటలలో సూచించినారు. వర్షాకాలము ప్రకృతి అంతా పచ్చగా, అందముగా వున్న సమయంలో 100 సంవత్సరములు సంచారము చేసిన శ్రీస్వామి అక్కల్‌కోట చేరారు.

చింతోపంత్ అక్కల్‌కోట రాజావారికి కనిపించి తిరిగి వెళ్ళి షోలాపురం చేరినారు. 1856 ఆఖరులో చింతోపంత్ శ్రీస్వామివారిని స్వయంగా ఆహ్వానించి గుఱ్ఱం మీద ఎక్కించుకొని అక్కల్‌కోటకు బయలుదేరినారు. దారిలో అతనికి కలెక్టర్ వద్దనుండి అత్యవసరంగా రమ్మని కబురు వచ్చినది. గత్యంతరములేక శ్రీస్వామిని ఒక చెట్టుక్రింద విడచి ఆయన సేవకుగాను ఒక నౌకరును వుంచి తాను వచ్చేవరకు అక్కడ శ్రీస్వామితో వుండమని – శ్రీస్వామిని ప్రార్థించి షోలాపురం వెళ్ళినారు. అతి త్వరగా పని ముగించుకొని సాయంకాలమునకు రాగా అక్కడ తన పనివాడు ఒక్కడే వున్నాడు.

చింతోపంత్ ఆత్రుతతో శ్రీస్వామివారు ఏరి? అని పనివానిని అడుగగా వారు "ఆర్యా! తాము వెళ్ళిన కొద్దిసేపటికి శ్రీస్వామివారు వెళ్ళిపోవడానికి నిర్ణయించుకున్నారు. నేను వారిని ప్రార్థించినా వారు వినక నేను ఎవరికీ బద్ధుడనుకాను'' అని కొలది అడుగులు వేసి ముందుకు వెళ్ళి అంతర్ధానమయ్యారు అని తెలిపినాడు. చింతోపంత్ నిరాశతో అక్కల్‌కోటకు చేరినాడు.

అక్కల్‌కోట చేరగానే గ్రామ దేవతైన ఖండోబా ఆలయానికి వెళ్ళడం చింతోపంత్‌కు అలవాటు – ఆలయం లోనికి మెట్లెక్కుతూనే శ్రీస్వామివారి దర్శనం అయినది. శ్రీస్వామివారు అక్కడ ఆడుకొనుచూ కనిపించినారు. వారినిచూచి సంతోషించి తమ ఇంటికి రమ్మనగా – వారు "మా ఇల్లు వేరు" అన్నారు గాని చింతోపంత్ ఇంటికి వెళ్ళలేదు.

విద్యాసాగరా! ఇలా శ్రీస్వామి అనేక ప్రాంతములలో తిరిగి హిమాలయముల నుండి సాగిన ప్రయాణము అక్కల్‌కోట చేరడంతో ముగిసినది. అవతార పురుషులు తమ లీలలతో దేశాన్ని, పుణ్యక్షేత్రాలను, పుణ్య తీర్థాలను పునీతంచేసి తమ లీలలను అక్కల్‌కోటకు చేర్చి ఈ క్షేత్రమును అతి పుణ్యక్షేత్రంగా మార్చినారు అని చెప్పి జయజయ నాదములు చేసినారు.

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** (శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***పదునెనిమిదవ అధ్యాయము** సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం ఓం శ్రీ గురుదేవదత్త
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట
# స్వామి సమర్థ లీలామృతము

## పందొమ్మిదవ అధ్యాయము

### అక్కల్‌కోట నివాసంగా శ్రీస్వామి లీలలు

గురు భక్తులారా! శ్రీస్వామి సమర్థ లీలామృత పారాయణ చేయు పావన చరితులారా!

దుఃఖమనేది ఎటువంటి వారికైన నిజకర్మ బలంవల్ల మాత్రమే సంభవిస్తూ వుంటుంది. దుఃఖనివృత్తికి ప్రయత్నించడం ప్రతిజీవికి సహజమే అయినా ఈశ్వరానుగ్రహం సద్గురుని కృపలేకపోతే ఆ ప్రయత్నాలు ఫలించవు.

ఈశ్వరానుగ్రహం, సద్గురుని కృపను పొందటానికి వారిని ఆరాధించటం అవసరం. కాని అది దుస్సాధ్యమైన కార్యం. నిస్సంగులై తీవ్ర తపశ్చర్యకు పూనుకొన్న మహామహులకు కూడా అది అరుదుగాగాని లభించదు.

ఆరాధించడం అనేది స్థూలరూపములో నిత్యకార్యాచరణలాగా కాకుండ సూక్ష్మబుద్ధితో మనస్సులో ఏ వికారములకు తావు ఇవ్వక వారిని హృదయ కమలముపై ప్రతిష్ఠించుకొని – మంత్రబద్ధంగా – నియమబద్ధంగా – శ్రద్ధతో – ఓర్పుతో ఆహ్వానించి పూజించాలి, సేవించాలి. వారి లీలలతో, వారి రూపముతో లయంకావాలి, మిశ్రమం కావాలి, కలసిపోవాలి. అప్పుడుగాని ఆరాధన కుదరదు.

దైవ నిర్ణయం ప్రకారం సమకూరే సుఖదుఃఖాలను సమభావంతో అనుభవించటం, తనకంటే అధికులైన వారిని చూసి సంతోషించటం, అల్పులపట్ల కరుణ వహించటం అన్నవి సంసారబంధ విముక్తికి

కారణాలవుతాయి. దీనిని పొందాలంటే మహాత్ముల జీవిత చరిత్రలను వారి లీలలను మననం చేసుకొని చిత్తశుద్ధిని పొందాలి. మీరు స్థిరచిత్తముతో ఈ అద్భుత లీలావతారుని కథలను చదవండి, చిత్తశుద్ధిని పొందండి.

నాయనా! విద్యాసాగరా! శ్రీస్వామివారి లీలలు అనంతములు. పూర్తిగా వారి లీలలను కీర్తించడం ఆదిశేషునికైనా అలవికాదు. వారి చర్యలలోని గూఢార్థం తెలుసుకొనుట సాధ్యముకాదు. సుదీర్ఘముగా వారిని సేవించి - వారి నామస్మరణతో లయం అయితేకాని, వారిని వారి తత్త్వాన్ని అర్థం చేసుకోలేము. కావున అటువంటి దయామూర్తిని మనస్సులో నిరంతరము ధ్యానంచేయి అని ప్రబోధించి నిత్యానందులు శ్రీస్వామి అక్కల్‌కోటలో చేసిన లీలలను చెప్పనారంభించినారు.

శ్రీస్వామి సమర్థులకు అనేకమైన భాషలు తెలియును. హిందీ, మరాఠి, సంస్కృతములపై మంచి ఆధిపత్యము కలదు. సర్వజ్ఞుడు. తనవద్దకు వచ్చువారి మనోభావములు తెలిసినవాడు. ఆయన నోటితోకన్న చేతులతో సంజ్ఞచేసి మాట్లాడేవారు. ఆయన మాట్లాడినప్పుడు గుప్తమైన భాషలో చిన్నచిన్న మాటలతో చెప్పెడివారు. ఆయనకు అతి దగ్గరైన భక్తులు వారు చెప్పినది అర్థము చేసుకొని ఇతరులకు విడమర్చి చెప్పెడివారు. ఆయన ఒక మాటచెప్పినా, ఒక సూచన యిచ్చినా, ఒక చూపు చూసినా భక్తులు ఆనందము పొంది ఆత్మానందముతో సంతృప్తి చెందెడివారు. శ్రీస్వామి లోహపు ఉంగరములతో ఆడెడివారు. వాటిపై దేవతల చిత్రములు వుండెడివి. అప్పుడప్పుడు తన భక్తులకు యిచ్చెడివారు. అటుల ఉంగరము పొందినవారికి వారి ఇష్టదైవము ఆ ఉంగరముపై చెక్కబడి యుండెడిది.

శ్రీస్వామి సమర్థులకు ధనవంతుడు, బీదవాడు అనే భేదము లేదు. హిందువులను, మహమ్మదీయులను, క్రైస్తవులను, పార్శీలను సమముగా చూచెడివారు. ఆయన ఎక్కువగా నిమ్నజాతుల, హరిజనులపైన శ్రద్ధవహించి వారిపై ఎక్కువగా దయచూపెడివారు. బీదసాదలను కష్టములతోనున్నవారిని ఆదుకొనెడివారు. ఎవరు బీదలను, కష్టములలో నున్నవారిని తనవారిగ గుర్తించెదరో వారు నిజమైన సాధువులు, అవతార పురుషులు. 1856వ సంవత్సరము నుండి 1878వ సంవత్సరము వరకు శ్రీస్వామివారు అక్కల్‌కోటలో



ఉన్నారు. అక్కల్‌కోట చేరిన కొత్తలో సమీపంలోని పొలములలో ఉన్న ఆముదపు కఱ్ఱలను తెచ్చి వాటిని తన దుప్పటినుండి తీసిన దారపు పోగులతో కట్టి, వరుసలో పెట్టి ఆడుతుండేవారు. ఎవరైనా ఏమి చేయుచున్నారని అడిగితే "సైన్యమును తయారు చేయుచున్నాని చెప్పేవారు. 1857లో ఉత్తర దేశమున భారతదేశపు ప్రథమ స్వాతంత్ర్య యుద్ధము ప్రారంభమాయెను. అప్పుడు శ్రీస్వామి సమర్థుల ఆటయొక్క సూచన స్వతంత్రమునకై జరగబోవు యుద్ధమని తెలుసుకొనగల్గిరి. భారతీయులు ఓడిపోయిరి. నానాసాహెబ్, తంత్యాతోపే, ఝాన్సీ లక్ష్మీబాయి యొక్క వీరోచిత యుద్ధము నిష్ఫలమాయెను. అంత ప్రభుత్వం ప్రజలను అతిక్రూరముగా హింసించెను. వీటి చిహ్నములను శ్రీస్వామి సమర్థ ముందుగనే సూచించెను. ఆయన ప్రతిదినము రాజమహలులోని పెద్ద ఫిరంగి దగ్గరకు వెళ్ళేడివారు. దాని పేరు లక్ష్మి. ఆయన తన తలను ఆ ఫిరంగిలో పెట్టెడివారు. అది భారతమాత దేశభక్తిగల బిడ్డల త్యాగములకు రాబోవు కర్మఫలమునకు సూచన.

భారతీయ సాంప్రదాయము ప్రకారము ఆకలితోనున్నవారికి అన్నము పెట్టుట ఎంతో ఉత్కృష్టమైన చర్య. శ్రీస్వామి సమర్థులకు సంతర్పణయందు భోజనములు వడ్డించుట అనిన ఎంతో ప్రీతి. అన్నపూర్ణాదేవి స్వయముగా తన బిడ్డలకు ఆకలి తీర్చుటవంటిది. ఎప్పుడూ అక్కడ ఆహార లోపము లేదు. వంటలు ఎప్పుడూ తక్కువకాలేదు. అటువంటి అద్భుతములు ఎన్నిసార్లో శ్రీస్వామి సమర్థ జీవితకాలములో జరిగినవి.

భక్త శిఖామణీ! పూర్వము రామాయణ కాలంలో – భరద్వాజ మహర్షి రామాదులకు తమ తపోబలంతో గొప్ప విందు చేసినాడు. అదేరీతిన జమదగ్ని మహర్షి తమ కామధేనువు సహకారంతో కార్తవీర్యార్జునునకు, వారి సైన్యమునకు భోజనము పెట్టినాడు. వశిష్ఠ మహర్షి కూడా విశ్వామిత్రుని సైన్యాలకు ఇలాంటి భోజనం పెట్టినారు. అది ఆకాలంలో – ఈ నవీన కాలంలో ఈ దత్తావతారులు కూడ కొద్దిమందికి వండిన వంటను వేలాదిమందికి సమకూర్చినారు శ్రీ నరసింహ సరస్వతి స్వామివారు, మన శ్రీస్వామి సమర్థులు.

శ్రీస్వామి సమర్థులు చేసిన లీలలలో అక్కల్‌కోటను కేంద్రముగా చేసుకొని చూపిన లీలలను తెలుసుకుందాము.

శ్రీస్వామివారు చోళప్ప గృహములో నుండగా అప్పుడప్పుడు చుట్టుప్రక్కల గ్రామములకు వెళ్ళేవారు. అలా ఒకసారి దగ్గరలోనున్న రాంపుర వెళ్ళారు. అక్కడ శ్రీస్వామి భక్తులు దావాజి, విఠోభాయి అనే దంపతులు శ్రీస్వామివారితో సన్నిహితంగా వుండేవారు. శ్రీస్వామివారు వచ్చినప్పుడు శ్రీస్వామితో కలసి నలుగురు బ్రాహ్మణులకు భిక్షచేసేవారు. అందరిని కలుపుకొని 40 మందికి సరిపోవు పదార్థములను సిద్ధంచేసినారు. శ్రీస్వామివారు రాగానే వారికి స్నానము చేయించి, అలంకరించి పూజించి హారతిని యిచ్చి ప్రసాద వినియోగానికి అనుమతి ఇవ్వమని అడిగినారు. ఇంతలో అనుకోకుండా శ్రీస్వామివారు వచ్చారని తెలిసి చుట్టుప్రక్కల వారందరు చేరినారు. శ్రీస్వామివారు వచ్చినవారందరికి భిక్షను ఇవ్వమని తమవారితో కలసి తాను స్వీకరిస్తానని తెలిపిరి. దావాజి దంపతులు సందిగ్ధంలో పడ్డారు. కేవలం 40 మందికి వండిన వంటకాలు ఇందరికి సరిపోవు. శ్రీస్వామివారు వారి మనోభావాల్ని గమనించి కొన్ని పాత్రలు తెప్పించి వాటిలో అడుగున శ్రీ పాండురంగ విఠలుడు, శ్రీ దత్తాత్రేయ స్వామిని, శ్రీ గణేశుని, అన్నపూర్ణ విగ్రహాలుంచి వాటిపై వండిన పదార్థాలు పెట్టించి వానిని తలపైన పెట్టుకొని ఆ దంపతులను తులసికోట చుట్టూ ముమ్మారు ప్రదక్షిణ చేసి వడ్డన చేయమని ఆజ్ఞయిచ్చారు. శంక ఏర్పడిన మనసును దైవశక్తి నిలిపి వుంచలేదు. కనుక వడ్డన చేస్తున్నప్పుడు పాత్రలలోని పదార్థాన్ని ఇంకా ఎంత పదార్థము మిగిలివున్నదా అనే దృష్టితో చూడకుండా వచ్చినవారందరికీ వడ్డించమని ఆజ్ఞాపించారు. చిత్రంగా నలుబదిమందికి వండిన వంటకములు వందలాది మంది భోక్తలకు సరిపోగా ఇంకా మిగలటము చూచి అందరూ ఆశ్చర్యపోయినారు. శ్రీస్వామివారు అన్నపూర్ణ స్వరూపమని, ఆదిశక్తి స్వరూపమని, పూర్ణదైవము అని పరబ్రహ్మ అని తలచి జయ జయ నాదములు చేసినారు.

అంతట దావాజీపటేల్, విఠోబాయి దంపతులు స్వామివారివద్దకు వచ్చి స్వామీ! మీ అనుగ్రహంతో నలభై మందికి సరిపోయే వంటకములు వచ్చిన భక్తులందరికి సరిపోయి ఇంకను మిగిలి, మీ వాక్కు వలన అక్షయమయ్యెను. సర్వజీవులకు పోషకులు మీరు. సంరక్షణకర్తలు తామే. తామే స్వయంగా వున్న ప్రదేశములలో లేమి ఎందుకు ప్రవేశిస్తుంది. స్తుతిగా మీ సద్గురు రూపాన్ని కీర్తించ ఎవరి తరము. శ్రీవారి లీలలను అర్థము చేసికొనుట సామాన్యులమైన



మాకు సాధ్యమా తండ్రీ! సదా మీ అనుగ్రహము మాపై వుండనివ్వండి అని ప్రార్థించి, శ్రీస్వామిని కూడా భోజనము చేసి విశ్రాంతి తీసుకోండి అని కోరిరి. అందులకు స్వామి మా తండ్రి, తాత ఇంకా భోజనము చేయలేదు ఆగమనెను. ఇంకా ఎంతసేపు ఎదురుచూచుట అని వారు అనుకొనుచుండగనే షోలాపూర్ నుండి కొందరు భక్తులు వచ్చిరి. వారికి కూడా వడ్డించి తృప్తిగా భోజనము చేసిన తరువాత శ్రీస్వామివారు భిక్ష స్వీకరించినారు.

అది నిజముగా అక్షయ భాండాగారము. అటువంటి మహాత్ముల మాటలు శక్తివంతములై తప్పక జరుగును. వారి చర్యలు, మాటలు, ఆలోచనలు - సత్యరూపములు. పొరపాటున కూడా అసత్యం వారి మాటలలో దొర్లదు. వారు మాట్లాడినది సత్యమై జరిగితీరును. అందువలననే మానవులు మహాత్ములను దర్శించి వారి ఆశీస్సులు కోరెదరు.

పూర్వము అర్జునుని మనుమడైన పరీక్షిన్మహారాజు కలిని నిర్జించి, ఒకసారి మృగయా వినోదమునకై అడవికి వెళ్ళెను. ఆ అడవిలో ఆయన చాలాసేపు వేటాడి అలసి, అమితమైన దాహంతో మంచినీటికోసం, ఆయన, ఆయన అనుచరులు వెదుకగా మంచినీరు దొరకలేదు. కాని వారికి శమీక ముని ఆశ్రమం కన్పించింది. వారు ఆశ్రమం చేరేసరికి శమీకముని సమాధి నిష్ఠలో వున్నారు. ఆయనను మహారాజు మంచినీటికై అర్థించినాడు. ఆయన పలుకలేదు. దానిపై దాహపీడితులై వున్నందున క్రోధమునకు వశుడై వివేచన నశించినవాడైనాడు. అనతిదూరంలో గాంచిన మృత సర్పమును ఆ ముని మెడలో వేసి తన దారిన తాను పోయెను. మునిది తపోనిష్ఠయో, లేక తనయందు నిర్లక్ష్యమో! రాజు తెలిసికొనలేకపోయెను. అది చూచిన కొందరు మునిబాలురు ఆ విషయమును శమీకుని కుమారుడైన శృంగికి తెలిపిరి. శృంగి వెంటనే తండ్రి వద్దకు వచ్చి చూచెను. అమితమైన ఆగ్రహం కలిగినవాడై, రాజే ఈ విధముగా ధర్మమర్యాదను ఉల్లంఘించినందువల్ల ఇక ధర్మానికి తావు వుండదన్న అభిప్రాయంతో నాటికి ఏడవరోజున తక్షక సర్ప విషమువల్ల పరీక్షిత్తు మరణించును గాక! అని శపించెను. తరువాత ఆ రాజు అట్లే మరణించెను.

అప్పటికి శృంగి ఏడు సంవత్సరములు నిండని బాలుడు. ఏ తపస్సూ చేయలేదు. అయినను శృంగి శాపమువల్ల పరీక్షిత్తు మరణించెను. ఆ శక్తి శృంగికి ఎవరిచ్చెను? ఆయన మహాత్ముడు కాదే? ఎందువల్లననగా అతడు

బాలుడైనా అబద్ధమాడడు. సత్యమును తప్ప పలుకడు. అందువలన అతడు ఏది మాట్లాడినను సత్యమై తీరును. అదే శృంగి విషయమున జరిగినది. ఇంక మహాత్ములైన శ్రీస్వామి సమర్థవంటి మహాపురుషుల విషయము చెప్పవలెనా?

విద్యాసాగరా! స్వామివారు తమ అఖండమైన దీవెనలతో మృత్యువును కూడా మార్చినారు. తన భక్తుల సంరక్షణలో శ్రీస్వామి ఏ ఆటంకములను లెక్కచేసేవారుకారు. వారికి భక్త సంరక్షణే ముఖ్యంగా వుండేది. వారు తల్లి, తండ్రి, గురువు, అంతకంటే వారందరికంటే ఎక్కువ.

అక్కల్‌కోటలోనే రాజదర్బారులో నౌకరుగా వున్న బాబాసాహెబ్ జాదవ అనే కుమ్మరి శ్రీస్వామీజీని అత్యంతభక్తితో సేవిస్తూ వుండేవాడు. వానిని శ్రీస్వామివారు "ఒరేయ్ కుమ్మరి" అనేవారు. ఒకనాడు శ్రీస్వామి సన్నిధిలో వుండగా అతనికి మరణము ఆసన్నమైనదని శ్రీస్వామికి తెలిసినది. అతనికై యమదూతలు వచ్చి సూక్ష్మరూపములో వుండి వాని ప్రాణములను తీసుకొని పోవుటకు సర్వలోక నాయకుడయిన పరబ్రహ్మస్వరూపులైన శ్రీస్వామి సమర్థుల అనుమతి కోరిరి. అంత శ్రీస్వామి ఓరి జాదవా! నీకు పైనుండి సమన్లు వచ్చాయి జాగ్రత్త! అన్నారు. జాదవునకు శ్రీస్వామివారి మాటలలోని సూచన తెలిసి శ్రీస్వామివారి పాదాలపై పడి స్వామీ నన్ను రక్షించండి. చనిపోతాను అనే భయంలేదుగాని తిరిగి మీ పాదసేవ ఎన్ని జన్మలకైనా లభించబోదని నా భయం. మీ పాదసేవ చేసుకొనేందుకైనా నన్ను రక్షించండి. స్వామి జనన, మరణములకు మీరే కారణభూతులు. పూర్వము మార్కండేయుని శివుని రూపములో రక్షించినది మీరే. వానికి చిరంజీవత్వం ప్రసాదించారుకదా! నాకు అంత ఆశలేదు. మరికొంతకాలము తమను సేవించుకొనే భాగ్యము కలిగించండి చాలు! అని ప్రార్థించినాడు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి కరుణించి యమదూతలతో అక్కడవున్న ఆంబోతు(ఎద్దు)ను చూపించి దానిని తీసుకొని వెళ్ళండి అని ఆదేశించారు. వారు శ్రీస్వామికి నమస్కరించి ఆ ఎద్దువైపు వెళ్ళిరి. శ్రీస్వామి దానిని చూస్తూ 'పో!' అని కేకవేశారు. తక్షణమే ఆ ఎద్దు చనిపోయినది. తమను సేవించి మరింత పవిత్రుడవటానికి జాదవను కాపాడటమేకాక జంతు జన్మమెత్తిన ఆంబోతును కూడ ఆ జన్మనుండి ఉద్ధరించారు అని శ్రీస్వామి నిత్యానందుడు చెప్పగానే ఈ చిత్రమైన కథ వినిన విద్యాసాగరుడు గురుదేవా! శ్రీస్వామిచే మరణము నుండి తప్పించుకొని జీవితమును వరముగా పొందిన



ఆ జాదవ ఎంతటి పుణ్యాత్ముడు. అతడు అపర మార్కండేయుడే కదా! అనగానే నిత్యానందుడు చిరునవ్వు నవ్వి ఆవును, అంతేకాదు ఆ జాదవ స్వామీజీచే రక్షించబడిన తరువాత అనేక సంవత్సరములు జీవించి శ్రీస్వామివారికి పరమభక్తుడైనాడు. వారిని ఎంతో ప్రేమతో సేవించేవారు అని శ్రీస్వామి లీలలను తెలుపుట ప్రారంభించినారు.

విద్యాసాగరా! అంతేకాదు శ్రీస్వామివారు మరియొక వింతను చూపిరి. అది అంతకంటే ఆశ్చర్యకరమైనది వినుము.

కొంతకాలమునకు ఒకరోజున శ్రీస్వామి తన శిష్యులైన చోళప్ప, జాదవ్ మున్నగువారితో కలసి దగ్గరలో వున్న ఇటగీ అనే గ్రామము వెళ్ళారు. మధ్యాహ్నం భోజనము తరువాత శ్రీస్వామివారు ఆంజనేయస్వామి ఆలయంలో నిద్రపోవుచున్నారు. ఆ సమయంలో దగ్గరలోని పొలాలలో పనిచేసుకొనుచున్న రామన్న అనేవానికి పాము కరచినది. పొలాలలో పనిచేయువారందరు వానిని ఆంజనేయస్వామి దేవాలయమునకు తీసుకొని వచ్చినారు. కాని వాడు మార్గం మధ్యలోనే చనిపోయినాడు. వానిని రక్షించమని శ్రీస్వామిని ప్రార్థించాలని వారికోరిక. కాని ఆ సమయంలో శ్రీస్వామి గాఢమైన నిద్రలో వుండి గుర్రుపెట్టుతున్నారు. చోళప్ప నిస్సహాయముగా చూచుచుండగా జాదవ్ శ్రీస్వామివారి పాదరక్షలను తీసుకొని చనిపోయిన వాడిపైన ఉంచాడు. శ్రీస్వామివారు వెంటనే నిద్రనుండి లేచి తీవ్రమైన కోపముతో "ఒరే కుమ్మరి మూర్ఖుడా! నా పాదరక్షలను ఆ శవముమీద ఎందుకు పెట్టావని తిడుతూ జాదవ్‌ను కొట్టబోయినంత పనిచేశారు. చాలాసేపు కోపంతో, తిట్టిన తిట్టు తిట్టకుండా తిట్టి, ఆ తరువాత శాంతించినారు. భయంతో జాదవ్ ఒక మూల ఒదిగి కూర్చొనినాడు. శాంతించిన శ్రీస్వామి జాదవ్ మనస్సులోని విషయము గ్రహించి, చచ్చినవాడా! బ్రతికి రా! అని పిలిచినారు. ఇంకా భయం వీడని కుమ్మరి జాదవ్ శ్రీస్వామి తననే పిలిచారనుకొని దగ్గరకు చేరి చేతులు కట్టుకొని వినయంగా నిలబడినాడు. అంతట శ్రీస్వామివారు జాదవ్‌ను చూచి ఇంకా ఎంతసేపు నిద్రపోతాడు వాడు, పోయి ఆ చచ్చినవాని చెవిలో మూడుసార్లు వాని పేరుతో పిలువుమని ఆజ్ఞాపించినారు. జాదవ్ సంతోషముతో ఆ శవమును చేరి చెవిలో "రామన్నా! రామన్నా! రామన్నా!" అని మూడుసార్లు పిలువగానే రామన్న నెమ్మదిగా కనులు తెరచి ఎక్కడవున్నానని ఆశ్చర్యపోయెను.

తన చుట్టూవున్న జనమును చూచి సిగ్గుపడి లేచెను. అతనికి పాముకాటు జ్ఞప్తికి వచ్చెను. తరువాత ఏమి జరిగినది అక్కడ వున్నవారు చెప్పిరి. అంతట వారు శ్రీస్వామి సమర్థులను శ్లాఘించుచూ పాటలు పాడిరి.

శ్రీస్వామికి నిజముగా జాదవ్‌పై కోపము వచ్చెను. బాగుగా హెచ్చరించెను. కర్మఫలమును ఎవరు తప్పించరాదు. విధి క్రమము జరుగవలసినదే. రామన్నకు కాలధర్మము అనుసరణగా మరణ మాసన్నమైనది. కాల నిర్ణయమునకు మనమడ్డుపడరాదనిరి. శ్రీస్వామి సమర్థవంటి మహాపురుషులు ప్రకృతిని శాసింపగలిగినను అత్యవసర పరిస్థితులందు తప్ప దైవనిర్ణయమునకు అడ్డు తగలరు. దైవకార్యము నెరవేరవలసినదే! జాదవ్ శ్రీస్వామి సమర్థ చెప్పులను రామన్న మరణమును తప్పించుట (ప్రాణప్రతిష్ఠ)కు ఉపయోగించెను. పాదుకలయొక్క ప్రభావమును చూపుటకు ప్రజలలో ఆధ్యాత్మిక విశ్వాసమును స్థాపించుటకు సూచనైనను ఆయన మనస్సులో ఈ పద్ధతి అంగీకరించలేదు. రామన్నను మరణమునుండి రక్షించి ప్రాణభిక్షను పెట్టెను.

ఈ ప్రపంచములో మహాపురుషులు నిర్వర్తించని కార్యములు ఏమియులేవు. వారి ఆజ్ఞపై మరణమైనను వెనుతిరగవలసినదే. శ్రీనరసింహ సరస్వతి జీవితములో కూడ ఇటువంటిదే జరిగినది. సతీసహగమనమునకై ఒక విధవరాలు చితిపైకెక్కుటకై బయలుదేరెను. మార్గమధ్యమున శ్రీనరసింహసరస్వతిని ఆమె కలసి ఆయన పాదములపైబడెను. శ్రీనరసింహ సరస్వతి సర్వసాధారణ స్థితిలో తల్లీ! నీవు సౌభాగ్యవతిగా జీవించుమని ఆశీర్వదించెను. నీకు ఎనమండుగురు సంతానము కలుగునని నెను. స్వామీ! ఇది అసాధ్యము నా భర్త చనిపోయెను. ఆయనను చితిపై పెట్టెదరు. నేను సహగమనమునకై పోవుచున్నాని భోరుమని ఏడ్చెను. శ్రీనరసింహ సరస్వతి ఆమెతో స్మశానమునకు వెళ్ళిన ఆ శవమును తెప్పించి శవముపై తన కమండలము నుంచి నీటిని తీసి చల్లెను. ఆ మరణించిన మనిషి తిరిగి లేచెను.

ఇటువంటివి ఎన్నో సంతులైన శ్రీపాద శ్రీవల్లభ, శ్రీనరసింహ సరస్వతీ, జ్ఞానేశ్వర మహరాజ్, శ్రీసమర్థ రామదాసస్వామి మొదలగు అనేక మంది జీవితములలో వారు వారి శిష్యులకు ప్రాణదానమును చేసిరి.

ఈ విషయములు మహాపురుషులకున్న అద్భుతశక్తులు, ప్రకృతిపై వారికిగల ఆధిపత్యమును సూచించెను. మరణించిన వారికి ప్రాణప్రతిష్ఠ



చేయగలరు. ఆయువును పెంచగలరు. కాని విద్యాసాగరా! ఆ శక్తులను వారు ఎప్పుడోగాని ఉపయోగించరు. ఇది ముఖ్యముగా మనము గ్రహించి వారి సూచనల ప్రకారం నడచుకోవాలిగాని – వారికి, వారి తపమునకు ఇబ్బంది కలిగించే విధంగా ప్రవర్తించరాదు అని తెలిపి శ్రీస్వామి లీలలను చెప్పుచున్నారు.

విద్యాసాగరా! కోపంలో శ్రీస్వామి రుద్రావతారులు అయితే ఒక్కొక్కప్పుడు తమాషాచేసి అందరిని ఆనందింపజేసేవారు. వారు సంతోషముతో నవ్వినప్పుడు పెద్దగా నవ్వేవారు. ఆ సమయంలో రెండు చేతులతో తమదైన పెద్ద పొట్టను పట్టుకొని పకపక నవ్వేవారు. ఆ దృశ్యం అందరికీ పరమ సంతోషాన్ని కలిగించేది.

ఒకరోజు శ్రీస్వామి ఖాస్‌బాగ్ అనే తోటలోకి వెళ్ళి పడుకొని వున్నారు. శ్రీస్వామివారి శిష్యులందరు కొలది దూరంలో వున్నారు. ఉన్నట్టుండి శ్రీస్వామి నాతో రండి, మీకు ఒక పుణ్యపురుషుని చూపిస్తాను అని ఒకవైపుకు నడిచారు. భక్తులందరు ఎవరో మహమ్మదును చూపుతారు కాబోలు అని అనుకొనుచు వారి వెంట నడచిరి. కొంత దూరముపోయి పొదలతో నిండియున్న ఒక పెద్ద పాము పుట్టను చూపి శ్రీస్వామి నిలబడినారు. ఆ పుట్టనుండి ఒక పెద్ద నాగుపాము బయటకు వచ్చినది. అది మెల్లగా శ్రీస్వామివారి వద్దకు చేరి పడగయెత్తి నిలబడినది. శ్రీస్వామివారు చూడండి. ఇతడే ఆ పుణ్యజీవి అని అన్నారు. అందరూ ఆ సర్పానికి నమస్కారము చేసినారు. అంత ఆ సర్పము శ్రీస్వామిజీకి నమస్కరించి తిరిగి పుట్టలోనికి వెళ్ళినది. శ్రీ స్వామివారికి ఏ రూపములో ఏ ఆత్మ దాగివుందో వాని గత జన్మల చరిత్ర ఏమిటో క్షుణ్ణంగా తెలుసు, వారు సర్వాంతర్యామి!

**జయ జయ స్వామి సమర్థ అక్కల్‌కోట స్వామి జయ**

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

***పంధొమ్మిదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
శ్రీగురుచరణమ్ - సద్గురు చరణమ్
సద్గురు చరణమ్ - భవహరణమ్

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరువదియవ అధ్యాయము

### బాసల్‌గాంలో శ్రీస్వామి సమర్థులు

విద్యాసాగరా! శ్రీ స్వామివారు అప్పుడప్పుడు చుట్టుప్రక్కల వుండే చిన్న చిన్న గ్రామాలకు వెళుతుండేవారు. ఇలాంటి గ్రామాలలో బాసల్‌గాం ఒకటి. అది అక్కల్‌కోటకు అయిదు, ఆరు మైళ్ళ దూరంలో వున్నది. ఆ వూళ్ళో ఒక దర్జీ (టైలర్) పనివాడుండేవాడు. అతనిని ఒక దుష్టగ్రహము పట్టి పీడిస్తుండేది. శ్రీస్వామివారిని దర్శిస్తే ఆ బాధ తొలగిపోతుంది అనే నమ్మకంతో తన కుటుంబముతోసహా అక్కల్‌కోటకు చేరినాడు. చోళప్ప గృహములో శ్రీస్వామివారు ఉండగానే ఉదయంపూట శ్రీస్వామిని దర్శించి వారి పాదములకు సాష్టాంగ నమస్కారములు చేసి "స్వామీ మీరు పరబ్రహ్మ స్వరూపులు, మా బాధలను, కష్టములను తొలగించుటకై ఈ రూపంలో అవతరించినారు. సద్గురుమూర్తీ! ఎన్నో జన్మలలో చేసుకున్న పుణ్యఫలం వలన మా గురువులు చేసిన గురుసేవ ఫలం వలన మాకు మీ దర్శనం కలిగినది. స్వామీ నేను చేసుకొన్న పాప ఫలంగా ఒక దుష్టగ్రహం నన్ను పీడించుచున్నది. దీని బాధనుండి నన్ను విముక్తుణ్ణి చేయండి. మీరు కరుణా సముద్రులు. స్వామీ! మాపై మీ అనుగ్రహం చూపండి!" అని ప్రార్థించినారు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి వూరుకున్నారు. అతను శ్రీస్వామివారి చిరునవ్వు చూచి వారి సన్నిధానంలో కలిగిన ఆనందముతో "స్వామీ మీరు మా గ్రామమునకు విచ్చేసి మా గృహమును పావనం చేయండి. మా పూజలను అందుకోండి, నా శక్తికొలది మీకు, మీ శిష్యులకు 50 మంది వరకు భిక్షకు ఏర్పాటు చేస్తాను వచ్చి స్వీకరించి మమ్ముల



ననుగ్రహించండి"అని ప్రార్థించి పాదములను గట్టిగా పట్టుకొని శ్రీస్వామివారివైపు దీనముగా చూచినాడు. శ్రీస్వామివారు అతని భక్తికి మెచ్చి వాని ఆహ్వానమును అంగీకరించినారు. మరుసటిరోజున వచ్చెదమని తెలిపి వానిని ఆశీర్వదించి ప్రసాదం యిచ్చి పంపినారు.

మరుసటి రోజున భక్త బృందంతో శ్రీస్వామివారు బాసల్‌గాంకు వెళ్ళినారు. ఆ దర్జీవాడు, శ్రీస్వామికి శాస్త్రరీతిన పాదపూజ చేసి భక్తులందరిని సత్కరించి భోజనమునకు రమ్మని పిలిచెను. శ్రీస్వామివారు ముందు వచ్చినవారికి భోజనము పెట్టమని అందరిది అయ్యాక తాము స్వీకరించగలమని తెలిపిరి. భోజనము వడ్డించుట ప్రారంభించడంతో క్రమక్రమముగా వందల సంఖ్యలో జనం రాసాగిరి. దర్జీ దంపతులు ఆందోళనతో శ్రీస్వామివారిని చేరిరి. శ్రీస్వామి "ఏమీ ఆందోళన పడవలదు. వడ్డించుచూ వెళ్ళండి. ఏమీ కొదవలేదు. అంతా సవ్యంగా జరిగిపోతుంది" అని అభయమిచ్చినారు. వారు శ్రీస్వామిని స్మరించుచూ వడ్డన సాగించినారు. వందలాదిమంది భోజనం చేసినారు, చేస్తున్నారు. అయిన పదార్థాలు తక్కువగాకుండా ఎప్పటికప్పుడు సరిపోతూ వచ్చాయి. చివరికి మిగిలిన వారితోను, ఆ దంపతులతోను శ్రీస్వామి భోజనము చేసినారు. ఈ అద్భుతమైన దృశ్యమును చూచి జనులందరూ ఆశ్చర్యపడినారు.

అనంతరము శ్రీస్వామివారు విశ్రాంతిగా కూర్చున్నప్పుడు ఈ దర్జీవాడు మరల తన బాధను విన్నవించాడు. వాడు అలా చెప్తూనే మధ్యలో పిచ్చిగా కేకలు వేస్తూ గంతులు వేయసాగాడు. శ్రీస్వామి అంతా చూస్తూ స్థిమితముగా హుక్కా తాగుతూ కూర్చున్నారు. చివరకు దర్జీవాని కళ్ళలోనికి తన తీక్షణమైన చూపులను ప్రసరింపజేసినారు. అప్పుడు వాడు పిచ్చి చేష్టలు మాని శ్రీస్వామి పాదాలపై పడ్డాడు. అతనిపైనున్న దుష్టగ్రహం అతనిని విడచి దూరంగా నిలబడి నన్ను పోనివ్వండి, నన్ను పోనివ్వండి అని దీనముగా ప్రార్థించినది. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి అంగీకారంగా తలవూపుతూ అనుమతి ఇచ్చారు. అంతట ఆ దర్జీవాడు లేచి మామూలు మనిషివలె స్వస్థత మనస్కుడై శ్రీస్వామికి నమస్కరించినాడు. ఆ తరువాత అతనికిక ఏమీ బాధ కలుగలేదు. శ్రీస్వామి అనుగ్రహంతో జీవితం ఆనందముగా సాగినది.

అదే గ్రామములో అప్పాసుతార అనే అతడు శ్రీస్వామి భక్తుడు వుండేవాడు. శ్రీస్వామి దయవల్ల పుష్కలంగా నీరు సమకూడి తన పొలం మంచి పంట పండింది. అతడు కృతజ్ఞతతో శ్రీస్వామిని తన పొలములోనే భోజనము చేయవలసినదిగా ప్రార్థించినాడు. శ్రీస్వామి సంతోషంగా కొందరు భక్తులతో అతని పొలంవైపు వెళ్ళారు. అందరూ కూర్చొని జొన్నకంకులు కాల్చుకోవడానికి, పేలాలు వేయించుకోవడానికి మధ్యలో పెద్ద మంట పెట్టారు. అక్కడే కూర్చున్న స్వామి తన పక్క కుండలో వున్న నీరు నోటిలో పోసుకొని ఆ నీటిని మాటి మాటికి ఆ నిప్పుమీద పుక్కిలించి ఉమ్మి వేస్తున్నారు. సహజంగా మంట ప్రజ్వరిల్లటం, అందరినీ ఆశ్చర్యపరిచింది. అది అగ్నిగుండంలో నెయ్యి వేస్తున్నట్లున్నదిగాని నిప్పుమీద నీరు పోస్తున్నట్టు లేదు.

శ్రీస్వామివారు బాసలగాంలో వుండగానే ఒకరోజు రామమందిరంలో విశ్రాంతి తీసుకొంటూ వున్నారు. ఉన్నట్టుండి పల్లకీ తెప్పించమని ఆజ్ఞాపించారు. భక్తులు గ్రామంలోనికి వెళ్ళి పల్లకిని తెచ్చారు. ఈలోగా ఆకాశము మేఘావృతమైనది. చూస్తుండగానే కుంభవృష్టిగా వర్షము కురవసాగినది. ఉరుములు, మెరుపులు ప్రారంభమయ్యాయి. పల్లకీ మోసేవారు కూడా ఆ వాతావరణములో బయట అడుగుపెట్టటాన్ని భరించలేకపోయారు. భక్తులందరూ కలసి శ్రీస్వామి మనస్సు మార్చే ప్రయత్నం చేశారు. కాని వారి ప్రయత్నాలు సాగలేదు. ఆయన పల్లకి కావాలని పట్టుబట్టారు. అప్పటికి ఎవరూ కదలకపోవడంతో ఆయన లేచి వర్షములోనే బయలుదేరినారు. అది చూచిన బోయిలు వీధిలోకి పల్లకి తీసుకొచ్చి శ్రీస్వామిని ఆసీనులు కమ్మని ప్రార్థించారు, భక్తులందరు అనుసరించినారు. వాతావరణము క్రమముగా ఉద్ధృతమైనది. ఉరుములు – మెరుపులతో వర్షము కురియుచునే యున్నది. ఆ దృశ్యముచూచి శ్రీస్వామి ఎంతో ఆనందిస్తూ ఆహ్లాదంగా, వెన్నెలలో విహరించినంత ఆనందంగా ఆనందించసాగారు. అందరూ వర్షములో తడిసి, ముద్దగా అయిపోయి అక్కల్‌కోట చేరినారు.

విద్యాసాగరా! పరబ్రహ్మస్వరూపులైన శ్రీ దత్తావధూతల చర్యలకు అర్థాలు చెప్పబూనటం సాహసమే అవుతుంది. వారు ఏదో సత్కార్యములను దృష్టిలో వుంచుకొని, తమ కార్యములను నిర్వర్తించెదరు. ప్రకృతిని, ప్రకృతిలోని



జీవులందరి తత్త్వమును, తమ ఆధీనములో వుంచుకొనగలరు. అక్కల్‌కోటలో ఒక కోతిని శ్రీస్వామివారు అదుపు చేశారు. ఆ కథ విను అని తిరిగి చెప్పసాగెను.

అక్కల్‌కోటలో ఒక కోతి తన విపరీత చర్యలతో అందరిని తీవ్రంగా బాధించసాగింది. అందరి ఇండ్లలో ప్రవేశించి, యిష్టమొచ్చినట్లు ప్రవర్తించేది. అది ఎవరికీ లొంగేదికాదు. అది చేసిన విచ్చలవిడి పనులకు విసుగుచెందిన ప్రజలు ఇక దాని చర్యలను భరించలేక ప్రభుత్వమువారికి విన్నవించుకున్నారు. రాజావారి అధికారులు, నౌకర్లను పంపి దాన్ని పట్టి చంపవలసినదిగా ఆజ్ఞ జారీచేసినారు. నౌకర్లు చాలా పెద్ద ప్రయత్నంచేసి దానిని బంధించి గ్రామములోని ఖండోబా మందిరమునకు తెచ్చినారు. శ్రీ స్వామివారికి యీ విషయం తెలిసినది. వారు చోళప్ప, యాదవులను పంపి దానిని తమ వద్దకు తీసుకొని రమ్మని ఆజ్ఞాపించారు. వారు వెళ్ళి నౌకర్లకు శ్రీస్వామి ఆజ్ఞను వినిపించగానే వారు శ్రీస్వామివారి విశిష్టతను ఎరిగి వున్నందున, రాజావారుకూడా శ్రీస్వామిని పూజించుట తెలిసియున్నందున, శ్రీస్వామి ఆజ్ఞను తీసివేయలేక వారిలోవారు చర్చించుకొని తుదకు ఆ కోతిని తీసుకొని శ్రీస్వామివారివద్దకు వచ్చి వారి ముందు వుంచి నమస్కరించినారు. శ్రీస్వామి దానిని బంధములను తొలగించి – దానిని దగ్గరగా తీసుకొని వెన్ను మీద నిమిరి "హనుమా ఇకమీదట ఎవ్వరి జోలికీ వెళ్ళవద్దు, ఎవరినీ బాధింపవలదు. నెమ్మదిగా ఉండు" అని దీవించి పంపివేసిరి. నౌకర్లతో ఇకమీదట అది ఎవ్వరినీ బాధింపదుగాన వెళ్ళి మీ అధికారులకు చెప్పండి అని పంపివేసిరి. ఆ కోతి ఆనాటి నుండి సాధుజంతువువలె ప్రర్తించసాగినది. శ్రీస్వామిపైగల భక్తితో ప్రతిరోజు వారివద్దకు వచ్చి కొద్దిసేపు గడిపి వెళ్ళేది. శ్రీస్వామివారి వాక్కుతో చంచల స్వభావముగల కోతిలో ఆ మార్పు వచ్చినది.

అలాంటిదే మరియొక సందర్భములో ఒక ఏనుగు విశృంఖలముగా సంచరిస్తూ, రాళ్ళూ, రప్పలను అందరిమీద విసరుతూ, మదపుటేనుగులాగా అందరిని చికాకుపరచసాగింది. అది పెంపుడు ఏనుగు. దానిపేరు జవహర్. కాని ఏ కారణముచేతనో మావటి వానికి గూడ లొంగక తిరగసాగింది. దీనితో గ్రామమంతా అల్లకల్లోలంగా అయిపోయింది. ఇది తెలిసి శ్రీస్వామివారు అతివేగంగా చోళప్ప ఇంటినుండి బయటకు వచ్చి వడివడిగా ఏనుగునకు

ఎదురుపడి, నడుములమీద చేతులను పెట్టుకొని దానివైపు తీక్షణంగా చూడసాగినారు. పరుగులమీద వచ్చుచున్న ఏనుగు శ్రీస్వామివారిని చూడగానే నెమ్మదిగా నిదానంగా వారివద్దకు చేరి నమస్కరించి తన స్వభావమును మార్చుకొనినది. దాని మావటివాడు, నౌకర్లు పరుగిడి వచ్చి, శ్రీస్వామి సన్నిధిలో వున్న ఏనుగును చూచి శ్రీస్వామికి నమస్కరించిరి. శ్రీస్వామి దానిని తీసుకొని వెళ్ళండి అనగానే దానిని తోలుకొని వెళ్ళిపోయిరి. శ్రీస్వామివారి ప్రభావం సర్వజీవులలోను, శాంతబుద్ధి నొందించగలదని అందరికీ తెలిసినది. జనులందరు జయ జయ నాదములతో శ్రీస్వామిని కీర్తించసాగిరి. అందరూ కలసి భజనలు చేయసాగిరి. క్రమంగా ఈ లీల అంతటా వ్యాప్తి చెందెను.

భాగవతంలో శ్రీహరి చెప్తారు – 'తాను కటాక్షించదలచిన భక్తుడి నుండి ముందుగా సర్వ సంపదలనూ హరించిన తరువాతనే కటాక్షిస్తానని' శ్రీ స్వామికి అతి సన్నిహితుడైన భక్తుడు శేషాచారి. నిత్యాగ్నిహోత్రం, అయిదిళ్ళ దగ్గర భిక్ష అతని నియమాలు. శ్రీస్వామి తీవ్రమైన కోపంతో ఉన్నప్పటికి కూడా ఇతర భక్తులలాగ గాక శేషాచారి ధైర్యంగా ఆయన దగ్గరకు వెళ్ళేవాడు. ఆయనను చూడటంతోనే శ్రీస్వామి శాంతించేవారు. అప్పుడప్పుడూ ఆయన శ్రీస్వామికి నశ్యం గూడా యిస్తూ వుండేవాడు. కాని అదేమి చిత్రమోగాని అందరికీ మిఠాయి పంచినపుడు గూడా ఇతనికి మాత్రం ఎప్పుడూ పెట్టేవారుగాదు. ఒకసారి ఉండబట్టలేక మర్నాడు శ్రీస్వామిని మిఠాయి అడగాలనుకున్నాడు శేషాచారి. మరుసటి రోజునుంచి శ్రీస్వామి అతనికట్టి అవకాశమే యివ్వలేదు. అతనెప్పుడు దర్శనానికి వచ్చినా శ్రీస్వామి నిద్రపోతుండేవారు. అలా కొన్ని రోజులపాటు శ్రీస్వామివారి దర్శనం కూడా దొరక్కుండా పోయింది. శ్రీస్వామి ప్రవర్తన అతనికేమీ అర్థంకాలేదు. అకస్మాత్తుగా ఒకరోజున తన తప్పు శేషాచారికి తట్టింది. తనకు మిఠాయియందు కోరిక కలగటమే ఇన్నింటికీ కారణమని గ్రహించాడు. అప్పటి నుండి అతడు దేనిని కోరగూడదని నిర్ణయించుకొన్నాడు. అంతేకాదు పేడతో చిన్న చిన్న ఉండలు చేసి వాటిని నోట్లో పెట్టుకొని నేనెప్పుడూ దేనిని కోరినా నాకిలాగే అగుగాక! అన్ని కోరికలూ వీటితో సమానమన్న సంగతి నాకెన్నడూ గుర్తుండుగాక! అనుకొన్నాడు. సరిగ్గా అదే సమయానికి శ్రీస్వామి తన పొట్టను రెండు చేతులతో పట్టుకొని మహాసంతోషంగా విరగబడి



నవ్వుతున్నారు. ఏ మహాత్ముడికైనా తన భక్తుడు కోరికలను జయించాడంటే సంతోషమేకదా!

విద్యాసాగరా! కోరిక ఏదైనా మనసులో ప్రవేశించింది అంటే చాలు అది క్రమ క్రమంగా పెరిగి వటవృక్షములాగ అవతరించి సాధకుని సర్వనాశనం చేస్తుంది. కోరిక ఒక్కటే కొద్దిసేపటిలో అనేకమౌతుంది. అవి కోరికలు అవుతాయి. అవి అన్నీ కలసి పర్వతాకారము పొందుతాయి. వాని క్రిందపడి నలగటమే మానవునికి మిగులుతుంది. కోరికలు ఒకదానివెంట ఒకటి పుట్టుతూనే వుంటాయి. ఈ కోరిక తీరితే చాలు, ఇంక ఏమీ కోరను అన్నవాడు దాని తరువాత ఇదే మాట మాట్లాడుతాడు. అందువలన బుద్ధిమంతులు వీనిని దగ్గరకు రానివ్వరు. సాధకులు ఒకవేళ దగ్గర చేరితేనే పాపం అని ప్రాయశ్చిత్తం చేసుకొంటారు. అందువలన మనస్సు శుద్ధి పొందుతుంది. శేషాచారి గొప్ప భక్తుడు, సాధకుడు. అందువలననే అతను ప్రాయశ్చిత్తం పొంది, చిత్తశుద్ధి పొందిన తరువాత శ్రీస్వామివారికి అత్యంత ప్రియుడు కాగలిగినాడు. ఈ లీలతో శ్రీస్వామి తన శిష్యులను, భక్తులను – కోరికలను దరిచేరనివ్వకండి అని ప్రబోధించినట్లయినది. కావున విద్యాసాగరా! నీవు ఈ కోరికలపట్ల జాగ్రత్తగా వుండుము అని శ్రీస్వామివారి లీలలను చెప్పబూనినాడు.

విద్యాసాగరా! శ్రీస్వామి సన్నిధిలో శ్రీస్వామినే పరీక్షింపవచ్చి వారిచే పరీక్షకు గురై ప్రాయశ్చిత్తం పొందువారు కలరు. ఆ కథ చెపుతాను వినుము.

అక్కల్‌కోటలో శ్రీస్వామి దేశముఖ్‌వాడలో వుండగా ఒకనాడు శివుబాయి అనే స్త్రీ అంధుడైన తన కుమారుని తీసుకొని శ్రీస్వామి వద్దకు వచ్చినది. ఆమె శ్రీస్వామితో తన బాలునికి పుట్టుకనుంచి చూపు చక్కగానే వున్నదని బ్రహ్మోపదేశము (ఉపనయనము) జరపగానే అంధత్వం వచ్చినదని వానిని కరుణించమని ప్రార్థించింది. అపుడు శ్రీస్వామివారు అమ్మా! నన్ను పరీక్షించడానికి అయిదుగురు రక్కసులు రాబోవుచున్నారు. వారు రాగానే మీ అబ్బాయికి కంటిచూపు వస్తుంది. ఆందోళన చెందనవసరం లేదు. నిదానంగా చూస్తూ వుండండి అని శ్రీస్వామి ఆశీర్వదించినారు.

ఇంతలో అయిదుగురు బ్రాహ్మణులు నల్లటి రంగుతో స్థూల

కాయములతో శ్రీస్వామివారి వద్దకు వచ్చారు. వారిలో వారు సంస్కృతము - కన్నడ భాషలలో మాట్లాడుకొనిరి. తరువాత ఆ బ్రాహ్మణులు శ్రీస్వామి సమర్థను దర్శనము చేసుకొని శుభాకాంక్షలు తెలిపిరి. అందరివలె నమస్కారము చేశారు. శ్రీస్వామీజీ తన మెడలోని హారము నుండి రుద్రాక్ష తీసి ఆ బాలునికి యిచ్చినారు. అతనితో శ్రీస్వామి ఓ బాలకా! ఈ బ్రాహ్మణులు ఏ ఉద్దేశముతో వచ్చారో, ఏమి ప్రశ్నలు అడగాలనుకుంటున్నారో ఆ ప్రశ్నలు, వాటికి సమాధానములు కూడా వివరంగా చెప్పు!" అని ఆదేశించారు. దానికి ఆ బాలుడు "మహాత్మా! నేను అజ్ఞానిని. నాకేమి తెలుసునని చెప్పగలను?"అని శ్రీస్వామికి చేతులు జోడించి నమస్కరించాడు. అంత శ్రీస్వామి వానిని దగ్గరకు పిలిచి ఒక పువ్వుతో వాని కన్నులను తుడిచారు. అపుడు విచిత్రంగా ఆ బాలుడు ఆ బ్రాహ్మణులవైపు తిరిగినాడు. వారు చెప్పకుండానే వారి వారి మనస్సులలో అన్ని భావములు ఆ బాలునికి తెలిసినవి. దానితో అతడు "ఆర్యులారా! మీరు శ్రీస్వామివారి శక్తిసామర్థ్యములను తెలుసుకొను ఉద్దేశంతో ఉన్నారు. మీ ఉద్దేశంలో అహంకారము - దంబాచారము ఉన్నవి. మీరు గొప్పవారని - విద్యావంతులని మిగతావారంతా ఎందుకూ పనికిరారని మీ విశ్వాసము. మీరు మీకంటే అధికులని ఎవరు కీర్తింపబడినా ఓర్వలేరు. ఏదో కుయుక్తి పన్ని చిక్కు ప్రశ్నలతో వారిని సతమతం చేసి, వారిని అవమానపరచి నవ్వులపాలు చేయుచుండుటయే మీ నైజము. మీరు అటువంటి ఉద్దేశముతోనే ఈ సమర్థుని సన్నిధానమునకు వచ్చినారు. శ్రీస్వామివారు అనాచారి అని, అబ్రాహ్మణుడు అని మీ భావము. అంతేకాదు మీరు ఐదుగురు శ్రీస్వామివారిని అడగటానికి ఐదు ప్రశ్నలను తయారుచేసుకొని వచ్చినారు. అవికూడా మీ సొంతము కాదు. శాస్త్రముల నుండి సేకరించినారు.

అవి ఏవి అనగా :

1. ముక్తిని సంపాదించుటకు గల భూమికలు ఏవి? వానిని ఏమంటారు? దాని వివరములు ఏవి?
2. ఉపనిషత్తు అనగానేమి? దాని శబ్దార్థము ఏమి?
3. యోగి అనగా ఎవరు? అతను ఎచ్చట వుండవలెను - ఎచ్చట వుండగూడదు?



4. యోగి అనువాడు ఎట్లుండవలెను? ఎట్లుండకూడదు? వాని లక్షణములు ఏవి?
5. యోగి అనువాడు దేనిని నిరోధించవలెను, దేనిని పొందవలెను?

ఇవి మీ ప్రశ్నలు. వీనిని శ్రీస్వామివారిని అడుగ సంకల్పించారు. మీరు ఎంత అజ్ఞానులు? సకల కారణములకు, కార్యములకు కారకుడు అయిన ఈ సద్గురు మూర్తిని ఇటువంటి చిన్న ప్రశ్నలతో తెలుసుకొనగలరా? వారిని తెలుసుకోవాలంటే శ్రద్ధతో, ఓర్పుతో, వినయముతో, భక్తితో సేవించి తెలుసుకోవాలిగాని ఈ మార్గము మంచిదికాదు. అని పలికి శ్రీస్వామివారికి నమస్కరించి వారి ప్రశ్నలకు సమాధానము చెప్పసాగాడు. అయ్యలారా! ఎన్నో జన్మల పుణ్యంచేత మీరు బ్రాహ్మణులుగా జన్మించినారు. మంచి గురువులను చేరి విద్యలను అభ్యసించినారు. విద్య లభించినదిగాని మీకు జ్ఞానవిద్య - యోగవిద్య అలవడలేదు. అందుచేతనే ఇలా మాట్లాడుచున్నారు. అశాంతితో దేశమంతా తిరుగుచున్నారు. అయినా వచ్చినారుగదా, మీ ప్రశ్నలకు సమాధానం వినండి. నావంటి చిన్న బాలుడిచేత శ్రీస్వామి సమర్థులే పలికించుచున్నారు. అని ఈ విధంగా చెప్పసాగినాడు.

1. ముక్తిని సంపాదించుటకుగల భూమికలు ఏడు 7; వానిని సప్తజ్ఞాన భూమికలంటారు. అవి : (1) శుభేచ్ఛ, (2) విచారణ, (3) తనుమానసత్వము, (4) సత్వపత్తి, (5) అసంసక్తి, (6) పదార్థ భావన, (7) తురాయము.

అయ్యలారా! ఆత్మ అనగానేమి - జన్మము అనగా ఏమి? ఈ జనన మరణములు ఏమి? మున్నగువానిపై కలుగు విచారణమే "శుభేశ్చ" మరియు వీనిని తెలుసుకోవలెను అను సంకల్పము. వానిని గురించి ఆద్యంతమును గూర్చి సర్వవిధాల విచారించుటయే 'విచారణ' అగును. ద్వైత భావమును క్రమక్రమముగా తగ్గించుకొనుచూ వృత్తిజ్ఞానము లేకుండా చేసుకొనుట "తనుమానసత్వము" అగును. ఈ మూడవస్థలను దాటినవాడు అద్వైత సిద్ధుడనబడును. తక్కిన నాలుగు భూమికల యందు జ్ఞాత - జ్ఞేయము - జ్ఞానము అనువానికి గల సంబంధమును గూర్చి ద్వైతభావముగూడ నశించును. "సత్త్వపత్తి"యందు అద్వైతభావమును పూర్తిగా పొందుట. వీనిని పొందినవానిని బ్రహ్మవేత్తలని అంటారు. ఈ స్థితిలోనున్నవారు వాని ప్రారబ్ధకర్మానుసారముగా

లోకకళ్యాణార్థము పాటుపడుదురు. "అసంసక్తి" అనెడి ఐదవ భూమికలో సంకల్పముగాని మనో వృత్తులుగాని వుండవు. అపుడు వానిపై ద్వైతభావము వాసనామాత్రముగూడా నుంచరు. వానిని బ్రహ్మవిద్యకుడందురు. వానికి దేహమున్నదను భావముండును. కాని దానియందెట్టి ఆసక్తియు నుండదు. "పదార్థభావన" అను ఆరవ భూమిక వచ్చినపుడు త్రిపుట జ్ఞానముగూడ నుండదు. అనగా దేహభావముగూడ వుండదు. అతను మెలకువగానున్నను ఎల్లప్పుడు సమాధి సిద్ధుడై యుండును. వానిని బ్రహ్మవిద్వరేణ్యుడందురు. ఏడవది అయిన తురీయావస్థకు చేరినవానిని బ్రహ్మవిద్యావరిష్ఠుడందురు. వారు బ్రహ్మమగును. అతను పరమశాంత స్థితిలో నుండును. అతను అనుభవించునది బ్రహ్మానందము అందురు. ఈ సప్తభూమికల జ్ఞానము నొసగుటకు, వానిద్వారా పొందు పరమసత్యమే శ్రీస్వామి సమర్థులని తెలుసుకొనండి.

2. ఉపనిషత్తు అనగానేమి అని అడిగినారు. ఉపనిషత్తు అనగా భేదరహిత జ్ఞానము. బ్రహ్మ ఆత్మల ఐక్యతను అభేధించు బ్రహ్మవిద్యయే ఉపనిషత్తు. దాని శబ్దార్థము – ఉపనిషత్తులకు రెండు అర్థములు కలవు వినండి.

   మానవులను అజ్ఞానాంధకారములో వుంచి జనన మరణములను, వానిచే కలిగిన కర్మలచేత కప్పబడియున్నదానిని అజ్ఞానమును నశింపజేయుట ఉపనిషదార్థమని అంటారు. అంతేకాక ఉప అనగా సమీపము. నిషత్ అంటే ఉంచునది. అనగా బ్రహ్మమునకు దగ్గరగా తీసుకొని వెళ్ళునది అని అర్థము. దానిని పూర్తిగా ఆచరించు శాస్త్రములనబడు వేదములలోని విజ్ఞాన వీచికలనే భాగములనే ఉపనిషత్తులంటారు.

3. యోగి అనగా అనేక జన్మలచేత లభించిన మానవ జన్మములో అన్ని ఆశ్రమములను ధర్మబద్ధముగా నిర్వర్తించుచూ ధర్మ – అర్థ – కామ – మోక్షములగు పురుషార్థములలో మొదటి మూడింటిని వదలి శ్రేయస్సు అనగా మోక్షమును పొందుటకై ప్రయత్నించి గురుశిష్యుడై తిరిగి గురువై – సాధకుడైన ముక్తసంగుని యోగి అని అంటారు. యోగి అనేవాడు నిస్సంకల్పుడై యుండాలి. దేనికిని చింతించక తన మనస్సును పరమాత్మయందు యుంచువాడే యోగి. అతను నిరంతరము పవిత్ర



నిర్మల స్థలమందు నివశించాలి. జన సమూహములోను సంఘర్షణలోను, ఉపద్రవములుగల స్థలములలో ఉండగూడదు. ఎక్కువగా ఏకాంత వాసములో ఉండవలెను. శబ్ద - స్పర్శ - రస - రూప గంధాదులు దొరకు చోటులో వుండగూడదు. యోగి సర్వ వేళలలో మనోవాక్కాయ కర్మలచేత, సాధనచేత పరమాత్మయందు లయించి వానితో ఆత్మానందము పొందుచుండవలెను. అంతేకాని దృశ్యపదార్థములపై మనస్సు ఉంచరాదు.

4. యోగి యనువాడు - నిత్య జప తపములను ఆచరించుచు అష్టాంగ యోగములను ఎగిరి వానిని సాధించుచు యోగాభ్యాసియై, యోగనిష్ఠుడై తన చిత్త వృత్తి - దేహము - ప్రాణము - ఇంద్రియములు, మనస్సు, బుద్ధి - అహంకారము మున్నగువానిని నిరోధించి - తన మనస్సును సదా పరమాత్మయందే యుంచి దేనికిని చింతింపక, మానావమానములు, నిందాస్తుతులు వదలి, చెట్టును నరకుచున్నను మొదలు కదలక మెదలక ఎలా వుండునో యోగికూడా అట్లే వుండవలెను. సంగి పురుషుడనగా సంఘమును దానితో సందర్భము కలవారు బాధలను పొందును. యోగి అలా ఉండరాదు. కావున యోగి సంగమును త్యజించవలెను. సంఘములో వున్ననూ వాని వ్యాపారములలో మనస్సు లయింపరాదు. దృశ్యములందు శబ్దాది రూపములయందు మనస్సు నిలుపరాదు. నిత్యము వారు ఆత్మానందమును పొందుచూ సాధనచేత పరమాత్మను పొందవలెను.

5. యోగులగు వారికి పరమ సాధనము చిత్తనిరోధనమే. దానిని సాధించుటకు ప్రయత్నించవలెను. అప్పుడే అతనికి అమృతము సిద్ధించగలదు. దీనిని పొందుటకుగల సకల కార్యములను, మార్గములును నిరోధించాలి. నిరంతరము భగవత్ భక్తితో నిండి ఆనందముగా జీవించాలి.

ఆర్యులారా! ఇవియే మీ ప్రశ్నలు? వాని సమాధానములు నిరంతరము ఈర్ష్య, అసూయలతో, దంబములతో మీరు అశాంతిని గొనితెచ్చుకొనుచున్నారు. ఉన్నతులని - అథములని ఈశ్వర ప్రసాదితమైన సృష్టిని వానిలోని

జీవరాశిని విభజించి, విభేదములను పొందిన మీకు శాంతి చేకూరునా? శాస్త్ర విచారమున తత్త్వమును తెలియవలెనేగాని, మూర్ఖత్వంతో ఆ విద్యను పొందరాదు. గురువులయందు విశ్వాసము వుంచి వారిని శుద్ధ భక్తిచేత సేవించి పొందిన విద్య అజ్ఞానమును నాశనము చేయును. జ్ఞానము లభించును. లేనిచో అందరూ విద్యను పొందికూడా మీవలె లోకంలో తిరుగుచుందురు. కామక్రోధములలో చిక్కుకొని పతనము అగుదురు. ఎవడు తన చిత్తమును పరమాత్మయందే చేర్చి పరమానంద స్వరూపుడై జీవన్ముకుడు అగుచున్నాడో అట్టివాడు తాను ధన్యుడగుటయేకాదు, తన వారినందరిని ధన్యులను చేయును. అటువంటి వారి కులం ధన్యము. తల్లిదండ్రులు కృతార్థులు. ఆ గ్రామము – ఆ దేశము పుణ్యవంతమగును. గాన బ్రాహ్మణులారా! పరమయోగి పురుషుడు యోగులకు యోగి – యోగిరాజు పరబ్రహ్మ – సచ్చిదానంద సద్గురుడు అయిన శ్రీస్వామి సమర్థుల సన్నిధిలో మీ అహంకారములను వదిలి, వారి ఆశీస్సులను బడసి ఉత్తములై జీవిత పరమావధిని పొందండి అని పలికి దివ్యమైన జ్ఞానముతోపాటు నేత్రములతో చూడగలుగు శక్తిని పొంది శ్రీస్వామి సమర్థులను చేరి వారికి సాష్టాంగ దండ ప్రణామములను ఆచరించి "ఓ దేవాదిదేవా! నీవు పరంధాముడవు. పరమ పవిత్ర సత్యస్వరూపుడవు. శాశ్వతుడవు, ఆదిదేవుడవు, పుట్టుక లేనివాడవు. దేహము ధరించియున్న విదేహుడవు. సంఘములో వున్నా నిత్య నిస్సంగుడవు, నిత్యానందుడవు, నీవే పరమగతి సచ్చిదానందుడవు. తండ్రీ! నీవు సదా నన్ను అనుగ్రహించి యీ జ్ఞానమును, ఈ సద్భక్తిని, శాశ్వతముగా నుండనిమ్ము" అని ప్రార్థించెను. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి ఆశీర్వదించిరి.

ఆ బ్రాహ్మణులు ఆ బాలుని వాక్కులను విని ఆశ్చర్యపోయినారు. తమ మనస్సులోని భావములను ఎలా తెలుసుకొనినారు? వానిచేత తమ ప్రశ్నలను, వానికై తమకంటే ఉన్నతములైన సమాధానములను పలికించినవారు సామాన్యులుకారని వారిని పరీక్షింప వచ్చిన మనము మహామూర్ఖులమని మధనపడి, అంతట ఆ బ్రాహ్మణులు తమ తప్పును తెలుసుకొని పశ్చాత్తాప్తులై శ్రీస్వామి పాదాలమీద పడ్డారు. అపుడు శ్రీస్వామి వారితో నేను ఏ విచక్షణ లేకుండా ఎవరిచేతినుండైనా ఆహారము స్వీకరిస్తానని ఆచార వ్యవహారాలు పాటించనని నావద్ద శక్తి వున్నదో లేదో తెలుసుకోకుండా పరీక్షింపవచ్చినారుగదా!



అన్నారు. వారు మరల ఖిన్నులై నిలచినారు. శ్రీస్వామి వారిలో ఒకరిని ఉద్దేశించి నువ్వు బ్రాహ్మణుడవని గర్వించి ఇతరులను అనాచారులను చెయ్యాలని అహంకరిస్తున్నావుగాని, స్వయంగా నీవే బ్రాహ్మణుడవుగావు. నీ తల్లి వ్యభిచరించిన కారణముగా ఇలాబక్షీ అనే ముస్లింవల్ల నీవు జన్మించినావు అనగానే ఆయన దివ్యత్వాన్ని పరీక్షింపవచ్చిన తమ అజ్ఞానానికి చెంపలు వేసుకుంటూ ప్రాయశ్చిత్తము సెలవీయమని అడుగగా, శ్రీస్వామి ఆ కులభ్రష్టునకు తీర్థయాత్రలు చేయమని పవిత్ర గంగాస్నానము చేయమని ఆదేశించినారు.

విద్యాసాగరా! చూచితివిగదా! శ్రీస్వామి దివ్యత్వం! ఏమీ ఎరుగని బాలునితో వేదాంత విషయాలను పలికించినారు. ఇటువంటి సన్నివేశం శ్రీగురు చరిత్రలో శ్రీనరసింహ సరస్వతి శ్రీస్వామివారు ఒక హరిజనునితో వేదాలను పలికించినారు. మహాత్ముల లీలలకు ఒక పరిధి అంటూ వుండదు. అది దివ్యలోకాలకు, దివ్యజ్ఞానులకు కూడా అతీతం అని శ్రీస్వామి సమర్థులకు మనసారా నమస్కరించి శ్రీదత్తావతారములను మనస్సులో తలచి తిరిగి చెప్పబూనినాడు.

అక్కల్‌కోటలో భీమరావు అనే వ్యక్తి వుండేవాడు. అతని తలపైన పెద్ద కణితి వుండేది. చూడడానికి చాలా వికారంగా వుండడంవలన అతణ్ణి చూచి అందరూ హేళనచేసి నవ్వేవారు. భీమారావు లోపల చాలా కుమిలిపోయేవాడు. శ్రీస్వామివారికి కాషాయరంగు పూవులంటే ఎంతో ప్రియమని అతనికి తెలుసు. అందులకుగాను అతడు ఆ రంగుపూలను తీసుకొని శ్రీస్వామి పాదములకు సమర్పించేవాడు. ఒకరోజున అతను పూలు తీసుకొని శ్రీస్వామిని దర్శించినాడు. ఆ రోజున శ్రీస్వామి అతనిని చూసి నవ్వి “ఇదిగో రెండు తలల రాక్షసుడు వస్తున్నాడు చూడండి” అని ఎగతాళి చేసారు. అతడు తను నమ్ముకున్న శ్రీస్వామి తనను ఎగతాళి చేయటంచూచి అవమానంతో ఎంతో ఖిన్నుడై దిగులుగా శ్రీస్వామికి నమస్కరించి తన బాధను నివారించమని మనస్సులోనే ప్రార్థించి ఇంటికి చేరినాడు. ఆ రోజున మధ్యాహ్న భోజనం తరువాత చిన్న కునుకు పట్టింది. ఆ నిద్రలో శ్రీస్వామి కనిపించి తన చెంత నిలబడి ఆ కణితిపై ఆప్యాయమగా నిమిరి చూచినారు. వెంటనే అతనికి మెలకువ వచ్చినది. అతని

ఆశ్చర్యానికి అంతులేకపోయింది. ఆ కణితి తాలూకు వాపు అంతా పోయి దాని తాలూకు చర్మం మాత్రం వేలాడుతున్నది. పట్టలేని సంతోషంతో శ్రీస్వామివారివద్దకు పరుగిడిపోయి వారి పాదములపైన పడి అమితమైన ఆనందము పట్టలేక భోరున ఏడ్చినాడు. ఇంతకాలము నుండి తాను పొందిన ఆవేదనంతా తీర్చుకొనినాడు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి అభయమిచ్చి విబూదిని ప్రసాదించినారు. ఆ విభూతిని, తీర్థములో కలిపి ఆ చర్మానికి రాయమని ఆనతి యిచ్చినారు. భీమారావు అలాగే చేయగా నాలుగు రోజులలో ఆ చర్మము ఎండి రాలిపోయి మామూలు చర్మం వచ్చినది. ఈ విచిత్రమైన, అద్భుత లీలను చూచిన భీమారావు తదితర భక్తులు శ్రీస్వామి ప్రేమకు, వారి రక్షణా శక్తికి ఆశ్చర్యపడి ఆనందించినారు.

***జయ జయ శ్రీపాద వల్లభ***
***జయ జయ శ్రీ నరహరి నరసింహ***
***జయ జయ శ్రీస్వామి సమర్థ***
***జయ జయ శ్రీ దత్తావతార***
***జయ జయ శ్రీ సాయినాథ***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
**ఇరువదియవ అధ్యాయము** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం

శ్రీ గురుదేవదత్త -శ్రీస్వామి సమర్ధాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరువది ఒకటవ అధ్యాయము

### శ్రీస్వామి అవతార విశిష్ఠత

విద్యాసాగరుడు గురుదేవా శ్రీస్వామి అవతారము చాలా విశిష్టముగా వున్నదికదా! వారి ఆకారం, లక్షణాలు ఎలా వుండేవి? అన్ని దత్తావతారములకు వారికిగల భేదమేమి? వివరంగా చెప్పండి అని ప్రార్థించగా, నిత్యానందయోగి-

ఓ బాలకా! నీవు చాలా చక్కని ప్రశ్నతో మంచి విషయము గుర్తుకు తెచ్చినావు. చాలా సంతోషము. శ్రీస్వామివారి అవతారములో వారి లక్షణములను వివరంగా తెలిపెదను విను అని శ్రీస్వామిని మనసారా ప్రార్థించి చెప్పబూనినాడు.

ఇతర దత్తావతారాలకూ శ్రీ అక్కల్‌కోట మహరాజ్‌కు స్వల్పమైన తేడాలు కనబడతాయి. శ్రీనరసింహ సరస్వతిస్వామి సన్యాసి వేషములో వుండేవారు. శ్రీస్వామికి అటువంటి ఆశ్రమ చిహ్నాలేమీ లేవు. అంతమాత్రాన శ్రీస్వామి సన్యాసి కారనికాదు, సన్యాసం అనేక విధాలు. వాటిలో పరమహంస, తురియాతీత, అవధూత, సాంప్రదాయాలలో దండము, కమండలము, కాషాయము మొదలైన నియమాల ఆవశ్యకత లేదు. ఆధ్యాత్మిక పరిపూర్ణత పొందినవారిలో కొందరిని "అత్యాశ్రమి" అంటారు. అంటే బ్రహ్మచర్య, గృహస్థ వానప్రస్థ, సన్యాసాశ్రమాలు నాలుగింటికి అతీతులవడంచేత ఈ నాలుగింటిలో ఏ ఆశ్రమముయొక్క నిబంధనలూ వారికి చెందవు. శ్రీస్వామి ఆ కోవకు చెందినవారు.

శ్రీ శ్రీపాదవల్లభస్వామి, శ్రీనరసింహ సరస్వతి, శ్రీమాణిక్య ప్రభువు ఈ ముగ్గురూ శ్రీస్వామికి ముందున్న దత్తావతారములు. ఈ ముగ్గురికి శాంతగుణం ప్రధానం. కాని శ్రీస్వామిలో రుద్రాంశ ప్రధానంగా వుండేదని కొంతమంది స్వామిని రుద్రావతారంగా కూడా భావించేవారు. అయితే నిర్వహించవలసిన జగత్కళ్యాణ కార్యక్రమాన్ననుసరించి శ్రీస్వామిలో రుద్రాంశ ప్రత్యేకంగా వ్యక్తం కావలసివచ్చిందేకాని, వారి ఆంతర్యములో సృష్టికి, తమకు భేదమేలేని మహాశాంతమూర్తి, త్రిమూర్త్యాత్మకుడైన శుద్ధ జ్ఞానమూర్తి. శ్రీస్వామి రూపంలో కూడా చాలా ప్రత్యేకత వున్నది. శ్రీస్వామి ఎప్పుడూ బ్రహ్మానందంలో మునిగియుండేవారు. ఆయన రూపం చిత్రంగా వుండేది. ఈయన వయోవృద్ధులైన అవధూత అయినప్పటికీ శరీరము ముడతలు పడక యవ్వనంలో లాగానే వుండిపోయిరి. ఆయనకు భయ, సంకోచాలు లేవు. వారు సర్వజ్ఞులైనప్పటికీ అలా కనిపించేవారు కారు. వారి చేష్టలు పసిపిల్లల చేష్టలవలె వుండేవి. ఆయన మాటలు ప్రేమతో నిండి మధురంగా వుండేవి. ఎప్పుడూ ఆనందములో మునిగియుండటంవల్ల (శ్రీ ఆదిశంకరులు బాలోన్మత పిశాచవత్ అని వర్ణించినట్లు) ఉన్మత్తావస్థలో వున్న శ్రీస్వామి ఎవరినీ లక్ష్యపెట్టేవారుగాదు. అందువలన సామాన్య ప్రజలకు ఆయనలోని గొప్పతనం గుర్తించడం చాలా కష్టమయ్యేది. ఆయన శరీరం చాలా పొడవు. ఆజానుబాహువు, పెద్దబొజ్జ, విశాలమైన భుజాలు, తీవ్రమైన దృష్టిగల ఆయన స్ఫురద్రూపి, శరీరచ్ఛాయ గోధుమవన్నె, చెవులు చాలా పెద్దవి. చెవి అడుగు భాగం చాలా పలుచగా వుండి ప్రతి చిన్న కదిలికకూ బాగా కదులుతూ వుండేవి. పెద్ద ముఖము, విశాలమైన నుదురు నెఱసిన కనుబొమ్మలుండేవి. ఆయన శరీరం గులాబీపూవువలె మృదువుగా వున్నా చాలా ప్రాచీనంగాను, శక్తివంతంగానూ కనిపించేది. పాదాలు పొడవుగా వుండేవి. ముఖాన తిలకం, ఎప్పుడూ కౌపీనం ధరించేవారు. అందమైన పలువరుస, లోతైన బొడ్డు, మెడలో స్ఫటికము, తులసి, రుద్రాక్షమాలలు, చెవులకు ప్రవాళాలు (పగడములు) పొదిగిన బంగారు కుండలాలు వుండేవి.

శ్రీస్వామి చేష్టలు వింతగా వుండేవి. ఎప్పుడూ తనలో తానే మాట్లాడుకుంటూ, చిరునవ్వు నవ్వుకొంటూ వుండేవారు. ఒకప్పుడు రాళ్ళనూ, చెట్లనూ ప్రేమతో లాలిస్తూ "నా నుంచి నీకేం కావాలి" అని అడిగేవారు.



ఒక్కొక్కప్పుడు వేదమంత్రాలు, శ్లోకాలు, భజన కీర్తనలు ఆయన నోటినుండి వెలువడుతుండేవి. మితభాషి. కాని మాట్లాడిన కొద్ది మాటలూ ఇతరుల హృదయాలలో దాగిన భావాలకు అన్వయించేవి. ఒక్కొక్కప్పుడు ఆయన మాటలు పరిభాషతో నిండి ఎవరికీ అర్థంగాకుండా వుండేవి. ఆయన మరాఠిలోనూ, హిందీలోనూ మాట్లాడుతుంటేవారు. ఒక్కొక్క వాక్యం మూడేసిసార్లు పలికేవారు. తరచు చాలా చెడ్డభాష, తిట్లూ, బూతులూ వుండేవి. ఆయనకు హిందూ – ముస్లిమ్‌లు అన్న భేదం లేదు. తరచూ ఆ ఊళ్ళో వున్న షేక్ నూరుద్దీన్ దర్గా, ఖాజీపీర్ దర్గాలతోపాటు ఊర్లోని ఇతర ఆలయాలలో కూడా ఆయన కూర్చుంటుండేవారు. శ్రీస్వామికి నియమిత దినచర్య అంటూ ఏమీలేదు. నిత్యమూ స్నానము, వేషధారణలు గూడా వుండేవికాదు. ఆయనకు బుద్ధిపుట్టినప్పుడు భక్తులను స్నానం చేయించమని అడిగేవారు. ఒకప్పుడు ఒంటికి గంథము రాయించుకొని హారతి యిప్పించుకొనేవారు. ఆయన కొన్ని వారాలు సైతము స్నానము చేసేవారు కాదు. అటు శ్మశానం దగ్గర నుంచి ఇటు రాజభవనం వరకూ ఆయనకు తోచినప్పుడు తోచినచోటకి వెళ్ళి కూర్చునేవారు. తనకు మడి, ఆచారాలు పట్టుబట్టా అవసరం లేకపోయినా, భక్తులను చాలామందిని ఆ నియమాలు పాటించమనేవారు. ఆయన లేచి నడవడం ప్రారంభిస్తే వారివలె వేగంగాను, అంత దూరమూ ఎవరూ నడవలేక పోయేవారు. ఒక్కొక్కప్పుడు మాట్లాడడం మొదలుపెడితే చాలాసేపు మాట్లాడేవారు. అట్లానే హుక్కా పీల్చుడం మొదలుపెడితే చాలాసేపు అందులో లీనం అయిపోయేవారు. తరచూ చిన్న పిల్లలతో కలసిపోయి ఆడుతుండేవారు. ఒకసారి శ్రీస్వామి ఉన్మత్తావస్థలో ఒక దర్గాను కొట్టారు. దాని ముక్క విరిగింది. ఊరిలోని మహమ్మదీయులందరకు కోపం వచ్చి ఆయనను కొట్టడానికి జట్టుగా ఆయన మీదకు బయలుదేరారు. ఆ వార్త వినిన శ్రీస్వామి ఏమీ చలించలేదు. అక్కడ వున్న ఒక భక్తుణ్ణి పిలిచి, అక్కడున్న ఒక నల్లకుక్కను నేలకేసి గట్టిగా అదిమిపట్టమన్నారు. అంతలో ఆ ముస్లిముల ఇండ్లలో చాలా విపత్తులు కలిగాయి. వాటిని పరిష్కరించుకోవడానికి వాళ్ళ ఇళ్ళకు బయలుదేరవలసి వచ్చినది. కొంతసేపటికి ఒక ముస్లిం వృద్ధుడు తక్కినవారందరినీ సమావేశపరచి శ్రీస్వామి ఒక గొప్ప ఔలియా (సిద్ధపురుషుడు అని అర్థము) అని ఆయనతో వైరం పెట్టుకోవడం తగదని వారించాడు.




శ్రీస్వామికి కుక్కలన్నా, ఆవులన్నా మహా ఆపేక్ష. కాషాయపురంగు పువ్వులంటే చాలా ఇష్టం. తినుబండారాలలో జంతికలు, ఉల్లిపాయ కూర అటే ఎక్కువ ఇష్టము. ఆయన నిత్యకృత్యం ఒక్కటి మాత్రం వుండేది. ప్రతి ఉదయం తప్పక విధిగా రెండుసార్లు ఆచమనం చేసేవారు. అన్నంకూడా ఎవరన్నా తినిపించవలసి వచ్చేది. ఒక్కొక్కప్పుడు శ్రీస్వామి పసిపిల్లవానివలె మారాం చేస్తే భక్తులెంతో ఓర్పుతో లాలించి అన్నం తినిపించవలసి వచ్చేది. నిద్రపోయేటప్పుడు ముఖంనిండా ముసుగు పెట్టుకొని పొడుగునా ఏదో ఒకటి మాట్లాడుతూ నిద్రించేవారు, చాలా స్వల్పకాలం మాత్రమే గుఱ్ఱుపెట్టి నిద్రపోయేవారు.

శ్రీస్వామి దర్శనానికి రోజూ రెండుమూడు వేల మంది జనం వచ్చిపోతుండేవారు. భజనలు, కీర్తనలు జరుగుతుండేవి, భక్తులు రుచికరమైన పదార్థాలెన్నో తీసుకొచ్చి సమర్పించినా ఎప్పుడోగాని ఆయన వాటిని తినేవారు కాదు. ఒకసారి రకరకాల పిండివంటలు ముందుపెట్టుకొని శ్రీస్వామి కూర్చొనియుండగా చూచిన ఒక భక్తుడికి సందేహం కలిగింది.

నిజమైన సాధువుకు రుచికరమైన పదార్థాలమీద మక్కువెందుకు? అనిపించింది. కాని అతనికి తన భావాన్ని వెలిబుచ్చేందుకు ధైర్యం లేకపోయింది. కాని శ్రీస్వామికి తెలియనిదేముంది? వెంటనే ఆ తినుబండారాల నవతల పారేశారు శ్రీస్వామి. తర్వాత రెండు శేర్లు పచ్చి మిరపకాయలు తెప్పించి తిని నీరుత్రాగి కూర్చున్నారు శ్రీస్వామి. అదే భక్తుని సందేహానికి వారి సమాధానం.

శ్రీస్వామి ఒక్కొక్కప్పుడు తినుబండారాలతో చిన్నపిల్లలవలె ఆడుకొనేవారు. విగ్రహాల చాటున పప్పులు, రాళ్ళు, గోలీలు దాచుకొనేవారు.

విద్యాసాగరా! శ్రీస్వామివారి కీర్తి నలుదిశల వ్యాప్తిచెందినది. అనేకమంది వారిని దర్శించడానికి అనేక ప్రాంతముల నుండి వచ్చేవారు. వారిలో విదేశీయులు కూడా వున్నారు. షోలాపూర్ జిల్లాలో ఇంజనీరుగా పనిచేసిన ఒక ఐరోపా దేశస్థుడు శ్రీస్వామిని గురించి ఇతరులు తెలుపగా సంతానహీనుడైన అతను సంతానము లభించునేమోనను కోరికతో అక్కల్‌కోటలో శ్రీస్వామిని దర్శించడానికి వచ్చినాడు. వాడు శ్రీస్వామివారి రూపమును, చేష్టలను వారి వింత ధోరణిని చూచిన తరువాత ఆయన



పిచ్చివాడేమోనన్న అనుమానం కలిగింది. ప్రజలు అనవసరముగా ఈయనను మహాత్ముడని సేవించుచున్నారేమో అనుకొని తాను అక్కడకు రావటము కూడా తెలివితక్కువ పనేమో అని అనుకొనుచుండగనే, శ్రీస్వామి వానిని చూచి అతనితో ఓయి! నీవు సంతానము అడగడానికి ఇక్కడకు వచ్చినావుకదా! ఒక సంవత్సరము లోగా నీకు సంతానము కలుగుతుంది. కొడుకు పుడతాడు, పో! అని అన్నారు. అతను తన మనస్సును, కోరికను ఇంత తేలికగా గ్రహించిన వ్యక్తి చాలా గొప్పవాడనీ తానే ఈ విషయము గ్రహించలేక పొరపాటుపడ్డానని తలచి మనస్ఫూర్తిగా శ్రీస్వామికి శరణాగతుడయినాడు.

శ్రీస్వామిని తరచుగా దర్శిస్తుండేవాడు. శ్రీస్వామి ఆశీర్వచనముతో వానికి ఒక సంవత్సరములో పుత్రసంతానం కలిగినది. అవధూతలను కేవలం స్థూలదర్శనముతో వారిలోని శక్తిని గ్రహించలేము. సూక్ష్మదృష్టి, జ్ఞాననేత్రం కావాలి. అప్పుడుగాని వారి నిజస్వరూపము గ్రహించలేము అని విశ్వసించి వారి లీలలను కొనియాడుతుండేవారు. అలాగే ఇజ్రాయిల్ నుండి వచ్చిన ఒక యూదు డాక్టరు బొంబాయిలో జంషెడ్ జిజాబాయి (జె.జె.) హాస్పిటల్‌లో కళ్ళడాక్టరుగా పనిచేయుచుండేవారు. అతను ఒకసారి క్రిస్టమస్ సెలవులకు భారతదేశంలోని కొన్ని ముఖ్యమైన ప్రదేశాలు, పుణ్యక్షేత్రాలు దర్శించడానికి అక్కల్‌కోట వచ్చినాడు. అతడు రాగానే శ్రీస్వామి అతనికేసి చూస్తూనే ఎన్నివేల మంది కళ్ళకు శస్త్రచికిత్స చేసి వుంటావు? ఎంతమందికి అంధత్వం ప్రాప్తించిందో? అని అన్నారు. ఆ డాక్టరుకు తాను గొప్ప డాక్టరును అని గర్వము వుండేది. శ్రీస్వామివారి సర్వజ్ఞత్వాన్ని చూచి ఆశ్చర్యపోయాడు. శ్రీస్వామివారి మాటలు వినగానే అతని అహంభావము దిగజారిపోయినది. పశ్చాత్తాపము కలిగినది. శ్రీస్వామివారి మాటలలో సత్యమున్నదేమో అనికూడా అనిపించింది. అలా అతనిలోని అహంకారమును అణచివేసి వాని దృష్టిని సరిచేసి తనను తాను గుర్తించుకొనేటట్లు చేశారు. అతనికి శ్రీస్వామివారిపై మంచి విశ్వాసము కుదిరింది. శ్రీస్వామివారికి మంచి భక్తుడై తన ఉద్యోగము విరమించిన తరువాత అక్కల్‌కోటలోనే స్వామి సేవలో తమ జీవితం గడిపినాడు.

అక్కల్‌కోట రాజువద్ద పెద్ద ఉద్యోగిగానున్న "జంబుసాహెబ్" అనువాడు అధికార బలముతో చాలా నిరంకుశముగా వుంటూండేవాడు. తనకంటే చిన్న ఉద్యోగులపట్ల అతి క్రూరంగా ప్రవర్తించేవాడు. ఒకనాడు రాజుగారి ఉద్యానవ

వనము (ఖాస్‌బాగ్)లో తిరుగుచుండగా స్నానానికి వచ్చిన చిన్న ఉద్యోగి కాండునానా వార్కిస్ అనువానిని తమ కాళ్ళు కడగమని ఆదేశించాడు. కాళ్ళు కడుగు సమయంలో కొంచెము లోపము చూపించి వానిని నానా విధములుగా బండబూతులతో తిట్టుతూ కోపముతో విచక్షణా జ్ఞానమును మరచి వానిని చితకబాది మెడపట్టుకొని తోటలోంచి బయటకు గెంటించాడు. "కాండు నానావార్కిస్ చాలా పెద్ద మనిషి. శ్రీస్వామి సమర్థులకు భక్తుడు. అతడు చేయునది లేక బాధపడుతూ శ్రీస్వామి వద్దకు వచ్చి తనకు జరిగిన అవమానమును గురించి శ్రీస్వామికి విన్నవించుకొనినాడు. శ్రీస్వామి అంతా విని ఊరకే ఉండిపోయారు. ఏమీ మాట్లాడలేదు.

ఒకనాడు శ్రీస్వామివారు "జంబుసాహెబ్" బంగళాకు వెళ్ళిరి. జంబుసాహెబ్ ఆశ్చర్యము పొంది వెంటనే నౌకర్లతో ఒక ఉచితాసనము ఏర్పాటు చేయించి శ్రీస్వామిని ఆశీనులు కండని ప్రార్థించెను. శ్రీస్వామి సమర్థులు కూర్చోలేదు. వానిని నిశితంగా చూచుచూ తీవ్రముగా – ఓరీ! నీవు బియ్యము కడిగిన నీరు, గంజి తాగి బతకవలసి వస్తుంది అని చెప్పేసి వచ్చేశారు. అతనికి శ్రీస్వామి మాటలకు అర్థము తెలియలేదు. అతనికి భయము కలిగినది.

కొన్నాళ్ళకు తోటలో ఒక పాము అతనిని కాటేసినది. తీవ్రమైన బాధకు గురియైనాడు. డాక్టర్లు ఎంతగా వైద్యము చేసినా ప్రయోజనము లేకపోయినది. అతడు కదలకుండా కూర్చోవలసి వచ్చింది. అతడి అహంకారము పూర్తిగా పడిపోయింది. డాక్టరు కాలు పూర్తిగా తీసివేయాలని చెప్పారు. అతనికి కాలు తీయించుకోవడము ఇష్టములేదు. అతనికి చాలా భయము కలిగినది. దిక్కుతోచక శ్రీస్వామిని అతికష్టముమీద దర్శించినాడు. కాని శ్రీస్వామి అతనితో మాట్లాడడానికి ఇష్టపడలేదు. అతడు శ్రీస్వామి భక్తుడైన 'మోరాపంతుకాశి' అను మిత్రునిద్వారా శ్రీస్వామి తనను రక్షించమని అతి దీనంగా ప్రార్థించుచూ విన్నపము పంపుకొనినాడు. అప్పుడు శ్రీస్వామివారికి దయకలిగి అతనికి ఆహారము తినకుండా బియ్యము కడిగిన నీరు, గంజి తాగమని, ఉల్లిపాయ పథ్యము చేయమని అట్లు చేసినచో ఆరోగ్యము కలుగునని తెలిపిరి. 'జంబుసాహెబ్' ఆ విధంగానే ఎనిమిదిరోజులు చేయగానే అతని కాలు బాగుపడి దానిపైన నిలువబడెను. అందరూ ఆశ్చర్యపడిరి. డాక్టరు శ్రీస్వామివారి అనుగ్రహమునకు – వారి వాక్కులకు ఆశ్చర్యపడెను. నాటినుండి జంబూసాహెబ్



పూర్తిగా మారిపోయెను. వాడు తన క్రూరత్వమును విడనాడి శాంతము పొంది, శ్రీస్వామివారిపై భక్తి కుదిరి వారిని సేవించుచుండెను. శ్రీస్వామివారు వాని అహంకారమును, గర్వమును తొలగించి పూర్తిగా సన్మార్గములో నడిపిరి. శ్రీస్వామివారి మాటలు అంత బలమైనవి. ఆయన ఇతరుల స్వభావములలోని చెడును నిర్మూలించడానికి వారిని సన్మార్గులుగా చేయడానికి అవసరమైనప్పుడల్లా ఇలాగే చేస్తుండేవారు.

బొంబాయి నగరములో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతడు షేర్ మార్కెట్‌లో చాలా పేరు, ధనము సంపాదించినాడు. కాని అతనికి సంతానము కలుగలేదు. దానివలన అతనికి ఎంత ధనమున్నా సంతోషము కరువైనది. అతడు దత్తభక్తుడు. ఒకసారి భార్యాసమేతంగా అతను శ్రీక్షేత్ర గానుగాపురము (గాణ్గాపురం) వెళ్ళి శ్రీదత్తాత్రేయస్వామిని నిర్గుణ పాదుకలను దర్శించి తనకు సంతానము కలిగితే వెయ్యిమంది బ్రాహ్మణులకు భోజనము పెట్టించగలను అని మొక్కుకొనినాడు. శ్రీదత్తాత్రేయస్వామి అనుగ్రహముతో ఒక సంవత్సరంలోగా వానికి సంతానము కలిగినది. వారు చాలా ఆనందమును పొందిరి.

కాని సంతానము కలిగిన కొంతకాలమునకే వారికి వ్యాపారములో అపార నష్టము కలిగినది. ఆస్తులన్నీ పోయినాయి. అతి బీదస్థితి కలిగినది. ఆ దిగులుతో అనారోగ్యంతో గుండెనొప్పి వచ్చి అతను చనిపోయినాడు. అతని భార్య ఓర్పుతో కష్టాలన్నింటినీ ఎదుర్కొన్నది. కాలక్రమమున ఆమెకు గాణుగాపురమున తన భర్త మొక్కుకొన్న మొక్కు గుర్తుకు వస్తూనే వుండేది. దానికి ఏమీ చేయలేని స్థితికి బాధపడుతుండేది. ఒకనాడు ఆమె తన పొరుగున వున్న ఇల్లాలితో తన మొక్కు విషయము తెలిపి బాధపడినది. అందులకు ఆ ఇల్లాలు ఆమెకు తిరిగి గాణుగాపురము వెళ్ళి అక్కడే శ్రీ దత్తమూర్తికి తన బాధను నివేదించుకుంటే ఆ దయామయుడే మొక్కును చెల్లించుకునే మార్గము కూడా చూపుతాడని ధైర్యము చెప్పింది. వెంటనే ఆమె తన కుమారుని తీసుకొని శ్రీక్షేత్ర గాణుగాపురము వెళ్ళినది. శ్రీస్వామివారి నిర్గుణ పాదుకలను శరణు వేడింది. ఆ రాత్రి ఆమెకు స్వప్నంలో శ్రీదత్తమూర్తి కనిపించి అక్కల్‌కోట వెళ్ళి అక్కడున్న శ్రీస్వామి సమర్థులకు భోజనము పెట్టు. వెయ్యిమందికి భోజనం

పెట్టినట్లు అవుతుంది అని చెప్పి అదృశ్యులైనారు. తెల్లవారి ఆమె సంతోషంతో అక్కల్‌కోటకు వెళ్ళినది. అక్కడ చిన్నపిల్లవానిలాగ రోడ్డుమీద ఆడుకొనుచున్న శ్రీస్వామిని చూసి సాష్టాంగ నమస్కారము చేసినది. ఆమె భక్తికి మెచ్చి శ్రీస్వామి ఆమెను దగ్గరకు పిలిచి తనకు భోజనము పెట్టమని అడిగినారు. మరింత ఆనందముతో ఆమె ఆయనకు భోజనము వడ్డించినది. భోజనం అవగానే తన చరిత్ర ఏమీ వారికి చెప్పకముందే శ్రీస్వామివారు "అమ్మాయీ! వెయ్యిమంది బ్రాహ్మణులకు భోజనము ముట్టినది, దిగులుపడకు!" అన్నారు. ఆయన కరుణకు గాణుగాపురములో తనకు వచ్చిన నిదర్శనం నెరవేరినందుకు ఆమె కళ్ళు ఆనందబాష్పాలతో నిండినాయి. అత్యంత దీనస్థితిలో గూడ దైవానికి మొక్కు తీర్చాలనే సద్భావము ఆమెను శ్రీస్వామీజీ లాంటి దివ్యపురుషుని ఆశీస్సులు అందుకొనేలా చేసింది. ఆమెకు, ఆమె పుత్రునికి శ్రీస్వామివారి ఆశీర్వచనము దొరికినందుకు ఆ ఇల్లాలు చాలా తృప్తినొంది ఆనందముగా తిరిగి తన గృహమునకు చేరినది. తరచు శ్రీస్వామిని దర్శించుచూ తన కుమారుని పెంచి పెద్దవానిని చేసినది.

విద్యాసాగరా! అవధూతలు మహాత్ములకు భూత భవిష్యత్ వర్తమానాలు పూర్తిగా అవగతము – వారు తమ భక్తులను అన్నివిధాలా రక్షించి కాపాడుతారు. అందులకు వారు అనేక విధాలుగా ఆదేశించుతారు. కాని భక్తులే వారి ఆజ్ఞలలోని మర్మము తెలుసుకోలేరు. ఓర్పులేక తొందరపడి వారి ఆజ్ఞలను ఉల్లంఘించి కష్టములను కొనితెచ్చుకుంటారు. అటువంటి సన్నివేశం ఒకటి శ్రీస్వామి సన్నిధిలో జరిగినది విను అని సన్నివేశము చెప్పబూనినాడు.

బాబూజి సితారాలో పోస్టల్ సూపరింటెండెంట్‌గా పనిచేయుచూ శని – ఆది వారములలోను, సెలవు దినములలోను శ్రీ స్వామివారిని దర్శించుకొని పోతూ వుండేవాడు. ఒకనాడు ఆదివారం శ్రీస్వామివారిని దర్శించి తిరిగి వెళ్ళడానికి శ్రీస్వామిని సెలవడిగినాడు. అప్పుడు శ్రీస్వామివారు ఎక్కడి వెళ్ళేది, కూర్చో! అని కసరి కూర్చోబెట్టారు. కొంత సమయం తరువాత తిరిగి ప్రార్థించినారు. శ్రీస్వామి తొందరేమున్నది కూర్చో! అన్నారు. అతనికి మరుసటి రోజున ఆఫీసులో హాజరు కావలసి వున్నది. అందుచేత సందిగ్ధములో పడ్డాడు. కొంతసేపు ఆలోచించి తిరిగి శ్రీస్వామిని సెలవు అడిగినాడు. అప్పుడు శ్రీస్వామి అతనిని దగ్గరగా పిలిచి హిందీలో "నదీ కినారే పార్‌రహాహై" (నడి ఒడ్డుదాటి పారుతుంది) వరద తీవ్రముగానున్నది, తొందరపడవద్దని హెచ్చరించారు.



అయినా అతను విశ్వసించక ఆఫీసుకు హాజరుకావాలని అదే ఆలోచనతో శ్రీస్వామికి తెలియకుండా మెల్లగా అక్కడనుండి జారుకొని బయటకు వచ్చి "కరూప్‌గామ" (కదురుగావ) రైల్వేస్టేషను చేరాడు. ఉధృతమైన వరద కారణంగా కృష్ణానదిపై వంతెన మునిగిపోయినది. రైళ్ళ రాకపోకలు ఆగిపోయినాయి. ఎటూకాని స్థితిలో తీవ్రమైన చలిలో రైల్వేస్టేషన్‌లోనే అతడు గడుపవలసి వచ్చినది. శ్రీస్వామి మాటలను త్రోసిపుచ్చి వచ్చినందుకు పలితము అనుభవిస్తున్నాని బాధపడ్డాడు. మరుసటి ఉదయానికిగాని అతడు ప్రయాణము చేయలేక పోయినాడు. అందువలన విద్యాసాగరా! సంశయాత్ములు, శ్రద్ధలేనివారు ఇలాగే బాధలకు గురికావలసి వస్తుంది. దివ్యపురుషుల సాన్నిహిత్యమును, వారి ఆశీర్వచనము పొందుటకు భక్తులు సమర్పించవలసిన కానుకలు వారి ఆజ్ఞల యందు సంపూర్ణ శ్రద్ధ – శరణాగత భావము అనే ఈ రెండు చాలా ముఖ్యము. అవే వారికి సంపూర్ణ ఫలితము, దివ్యమైన జీవితమును ఇవ్వగలుగుతాయి. ముఖ్యముగా గురుభక్తి – విశ్వాసము అతి ముఖ్యమైన ఆభరణములు. అనుమానము పాపము.

***"విశ్వాసము ఆత్మజ్ఞానమును కలుగజేయును.***
***అనుమానము సర్వ నాశనమును కూర్చును"***

కావున నీవు అత్యంత విశ్వాసముతోను, భక్తిశ్రద్ధలతోను శ్రీస్వామిని దర్శించి ఆత్మానందమును పొందగలవు అని దీవించినారు.

పాఠకులారా! మహాత్ముల దీవెనలను – ఆజ్ఞలను వినమ్రతతో స్వీకరించి వానిలోని నిగూఢమైన విషయమును గ్రహించండి – విశ్వాసమును సడలనివ్వకండి విజయమును – జీవితానందమును – ఆత్మానందమును – పరమానందమును పొందండి.

***జై అవధూత చింతన గురుదేవదత్త"***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరువది ఒకటవ అధ్యాయము*** సంపూర్ణము






ఓం శ్రీ సాయిరాం
ఓం గురు ఓం గురు సచ్చిదానందా
జయ గురు జయ గురు దత్తాత్రేయ

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరవై రెండవ అధ్యాయము

"విద్యాసాగరా! అక్కల్‌కోట స్వామికి చాలాకాలం భిక్షపెట్టి సేవచేసే భాగ్యం గ్రామంలో చోళప్పకు లభించింది గదా! ఆ తర్వాత వారి గృహంలో శ్రీస్వామివారి లీలలను, అతని పరివారంతో శ్రీస్వామి అనుబంధాన్ని చెబుతాను విను.

చోళప్ప భార్యపేరు యశోబాయి. వారికి ఇద్దరు కుమారులు కలరు. పెద్దవాని పేరు కృష్ణ, రెండవవానిపేరు అప్పా. యశోబాయికి ఆమె కుమారులకు శ్రీస్వామివారిలో ఎటువంటి విశేషమూ కనబడలేదు. వారు శ్రీస్వామి చేష్టలను పిచ్చివాని చేష్టలుగా పరిగణించేవారు. శ్రీ స్వామివారిని చోళప్ప తమ ఇంటిలోనే వుంచుకొనవలెనను ప్రయత్నంలో పరివారముయొక్క వ్యతిరేకతను ఎదుర్కొనవలసి వచ్చింది. చోళప్ప యందలి గురుభక్తిని పరీక్షించుటకు యశోబాయి ఒక పావులాగ ఉపయోగపడింది. ఇది సర్వసాధారణమే. దంపతులలో ఒకరు గురుభక్తి గలిగియుండే మరియొకరు వ్యతిరేకించెదరు. ఇది భక్తులలోని భక్తిభావము పరీక్షించుటకే ఉపయోగపడును. కోటికొక్కరు దంపతులు ఒకే భావముతో దైవ, గురుభక్తి చేయగలిగిన వారుందురు. శ్రీస్వామి యశోబాయిలోని వ్యతిరేక భావాలను హెచ్చరింపజేసి చోళప్ప ఓర్పును పరీక్షించేవారు. అంతేకాక శ్రీస్వామి "బాలోన్మత్త పిశాచవత్" అను మాదిరిగా ఇంటిలో అందరినీ ఏడిపించేవారు. వారి గృహములో అంత వ్యతిరేకత వున్నా శ్రీస్వామి వారింటిలో ఒక సభ్యుడిగానే కలిసి వుండేవారు.



శ్రీస్వామి దర్శనార్థం అనేకమంది వస్తుండేవారు. అనేకమందికి ఈతిబాధలు తీరుచుండేవి. కోరికలు నెరవేరుచుండేవి. ఇన్నీ చూస్తున్నా, వింటున్నా యశోబాయి వింత స్వభావంతో ఇవన్నీ గాలిలో కలిసిపోయేవి. మహామహిమాన్వితుడన్న భావం ఏమాత్రం కలగలేదు.

శ్రీస్వామి వింత చర్యలతో ఆమెను అమితంగా విసిగిస్తుండేవారు. ఇంటిలో వున్న ధాన్యమును ఎవరి అనుమతీ లేకుండా తీసుకొని వెళ్ళి ఆవుకు తినిపించేవారు. ఒక్కొక్కసారి వాకిట్లోకి వచ్చిన భిక్షకులకు పిలిచి చేతికందిన వస్తువులను యిచ్చేవారు. ఒకప్పుడు ఆమెను ఏడ్పించడానికి చిన్నపిల్లవానివలె నట్టింట్లో మూత్ర విసర్జన చేసేవారు. ఇలా చేస్తున్నా శ్రీస్వామిని భక్తులు వచ్చి దర్శనం చేసుకొనేలోపు యశోబాయి నలుగురు వస్తారని ఇల్లంతా శుభ్రం చేసుకొనేది. శ్రీస్వామిని విసుక్కుంటూ, చోళప్పను సాధిస్తూ తన పనులు తాను చేసుకొనేది. శ్రీస్వామికి భిక్ష పెట్టేటప్పుడు చాలా ప్రేమతో పెట్టేది.

శ్రీస్వామివారి లీలలతోను, వారి భక్తుల కోలాహలంతోనూ, వింతల తోనూ చోళప్ప గృహం అతి పవిత్ర వాతావరణంతో నిండిపోయి వుండేది. వారి ఇంటి బయట ఆవరణలోని చెట్లక్రిందకూడ భక్తుల సందడితో కళకళలాడేది.

ఒకసారి యశోబాయి పండుగరోజున పూర్ణములు చేయవలెనని కోరికతో శనగలు తెప్పించి ఒక కుండలో దాచియుంచినది. శ్రీస్వామి ఆమెకు తెలియకుండానే కుండలోని శనగలు ప్రతిరోజు కొంచెం కొంచెం వారి పెరట్లోని ఆవుకు తినిపించేశారు. పండుగ రేపనగా యశోబాయి కుండ మూతతీసి చూచినది. కేవలం అడుగున కొన్ని శనగలు మాత్రమే వున్నవి. ఆమెకు చాలా బాధ కలిగినది. ఇది శ్రీస్వామి పనియే అని గ్రహించి చోళప్పకు ఫిర్యాదు చేసింది. కాని చోళప్ప అతి సామాన్యమైన ఈ పనిగురించి శ్రీస్వామిని ఏమీ ప్రశ్నించలేదు. విని ప్రశాంతంగా ఊరుకున్నాడు. దానితో ఆమె కోపం పట్టలేక తానే శ్రీస్వామిని అడిగినది. అందుకు శ్రీస్వామివారు అమాయకంగా ముఖంపెట్టి "నాకేం తెలుసు? శనగలన్నీ నీ ఆవే తిన్నది. ఆవునే అడుగు, నన్నడుగుతావేం?" అన్నారు.

అంతేకాదు. ఒక్కొక్కసారి తన పడకమీద పడుకోకుండా శ్రీస్వామి యశోబాయి పిల్లలకొరకు వేసిన పడకలమీద పడుకొనేవారు. అట్లే నిద్రపోయేవారు. ఏమనాలో ఆమెకర్థమయ్యేదికాదు. ఒక్కొక్కప్పుడు ఆమెకంటే ముందు వేకువనే లేచి పొయ్యిలో మలవిసర్జన చేసేవారు. ఆ తల్లి యశోబాయి అంతా శుభ్రంచేసి వంటకై పొయ్యి వెలిగించుకొని వంట ప్రయత్నం చేయుచుండగా పొయ్యిలో నీల్ళు పోసేవారు. చోళప్ప కుటుంబంలో అందరూ చాలా ఆచారవంతులు. అతనికి నియమములపట్ల, ఆచారంపట్ల అంత పట్టింపు లేకున్ననూ, అతని భార్యకు పట్టింపు వుండేది. ఆమె నిత్యం మడి ఆచారములను పాటించేది. శ్రీస్వామి మడికై ఆరవేసిన బట్టలను చిన్నపిల్లవానివలె వద్దన్నకొద్దీ తాకేవారు. ఆమె శ్రీస్వామిని తిట్టుకొంటూ, విసుక్కొంటూ, చిన్నపిల్లవానిపై వేసినట్లు కేకలు వేస్తూ తిరిగి శుభ్రపరచుకొంటుండేది. ఇంట్లో పూజలు, వ్రతాలు జరిగే రోజున ఆమె మడి వంటలను, మడి నీళ్లనూ తాకవద్దని శ్రీస్వామిని మరీ మరీ కోరేది. కాని శ్రీస్వామి హఠంచేసి మరీ తాకేవారు. దానితో ఆమె చాలా కష్టపడవలసి వచ్చేది.

ఒక పండుగ రోజున చాలా బొబ్బట్లు చేసింది. అదే సమయంలో వారి ఇంటిముందు ఒక సన్యాసి భిక్షకై వచ్చి “అలక్ నిరంజన్” అని కేకపెట్టారు. ఆ సమయంలో శ్రీస్వామి భక్తుల మధ్యలో కూర్చుని వారితో ముచ్చటిస్తున్నారు. ఆ కేక వినగానే మెఱుపులాగ ఒక ఉదుటున వచ్చి బొబ్బట్లు ఉన్న పాత్రను చేతితో పట్టుకొని ముందు వాకిట్లోకి పరుగెత్తిపోయారు. యశోబాయి అంతకంటే వేగంగా పరుగెత్తిపోయి శ్రీస్వామిపై కలబడి శ్రీస్వామి చేతిలోని పాత్రను లాక్కొంది. అందులోనుండి ఒక్క బొబ్బట్టు మాత్రం ఆ సన్యాసికి యిచ్చింది. ఈ దృశ్యమును చూచిన అక్కడి భక్తులంతా ఆశ్చర్యపోయినారు. ఈ లీలను చూచినా శ్రీస్వామివారి భావం ఎవరికీ అర్థంకాలేదు. వింతగా చూచి ఊరుకున్నారు. కాని అందరూ వీరి వింత ప్రవర్తన (కారణం లేనిదే కార్యము జరుగదు) గురించి వినియున్నవారే కావున శ్రీస్వామియందు భక్తిభావం మాత్రం చెదిరేదికాదు.

ఒకసారి చోళప్ప గ్రామాంతరం వెళ్లిన సమయంలో శ్రీస్వామి నట్టింట్లో నిలబడి ఈ ఇల్లు తమదనీ, ఇందులో ఇంకెవ్వరూ ఉండటానికి అధికారం



లేదని పెద్దపెద్ద కేకలుపెట్టి యశోబాయినీ, పిల్లలనూ భయపెట్టి బయటికి గెంటారు. వారు తిరిగి లోపలికి రాకుండా కర్ర పుచ్చుకొని గడపలోనే నిలబడినారు. గత్యంతరం లేక యశోబాయి, పిల్లలూ పోయి చెంతనే వున్న ఒక చెట్టుక్రింద కూర్చున్నారు. వారికి మధ్యాహ్న భోజనం లేదు. కాని శ్రీస్వామి ఎవరెన్ని చెప్పినా శాంతించలేదు. సాయంత్రం చోళప్ప తిరిగి రాగా విషయం తెలిసింది. చోళప్ప శ్రీస్వామివారి వద్దకు వచ్చి చిన్న పిల్లవానికి చెప్పినట్లు "స్వామీ! ఈ ఇల్లూ, ఈ ఇంటిలోని సామాగ్రి అంతా మీదే! మీవికానివి ఏమున్నాయి. నేను, నా భార్య, నా పిల్లలు అందరమునూ మీవారమే. సద్గురుమూర్తీ మీకు తెలియనిదేమున్నది. మీకు మధ్యాహ్నం నుండి భోజనం లేదు. చిన్నపిల్లలు వారు కూడా ఉదయం నుండి ఏమీ తినలేదు. ఆ తల్లి తన పిల్లలకు భోజనం లేదని ఎంత బాధపడుచున్నదో చూడండి. స్వామీ! మీ ఆవేశం తగ్గించుకొని శాంతించండి. వారిని లోనికి రానీయండి. అంతా మీదే. ఈ ఇల్లేమిటి! ఈ జగత్తు అంతా మీదే. మేము మీచే నడుపబడుచున్న బొమ్మలము. నాటక సూత్రధారి మీరు. మేము నటులము. దయామయా! పాపం! వారిపై దయ చూపండి. వారిని లోనికి అనుమతించండి" అని పరిపరి విధముల ప్రార్థించాడు. అప్పుడు శ్రీస్వామి శాంతించి అందరినీ లోనికి రానిచ్చారు.

ఒకరోజు చోళప్ప భార్య యశోబాయికి నవమాసములు నిండి ప్రసవ సమయమాసన్నమైనది. ప్రసవ వేదనకూడా ప్రారంభమైనది. ఆమెను ప్రత్యేకమైన గదిలో మంచంవేసి పరుండబెట్టినారు. ఆమె నొప్పులతో అధికంగా బాధపడు చున్నది. శ్రీస్వామి ఆమెను వుంచిన గది తలుపులను మూయనివ్వక గడపవద్దనే నిలబడినారు. ఎవ్వరెంత చెప్పినా వినలేదు. అడ్డువచ్చిన వారందరినీ అరుస్తూ ఇంటిలోని సామాగ్రినంతా చిందరవందరగా పడవేసి చిన్నపిల్లవానిలాగా గోల చేయసాగినారు. యశోబాయి ప్రసవవేదన భరించలేక వేయు కేకలు, శ్రీస్వామి వేయు కేకలు, సామాగ్రి విసరే మోతలతో ఇల్లంతా మోగిపోయింది. అందరు ఈ వింత ప్రవర్తనకు విస్తుపోయి చూస్తూ ఏమి చేయాలో తెలియక యోచిస్తున్నారు. అంతలో యశోబాయికి పెద్ద నొప్పులు రావడం, శ్రీస్వామి తనంత తానే తలుపులు దగ్గరకేసి ఇవతలికి వచ్చేసి, ఇంటిలో చిందరవందరగా పడవైచిన సామాగ్రినంతగా చక్కగా తానే సర్దిపెట్టడం అన్నీ క్షణకాలంలో జరిగినవి.




యశోబాయి ఆడపిల్లను కన్నది అని నిత్యానందుడు చెప్పగనే వినుచున్న విద్యాసాగరుడు "గురుదేవా! ఇదేమి వింత! ఎవరైనా ప్రసవవేదన పడుచున్న స్త్రీలపై జాలిగలిగి వుంటారుగదా! మరి ఆ సమయంలో శ్రీస్వామి అట్లు చేయుటకుగల కారణమేమి? "బాలోన్మత్త పిశాచవృత్తి" అనే వానిలో ఇలా చేయటం వున్నదా! అందువలననే శ్రీస్వామి ఇలా చేసినారా లేక ఇందులకేమైనా కారణము గలదా? వివరముగా తెలుపండి అని నా ప్రార్థన" అని అడిగినాడు. ఇది విని శ్రీ నిత్యానందయోగి "విద్యాసాగరా! యోగులు, సిద్ధులు, మహాత్ముల చర్యలు చాల గూఢముగా వుండును. వారు ఏమిచేసినా ఇతరులకు మేలు చేయడంకొరకే.

అయితే ఈ యశోబాయికి ఆ ప్రసవ సమయంలో ప్రాణగండమున్నది. దానిని శ్రీస్వామి తప్పించిరి. ఆమెకు ఆడపిల్ల జన్మించునని తెలియజేయుటకై ఇల్లంతా సర్దిపెట్టిరి. మరియు యశోబాయిది వైరభక్తి. ఆమెకు శ్రీస్వామిపైన అపారమైన ప్రేమ వుండేది. కాని వారు చేసే పనులకు విసుగుచెంది అడ్డగించేది. ఆమెనుండి స్థూలంగా వ్యతిరిక్తత కనిపించినా మనసులో వ్యతిరేకత లేదు.

వారిరువురి సంబంధం యశోదా - కృష్ణుల సంబంధం లాంటిది. శ్రీకృష్ణుని ప్రజలంతా దేవుని అవతారంగా గౌరవించి ఆరాధించినా, అనేక అతి మానుష లీలలను తన కన్నులతో తాను చూచినాకూడ కృష్ణుడు తన కుమారుడన్న భావంతోనే యశోద చూచేది, లాలించేది, దండించేది ఆమె తల్లి. అందుచే కుమారుడెంతటివాడైనాసరే వానిపట్ల తల్లిపాత్ర యిలాగే వుంటుంది. యశోబాయి కూడా అనుదినం శ్రీస్వామికి భోజనం పెట్టేది. భోజనం పెట్టేవారందరూ తల్లివంటివారే అనికదా శాస్త్ర ప్రబోధం. అందుచేత శ్రీస్వామి చోళప్ప ఇంటిలో వుండి ఆ యశోబాయితో తల్లితో బిడ్డ ఆడుచున్న చందముగా ఆడుకొన్నారు.

ఈ విధంగా నిత్యానందుడు చెప్పగనే విద్యాసాగరుడు తన్మయత్వం చెంది "గురుదేవా! ఆహా! ఏమి ఆ తల్లిచేసిన పుణ్యం! ఎన్ని జన్మల పుణ్యభాగ్యమో! దేవాదిదేవుడు, త్రిమూర్తి స్వరూపుడు అయిన శ్రీస్వామి ఆమెకు ఈ విధమైన సేవ చేయుటకు" అని చేతులు జోడించి శ్రీస్వామిని మదిలో తలంచి జయజయనాదములు చేసినాడు.

నిత్యానందుడు బాలకా! అలా జన్మించిన ఆ బాలికకు రాజాబాయి



అని పేరుపెట్టినారు. కాలక్రమములో శ్రీస్వామి యశోబాయిపై తన కరుణారసమును కురిపించిరి. ఆమెకూడా శ్రీస్వామిని ఎన్నడూ మరువలేదు. ఒక సందర్భంలో ఆమెకు శ్రీస్వామిపై భక్తి, విశ్వాసములు దృఢపడే అవకాశం లభించినది. ఒకరోజు ఆమెకు తేలు కుట్టినది. దానితో ఆమె అమితముగా బాధపడుచున్నది. బాధకు తాళలేక పెద్దపెద్ద కేకలు వేయుచున్నది. చోళప్ప, కుమారులు పరుగున వచ్చి చేరినారు. శ్రీస్వామిని దర్శింపవచ్చిన భక్తులుగూడ ఉన్నారు. అందరూ తలకొక వైద్యమును సూచించిరి. చోళప్ప శ్రీస్వామివైపు మాత్రమే చూచుచుండెను. ఆమెకూడ "శ్రీస్వామివైపు చూచి అందరికీ అన్ని బాధలూ తీరుస్తావు అంటారే, నేనింత బాధపడుతుంటే చూచి ఊరుకుంటావేమి!" అని మనస్సులో అనుకొనుచూ బాధకు తాళలేక కేకలు వేయుచున్నది. అప్పుడు శ్రీస్వామి తాను ధరించు పాదుకనొకదానిని ఆమె ముందుకు విసిరి అందులో ఆమె చెయ్యిని వుంచమనిరి. ఆమె అలాగే చేసెను. ఆశ్చర్యకరముగా ఆమె అరుపులు, కేకలు మాయమయ్యెను. అనగా బాధ పూర్తిగా లేకుండెను. ఆశ్చర్యానందములతో శ్రీస్వామిని చూచుచు చేతిని బయటికి తీయగా మరలా బాధ కలిగెను. వెంటనే ఆమె చేతిని పాదుకలో వుంచెను. బాధ తగ్గినది. చివరకు తన చేతిని పాదుకలోనే వుంచి ప్రశాంతముగా నిద్రపోయినది.

విద్యాసాగరా! దీనిలో చాలా వేదాంత భావం గోచరిస్తుంది. ఈ సంసారం తేలుకాటు వంటిదని, శ్రీస్వామి పాదుకలు శరణువేడితే ఆ బాధ వుండదని, మధ్యలో విస్మరిస్తే సంసార బాధ తలెత్తుతుందని, అందువల్ల విడువక శ్రీస్వామిని స్మరిస్తూ, మనస్సును శ్రీగురుచరణాలమీదనే లగ్నంచేస్తే ప్రశాంతముగా జీవించవచ్చునని తెలియుచున్నది.

ఒకరోజు శ్రీస్వామి అకస్మాత్తుగా చోళప్ప ఇంటినుండి కోపంతో శరవేగంగా 'హోసాపుర' అనే గ్రామంవైపు నడక సాగించినారు. శ్రీస్వామి కోపంతో వెళ్ళుట చూచి చోళప్ప కూడా వేగంగా వారి వెంట పరుగిడెను. శ్రీస్వామి అతనికేసి చూచి "మేము సంన్యాసులం. నీవు గృహస్థుడవు. నావెంట నడువరాదు. నీవిక్కడే వుండి లోకవ్యవహారాలు చక్కబెట్టుకో!" అన్నారు. చోళప్ప వెనుకకు పోలేదు. అక్కడే నిలబడినాడు. శ్రీస్వామి మహోగ్రులై తిట్టరాని తిట్లు తిట్టారు. చివరికి చోళప్ప కన్నీరు కారుస్తూ "స్వామీ! నేను ఇంటినైనా విడుస్తాను. కాని మీ పాదాలు మాత్రం విడువను" అన్నాడు. ఆ దృఢభక్తికి శ్రీస్వామి

ప్రసన్నులై తమ పాదుకలను అతని ముందుకు విసిరి, వాటిని పూజించు కోమన్నారు. ఆ తర్వాత శాంతించి అక్కల్‌కోటకు వచ్చినారు. కష్టాలలోనున్న అనేకమంది భక్తులకు స్వప్నంలో తన పాదుకలను సేవించుకోమని దివ్యసందేశాలు రావడం, వారు ఆ పాదుకలను సేవించి బాధానివారణ పొందడం జరిగినవి. దానితో చోళప్ప విశ్వాసాన్ని మరింత దృఢం చేసినాయి. ఇప్పటికీ చోళప్ప మఠంలో ఆ పాదుకలు పూజింప బడుచున్నవి.

ఒకసారి శ్రీస్వామి చోళప్ప మొదలైన భక్తులతో కలసి పొలములలో తిరుగుతూ అకస్మాత్తుగా పొలముల గట్లపైన గల 'కలబంద' పొదలపై నడువసాగిరి. వారిని చూచి చోళప్ప ఒక్కడే అనుసరించినాడు. మిగిలిన భక్తులంతా భయంతో నిలబడిపోయిరి. కొంతదూరం పోయిన తరువాత వారిరువురూ తిరిగి ఊరిలోనికి వచ్చిరి. కలబంద చెట్లు పూర్తిగా ముళ్ళతో నిండియుండును. అవి చాలా పదునుగా వుండి కాలు మోపితే కాలు లోతుగా దిగిపోతాయి. కాని వీరిరువురికి ఏమీ జరుగలేదు. శ్రీస్వామి శక్తితో చోళప్ప కూడా నడువగలిగినాడు. అది గమనించిన భక్తులు ఆశ్చర్యమును పొందిరి.

విద్యాసాగరా! ఇలా శ్రీస్వామి చోళప్ప ఇంటిలో వుండగా అనేక లీలలు చేసి చూపిరి. వారు యోగిరాజు - యోగేశ్వరులు - మహాయోగ చక్రవర్తి - వారిని రాజులు సేవించిన కథ వివరంగా తెలుపుతాను, వినుమని చెప్పసాగిరి.

***"ఓం గురునాథా - ఓం గురునాథా***
***దత్తాత్రేయా - స్వామి సమర్థా"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరవై రెండవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీం ద్రాం దత్తావతార
సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరవై మూడవ అధ్యాయము

విద్యాసాగరుడు "గురుదేవా! అక్కల్‌కోట అని పిలుస్తున్నారుకదా! ఈ గ్రామమునకు ఈపేరు ఎందుకు వచ్చినది? దానిని గురించి తెలుపండి!" అని కోరగానే శ్రీ నిత్యానందయోగి "నాయనా! శ్రీస్వామిని భక్తులందరూ అక్కల్‌కోట మహరాజ్ అని పిలుచుచుండుటచేత, నీవు అడిగిన ప్రశ్న బాగున్నది. అక్కల్‌కోట పేరు గురించి – ఆ రాజవంశము గురించి తెలుపుతాను వినుము.

పూర్వము అక్కల్‌కోటకు ప్రజ్ఞాపురము అని, ధీపురమని పేర్లు వున్నవి. ప్రజ్ఞాపురము అనగా – ప్రజ్ఞ అనగా శుద్ధ చైతన్యము అనియును, విజ్ఞానము అనియును, పరిపూర్ణమైన జ్ఞానమనియును అర్థములున్నవి. ఇంకనూ చెప్పాలంటే బుద్ధి అని, గుర్తు అనికూడా అర్థము. ప్రాజ్ఞుడు అనగా పండితుడు అని అర్థము. అనేకమంది ప్రాజ్ఞులు నివసించుటచే ప్రజ్ఞాపురం విజ్ఞాన నగరమని చెప్పవచ్చు. పూర్వము రామాయణ కాలములో ప్రజ్ఞాపురము అని వున్నది. అది ఇదేకావచ్చును. ఈ నగరములో విద్యాలయములు మహర్షుల ఆశ్రమములు అనేకం వుండేవి. అందు విద్యార్థులకు విద్యను ప్రబోధించేవారు. ఈ గ్రామమునకు రెండు మైళ్ళ దూరంలో 'భోరీ–భద్ర' అనే నదులు వున్నవి. దానికి మరికొలది దూరంలో అనగా షుమారు 20 కిలోమీటర్ల దూరంలో చీనా–భీమానది సంగమము కలదు. మరియు కొలది దూరములో 50 కిలోమీటర్ల దూరంలో భీమా–పాయు నదుల సంగమము కలదు. ఇవి అన్నీ కృష్ణానదిలో కలయును. వాని మధ్యలో వుండు ఈ పురము వీటన్నింటికి ప్రధానమైనది. కావున ప్రధాన పురము అనికూడ పిలుచుచుండిరి. ఈ ప్రాంతము

అంతా అనేక ఆశ్రమములు, విద్యాలయములు వుండుటచేత ఇది ప్రజ్ఞాపురము అని ప్రసిద్ధిచెంది వుండెను. రామలక్ష్మణులు అరణ్యవాసములో సీతకై అన్వేషణ చేయుచు ఈ ప్రాంతమంతా తిరిగినారు. ఇది దండకారణ్యమునకు నైరుతి భాగం. ఇక్కడనుంచే జనన స్థానం మొదలవుతుంది. క్రౌంచారణ్యము అని కూడా అంటారు. ఇక్కడికి కొన్ని యోజనాల దూరంలోనే కబందుడు అను రాక్షసునికి శాపవిమోచనం కలిగినది. సుగ్రీవునితో స్నేహము పెంచుకొని కబందుని తెలుసుకొంటారు. పంపాసరోవరం అగు శబరి ఆశ్రమమునకు బయలుదేరుతారు. అటువంటి పవిత్రమైన ప్రదేశం ఇది. యోగేశ్వరుడైన దత్తుని అవతారం ఈనాడు ఈ ప్రాంతములో సంచారముచేసి 23 సంవత్సరములు నివసించినారు. శ్రీస్వామి సమర్థుల రూపంలో దీనికి దగ్గరలోనే గంధర్వ నగరములో రెండవ దత్తావతారం శ్రీనరసింహ సరస్వతి నివసించి తన లీలలను చూపినారు. వారే వీరు అనికదా భక్తుల విశ్వాసము. అనేకమందికి పరిపూర్ణమైన అనుభవం కలిగించినది. అందువలన ఏ విధంగా చూచినా ఇది ప్రజ్ఞాపురము అనుటకు తగియే వున్నది. ప్రజ్ఞాపురము పర్షియన్ భాషలో అక్కల్‌కోట అంటారు. ఇంకా చెప్పాలంటే బుద్ధికి బలమైన స్థలము అని, శ్రీస్వామి సమర్థుల సమాధి – వటవృక్ష మందిరం వలన ఈనాడు సుప్రసిద్ధమైన పుణ్యక్షేత్రం అయినది. విద్యాసాగరా! విన్నావు కదా! మనము ఇటువంటి క్షేత్రములో వున్నాము. విజయనగర రాజుల కాలములో ఈ పురమునేలు రాజులలో ఖండే అనే వంశము వారి కాలము 1708 ప్రాంతములోని షాహు మహారాజు సంతానం లేక భోన్స్‌లే వంశము నుంచి రానోజీ అనేవానిని తీసుకొని వచ్చి రాజును చేసినారు. అతనికి ఫతేసింహ అనే పేరు పెట్టినారు. అతని కాలంలోనే బ్రిటిష్‌వారు మన దేశములో ప్రబలిరి. అయితే బీజాపూర్ సుల్తాను, హైదరాబాద్ నిజామ్ సర్కారు – మున్నగు వారితో చక్కని సంబంధములతో ఈ రాజ్యం చాలాకాలం సుభిక్షముగానే వుండేది. ఆ కాలములో దీని వైశాల్యము 498 చదరపు మైళ్ళు.

ఆ తరువాత ఈ రాజ్యానికి రాజుగా ఫతేసింహుని కుమారుడు రాజైనాడు. అతనికి నలుగురు కుమారులు షహాజీ, మాలోజి, బాబాసాహెబ్, అప్పాసాహెబ్. శ్రీస్వామి అక్కల్‌కోట రాకమునుపు పెద్దవాడైన షహాజీ రాజా భోన్స్‌లే రాజుగా వుండేవారు. వారికి మాలోజిరావ్ – దాజీరావు అను కుమార్లు.



వారు శ్రీస్వామి సమర్థుల భక్తులైనారు. ఈ మాలోజీకే గాణుగాపురంలో దత్తాత్రేయస్వామి కలలో కనిపించి నేను అక్కల్‌కోటలోనే వున్నాను అని చెప్పినారు.

శ్రీస్వామి సమర్థుల వారికి రాజులయినా పేదలయినా ఒక్కటే. ఎక్కువ తక్కువలు లేవు. భగవంతుని ముందు అందరూ సేవకులే. సర్వజీవులకు ప్రభువు భగవంతుడే. ఆ భగవంతుని అవతారం శ్రీస్వామి సమర్థులు. అందువలన వీరే రాజులకురాజు, యోగులకు రాజు. అందువల్లనే వీరికి భక్తులు "అఖిలాండకోటి బ్రహ్మాండనాయక, రాజాధిరాజా యోగిరాజా, సచ్చిదానంద సద్గురు శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహారాజ్" అని జయజయ నాదములు, జయఘోషలు చేయుచుండిరి. మానవులు భగవంతుని కరుణతో ఎంత పెద్ద పదవులు సంపాదించినా, ఆ భగవంతుని ముందుకు వచ్చినప్పుడు అధికారములను ప్రదర్శింపరాదు. అంతేకాదు – దేవుని దగ్గరకు – గురువుల వద్దకు – తల్లివద్దకు వచ్చినప్పుడు సాధారణముగా, వినయముతో నుండవలెనని కదా ఆర్యోక్తి! అలాగే శ్రీస్వామి సమర్థులను రాజులెందరో దర్శించి పూజించి వారి అనుగ్రహమును పొందేవారు.

అక్కల్‌కోట సంస్థానపు రాజైన మాలోజీరావ్ భోన్స్‌లే అతని తమ్ముడు దాజీరావు భోన్స్‌లే ఇరువురును శ్రీస్వామి సమర్థులను వారు అక్కల్‌కోటకు వచ్చిన మూడవరోజుననే దర్శించినారు. అపుడపుడు చోళప్ప గృహములో వున్న శ్రీస్వామిని దర్శించేవారు. మాలోజీరావ్ భోన్స్‌లేకి గురుభక్తి చాలా ఎక్కువగా వుండేది. వీరు శ్రీగురుచరిత్రను నిత్యం పారాయణము చేసేవారు. తరచు శ్రీగురు క్షేత్రాలను దర్శించేవారు. వీరు దత్తోపాసకులు. రాజ్యములో, రాజరికములో ఎన్ని ఇబ్బందులు వున్నా శ్రీగురు భక్తిలో ఎటువంటి మార్పు ఉండేదికాదు.

వీరు తరువాత కాలంలో 'హుబ్బళి'లో వుండే అవధూత శ్రీసిద్ధారూఢ స్వామిని కూడా సేవించినారు. చోళప్ప గృహములో ఉన్న శ్రీస్వామికి మొదట మహమ్మద్ ఆలీ ఖర్చులు భరించేవాడు. తరువాత కొంతకాలానికి వీరు నెలకు సరిపడు సామాగ్రి సదుపాయాలు పంపేవారు. ఉత్సవాలలోను, పర్వదినాలలోను

బ్రాహ్మణ సంతర్పణకుగాను 125 రూపాయలు పంపేవారు. శ్రీస్వామికి చోళప్ప గృహము ఎంతో, రాజు అంతఃపురము అలాగే వుండేది. కాని చోళప్ప గృహములోను, గ్రామంలోను ఉన్నప్పుడు భక్తులందరికి శ్రీస్వామి దర్శనము దొరికేది. రాజు మందిరములో వున్న సమయంలో అది సరిగా జరిగేది కాదు. రాజు మందిరములో వారి రాకపోకలకు ఎప్పుడూ అడ్డు వుండేదికాదు. స్వేచ్ఛగా వుండేవారు శ్రీస్వామి.

ఒకరోజున మాలోజీరావు భోన్స్లే జన్మదినము. ఆయన తన రాజలాంఛనాలన్నింటితోనూ శ్రీస్వామి దర్శనానికి బయలుదేరినాడు. నూతన వస్త్రములను, కిరీటమున్ను, కవచకుండలాలున్ను ధరించి ఏనుగునెక్కి సోదరునితో, మంత్రులతో, భటులతోను, సైన్యములతోను, రాణులతోను, చోళప్ప ఇంటికిచేరి శ్రీస్వామివద్దకు వచ్చి నమస్కరించినాడు. రాజావారు ఇలా రావడం శ్రీస్వామికి నచ్చలేదు. వారివైపు కన్నెత్తయినా చూడకుండా మౌనంగా వున్నారు. కొంత సమయం గడిచాక రాజావారు శ్రీస్వామి దృష్టిని ఆకర్షించడానికి ఆయన పాదములకు నమస్కరింపబోగా, శ్రీస్వామి సమర్థులు ఉగ్రుడై, బలంగా రాజావారి చెంపమీద ఒక దెబ్బ కొట్టారు. ఆ దెబ్బకు కిరీటం పోయి ఇరవై అడుగుల దూరములో పడిపోయినది. నిశ్చేష్టుడై, నివ్వెరపోయి రాజు చెంప నిమురుకుంటూ కూర్చుండిపోయినారు. అందరూ ఆశ్చర్యంగాను, ఆందోళనతోనూ చూచుచుండిరి. శ్రీస్వామి సమర్థులు "నీ రాజరికం నీ భవనంలోను, నీ దర్బారులోనూ సరిపోతుంది ఇక్కడ అవసరం లేదు. ఈ ప్రపంచము అనే చదరంగంలో నీవంటి రాజులను ఎంతమందిని కావాలంటే అంత మందిని తయారు చేయగలం" అని అన్నారు. మాలోజీరావ్ ఈ విషయమును శ్రీస్వామి ప్రవర్తనలోని మర్మమును తెలుసుకొని శిష్యుడు, భక్తుడు సద్గురువు వద్దకు నిరాడంబరముగా రావాలని గుర్తించాడు. తన తప్పులను మన్నించమని ప్రార్థించాడు. శ్రీస్వామి శాంతించి దీవించినారు. శ్రీస్వామి కొట్టినది అతనిని కాదు. అతనిలోని అజ్ఞానమునే. ఈ సన్నివేశం తరువాత మాలోజీరావ్‌లో దృఢమైన భక్తి, శ్రద్ధ కలిగి మంచి సాధకుడై దత్తానుగ్రహమును పొందినాడు. అంతేకాదు శ్రీస్వామి సమర్థుల అనుగ్రహం పొందినాడు.



అప్పటినుంచి రాజు తన పల్లకిని మూడు ఫర్లాంగుల దూరములో ఆపి, కాలినడకన శ్రీస్వామి సన్నిధికి చేరేవారు. వేషము, అలంకరణ సాధారణముగా వుండేది. రాజావారికి సంతతి లేదు. ఆ రాజు ఆయన పత్ని శ్రీస్వామిని సేవించుచూ తమ సంకల్పమును మనస్సులోనే తలంచుకొనేవారు. శ్రీస్వామి సమర్థులు వారి మనోభావములను గ్రహించి వారిని అనుగ్రహించినారు. మాలోజీరావు భార్య గర్భమును ధరించినది. వారి ఆనందమునకు అవధి లేకుండినది. వారు శ్రీస్వామి సమక్షములో అన్నసమారాధనను పెద్దయెత్తున నిర్వర్తించినారు. అయితే అతనికి తమకు పుట్టబోవునది ఆడపిల్లో లేక మగపిల్లవాడో తెలుసుకోవాలని వుండేది. దానికి శ్రీస్వామి ఒకనాడు "గాజులు కావాలి" అని అడగటం, పొయ్యి ముందు కూర్చొనడం చూచి తనకు పుట్టనున్నది ఆడపిల్లయే అని నిర్ణయించుకొన్నారు. రాజ్యానికి వారసుడు కలిగితే బాగుండును అనుకొనుచు బాధపడసాగినాడు. అతని మనోరథం తెలిసి శ్రీస్వామివారు ఒకనాడు "ఫిరంగి గుండు వత్తికి నిప్పు పెట్టండి" అని కేకలు వేశారు. అది గ్రహించి మాలోజీరావు శ్రీస్వామి తన మనోభీష్టాన్ని తెలుసుకొని తనకు మగబిడ్డననుగ్రహించినారని సంతోషించినాడు. అనుకున్న విధముగానే వారికి మగపిల్లవాడు కలిగెను. శ్రీస్వామి చెప్పినట్లే ఆ శుభవార్త లోకానికి వెల్లడి చేయడానికి ఫిరంగులు పేల్చి ఊరిలోని ప్రతి వ్యక్తికి తానే స్వయముగా కలకండ పంచాడు రాజు. వానికి షహాజీరావు అని నామకరణము చేసినారు. ప్రజలు వాని బాబాషాహెబ్ రాజే అని పిలిచేవారు. ఈ విధముగా శ్రీస్వామి సమర్థుల అనుగ్రహముతో రాజు సంతానాన్ని, రాజ్యానికి వారసుని పొందినారు.

మరొకసారి శ్రీస్వామి రాజభవనానికి వెళ్ళారు. రాజు తగిన సత్కారాలతో శ్రీస్వామివారిని ఆహ్వానించి - పూజాగృహం దగ్గరకు తీసుకొని వెళ్ళారు. శ్రీస్వామి అక్కడవున్న ఉయ్యాలబల్లమీద కూర్చున్నారు. రాజుపరివారం అంతా వున్నారు. ఆ సమయంలో పూజారి పూజకోసమని గంధపుచెక్క అరగదీస్తున్నాడు. ఒక ఎలుకవచ్చి దేవునికి పెట్టిన దీపారాధనలోని వత్తిని తాకింది. ఆ నిమిషంలో చేతిలోని గంధపు చెక్కను ఆ ఎలుకపైన విసిరినారు. పాపం ఆ ఎలుక అది




తగిలిన వెంటనే చనిపోయింది. పూజారి కోపంతో "తగిన శాస్తి అయినది" అంటూ ఆ ఎలుక తోక పట్టుకొని బయట పారవేయడానికి తీసుకొని పోవుచున్నాడు. శ్రీస్వామి పూజారిని దగ్గరకు పిలిచి ఆ చచ్చిన ఎలుకను తనకిమ్మని గద్దించారు. అతని చేతిలోని ఎలుకను తీసుకొని ఉయ్యాల గొలుసులోని ఒక రంధ్రములో నుంచి అటూ ఇటూ నాలుగుసార్లు తీశారు. తరువాత దానిని చేతులలోనికి తీసుకొని బుజ్జగిస్తూ "లేమ్మా! లే! ఇక వెళ్ళు!" అన్నారు. వెంటనే ఆ ఎలుకకు ప్రాణమువచ్చి ఆయన చేతిలోంచి దూకి పారిపోయినది. రాజు, రాజు పరివారం ఆ దృశ్యమును చూచి ఆశ్చర్య పోయినారు. శ్రీస్వామివారి ఈ చర్య పూజారికి చెప్పకనే బుద్ధిచెప్పింది. సర్వజీవులయందు ప్రేమగలిగి యుండుటయే మానవలక్షణము.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు ఈ ప్రజ్ఞాపురములో నివసించుటచేత ఈ నగరము పేరుతోనే అందరు అక్కల్‌కోట మహరాజ్ అని పిలుచుచుండిరి. శ్రీస్వామివారిని ఈ రాజవంశములవారేకాదు, అనేకమంది రాజులు కూడా దర్శించినారు. వారిని గురించి తెలుపుతాను వినుము అని తిరిగి చెప్పసాగెను.

***"అఖిలాండ కోటి బ్రహ్మాండ నాయక రాజాధిరాజ!***
***యోగి రాజ! పరబ్రహ్మ శ్రీ సచ్చిదానంద సద్గురు***
***శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్‌కీ జై!"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరువది మూడవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ రాజాధి రాజ
యోగిరాజాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరవై నాలుగవ అధ్యాయము

**వి**ద్యాసాగరా! ధనము వుండి విజ్ఞానధనం లేనిచో వాడు పేదవాడే - ధనము లేకపోయినా విజ్ఞాన దనం వున్నచో వాడు ధనవంతుడే! రాజులైనా, రారాజులైనా యోగీశ్వర చక్రవర్తులకు దాసులే. ఈ అధ్యాయములో శ్రీస్వామి సమర్థులు మనకు యోగీశ్వర చక్రవర్తులై దర్శనమును యిస్తారు. జాగ్రత్తగా శ్రద్ధగా గ్రహించు అని చెప్పబూనినాడు.

గ్వాలియర్ రాజా జియాజీరావు షిండే గొప్ప దైవభక్తుడు. అహంకారము లేని రాజు. ఆయనకు సంతానము కలుగలేదు. అయినా అతనికి ఆ చింత ఏమీ వుండేదికాదు. రాజునకు రాజ్యంలోని పండితులు, జ్యోతిష్యులు తీర్థయాత్రలవల్ల ఫలం వుండునని సలహా యిచ్చిరి. ఆ పలితం ఎలావున్నా తీర్థయాత్రలవలన పరమార్థము, మహాత్ముల దర్శనం జరుగుతుందని ఆయన బయలుదేరి అనేక ప్రాంతములలో తిరుగుచూ, అనేక పుణ్యక్షేత్రములను, మహాత్ములను దర్శించుచూ శ్రీస్వామి సమర్థులను గురించి విని వారిని దర్శించాలనే కోరికతో అక్కల్‌కోటకు వచ్చినారు. వారివెంట ప్రఖ్యాత కీర్తనకారుడు గోవిందబువా వున్నారు. ఆ సమయంలో శ్రీస్వామివారు రాజుగారి కోరికపై రాజభవనములో ఉన్నారు. తాను రాజైయుండి మరొక రాజు అంతఃపురమునకు ఆహ్వానము లేకుండా వెళ్ళడానికి సందిగ్ధమేర్పడినది. ఏమి చెయ్యాలని యోచించుచుండగనే వారి రాక, భక్తిశ్రద్ధలు తెలుసుకొన్న శ్రీస్వామి సమర్థులు రాజభవనాన్ని వదలి కాలినడకనే ఊరి బయటకు వెళ్ళి ఒక చెట్టు

క్రింద ఆసీనులైనారు. ఈ వార్త విన్న వెంటనే రాజాజియాజీరావుతో పాటు గోవిందబువా కలసి సంతోషముతో శ్రీస్వామి వద్దకు వెళ్ళి వారికి పాదాభివందనములు చేసి పుష్పములు వారి పాదములపై వేసి పండ్లు, కొబ్బరికాయను సమర్పించుకొనిరి. అతను చాలా జిజ్ఞాసువుగాన శ్రీస్వామి ముందు కూర్చుని చేతులు జోడించి "అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! ఆదిపురుషా, అద్వైతరూపా, నిన్ను తెలుసుకొనుట మానవులమైన మాకు సాధ్యంకాదు. హే! దయానిధీ! దుఃఖమయము – మోహమయము అయిన సంసార సాగరాన్ని దాటుట ఎట్లు? దేహం ధరించిన జీవులు – తిరిగి ఏ సాధనవలన పరబ్రహ్మ లోకానికి చేరుచుందురో దానిని నాకు వివరముగా చెప్పి అనుగ్రహించండి" అని ప్రార్థింపగా, శ్రీస్వామి చిరునవ్వులు నవ్వుచూ వారిని దీవించి "రాజా! చాలా చక్కని ప్రశ్న అడిగినావు. చాలా సంతోషము" అని అందరినీ కూర్చోమని సైగచేసి రాజువైపు తిరిగి కరుణా దృష్టితో "జిజ్ఞాసీ! సంసారము దుఃఖమయము అని అన్నావుకదా! సంసారము అనగా ఏమిటో తెలుసా?" అని అడిగినారు. జియాజిరావు స్వామీ! భార్య – భర్త, సంతానము వీరితో కలసి జీవించునదేకదా సంసారము అన్నారు.

శ్రీస్వామి "కాదు అది గృహస్థ ఆశ్రమము. నాయనా! ఆశ్రమములు నాలుగు (4); 1. బ్రహ్మచర్యము; 2. గృహస్థ; 3. వానప్రస్థ; 4. సన్యాసము. వీని అన్నింటిలోను ఉత్తమమైనది అన్ని ఆశ్రమములకు మూలము గృహస్థ ఆశ్రమము. సంసారమనగా, శరీరత్రయములోను, వాని ధర్మములలోను జరుగు వ్యాపారము. అనగా సూక్ష్మ, కారణ శరీరములు కలసి శరీరత్రయం. దీనిని ధరించినది ఆత్మ అని – జీవుడు అని – దేహి అని అంటారు. దేహి నివసించుటకు ఉపయోగపడునది దేహం. వీని కలయికే సంసారము. బంధము శరీరము; బంధములు – వీనిలోని గుణములు; వీనిని దాటుటయే చాలా కష్టం. వీనివలన (నిజకర్మ బలం వల్ల) సంభవించేవే దుఃఖాలు. జీవికి ఈ శరీరమే నేను అని – నాది అను భ్రమలే మోహము. ఇదే అజ్ఞానము. నేను మానవుడను – ఉన్నతుడను, హీనుడను, రాజును, సేవకుడను అను భావములే అజ్ఞాన మూలములు. వీనివలన ఏర్పడు విచారము అంతా మోహము. దుఃఖ మోహాలే ద్వంద్వాలు. సుఖ, దుఃఖ శీతోష్ణాల వంటివి కూడా ద్వంద్వాలు. అనగా జంటలు.




ఇవి నివారింపబడితే కలిగేది జ్ఞానం. జ్ఞానం ఆధారంతో పై భావంలో వుండే భక్తుడు వానిలోని చైతన్య శక్తి అయిన భగవానుని దర్శించాలి. వానిని అన్నింటిని పొందుటకు, అజ్ఞాన మూలము నశింపజేసుకొనుటకు తత్త్వదర్శి అయిన గురువును దర్శించాలి. వారి పాదపద్మములను శరణువేడి వారి అనుగ్రహముతో పై ద్వంద్వాలవల్ల కలుగు తాపములను పోగొట్టుకొని – సంసార సముద్రాన్ని దాటాలి. అంతేకాదు నాయనా! దేహం ధరించిన జీవి – దేహ సంబంధ విషయాలలో బంధము పెట్టుకొనక ఈ దేహమును రథములాగా చేసుకొని, రథికుడు యుద్ధములో విజయము సాధించినట్లు విషయ వాసనలు; దుఃఖ మోహాలు; కామ–క్రోధాలు; అన్నీ అజ్ఞాన లక్షణములతో యుద్ధంచేసి విజయం సాధించాలి. అయితే దేహము అనే రథమును తోలే రథసారథిగా ఉత్తమమైన గురువు వుండాలి. అతను తన శిష్యుడైన రథికునికి సరియైన మార్గ ప్రబోధము, విద్యాబోధనం చేసి విజయం చేకూర్చుతాడు. ఉత్తమమైన గురుశిష్యులు కృష్ణార్జునులు. అందుకే జీవుడైన అర్జునునికి – సాక్షాత్తు పరబ్రహ్మయే గురువై విజయం చేకూర్చినారు. అందువలన ఉత్తమమైన గురువును ఆశ్రయించడం ద్వారా శిష్యుడు తన గమ్యమైన మోక్షం, పరబ్రహ్మ లోకాలను చేరుతాడు అని పూర్తిగా విశదపరచిరి. అందులకు జీయాజీరావు ఆనందముతో శ్రీస్వామిని పూజించి అక్కడ అత్యంత వైభవముగా అన్న సమారాధన గావించినారు. శ్రీ గోవిందబువా నాశిక్‌కర్ మధురాతి మధురంగా కీర్తనలు పాడి అక్కడ శ్రీస్వామి సన్నిధిలో అందరినీ ఉర్రూత లూగించిరి. అది ముగియగానే శ్రీస్వామి ఒక భక్తునిచేత రొట్టెలు, బేసిన్ లడ్లు తెప్పించి అందరికీ ప్రసాదంగా పంచిరి. మరియు శ్రీస్వామి అతని మనస్సులోని కోరికను, వారి రాజరికమును వారసులు లేకుండుటను గ్రహించి, ఆయన ననుగ్రహించి వారికి సంతానము కలగాలని దీవించినారు. ఆ తరువాత వారికి మగ సంతానం కలిగినది. రాజాజియాజీరావు షిండే ఎల్లకాలము శ్రీస్వామి భక్తులై వారిని సేవించినారు.

ఒకసారి శ్రీస్వామి సమర్థ షోలాపురం రోడ్డులో 'కుంబారి' అనే గ్రామంలో వుండగా, రాజామాలోజీరావ్ భోన్సలే అతని స్నేహితుడు సాంగ్లీ సంస్థాన రాజా తాత్యాసాహెబ్ పట్వర్ధన్‌ను వెంటబెట్టుకొని శ్రీస్వామి దర్శనమునకు వచ్చినారు. రాజామాలోజిరావు పల్లకీదిగి నడచుకొనుచూ వెళ్ళి

శ్రీస్వామివారి పాదములకు నమస్కరించి నిలబడినారు. ఆ సమయమునకు ఒక మాసం ముందుగా రాజామాలోజీరావు సంస్థానం అక్కల్‌కోటను బ్రిటిష్ సైన్యాలు ఆధీనం చేసుకొని వున్నారు. ఆయన షోలాపురంలో కాపురం వుండిరి. సాంగ్లీ సంస్థానమును బ్రిటిష్‌వారు ఆధీనం చేసుకోలేదు. ఆ రాజు సంస్థానాధిపతిగానే నుండెను. ఆ గర్వముతో "నేను రాజును, పల్లకిదిగి నడచిపోవటం ఏమిటి?"అని పల్లకిలోనే శ్రీస్వామి దగ్గరగా పోయి పల్లకిలోనే కూర్చొని వారిని చూచెను. శ్రీస్వామి వానిని చూచి "ఏమిరా! నన్ను గుర్తించలేదా? నీవు ఎవరికంటే పెద్దవాడివి? ఎవరికి రాజువి? నీ పూర్వజన్మ మరచిపోయినావా?" అనిరి. అంతట ఆ రాజు మందహాసము చేసి, పల్లకి దిగి తన దగ్గర వున్న (మిఠాయి) పాలకోవా బిళ్ళలలో విలువైన రెండు బంగారు వజ్రపు ఉంగరములను ఉంచి శ్రీస్వామి పాదముల దగ్గర పెట్టి నమస్కరించినాడు. శ్రీస్వామి ఆ విషయము గ్రహించి "నీకు అవి రత్నాలైతే కావచ్చు! నాకవి రాళ్ళతో సమానం, తీసెయ్ అక్కడనుండి" అని గద్దించారు. అతను ఆశ్చర్యముతోను, భక్తితోను శ్రీస్వామిముందు నిలచి వాటిని తీసుకొనినాడు. ఆ తరువాత శ్రీస్వామి వానిని ఆశీర్వదించినారు. రాజామాలోజీరావును చూచి "ఏమీ దిగులుపడవద్దు. అన్నీ అవే సర్దుకుంటాయి. నిశ్చలంగా వుండు" అని దీవించినారు. ఆ తరువాత కొలది రోజులలోనే రాజామాలోజీరావునకు బ్రిటిష్ సైనిక ప్రభుత్వము అక్కల్‌కోట సంస్థానమును తిరిగి యిచ్చివేసిరి.

ఒక జాగీరుకు జమీందారు అయిన శ్రీ దాదాసాహెబ్ వించూర్‌కర్ అనువారు గొప్ప భక్తులు, ధార్మికులు, విద్యావంతులు. వారికి బ్రిటిష్ ప్రభుత్వం తరఫున అక్కల్‌కోటలో ఉన్నతమైన రాజోద్యోగిగా పదవి వచ్చింది. అతను అక్కల్‌కోటకు వచ్చిన సమయంలో శ్రీస్వామిని గురించి తెలిసింది. వారి లీలలను గురించి కూడా తెలిసినది. అతను శ్రీస్వామిని దర్శించడానికి వెళ్ళినాడు. అపుడు శ్రీస్వామి బుధవారపేటలో ఒక చెట్టుకింద ఆసీనులై వున్నారు. అతను వారిని చూడగానే శ్రీస్వామి చిరునవ్వు నవ్వి పలకరించిరి. అతనికి శ్రీస్వామిని చూచినంతనే అమితమైన ఆనందము కలిగినది. శ్రీస్వామిలో వారికి దివ్యమైన రూపములు కనిపించినవి. ఇతనికి మనోవృత్తులన్నీ శాంతి నొందినవి. మౌనముగా వెళ్ళి శ్రీస్వామి పాదములకు నమస్కరించి, పాదముల దగ్గర కూర్చొని




వారి పాదములను ఒత్తసాగినాడు. శ్రీస్వామి తన హస్తము వాని శిరమున ఉంచి దీవించిరి. ఆనాటినుండి శ్రీస్వామిని ప్రతిదినము దర్శించుచుండెడివారు. అతను శ్రీస్వామికి అమితమైన భక్తుడైనాడు. అంతేకాదు, శ్రీస్వామిని తన గృహమునకు అప్పుడప్పుడు తీసుకొని వెళ్ళేవాడు. ఆ సమయంలో అతనే స్వయంగా శ్రీస్వామికి స్నానం చేయించి అలంకరించి తన స్వహస్తాలతో వారికి భోజనం తినిపించేవాడు. ఒకసారి శ్రీస్వామి వారి ఇంటికి వెళుతూ చోళప్ప పెద్దకుమారుడు కృష్ణప్పను తీసుకొని వెళ్ళినాడు. కృష్ణప్పకు ఉపనయనం అయినది. మంత్రాలు, పంచసూక్తములను – రుద్ర – నమక – చమకములను నేర్చుకొని వున్నాడు. అతను అప్పుడప్పుడు శ్రీస్వామి సేవలో వుండేవాడు. శ్రీస్వామివారు ఎక్కడికైనా వెళ్ళినప్పుడు వారి అనుమతితో స్వామివెంట వెళ్ళేవాడు. వీరు ఇరువురు వించూర్‌కర్ ఇంటికి వెళ్ళినప్పుడు దాదాసాహెబ్ వించూర్‌కర్ ఇంటిలోనే వున్నారు. శ్రీస్వామిని అర్ఘ్యపాద్యములతో పూజించినారు. వారు అందరూ కూర్చున్న తరువాత శ్రీస్వామి అక్కడ వున్న కాగితముల నుండి ఒక కాగితం తీసి కృష్ణప్పకు ఇచ్చి చదవమనినారు. కృష్ణప్ప చదువబోగా అది ఏమి విచిత్రమో చదువలేకపోయినాడు. ఎంత శ్రమపడినా ఫలితం కనబడలేదు. అతను ఆశ్చర్యపోయినాడు. అయితే వించూర్‌కర్ వీడు ఇంత పెద్దవాడు, బ్రాహ్మణుడు! వీనికి చదువురాదా! అని కోపముతో “నీకు ఇంత వయసు వచ్చినా చదువు రాదా? నేర్చుకోలేదా? నీకు సిగ్గులేదా?” అని అడిగి కోపగించినాడు. అక్కడ నుండి ఇంటికి వెళ్ళిన తరువాత కృష్ణప్ప అమితంగా బాధపడినాడు. ఆ సమయంలో తనకు ఏమైనది, ఎందుకు చదువలేకపోయినాను అని దుఃఖించినాడు.

మరుసటి రోజున వించూర్‌కర్ శ్రీస్వామి దర్శనమునకు వచ్చినపుడు శ్రీస్వామివద్ద కూర్చొని కృష్ణప్ప పంచసూక్తములను పారాయణము చేయుచుండెను. వాని స్వరము – వానిలోని స్వచ్ఛత చూచి వించూర్‌కర్‌కు ఆశ్చర్యము వేసినది. అతను విచారింపగా కృష్ణప్ప మంచి విద్యావంతుడని, పరమభక్తుడని తెలిసినది. తాను తొందరపడి వానిని కోపగించుకున్నందుకు పరమభక్తుడైన కృష్ణప్పను తిట్టినందుకుగాను చాలా బాధపడినాడు. ఇదంతా శ్రీస్వామి లీలయే అనుకొని శ్రీస్వామిని మనస్సులో క్షమించమని ప్రార్థించినారు.

 

కొలది కాలమునకు వించూర్‌కర్‌నకు అతని తొడపైన చర్మవ్యాధి (శ్వేత కుష్ఠు) వ్యాపింపసాగినది. అతడు భయపడి శ్రీస్వామికి తెలిపినాడు. శ్రీస్వామి "నీచేతికున్న వజ్రపు ఉంగరమును తీసిఇవ్వ"మనినారు. పరమభక్తుడైన వించూర్‌కర్ వెంటనే దానిని తీసి శ్రీస్వామి పాదములవద్ద వుంచినారు. శ్రీస్వామి దానిని తీసి చోళప్పకు యిచ్చినారు. వించూర్‌కర్ వ్యాధి ఆశ్చర్యకరముగా మూడు రోజులలో తగ్గిపోయినది. చాలాకాలము గడిచాక ఒకరోజున శ్రీస్వామి వించూర్‌కర్ గృహమునకు పోయి "మూట ముల్లె సర్దుకొని ప్రయాణానికి సిద్ధముగా వుండు. ఇక్కడ వుండతగవు" అన్నారు. "ఎక్కడ నిన్ను వేలాది జనము ఆదరించి గౌరవిస్తారో అక్కడకు వెళ్ళు!" అన్నారు. వించూర్‌కర్ "నేను ఎక్కడికి వెళ్ళేది స్వామి మీ పాదాలను వదిలి?" అన్నారు. ఇది జరిగిన కొద్దిరోజులకు అక్కల్‌కోట రాజామాలోజీరావునకు వీరికి అభిప్రాయభేదాలొచ్చి ఉద్యోగానికి రాజీనామా యిచ్చి తన స్వంత జాగీరైన వించూర్‌నకు శ్రీస్వామి అనుమతితో వెళ్ళినాడు. అక్కడ ప్రజల మన్నన అందుకొంటూ జీవించటమేకాక ఆధ్యాత్మిక సాధనలో కూడా శ్రీస్వామి అనుగ్రహంతో ఉన్నతస్థాయికి చేరగలిగినాడు. శ్రీస్వామి ఇచ్చిన ఉంగరము అమ్మి చోళప్ప ఆ వచ్చిన ధనంతో శ్రీస్వామి అనుగ్రహంతో కృష్ణప్ప వివాహము, తన గృహమును పునర్ నిర్మాణము చేసినాడు.

శ్రీస్వామి సమర్థుల అనుగ్రహం పొందిన వారిలో బాబాసాహెబ్ ఘోర్పడే కూడా వున్నారు. వీరు బరోడా సంస్థానములో చిన్న ఈనాముదారుగా వున్నారు. వీరికి బ్రిటిష్ ప్రభుత్వం వారిచే మహారాష్ట్రలో కొల్హాపురం సమీపానగల దత్తవాడ్, దాన్‌వాడ్, సప్తసాగర గ్రామములు–అహమ్మద్ నగర జిల్లాలో – హింగిణి అనే గ్రామము ఈనాముగా లభించినవి. ఇతని పూర్తిపేరు రామచంద్ర వెంకటరావు ఘోర్పడే. అందరు బాపూసాహెబ్ అని పిలిచేవారు. ఇతని భార్యపేరు గంగాబాయి. వీరికి సంతానము లేక విచారగ్రస్తులై వుండేవారు. శ్రీస్వామి సమర్థులను గురించి తెలుసుకొని వారిని శరణువేడితే ఫలితము కనిపించగలదని విశ్వసించి, తనవద్ద పనిచేస్తున్న వేణిమాధవ వైద్య అనే లేఖకుని తన తరఫున శ్రీస్వామికి తన కోర్కెను నివేదించి ప్రార్థించమని పంపినారు. అతను అక్కల్‌కోట చేరి శ్రీస్వామిని దర్శించి భక్తిగా సేవించి తాను వచ్చినపని నివేదించినాడు. శ్రీస్వామి ప్రసన్నులై "సంతానము కావలసిన ఆ దంపతులను "నిత్యము 'హరివంశము' చదివించుకొని విను"మని చెప్పినారు. వారు శ్రీస్వామి ఆజ్ఞను శిరసావహించి



నారు. శ్రీస్వామి అనుగ్రహంతో వారు అనతి కాలములోనే పుత్రసంతానాన్ని పొంది మిక్కిలి సంతోషించారు. అతను స్వయంగా వచ్చి శ్రీస్వామిని సేవించకుండా యితరుల ద్వారా తన కోరికను శ్రీస్వామికి నివేదించినా ఆయన ఆశీస్సులు పొందినాడు. వారికి శ్రీస్వామిమీదగల విశ్వాసమునకు అది ఫలితము. ఇతను తన కుమారునికి 'బాబాసాహెబ్' అని పేరుపెట్టినాడు. వారు శ్రీస్వామిని మానసికంగా నిత్యం పూజించుకొనేవారు.

అలాగే ఇండోర్ రాజైన తుకోజీహోల్కర్ అతని కుమారుడు యువరాజు బాలాసాహెబ్ నందహోల్కర్ వచ్చువేళకు శ్రీస్వామివారు అక్కల్‌కోటలోనే కర్ణాకర్ అనే భక్తుని ఇంటి ఆవరణలో ఒక మర్రిచెట్టు క్రింద కూర్చుని వున్నారు. ఆ రాజు, అతని కుమారుడు శ్రీస్వామిని చేరి వారికి పాదాభివందనములు చేసిరి. ఆరాజు శ్రీస్వామిని చూస్తూ "ఓ సద్గురుమౌళీ! పూజ్యులైన నా తండ్రి, తల్లి అహల్యాబాయి యొక్క పూజాఫలము వలన, వారి ఆశీస్సుల వలన నేనిదివరకు దేశ సంచారం చేస్తూ మౌంట్ అబూ క్షేత్రాన్ని దర్శించాను. ఆ సమయంలో మిమ్ములనను ప్రథమంగా దర్శించే భాగ్యం కలిగినది. ఈరోజు మరల తమ దర్శనభాగ్యం ఇక్కడ కలిగినది. ఈ రెండుసార్లు మిమ్ములను దర్శించిన దర్శనాలు నా జీవితమంతటికి మకుటాయమానమైన భాగ్యాలు. మహాదేవా! దయతో మమ్ము సదా అనుగ్రహించండి అని తిరిగి పాదాభివందనం చేసినాడు. శ్రీస్వామి మందహాసం చేసి "మీ రాజమందిర ప్రాకారములో మామిడిచెట్టు కలదా?" అని అడిగెను. దానికి ఆ రాజావారు "మహారాజా! మీ కృపవల్ల రెండు మామిడిచెట్లు మా ప్రాకారములో కలవని" జవాబు చెప్పెను. అంత శ్రీస్వామి సమర్థులు తన తలపైన టోపీ తీసి ఇండోర్ మహారాజుపైన విసరెను. ఆ రాజావారు దానిని మహాప్రసాదముగా తీసుకొనెను. శ్రీస్వామి వారికి మెడలో పూలదండలు వేసి, మధురమైన మిఠాయి పెట్టిరి. శ్రీస్వామివారు ప్రసాదమును ఇచ్చినారు. తుకోజి హోల్కర్ రాజావారు అక్కడివారికి, బ్రాహ్మణులకు, అన్నసమారాధన చేసి శ్రీస్వామికి అనేక కానుకలు సమర్పించి శ్రీస్వామివారి దీవెనలు అందుకొని వెళ్ళిపోయినారు.

శ్రీస్వామి సమర్థులు మౌంట్ అబూ వెళ్ళినట్లు అక్కడివారికి ఎవరికీ తెలియదు. రాజావారి మాటలలో అవి తెలుసుకొని ఆశ్చర్యపోయిరి. దీనినిబట్టి

శ్రీస్వామి సమర్థ తన భక్తులకు ఎచ్చటనైనా దర్శనమీయగలరు అని భావించిరి. మహాయోగులకు దూరము భారముకాదు. సంకల్పముచేత కొండలు, సముద్రములు దాటగలరు. వారు సిద్ధసంకల్పులు.

మనదేశ చరిత్రలోనే ప్రఖ్యాతమైన సిపాయిల తిరుగుబాటు ముగిసిన రోజులు అవి. నాడు మన దేశాన్ని పరిపాలిస్తున్న ఆంగ్లేయులను పారద్రోలి స్వాతంత్ర్యాన్ని సాధించుకోవాలని మన దేశ సైనికులు చేసిన ఆ తిరుగుబాటును ఆ తెల్ల ప్రభుత్వం అణచివేసింది. అంతేకాదు, ఆ తిరుగుబాటులో ప్రచ్ఛన్నంగా గాని, లేక బాహాటంగా గాని పాల్గొనినా, లేక మనదేశ సైనికులకు సహకరించినా వారిపై ఆంగ్ల ప్రభుత్వం కక్షసాధింప నారంభించింది. అట్టి దౌష్ట్యానికి గురియైన వారిలో జమాఖిండికి రాజైన అప్పాసాహెబ్ పట్వర్ధన్ ఒకరు. అతనిని రాజ్యభ్రష్టుని చేసి ఆ రాష్ట్రాన్ని ఆంగ్ల సామ్రాజ్యంలో విలీనం చేసుకోవడమేగాక అతనిని వెంగుర్ల అనేచోట ఖైదీగా వుంచారు. అతనికి ఆప్తుడైన హిరాలీకర్ ప్రభుత్వోద్యోగి, సమర్థుల భక్తుడు. అతడు వెంటనే శ్రీస్వామి సన్నిధిచేరి వెనకటి తన యజమానియైన అప్పాసాహెబ్‌ను చెరసాలనుండి విడిపించి తిరిగి అతనికి రాజ్యం ప్రసాదించమని ప్రార్థించాడు. శ్రీస్వామి తదేకంగా జమాఖిండి దిక్కుగా చూచి, ఆ దిక్కునుండి యెవరినో పిలుస్తున్నట్లు భంగిమచేసి ముమ్మారు “నీవు బయటకు రా!” అని హూంకరించారు. చిత్రం, మరుసటిరోజే ఆంగ్లేయులు అప్పాసాహెబ్‌ను చెరసాల నుండి విడిపించి తిరిగి అతనిని జమాఖిండి సింహాసనంపై అధిష్ఠింప చేసిరి.

విద్యాసాగరా! రాజులు, రాజాధిరాజులు, యోగిరాజును సేవించి పొందిన ఫలితములను విన్నావుకదా! రాబోవు అధ్యాయములో మరికొందరి రాజుల గురించి చెపుతాను. ఇప్పుడు శ్రీస్వామి ప్రబోధములు ఎలా వుంటాయో తెలుసుకొందాము.

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరువది నాలుగవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ దత్తావతార
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరువది ఐదవ అధ్యాయము

విద్యాసాగరా!

సద్గురువుల ప్రబోధములు మనస్సునకు గుచ్చుకొనేలాగా వుండి, ఎన్నడూ మరచిపోని విధముగా మార్పు చెందేందుకు ఉపయోగపడతాయి. గత అధ్యాయములో రాజామాలోజీరావునకు చేసిన ప్రబోధము అలాంటిదే. సద్గురువులు ధర్మప్రబోధకులు. వారి ఆచరణ – వారి అవతారం అందుకొరకే. శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోటలో వున్న సమయములో దేశమంతా అరాచకముగా వుండేది. స్వదేశీయులైన రాజులు విదేశీయులతో యుద్ధములో ఓడిపోయినారు. అందువలన విదేశీయులు సైనిక పరిపాలన ప్రారంభించినారు. హిందువులను – మహమ్మదీయులను విభజించి పాలించాలనే ఉద్దేశ్యముతో విదేశీయ పాలకులు మత వైషమ్యం కలిగించేవారు. తమ మతమును అభివృద్ధి చేయబూనినారు. ఆ సమయములో ధర్మమునకు ఎంతో హాని జరిగినది. శ్రీస్వామి సమర్థులు శ్రీ గజానన్ మహరాజ్, శ్రీ సిద్ధారూఢస్వామి, శ్రీ తాజుద్దీన్ బాబా – శ్రీ మాణిక్య ప్రభువులు, శ్రీ షిరిడి సాయిబాబా మున్నగువారు అందరూ సంఘమున సకల మత సామరస్యమునకు – సంఘములోని అన్ని జాతుల సమైక్యతకు – సంఘీభావమునకు – తమ లీలలతో, ప్రబోధములతో ఎంతో కృషిచేసి ధర్మమును – మతమును, ధార్మికులను రక్షించి కాపాడినారు. వీరిని అనేకులు రాజులు, రారాజులు ఆశ్రయించినారు. ఆఖరికి బ్రిటిష్ అధికారులు కూడ వారి శక్తిని గుర్తించి వారికి దాసులైనారు. వారి ప్రబోధములను




ఆచరించినారు. కావున జిజ్ఞాసీ! రా! మనము శ్రీస్వామి సమర్థుల ప్రబోధములను దర్శించుదాము అని చేతులు జోడించి –

"జగదీశా! యోగీశా! – సర్వభూతాధారా! సకల సంపూర్ణమైన ఈశ్వర తత్త్వము నీవే – నీ కరుణకై జగతిలోని సర్వభూతములు కైమోడ్చి నిన్ను నిరంతరము స్మరించుచుండును. నీవు మాబోటి వారిని రక్షించుటకై ఈ మాయా మానుష రూపమును ధరించినావు. ప్రకృతి – వికృతి – తత్త్వము – తత్త్వమూలము అంతా నీవే – సదా మాబోటి వారిని రక్షించి కాపాడి – సాధనలోని రహస్యములను విశదపరచి నీ తత్త్వమును తెలియజేసి నీలోనికి చేర్చుకొనుము. విముక్తిని ప్రసాదించు". అని ప్రార్థించి – శ్రీస్వామి లీలామృతమును శ్రీ నిత్యానందులిట్లు చెప్పసాగెను.

శ్రీస్వామి సమర్థులు తమ భక్తులకు గుణపాఠమును చిత్రవిచిత్రమైన రీతులలో నేర్పేవారు. ఒకసారి ఇద్దరు భక్తులు పోట్లాడుకుంటుంటే వారిలో ఎక్కువ ఉద్రేకపడుతున్నవాణ్ణి పిలిచి, వాని చేతిలో ఒక నల్లచీమను పెట్టారు. వాడు దాన్ని చూచి పోట్లాట మాని వెళ్ళిపోయినాడు. దాని అర్థం మానవుడుగూడా చీమలలాగా అన్యోన్యముగా సమైక్యతతో, సహకారాలతో జీవించాలని, వాదులాడుకోవడం తగదు అని తెలిపిరి.

ఒకరాత్రి భక్తులంతా కూర్చొని యుండగానే శ్రీస్వామి నిద్రపోయారు. నిద్ర గాఢంగా పట్టిందేమో గుర్రుపెట్టారు. గోవిందరావు అనే ఒక భక్తుడికి ఒక పెద్ద సందేహం కలిగింది. పరిపూర్ణుడైన యోగికి నిద్రలేదని శాస్త్రం చెబుతోందిగదా! శ్రీస్వామి మాత్రము ఇలా అకాలములో నిద్రపోతున్నారే అని అనుకొనుచుండగనే, అంత గాఢంగా నిద్రపోతూ గురకపెట్టే శ్రీస్వామి మరుక్షణమే కళ్ళు తెరిచి "ఒరేయ్ కంసాలీ! అటువంటిదేమీ లేదు!" అని మరుక్షణమే గుర్రుపెట్టి నిద్రపోయారు. వారు ఎలా వున్నప్పటికీ జాగరణలోనే వుంటారు. నిద్రకూడా ఎవరికో మేలు చేయడానికేగాని శరీర సుఖముకోసం కాదు.

అలాగే శ్రీస్వామికి నటనంటే అసలు గిట్టేదికాదు. కృత్రిమత్వమన్నా అంతే, శ్రీస్వామివారు గణపతిరావ్‌జోషి ఇంట్లో కూర్చొనియుండగా తిలకం, మాల, వీణ ధరించిన ఒక సాధకుడు సాధువు కబీరు సాంప్రదాయానికి



చెందినవాడు – భిక్ష కొచ్చాడు. అతడు పాట పాడుకొనుచు తిరుగుచున్నాడు, దాని చివర... "అని చెబుతున్నారు ఈ సాధువు" అన్న చరణముతో, సామాన్య ప్రజలు ఇతని వేషం, భాష చూచి అతడు గొప్ప సాధువని నమ్మి, సాష్టాంగ ప్రణామాలు చేయుచున్నారు. అతనిని శ్రీస్వామి చూస్తూనే కొన్ని భంగిమలతో సైగలతో ఈ సాధువు శీలంలేనివాడని వ్యక్తంచేశారు. అవి అక్కడ భక్తులకు అర్థం అయినాయి. శ్రీస్వామికి ఇటువంటి వారిని గురించి నోటితో చెప్పడము కూడా ఇష్టములేదు.

ఆ తరువాత కొంతకాలానికి విచారించినప్పుడు అందరికీ తెలిసింది. అతనికి ఒక ఇల్లాలితో అక్రమ సంబంధాలున్నట్లు! అందరు సాధువులు పరిపూర్ణమైనవారు కారు అని, వేష భాషలను చూచి మోసపోవద్దని, పరిశీలనచేత, అనుభూతులచేత, అనుభవములతోనే తరచి తరచి చూచి విశ్వసించాలని శ్రీస్వామి తెలియజేసినారు.

ఒక్కొక్కప్పుడు శ్రీస్వామి తన దర్శనార్థంగాని, పరీక్షించడానికిగాని వచ్చిన వేద పండితులతోను – సాధారణ ప్రజలతోను – రాజులతోను – సాధు సంతులతోను లేక నిరక్షరాస్యులైన పేద పల్లె ప్రజలతోను ఎవరికి తగినస్థాయిలో వారితో చర్చించేవారు.

ఒకరోజు అది 1870 సంవత్సరములో బొంబాయి నుండి ఒక బ్రహ్మచారి బాబా కొద్దిమంది శిష్యులతో అక్కల్‌కోట చేరాడు. వారు శ్రీస్వామిని దర్శించి పాదాభివందనములను చేసి కొంత సమయము వారితో గడిపి తరువాత తమకు ఏర్పాట్లు చేసిన బసకు చేరి, వంట చేసుకొంటూ తన శిష్యుడైన 'లఖ్ఖా'ను బెల్లం కొనుక్కొని రమ్మని బజారు పంపాడు. అదే సమయానికి చోళప్ప మఠంలో కూర్చునియున్న శ్రీస్వామి "ఆ వెధవ లఖ్ఖా నాకు పెట్టకుండా బెల్లం తింటున్నాడు" అంటూ చిన్న పిల్లలు తమకు ఎవరైనా పెట్టకుండా తింటే ఎలా మారాం చేస్తారో అలాగే మారాం చేయసాగిరి. శ్రీస్వామి మాటలలో ఎంత నిజముందో పరిశీలించే అవకాశం కలిగినందుకు సంతోషిస్తూ మంద్రేకర్ అను భక్తుడొకడు పరుగున బజారుకు వెళ్ళాడు. శ్రీస్వామి చెప్పింది అక్షరాల నిజమైంది. బ్రహ్మచారి బాబా శిష్యుడు లఖ్ఖా పెద్ద బెల్లంముక్క చప్పరిస్తూ

వారి వసతి గృహమువైపు వచ్చుచున్నాడు. మం[జేకర్ శ్రీస్వామి చెప్పిన మాటలను లఖ్ఖాకు చెప్పినాడు. వాడు పరుగు పరుగున వెళ్ళి శ్రీస్వామి పాదాలపైనబడి క్షమాపణ కోరినాడు. శ్రీస్వామి మారాము చేయడం ఆపి, వానిని చూచి మందహాసం చేసినారు. అపుడు వానికి గుర్తుకు వచ్చినది, బ్రహ్మచారి బాబా చెప్పిన మాటలు “దైవానికి నివేదన పెట్టకుండా ఏదీ తినకూడదు అని”. జిహ్వా చాపల్యాన్ని అరికట్టడం సాధకునికెంతో అవసరమని వారు చెపుతుండేవారు.

లఖ్ఖా మనస్సులో ఈ సంఘటన ద్వారా ఈ విషయం చాలా బలంగా నాటుకుపోయింది. జరిగినది తెలుసుకొని బ్రహ్మచారి బాబా చాలా ఆశ్చర్యపోయినారు. శిష్యులతో శ్రీస్వామి సద్గురుమూర్తి అని, అవతార పురుషుడు అని చెప్పి వంట అయిన తరువాత భోజనం తీసుకొని వెళ్ళి శ్రీస్వామికి తినిపించి నమస్కరించిరి. దేవునికి నైవేద్యం పెట్టకుండా – ఇతరులకు పెట్టకుండా, ఏమీ తినకూడదు అని వేద ప్రబోధం. అంతేకాదు సాధకులు జిహ్వా చాపల్యాన్ని అదుపులో పెట్టుకోవాలనే నియమముయొక్క ఆవశ్యకత అందరికీ తెలిసినది. అందరూ శ్రీస్వామి ప్రబోధనా విధానానికి వారియొక్క – సర్వజ్ఞత్వానికి ఆశ్చర్యపోయారు. అతనికి ఈ సన్నివేశం మరువరాని విషయం అయినది.

అక్కల్‌కోటలో గోపాల్ అనే మంగలి శ్రీస్వామికి క్షౌరం చేసేవాడు. తలగొరిగి, గోళ్ళు తీసేవాడు – ఆ మంగలి తాను తీసిన గోళ్ళను, వెంట్రుకలను, తాయత్తులలో పెట్టి బీద జనమునకు ఉచితముగా యిచ్చినాడు. శ్రీస్వామి శక్తిచేత అవి అద్భుతముగా పనిచేసేవి. ప్రజలు అనేక బాధల నుంచి రక్షింపబడటం వలన చాలామంది వాటికొరకు ప్రాకులాడేవారు. కొంత ధనమును దక్షిణగా యిచ్చేవారు. క్రమంగా అతనికి భక్తిశ్రద్ధలకంటే ధనవ్యామోహం కలిగినది. వాడు తాయత్తులను ఇవ్వడానికి రుసుమును పెట్టి ఇవ్వసాగినాడు. అతను ఈ విధముగా మారడంతోనే ఆ తాయత్తులు పనిచేయడం మానివేశాయి. క్రమంగా జనం వాటిని తీసుకోవడం మానివేశారు. ఈ సంఘటన ద్వారా శ్రీస్వామి భక్తి, శ్రద్ధ కలిగివుంటే అన్నీ సమకూరుతాయి. ధన వ్యామోహం, కీర్తికాంక్ష వుంటే అన్నీ క్షీణిస్తాయి అని తెలిపిరి.



## విద్యాసాగరా!

అక్కల్‌కోటలో మహీపతి రామచంద్ర అనే అతను వుండేవారు. అతనిని బాబా సబ్నీస్ అని పిలిచేవారు. శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోటకు వచ్చిన రెండవరోజు వీరి బావగారైన పాండురంగ పౌరాణిక్ – అతని సోదరి నీరాబాయి శ్రీస్వామికి ఆతిథ్యము యిచ్చారు. ఆ రోజున సబ్నీసు శ్రీస్వామిని దర్శించగనే "వీరు అక్కల్‌కోట వస్తారు అని పూర్వం మాణిక్య ప్రభువు చెప్పినారు. నీవుకూడా విన్నావుకదా!" అనగా దీక్షిత్ నాటినుండి శ్రీస్వామివారికి అత్యంత ప్రియమైన శిష్యుడైనాడు. శ్రీస్వామి అక్కల్‌కోట రాకమునుపు ఇతను మాణిక్య ప్రభువు యొక్క భక్తుడు.

ఒకసారి మాణిక్య నగరంలో శ్రీదత్త జయంతి, శ్రీ మాణిక్య ప్రభువు జయంతి ఉత్సవములు జరుగుచున్నాయి. ఆ ఉత్సవములకు అక్కల్‌కోట నుండి మహిపతి రామచంద్ర (బాబా సబ్నీస్) అతని స్నేహితులు బాపు దీక్షిత్, విశ్వనాథ్‌వైద్య కలసి వెళ్ళినారు. వీరికి మాణిక్య ప్రభువుల వారితో పరిచయం వుంది. వీరు వారిని అనేకసార్లు దర్శించినారు. వారిపై శ్రీ మాణిక్య ప్రభువు అనుగ్రహం వుండేది. ఒకరోజున శ్రీమార్తాండ దత్తావతార మాణిక్య ప్రభువులు దర్బారులో వున్నారు. కీర్తన జరుగుచున్నది. విశేష జనం వున్నారు. ఆ సమయంలో ఒక పెద్ద మెరుపు వచ్చినది. దానినుండి దివ్యమైన కిరణములు ప్రసరించినవి. వాని మధ్యలో ఒక దివ్యమైన ఆకారం ఆకాశం నుండి దిగివచ్చి ఆ ప్రాంగణములో నిలిచినది. ఆ ఆకారం చూచినంతనే శ్రీమాణిక్య ప్రభువులు అమాంతం లేచి వారి దగ్గరకు వెళ్ళి నమస్కరించిరి. ఆ ఆకారం చిరునవ్వు నవ్వి వారిని కౌగిలిలోనికి తీసుకొనినది. వారు ఇరువురు కౌగిలిలో కొద్దిసేపు ఉండిరి. శ్రీమాణిక్య ప్రభువులు వారిని తీసుకొనివచ్చి ఒక ఉచితమైన ఆసనమున కూర్చుండబెట్టిరి. శ్రీ మాణిక్య ప్రభువు శిష్యులు కొందరు వెంకమ్మగారి ఆధ్వర్యములో ఆ దివ్యపురుషుని అర్ఘ్యపాద్యములతో పూజించి, ఫలహారం యిచ్చి హారతులను యిచ్చిరి. ఆ సమయంలో అక్కడే ఉన్న బాబా సబ్నీస్‌దీక్షిత్, విశ్వనాథ వైద్యులవైపు చూచి శ్రీ మాణిక్య ప్రభువు బాబా సబ్నీస్‌తో "వీరు శ్రీస్వామి సమర్థులు, శ్రీదత్తావతారులు, కొలది కాలములో మీ గ్రామంలోనికి వచ్చి నివసింతురు" అని చెప్పిరి. అంతేకాదు ఈయనయే నీకు గురువు అని

చెప్పినారు. అంత శ్రీస్వామి సమర్థులు శ్రీమాణిక్య ప్రభువుల దగ్గర సెలవు తీసుకొని వారినందరిని ఆశీర్వదించి అదృశ్యులైనారు. ఈ విషయం బాబా సబ్నీస్ ద్వారా అందరికీ తెలిసినది.

శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోట వచ్చినప్పటి నుంచి ఈయన శ్రీస్వామిని సేవించుచు వుండేవాడు. శ్రీస్వామి తొలుత గోనె పట్టాలపైన నిదురించేవారు. ఎక్కడ అంటే అక్కడ కూర్చొనేవారు. బాబా సబ్నీస్ కృషితో భక్తితో వారికి పట్టుపాన్పు తయారైనది. తరువాత శ్రీస్వామి దానిపైన పడుకొనేవారు. ఒక ఆసనము కృష్ణాజినము దర్భలతో తయారు చేసినది, శ్రీస్వామి ఎక్కడికి వెళ్ళినా దానిని వేసి కూర్చొనేవారు. ఈ విధముగా బాబా సబ్నీస్ అచంచలమైన భక్తి, విశ్వాసాలతో శ్రీస్వామి సమర్థులను సేవించేవాడు. తాను చూచిన మాణిక్యనగర లీలను అందరికీ వినిపించేవాడు. కాని, అతని బావ పాండురంగ పౌరాణిక్‌కు శ్రీస్వామియందు భక్తి వుండేది. కాని అది దృఢముగా వుండేదికాదు. వారు మహత్తులను గుర్తించినారు. కాని, సాక్షాత్తు దత్తావతారంలోని భగవత్ స్వరూపులు అని గుర్తించేవారు కాదు. తాము గొప్ప పురాణవేత్త అని గర్వం కూడా వుండేది. అతిచక్కని నైపుణ్యంతో ఇతను పురాణ కథలను చెప్పేవారు. ఇతని పురాణాన్ని వినడానికి శ్రీస్వామి సమర్థులు కూడా వెళ్ళేవారు. ప్రతిరోజూ క్రమం తప్పకుండా ఈ కార్యక్రమము సాగుతుండేడి.

శ్రీపాండురంగ పౌరాణిక్‌నకు తన బావమరిది బాబా సబ్నీస్ శ్రీస్వామి సమర్థులకు పట్టుపానుపును అమర్చడం, వారు దానిపైన పవళించడము నచ్చలేదు. దానిపైన తన అయిష్టతను దాచుకోలేకపోయినాడు. ఒకనాడు పురాణము చెప్పుచు సందర్భోచితముగా "నిజమైన సాధువులకు పట్టుపాన్పులు అవసరం లేదన్నాడు" ఇది విని శ్రీస్వామి సమర్థులు తాత్కాలికంగా వూరుకొన్నారు. కొన్ని రోజుల తరువాత ఒక సాయంత్రం శ్రీస్వామి ఈ పౌరాణిక్‌ను తీసుకొని 'కడగాం' సమీపంలోని అడవికి వెళ్ళినారు. అక్కడ చలి తీవ్రముగా వుంది. సూర్యాస్తమయం అయ్యేసరికి చలి దుర్భరమైంది. చిరునవ్వుతో శ్రీస్వామి అతనిని చూస్తూ అక్కడున్న బండమీద వాలి నిశ్చింతగా నిద్రపోయారు. ఒంటినిండా గుడ్డలు వుండికూడా పౌరాణికుడు కాళ్ళు పొట్టలో పెట్టుకొని పడుకున్నాడు. కౌపీనం తప్ప మరో ఆచ్ఛాదనే లేని శ్రీస్వామి కఠినమైన



నేలమీద నిశ్చింతగా నిద్రపోతున్నారు. కొద్దిసేపు గడిచేటప్పటికి చలికి తట్టుకోలేక శ్రీస్వామిని నిద్రలేపటానికి ధైర్యంచాలక, పౌరాణిక్ లోపల తనను చలినుండి కాపాడమని శ్రీస్వామికి మొరపెట్టుకొన్నాడు. తక్షణమే శ్రీస్వామి నిద్రనుండి లేచి "ఏమి పౌరాణిక్! మా పట్టుపాన్పు ఎలా వున్నది చూచినావుకదా!" అన్నారు. అప్పటికిగాని శ్రీస్వామి చెప్పదలచిన విషయం అతనికి అర్థంకాలేదు. తాను అహంకారముతో పురాణము చెప్పుచున్నప్పుడు అనిన మాటలకు శ్రీస్వామి చేసిన ఈ లీలలను అర్థం చేసుకొని సిగ్గుపడి, శ్రీస్వామి పాదములపై వాలి క్షమించమని వేడినాడు. శ్రీస్వామి అనుగ్రహంతో అతని శిరముపైన తన హస్తము వుంచి దీవించినారు. ఆశ్చర్యముగా శ్రీస్వామి స్పర్శతో అతనికి చలిబాధ తగ్గినది. శరీరము వెచ్చగా మారసాగినది. దానికి అతను మరింత ఆశ్చర్యపోయెను. శ్రీస్వామి పకపక నవ్వినారు. వాతావరణం చలిగా నుండినా అతనికి ఏమీ బాధ కలుగలేదు. తరువాత ఇరువురు తిరిగి వచ్చినారు. సబ్నీస్ సమర్పించిన పట్టు పరుపును, కొండమీద బండనూ సమానంగా అనుభవించిన శ్రీస్వామి "మాకు అంతా ఒక్కటే!" అని తెలిపినారు. అంతేకాదు, భక్తిలోను, సాధనలోను వుండు పౌరాణికుని సత్పురుషుల నిందలతో ఆధ్యాత్మిక జీవితానికి విఘాతం కలగకుండా కాపాడినారు. అతనికి ఈ గుణపాఠం అతనిమీద ప్రేమవల్లనే కల్పించినారు.

విద్యాసాగరా! మహాత్ములకు గోనె సంచులైనా, పట్టుపరుపులైనా నేలపైన అయినా, నీటిలోనైనా ఒక్కటే. ఒకప్పుడు కాశీక్షేత్రంలో మణికర్ణికా స్నానఘట్టములో వున్న శ్రీ త్రైలింగ శ్రీస్వామివారు నీటిపైన పడుకొనే రోజుల తరబడి వుండేవారు. అందువలన మహాత్ములకు ఏదీ వైభోగము కాదు. అవి భక్తులను సంతోషపెట్టుటకే అంగీకరింతురు.

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరువది ఐదవ అధ్యాయము*** *సంపూర్ణము*



ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ గురుదేవదత్త
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరువది ఆరవ అధ్యాయము

విద్యాసాగరా!

మహాత్ముల దర్శనం అనేక జన్మలలో చేసుకొన్న పుణ్యఫలం వలన మాత్రమే కలుగుతుంది. సద్గురువును శుద్ధమైన, నిర్మల భక్తితో సేవించితే కలిగేది జ్ఞానము – విజ్ఞానము – జీవన్ముక్తి. అట్లుకాక దానిని స్వార్థముతోను, కోరికలతోను నిర్వర్తించితే ఆ స్వార్థము, ఆ కోరికలు – సేవకంటే ఎక్కువైపోయి అసలు సేవకు దూరం అవుతారు. గాన సద్గురువుల దగ్గర చేరినవారు – వారి అనుగ్రహం పొందినవారు సర్వవేళలలోను జాగరూకతగా నుండవలెను. లేనిచో జ్ఞానస్వరూపుని సేవించుచు అజ్ఞానాంధకారములో మునిగిపోగలరు. గాన నీవు జాగ్రత్తగా నీ సాధనను కొనసాగింపవలెను.

ఇదే విధముగా శ్రీస్వామి సమర్థుల సేవ లభించినవారు చోళప్ప – సుందరాబాయి – బాలప్పలు. మొదటి ఇద్దరికి లభించని వారసత్వం బాలప్పకు లభించినది. వారి సేవలలోని వ్యత్యాసం నీవు రాబోవు అధ్యాయములలో తెలుసుకోగలవు.

శ్రీస్వామి సమర్థుల సేవలో చోళప్ప తరువాత వచ్చినవారు శ్రీమతి సుందరాబాయి. ఈమె షోలాపురం నివాసిని. చిన్న వయస్సులోనే ఆమెకు భర్త చనిపోయినాడు. ఒకప్పుడు ఆమెకు కాలిలో పుండు లేచినది. దానివలన కాలు వాచిపోయి ఎన్ని మందులు వాడినా తగ్గలేదు. షోలాపురంలో శ్రీస్వామిని గురించి చెప్పుకొనుట విని శ్రీస్వామిని దర్శించి తన బాధను నివారించుకోవాలని



అక్కల్‌కోట చేరినది. శ్రీస్వామి సమర్థులను దర్శించి వారికి పాదాభివందనం చేసి తన బాధను చెప్పుకొనినది. అలా కొంతకాలం గడిచేసరికి శ్రీస్వామి దర్శనం వలన వారి అనుగ్రహంతో ఆమె కాలి గాయం వాపు తగ్గిపోయినది. దానికితోడు రోజూ చూచే శ్రీస్వామి లీలలతోను వారిపైన శ్రద్ధాభక్తులు ఏర్పడి వారి సేవలోనే వుండిపోయినది. అప్పటికే శ్రీస్వామిని దర్శించటానికి అనేక దూరప్రాంతముల నుండి భక్తులు వచ్చుచుండెడివారు. వారిలో పేదవారు – ధనవంతులు – రాజులు, గొప్ప సాధువులు – ఇంగ్లీషువారు ఇలా అనేకులు వుండేవారు. కొందరు రోజులకొలది శ్రీస్వామివారి సన్నిధిలో గడిపేవారు. వారికి వసతులు – భోజనములు – శ్రీస్వామి వారికి నిత్యసేవలలో చోళప్పకు సమయం చిక్కేదికాదు. వారికి కొందరు సహాయం చేసేవారు. చోళప్ప పరివారం యశోబాయి, కృష్ణప్ప, శ్రీపాదభట్ బాబా సబ్నీస్, యాదవ్ – మున్నగువారు. అప్పుడప్పుడు సలహాలనిచ్చి, ఆర్థిక సహాయం చేయువారు ఎందరో వుండిరి. అయినా శ్రీస్వామికి దగ్గరగా వుండి సేవలను చేయటం కష్టంగా వుండేది. ఆ సమయంలో ఆ బాధ్యత సుందరబాయి తీసుకొనినది. ఆ కారణమున ఆమె చేసిన సేవలను చూచి చోళప్ప కొన్ని పనులు ఈమెకు అప్పచెప్పసాగినాడు. తాత్కాలికంగా కలిగిన భక్తివల్ల ఆమె తనను సేవిస్తున్నా ఆమె అసలు స్వభావం అంత భక్తితో కూడినదికాదని శ్రీస్వామికి తెలుసు. వారు ఎప్పుడో గ్రహించినారు. వారు ఒకసారి చోళప్పను “జాగ్రత్త! కొన్నాళ్ళకు నీ స్థానాన్ని కూడా ఈ విధముగా ఊడగొడుతుంది. కుట్రచేసి నిన్ను నా సేవనుండి తొలగించి తానే నా వ్యవహారములను చూచుకొంటుంది” అని హెచ్చరించినారు. కాని చోళప్ప ఆ మాటలను నమ్మలేదు. రానురాను శ్రీస్వామివారి అన్నిపనులు సుదరబాయి చూడసాగినది. వారికి ముఖ్య పరిచారికగాను, ఆంతరంగికురాలిగా మారింది. శ్రీస్వామి రాజభవనంలో వున్నా – చోళప్ప ఇంటిలోవున్నా జోషిమఠం (వటవృక్ష మందిర్) దగ్గరవున్నా ఈమె వెంట వుండి ఆయన అవసరాలు చూస్తూ వుండేది. శ్రీస్వామి ఎక్కడికి వెళ్ళినా జనం వెంట వుండేవారు. రానురాను వీరు ఎక్కడికి వెళ్ళినా భజన బృందం భక్తులు వెంట ఉండేవారు వారందరికి సుందరబాయియే నాయకత్వం వహించేది. కొంతకాలము తర్వాత శ్రీస్వామి దర్శనమునకు ఎవరు వచ్చినా ముందుగా సుందరబాయిని ఆశ్రయించవలసి వచ్చేది. అందువలన ఈమె శ్రీస్వామి పరివారంలో ప్రముఖస్థానాన్ని అవలీలగా ఆక్రమించి కీలకమైన

 

వ్యక్తిగా మారింది. చివరకు శ్రీస్వామి తరఫున కానుకలను తానే స్వీకరించేది. భక్తులుకూడ ఈమెకిస్తే శ్రీస్వామికి యిచ్చినట్లుగానే తలంచేవారు. శ్రీస్వామికూడా భక్తులు తమకిచ్చిన కానుకలు ఎప్పుడూ ప్రక్కనే వున్న సుందరబాయికి అందిస్తుండేవారు. దానితో ఈమెకు అహంకారం కలిగినది. సహజంగానే దురాశాపరురాలు. దానికితోడు అహంకారం, పేరాశ కలిగి, ఈమెలోనుండి బయటకు వచ్చి విశ్వరూపం దాల్చినవి.

అందువలన క్రమక్రమంగా ఆమె శ్రీస్వామి సేవలో కూడా ఎంతో నిర్లక్ష్యము – అశ్రద్ధ – అగౌరవము చూపసాగినది. శ్రీస్వామివారికి భక్తులు సమర్పించిన విలువైన వంటకాలు తనకు డబ్బిచ్చిన వారికి ముట్టజెప్పి, పాచిపోయిన, చల్లారిపోయిన పదార్థాలు, రొట్టెలు ఆయన భోజనంలో పెట్టసాగినది. ఈమెకు ఇది కొంచెము కూడా అన్యాయమని అనిపించలేదు. పైగా భక్తులను, అక్కడి సేవలకులను కసురుకొని, విసుక్కునేది, కేకలు వేసేది. ప్రతి చిన్నదానికి అరచి, కేకలు పెట్టేది.

ఒకసారి సుందరబాయి 'భజరంగ్' అనే భక్తుడ్ని కసురుకుని తిట్టింది. వాడు ఎదురుతిరిగి ఆమెను అనరాని మాటలతో దూషించాడు. దానికి ఆమె ఎంతో రోషంతో ఆత్మహత్య చేసుకుంటానని బావిదగ్గరకు వెళ్ళింది. ఈ విషయం తెలిసిన శ్రీస్వామి సమర్థులు వెంటనే బావిదగ్గరకు వెళ్ళి ఆమెకు నచ్చజెప్పి తీసుకువచ్చారు. అప్పటినుండి అందరికీ సుందరబాయిని చూస్తేనే ఒకవిధమైన భయం కలిగేది, అందువలన ఆమె వ్యవహారంలో ఎవరూ కల్పించుకొనేవారు కారు.

శ్రీస్వామి ఇవేవీ పట్టించుకోనట్లు కనిపించినా ఆమెను గాఢంగా హెచ్చరించడానికి ఆమె ఒకరోజు తాను శ్రీస్వామి సేవలో కూడబెట్టివున్న ధనం గురించి గర్వంగా తలంచుకొంటున్న సమయంలో శ్రీస్వామి చోళప్పకేసి చూస్తూ "ఒరే చోళప్పా! సేవకుడవైన నీవు యింతలోనే నన్నుకూడా శాసించగల నవాబు వయ్యావే!" అని మందలింపుగా అన్నారు. చోళప్ప తప్పేమో అర్థంగాక, భయంతో తాను ఏదైనా పొరపాటు చేస్తున్నానేమోనని, అందులకే శ్రీస్వామి ఇలా అంటున్నారేమోనని వణికిపోయాడు. శ్రీస్వామితో "దేవా! నా పొరపాటు ఏమైనా వుంటే సెలవివ్వండి, సరిచేసుకుంటాను" అని చేతులు జోడించినాడు.



శ్రీస్వామి దానికి ఏమీ సమాధానం యివ్వలేదు. సుందరబాయి మాత్రం శ్రీస్వామి చోళప్పను మందలించుచున్నారు అనుకొనినది. దాంతో మరింత విజృంభించి రాజామాలోజీరావు భార్యకు ఏవేవో చాడీలు చెప్పినది. అవన్నీ ఈమె చెప్పే విధానంతో రాణిగారు నమ్మి రాజామాలోజీరావుతో చెప్పి చోళప్పను తప్పించి సుందరబాయికే అధికారం అందించినది. శ్రీస్వామి చోళప్ప గృహంలో మొదట భోజనంచేసి, నివాసం ఏర్పాటు చేసుకొన్నప్పుడు శ్రీస్వామివారి ఖర్చును మహ్మద్ ఆలీ అనే మహమ్మదీయుడు ఇచ్చేవాడు. ఆ తరువాత రాజామాలోజీరావు తన సంస్థానం నుండి పంపుచూ వుండేవారు. అది క్రమ క్రమంగా చోళప్పను శ్రీస్వామిని సేవించే రాజోద్యోగిగా మార్చినది. సుందరాబాయి ప్రమేయముతో అదికాస్తా పోయినది. అధికారికంగా సుందరబాయి ప్రధాన సేవకురాలిగా నియమించబడినది. ఇక ఆమె అహంకారానికి హద్దులేకుండా పోయినది. శ్రీస్వామి సేవలో సంపూర్ణ అధికారం లభించిన తర్వాత శ్రీస్వామి ఆమెనుండి అల్పమైన సేవలను మాత్రమే అంగీకరించి ఆమెకు ఏవిధమైన ప్రాముఖ్యత యివ్వకపోయినారు. ఇది జరగడానికి కొలదిరోజుల ముందే బాలప్ప అనే భక్తుడు శ్రీస్వామి సమర్థులను దర్శించి అక్కడే వారి సేవలో వుండగా చోళప్ప వానిని సుందరబాయికి సహాయకుడిగా వుండమని కోరినాడు. క్రమక్రమంగా బాలప్పను సుందరబాయి శ్రీస్వామి సేవలో వుంచి తాను వేరే పనులు చూచుకోసాగినది. అధికార మార్పిడి జరిగిన తరువాత శ్రీస్వామి అన్ని సేవలు ఎక్కువగా బాలప్పతోనే చేయించుకొనేవారు. ఒక విధముగా స్వార్థమైన కోరికలతో శ్రీస్వామి దర్శనానికి వచ్చే భక్తులకు ఈమె పెద్ద అడ్డుగా వుండేది. శ్రీస్వామి ఆమెను వారించక తమ ఆధ్యాత్మిక శక్తికి ఒక దిష్టిబొమ్మగా వుంచినారు.

భక్తులు శ్రీస్వామితో మాట్లాడాలన్నా, చూడాలన్నా, వారిని ఇంటికి తీసుకొని వెళ్లి భిక్ష ఇయ్యాలన్నా, ఇతర గ్రామస్థులు తమ గ్రామములకు తీసుకొని వెళ్ళాలన్నా ఈమె అనుమతి ముందు పొందవలసి వచ్చేది. చోళప్ప ఇది జరిగిన తరువాత కూడా రోజూ శ్రీస్వామిని దర్శించేవాడు. అతని కుమారుడు కృష్ణప్ప శ్రీస్వామి దయతో అల్లుడు అయిన శ్రీపాదభట్‌లు మాత్రం శ్రీస్వామికి సన్నిహితంగా వుండి సేవించేవారు. వీరు సుందరాబాయిని లెక్కచేసేవారుకాదు. ఒకరోజున శ్రీస్వామి చోళప్పతో "ఏమిరా, నీవిలా మౌనంగా ఊరుకుంటే

నీకు రావలసిన పంటంతా పోతుందే? చూస్తూ వూరుకుంటావేమిటి?" అన్నారు. అతను నమస్కరించి "మీ దయ" అన్నాడు. కొద్దిరోజుల తరువాత భక్తులందరికి ఈమె వ్యవహారములు, ఇతరులతో వ్యవహరించిన తీరు చాల ఇబ్బంది కలిగించసాగినది. దానితో శ్రీస్వామికి ప్రారంభము నుండి వున్న భక్తులు చింతోపంత్‌తోల్, పాండురంగ పురాణిక్ - రాజాజ్యోషి - బాబాసబ్నీస్ మున్నగువారు మెల్లగా మాలోజీరావు దృష్టికి తెచ్చినారు. మాలోజీరావ్ తాను చేసిన పనికి మనస్సులో బాధపడి అందరి అంగీకారంతో బాలప్పను శ్రీస్వామి సేవకుడిగా నియమించుతూ, సుందరాబాయిని తప్పించినారు. అయినా ఈమె అమాయకులైన భక్తులనుండి డబ్బు గుంజుకోవటం మానలేదు. ఒకరోజున ఆమెను శ్రీస్వామి చెప్పుతో కొట్టారు. అయినా ఆమె తన వైఖరి మార్చుకోలేదు. ఆమెలో అంత త్వరగా మార్పురాదని తెలుసు. అయినా ఆమెలోని ధనాశను పూర్తిగా నిర్మూలించాలి, అపుడుగాని ఆమెకు భక్తి కుదరదు అని శ్రీస్వామికి తెలుసు. కొలదికాలము గడచిన తరువాత ఆమె దుశ్చేష్టలకు విసిగిన భక్తులు అందరూ సమావేశమై ఆమె చర్యలను తీవ్రముగా వ్యతిరేకించి మమల్తాదారు (మేజిస్ట్రేట్)కు, మరియు పోలీసు ఆఫీసర్‌కు ఫిర్యాదు చేసినారు. ఆ అధికారులిద్దరూ కూలంకషంగా విచారణ జరిపి రాజుగారి అనుమతితో ఆమె నేరస్థురాలని తీర్మానించి, ఆమెను శ్రీస్వామి సేవనుండి పూర్తిగా తొలగించినారు. ఆమె కూడబెట్టిన పాపపు సొత్తునంతటిని జప్తుచేశారు. దానితో ఆమెకు పట్టిన ధనార్జన అనే దయ్యము వదిలింది. పేదరాలిగా జీవించవలసి వచ్చింది. ఆ కష్టజీవితం ఆమెలోని భక్తిని, శ్రద్ధను మేలుకొలిపి తప్పులకు పశ్చాత్తాపం చెందే మనస్సును ఇచ్చింది. తత్ఫలితంగా తిరిగి నిజమైన భక్తురాలిగా మారింది. కాని శ్రీస్వామికి దగ్గరగా చేరలేకపోయింది. అనంతరకాలములో తీవ్రమైన బాధతో జీవించింది. చివరకు ఒక్కసారి శ్రీస్వామికి అన్నం తినిపించే భాగ్యం కలిగినది. దానికే ఆమె అమితమైన ఆనందముతో, భక్తితో జీవించినది.

విద్యాసాగరా! చూచితివికదా! సుందరాబాయి కథను. ఎందుకంటే ఆమెకు సుందరమైన పేరు వున్నా సుందరమైన పనులు చేయలేదు.

సహజంగా, సుందరమైన రూపం వుండేవారి మనస్సు సుందరముగా వుండదు. అనేకమైన లోపాలు వుంటాయి. కొందరికి సుందరమైన రూపం



వుండదు. కాని వారి కార్యములలో సుందరత వుంటుంది. కాని వారిలోనూ కొన్ని లోపాలు వుంటాయి. సుందరమైన మనస్సు వుండి కూడా సుందరమైన భావములు, సంకల్పములు లేకపోతే – ఎంత సుందరత వున్నా నిరుపయోగం. అందులకే సాధకుడు రూపసుందరుడు కాకపోయినా, భావ సుందరుడు – సంకల్ప సుందరుడు అయితేనే సత్యం – శివం – సుందరంను దర్శించగలరు. లేనిచో సద్గురువు సేవ లభించినా ఇలాగే జరుగుతుంది.

సద్గురుడు తన అభయహస్తాన్ని ఎప్పుడూ ముందుకు చాచి వుంచుతాడు. శిష్యుడే దానిని గట్టిగా పట్టుకోవాలి. వారి సహకారంతో గమ్యం చేరుతాడు. ఇహ సంబంధమైన కోరికలతో సద్గురువును చేరినవారు వారి చేతిని మధ్యలో వదిలి కోరికలవెంట పరిగెడతారు. తమ సుఖంకోసం గురువులను వదిలివేస్తారు. కాని చివరకు ఆ గురు స్వరూపాల అనుగ్రహంతోనే తరించుతారు. ఇదే గురుతత్త్వములోని విచిత్రమైన విశిష్టత అని తెలిపినారు.

మరల నిత్యానందులవారు విద్యాసాగరునితో నాయనా! ఈ అధ్యాయం చివరిలో శ్రీస్వామివారి మరొక విచిత్రలీలలను తెలుపుతాను వినుమని చెప్పసాగిరి. అది 1857వ సంవత్సరము. శ్రీస్వామివారు అక్కల్‌కోటకు వచ్చిన కొలది కాలమునకే జరిగిన సంఘటన. కొడక్ ఇండియా లిమిటెడ్ అను ఫొటో కంపెనీవారు బొంబాయిలో క్రొత్తగా తమ సంస్థను స్థాపించిరి. దానికి విశేషముగా ప్రచారము చేయవలెనను తలంపుతో కొందరు ప్రముఖ వ్యక్తుల ఫొటోలు అందముగా తీసి వాటి ద్వారా ప్రచారం సాగిస్తే తమ కంపెనీకి అభివృద్ధికి రాగలదని భావించిరి. మంచి నేర్పుగల పనివారలను ప్రముఖులవద్దకు పంపిరి. అప్పటికే మహారాష్ట్రలోను, కర్ణాటకలోనూ, నిజాం రాష్ట్రములోనూ విశేషముగా జనులు శ్రీస్వామివారి లీలలను, మహిమలను చెప్పుకొనుచున్నారు. మరియు కొన్ని పత్రికలు శ్రీస్వామివారి అద్భుతాలను గురించి వ్రాసినవి. పేపర్లలో చదువుట వలన, జనులు చెప్పుకొనుచున్నందువల్లనూ కంపెనీ అధికారులు, బ్రిటిష్ గవర్నరువారునూ శ్రీస్వామివారినే ఫొటో తీయించాలని నిర్ణయించి ఫొటోగ్రాఫర్‌ను అక్కల్‌కోటకు పంపినారు. ఆ ఫొటోగ్రాఫర్ వచ్చి శ్రీస్వామి భక్తులతో తాను వచ్చిన పనిగురించి చెప్పినాడు.

వారు శ్రీస్వామి ఆజ్ఞలేనిదే ఆపని సాధ్యపడదని చెప్పిరి. అతడు శ్రీస్వామిని చేరి నాలుగురోజులు అడిగినాడు. కాని శ్రీస్వామి వినిపించుకోలేదు. చివరికి శ్రీస్వామి అనుమతి లేకుండానే వారికి తెలియకుండా తనపని తాను చేయాలనుకొన్నాడు. అతనికి తన నైపుణ్యంమీద చాలా నమ్మకం. అతను తెచ్చిన కెమేరాలు చాలా ఖరీదయినవి. సరైన ఫోజుకొరకు ఎదురు చూచాడు. ఫొటో తీయబోయే సమయానికి శ్రీస్వామి కదులుటయో లేక ఎవరైనా అడ్డురావటమో జరిగేది. ఇలా కనీసం ఇరువదిసార్లు జరిగినది. ఎట్టకేలకు అతి కష్టంమీద ఒక్క ఫొటో తీశాడు. శ్రీస్వామివారిని మోసగించగలిగానని సంతోషించాడు. అదే చులకనభావంతో శ్రీస్వామికేసి చూచాడుకూడ. నెగిటివ్‌ను కడిగి ఫొటో ప్రింట్‌వేశాడు. వానికి శ్రీస్వామి ఫొటో చక్కగా వచ్చిందనిపించింది. సగర్వంగా దానిని శ్రీస్వామివారికి చూపి ఇప్పుడేమంటారు? అన్నాడు. శ్రీస్వామి ఆ ఫొటోను ఒక భక్తుని ముందువేసి "అందులో ఏముందో చెప్ప"మన్నారు. అతడు "ఇది శ్రీరాముని ఫొటో! ఎంతో అందంగా వున్నది" అన్నాడు. మరొక భక్తుడు "విష్ణుమూర్తి"దన్నాడు. ఇంకొకడు "దేవి అంబా భవాని" ఫొటో అన్నాడు. మరియొకనికి శంకరుడుగాను వేరొకనికి పండరి విఠలునిగాను వారి వారి ఇష్టదైవమే గోచరించసాగింది. మరొకడు కానేకాదు "ఇది ఖండోబా ఫొటో" అన్నాడు. ఫొటోగ్రాఫర్ పట్టలేని కోపంతో "వీరంతా పిచ్చివారో లేక అజ్ఞానులై యుండాలి. ఇది శ్రీస్వామి ఫొటో. ఇంతమాత్రం గుర్తించలేరా? మీరు చూచి చెప్పండి!" అని శ్రీస్వామితో అన్నాడు. శ్రీస్వామి నవ్వి "ఓహో! అట్లాగా! ఇది నా బొమ్మా! నేను అంత ఘోరంగా వున్నానా?" అంటూ ఆ ఫొటోను అతనికే తిరిగి యిచ్చారు. అతని ఆశ్చర్యానికి అంతులేదు. శ్రీస్వామివారి బొమ్మలేదు సరికదా ఒక కోతిబొమ్మ వుంది. తన గర్వాన్ని అణచేందుకే శ్రీస్వామి ఇలా చమత్కారం చేశారని అర్థమయింది. క్షమాపణలు వేడి ఆయనకిలా మనవి చేసుకున్నాడు. పవిత్రమైన శ్రీస్వామి చిత్రపటం అందరి ఇళ్ళలో వుండాలని తద్వారా తన కంపెనీ వృద్ధిలోకి రావాలని, స్వామి దయతో అనుమతిస్తేగాని తన కోరిక నెరవేరదనీ మరీ మరీ ప్రార్థించాడు.

అతడు సవినయంగా చేసిన ప్రార్థన మన్నించి శ్రీస్వామి అనుమతి నిచ్చారు. అప్పుడు మరల తీస్తే సరియైన ఫొటో వచ్చింది.



ఆ తరువాత కూడ శ్రీస్వామివారి అనుమతి వుంటేనే ఫొటోలో బొమ్మ సరిగా వచ్చేది. ఒకసారి ఫడ్కే అనే ఫొటోగ్రాఫర్ శ్రీస్వామి అనుమతి పొంది సాయంత్రం అయిదుగంటలకు కెమెరా తీసుకొని వచ్చాడు. కాని శ్రీస్వామి చీకటి పడేవరకు హుక్కా అందించమని పొగ పీలుస్తూనే వున్నారు. ఆ తర్వాత ఇప్పుడు ఫొటో తీయమన్నారు. వెలుగు లేనప్పుడు తీస్తే సరిగా రాదనీ, తనవద్ద ఫ్లాష్ లేదనీ అతడు బాధపడ్డాడు. కాని శ్రీస్వామి చీకట్లోనే ఫొటో తీయమని ఆజ్ఞాపించారు. సరేనని తీసి అది సరిగా రాదనుకుంటుండగా శ్రీస్వామి తన రెండు చేతులతో పొట్టను పట్టుకొని పెద్దగా నవ్వి ఫొటో వస్తుంది కడిగి తెమ్మన్నారు. అతడు శ్రీస్వామి చెప్పినట్లే చేశాడు. ఆశ్చర్యం! దానిలోని శ్రీస్వామి చిత్రం స్వచ్ఛంగా వచ్చింది. ఇది కేవలం శ్రీస్వామివారి లీలయే.

రాబోవు అధ్యాయములలో ఇంకా కొందరు భక్తులు, సేవకులగు రాజులను, వారి భక్తిశ్రద్ధలనూ తెలుపుతానంటూ శ్రీస్వామిని మదిలో తలచుకొని తిరిగి చెప్పసాగిరి.

***"జయ జయ సద్గురుమూర్తి - జయ జయ సచ్చిదానంద***
***శ్రీస్వామి సమర్థ మహరాజ - జయ జయ దత్తమూర్తి"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్***
*(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరువది ఆరవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ సర్వలోకారాధ్య
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరువది ఏడవ అధ్యాయము

విద్యాసాగరా!

ఈ అధ్యాయములోని లీలలు సుందరబాయి శ్రీస్వామి దగ్గర రాజోద్యోగిగా వున్న సమయంలో జరిగినవి. అది శ్రీస్వామి వారి సంకల్పముతో ఒక మఠం స్థాపనకు నాందిగా మారినది. ఎవరు ఎన్నివిధాల ప్రయత్నించినా సద్గురువుల సంకల్పము ఆశీర్వచనము వుంటేనే అది ఫలించేది. లేనిచో ఏ ప్రయత్నమైనా వ్యర్థమైపోతుంది. అందువలన ఫలితం పొందాలి అనే సంకల్పం ఉన్న భక్తులు ఆ సంకల్పమును నిస్వార్థముగాను, శ్రద్ధతోను చేసినచో దానికి మహాత్ముల ఆశీస్సులు లభించుతాయి అని నిత్యానందుడు తెలిపి తిరిగి చెప్పుచున్నారు.

శంకర్‌రావు రాజావారు నిజాం రాజ్యంలో జాగీర్దారు. ఇతను గొప్ప ధనవంతుడు. సంవత్సరానికి ఆరులక్షల ఆదాయం వున్నవాడు. అతనికి ఒకప్పుడు తీవ్రమైన క్షయవ్యాధి సంక్రమించింది. దానికితోడు అతనినొక బ్రహ్మరాక్షసి ఆవరించి వేధించి జీవితమును దుర్భరముగా చేయసాగినది. ఎంతోమంది వైద్యులను సంప్రదించినాడు. ఎంతోమంది మాంత్రికులచేత మంత్రాలు వేయించినారు. దానికోసం ఎంతో ధనమును ఖర్చు చేసినారు. అయినా ఫలితం కలుగలేదు. నానాటికీ కృశిస్తున్న అతనిని శ్రీక్షేత్ర గాణుగాపురమునకు వెళ్ళమని, అచ్చటగల శ్రీదత్త నిర్గుణపాదుకలను దర్శించమని స్నేహితులు సలహా ఇచ్చినారు. శంకర్‌రావుగారు శ్రీక్షేత్ర గాణుగాపురమునకు వెళ్ళాడు. శ్రీదత్త పాదుకలనునిత్యము - భక్తిగా శ్రద్ధగా



సేవించి బ్రాహ్మణులకు భారీయెత్తున అన్న సంతర్పణలు చేసి విరివిగా దక్షిణలు యిచ్చినాడు. ఈ విధముగా మూడు నెలలు గడిచాక శ్రీదత్తాత్రేయ శ్రీస్వామి స్వప్నంలో దర్శనము యిచ్చి అక్కల్‌కోటలోని శ్రీస్వామి సమర్థులను దర్శనము చేసుకొని వారిని సేవించమని చెప్పారు. ఆ క్షేత్రములోనే అక్కల్‌కోటలోని ఆ అవతార పురుషుని గురించి వారి లీలలను గురించి భక్తుల ద్వారా విని యున్నారు. అచ్చటనున్న శ్రీస్వామి అవతారపురుషుడని వారి మహిమ గురించి తెలుసుకొన్నారు. అయినా రాజుగారికి వెళ్ళే సంకల్పం కలుగలేదు. స్వప్నంలో శ్రీదత్తస్వామి ఆదేశించినా అతని మనసునకది నచ్చలేదు. శ్రీగాణుగాపురము విడిచి వెళ్ళాలనిపించలేదు. శ్రద్ధగా శ్రీగురుదత్త పాదుకలనే నిత్యం సేవించసాగినారు. భక్తులపట్ల దయతో వారిని ఆర్థికంగా, ఆదిభౌతికంగా, ఆధ్యాత్మికంగా రక్షించి అనుగ్రహించే తత్త్వమే శ్రీదత్త సాంప్రదాయం.

శిష్యులు – భక్తులు ఏ దత్త అవతారములనైనా ఆ సాంప్రదాయ గురువులు ఎవరినైనా అనుష్ఠానముగా నుంచుకొని ఆరాధించినా, అది మూలతత్త్వం అయిన శ్రీగురుదత్తునికే చేరుతుంది. అందువలన ఈ భక్తులు, శిష్యులు ఆర్తితో పిలిచితే ఆ దగ్గరలో వున్న ఏ దత్తావతారమైనా సాంప్రదాయ గురువులైనా వీరి పిలుపును విని వీరిని రక్షించి – అనుగ్రహించగలుగుతారు. అందువలన దత్త సాంప్రదాయ శిష్యులు – ప్రశిష్యులు తాము ఆరాధించినదే శ్రీగురుతత్త్వం అనీ, వేరే ఆకారములు కాదనీ విశ్వసించరాదు. గురువుల ఆకారములు ఎన్ని ఉన్నను అందులో పనిచేయు శక్తి శ్రీదత్తాత్రేయస్వామియే. వారే జగత్ గురువు. అందరి పూజలు – సేవలు ఏ ఆకారానికి చేసినా అందేది శ్రీగురుదత్తునికే. అందువలన రాజా శంకరరావుగారిని ఆదరించి రక్షించే ప్రయత్నంలో శ్రీదత్తస్వామి స్వప్నంలో అలా ఆదేశించినారు. వీరు విశ్వసించి వెళ్ళకపోతే కొద్దికాలం తరువాత శ్రీదత్తస్వామి మరల స్వప్నంలో కనిపించి "రాజా! నీవు వెంటనే అక్కల్‌కోటకు వెళ్ళు! అక్కడ వున్న నా రూపమును దర్శించి సేవించు. నీకు స్వస్థత చిక్కుతుంది" అని ఆదేశించినారు.

రాజావారు చాలా ఆలోచించి, శ్రీస్వామి మొదటి ఆదేశం ప్రకారము నడవనందుకు బాధపడి క్షమాపణ కోరుకొని తెల్లవారగనే బయలుదేరి అక్కల్‌కోట చేరినారు. ఆ సమయంలో శ్రీస్వామి సమర్థులు కార్నల్‌కర్ యింటనున్నారని తెలిసి అచ్చటికి వెళ్లి శ్రీస్వామిని దర్శించడానికి ప్రయత్నించుచుండగా అక్కడ

అప్పటికే చాలామంది భక్తులు వేచి వున్నారు. అంతమందిలో తాను తన బాధను శ్రీస్వామికి తెలుపలేక, శ్రీస్వామివారి భక్తులతో మాటలాడ ప్రయత్నించగా, సుందరాబాయిని సంప్రదించితే మంచిదని తెలిసినది. శ్రీ రాజావారు సుందరబాయిని చూచి తన బాధను తెలుపుకొని శ్రీస్వామి అనుగ్రహం లభించేలా చేయమని కోరినాడు. అందులకు సుందరాబాయి "రాజా, నీకు తప్పక నయమవుతుంది. అయితే శ్రీస్వామికి నీ గురించి చెప్పవలెనంటే నీవు నాకు రెండు వేల రూపాయలు ఇవ్వాలి! అలా ఇవ్వగలిగితే నేను తప్పక నీకు సహకరించగలను!" అన్నది. రాజావారు గొప్ప ధనవంతులని ఆమె గ్రహించినది. అందులకే అలా కోరినది. దానికి రాజావారు "అమ్మా! నాకు శ్రీస్వామి దయతో నయము అవ్వాలిగాని రెండువేలు ఏమిటి; పదివేలు యివ్వగలను!" అన్నారు. దానికి ఆమె అమితమైన ఆనందమును పొంది - వారిని శ్రీస్వామివారి వద్దకు తీసుకొని వెళ్ళినది. రాజావారు శ్రీస్వామికి పుష్పమాలను సమర్పించి, తియ్యని పదార్థములను తినిపించి పాదాభివందనం చేసినారు. అంత సుందరాబాయి శ్రీస్వామితో వీరిని అనుగ్రహించి వారి బాధను నివారించమని చెప్పుచుండగానే శ్రీస్వామి దిగ్గునలేచి బయటకు వెళ్ళి గబగబా నడచి షేక్ నూర్‌సాహెబ్ దర్గా దగ్గరకు వెళ్ళి ఆ సమాధి దగ్గర పడుకొనినారు. రాజా పరివారం మిగతా భక్తులంతా వారిని వెంబడించి పోయినారు. వారు దర్గా దగ్గర పడుకొని వున్న శ్రీస్వామిని చూచి దూరంగా నిలబడినారు. దర్గా దగ్గర ఉన్న ఫకీరులు రాజావారిని చేరి విషయం తెలుసుకొని "రాజా! శ్రీస్వామి అలా పడుకొని వుండడం ద్వారా నీ అనారోగ్యమును తొలగించి ఆరోగ్యం ప్రసాదించినారు. మృత్యుముఖము నుండి బయటపడినావు" అని అన్నారు.

సుమారు ఆరు మాసములలో శంకరరావురాజావారి శరీర అనారోగ్యము బ్రహ్మరాక్షస బాధలు అన్నీ పూర్తిగా మటుమాయమయ్యాయి. ఈ కాలములో ఎక్కువగా వారు గాణుగాపురంలోను శ్రీస్వామి సమర్థుల సన్నిధిలోను గడిపినారు. వారు పూర్తి ఆరోగ్యము పొందిన తరువాత శ్రీస్వామి వారిని దర్శించినపుడు ఆయన "నీవు సుందరాబాయికి ఏమీ ఇవ్వనక్కరలేదు. నిన్ను అనుగ్రహించినది ఆమె కాదుకదా! ఈ పట్టణ పొలిమేరలో ఒక మఠం నిర్మించడానికి నీవు చెప్పిన పైకం వెచ్చించు" అన్నారు. శ్రీస్వామివారి ఆదేశంతో శంకరావురాజావారు భక్తులకోసం ఒక చక్కటి మఠం నిర్మించినారు. దీనినే



“రాజేరాయన్” మఠం అని పిలుస్తారు. శ్రీ స్వామి దానికి ఆనందించారు. వీరి భక్తులనేకులు ఈ మఠంలో నివసించి, శ్రీ స్వామిని దర్శించి వారి ఆశీర్వాదములను పొందుచుందురు. ఈ విధముగా శంకరరావురాజే వారికి అనుగ్రహమూ - సుందరాబాయి ఆశకు నిరాశ మిగిలినది. శ్రీస్వామి సంకల్పముతో కోరిన ధనంతో ఒక మంచి మఠం నిర్మాణమైనది.

సతారా జిల్లాలో ‘రహమత్‌పురా’ అనే సంస్థానము వుండేది. దానికి అప్పాసాహెబ్ మాణే అనువారు జమీందారుగా నుండేవాడు. వారికి ఇద్దరు కుమారులు : అన్నాసాహెబ్, తాత్యాసాహెబ్, ఒక కుమార్తె జమునాబాయి కలరు. అతను ఒకసారి అక్కల్‌కోటకు శ్రీస్వామి వచ్చిన కొత్తలోనే శ్రీస్వామి దర్శనార్థమై వచ్చినాడు. అతని కుమార్తెకు ఎన్ని సంబంధాలు చూచినా కుదరలేదు. శ్రీస్వామి అక్కల్‌కోటకి రావటం, వారి లీలలు, అనుగ్రహములు విని వారిని దర్శించాలి అని వచ్చినారు. ఆయన యుక్త వయస్సు వచ్చిన తన కుమార్తె జమునాబాయిని తీసుకొని శ్రీస్వామి సన్నిధికి చేరి వారికి పాదాభివందనములు చేసి తన కోరికను తెలుపగా, శ్రీస్వామి “భయమెందుకు? ఏల బాధపడతావు? నీ కుమార్తె కొరకు ఉన్నత రాజవంశీయుడైన వరుని నిర్ణయించినాము. అతని పేరు ‘ఖాండియా’ అన్నారు. వారు ఆనందముతో భక్తులకు మిఠాయిలు పంచిపెట్టి శ్రీస్వామికి పాదాభివందనములు చేసి కానుకలను సమర్పించి వారి సంస్థానానికి వెళ్ళిపోయినారు. కొలది రోజులకే బరోడా యువరాజైన ఖండీరావు గైక్వాడ్‌తో ఆమెకు వివాహం అయినది. అప్పాసాహెబ్‌మాణే సమస్య తీరడమేగాక, యువరాజుగారు అల్లుడు కావడంతో ఆయన కీర్తి ప్రతిష్ఠలు మరింతగా పెరిగినాయి. శ్రీస్వామివారిని దర్శించి అక్కడ వారికందరికీ అన్నసమారాధన గావించినాడు. తరచుగా శ్రీస్వామిని దర్శించేవాడు.

అప్పాసాహెబ్ అక్కల్‌కోటలో శ్రీస్వామిని దర్శించడానికి ఎప్పుడు వచ్చినా చాలారోజులు వుండేవారు. అతనికి అక్కడ శ్రీస్వామి దర్శనం - అక్కడ జరిగే సంకీర్తనలు - పురాణ కాలక్షేపములయందు చాల ఇష్టంగా వుండేది. అందువలన అతను తన బాధ్యతలను పెద్దకుమారుడైన అన్నాసాహెబ్ మీద వదలి ఇక్కడే కాలక్షేపం చేసేవారు. దానికోసం ఒక ఇంటిని కూడా ఏర్పాటు చేసుకొనినారు. ప్రతినిత్యం క్రమం తప్పకుండా శ్రీస్వామిని

దర్శించేవారు. ఇలా వుండగా ఒకసారి అతనికి టైఫాయిడ్ జ్వరం వచ్చినది. అతని ఆరోగ్యం క్షీణించడం వలన లేచి తిరుగలేక శ్రీస్వామిని దర్శనం చేసుకోలేక పోయినారు. అంత బాధలో కూడా అతను శ్రీస్వామిని మరువలేదు. ప్రతిక్షణం శ్రీస్వామిని స్మరించుచునే వుండేవారు. రోజురోజుకు అతని పరిస్థితి విషమిస్తున్నందు వలన వానిని రక్షించుటకై శ్రీస్వామి ఒకరోజు అతని ఇంటికి వెళ్ళి అతనికి దర్శనము యిచ్చినారు. ఆ సమయంలో అప్పాసాహెబ్ స్పృహలో లేకుండిరి. వారి కుమారుడు తాత్యాసాహెబ్ శ్రీస్వామికి నమస్కరించి తండ్రి పరిస్థితి చెప్పి దీనముగా నిలబడెను. శ్రీస్వామి తన పాదముతో అప్పాసాహెబ్‌ను మూడుసార్లు తాకి అక్కడే కొంచెముసేపు కూర్చొని వెళ్ళిపోయినారు. ఆ తరువాత అతనికి జ్వరం తగ్గుముఖం పట్టినది. మూడురోజులలో అతనికి సంపూర్ణమైన ఆరోగ్యం చేకూరినది. సంతోషముతో శ్రీస్వామిని దర్శించినారు. అతను, అతని కుమారులు ఎప్పుడూ శ్రీస్వామిని దర్శించుచుండేవారు.

అప్పుడప్పుడు శ్రీస్వామి తన భక్తుడైన మోరాబాకులకర్ణి ఇంటికి వెళుతుండేవారు. అతని భార్య చాలాకాలమునుండి తీరని కడుపునొప్పితో బాధపడుతుండేది. ఒక అర్ధరాత్రి ఆ బాధ భరించలేక ఆత్మహత్య చేసుకోవటానికి ఆమె బావి దగ్గరకు వెళ్ళింది. అదే సమయానికి శ్రీస్వామి భజరంగ అనే ఒక భక్తుని నిద్రలేపి బావి దగ్గరకు వెళ్ళమని చెప్పారు. అర్ధరాత్రిలో బావి దగ్గరకు ఎందుకు వెళ్ళాలో అర్థంకాలేదు. అయినా సద్గురువు మాటను ఉల్లంఘించటానికి వీల్లేదు గావున అతను బావి దగ్గరకు వెళ్ళేసరికి బావిలో దూక ప్రయత్నం చేస్తున్న కులకర్ణి భార్య అతనికి కనిపించినది. ఆమెను ఆ ప్రయత్నం నుండి విరమింపజేసి శ్రీస్వామి వద్దకు తీసుకొని వచ్చినారు. శ్రీస్వామి ఆమె శరీర బాధను తెలుసుకొని ఓదార్చి క్షణకాలం రెప్పవాల్చక ఆమెకేసి చూచారు. అంతే, ఎంతోకాలంగా బాధించుచున్న ఆ కడుపునొప్పి ఆ క్షణం నుండి మాయమైపోయినది. భక్తులను రక్షించడం అనేది, వారి శరీర బాధలు తీర్చడం అనేది ఈ సాంప్రదాయ ప్రాథమిక చర్య. ఆత్మహత్య మహాపాపం. దానివలన స్థూలంగా విముక్తి లభించునట్లు కనబడునేకాని, అది విముక్తి మాత్రం కాదు. మానవ జీవితం సాధనతో, యోగంతో ముక్తి సాధించడానికే. కష్టాలు – వ్యాధులు పాపమును హరించివేస్తాయి. సుఖాలు, సౌఖ్యాలు, విలాసములు పుణ్యఫలమును హరించివేస్తాయి. గాన సద్గురువుల సేవలో వారి అనుగ్రహంతో ఈ పాప – పుణ్యములను హరింపజేసుకొని ముక్తిని పొందాలి, దానికై యత్నించాలి.



గోవిందశాస్త్రి అనే పేద బ్రాహ్మణుడు వుండేవాడు. అతను ప్రతిదినము శ్రీస్వామిని దర్శించుచుండేవాడు. కాని సంసారభారం ఎక్కువగా వుండేది. పేదరికం వలన రోజూ పస్తులు వుండవలసి వచ్చేది. భార్య, పిల్లలను పోషించలేక ఆ బాధలను భరించలేక ఒకసారి ఆత్మహత్య చేసుకోవటానికి నిశ్చయించుకొని, చివరిసారిగా శ్రీస్వామి దర్శనానికి వెళ్ళాడు. శ్రీస్వామి అతని నిర్ణయం గ్రహించి వానివైపు చూస్తూ "మీ ఇంటి దొడ్లో చెట్టుక్రింద ఏమి దొరుకుతుందో అది తీసుకొని భగవచ్చింతనలో కాలం గడుపు" అని ఆజ్ఞాపించారు. అతను ఇంటికి వెళ్ళి ఆ చెట్టుక్రింద త్రవ్వగా, అక్కడ గొప్ప నిధి దొరికినది. శ్రీస్వామివారి ఆజ్ఞ ప్రకారము గోవిందశాస్త్రి నిశ్చింతగా భగవచ్చింతనలో మునిగిపోయాడు. వీరిని శ్రీస్వామి ఈ విధంగా అనుగ్రహించి కాపాడినారు.

విద్యాసాగరా!

శ్రీస్వామి తాను దత్తమూర్తి అని చెప్పకనే చెప్పేవారు. ఒకసారి ఒక బ్రహ్మచారి తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతూ ఆ బాధ తగ్గితే నరసింహవాడి వెళ్ళి, అక్కడ దత్త పాదుకలకు శ్రీ దత్తాత్రేయస్వామికి యిరవై ఐదు పైసలు పెట్టి పాలకోవా కొని సమర్పిస్తానని మొక్కుకున్నాడు. బాధ నివారణ అయింది. కాని, బ్రహ్మచారి మొక్కుమాట మరచిపోయాడు. ఇది జరిగి పది సంవత్సరాలు అయినది. తరువాత అతను అక్కల్‌కోటకు శ్రీస్వామిని దర్శించడానికి వచ్చినాడు. శ్రీస్వామికి అతన్ని చూస్తూనే కోపంతో "మూర్ఖుడా! పాలకోవా మాట మరచిపోయావా?" అన్నారు. అతనికి వెంటనే తాను మొక్కుకున్నది గుర్తుకువచ్చి శ్రీస్వామికి క్షమాపణలు చెప్పుకొని పాలకోవాలను శ్రీస్వామికి సమర్పించినాడు. "దత్తావతారులను తలచి వారికి యిస్తాను అని ఇవ్వకపోతే ఎప్పుడైనా ఎక్కడైనా ఏదో ఒక దత్తావతారం దానిని అడిగి మరీ పుచ్చుకొంటుంది. ఆ విధముగా భక్తులను ఋణ విముక్తులను చేస్తుంది" అని నిత్యానందుడు తెలిపినాడు.

***"నారాయణ నారాయణ గోవింద హరే***
***నారాయణ నారాయణ గోపాల హరే"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరవై ఏడవ అధ్యాయము*** *సంపూర్ణము*

 



ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ గురుదేవదత్త
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ఇరువది ఎనిమిదవ అధ్యాయము

విద్యాసాగరుడు "గురుదేవా! మీవలన అద్భుతము - మహోన్నతము అయిన శ్రీస్వామివారి లీలలను, ప్రబోధములను, అనుగ్రహములను విను భాగ్యము కలిగినది. ఎంత విన్నను తనివితీరడంలేదు. దయామయా! చిత్రాతిచిత్రమైన ఈ కథలను ఇంకను తెలుపండి" అని ప్రార్థింప నిత్యానందుడు "బాలకా! శ్రీగురు అనుగ్రహాన్ని తమ బలంతోను, ధనంతోను పొందాలని ప్రయత్నించినవారు కలరు. అలాంటి వారి కథ ఇప్పుడు నీకు చెపుతాను వినుము.

ఆశకు అంతనేది లేదు. అనవసరమైన ఆశలు పెంచుకోవడం - అసంతృప్తికి మూలమవుతుంది. అత్యాశాపరులకు సమస్తలోక సంపద అంతా లభించినా శాంతి అనేది లభించదు. ఇంకా ఏమో కావాలనే భావంతో అశాంతికి గురి అవుతారు. అందువలననే వివేకులైనవారు ఎప్పటికేది లభిస్తే అది గురువు అనుగ్రహం అనుకొని దానిని సంతోషముగా అనుభవిస్తారు. దీనిలో వారికి సుఖము శాంతి లభిస్తాయి. అలా సుఖంగాను, శాంతితోనూ జీవించటం వలన వారికి ముక్తి లభించుతుంది. జీవిత లక్ష్యం నెరవేరుతుంది. సంతుష్టిగలవారి హృదయతేజం, దానివలన అంతకంతకు వృద్ధి పొందుతుంది. అసంతుష్టిగలవారి తేజం క్షణం క్షణం క్షీణించిపోతుంది. సంతుష్టుడైనవాడు, మూడు లోకాలలోను పూజింపబడతాడు. నిత్య సంతోషికి దుఃఖమనేది రాదు.

శ్రీస్వామి సమర్థుల దర్శనానికి రాజులు, సంస్థానాధిపతులు చాలామంది



వచ్చి వెళుతుండేవారుకదా! అందులో బరోడా మహారాజు శ్రీ మల్లారావు గైక్వాడ్ ఒకరు. ఈయన తరచూ శ్రీ అక్కల్‌కోట వచ్చి శ్రీస్వామివారిని దర్శించుచుండేవారు. కాని ఆనాటి రాజులకు, సంస్థానాధిపతులకు శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోటలో నివాసముండి ఆ సంస్థానము వారి రాజభవనంలో తిరుగుచూ వారిని అనుగ్రహించడం చూచి అసూయ కలిగేది. అక్కల్‌కోట సంస్థానమునకు కలిగిన ఈ మహాభాగ్యాన్ని చూసి అందరికీ ఆశ్చర్యం, ఈర్ష్య కలిగినాయి. అయినా రాజామాలోజీరావు యొక్క స్నేహభావం, వారుచేసే అతిథి మర్యాదలకు తృప్తిచెంది శ్రీస్వామిని దర్శించి అనుగ్రహములను పొందుటచేత వారందరు శ్రీస్వామికి మంచి భక్తులుగా మారినారు. క్రమక్రమంగా వారిలో ఆ భావములు నశించాయి. కాని బరోడా మహారాజు మల్లారావు గైక్వాడ్‌నకు మాత్రం ఇది సహించరానిదయినది. ఆయనకు ఎలాగైనా శాశ్వతముగా శ్రీస్వామిని తమ రాజ్యానికి తీసుకొని పోవాలని వుండేది. ఒకసారి తమ ఆస్థానములో సభచేసి, పండితులను, మంత్రులను - మేధావులను - సైన్యాధిపతులను అందరినీ పిలిచి, శ్రీస్వామిని అక్కల్‌కోట నుండి తరలించి తీసుకొని రాగలిగినవారికి ఖర్చులేగాక కోరినంత ధనమును యిచ్చి ఘనంగా సన్మానిస్తానని తెలియజేశారు. అందరూ ఇది సామాన్యమైన పనికాదని నిర్ణయించారు. అందువలన ఎవరూ ముందుకు రాలేదు. రాజుగారు చూపిన ధన ప్రలోభంతో వారి మంత్రి తాత్యాసాహెబ్ అనువారు ముందుకు వచ్చి ఎలాగైనాసరే శ్రీస్వామిని తప్పక తీసుకొనిరాగలనని రాజుకు మాట యిచ్చినాడు. మహారాజావారు చాలా సంతోషపడి అతని ధైర్యమునకు, తెలివికి మెచ్చుకొని ఎలాగైనా తప్పక కార్యమును సాధించుకురమ్మని చెప్పి కావలసినంత ధనము, గుఱ్ఱములు, ఏనుగులను, సేనలను యిచ్చి అక్కల్‌కోట పంపినాడు. శ్రీస్వామి వారికి భారీయెత్తున కానుకలను పంపినాడు. శ్రీస్వామివారికి తన వందనములను తెలుపమనినాడు.

తాత్యాసాహెబ్ అమితమైన ఆనందముతోను, దృఢమైన నిశ్చయముతోను, బయలుదేరి అక్కల్‌కోటకు చేరినాడు. శ్రీస్వామివారిని దర్శించి మహారాజు ఇచ్చిన కానుకలు సమర్పించి శ్రీస్వామివారికి ఆహ్వానమును తెలిపినారు. కానీ శ్రీస్వామీజీ ఆ ఆహ్వానమును తిరస్కరించినారు. ఎలాగైనా శ్రీస్వామిని

తీసుకురమ్మని రాజావారి ఆజ్ఞ కనుక అతను అక్కడే వుండిపోయి తన ప్రయత్నాలను కొనసాగించినాడు. దానిలో భాగంగా శ్రీస్వామి సేవకులందరిని లోబరచుకోవాలని వారందరికీ మిఠాయిలు పంచారు. అంతేకాదు కొన్ని బహుమతులు కూడా యిచ్చినారు. వారి శిష్యులతో శ్రీస్వామికి చెప్పించాలని చూచినాడు. కానీ ఆ పథకం పారలేదు. తుదకు శ్రీస్వామికి సన్నిహితుడైన చోళప్పకు తన లక్ష్యాన్ని చెప్పి తనకు సహాయం చేస్తే దీనికి బదులుగా పదివేల రూపాయలు యిస్తామని మరియు మహారాజా వారికి తెలిపి చిన్న జాగీరు యిప్పిస్తానని కూడా వాగ్దానము చేసినారు. చోళప్ప బీదవాడు, అమాయకుడు. ఇతను చూపిన ఆశకు లొంగిపోయినాడు. తాత్కాలికమైన ధన వ్యామోహంలో పడి, శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోటలో వుంటే ఎంతటి మహాభాగ్యమో! ధనంవలన భాగ్యమా! లేక సద్గురు సన్నిధి మహాభాగ్యమా! అన్నది మరచిపోయినాడు. ఒకనాడు శ్రీస్వామి సంతోషముగానున్న సమయంచూచి ఏకాంతములో శ్రీస్వామితో ఇలా అన్నాడు. శ్రీస్వామీ! మీరు తాత్యాసాహెబ్‌తో బరోడా వెళ్ళితే నాకు పదివేలు వస్తాయన్నాడు. శ్రీస్వామి నవ్వి ఓహో! అలాగా! కాని అతనికి భక్తిలేదు అన్నారు. ఆమాట వినడంతోనే చోళప్ప ఆశలన్నీ కుప్పకూలిపోయినాయి. ఈ విషయం తాత్యాసాహెబ్‌నకు తెలిపినాడు. ఇది చోళప్పకు పెద్ద పరీక్ష అయినది. దానితో చోళప్ప రెండు విధాలా ఓడిపోయినాడు. ఒకటి తాత్యాసాహెబ్ కార్యం సాధించలేదు. రెండు శ్రీస్వామి సేవాభాగ్యం కోల్పోయినాడు. స్థూలంగా వున్న ధనం ఎంతున్నా అది శాశ్వతంకాదు. రాజు, జమీనులు (భూములు) శాశ్వతం కాదు. అవి ఏనాడైనా పోయేవే ఇది అందరూ ఎరిగిన సత్యం. అయినా ఈ ధనం మనిషిని మానవత్వమునుండి మహనీయునిగాను – మానహీనునిగాను మార్చగలదు. శాశ్వతమైనది సద్గురుని చరణ సన్నిధి. ఎన్ని యుగాలైనా దానితో బంధింపబడినవాడు హీనుడు కాలేడు, దానిని కోల్పోవడు. ఇది గ్రహించక చోళప్ప క్షణికమైన ఆశాభూతానికి, ప్రలోభానికి లొంగి శాశ్వతమైన సద్గురు సేవనుండి వేరుచేయబడినాడు. సద్గురుని హస్తం ఏ వికారాలు లేకుండా పట్టుకొని వుండాలి. ఏ వికారములైనా చేరనిస్తే అవి సద్గురుని హస్తం నుండి విడిపించి తిరిగి చేరరాని తీరాలకు చేర్చి శిష్యుని అధోగతిపాలు చేస్తాయి. గాన విద్యాసాగరా శిష్యుడు ఎల్లవేళల జాగ్రత్తగా నుండవలెను.



తాత్యాసాహెబ్ తన ప్రయత్నములను మానలేదు. శ్రీగురుచరిత్ర పారాయణం చేయించితే ఫలితం ఉండవచ్చు అనుకొనినాడు. దానికై కొందరు బ్రాహ్మణులను నియమించుకొని తన కార్యము నెరవేర్చుటకై శ్రీగురుచరిత్రను పారాయణం చేయమనినాడు, అన్నసమారాధనలు చేయంచినాడు. అయినా శ్రీస్వామి మనస్సును జయించలేకపోయినాడు. శ్రీగురుచరిత్ర పారాయణము సత్ఫలితములు ఇస్తుందేకాని దుష్ట కార్యములకు సహకరించదు. తాత్యాసాహెబ్ బాగా ఆలోచించి శ్రీస్వామివారిని ఎలాగైనాసరే బరోడా చేర్చాలనుకొని ఒక పెద్ద ప్రయత్నం చేసినారు. శ్రీస్వామివారి పల్లకిని మోయు వారికి ధనం యిచ్చి లోబరచుకొనినారు. ఒకరోజు సాయంత్రం శ్రీస్వామివారు రాజభవనానికి వెళ్ళడానికి పల్లకిలోనికి ఎక్కినారు. పల్లకి మోసేవారు ఇదే అవకాశం అనుకొని పల్లకి తలుపులు మూసి తాళంవేసి అతిత్వరగా రైలుస్టేషన్ 'కడ్‌గాం' చేరినారు. రైలుకూడా తాత్యాసాహెబ్ సిద్ధం చేసుకొని వున్నారు. స్టేషన్ చేరిన వెంటనే పల్లకీ తలుపు తాళంతీసి – చూచిన తాత్యాసాహెబ్ ఆశ్చర్యానికి అంతులేదు! అందులో శ్రీస్వామి లేరు. అప్పటికిగాని శ్రీస్వామి శక్తి ఏమిటో అర్థంకాలేదు. శ్రీస్వామి అనుమతి లేకుండా వారిని తరలించడం ఎవరితరంకాదు అని నిర్ణయించుకొని తన ఓటమిని అంగీకరించి, చేయునదిలేక తన పరివారంతో తిరిగి బరోడాచేరి మహారాజులకు తన పరాజయం తెలిపి క్షమాపణను వేడినారు.

ఇంత జరిగినా మల్లారావు గైక్వాడ్ తన ఆలోచనను వదలలేదు. అతను మరొక రాజోద్యోగి యశ్వంతరావుకు చాలా కానుకలిచ్చి తిరిగి అక్కల్‌కోటకు పంపినాడు. అతను ఈ ఘనకార్యాన్ని తాను సాధిస్తానని బయలుదేరినాడు. అతను అక్కల్‌కోటకు వెళ్ళి శ్రీస్వామిని దర్శించినాడు. వారితో ఎలా సంభాషించాలా అని ఆలోచించుకొని నిలబడినాడు. తక్షణం శ్రీస్వామి "ఏమిటి సంగతి?" అన్నారు. అతడు భయంతో మాట్లాడలేకపోయాడు. శ్రీస్వామివారు తిరిగి అతనిని చూస్తూ "సంకెళ్ళు! తాళం!" అని శ్రీస్వామి మూడుసార్లన్నారు. ఆ మాటలు ఎవరికీ అర్థంకాలేదు.

మూడురోజుల తరువాత యశ్వంతరావుని అత్యవసరంగా రమ్మని బరోడానుంచి వర్తమానం వచ్చింది. ఆ తరువాత అతను ఒక నేరంమీద జైలుపాలయ్యాడు. బరోడా మహారాజైన మల్లారావు గైక్వాడ్ కుమారుడు

ఖండేరావు ఇతనికి శ్రీస్వామి అనుగ్రహంతో – అప్పాసాహెబ్ మాణె కుమార్తె జమునాబాయితో వివాహం జరిగినది.

భక్తాగ్రేసరా! శ్రీస్వామివంటి దివ్యపురుషుల జీవితాలలో అనేక నిగూఢమైన రహస్యాలు వుంటాయి. వారి చర్యలలోను, వాక్కులలోను సామాన్య మానవులు గ్రహించలేని విషయాలు మూడు వంతులకు పైగానే వుంటాయి. అతి సన్నిహితులుగా వుండేవారుకూడా గమనించలేని విషయాలు అనేకముంటాయి. పూర్వజన్మ సంస్కారమువల్ల మహాత్ముల సాంగత్యము లభించినవారు కూడా ఉన్నతస్థాయికి చేరగలిగే అవకాశము తమ స్వయంకృత అపచారంవల్ల కోల్పోతూ వుండడము కద్దు. అలాంటి అభాగ్యులలో చోళప్ప ఒకడు – సుందరబాయి ఒకర్తె – చోళప్ప ఆశకు లొంగిన తరువాతనే శ్రీస్వామి సేవకు దూరమైనాడు. దానికి జీవితాంతము శిక్షను పొందినాడు.

***"అచ్యుతం కేశవం – రామనారాయణం!***
***కృష్ణదామోదరం – వాసుదేవం భజే!!***
***శ్రీధరం మాధవం – గోపికావల్లభం!***
***జానకీ నాయకం – రామచంద్రంభజే!!"***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్***
*(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఇరువది ఎనిమిదవ అధ్యాయము*** *సంపూర్ణము*







ఓం శ్రీ సాయిరాం
శ్రీస్వామి సమర్థ జై జై!
స్వామి సమర్థా
శ్రీస్వామి సమర్థ జై జై!
స్వామి సమర్థా

# శ్రీ అక్కల్‌కోట
# స్వామి సమర్థ లీలామృతము

## ఇరవై తొమ్మిదవ అధ్యాయము

సాధకులారా! ఇతరులకు మార్గదర్శకులు కావటానికి ముందు ఎవరికి వారు అనన్యభక్తితో గురుశుశ్రూష చేయాలి. స్వార్థమును త్యజించాలి. సుఖదుఃఖాలను సమభావంతో స్వీకరించడం అలవర్చుకోవాలి. ఎవరు తనను అధిక్షేపించినా, అవమానపరచినా కోపగించుకోరాదు, ఓర్పుతో వుండాలి. ఓర్పే దానం, ఓర్పే యజ్ఞం, ఓర్పే సత్యము, ఓర్పే కీర్తి, ఓర్పే ధర్మము. ఓర్పువలన కలగనిదేమున్నది? పవిత్ర కర్మలనాచరించడం ద్వారా పరమోత్కృష్టమైన భావాలు కలుగుతాయి. అవియే పరమాత్మ సాక్షాత్కారానికి కారణమౌతాయి. దానిని పొందటానికి ప్రతిజీవి ప్రయత్నించాలి. అలా ప్రయత్నించడానికి సోదర ప్రాణులనుగూడ ప్రోత్సహించాలి. తాము పొందినదానిని ఇతరులకందించని వారు జ్ఞానులైనా అజ్ఞానులే అవుతారు. అందువలన ప్రతి మానవుడు తాను సముపార్జించిన జ్ఞానాన్ని తప్పకుండా అందించాలి. ఆ శక్తిని పొందడానికై సద్గురువుల నాశ్రయించాలి.

విద్యాసాగరా! శ్రీస్వామి సేవతో వారి మన్ననలను పొంది వారి వారసత్వమును పొందిన సేవకుడు బాలప్ప. ఇతను కర్ణాటక రాష్ట్రములో బీజాపూరు జిల్లాలోని హవేలి తాలూకాయందలి కరజ్గీ గ్రామానికి చెందిన యజుర్వేద బ్రాహ్మణుడు. నగల వ్యాపారము, వడ్డీ వ్యాపారము చేస్తూ ఆ గ్రామములో అందరికన్నా ధనవంతుడుగా వుండేవాడు. అతనికి ముప్పది సంవత్సరాల వయస్సులో తీవ్రమైన ఆధ్యాత్మిక చింతన కలిగినది. సద్గురువును




అన్వేషణ చేయుటకై శ్రీగురుచరిత్రను పారాయణం చేయుచు, శ్రీక్షేత్ర గాణుగాపురం వెళ్లాలని నిర్ణయించుకొని, సంసార బాధ్యతను ఇతరులకు అప్పగించి బయలుదేరినాడు. దారిలో అపర శివావతారముగా ప్రసిద్ధి చెందిన శ్రీ చిదంబర దీక్షితులు నివసించిన 'ముర్గద్' (మరుగడ్) అనే గ్రామం చేరినాడు. శ్రీ చిదంబర దీక్షితులు ఆధ్యాత్మికముగా చాలా ఉన్నతి పొందినవారు. ఆయన అనేక యజ్ఞ, యాగాదులు చేసినవారు. శ్రీస్వామి సమర్థులు సంచారం చేయుచున్నప్పుడు ఈ గ్రామమును సందర్శించి శ్రీదీక్షితులు చేయు యజ్ఞములలో పాల్గొని అన్నదాన సమారాధనలో దీక్షితుల కోరికపై భోజనమునకు కూర్చున్న వారికి నెయ్యిని వడ్డించినారు. ఆ గ్రామములో శ్రీబాలప్ప మూడు రోజులు వుండి, అక్కడి కార్యక్రమంలో పాల్గొని అనుష్ఠానము చేసుకొని, అక్కడనుండి శ్రీక్షేత్ర గాణుగాపురమునకు చేరుకొనినారు. ప్రతిదినము భీమా అమరజానదీ సంగమములో స్నానము చేయుచు అక్కడ శ్రీగురుచరిత్రను నిష్ఠగా పారాయణము చేసుకొనువారు. మధ్యాహ్నం అయిదు ఇండ్లలో భిక్ష తెచ్చుకొని, ఆ భిక్షాన్నాన్ని నదిలో కడిగి కేవలం ప్రాణం నిలచియుండటం కోసం తినేవారు. నిద్రమాత్రం శ్రీక్షేత్ర గాణుగాపురంలో నిర్గుణ పాదుకా మందిరంలో చేసేవారు. వేకువనే లేచి శ్రీస్వామి నిర్గుణ పాదుకలను దర్శించి నేరుగా సంగమమునకు వెళ్ళేవారు. ఇట్లు సప్త సప్తాహములు పారాయణం అయిన తరువాత ఒకరోజు శ్రీదత్తాత్రేయ స్వామి బోరిబ్రాహ్మణ వటువుగా స్వప్నంలో కనిపించి అక్కల్‌కోటలో శ్రీస్వామి సమర్థులను దర్శించమని చెప్పిరి. తరువాత శ్రీస్వామివారు దిగంబరముగా దర్శనము యిచ్చినారు. అయితే తాను నిద్రలేచేసరికి తన పడకమీద ఒక కాగితం కనిపించినది. దానిమీద "తొందర పడవద్దు"అని వ్రాసియున్నది. అక్కడే బాలప్ప అదే విధముగా రెండు నెలలుండి, సాధన అధికం చేసినాడు. ప్రతిరోజు శ్రీగురుచరిత్రను పూర్తిగా పారాయణం చేయసాగినాడు. తిరిగి స్వప్నంలో శ్రీదత్తాత్రేయస్వామి దర్శనమిచ్చి దీవించి – అక్కల్‌కోట వెళ్ళమని ఆదేశించి నారు. తెల్లవారగానే బాలప్ప అక్కడ బ్రాహ్మణులవద్ద, తోటి సాధకులవద్ద సెలవు తీసుకొని పాదచారియై అక్కల్‌కోటకు బయలుదేరినాడు. అతనికి దారిపొడవునా అన్నీ శుభశకునాలే ఎదురైనాయి. అతడు సరిగ్గా శ్రీరామనవమికి అక్కల్‌కోట చేరినాడు.

బాలప్ప అక్కల్‌కోట చేరిన సమయంలో శ్రీస్వామి సమర్థులు ఖాన్‌బాగ్



తోటలో వున్నారు. శ్రీస్వామిని చూస్తూనే తాను స్వప్నంలో దిగంబరముగా చూచిన రూపం శ్రీస్వామివారేనని గ్రహించి, అమాంతముగా ఆయన పాదాలపైబడి శాస్త్రరీతిన వందనములను ఆచరించినాడు. వారికి కలకండను నైవేద్యముగా సమర్పించినాడు. బాలప్ప సద్గురువునకై చేసిన అన్వేషణ పూర్తి అయినది అనీ, వీరే తన సద్గురు దేవులని అమితమైన ఆనందముతో వారి సన్నిధిలో కూర్చుండిపోయినాడు. శ్రీస్వామికూడ బాలప్పను చూచి చాలా సంతోషపడి పకపకా నవ్వినారు. శ్రీస్వామివారు తోటలోని పూలను తాకి వాటిని సవరించుచూ రహస్య సంకేతము ద్వారా అతని పూజలను, సేవను అంగీకరించినారు. ఆ తరువాత అతను మురళీధరుని ఆలయంలో బసచేశాడు. తోటలోనుండి శ్రీస్వామి రాజభవనములోనికి వెళ్ళినారు. వారు అక్కడే ఎనిమిది రోజులు వుండిపోయారు. బాలప్పకు ఈ ఎనిమిది రోజులు శ్రీస్వామి దర్శనము దొరకలేదు. అతను అనుక్షణం శ్రీస్వామినే స్మరించసాగినాడు. వారి దర్శనమునకై తహతహలాడినాడు. బాలప్ప మనస్సును ఎరిగిన శ్రీస్వామి అతనికి రాజభవనం లోనికి పిలిపించారు. అతడు సమర్పించిన ఖర్జూరపు పండ్లు ప్రసాదంగా శ్రీస్వామివారు అందరికీ పంచారుగాని బాలప్పకు యివ్వలేదు. అతను మొదట బాధపడ్డాడుగాని, ఆ తరువాత అతనికి తెలిసినది. శ్రీస్వామివారు తమ సేవలో వుంచుకొనువారికి ప్రసాదం పెట్టరని. అతను గొప్ప ధనవంతుడైనప్పటికీ ఆశలేనివాడు ఆ సమయంలో సుందరాబాయి అత్యాశకు గురయి వున్నది. ఆ కారణమున శ్రీస్వామి సేవలో ఏర్పడిన అలసత్వము కారణమున చిన్న చిన్న పనులైనా శ్రద్ధగా చేస్తూండేవాడు.

మొట్టమొదట శ్రీస్వామి ఉమ్మివేసుకునే పాత్రను కడగడంతో అతని సేవ ప్రారంభమైనది. క్రమక్రమంగా శ్రీస్వామికి స్నానం చేయించడం, వంట వండడం, ఆఖరుకు శ్రీస్వామికి భోజనం పెట్టడానికి కూడా అతనికి అవకాశం కలిగింది. అతను ఎట్టిసేవనూ హీనమని తలచక సర్వవిధాలా శ్రీస్వామిని సద్గురువని సచ్చిదానందుడని భావించి సేవించేవాడు. ఏమాత్రం లోపం జరిగినా శ్రీస్వామివారు అతనిని తీవ్రంగా మందలించేవారు. అయితే సుందరాబాయి మాత్రం అతనికి అగ్నిపరీక్షలు పెట్టేది. కేకలు వేసేది, దూషించేది, ఆఖరికి అతనికి లభించిన అదృష్టానికి అసూయచెంది మరింత బాధపడేది. అయినా శ్రీస్వామివారి సేవ లభించినదిగదా అని ఓర్పుగా వుండేవాడు. తనపనిని తాను




శ్రద్ధగా చేసుకొంటూ వుండేవాడు. అంతేకాదు ఆమె ఎన్నోరీతుల దుష్ప్రచారం చేసేది. అతను ఆమె బాధించినప్పుడల్లా శ్రీస్వామిని చూచేవాడు. అంతేకాని ఆమెను ఎవరూ అదుపులో పెట్టడములేదని కాని, శ్రీస్వామివారు దండించలేదని గాని ఆలోచించేవాడు కాదు. తన పాపములను ఈ విధముగా శ్రీస్వామి తొలగించుచున్నారని తలచి మరింత సంతోషముగా ఆయనను సేవించేవాడు. క్రమముగా అతనికి శ్రీస్వామి సేవలోను, శ్రీస్వామివారితోను సాన్నిహిత్యానికి ఎక్కువ అవకాశం కలిగింది.

ఒకనాడు పూజకు పూలు కోస్తుండగా బాలప్పకు చేతిలో ముల్లు గుచ్చుకొని వాచి చాలా బాధపెట్టింది. అయితే అతని బాధను చూచి శ్రీస్వామి “ఆవు పంచికము కురుపుపైరాయి, త్వరలో నయమవుతుంది!”అని దీవించినారు. ఆశ్చర్యకరముగా శ్రీస్వామి చెప్పిన వైద్యముతో చాలా త్వరగా నయమైనది. అలాగే ఒకసారి బాలప్పకు తీవ్రమైన జ్వరము వచ్చినది. కొందరు భక్తులు బాలప్పకు ఎవరైనా ఏమైనా పెట్టారేమో, శ్రీస్వామికి సన్నిహితుడవుతున్నాడనే ఈర్ష్యతో అని అనుకొనినారు. కాని శ్రీస్వామి హృదయంలో చోటుచేసుకొన్న వానిని ఈ బాధలు ఏమిచేస్తాయి? దైవ సన్నిధిలో సేవలో వుండగా యిలాంటివి జరగటం కర్మను తగ్గించి అనుభవింపజేయడము. అంతేకాదు భక్తుని విశ్వాసమును, బలమును పరీక్షించడమూ కావచ్చు. ఒకరోజు శ్రీస్వామి అందరికీ ఖర్జూరపు కాయలు పంచేటప్పుడు మొదట బాలప్పకు యివ్వలేదు. అయితే కొంత సమయం తరువాత శ్రీస్వామి అతనిని పిలచి రెండు ఖర్జూరపు కాయలు ప్రసాదంగా యిచ్చారు. శ్రద్ధ–ఓర్పు కలిగియుండమని సూచించినారు. ప్రసాదం మొదటిసారిగా యిచ్చినారుకదా అని సంతోషంతో వానిని తినబోవుచుండగా శ్రీస్వామి అమాంతంగా వాటిని లాక్కొని వెళ్ళిపోయారు. నిరాశతో బాలప్ప కళ్ళు చెమ్మగిల్లాయి. ఒకరోజు మరల శ్రీస్వామి తన నోటినుండి కలకండ తీసి, ప్రసాదంగా బాలప్పకు యిచ్చారు. మునుపటిలాగే నిరాశ కలగకుండా వుండేందుకు బాలప్ప తక్షణమే ఆ ప్రసాదాన్ని తినేశాడు. అది చూచిన శ్రీస్వామి తన పొట్టను రెండు చేతులతో పట్టుకుని గట్టిగా నవ్వారు. ఆ రోజుతో బాలప్పకు శ్రీస్వామివారి అనుగ్రహం పూర్తిగా కలిగినది.

ఆరోజునుండి బాలప్ప సాధన తీవ్రముగా చేయసాగినాడు. వంశాచారా న్ననుసరించి తన కులదైవాన్ని కూడా నిత్యమూ పూజిస్తుండేవాడు. దానిని



చూచి శ్రీస్వామి "బాలప్ప ముతక గొంగళ్ళు నేస్తున్నాడు" అని చమత్కరించారు. సద్గురుని సేవ అనేది జరీశాలువ వంటిది. గురువూ, దైవమూ ఒక్కటే కనుక సద్గురువు సేవలో నుండగా మరల దైవారాధనలతో పనిఏమి వున్నది? దైవారాధన ధార్మిక మార్గములో మొదటి మెట్టు. దానికంటే పైమెట్టు సద్గురుని సేవ. అందువలన బాలప్పను పూర్తిగా తనవానిగా చేసుకొనుటకుగాను శ్రీస్వామి సమర్థులు అలా అనేవారు. అంతేకాదు, ఒక్కసారి బాలప్పను ఒక శూద్రుని ఇంటనున్న బావిలోనుండి మంచినీళ్ళు తీసుకొని రమ్మని ఆజ్ఞాపించారు. అప్పుడే స్నానముచేసి పూజకు సిద్ధమవుతున్న బాలప్ప మనస్సు కలత చెందినది. అతను ఆ ఇంటి బావిలో నీరు తెచ్చుటకు ముందు వెనుకాడినాడు. వెంటనే శ్రీస్వామి గద్దించి భగవంతుని దృష్టిలో అందరూ సమానులే. నీరు తీసుకురా! పో" అన్నారు. బాలప్ప సద్గురుదేవుని ఆజ్ఞను మీరలేక వెళ్ళి నీరు తెచ్చినాడు. అప్పుడు శ్రీస్వామి బాలప్పకు "కులభేదాలు పాటించుట తప్పని, సర్వజీవులు ఆ పరమేశ్వరుని సంతానమేనని, వారిపట్ల ప్రేమ - దయ కలిగి వుండాలని, శరీర ధారులైన వారిపట్ల ద్వేషం - భేదం కూడదని" ప్రబోధించినారు.

బాలప్పకు తాను రోజూ చేసుకునే ధ్యానములో ఏకాగ్రత కుదిరేదికాదు. అనేక ఆలోచనలు, సందేహాలు ఒకదాని తరువాత ఒకటి తలెత్తుతూ వుండేవి. దీనిని ఒకసారి శ్రీస్వామి వారివద్ద నివేదించుకున్నాడు. శ్రీస్వామి దగ్గరకు రమ్మని ఆయన వీపుపై గట్టిగా చరిచారు. వీపుమీద శ్రీస్వామి వేళ్ళు అచ్చుతేలాయి. తక్షణమే బాలప్ప సమాధిస్థితిలోనికి వెళ్ళాడు. ఆ స్థితిలో చాలాసేపు వుండి దివ్యానుభూతి పొందాడు. శ్రీస్వామి బాలప్పకు ఒక తులసిమాల ప్రసాదించినారు. అప్పటినుండి అతని జపధ్యానాదులు ఏ ఆటంకము లేకుండా సాఫీగా సాగి ఆధ్యాత్మికముగా ముందుకు సాగినవి. శ్రీస్వామి అప్పుడప్పుడు అక్కల్‌కోట చుట్టూ వున్న ఊళ్ళకు వెళ్ళి అక్కడ కొన్నిరోజులుండి తిరిగి వస్తుండేవారు. బాలప్ప మాత్రము అక్కల్‌కోటలోనేవుండి, నిత్యపూజ, జపధ్యానాదులు చేసుకొనేవాడు. ఆ సమయంలోనే రాజామాలోజీరావుగారు సుందరాబాయిని శ్రీస్వామి సేవనుండి తొలగించి బాలప్పను నియమించినారు. బాలప్ప ఏ విధముగాను తన కర్తవ్యంలో లోపము రానిచ్చేవాడుకాదు. ఆ తరువాత అతను అన్నీ మరచి సద్గురు దేవునే సకల దేవతా రూపముగా భావించి పూజింపసాగినాడు. దానితో చక్కని సాధకుడు కాగలిగినాడు. ఇలా వుండగా ఇంకా కొలది కాలమునకు శ్రీస్వామి నిర్యాణం జరుగుతుంది అనగా

ఒకరోజున బాలప్పను పిలిచి తనపేరును ముద్రించిన బంగారు వుంగరాన్ని స్వయంగా అతని వేలికి తొడిగారు. తరువాత బాలప్ప శిరస్సుమీద తన చేతినుంచి "నా రాజముద్రిక నీకిస్తున్నాను. దీనివలన నీకెప్పుడూ ద్వారాలు తెరిచే వుంటాయి. నా అధికారాన్ని, నా శక్తులనూ యావత్తూ నీకిచ్చేస్తున్నాను. నా కార్యం నిర్విఘ్నంగా కొనసాగించ గలుగుతావు" అన్నారు. అతనిని ఆలింగనం చేసుకొన్నారు. తన మెడలోని రుద్రాక్షమాలను అతని మెడలో వేసినారు. తన చొక్కా నొకదానిని స్వయంగా తొడిగి – ఒక కౌపీనాన్ని కూడా యిచ్చారు. ఒక జెండాను యిచ్చి, తన నోట్లోనుండి వెడలగ్రక్కిన ఆత్మపాదుకలను యిచ్చి వాటిని మఠంలో ప్రతిష్ఠించమని చెప్పారు. సదా ఔదుంబర వృక్షపు నీడలో వుండమని, అక్కడే ఒక మఠాన్ని స్థాపించమని ఆదేశించినారు. ఈ కార్యక్రమమంతా బాలప్పను యోగి అని దీవించి – సన్యాస ఆశ్రమం ఇచ్చిన విధముగా నున్నది. ఆనాటి నుండి బాలప్ప, 'బాలప్ప మహరాజ్'గా మారిపోయినాడు. వారిని అనేకులు అనుసరించినారు. శ్రీస్వామి ఆదేశానుసారము బాలప్ప మహరాజ్ మఠమును నిర్మాణము చేసినారు. బాలప్ప మఠ నిర్మాణమునకు స్థలాన్ని వెదుకుచుండగా శ్రీ ఆంజనేయస్వామి ప్రత్యక్షమై అందుకు యోగ్యమైన స్థలాన్ని తామే చూపించారు. అక్కడ మఠ నిర్మాణం సాగినది. అందులోనే శ్రీస్వామి ప్రసాదించిన పాదుకలను ప్రతిష్ఠించినారు. దీనినే బాలప్ప మఠంగా పిలుచుచున్నారు. వీరు దీనిని కేంద్రముగా చేసుకొని శ్రీస్వామి నిర్యాణం చెందిన తరువాత 32 సంవత్సరముల వరకు అనేకమందిని సన్మార్గంలో నడిపిస్తూ దైవకార్యం కొనసాగించి సిద్ధిపొందారు. అదే నేటి ప్రఖ్యాతమైన బాలప్ప మఠం.

***శివ శివ శివ శివ శివాయ నమః ఓం***
***హర హర హర హర హరాయ నమః ఓం***
***శివాయ నమః ఓం హరాయ నమః ఓం***
***శివాయ నమః ఓం హరాయ నమః ఓం***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**
**ఇరువది తొమ్మిదవ అధ్యాయము** సంపూర్ణము



ఓం శ్రీ సాయిరాం
ఓం అవధూత చింతన
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పదియవ అధ్యాయము

విద్యాసాగరా!

**వేదాధ్యయనంవలన, తపశ్చర్యలవలన, పూజాది వ్రతముల వలన, బ్రహ్మచర్యాదులవలన, హరించిన పాపాలు తిరిగి తలచూపటం సంభవం. అలా అవి తిరిగి తల చూపకుండా వుండటానికి వాటిని నిర్మూలనం చేసుకోవటం చాలా అవసరం. పాప నిర్మూలనమన్నది, శ్రీసద్గురు చరణాలను ఆశ్రయించటం ద్వారా, ఆయన సేవకు సర్వస్వాన్ని అర్పించటం ద్వారా మాత్రమే సంభవమవుతుంది. అంతేకాని వేరే మార్గం ఏదీ లేదు. అందువలన సద్గురు చరణాలకు తను – ధన – మాన ప్రాణములను అర్పించాలి. దానిద్వారా తరించాలి, దానికై తపించాలి – విచారించాలి – జీవిత లక్ష్యమును పొందాలి –**

అనిచెప్పి నిత్యానందుడు ఈ అధ్యాయమును ప్రారంభించినాడు. అక్కల్‌కోటలో చింతోపంత్‌తోల్ అను భక్తుడు వున్నాడుకదా! అతను నిత్యము తాను చేయు అర్చనలను నిర్వర్తించుకొనుచు, శ్రీస్వామివారిని దర్శించేవాడు. చింతోపంత్‌తోల్ శ్రీస్వామిని దత్తావతారంగా విశ్వసించేవాడు. అందరితోను శ్రీస్వామి లీలలను గురించి చెప్పుకొనేవాడు. ఇతనేకదా శ్రీరాజామాలోజీకి శ్రీస్వామిగురించి చెప్పినది. భక్తుడు తన ఇష్టదైవానికి పూజచేసే సమయంలో అతని గురువు అక్కడకు వచ్చినచో ఆ పూజను గురువుకే చెయ్యాలనిగదా శాస్త్ర ప్రబోధం. శ్రీస్వామి ఈ సత్యాన్ని అందరికీ తెలుపుటకై భక్తుడైన చింతోపంత్‌కు విశేషమైన రీతిలో చెప్పినారు. చింతోపంత్‌తోల్ ఇంటిలో విష్ణువు

విగ్రహం ఒకటి వుండేది. ఒకసారి అతను ఆ విగ్రహానికి కోటి తులసిపూజ చేయాలని నిశ్చయించుకొని నిత్యమూ నియమంగా కొంత సంఖ్య పూర్తి చేసేవాడు. పూజ మొదలుపెట్టిన రెండవరోజునుండి సరిగ్గా పూజ సమయానికి శ్రీస్వామి స్వయంగా వారి ఇంటికి వచ్చేవారు. పూజకోసం వుంచిన తులసీ దళాలను చింతోపంత్ శ్రీస్వామి చరణాలమీద వేసి నమస్కరించేవాడు. చివరిరోజున షోడశోపచార పూజతో తులసిపూజ ముగించాడు. అతని భక్తికి మెచ్చి ఆనందంలో మునిగియున్న శ్రీస్వామి సమర్థుల చుట్టూ ఒక విచిత్రమైన దివ్యకాంతి చింతోపంత్‌నకు స్పష్టంగా కనిపించింది. అతని కళ్లు ఆనందభాష్పాలతో నిండాయి.

చింతోపంత్‌తోల్ పారవశ్యములో మునిగిపోయి శ్రీస్వామిని –

"దేవాదిదేవా! సద్గురు మౌళీ! సర్వభూతములకు నీవు సఖుడవు – నిర్గుణుడవైన పరబ్రహ్మవు నీవు! నావంటి వారిని ఉద్ధరించటానికి ఈ మానుష శరీరమును ధరించినావు. నీవే తల్లివి – తండ్రివి – గురుడవు – దైవానివి, సర్వ విధముల, సకల లోకములలో జరుగు పూజలను సేవలను గ్రహించువాడవు నీవే! నీవే విష్ణువు, నీవే బ్రహ్మవు, నీవే శివుడవు, గురుడవు – శిష్యుడవు నీవే. నాది, నేను అనునది కేవలం సాక్షీభూతములు – సకల భూతనాయకుడవు నీవే. నిన్ను సేవించు భాగ్యం కలిగినది – నిరంతరము మీ పాద పద్మములను సేవించు వరం ప్రసాదించండి" అని –

చేతులు జోడించి ప్రార్థించి వారికి పాదాభివందనం చేశాడు. శ్రీస్వామి చాలా సంతోషించి "తథాస్తు" అని దీవించినారు. విచిత్రమేమనగా శ్రీస్వామి వెళ్ళిన తరువాత వారు ఆశీనులైన పీటమీద శ్రీస్వామి పాదాలు స్పష్టంగా ముద్రింపబడి వున్నాయి. ఏ వడ్రంగీ చెక్కలేనంత అందముగా వున్నాయి. వాటిని ఇప్పటికీ అక్కల్‌కోటలో శ్రీస్వామి మందిరములో చూడవచ్చును. ఈ సంఘటన ద్వారా శ్రీస్వామి శుద్ధమైన, నిర్మలమైన భక్తి కలవారికి వశమై వుంటారు అనేది సత్యమైన మాట.

మహారాష్ట్రలో ప్రసిద్ధి చెందిన ఉపన్యాసకుడు – వేదాంతి అయిన శ్రీ విష్ణుబువా బ్రహ్మచారి వుండేవాడు. అక్కల్‌కోటలో అతని ఉపన్యాసములు ఏర్పాటుచేసి శ్రీరాజామాలోజీరావు అతనిని ఆహ్వానము చేసినాడు. అతనికి గొప్ప వేదాంతినని, వేద వేదాంగములను పురాణ ఇతిహాసములను చదువుకొన్న



పండితుడనని గర్వంగా వుండేది. దానికితోడు అతని ఉపన్యాసములకు చాలామంది జనులు ఆకర్షితులయ్యేవారు. అతను ఒకరోజున శ్రీస్వామిని దర్శించటానికి వచ్చినాడు. అతను తన పాండిత్యాన్ని శ్రీస్వామి ముందు ప్రదర్శించదలచి, శ్రీస్వామివారిని "ఓ యోగిరాజా! బ్రహ్మతదాకార వృత్తి అంటే ఏమిటి?" అని ప్రశ్నించినాడు. శ్రీస్వామివారు అతని మనోగర్వము గమనించి ఏమీ సమాధానం యివ్వలేదు. అతను చాలా సమయం అక్కడ గడిపి తన ప్రశ్నకు సమాధానం రాకుండుట చూచి శ్రీస్వామివారికి ఏమీ తెలియదనుకొని విజృంభించి వేదాంతములో అతి చిన్న విషయానికి అర్థం తెలియని వీరిని జనులందరూ అంధవిశ్వాసములతో బ్రహ్మరథము పడుతున్నారని తలచి శ్రీస్వామిని గురించి అందరిదగ్గరా హేళనచేసి చులకనగా మాట్లాడసాగాడు. అయినా శ్రీస్వామి ఏమీ పట్టించుకోలేదు. అతని విషయంలో మౌనంగానే వుండిరి. ఒకరోజు రాత్రి బ్రహ్మచారికి కలలో కొన్ని వేల తేళ్ళు మీదకు వస్తున్నట్లు కనిపించాయి. అందులో వాటిని తప్పించుకొనే ప్రయత్నంలో అటూ ఇటూ పరుగులు పెడుతున్నప్పటికీ, ఒక తేలు అతనిని కుట్టటంతో ఈ బ్రహ్మచారి "చచ్చాన్రోయ్!" అని అరిచాడు. ఆ కేకకు ఆ ప్రక్కనే పడుకొని నిద్రపోతున్న ఒక పారశీక భక్తుడు నిద్రలేచి బ్రహ్మచారిని నిద్రలేపి కారణమడిగాడు. అతను కలలోని దృశ్యాన్ని మరువలేక భీతితో వణికిపోతున్నాడు. కొంత సమయం తరువాత తన కలనంతా వర్ణించాడు. కొన్ని రోజుల తరువాత శ్రీ స్వామిని దర్శించాడు. అతడు తన తెలివిని మరల ప్రదర్శించ దలచి శ్రీ స్వామిని "ఓ మహాత్మా! బ్రహ్మతదాకార వృత్తి అంటే ఏమిటి?" అని అడిగినాడు. శ్రీస్వామి కోపముతో మండిపడుతూ "మూర్ఖుడా! వందల తేళ్ళు కలలో కనిపించినంత మాత్రానే కేకలుపెట్టి ప్రక్కన పడుకొన్న పారశీకుని కూడా హడలగొట్టావుకదా! నీవుకూడా వేదాంతం మాట్లాడటమేనా! 'బ్రహ్మతదాకార వృత్తి' అంటే అంత సులభము అనుకొంటున్నావా? గొంతెత్తి ఉపన్యాసాలివ్వడంతోనూ, మాటలతో గారడీ చేయడంతోనూ బ్రహ్మతదాకార వృత్తి రాదు. పుస్తకం చదివితే జ్ఞానం వస్తుందా? అంత మాత్రాన పెద్ద యోగివయ్యావనుకొన్నావా? ఇక్కడనుండి పో!" అని కేకలేశారు. ఆ తరువాత కొన్ని రోజులకు అతనిలో అంతర్మథనం ప్రారంభమైంది. తిరిగి భక్తితో శ్రీస్వామిని దర్శించి పాదాభివందనం చేసినాడు. అప్పుడు శ్రీస్వామివారు అతనితో "నిరాకార నిర్గుణ పరబ్రహ్మ విశ్వంలో జరిగే




ప్రతి పరిణామానికి స్పందించక పూర్తి నిర్లిప్తతతో సాక్షీభూతుడుగా వుండగలగటమే ఆ మాటకు అర్థము. అది పుస్తక జ్ఞానమువలన, వేదాంత తాత్త్విక చర్చల వలన లభించదు" అని తెలిపిరి. దానితో అతనిలోని గర్వము తొలగినది. శ్రీస్వామి సకల విద్యా స్వరూపమని, సకల వేదాంతసారమని గ్రహించి వారిని క్షమించమని వేడినాడు. శ్రీస్వామి దయతలచి తదేక దృష్టితో అతనిలో బ్రహ్మానుభూతిని పొందేలా చేశారు. కొంత సమయం దానిలో లీనమైన ఆ బ్రహ్మచారి సమాధిస్థితిని పొందినాడు. తరువాత కాలములో అతను సుస్థిరమైన నమ్మిక గలవాడైన భక్తుడిగా మారిపోయాడు. శ్రీస్వామి అతనికి యోగదీక్షను ఇచ్చి ఆశీర్వదించినారు. ఆ తరువాత అతను చాలా గొప్పయోగిగా ప్రసిద్ధిచెందినాడు. కొన్ని గ్రంథాలు కూడా రచించినాడు. అతను శ్రీస్వామిని పూర్ణ అవతార పురుషుడిగా గుర్తించి వారి గురించి ప్రచారం చేసినాడు.

స్నేహం అనేది చాలా గొప్పది. అది మానవునికి మానసికమైన బలం చేకూర్చుతుంది. అయితే ఉత్తమమైన స్నేహం సద్బుద్ధి కలవారి మధ్య స్నేహం – వారికి సత్సాంగత్య ఫలితమును కలిగించుతుంది. వక్రబుద్ధి కలవారి స్నేహం – ఆపదలపాలు చేస్తుంది.

సమానమైన భావములు సమానమైన స్థితిగతులు గలవారిమధ్య స్నేహం శాశ్వతముగా నుండి వారికి మేలు చేస్తుంది. హెచ్చు తగ్గులు – వ్యతిరేక భావములు గలవారి మధ్య స్నేహం అపఖ్యాతిపాలు చేస్తుంది.

విద్యాసాగరా!

సహవాసంవల్ల చెడిపోతున్న తన భక్తుని శ్రీస్వామి రక్షించుకొన్న కథను చెబుతాను విను అని శ్రీనిత్యానందుడు చెప్పసాగినాడు. శృంగేరి మఠంలో వుండే శాస్త్రి అనే పండితుడు అక్కల్‌కోటకు వచ్చినాడు. అతనికి బావడేకర్ అనే మిత్రుడుండేవాడు. అతను తన మిత్రుడితో కలసి శ్రీస్వామివారి దర్శనానికి వెళ్ళినాడు. ఆ సమయంలో శ్రీస్వామి చిన్నపిల్లలతో ఆడుకొనుచున్నారు. శ్రీస్వామిని చూస్తూనే అతనికి నచ్చలేదు. అతను ఎరిగిన స్వాములు, నిత్య అనుష్ఠానపరులు. ఆశ్రమములలో సన్యాస ఆశ్రమము స్వీకరించి ముక్తికోసం జీవించుచూ, శిష్యులకు ధార్మిక విద్య ప్రబోధం చేయువారు, మరియు వేదాంత ఉపన్యాసములు ఇచ్చేవారు. కాని శ్రీస్వామి చర్యలు సాధారణముగా నుండుట చూచి, వారు ధరించిన కౌపీనం ద్వారా సన్యాస ఆశ్రమ లక్షణాలు తెలియక



– వీరిని పిచ్చివాడు అని అనుకొనినాడు. అంతేకాక అక్కడినుండి స్నేహితుని ఇంటికి వెడుతూనే శాస్త్రి బావడేకర్‌తో “ఈ మహాత్ముని వలన ఏమి లాభం? వట్టి పిచ్చివాడిలా కనబడుతున్నాడే! ఆధ్యాత్మికంగా ఈయన నిన్ను ముందుకు తీసుకుపోలేడు. నేనేనయం నిన్నొక మంచి పండితుడుగానైనా తయారు చేయగలను” అని అన్నాడు.

బావడేకర్ స్వతహాగా శ్రీస్వామివారి భక్తుడు. కాని శాస్త్రిగారి మాటల వలన అతనికి శ్రీస్వామిపైన గల భక్తిశ్రద్ధ కొద్దికొద్దిగా సడలిపోయినవి. అతనుకూడ శాస్త్రిగారి మాటలలో సత్యం వుంది కాబోలు అని అనుకొనినాడు. ఆ రాత్రి వారిద్దరు గదిలో తలుపులు గడియ వేసుకొని పడుకున్నారు. కొంతసేపటికి తలుపులు వాటంతట అవే తెరుచుకొన్నాయి. శ్రీస్వామి గడపదగ్గర నిలబడి వున్నారు. శ్రీస్వామి రావటంతోనే బావడేకర్ చేతులు జోడించినాడు. వారు అతనితో నీవుకూడా శాస్త్రిలాగా ఎప్పుడు పండితుడివి అవుతావు? పాపము అతను అరిషడ్వర్గాలైన కామ, క్రోధాదులకు బానిసయై వున్నాడు. గొప్ప పాండిత్యాన్ని గడించినా అతని పాండిత్యము నిరర్థకము”. ఇలా అంటూ శ్రీస్వామి హఠాత్తుగా అదృశ్యమైనారు. బావడేకర్ శ్రీస్వామిమీద వున్న విశ్వాసం సడలించడం తనదే తప్పని గ్రహించినాడు. అక్కడే పడుకొని వున్న శాస్త్రికి ఇంత జరుగుతున్నా మెలకువ రాలేదు. మరుసటిరోజు ఉదయం వెళ్ళి శ్రీస్వామిని తన తప్పు మన్నించమని ప్రార్థించినాడు. శ్రీస్వామి పకపకా నవ్వి దీవించి పంపినారు. భక్తులు సాంగత్య దోషములవల్లకూడా పతనం చెందే అవకాశం వున్నదని ఈ కథవలన తెలుస్తుంది. సద్గురువులను సమభావంతో చూడగలిగినవాడే జ్ఞాని – లేనిచో పాండిత్యం వున్నా అజ్ఞానియే!”

***“నృసింహః కాశ్యపో యోగే శ్రీస్వామినాథో యతీశ్వరః !***
***ప్రజ్ఞాపుర నివాసీ చ చిరంజీవీ దిగంబర !!”***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పదియవ అధ్యాయము*** *సంపూర్ణము*



ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీం శ్రీపాద శ్రీవల్లభ
శ్రీ నరసింహ సరస్వతి యై నమః
ఓం శ్రీం శ్రీపాద మాణిక్య స్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది ఒకటవ అధ్యాయము

విద్యాసాగరుడు – "గురుదేవా! మీరు తెలుపుతున్న శ్రీస్వామి సమర్థుల లీలలు సకల ధర్మాలను తెలుపుచున్నాయి. శ్రీగురుతత్త్వం కొద్దికొద్దిగా బోధపడుచున్నది. అవధూతతత్త్వము అవగతమగుచున్నది. అయినా, ఆర్యా! పండితులు (పాండిత్యం కలవారు) ఈ తత్త్వమును ఎందుకు తెలుసుకోలేరు? ఉపనిషత్తులలో ఈ తత్త్వము గురించి పూర్తిగా విశదపరచి ఉన్నదికదా! మరి ఎందుకు వారు సద్గురువును గుర్తించలేదు? వివరముగా తెలపండి" అని ప్రార్థించినాడు.

శ్రీ నిత్యానందయోగి చిరునవ్వు నవ్వుచూ, విద్యాసాగరుని బుద్ధి కుశలతకు లోలోన ఆనందపడుచూ –

"నాయనా! నీవు అడిగిన విషయము అతి సూక్ష్మమైనది. వేద వేదాంతములను ఎంత అధ్యయనం చేసినా అందులోని అతి రహస్యమును గ్రహించుటకు సద్గురువుకు సర్వస్య శరణాగతి కావాలి. అట్లు కాని, కాలేని పండితులందరూ ఎంత కుశలురైనను ఈ తత్త్వాన్ని ఎరుగలేరు. వారికి అంతర్దృష్టి లేదు. అందువలన మోహములోపడి తిరుగాడుచుందురు. బాహ్యదృష్టి యున్నంతవరకు అంతర్దృష్టి మూతబడి వుండును. అతి తృష్ణ వీడిన వారియందు మాత్రమే అంతర్ దృష్టి ఉదయించును. విషయ లాలసులయందది ఎట్లుదయుంచును? నీచ కామములను విడనాడి తత్త్వముపై దృష్టినుంచవలెను. మనస్సును పరిపరి విధముల పోనివ్వక అత్యంత ఏకాగ్ర బుద్ధితో సత్యము నన్వేషింపవలెను. అప్పుడు ధ్యానమంతయు తెలివికి వచ్చును. భావాతీతమైన




సత్యము గోచరించును. ఆ సత్యమే అమృతతత్త్వమును పొందించును. తన్ను తాను తెలియక, తెలిసికొన ప్రయత్నింపక, పుస్తక జ్ఞానముతో అహంకరించువారు ఎంతటి పండితులైనా ఈ తత్త్వమును పొందలేరు.

కావున వినయశీలీ! నీవు అందులకై పూర్తిగా ప్రయత్నించుము. రా! మనము అక్కల్‌కోటలో శ్రీస్వామి సమర్థుల లీలలను ఇంకా కొన్ని తెలుసుకొందాము.

విద్యాసాగరా! శ్రీస్వామి వారివద్దకు కేవలం భక్తితో ముక్తికోరి వచ్చేవారికంటే కోరికలతోను భుక్తికోసం వచ్చేవారు చాలామంది వుండేవారు. శ్రీస్వామివారు వారి కోరికలను తీర్చి, ఆరోగ్యములను ప్రసాదించి భుక్తిమార్గము చూపటమే గాకుండా తమ శక్తితో వారిలో భక్తి జ్యోతిని వెలిగించేవారు. అంతేకాదు, శ్రీస్వామిని అనేకవిధాల పరీక్షించడానికి గూడా చాలామంది వచ్చేవారు. ఒకసారి అక్కల్‌కోటలో వుండే రాధ లేక రాహ అని పిలవబడే వేశ్య కూడా వచ్చినది. ఆమె చాలా అందగత్తె మరియు గొప్ప నాట్యకత్తె. ఏ పురుషుడైనా తన అందానికి దాసుడుగాక తప్పదనే గర్వము కలిగిన స్త్రీ. శ్రీస్వామి అంతటి స్వామి తనకు దాసుడైతే ఎనలేని ఘనత లభిస్తుందని, ఆయన మనో నిబ్బరాన్ని పరీక్షించేందుకు చక్కగా అలంకరించుకొని వారి సన్నిధికి వచ్చినది. శ్రీస్వామివారి వద్ద శ్రీ వామనబువా బ్రహ్మచారి, అతని మిత్రులు, మరికొంతమంది భక్తులు కూర్చుని వున్నారు. ఆమె వారికి పాదాభివందనంచేసి దగ్గరగా కూర్చున్నది. ఆమె రాకకు భక్తులు ఆశ్చర్యపోయినారు. ఎవరైనా కావాలని శ్రీస్వామిని పరీక్షించడానికి ఆమెను పంపినారేమోనని అనుకొనసాగినారు. శ్రీస్వామివారి దివ్యమైన రూపాన్ని చూడగానే, ఆమె మనస్సులో, ఆ శరీరం ఎప్పుడైనా స్త్రీ స్పర్శ కలిగియున్నదా! లేదా? అన్న సందేహం తలెత్తింది. శ్రీస్వామి ఆమెను చూచి చిరునవ్వు నవ్వి "నీవిక్కడకెందుకు వచ్చినావు? నానుండి నీకేమి కావాలి?" అని అడిగినారు. ఆమె వారివైపు తన సహజమైన వేశ్యగుణముతో కొంటెచూపులు చూడసాగినది. శ్రీస్వామి "పురుషునికి స్త్రీకి భేదమేమి? పురుషుడిలో లేనిది స్త్రీలో ప్రత్యేకంగా వున్నదేమిటి?" అని అడిగినారు. అందులకు ఆమె ముసిముసినవ్వులు నవ్వుచూ "పురుషునిలో లేనివి స్త్రీలకు అధికంగాను, అందముగానూ వున్నవి రెండు వున్నాయి. మీ కొరకు ఆ రెండు విలువైన కానుకలను తీసుకొచ్చాను" అన్నది. శ్రీస్వామి

పకపక నవ్వి "ఓహో! అలాగా! అవి నీకున్నాయా! నీ శరీరానికున్నాయా? నీవు వానిని తీసి మరొకరికి యివ్వగలవా? అయితేసరే! వాటిని నేను స్వీకరించానులే!" అన్నారు. మరుక్షణమే ఆమె స్తనాలు కృశించిపోయి వక్షస్థలము మగవాని ఛాతీలాగా మారిపోయింది.

ఆమె వృత్తికి ఆధారమైన పాలిండ్లు కృశించిపోవడంతో ఆమె గర్వమంతా పోయినది. ఆశ్చర్యంతోను, దుఃఖముతోను మౌనముగా నిలబడినది. అక్కడ అలా వుండగనే శ్రీస్వామివంటి యోగశ్రేష్ఠుడైన ఒక దివ్యపురుషుడిని తాను పరీక్షించ సాహసించుట ఎంతో అపచారమని పశ్చాత్తాప పడినది. ఆమె ఆంతర్యంలో కూడా పరిణామం కలిగి తన వృత్తిమీద అసహ్యం కలిగినది. ఆమె శుద్ధమైన భక్తితో శ్రీస్వామిని శరణు అంటూ పాదములకు నమస్కరించినది. గంగానది ఆవిర్భవింప చేసిన విష్ణుపాదాలే అవి అన్నభావన ఆమెలో కలిగినది. ఆ యోచన ఆమెలోని మాలిన్యాన్ని కడిగివేసినవి. ఆమె తన వృత్తిని పూర్తిగా మానివేసి నిత్యము శ్రీస్వామిని దర్శించుచుండేది. కొంతకాలానికి శ్రీస్వామి ఆమెకి తనయందు కలిగిన భక్తినిచూచి – ఆమెను ఆశీర్వదించిరి. ఆమెకు అవ్యక్తానుభూతి కలిగి అక్కడ నుండి శ్రీస్వామి అనుమతితో కాశీకి వెళ్ళి అక్కడ ధ్యానాదులను చేసుకొంటూ జీవించి బృందావన్‌లోనూ, కాశీలోను గడిపినది.

విద్యాసాగరా! ఈ విధముగా శ్రీస్వామిని విష్ణుబువా రూపంలో విద్యాశ్రీ – రాజామాలోజీ రూపంలో రాజ్యశ్రీ – వేశ్య రాధాబాయి రూపంలో సౌందర్యశ్రీ పరీక్షించి ఓడిపోయినవి. అంతేకాదు, శ్రీస్వామి సమర్థుల అద్భుతమైన ఆత్మసౌందర్యములో కరిగిపోయినవి. భగవంతుడు కరుణాసముద్రుడు తాను చేసిన పాపాలకు పశ్చాత్తాప పడుతున్న ఏ జీవినైనా క్షమించి కృపతో అనుగ్రహిస్తారు. మురికినీటి కాలువలు పరిశుద్ధమైన నదులలో కలిస్తే పరిశుద్ధమైనట్లు, దైవమువైపు మళ్ళిన అంతఃకరణ తన మాలిన్యాన్ని కోల్పోయి పరిశుద్ధమౌతుంది. దివ్యాకర్షణల పురుషుని ఏ ఆకర్షణలు కదిలించలేవు.

ఒక్కొక్కప్పుడు జోరుగా వర్షం కురుస్తుంటే శ్రీస్వామి తమను పల్లకిలో ఎక్కించి, ఆ వర్షంలో తిప్పమని భక్తులను కోరేవారు. అలాగే భక్తులు ఒక్కసారి పల్లకీని ఆరుమైళ్ళు మోసుకొనిపోయి అలసిపోయినారు. వారు పల్లకీ బరువుగా వుండడంతో మోయలేకపోయారు. శ్రీస్వామి పల్లకి దిగి అక్కడ ఒక భక్తుని గుఱ్ఱం ఒకటి పొట్టిది వుంటే దానిని తీసుకొని దానిమీద పక్క ఊరుకి పోసాగిరి. గుఱ్ఱం పొట్టిదిగాన శ్రీస్వామి పాదములకు రాళ్ళు కొట్టుకొంటున్నాయి. అది చూచి భక్తులు బాధపడి శ్రీస్వామితో "తాము తమ శరీర బరువును



తగ్గించినట్లయితే మేము పల్లకీలోనే మిమ్మల్ని తీసుకొని వెళ్ళగలము" అని చెప్పిరి. అందువలన దయామయుడైన శ్రీస్వామి అంగీకరించి పల్లకీలో కూర్చున్నారు. ఈసారి పల్లకీ మహాసునాయాసంగా పైకి లేచిపోయినది. కొంతదూరం పోయిన తరువాత బాగా చీకటిపడినది. ఆ రోజు రాత్రికి రోడ్డు ప్రక్కనే ఆగి అందరూ విశ్రాంతి తీసుకొన్నారు. ఉదయం నుండి నడచినడచి అలసిపోయినారు. భోజనం కూడా లేదు. అందరికీ ఆకలిగా వున్నది. అయినా ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. కొంత సమయం గడిచాక ఒక భక్తుడు శ్రీస్వామివారితో మెల్లగా "శ్రీస్వామీ! భక్తులందరూ ఉదయమునుండి ఏమీ తినలేదు. ఆకలిగా వున్నది ఏమి చెయ్యాలి. ఇక్కడ ఏ గ్రామమూ లేదు" అని అడిగినాడు. అప్పుడు శ్రీస్వామి "భయపడకండి ఒక భక్తుడు మంచి తినుబండారాలతో వస్తున్నాడు" అని చెప్పారు. ఇంతలో దూరంగా ఎవరో వచ్చుచున్న అలికిడి అయినది. కొంత సమయం తరువాత దేశ్‌పాండే అనే భక్తుడు ధార్వాడ్ నుండి సకుటుంబంగా బయలుదేరి ఆ దారినే శ్రీస్వామి దర్శనార్థం అక్కల్‌కోట వస్తున్నాడు. దారిలోనే వున్న శ్రీస్వామిని దర్శించినాడు. శ్రీస్వామికి అక్కడ వున్న వందమంది భక్తులకు వంట చేయించి షడ్రసోపేతంగా భోజనం పెట్టించాడు. అతను అక్కల్‌కోటలో అన్నదాన సంతర్పణ చేయడం కోసం తయారుగా వచ్చుచు దారిలోనే ఆ కార్యమును పూర్తిచేసినాడు.

అహమ్మద్ నగరం నుండి వచ్చిన భక్తుడు దర్శనానంతరం ఏదైనా రుచికరమైన వంట చేయించి శ్రీస్వామికి నివేదనగా యివ్వాలని, మనస్సులో అనుకొన్నాడు. శ్రీస్వామి అతని మనోభావమును గ్రహించి వెంటనే తనకు, పప్పు, పాయసం కావాలని కోరారు. ఆ భక్తుడు ఆనందముతో తన భార్యచేత ఆ వంటకాన్ని వండించి శ్రీస్వామిని ఆహ్వానించాడు. ముందు బ్రాహ్మణులకు పెట్టమనీ, తరువాత తాము తింటామనీ చెప్పారు. ఇద్దరు బ్రాహ్మణులకు రెండాకులలో వడ్డించి, మూడవ ఆకులో శ్రీస్వామికి వడ్డించారు. ఆ బ్రాహ్మణులు వారికి వడ్డించినవి తిని, మూడవ ఆకులోనివి కూడా వారికే కావాలని కోరినారు. దారితోచక, కాదనలేక దానిని కూడా వారికి వడ్డించినాడు. జరిగినది శ్రీస్వామికి తెలుపడానికి భార్యాభర్తలిద్దరూ శ్రీస్వామి దగ్గరకు వచ్చారు. వారిని చూచిన వెంటనే శ్రీస్వామి తమ పొట్టను అదుముకొని, పెద్దగా త్రేన్చి, ఆరోజు వారు భోజనానికి చేసిన పదార్థములన్నింటిని వివరముగా వర్ణించి, జీడిపప్పు ఎక్కువైందని చెప్పి, మిగిలిన వంటకాన్ని తెమ్మనినారు. అతని భార్య ఖిన్నురాలై "సద్గురుదేవా ఏమీ మిగలలేదు!" అని దీనంగా తెలిపినది. అందులకు శ్రీస్వామి

"అమ్మా! ఒక మూల బజ్జీ మిగిలివున్నది. తీసుకురా!" అన్నారు. ఆమె వెళ్ళి చూస్తే బుట్టలో ఒక ప్రక్కన నిజంగానే బజ్జీ మిగిలివుంది. ఆమె దానిని తీసుకొని వచ్చి శ్రీస్వామికి ఇచ్చినది. దానిని తిని వారు తృప్తిపడినారు. అక్కడ ఉన్నవారందరికి ఇది అరణ్యవాసములో ద్రౌపదీదేవిని అక్షయపాత్రలో ఒక్క మెతుకు వుంది. ఇవ్వమని, శ్రీకృష్ణుడు దానిని తిని తృప్తినొందిన ఆ సన్నివేశం గుర్తుకు వచ్చినది. శ్రీస్వామి శ్రీకృష్ణావతారం అని అనుకొనినారు.

చిప్లం గ్రామంనుండి గోపాలరావు అనే బ్రాహ్మణుడు శ్రీస్వామి దర్శనానికి అక్కల్‌కోట వచ్చినాడు. ఆరోజు అక్కడ భక్తుల రద్దీ ఎక్కువగానున్నది. అతనికి స్నానం చెయ్యటానికి కుండ, చెంబు ఎవ్వరూ ఇవ్వలేదు. ఎవరి తొందరలో వారున్నారు. ఎదురుచూచి ఎదురుచూచి చివరకు అతను ఒక దళితుని ఇంట్లో కుండను తీసుకొని స్నానం చేశారు. ఈ విషయం అందరూ వింతగా చెప్పుకొనినారు. శ్రీస్వామికి మామూలుగా హుక్కా అందించే బ్రాహ్మణుడు బల్వంతరావుకు ఈ విషయం తెలిసినది. అతను గోపాలరావును భోజనం దగ్గర సహపంక్తిలో కూర్చోనివ్వక, విడిగా కూర్చోబెట్టినాడు. గోపాలరావు ఏమీ మాట్లాడకుండా అలాగే కూర్చుని భోజనం ముగించినాడు. అయినా మనస్సులో అలా జరిగినందుకు బాధపడినాడు. ఆరోజు సాయంత్రం బలవంతరావు శ్రీస్వామికి భోజనం తీసుకొని వెళ్ళగా స్వామి అలిగి అతడు పెడితే తినక "అన్యకులస్థులను తాకితేనే అపవిత్రుడై పోతాడా ఏమిటి?" అని మందలించారు. ఆరోజు భోజనం బాలప్ప వచ్చి తినిపించవలసి వచ్చినది. ఆ తరువాత బల్వంతరావుచేత హుక్కా కూడా అందుకోలేదు. ఏ సేవకు అవకాశం యివ్వలేదు. నాలుగు రోజుల తరువాత అతనికి మతిచలించి పిచ్చివాడయ్యాడు. కొంచెం తెలివి కలిగినపుడు శ్రీస్వామి పాదాలమీదపడి తనను కాపాడమని వేడుకొన్నాడు. శ్రీస్వామి దయతో అతనిని గోపాలరావుకు సేవ చేయమనినారు. అలాచేసి అతను ఆ బాధనుండి విముక్తి పొందాడు. ఈ సంఘటన తరువాత ఎవ్వరూ ఇలా ప్రవర్తించేవారు కారు. అలా ఎవరైనా క్రొత్తవారు చేయబోతే శ్రీస్వామిని కోపగించుకొని శిక్షిస్తారు అని బలవంతరావు కథను తెలిపేవారు.

మహారాష్ట్ర ప్రాంతములోను, నిజాం రాజ్యంలోను తరచుగా ప్లేగు వ్యాధి వ్యాపించేది. అది ఎంతోమంది జనాలను పొట్టన పెట్టుకొనేది. ఆయా ఊరి జనులు శ్రీస్వామి వద్దకు వచ్చి శ్రీస్వామిని శరణు కోరినారు. రక్షింపమని ప్రార్థించేవారు. ఆయన వారితో "మీ గ్రామ దేవతకు సక్రమంగా నైవేద్యం



పెట్టండి. ఆ తరువాత నేనామెతో మాట్లాడతాను" అనేవారు. ఆశ్చర్యంగా ఆయా గ్రామాలలో శ్రీస్వామి చెప్పినట్లు చెయ్యగానే ఆ వ్యాధి తగ్గిపోయేది. ఆ సమయంలో ఎన్నో గ్రామాల ప్రజలు శ్రీస్వామివారి నుండి రక్షణ పొందినారు.

పూనా గ్రామంలో మోతే అనే గొప్ప కీర్తనకారుడుండేవాడు. అతనికి సంగీత ప్రావీణ్యమేగాక, వేదాంతపరమైన అర్థాలను సరళమైన భాషలో అందరికీ విపులంగా వివరించడము కూడా అలవాటు. అతను గొప్ప పేరు గాంచినవాడు అగుటచే ఎన్నో వేలమంది ప్రజలు అతని కీర్తన వినడానికి వస్తుండేవారు. శ్రీస్వామివారు కూడా సంకీర్తన సమయములో వెళ్ళి కూర్చుండేవారు. ఒకనాడు సంకీర్తన 'ఖాస్ బాగ్' అనే తోటలో జరుగుచున్నది. శ్రీస్వామికి ఒక ఆసనమును వేసినారు. శ్రీస్వామి దానిమీద కూర్చుని వున్నారు. సంకీర్తన చాలా మంచి రసవత్తరముగా వున్నది. అందరూ చక్కని అనుభూతిని పొందుతున్నారు. ఉన్నట్లుండి మోతే బిగ్గరగా "ఈ భవసాగరము నుండి మనను దాటించగల మహానుభావుడు ఎవరు?" అని అన్నాడు. అది విన్న శ్రీస్వామి ఒక కాలును క్రిందపెట్టినారు. మోతే పరుగెత్తుకొని వెళ్ళి ఆ పాదమును పట్టుకొని గుండెలకు హత్తుకుంటూ "అవును! ఈ పాదము మనలను తరింప జేయగలదు!" అని అంటూ ఉండగనే శ్రీస్వామి రెండో పాదము కూడా క్రిందకు దించినారు. మోతే భావోద్వేగముతో రెండు పాదాలను గుండెలకు హత్తుకొని, "ఈ పాద స్పర్శలే మనలను దరిజేర్చగలవు!" అంటూ తన్మయావస్థలో కన్నీరు కార్చసాగాడు. ఈ దృశ్యము చూచిన మిగిలినవారెందరో భక్తితో మనస్సు ద్రవించి ఆనందబాష్పాలు కార్చసాగినారు. అందరూ జయ జయ శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్‌కీ జై! అని నినాదములు చేసినారు.

***"కౌపీనధారీ సన్యాసీ సమర్థో జ్ఞాన భాస్కర!***
***నారాయణ స్వరూపి చ ధనదారా వివర్జిత!!"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పది ఒకటవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ దాం దత్తాత్రేయా నమః
ఓం శ్రీం శ్రీపాదవల్లభ నరసింహ
సరస్వతియై నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది రెండవ అధ్యాయము

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు సర్వాంతర్యామి! సర్వ హృదయములలో వుండేది వారే! సర్వులు వారి స్వరూపాలే. అందరి మనస్సులలోను ఏమి వుందో శ్రీస్వామి వెంటనే గ్రహించేవారు. వారి జీవితాలలోని అతి రహస్యములను బయటపెట్టేవారు. వారిని శిక్షించి మంచి మార్గంలో పెట్టేవారు.

ఒకసారి బరోడానుండి ఆచారవంతురాలైన బ్రాహ్మణ స్త్రీ జానకీబాయి శ్రీస్వామి దర్శనార్థమై వచ్చినది. ఆమె మడిగా వంటచేసి రోడ్డుమీద జనాన్ని తప్పుకొంటూ శ్రీస్వామికి నివేదించడానికి వచ్చినది. ఆరోజు భక్తులు చాలా ఎక్కువగా వున్నారు. చాలా కష్టముతో ఎవరినీ తాకకుండా లోపలికి వచ్చి శ్రీస్వామి ముందు భోజనమును వుంచి నమస్కరించింది. శ్రీస్వామి ఆమెతో "అమ్మా! ఇంత మడితో వండిన భోజనం మాకు వద్దు, ఆచారాలు, అనాచారాలు మాకు లేవు. మేము ఎవరు పెట్టినా తింటాము. ఈ భోజనం తీసుకొనిపోయి ఆ నాటకాలలో వేషాలేసేవాడున్నాడే, వాడికి యివ్వు! చాలా సంతోషపడతాడు!" అన్నారు. ఎవరికీ తెలియని తన జీవిత రహస్యం వేషాలువేసే వానితో తనకుగల సంబంధమును చెప్పిన శ్రీస్వామి దివ్యవాణికి ఆశ్చర్యపడి వారికి నమస్కరించి క్షమాపణ చెప్పుకొనినది జానకీబాయి. ఆమె మనస్సులో తండ్రీ ఇకమీదట నేను అలా ప్రవర్తించను నన్ను క్షమించి రక్షించు అని ప్రార్థించినది. అప్పుడు శ్రీస్వామివారు ఆమె తెచ్చిన భోజనం నుండి కొద్దిగా తీసుకొని నోట్లో వేసుకొనినారు. దానికి ఆమె చాలా సంతోషపడింది. శ్రీస్వామి ఆమెతో "నీవు తెల్లబడ్డాక నిజమైన భక్తి నీలో ఉదయిస్తుందిలే!" అన్నారు.



ఆశ్చర్యకరంగా ఆరోజునుండి ఆమె చేసిన పాపములకు శిక్షగా శ్వేత కుష్ఠువ్యాధి వచ్చినది. ఆరోజునుండే ఆమెలో శుద్ధమైన నిర్మల భక్తి ఉద్భవించినది. ఆ తరువాత చాలాకాలమునకు శ్రీస్వామి దయతో ఆమె ఆ వ్యాధినుండి విముక్తిపొంది మంచి భక్తురాలైనది.

బరోడా నివాసి రామశాస్త్రి డోంగ్రే శ్రీస్వామి దర్శనానికి అక్కల్‌కోట వచ్చినాడు. అక్కడ శ్రీస్వామిని దర్శించిన తరువాత అతని మిత్రులు దక్షిణదేశం వెళ్ళి శ్రీకార్తీక స్వామిని దర్శించేందుకు వెళ్ళుచూ, దారిలో శ్రీస్వామి సమర్థులను దర్శించటానికి అక్కల్‌కోట వచ్చినారు. వారు అందరూ తిరిగి బయలుదేరగా శ్రీస్వామి, వారి యాత్రను కొనసాగించమని ఆజ్ఞను ఇచ్చినారు. శాస్త్రి తాను కూడ వారితో వెళ్ళడానికి నిర్ణయించుకొని శ్రీస్వామిని దర్శించి అనుమతి కోరినాడు. శ్రీస్వామి అనుమతి ఇవ్వక అక్కడనే ఉండిపొమ్మనినారు. తను ఒక్కడు మిత్రులను వదలి వుండటానికి మనస్కరించలేదు. శ్రీకార్తిక స్వామిని దర్శించాలని మిత్రులతో యాత్ర చేయాలని అతనికి వున్నది. అయితే అక్కడ వున్న భక్తులు శ్రీస్వామి ఆజ్ఞను మీరవద్దు అన్నారు. వారి అనుమతి లేనిదే ఎవరూ వెళ్ళకూడదు. అది అంత మంచిదికాదు. వారి మాట విని వుండిపోండి. మీ మేలుకొరకే అలా చెప్పి వుంటారు అని సలహా యిచ్చినారు. శ్రీ శాస్త్రి ఆగిపోయినాడు. కార్తీక పౌర్ణమినాడు శ్రీస్వామికి హారతి సేవ జరుగుచున్నది. శ్రీస్వామి రామశాస్త్రి డోంగ్రేకు మాత్రం కార్తికస్వామిగా దర్శనము యిచ్చినారు. హారతి అయ్యేవరకు ఆ దర్శనము కొనసాగినది. ఈ అద్భుత లీలలను చూచి శాస్త్రికి శ్రీస్వామి ఎందుకు ఆగిపొమ్మన్నారో తెలిసినది. సకల దేవతాస్వరూపుడైన శ్రీస్వామి ప్రత్యక్షంగా అక్కడ వుండగా ఇక ఇతర యాత్రలు ఏల? ఈ అక్కల్‌కోటయే సకల పుణ్యక్షేత్రాల సంగమమని అర్థమైనది. అచంచలమైన విశ్వాసంతో రెండు సంవత్సరాలు శ్రీస్వామిసేవలో వుండిపోయినాడు. ఆ తరువాత అతనిని శ్రీస్వామి బరోడా వెళ్ళమనిరి. శాస్త్రి అక్కడ పురాణ పఠనము, హరి సంకీర్తన చేస్తూ దైవసాధనలో జీవితం గడిపినాడు.

ఒకరోజు దేశముఖ్ వాడలో శ్రీస్వామివారు, సేవకులు మరియు భక్తులు అందరూ కూర్చొనియుండగా అచ్చటికి సయ్యద్ మహమ్మద్ అనే ముస్లిం వచ్చాడు. అతడు ఇస్లాం మత గ్రంథాలను క్షుణ్ణంగా చదివిన తత్త్వవేత్త. అతను శ్రీస్వామివారు ఎక్కడున్నారని అడుగుతూ వచ్చాడు. అక్కడ ఉన్నవారు ఏమని



సమాధానం ఇవ్వాలో తెలియక బదులు పలుకలేదు. శ్రీస్వామివారు అక్కడ వుండగానే శ్రీస్వామివారు ఎక్కడ అని అంటాడేమి! అని - అతను అన్యమతస్థుడు అని వూరుకుండినారు. ఇంతలో శ్రీస్వామియే "ఇటు చూడుము నేనే శ్రీస్వామిని" అని గట్టిగా చెప్పారు. సయ్యద్ వారివైపు చూశాడు. ఆ స్వరం వింటూనే, శ్రీస్వామిని దర్శించుతూనే ఆయన గజగజ వణికిపోయాడు. అతనికి కన్నులవెంట ఆనందభాష్పాలు రాలుచున్నవి. శరీరమంతా తీవ్రంగా కంపించింది. కొద్ది క్షణాలలో అతను పరవశించి కన్నులు మూసుకున్నాడు. వెంటనే అతను సమాధిస్థితిలోకి వెళ్ళాడు. కొంతసేపటికి అతనికి బాహ్యస్మృతి కలుగగానే అతడు మోకాళ్ళమీద కూర్చుంటూ "ఓ శ్రీస్వామీ! నీవు సాక్షాత్తు హజరత్ ఆలీయే! ఇంతవరకు నేనెందరినో సాధువులను, ఫకీర్లను చూచానుగాని, యిట్టి దర్శనం నాకెన్నడూ కలుగలేదు. నా జన్మ ధన్యమైనది. తాము యిచ్చే ఆజ్ఞప్రకారం తమను సేవించుకుంటాను!" అని భక్తిపారవశ్యంతో విన్నవించుకున్నాడు. శ్రీస్వామి తదేకంగా అతనికేసి చూచి "నీవు హైదరాబాదు వెళ్ళి అక్కడే నీ సాధన చేసుకో. మేము అక్కడా, యిక్కడా యెల్లెడలా వున్నాము" అన్నారు. వారి ఆజ్ఞ ప్రకారము అతడట్లే వెళ్ళి తన శేషజీవితము దైవసాధనలో గడిపినాడు.

ఏకనాథ్ మందిర ప్రాంతములో త్రాగటానికి నీళ్ళు లేవు. ఒక లోతైన బావి వున్నది. కాని అందులో నీళ్ళు మురికి వాసన కొడుతున్నాయి. ఒకరోజున శిష్య, భక్త సమేతంగా శ్రీస్వామివారు ఆ మందిరానికి విచ్చేసినారు. అక్కడ పరిస్థితి తెలుసుకొని ఒక పెద్ద కర్రను తీసుకొని దానిని నీటిలో ముంచి రెండవ చివర తన ముక్కుకు ఆనించుకొని వాసన చూచినారు. భక్తులందరికీ, ఆ ప్రాంతమువారికి ఆశ్చర్యము కలిగినది. ఆనాటినుండి ఆ నీరు స్వచ్ఛమై అందరికీ త్రాగడానికి పనికొచ్చాయి. ఆ ప్రాంతములోని వారికి మంచినీరు కరువు తీరినది. సద్గురు అనుగ్రహంతో ప్రకృతిలో కూడా మార్పు జరుగగలదు. వినాయకరావు కాకా సాహెబ్ అనువాడు బ్రిటిష్ సర్కారులో దుబాసిగా యుండేవాడు. అతనికి శ్రీస్వామిని గురించి తెలిసినది. ఆనాటి మరాఠి ఇంగ్లీషు పేపరులో శ్రీస్వామి వారి గురించి వ్రాసినవి చదివి వారిని చూడాలని అతను అక్కల్‌కోట చేరినాడు. శ్రీస్వామివారిని దర్శించి పాదాభివందనములు చేసినాడు. శ్రీస్వామి వానిని చూచి ఆశీర్వదించి, సముద్రతీరాన నివాసము ఏర్పాటు చేసుకోమని సలహా



యిచ్చారు. కొద్దికాలానికి అతను ఉద్యోగ విరమణ చేశాక శ్రీస్వామివారు చెప్పినట్లు సముద్రతీరాన గృహమును నిర్మాణం చేసుకొని జీవించసాగినాడు. ఒకసారి అతని భార్యకు తీవ్రమైన జబ్బు చేసినది. వినాయకరావు అక్కడనుంచే శ్రీస్వామిని దయతో తన భార్యకు అనారోగ్యమును నివారించి ఆరోగ్యము కలిగింపుము అని ప్రార్థించినాడు. శ్రీస్వామి వాని ప్రార్థనను ఆలకించి దయతో "రావుజీ దీకాజాదేవళే" అను వాని ద్వారా తన పాదుకలను పంపినారు. వానిని పూజించుచుండగనే ఆమె అనారోగ్యము అంతా నివారణ జరిగి ఆరోగ్యము చేకూరినది. శ్రీస్వామివారి పాదుకలను సముద్రతీరాన మహాలక్ష్మి అనేచోట ప్రతిష్ఠ చేశాడు. నేటికీ వానికి దివ్యముగా పూజలు జరుగుచున్నవి. అనేకమంది భక్తులు వానిని దర్శించుచున్నారు.

విద్యాసాగరా! శ్రీస్వామి అనేక దేవతా స్వరూపాలలో భక్తులయొక్క కోరికల ననుసరించి కనిపించుటయే కాకుండా ఒకేసారి అనేకచోట్ల కనిపించి ఆర్తుల కోరికలు తీర్చిన సందర్భాలు అనేకము కలవు. అవి అనంత సాగరములు – ఒకే సమయంలో వేలాది మంది శ్రీస్వామిని పూజించి – వారి అనుగ్రహమును పొందినారు. మరియు నేటికిని పొందుచున్నారు. నీవు నరసింహావాడిలో శ్రీస్వామిని స్వప్నరూపంలో దర్శించితివిగదా! అటులనే అనేకమందికి స్వయంగా స్వప్నంలో కనిపించుచుందురు. అది వారి లీలావిలాసము అని నిత్యానందుడు చెప్పెను.

***సుబ్రహ్మణ్యం సుబ్రహ్మణ్యం షణ్ముఖనాథ సుబ్రహ్మణ్యం***
***శివ శివ శివ శివ సుబ్రహ్మణ్యం – హర హర హర హర సుబ్రహ్మణ్యం***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పది రెండవ అధ్యాయము*** సంపూర్ణము





ఓం శ్రీ సాయిరాం
ఓం శ్రీ సకల దేవతా స్వరూప
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది మూడవ అధ్యాయము

విద్యాసాగరా!

యోగతత్త్వ ఉపనిషత్ ఇలా చెప్పుచున్నది. అజ్ఞానమే బంధకారణము. జ్ఞానమువల్లనే మోక్షము కలుగును. ప్రథమములో నిదియే జ్ఞానస్వరూపము. జ్ఞేయమునకు జ్ఞానమొకటియే సాధనము. జ్ఞానమువలన పరమ పదము లభించును. అదియే జీవసారము. విభాగములు లేనిది – దోషము లేనిది. సాక్షాత్తు సత్, చిత్, ఆనందస్వరూపము, పుట్టుక, ఉనికి, చావు, స్ఫురణ లేక జ్ఞాపకము దానికి లేవు. ఇది జ్ఞానము. అనగా ఉత్పత్తి – వినాశములు లేని నిరంతర చైతన్యము జ్ఞానమనబడును. కావున నీవు ఇట్టి జ్ఞానమును సద్గురుదేవుని వలన పొందెదవుగాక! అని దీవించి శ్రీస్వామి సమర్థులను ఈ వాక్కునకు అట్టి శక్తిని యివ్వమని ప్రార్థించి, తిరిగి ఈ అధ్యాయమున శ్రీస్వామి లీలలను తెలుపసాగినాడు.

ఆబాజీబువారామదాసి గొప్ప వేద పండితుడు, ప్రఖ్యాత కీర్తనాకారుడు. అతడు శ్రీస్వామి దర్శనానికి అక్కల్‌కోట వచ్చారు. అయితే అతనికి తన పాండిత్యాన్ని గుర్తించి గౌరవిస్తారు అనే విశ్వాసం వుండేది. అంతేకాదు, అతను గొప్ప విద్వాంసుడను అనే గర్వముకూడా వుండేది. అతను శ్రీస్వామి సన్నిధికి వచ్చి నమస్కరించినాడు. అయితే శ్రీస్వామి మొదటిరోజంతా అతనిని గమనించలేదు. దర్శనము కూడా యివ్వలేదు. ఆ సమయంలో శ్రీస్వామివద్ద చాలా రద్దీగా వున్నది. రామదాసికి దగ్గరగా వెళ్ళే అవకాశం కుదరలేదు. శ్రీస్వామి ఎవరెవరినో పిలిచి మాట్లాడుచున్నారు, ఆశీర్వదించుచున్నారు. కానీ వీరికి



అవకాశం ఇవ్వలేదు. అతను శ్రీస్వామి సమర్థులను అవతార పురుషులు అని అంటారే – మరి వారు నా అంత పండితునికి, భక్తునికి దర్శనమెందుకివ్వలేదు? అనుకొనినాడు. అయినా వారి దర్శనము, వారిచే గౌరవము లభించనిదే తిరిగి పోకూడదని నిశ్చయించుకొన్నాడు. మరుసటిరోజున ఉదయం అతను దర్శనానికి వెళ్ళే సమయానికి శ్రీస్వామి వెళ్ళి దగ్గరగానున్న పేడకుప్పమీద కూర్చున్నారు. ఆచారవంతుడైన రామదాసి పశువుల పేడ, చెత్తా చెదారము, పాత గుడ్డపీలికలు – ఎముకలు ముక్కలు వున్న ఆ ప్రదేశంలో అడుగుపెట్టడానికి మొదట వెనుకాడినా, ఆయన తనను పరీక్షిస్తున్నారని తలచి దగ్గరగా వెళ్ళి నమస్కరించినాడు. శ్రీస్వామి అతనివేపైనా చూడకనే ఒక సేవకుణ్ణి రెండు కూజాలు నిండుగా నీరు తెమ్మనినారు. అతడు వెంటనే తెచ్చాడు. శ్రీస్వామి వాటికేసి, ఆబాజీబువా రామదాసికేసి పరీక్షగా చూచి : “ఇవి ఇంత నిండుగా వుంటే వీటిలో యేమైనా పోసేదెలా?” అని ప్రశ్నించి ఆ కూజాలలోని నీటినంతా పారబోసి, “ఇలా వుంటే ఇప్పుడేమైనా పోయవచ్చు” అన్నారు. విద్యావంతుడను గర్వముతోను, కేవలము వేదపఠనముతోను మనసు నింపుకోవడం గురుకృపను ఆటంకమే కాగలదు. అంతేకాదు, మానవుడు ఎంత విద్వత్తు సంపాదించినా పేడకుప్పలాంటి అహంకారముపై కూర్చుండ కూడదని అందువలన అతడు నేలపాలైన నీరువలె యిహపరాలు రెండూ సాధించలేనివాడు అవుతాడని శ్రీస్వామి వారి చర్యలకు అర్థం మరియు రామదాసికి హెచ్చరిక. అయినా ఆబాజీబువాలోని అంతరాత్మకు విషయం పూర్తిగా బోధపడక అతని విద్యాగర్వం దానిని ఒప్పుకోలేదు. వారు ఆ భావాన్ని త్రోసిపుచ్చారు. మరుక్షణమే శ్రీస్వామి అతనికేసి కఠినంగా చూచి, “ఎంత పవిత్ర గ్రంథాలను వీపుపై మోసినా గాడిదకొచ్చే దేమున్నది?” అని గట్టిగా చెప్పారు. ఆ మాట వినడంతోనే ఆ పండితునిలోని జ్ఞానం మేలుకాంచినది. విషయం పూర్తిగా అవగతము అయినది. అతను పశ్చాత్తాపముతో శ్రీస్వామి పాదములపైబడి క్షమించమని కోరినాడు. శ్రీస్వామి చిరునవ్వునవ్వి దీవించినారు. అతను కొన్నిరోజులపాటు అక్కల్‌కోటలోనే వుండి శ్రీస్వామిని సేవించినాడు. శ్రీస్వామి అతనికి తన పాదుకలు యిచ్చి అనుగ్రహించినారు. అతను శ్రీస్వామివద్ద సెలవు తీసుకొని తన గ్రామం వెళ్ళినాడు. నిరంతరము శ్రీస్వామి పాదుకలను సేవించి తరించినాడు.

అక్కల్‌కోటకు దగ్గరగానున్న లోహరగాంవ్ అనే గ్రామంలో బాపూకులకర్ణి




అనేవాడు వుండేవాడు. అతను కంఠంలో బాధ వుండి వైద్యులను సంప్రదించగా వారు అతని కంఠానికి శస్త్రచికిత్సచేసి రంధ్రమును పెట్టినారు. దీనివలన బాధతో అన్నపానీయములు స్వీకరించుటలేదు. అతనికి అది దీర్ఘవ్యాధి అని – మృత్యుముఖంలోనికి తీసుకొని వెళ్ళగలదని ఇతరులు తెలిపిరి. కొందరు మిత్రులు – సర్వరోగాలను నివారణ చేయు శక్తి శ్రీదత్త పాదాలకు వుంది అని, శ్రీక్షేత్ర గాణుగాపురం వెళ్ళమని సలహా యిచ్చినారు. అతనుకూడ భక్తికలవాడే. వారి మాటలను, దానిలోని శక్తిని గ్రహించి నేరుగా శ్రీక్షేత్ర గాణుగాపురం చేరినాడు. అచ్చట శ్రీగురుచరిత్ర నిత్యపారాయణ చేస్తూ నిర్గుణ పాదుకలను దర్శించుచు, శ్రీదత్త నామస్మరణ చేయసాగినాడు. కొలది కాలమునకు అతనిలో కవితాశక్తి జాగరణమైనది. అతని కలంవెంట ధారాపాతంగా దాదాపు నాలుగు వందల అభంగాలు వెలువడ్డాయి. అయితే ప్రతీ అభంగమునకు నాల్గవ పాదం స్ఫురించక అన్నీ అసంపూర్తిగా వుండిపోయాయి. ఎంత ప్రయత్నించినా వాటిని పూరించలేకపోయినాడు. అతను ఇందులకు తీవ్రముగా వ్యధజెంది శ్రీదత్తస్వామిని అధికంగా కీర్తించసాగినాడు. ఒకరోజు రాత్రి స్వప్నంలో శ్రీదత్తస్వామి దర్శనము ఇచ్చి "అక్కల్‌కోట వెళ్ళు!"అని ఆదేశించిరి. అతను ఆ మరునాడు బయలుదేరి అక్కల్‌కోట చేరినాడు. అతడు వచ్చి శ్రీస్వామిని దర్శించి నమస్కరించగానే శ్రీస్వామి చిరునవ్వునవ్వి అతని అభంగానికి నాలుగవపాదం చెప్పినారు. క్రమంగా ప్రతిరోజు శ్రీస్వామిని దర్శించగా వారు, అతని నాలుగువందల అభంగములకు నాలుగవ పాదం చెప్పి దానిని పూర్తి చేయించినారు. సరిగా పూర్తి అగునాటికి అతనికి వ్యాధి నయమైనది. అతను అమితమైన భక్తితో మరికొన్ని అభంగములను వ్రాసినాడు. అతను 'దాస్‌బాపూ' అను పేరున ప్రసిద్ధికెక్కినాడు.

దేశ్‌ముఖ్ అనే భక్తునిఇంట శ్రీస్వామి వున్న సమయంలో నైజాం ప్రాంతం నుంచి ఒక ముస్లిం భక్తుడు శ్రీస్వామి దర్శనార్థం అక్కల్‌కోట వచ్చినాడు. అతను శ్రీస్వామివద్దకు వచ్చి అతని సాంప్రదాయంలో నమస్కరించి శాంతిని పొందే మార్గం చూపమని కోరినాడు. శ్రీస్వామి అతనికేసి యోగదృష్టితో చూచి "అక్కల్‌సే ఖుదా పైఛానో" (ఎఱుకతో దైవాన్ని తెలుసుకో!) అన్నారు. అది వింటూనే ఆ ముస్లిమ్ భక్తుడు సమాధిస్థితిని అనుభవించాడు. తిరిగి బాహ్య స్మృతి వచ్చే సమయంలో అతనికి పైగంబరులవారి దర్గా (మక్కామదీనా)



దర్శనమైనది. అతను శ్రీస్వామి పాదములపైబడి నమస్కరించి "హే అల్లా! హే ఖుదా! మీరు సామాన్యులుకారు. సాక్షాత్తు ఆ పైగంబరుని అవతారం. మీ దర్శనంచేత నా జీవితం ధన్యమైనది. జన్మ జన్మలలో దొరకని నీ పాదం ఈ జన్మలో చేసుకొన్న పుణ్యమువలన, మా పూర్వీకులు చేసిన గురుసేవలవలన లభించినది. నన్ను సదా రక్షించి – కాపాడండి" అని ప్రార్థించినాడు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి ఆశీర్వదించినారు. అతను కొలది రోజులు వుండి శ్రీస్వామిని సెలవు కోరినాడు.

శంఖేశ్వర (శృంగేరి) పీఠాధిపతి జగద్గురు శ్రీశ్రీశ్రీ శంకరాచార్యులు ఒకసారి శ్రీ రాజామాలోజీరావుగారి ఆహ్వానము పురస్కరించుకొని అక్కల్‌కోట వచ్చారు. రాజావారి భవనములో వారు మకాము చేసినారు. వారిని దర్శించడానికి జనులు తండోపతండములుగా వచ్చినారు. శ్రీస్వామి సమర్థులు కూడ చోళప్పను తీసుకొని వారి దర్శనానికి వెళ్ళినారు. చాలా జనసందోహము వున్నది. శ్రీస్వామివారి రాకను ఎవరూ గుర్తించలేదు. ఒక బ్రాహ్మణ భక్తుడు వారినిచూచి, ఒక చెక్కపీటను తెచ్చి ఆసనముగా వేసి కూర్చోమని కోరినాడు. శ్రీస్వామి ఆసనముమీద మౌనముగా కూర్చుండినారు. అంత జనసందోహములో కూడ శ్రీస్వామివారిని శ్రీ శంకరాచార్యులు చూచినారు. శ్రీస్వామివారి దివ్యమంగళ విగ్రహమును, వారిలోని దివ్యమైన తేజస్సును చూచి అచ్చెరువొందారు. అది శంకరభగవానులు కూడ ఈయనవలె వుండి వుండవచ్చని అనుకొనినారు. కాని వారిని దగ్గరకు పిలవడంకాని, ఆయన వారివద్దకు వెళ్ళడంకాని చేయలేదు. మధ్యాహ్నం భోజన సమయం అయినది. భోజనములు ఏర్పాటు చేసినారు. అక్కడ వున్న బ్రాహ్మణులు కొందరు శ్రీస్వామి కులమత విచక్షణ లేకుండ అందరిచేత భిక్ష స్వీకరిస్తారని, అందరు బ్రాహ్మణుల పంక్తిలో వారిని కూర్చోబెట్టకూడదని, వేరుగా వడ్డించాలని నిర్ణయించి ఆయనను వేరుగా కూర్చోబెట్టినారు. విస్తర్లలో అన్ని వంటకాలు వడ్డించారు. భోజనం చేయబోవు సయంలో వడ్డించిన పదార్థాలన్నీ చెడువాసన కొడుతూ, వాటినిండా పురుగులు ఏర్పడినవి. ఎవరూ దానిని ముట్టలేకపోయారు. అందులో కొందరు బ్రాహ్మణులు ఇది శ్రీస్వామి సమర్థులపట్ల తాము చేసిన అపచారము వల్లనే ఏర్పడినదని గ్రహించి శ్రీమత్ శంకరాచార్యులకు తెలిపిరి. శ్రీస్వామివారి లీలలను వారి అనుగ్రహములను పూర్తిగా తెలుసుకొన్న శ్రీమత్ శంకరాచార్యులవారు

స్వయంగా శ్రీస్వామి సమర్థుల వద్దకు వచ్చి వారికి వందన సమర్పణ చేసి వారిని తమతోపాటు విందుకు ఆహ్వానించిరి. శ్రీస్వామి సమర్థులు సమ్మతించి వారి ప్రక్కన భోజనమునకు కూర్చొనగానే, ఆహార పదార్థములన్నీ తిరిగి పూర్వమువలె సువాసనలు వెదజల్లసాగినవి. రుచికరముగా మారినవి. అందరు తృప్తిగా భోజనము చేశారు. అంతా దానిని శ్రీస్వామి సమర్థుల ప్రసాదంగా భావించారు.

శ్రీస్వామి ఈ లీలతో తమ అవధూత తత్త్వము మరొకసారి తెలియ జేశారు. అక్కడి బ్రాహ్మణులకు యిచ్చిన సందేశములో వర్ణవ్యవస్థ సమాజములో కొన్ని నిర్దిష్టమైన ప్రయోజనాల కొరకు ఏర్పడినదని, దైవము ముందు అందరూ సమానులేనని, ఎవరూ ఎవరికీ హృదయపూర్వకముగా వ్యతిరేకులు కారని, కాకూడదని, అందరూ సౌభ్రాతృత్వముతో వుండాలని, అందరికీ తండ్రి ఆ ఈశ్వరుడేననీ తెలిపిరి.

శ్రీస్వామి సమర్థులు సమాధి అయిన పది సంవత్సరములకు శ్రీమత్ శంకరాచార్యులవారు శంఖేశ్వర పీఠాధిపతి అక్కల్‌కోటకు విచ్చేసి శ్రీస్వామి సమర్థుల పాదుకలను సేవించి వారిపై కొన్ని సంస్కృత శ్లోకాలు వ్రాసినారు.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు జగద్గురువులు అని ఈ కథద్వారా తెలియుచున్నది. మరికొన్ని సన్నివేశములను తెలుసుకుందాము అని చెప్పసాగిరి.

***సర్వసంగ పరిత్యాగీ భక్తానాం జ్ఞానదో గురుః !***
***బ్రహ్మేంద్రో బ్రాహ్మణో జ్ఞానీ క్షేత్రజ్ఞః సురవందితః !!***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పది మూడవ అధ్యాయము*** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం
ఓం అవధూత చింతన
శ్రీస్వామి సమర్థాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది నాలుగవ అధ్యాయము

"విద్యాసాగరా!

భక్తియనునది సూక్ష్మముగా త్రివిధములుగా నున్నది. అది స్థూలముగా కాయిక, వాచిక, మానసికమని మూడు విధములు. కాయిక భక్తిలో పూజాది కార్యములను, వాచిక భక్తిలో శ్రవణము, కీర్తనము, మానసిక భక్తిలో ఆత్మానందము నొందుట, తనను తాను భగవంతునికి అర్పితం చేసికొనుట మొదలగునవి. ఈ విధముగా భక్తుడు భగవంతుని సేవించవచ్చును. నాయనా విద్యాసాగరా! నీవు యిప్పుడు సేవించుచున్నది వాచిక భక్తితో. నీలో కలిగిన ఈ భక్తితో, మానసిక భక్తిని చేర్చుకొనినచో నీవు శ్రీస్వామి లీలలను శ్రవణము చేసి వానితో ఆత్మానందమును పొంది, నిశ్చయముగా ముక్తసంగుడవు కాగలవు. ప్రయత్నించి ఫలితం సాధించుము" అని వానికి తిరిగి శ్రీస్వామి లీలలను దర్శింపజేయసాగినారు.

ఉత్తర ప్రాంతాలకు చెందిన ఒక సన్యాసి కొన్ని సిద్ధులతోపాటు రసవిద్యను, స్వర్ణయోగమును అభ్యసించినాడు. అతను దానిద్వారా రోజుకు కొంత బంగారము సుమారు మూడు లేక నాలుగు తులాలు తయారుచేసేవాడు. దానితో భోగభాగ్యములను అనుభవిస్తుండేవాడు. అంతేకాక అందరినీ చులకనగా చూస్తూ తానే ఒక గొప్ప మహిమగల యోగినని, మిగిలినవారు (స్వర్ణయోగము తెలియనివారు) ఎవరూ యోగులు కారని వాదించేవాడు. ఆయన సంచారము చేయుచు నాసిక్ వచ్చి అక్కడ ప్రసిద్ధిగాంచిన యోగి, శ్రీస్వామి సమర్థుల శిష్యుడు అయిన శ్రీ ఘోలప్ స్వామిని కలుసుకొన్నాడు. ఈ సన్యాసి అక్కడకూడ తన గొప్పలు చెప్పుకొని యోగినని చెప్పసాగినాడు. శ్రీ ఘోలప్‌స్వామి "సాధకుడు

సిద్ధులను పొందవచ్చునని, అయితే వానిద్వారా లౌకికమైన భోగములు, విషయ వాసనలు పొందకూడదని, దానిద్వారా సాధనామార్గములో ప్రతిబంధకము ఏర్పడునని, అందువలన సాధకుని లక్ష్యం నెరవేరద"ని గట్టిగా ఖండించారు. దానికి ఉగ్రుడైన ఆ సన్యాసి ఘోలప్‌ను అతడి శిష్యులను దూషించి చేయిచేసుకోబోయినాడు. వారందరు మౌనముగా ఉండిపోయినారు. వానికి తగిన గుణపాఠము చెప్పాలని నిశ్చయించుకొని, అవకాశము కొరకు ఎదురు చూడసాగినారు.

తత్త్వవేత్త, శ్రీస్వామి సమర్థుల శిష్యుడు అయిన శ్రీ వామనబువా బ్రహ్మచారి నాసిక్ వచ్చినారు. వారు రాగానే శ్రీ ఘోలప్‌స్వామి, శ్రీస్వామి శిష్య బృందమంతా కలసి తత్త్వవిచారణము అను తాత్త్విక చర్చను ఆ ఉత్తరాది సన్యాసికి శ్రీ వామన బువాకు మధ్య ఏర్పాటు చేసినారు. శ్రీ వామనబువా చర్చను ప్రారంభించినాడు. వారి శాస్త్ర పరిశీలనకు, అద్వైతానుభవమునకు ఆ సన్యాసి ఆశ్చర్యపడినాడు. వారి శాస్త్ర పరిశీలనకు, అద్వైతానుభవమునకు ఆ సన్యాసి ఆశ్చర్యపడి ఆ వాదనలో నిలువలేక తన అజ్ఞానాన్ని కప్పిపుచ్చు కునేందుకు చర్చను రసవిద్య, ఇతర సిద్ధులవైపు మరలించినాడు. శ్రీ వామనబువా అతనిని నిగ్రహించి, సిద్ధులకు లోబడిన సాధకుడు తన లక్ష్యాన్ని వదిలి ఎలా పతనమయ్యేది, అవి సాధకుని లొంగదీసుకొని అధఃపాతాళానికి చేరుస్తాయి అని, ఎంత స్వర్ణం వున్నా, మణులు, మాణిక్యాలు వున్నా ఆత్మతృప్తిలేని వానికి ఏమీ లేనట్లేనని" వివరించి చెప్పారు. ఈ మాటలు ఆ సన్యాసికి రుచించలేదు. అతడు చాలా నిర్లక్ష్యంగా "మీ గురువెవరు?" అని ప్రశ్నించాడు. అందుకు వామనబువా "మా గురుదేవులు శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహారాజ్‌వారు" అని చెప్పగా అతను "మీ గురుదేవులు నాలా బంగారము చేయగల సమర్థులా?" అని అడిగినాడు. ఆ చర్చను చూచు వారందరు అతనినిచూచి చర్చకు నిలువలేక రకరకాలుగా మారుతున్నవాని అజ్ఞానమును తెలుసుకొని పకపక నవ్వినారు. వామనబువా "నీతో ఏమి చెప్పినా ఏమి వాదించినా ప్రయోజనం లేదు. అందువలన నీకు మేలు జరగాలంటే తక్షణం శ్రీస్వామి సమర్థులను దర్శించుకొని ఆయన ఆశీర్వాదము కొరకు వేడుకో!" అని చెప్పారు. ఆ సన్యాసి కోపముతో వెళ్ళిపోయినాడు.

ఆ మరుసటిరోజు అతను బంగారము తయారుచేయ పూనుకున్నప్పుడు బంగారమునకు బదులు బొగ్గువచ్చినది. అతను ఎన్నిసార్లు ప్రయత్నించినా ఫలితం లేకపోయినది. దానితో వామనబువా ఏమియో తంత్రములను తనపై



ప్రయోగించినాడని, అందువలన తన విద్య ఫలితమును యివ్వలేదని కోపంతో వామనబువా దగ్గరకెళ్ళి నిందించి, ఒక పెద్ద రాయిని తీసుకొని వామనబువాపై విసిరినాడు. ఆ సమయములో వామనబువా, ఘోలప్‌స్వామి మొదలగువారు శ్రీస్వామి అక్కల్‌కోట మహారాజ్‌వారి నామసంకీర్తనలో వున్నారు. వారు ఆ ఆనంద పారవశ్యంలో ఈ సన్యాసి రాకను గుర్తించలేనేలేదు. కాని చిత్రంగా ఆ రాయి తిరిగి వచ్చి సన్యాసికే తగిలినది. అతనికి తీవ్రమైన గాయం అయినది. దానితో అతను పెనుకేకపెట్టి స్పృహ కోల్పోయినాడు. వామనబువా, ఘోలప్‌స్వామి మున్నగువారు వైద్యము చేయగా అతనికి స్పృహ వచ్చినది. ఈ అద్భుత లీలను చూచి ఆ సన్యాసి తన తప్పును తెలుసుకొని పశ్చాత్తాపపడి, వామనబువా, ఘోలప్‌స్వామి, ఆయన శిష్యబృందానికి క్షమాపణలు చెప్పుకొనినాడు. వారు చెప్పినదంతా తన మేలుకొరకేనని గ్రహించినాడు. దీనితో అతని మనస్సులో పూర్తి పరివర్తన వచ్చినది. కంటనీరుపెట్టి శ్రీ వామనబువాను, ఘోలప్ స్వామిని కౌగలించుకొనినాడు. శ్రీస్వామి గొప్పతనమును అంగీకరించి వారి గురువు శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహారాజ్ వారు చాలా గొప్ప మహానుభావుడని గ్రహించి ఆయనను దర్శనము చేసుకొనవలెనని ఆ మరుసటిరోజున అక్కల్‌కోటకు బయలుదేరినాడు.

అక్కల్‌కోట చేరిన ఆ సమయంలో శ్రీస్వామి సమర్థుల దర్బారులో నామసంకీర్తనము జరుగుచున్నది. శ్రీస్వామి ఒకమూల పిల్లవాడిలాగా ఆడుకొనుచున్నారు. సన్యాసి వారి దగ్గరకెళ్ళి భక్తితో పాదాభివందనము చేసినాడు. శ్రీస్వామి అతనికేసి చూసి "పనికిమాలిన వెధవా! అంత గర్వమా? వారిమీద రాయి విసురుతావా? బంగారం చేయబోతే బూడిద వచ్చిందికదూ! వెళ్ళి చావలేకపోయావా? నీకు స్వర్ణయోగం కావాలా? అయితే ఆ చెట్టుకేసి చూడు" అని చూపించి శ్రీస్వామి తన పొట్టను రెండు చేతులతో పట్టుకొని గట్టిగా నవ్వసాగారు. శ్రీస్వామి చూపించిన ఒక వేపచెట్టు నిలువెల్లా బంగారమై వుండటం చూచి ఆ సన్యాసి నివ్వెరపోయాడు. తన అహంకారమణిగి శ్రీస్వామిని క్షమించమని కోరి పాదాభివందనం చేసినాడు. ఆ తరువాత అతను భక్తితోను, విశ్వాసముతోను శ్రద్ధగా అయిదురోజులు శ్రీస్వామిని సేవించినాడు. అప్పుడు శ్రీస్వామి వానిని ఆశీర్వదించి ఒక జింక చర్మము, కాషాయ వస్త్రము అతనికి యిచ్చి "మాహురగడ వెళ్ళి అక్కడ సంతోషముగా వుండు!" అన్నారు. సన్యాసి వారి ఆజ్ఞను అనుసరించాడు. మాహురగడ వెళ్ళి అక్కడ జీవించసాగినాడు. యోగిగా పేరుగాంచినాడు.

విద్యాసాగరా! ఈ సన్యాసి కథ యోగసాధకులందరికి ఒక హెచ్చరిక. ఆత్మసాక్షాత్కారమనే లక్ష్యాన్నుంచి సిద్ధులు, మహిమలు సాధకుణ్ణి తప్పుదారి పట్టించి అతని పతనానికి దారితీస్తాయి. ఈ విషయమునే శ్రీస్వామి సమర్థులు ఆ సన్యాసి వచ్చినరోజు సాయంత్రం భక్తులకు వివరించినారు.

అక్కల్‌కోటలోనే జోషి అనే పండితుడు వుండేవాడు. అతని ఇంట్లో నిత్యము సత్సంగము జరిగేది. దానిలో అతని స్నేహితులు కొందరు జిజ్ఞాసులు పాల్గొనేవారు. జోషి అనేక ఆధ్యాత్మిక గ్రంథములను వరుసగా చదివి అందరికీ అందులోని భావములను విశదీకరించి చెప్పేవాడు. వారు కొద్దిరోజులుగా 'పంచదశి' అనే వేదాంత గ్రంథము శ్రీవిద్యారణ్య స్వాములవారి రచన చదివి, దానిలోని అర్థములను సరళమైన భాషలో వివరిస్తూ ఉండేవాడు. ఆనాడు వారికి ఒక శ్లోకమునకు సరియైన అర్థము స్ఫురించలేదు. దానితో అంతరాయము కలిగినది. వారికి ఆనాడు వచ్చిన జటిలమైన శ్లోకం.

***ద్వైతావజ్ఞా సుస్థితాచేదద్వైతేధీః స్థిరా భవతే ।***
***స్థైర్యే తస్యాః పుమానేష జీవన్ముక్త ఇతీర్యతే ॥***

వారందరూ సత్సంగమును ఆపి శ్రీస్వామి దర్శనానికి వెళ్ళారు. వీరు వచ్చి కూర్చోగానే శ్రీస్వామి తన ముందున్న భక్తులందరినీ కూర్చోమని జోషిని ఆ స్వర్ణయోగ సన్యాసిని యిద్దరివైపు చూచి నవ్వుతూ భక్తులందరివైపు తిరిగి *"ద్వైతమును వదలి అద్వైతము నాశ్రయించిన జ్ఞాని సముద్ర తత్త్వమును పొంది వుండాలి. అనగా సముద్రము నదీజలమునుగాని, వర్షపునీటినిగాని ఎన్నడు కోరదు. అవియే దైవికముగా వచ్చి చేరును. అవి వచ్చి చేరినను, చేరకున్నను సముద్రము నిశ్చలముగా నుండును. జ్ఞాని కూడా అట్లే వుండవలెను. జ్ఞానమును పొందినవాడు ఏ విషయములను కోరడు. నిత్య వ్యవహారముల వలన ఒకవేళ దైవికముగా శబ్దాది విషయములు తటస్థించిననూ వానిచే అతనేమాత్రము తొణకక నిర్వికారుడై యుండును. ఇట్టివానినే సముద్ర గంభీరుడు అంటారు. ఈ సంస్కారము స్థిరమైనప్పుడు ఆస్థితిలోనుండు పురుషుని జీవన్ముక్తుడని అంటారు. అద్వైత సంస్కారమును పొందికూడ ఆ లక్ష్యము స్థిరముగా లేనప్పుడు మహోన్నతమైన సాధకుడు కూడ జీవన్ముక్తుడు కాలేడు. అంత్యకాలము వరకు అట్టి స్థితియందున్న వాడు మోక్షమును పొందును. కావుననే మహాత్ముల జననకాలమునుండి శరీరమును త్యాగము చేయువరకు ఈ స్థితిలోనే నిశ్చయులై వుందురు.

* *ద్వైతమనగా జీవుడు-దేవుడు వేరు వేరని భావము. అద్వైతమనగా జీవుడు దేవుడు ఒక్కరేనని భావము.*



ఈ విధంగా వారందరికీ వేదాంత బోధచేశారు. ఆశ్చర్యము! ఆ చేసిన బోధంతా ఆ శ్లోకానికి వ్యాఖ్యానము! జోషి మున్నగు భక్తులు ఆ చక్కటి వ్యాఖ్యానమును విని ఆనందపరవశులైనారు. స్వర్ణయోగ సన్యాసి ఆ హితబోధ అంతా తనకే అనుకొని భావించినాడు. జోషి మున్నగు భక్తులు ఆ శ్లోకానికి అర్థము చెప్పి వారి సత్సంగములో కలిగిన ఆటంకమును తొలగించినారని, తమ మనస్సులోని ఆలోచనలను గ్రహించి ఈ విధముగా తెలియజేశారని, శ్రీస్వామివారి సర్వజ్ఞత్వానికి ఎంతో విస్మయం చెందినారు. శ్రీస్వామివారు భక్తులపాలిట కల్పవృక్షమని, వారిని ఏ కోరిక కోరకున్నను భక్తుల మనోభావముల నెరిగి, వారికన్నీ సమకూర్చుతారని భావించినారు. భక్తులందరూ ఆనందముతో "రాజాధిరాజ! యోగిరాజ పరబ్రహ్మ సచ్చిదానంద! సద్గురు శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహారాజ్‌కీ జై!" అని జయ జయ నాదములు చేసినారు. మనము కూడ వారితోపాటు ఆ జయ జయ నాదములలో పాల్గొందము అని శ్రీ నిత్యానందుడు తెలిపి యిరువురును జయ జయ నాదములు చేసినారు. పాఠకులారా! మీరును ఈ సమయంలో శ్రీస్వామి సన్నిధిలో ఉన్నారని భావించి ఆ జయ జయ నాదములు చేయండి.*

విద్యాసాగరుడు ఈ కథను విని గురుదేవా! సాధకుడు మహోన్నతమైన సాధనచేసి అద్వైత సంస్కారమును పొందికూడ జీవన్ముక్తుడై అంత్యకాలము వరకు ఆ స్థితిలో వుండలేడా? అటుల ఉండలేకపోయినవారు ఈ కాలములో స్వర్ణయోగ సన్యాసిలాంటివారు ఉన్నారని తెలుపుచున్నారు. పురాణ ప్రశస్తి నొందినవారు ఎవరైనా ఉన్నారా? అలాంటి వారి చరిత్రను తెలుపండి అని ప్రార్థించెను. అంతట నిత్యానందుడు మహదానందపడి "భళీ! విద్యాసాగరా! చాలా చక్కటి ప్రశ్నవేశావు. నీవు అడిగితే గుర్తుకు వస్తున్నది. మహోన్నతుడైన సాధకుడు, తపస్వి అయిన సౌభరి అనే మహర్షి ఈ స్థితినే పొందినాడు.

ఋగ్వేద తత్త్వపురుషుడైన దయామూర్తియగు సౌభరి మహర్షి చరిత్ర వేద, పురాణ, ఉపనిషదాదులలో కలదు. వీరు బృందావన సమీపములో కాళింది నదీ తీరమునగల రమణక ద్వీపమునందు నివసించుచుండెడివారు. సౌభరి మహర్షి యమునానదీ జలములో సమాధిస్థుడై అనేక సంవత్సరములుగా తపస్సు చేయుచుండెను. ఆ జలములోనే అనేక సంవత్సరముల నుండి జీవించు సంమదమను మత్స్యరాజు తన పరివారముతో మహావైభవముగా తిరుగుచుండుట చూచి అతను మనస్సులో "ఏమి ఈ మత్స్యరాజు మహానంద వైభవము" అని ఆశ్చర్యపడి భార్యలతో సంతానముతోను, మనుషులు మనుమరాండ్రతోగల అతి పెద్దదైన పరివారం అతనిని సేవించుచుండగా ఎంతటి

సంతోషము పొందుచున్నదో కదా! నావంటి బికారికి ఇట్టి సంతోషము ఎట్లు లభించగలదు అని మనసులో తలంచుకొని, తాను గృహస్థ జీవితమును పొందవలెనని తలచి, జలమునుండి బయటకు వచ్చెను. తనకు భార్యకాగల కన్యను పొందుటకు ఎవరైతే బాగుండునా యని మనస్సులో తలంచగా, అయోధ్యానగరాధిపతి మాంధాత చక్రవర్తి కుమార్తెలు గోచరించిరి. ఆయన నేరుగా అయోధ్యా నగరముచేరి మాంధాత మహారాజును దర్శించగోరెను. ఆ వార్త తెలిసిన మాంధాత మహారాజు అర్ఘ్యపాద్యములతో వారిని పూజించి, సభకు ఆహ్వానించెను. సభలో చేరిన తరువాత మాంధాత మహారాజును చూచి సౌభరి మహర్షి "రాజా! నీ రాజ్యములో సకల కార్యములు ధర్మపరంగా సాగుచున్నవా? జనులు అతిథి – అభ్యాగతి సేవతోను, శిష్యులు – గురు పూజలతో, సతులు పతిసేవలలోను, సేవకులు – యజమాని సేవలోను, ధర్మవర్తనులై మెలగుచున్నారా? నీవు, నీ మంత్రులు పురుషార్థపరంగా మెలగుచున్నారా! వర్షములు సకాలంలో కురిసి పాడి–పంటలకు మేలు కలిగిస్తున్నాయికదా!" అని అతని యోగ క్షేమములను, రాజ్యాధి విషయములను విచారించెను. రాజు వారి పలుకులకు సంతసించి వినయముతో "మీవంటి తాపసుల ఆశీస్సుల వలన ఈ రాజ్యములో అన్నివిధాల ధర్మపరులై ప్రజలు జీవించుచున్నారు. వర్షములు, ప్రకృతి సరియైన విధమున అనుకూలముగా నుండుటచేత, పాడిపంటలు సమృద్ధిగా లభించుచున్నవి. నేను నా మంత్రులు ప్రతిక్షణం జాగరూకులమై ధర్మార్థ కామ మోక్షములను పొందుటకు ప్రయత్నించుచున్నాము. యజ్ఞయాగాదులతో దేవతలను, సేవాది కార్యములతో గురువులను సంతృప్తిపరచుచున్నాము. మహాత్మా! తాము అనేక సంవత్సరములుగా యమునా నదీ జలములో తపోనిష్ఠులమై ఉన్నారని విన్నాము. అటువంటి తాము మా అదృష్టవశమున ఈ రాజ్యములో అడుగిడినారు. మీ దర్శనముచేత, మీ పాద స్పర్శచేత మా జీవితములు ధన్యములైనవి. ఈ సేవకుడు మీకు చేయవలసిన కార్యమేదేని కలదా! ఆదేశించండి. మాకు మీ సేవచేయు భాగ్యము కలిగించండి!" అని ప్రార్థించెను.

మాంధాత మహారాజు ప్రార్థన విని సౌభరి మహర్షి "ఓ మహారాజా! నీవు సూర్యవంశమున వారసుడవు. నీ వంశములో అందరూ మహాత్ములు, రాజర్షులు జన్మించి ఈ పృథ్విని దివ్యంగా పాలించినారు. నీ పలుకులు వారికి తగినట్లున్నవి. రాజా! నేను గృహస్థ ఆశ్రమ ప్రవేశము చేయాలని నిర్ణయించుకొనినాను. అందుకు తగిన కన్యను నీవద్దనుండి పొందాలని వచ్చినాను. గాన నాకు తగిన కన్యను దానం చేసి, నా యిచ్ఛను పూర్తిచేయుము" అని పలికెను.

అంత మాంధాత మహారాజు "మహాత్మా! మీరు మా రాజ్యములోని ఏ కన్యనైనా కోరుకోండి. తప్పక మీ కార్యమును నెరవేర్చగలవాడను" అని వినయముగా పలికెను.

అందులకు సౌభరి మహర్షి "రాజా! రాజ్యములోని కన్యలు ఏల? నీకు 50 మంది కుమార్తెలు కలరని విన్నాను. వారిలో ఏ ఒక్కరినైనా నా గృహస్థ జీవితమునకు భాగస్వామినిగా చేయుము. నావంటి వానికి ఉత్తమ రాజకన్యయే భార్య కాగలదు" అని తెలిపెను. దానికి మాంధాత ఆశ్చర్యపడి ఇటువంటి వయోవృద్ధునకి నా కుమార్తెలలో ఒకరిని ఇవ్వలేనని పలికినచో తాపసి కోపగించునేమో అనుకొని మనస్సులో విచారించి "తాపసోత్తమా! నిస్సంకోచంగా మా కుమార్తెలలో ఎవరైనా మీతో జీవనమునకు యిష్టపడినచో తప్పక వారితో వివాహం జరుపగలను" అని తెలిపి వారిని అంతఃపురములోనికి తీసుకొని వెళ్ళెను. సౌభరి మహర్షి రాజకన్యలు తన రూపమును చూచి వరించరేమోనని తలచి, తన తపశ్శక్తివలన వారికి తాను దివ్యమైన శృంగార పురుషునిగా కనిపించునట్లుగా చేసుకొనెను. మాంధాత అంతఃపురములోనికి వెళ్ళి తన కుమార్తెలను పిలచి మహర్షి సంకల్పం తెలిపి "మీలో ఎవరైనా ఇష్టపడినచో వారికి ఇవ్వగలను" అని తెలిపెను. తండ్రి వాక్కులు విని వారు ఆ మహర్షిని చూచిరి. వారికి తపోబలమువలన ఆ మహర్షి అతి సుందరునిగా, మనోహరునిగా కనిపించెను. వారు ఆ సమ్మోహన రూపమును చూచినంతనే ఒక్కసారిగా అందరూ నేను వివాహము చేసుకొంటాను, నేను వివాహం చేసుకొంటాను అని పలికినారు. మాంధాత ఆశ్చర్యముతో వికారమైన మహర్షి రూపమును చూచి తన బిడ్డలు మేము చేసుకోము అని అంటారనుకొంటే అందరూ అతనినే చేసుకొంటాము అని అంటున్నారే, ఏమి చేయగలం! ఇదంతా విధి సంకల్పం అని వారినందరిని ఇచ్చి సౌభరి మహర్షికి అత్యంత వైభవముగా వివాహం చేసినాడు.

సౌభరి భార్యలందరిని వెంటబెట్టుకొని ప్రయాణం అయి యమునా నదీతీరం చేరుకొని తన తపోబలంతో సుందరమైన నగరం సృష్టించినారు. సేవకులను, పరివారమును సృష్టించినారు. ఆ సుందర నగరంలో తన భార్యలతో క్రీడించసాగినాడు. కొలది కాలమునకు వారికి అనేక మంది సంతానము కలిగిరి. తిరిగి ఆ సంతానమునకు వివాహాలు కాగా వారికి సంతానములు కలిగిరి. సౌభరికి పుత్రులు, పుత్రికలు, పౌత్రులు, పౌత్రికలు అనేకమంది కలిగిరి. వారందరు 5000 మంది అయినారు. వారందరితో ఆనందముగా కాలము గడుపుచుండగా ఒకనాడు సౌభరికి మనస్సులో తత్త్వవిచారణ కలిగినది. "ఔరా! నేనెట్టి పనిచేసితిని?" అని తలచి తత్త్వదృష్టి కలవాడై సంసార చక్రమునుగూర్చి

పరిపరి విధములుగా హృదయమున విచారించుచుండెను. సంసారమునందు మునిగి సర్వమును మరచి వ్యామోహమున పడుట ఆశ్చర్యమని, కోరికలకు సమాప్తి అనునది పదివేల సంవత్సరాలకైనా వుండదు. ఒక కోరిక తీరగా మరొక కోరిక పుట్టుచునే యుండును. పిల్లలు పుట్టువరకు గృహస్థాశ్రమములో వుండాలని అనుకొంటిని. కాని పిల్లలు పుట్టిన పిదప వారు పెరిగి పెద్దవారగు వరకు ఉండాలనే కోరిక కలిగినది. అటుపిమ్మట వారికి కూడా వివాహము చేసి సంసారమును వదలవలెనని కోరుకొంటిని. కాని వారి వివాహములైనప్పుడు వారి పిల్లలను కూడ చూడవలెనని కోరిక ఉదయించెను. వారు జన్మించిన పిదప వారి పిల్లలను కూడ చూడవలెననియు ఈ విధముగా నా మనస్సు కోరికతో నిండియే వున్నది కాని ఎన్నడును శాంతింపలేదు.

శరీర పాతమగువరకు ఈ కోరికలను సమాప్తమనునది లేదను విషయము నాకిప్పటికి తెలిసినది. కోరికలయందాసక్తి కలవాని మనస్సు పరమార్థ సంబంధముల నేర్పరచుకోలేదు. నేను కొలనులో జలవాసము చేయుచు తపము చేసుకొనుచుండగా మత్స్యరాజ సాంగత్యముచేత నా సమాధి అంతయు వ్యర్థమైనది. ఆ మత్స్యరాజు యొక్క సహవాసమువలననే ఈ సంసారమంతయు ఏర్పడినది. ఈ సంసార సంబంధముగానే సమాప్తిలేని కోరికలు నాకు కలిగినవి. యతులకు సంగరాహిత్యమే మోక్షహేతువని అంటారుకదా! సంగమువలన పుట్టిన అనేక దోషములే ఆరూఢ యోగినైనను అధఃపతితుని చేయును. ఇంక అల్పశక్తిగల ఆరురుక్షయోగి సంగముచేత భ్రష్టుడగునని వేరుగా చెప్పనక్కరలేదు అని విచారించి సౌభరి మహర్షి తమ సంతానమును విడచి భార్యలతో కలసి తపోలోకములకు వెళ్ళినాడు. అచ్చట అఖండమైన దీక్షతో తీవ్రమైన తపమును చేసి తిరిగి తన పూర్వస్థితిని పొంది జీవన్ముక్తుడైనాడు.

విద్యాసాగరా! విన్నావుగదా! నీవును జాగరూకుడవైయుండి సాధనచేసి జీవన్ముక్తుడవు కావలెను అని ఆశీర్వదించినారు.

***యిల్లు యిల్లంటావు నీ యిల్లు అంటావు ఇల్లెక్కడున్నదే చిలకా?***
***వల్లకాటిలోన మూడడుగుల నేల నీదికాదటే చిలకా!***
***నాది నాదంటావు నావారు అంటావు నీవారుఎవ్వరే చిలకా?***
***వెళ్ళిపోయేనాడు వల్లకాటివరకే నీవారి బంధాలు చిలకా!***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పది నాలుగవ అధ్యాయము*** సంపూర్ణము



ఓం శ్రీ సాయిరాం

"దత్తగురు దత్తగురు జైజై దత్తగురు
దత్తగురు దత్తగురు జైజై దత్తగురు"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది ఐదవ అధ్యాయము

గురుదేవా! శ్రీస్వామి సమర్థులు రోజులకు రోజులు రాజమందిరములో వుండేవారు అన్నారే? మరి సుదూర ప్రాంతముల నుండి వారి దర్శనానికి వచ్చే భక్తులు అన్ని రోజులు అక్కల్‌కోటలోనే వేచి వుండేవారా? లేక రాజమందిరములోనికి వచ్చేవారా? వివరంగా తెలుపండి అని ప్రార్థింపగా నిత్యానందుడు వత్సా! శ్రీస్వామి రాజమందిరములోనికి ఎప్పుడు అంటే అప్పుడు స్వేచ్ఛగా వెళ్ళేవారు, వచ్చేవారు. వారి రాకకు ఏ ఆటంకము రాజభవనంలో లేదు. రాజా మాలోజీరావుగారే అయినా యోగేశ్వర చక్రవర్తి అయిన శ్రీస్వామివారే నిజమైన రాజగౌరవములన్నీ పొందేవారు. వారి వెనుక చేతులు కట్టుకొని రాజు, అతని పరివారం నడిచేవారు. శ్రీస్వామి రాజమందిరము వదలినపుడు ఆ రాజామాలోజీరావు తన పరివారంతో సింహద్వారము వరకు వచ్చి సెలవు తీసుకొనేవారు.

శ్రీస్వామి రాజప్రాసాదంలో ఉన్నప్పుడు బాల్కనీలోనికి వచ్చి భక్తులకు దర్శనము యిచ్చేవారు. వారు రాజభవనములో వున్నన్ని రోజులు ఉదయం, సాయంకాలం యీ కార్యక్రమం జరిగేది. భక్తులు తండోపతండాలుగా వచ్చేవారు. శ్రీస్వామిని అక్కడి నుండే ప్రార్థించేవారు, హారతులు యిచ్చేవారు. అందులో కొందరిని శ్రీస్వామి దగ్గరకు పిలిచి ఆశీర్వదించి పంపేవారు. అలా దగ్గరకు పిలిచిన వారిలో తీవ్రమైన అనారోగ్యములకు, బాధలకు గురైనటువంటివారు వుండేవారు.

శ్రీస్వామికి వాటితో పనిలేకపోయినా ఆయన కొరకు రాజావారు ఎన్నో ఆవులు, గుర్రాలు, ఎప్పుడైనా ప్రయాణం చేసేందుకు వీలుగా ఒక పల్లకి యిలాంటివి ఎన్నో ఆయన యెడల భక్తి ప్రపత్తులను చూపుకొనేందుకొరకు

ఏర్పాటు చేశాడు. శ్రీస్వామిని సందర్శించటానికి అనేకులు వస్తూ వుండేవారు. కాని ఆయన వారికి ఒకచోట స్థిరముగా దర్శనమిచ్చేవారు కాదు. ఆయన మందిరములో వున్నా, మఠంలో వున్నా, రాజభవనంలో వున్నా వారికి దర్శనము యిస్తుండేవారు. ఎక్కువగా రోడ్డువెంబడి నడచి వెడుతున్నప్పుడు ఏ చెట్టు క్రిందనో కూర్చుని వున్నప్పుడో చాలామంది దర్శనము పొందుతుండేవారు. చిన్నపిల్లవానివలె రోడ్డు ప్రక్కన ఆడుకొంటున్నప్పుడు, రాజప్రాసాదములలో ముఖమల్ పరుపులపై ఆసీనులైనప్పుడు కూడా ఆయనలో దైవాంశ ఒకే విధంగా వుండేది. కాని ఏ ప్రత్యేకతలకు కట్టుబడి వుండేదికాదు. ఎక్కడైనా, ఎప్పుడైనా ఏ పరిస్థితులలోనైనా అర్హతగల భక్తుడు సమీపిస్తే తప్పక ఆయన ఆశీస్సులు పొందేవాడు. మానసిక శుచిత్వము లేకనో ఆయనయందు దృఢమైన విశ్వాసము నిలబడకనో, ఆయనను సమీపిస్తే ఏదో ఒక గుణపాఠాన్ని నేర్చుకోవలసి వస్తుండేది.

వాసుదేవ బల్వంత్ అనేవాడు ఆంగ్లేయుల వద్ద ఉద్యోగం చేసేవాడు. అతను ఫడ్కే వంశానికి చెందినవాడు. వీరు కొలాబా జిల్లాలో పాన్వేల్ సమీపానగల షిర్ఢోన్ అనే గ్రామములో వుండేవారు. తాత, తండ్రి గొప్ప ధనవంతులు. అయినా అతని కాలమునకు ఉద్యోగము చేయవలసి వచ్చినది. అందువలన స్వగ్రామమునకు దూరముగా వుండేవాడు. ఒకప్పుడు అతని తల్లికి ప్రమాదకరమైన అనారోగ్యం కలిగినది. ఆ సమయంలో ఆమె దగ్గర వుండి సేవచేసుకోవాలని వాసుదేవ బల్వంత్ ఆంగ్లేయ అధికారులకు సెలవుకొరకు అర్జీ పెట్టుకొనినాడు. కాని కఠిన హృదయులైన ఆ అధికారులు వారికి సెలవు మంజూరు చేయలేదు. కొద్దిరోజులలోనే ఆమె మరణించినది. అప్పుడు కూడా పాషాణహృదయులైన ఆంగ్లేయ అధికారి అతనికి శెలవు యివ్వలేదు. అతని తల్లి అంత్యక్రియలకు కూడ అతడు హాజరు కాలేకపోయాడు. అతని హృదయము చిత్రవధకు గురియైనది. అతనికి అనుక్షణం తల్లి గుర్తుకు రాసాగింది. తల్లికి సేవ చేసుకోలేకపోయినందుకు వాసుదేవ బల్వంత్ మనస్సులో ఆవేదన తీవ్రమైనది.

అతనికి తల్లి మన మాతృదేశానికి ప్రతీకగా నిలిచినది. తన తల్లికి అనారోగ్య స్థితిలోను, అంత్యస్థితిలోను సేవచేయలేకపోయినందుకు, అంత్యక్రియలకు వెళ్ళలేక పోయినందుకు తన దురదృష్టానికి పరిహారంగా తన ఉద్యోగానికి రాజీనామా చేసినాడు. శివాజీ చక్రవర్తిలాగా తానుకూడా కులమత భేదాలను విడచి అంత్యజులుగా తలచబడిన కోళి మరియు రామోషి



జాతుల వారి నుండి సైన్యమును సమీకరించి మన దేశం నుండి ఆంగ్లేయులను పారద్రోలాలని నిశ్చయించుకొన్నాడు. అతను మొదటిసారిగా తన సైన్యముతో 1857వ సంవత్సరములో జరిగిన మొదటి భారత స్వాతంత్ర్య పోరాటంలో ప్రముఖపాత్ర వహించినవారిలో ముఖ్యుడు.

అతను గొప్ప దత్త భక్తుడు. అతను నిత్యమూ శ్రద్ధగా పారాయణమును, పూజాది అనుష్ఠానములను చక్కగా నిర్వర్తించుచుండెడివాడు. "దత్తలహరి" అనే పేరున భక్తి గీతములను వ్రాసి ఒక పుస్తకమును ప్రకటించినాడు. అతని మిత్రులు, రాజకీయ పోరాటము జరిపేవారును అతని నిత్యకర్మ చూచి ఆశ్చర్యపోయినారు. 1876వ సంవత్సరంలో కొందరు పేద ప్రజలను రక్షించేందుకై వారికి సహాయం చేయడానికి కొందరు ధనవంతులను కొల్లగొట్టినాడు. ఆ ధనం అంతా పేదలకే పంచినాడు. ఇతను శ్రీస్వామి సమర్థులను రెండుసార్లు దర్శించినాడు. భారతదేశ స్వాతంత్ర్యాన్ని పోరాటం ద్వారా సాధించాలనే ప్రయత్నంలో అతడెన్నో కష్టాలను ఎదుర్కొన్నాడు. విప్లవ వీరునిగా చాలా త్యాగాలకు సిద్ధపడ్డాడు. అయినా దైవబలము లేకుండా ఏ కార్యము సానుకూలపడదని తలచి పెద్దయెత్తున పోరాటాన్ని సాగించాలనే తీవ్ర సంకల్పంతో ముందుగా శ్రీదత్తావతారులైన శ్రీస్వామి సమర్థులను దర్శించి వారి ఆశీస్సులను తీసుకోవాలని అతను అక్కల్‌కోటకు వచ్చినారు. అతను శ్రీస్వామిని చేరి పాదాభివందనములను చేసి తన కత్తిని శ్రీస్వామి ముందుంచి ఆశీర్వదించమని కోరాడు. శ్రీస్వామి ఆశీర్వదించి "అభీవక్త్‌హై" (అంటే "ఇంకా కొంతకాలం గడవాలి" అని అర్థం) అన్నారు. తరువాత ఒక సేవకుడిని పిలిచి ఆ కత్తిని అతని చేతికిచ్చి చెట్టుపైన పెట్టమన్నారు. ఆ చర్యకు అర్థం తన మాట వినకపోతే ప్రమాదమని శ్రీస్వామివారి భావన అంతేకాదు పాండవులు అతి బలవంతులై కూడా అజ్ఞాతవాసకాలములో తమ ఆయుధములను శమీవృక్షము మీద దాచి, కాలము అనుకూలించగా యుద్ధము ద్వారా విజయము సంపాదించుకొని రాజ్యపాలన చేసినట్లు – భారత స్వాతంత్ర్య విప్లవకారులు కూడా కొంతకాలము అజ్ఞాత వాసము చేయాలని అర్థము. వాసుదేవ బల్వంత్ చాలాసేపు కూర్చొని శ్రీదత్త స్మరణ చేస్తూ శ్రీస్వామిని కీర్తిస్తూ గడిపాడు. శ్రీస్వామి అతనిని ఆశీర్వదించలేదు. కత్తిని యివ్వలేదు. బ్రిటిష్‌వారు మనదేశమును వదలి వెళ్ళుకాలము రాలేదని శ్రీస్వామి భావన. ఇన్నివిధాల తెలియజేసినను ఇతనికి ఏమి చేయాలో పాలుపోలేదు. అయినా అన్నీ సిద్ధం చేసుకొని ఆగిపోవడం నచ్చక స్వామికి నమస్కరించి, ఆ కత్తిని చెట్టుపైనుండి తీసుకొని

పోయినాడు. ఆ తరువాత పోరాటంలో పాల్గొని చాలామంది ఆంగ్లేయులను, వారి అధికారులను చంపి చివరకు పట్టుబడ్డాడు. అతనిని బందీగా 'ఏడెన్'కు పంపినారు. 1883వ సంవత్సరము ఫిబ్రవరి 17వ తేదీన "నా మాతృదేశం నుండి మట్టి తెప్పించి నా తలక్రింద వుంచండి" అని ఆఖరి కోరిక కోరి స్వర్గస్థుడైనాడు.

ఒక సంవత్సరం అక్కల్‌కోట ప్రాంతంలో వర్షాలులేక కరువు వచ్చే ప్రమాదం ఏర్పడింది. ఆ ప్రాంతమంతా వర్షాధారమైన పంటలు పండేవి. వర్షము లేకపోతే బీదలు, మధ్యతరగతి ప్రజలు పస్తులుండవలసి వస్తుంది. ఆఖరుకు చాలామంది ప్రజలు శ్రీస్వామి సమర్థులను ఈ విపత్తు నుండి కాపాడమని ప్రార్థించుటకు అక్కల్‌కోట చేరినారు. వారు చోళప్ప ద్వారా శ్రీస్వామికి తన బాధలను వినిపించారు. శ్రీస్వామి "బ్రాహ్మణులతో వేదంలోని "పర్జన్య సూక్తం" చదివించి రేణుకా సహస్రనామ పారాయణం చేయించండి" అని సమాధానం యిచ్చారు. రెండు రోజుల తరువాత భక్తులతోను, సేవలకులతోను కలసి పల్లకిలో 'జేవురు' అనే పల్లెటూరు వెళ్ళారు. ఆ గ్రామంలో వర్షములేక మంచినీటికి కూడా ప్రజలు తహతహలాడుచున్నారు. శ్రీస్వామి ఆ గ్రామంలో శివాలయానికి వెళ్ళి శివలింగానికేసి చూస్తూ "వర్షాలు యింకా పంపలేదేమి?" అని గట్టిగా గర్జించారు. దానికి దగ్గరలో వున్న 'వారసంగ్' అనే మరొక ఊరికి వెళ్ళి అక్కడ శివాలయంలో ప్రతిష్ఠింపబడిన విగ్రహములను చూస్తూ ఆ దేవతలందరిని తిట్టి "మీకు శనగలు కావాలా?" అని అడిగినారు. ఆ తరువాత ఆ గ్రామస్తులు ఊళ్ళో నుండి శనగలు తెప్పించి శ్రీస్వామివారికి అందజేశారు. శ్రీస్వామి వాటిని తీసుకొని పార్వతీ – శంకరులపైన, మిగతా విగ్రహములపైన చల్లారు. ఆశ్చర్యంగా వెంటనే ఆకాశం మేఘావృతమై అతి భీకరమైన వర్షం కురిసింది. దానితో ఆ ప్రాంతమంతా నీటి కరువు తీరినది. అన్ని గ్రామములలో ప్రజలు శ్రీస్వామి లీలలకు, అనుగ్రహమునకు ఆనందపడినారు. శ్రీస్వామి తిరిగి అక్కల్‌కోట చేరినారు. చుట్టుప్రక్కల గ్రామ ప్రజలు తండోప తండాలుగా వచ్చి శ్రీస్వామిని దర్శించి తమ కృతజ్ఞతను తెలియజేసినారు. చోళప్ప, బాలప్ప, సుందరాబాయి మున్నగు సేవకులను అభినందించినారు. ఇటువంటి దివ్యమైన శక్తిగల పురుషుడు తమ ప్రాంతములో వున్నందుకు ఈ ప్రాంతము, తాము ధన్యులమైనామని చెప్పుకొనినారు.

విద్యాసాగరా! చూచితివా శ్రీస్వామి దివ్యమైన లీల, భక్తులను రక్షించుట, వారి ఆర్థిక పరిస్థితి జీవమునకు కావలసిన వరములను యివ్వడం, తరువాత వారిని ఆధ్యాత్మికముగా వృద్ధిచేయడం, ఈ అవతారులలో గొప్ప విశిష్టత, ఆ దివ్యమైన మూర్తిని మనసారా ధ్యానించు అని తెలిపి తిరిగి మరియొక లీలలను దర్శింప జేయసాగినారు.



ఒకసారి శ్రీస్వామివారు సంచారమునకు బయలుదేరినారు. వారివెంట పరివారంలాగా భక్తులు, శిష్యులు, సేవకులు అందరూ బయలుదేరినారు. అందరూ కలసి సుమారు వందమంది వున్నారు. వారు అందరూ నామసంకీర్తన చేసుకొంటూ చాలా దూరం పోయినారు. ఆ మార్గంలో ఎక్కడా తినడానికి, త్రాగడానికి ఏమీ దొరకలేదు. అలా వెళ్ళి ఒక చెట్టు క్రింద శ్రీస్వామివారు తమ పల్లకిని నిలిపినారు. అందరికీ చాలా ఆకలిగా వున్నది. అందులో కొందరు పిల్లలుకూడా కలరు. వారిలో ఒక పిల్లవాడు శ్రీస్వామి దగ్గరకు వెళ్ళి తమకు ఆకలిగా వుందని తినటానికి, త్రాగటానికి ఏమీ దొరకలేదు అని చెప్పినాడు. భక్తులలో ఒకని దగ్గర గల పదార్థములను శ్రీస్వామివారికి సమర్పించగా శ్రీస్వామి వాటిని తిన్నారు అయితే భక్తులకు ఏమీ దొరకలేదు. ఆ తరువాత భక్తులందరికీ దూరంగావున్న మామిడిచెట్లను చూపించి వాని క్రిందకు వెళ్ళి కూర్చోమనినారు. ఆ చెట్లవైపు చూచినవారికి అక్కడ ఏమీ కనబడలేదు. శ్రీస్వామి తమను ఆటపట్టిస్తున్నారేమో ననుకొనినారు. అయినా వారి ఆజ్ఞను పాటించదలచి అందరూ బయలుదేరి వెళ్ళసాగిరి. దగ్గరగా వెళ్ళగానే వారికి అక్కడ భోజన పదార్థములను పెట్టుకొని ఒక ముసలమ్మ కూర్చొని కనబడింది. ఆమె వారిని ఆహ్వానించి ఇక్కడకు భోజనానికి రావలసినవారు రాలేదు. ఈ భోజనం మీరు చేయండి అని సిద్ధంగావున్న భోజనం వారికిచ్చినది. వారందరు స్వయంగా వడ్డించుకుని భోజనం చేసినారు. ఆ తరువాత ఆమెకు కృతజ్ఞతను తెలుపుకొని, శెలవు తీసుకొని శ్రీస్వామిని చేరినారు. తిరిగి వారి ప్రయాణం అక్కల్‌కోటకు సాగినది. "విద్యాసాగరా! శ్రీస్వామి సంకల్పంతో వారికందరికి సాక్షాత్తు అన్నపూర్ణాదేవి ప్రసాదం లభించినది. ఆహా! వారు ఎంత ధన్యులైనారో కదా!".

ఒకసారి ఒక తల్లి తన కుమారుని తీసుకొని అక్కల్‌కోటకు వచ్చినది. ఆమె కుమారుడు తీవ్రమైన వ్యాధితో బాధపడుచున్నాడు. ఆమెకు వాడొక్కడే కుమారుడు. శ్రీస్వామి దర్శనమునకు తీసుకొని రాగా అక్కల్‌కోట చేరగానే ఆ పిల్లవాడు చనిపోయాడు. ఆమె శ్రీస్వామివద్దకు వెళ్ళి వారి పాదాలపైబడి "దేవాదిదేవా! సద్గురుమౌళీ! ఎక్కడా రక్షణ లేకపోయినా మీ పాదములచెంత రక్షణ వుందనుకొన్నాను. ఇక్కడ వాడి ఆరోగ్యం కుదుటపడుతుందని వస్తే ఇక్కడకొచ్చినా పిల్లవాడు మరణించవలసినదేనా?"అని విలపించసాగినది. శ్రీస్వామికి ఆమెమీద కనికరం కలిగినది. వెంటనే లేచి, శ్రీస్వామి ఆ పిల్లవాని శవమువద్దకు వెళ్ళి దానిని కాలు పుచ్చుకుని గిరగిరా తిప్పి అక్కడ వున్న ఒక గుట్టం దగ్గరకు విసరినారు. అద్భుతం! ఆశ్చర్యం! అక్కడపడిన పిల్లవానికి ప్రాణం వచ్చినది. ఆ తల్లి ఆనందం వర్ణించ ఎవరితరం? వాడిని అప్పటిదాకా పీడించే వ్యాధి మాయమైనది. శ్రీస్వామి స్పర్శతో వాడికి వ్యాధి నయమగుటయే

గాక మరణం తప్పి జీవితం లభించినది. ఇటువంటి లీలలు కోకొల్లలు. నేను కొన్ని మాత్రమే నీకు వినిపించుచున్నాను. శ్రీస్వామివారి అన్ని లీలలను చెప్పడం ఆదిశేషునకైనను కష్టమే. శ్రీస్వామి అక్కల్‌కోటలోని లీలలు మనకు తెలుస్తున్నా, వారు ఒకే సమయంలో అనేక ప్రదేశములలో అనేకులను రక్షించినారు. ఎందరో భక్తులు శ్రీస్వామిని వారి వారి ప్రాంతములలో దర్శించినారు. వారి అనుగ్రహం పొందినారు. శ్రీస్వామి విశ్వస్వరూపులు–విశ్వాధిపతి–వారి లీలలు అనంతములు.

## శ్రీ అన్నా సాహెబ్ పట్వర్ధన్

అన్నాసాహెబ్ పట్వర్ధన్ పేరుగాంచిన గొప్ప వైద్యుడు, దేశభక్తుడు. బ్రిటిష్ పరిపాలన నుండి మాతృదేశానికి విముక్తి కలిగించాలని తపన పడేవాడు. తన లక్ష్యాన్ని విప్లవంతో కాకుండా తపశ్చర్యద్వారా యజ్ఞయాగాదుల ద్వారా సాధించాలని నిర్ణయించుకొన్నాడు. అందులకు శ్రీస్వామి సమర్థుల ఆశీర్వచనం చాలా ముఖ్యమని తలంచి శ్రీస్వామి దర్శనార్థం అక్కల్‌కోటకు వచ్చినాడు. శ్రీస్వామి సమర్థుల వద్దకు వెళ్ళి వారికి పాదాభివందనం చేసినాడు. శ్రీస్వామి వారి మనోభావము నెరిగి సృష్టికర్తయైన పరమాత్మ ఈ విశ్వానికి సంచాలకుడు. ఈ పరబ్రహ్మ సంకల్పము నిర్దిష్టమైన ప్రణాళిక ననుసరించియే జరుగుచుండును. ఆయన సంకల్పానికి భిన్నంగా ఎవ్వరూ ఏ కార్యమునూ సాధించలేరు. తగిన సమయం వస్తేనేగాని ఏపనీ జరుగదు. అందరూ ఆయన అనుగ్రహానికై వేచియుండక తప్పదు. దేశానికి స్వాతంత్ర్యం రావడం తథ్యం. దానికి కొన్ని దశాబ్దాల కాలం గడవాలి. నీవు వెళ్ళి ఆళందిలో వున్న శ్రీనరసింహ సరస్వతి స్వామిని సేవించి సద్గురు కృపతో మోక్షాన్ని సంపాదించే ప్రయత్నం చేయ’మని ఆశీర్వదించి పంపినారు. అన్నాసాహెబ్ అట్లే ఆళంది వెళ్ళి శ్రీనరసింహ సరస్వతి స్వామిని సేవిస్తూ తన లక్ష్యసాధననూ, మోక్ష సాధననూ ఏకంగాచేసి తన శేషజీవితాన్ని గడిపారు.

**జై సమర్థ సద్గురు శ్రీ అక్కల్‌కోట మహరాజ్‌కీ జై!**

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

***ముప్పది ఐదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"దిగంబరా దిగంబరా

శ్రీపాద వల్లభ దిగంబరా"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది ఆరవ అధ్యాయము

"వినయశీలా! విద్యాసాగరా! గురువునకు సర్వస్వమును అర్పించు" అని గురుగీతలో శివుడు పార్వతికి తెలిపినారు. "గురోరారాధనం కార్యం స్వజీవత్వం నివేదయేత్" అనగా గురువకు తన జీవత్వాన్నే నివేదనగా అర్పించాలని, స్థూల శరీరమును దానికి వున్న అన్ని వనరులే కాకుండా జీవి తనను తాను శ్రీగురుదేవునికి అర్పించుకొని నేను సాక్షాత్తు ఆ చైతన్యమూర్తిని, పరమాత్మ స్వరూపిని అని భావించాలి. ఇదే పరిపూర్ణమైన నివేదన. శ్రీదత్తతత్త్వం దిగంబరులైన గురువును - శిష్యుడు దిగంబరుడై చేరాలి అని చెబుతుంది. అనగా దిగంబర తత్త్వ స్వరూపులయిన గురువులను - శిష్యుడు తన గౌరవ మర్యాద - కీర్తి, ప్రతిష్ఠ, ధనము మున్నగునవన్నీ విసర్జించి దిగంబరుడై చేరి సేవించాలి. శరీరము, మనస్సు - ఆలోచనలను పూర్తిగా గురువునకు సమర్పించి రిక్తహస్తులై చేరినచో గురువు అనుగ్రహం పొందగలడు. ఈ అధ్యాయములో నీకు మరికొన్ని లీలలను విశదపరచెదను వినుము" అని శ్రీ నిత్యానందయోగి తిరిగి శ్రీస్వామి లీలలను చెప్పసాగిరి.

ఒకరోజు శ్రీస్వామి షేక్‌నూరుద్దీన్ దర్గాలో కూర్చొనియుండగా కొంకణి దేశం (ఉత్తర కర్ణాటక) నుండి వచ్చిన దంపతులు శ్రీస్వామిని సేవించుచున్నారు. వారు సంతానంలేక శ్రీస్వామి లీలలను విని వారి ఆశీర్వచనంతో సంతానం పొందవచ్చునని వచ్చినారు. భర్త శ్రీస్వామికి విసరుతున్నాడు. అతని భార్య ఆయన ప్రక్కన నిలుచున్నది. ఆ సమయంలో ఒక నూనె వర్తకుడు శ్రీస్వామివారిని దర్శించి, తాను అతి పేదవాడనని, అందువలన సంసారాన్ని నడపలేకున్నానని మొరపెట్టుకున్నాడు. అతని భార్యకూడా చనిపోయి చాలా

 

కాలమైనది. అప్పుడు శ్రీస్వామి ఆ కొంకణి దేశంనుండి వచ్చిన భార్యాభర్తలలో భార్యవైపు చూచి "రింబే! నీవు గతజన్మలో ఈ నూనెవర్తకుని భార్యవు, అతడు నీ భర్త. అపుడు నీకు ముగ్గురు పిల్లలు. వారినందరినీ యిప్పుడు ఇతనే పోషించుచున్నాడు. చాలా పేదరికంలో వున్నాడు. ఇతనిని మీవెంట తీసుకొని పొండి" అని ఆ నూనెవర్తకుని చూపించినారు. 'రింబె' అనే పేరు ఆమె పూర్వ జన్మలోనిది. ఆ మాటలు విని, ఆమె, ఆమె భర్త ఆశ్చర్యపోయినారు. ఇంతలో శ్రీస్వామి కృపతో ఆమెకు పూర్వజన్మ స్ఫురణకు వచ్చినది. సిగ్గుతో ఆమె తన గత జన్మలోని భర్తను చూచి తలవంచుకొనినది. ఇంతలో ఆ నూనెవర్తకుని పిల్లలు అక్కడికి చేరారు. వారందరికీ శ్రీస్వామి కృపతో ఆమె తమ తల్లిలాగా కనపడసాగినది. వారు ఆమెను చూస్తూనే "అమ్మా!" అంటూ ఆమెచుట్టూ చేరారు. అపుడు శ్రీస్వామి ఆమెతో "నీవు ఈ నూనె వ్యాపారితో కలసి వాని ఇంటికి వెళ్ళు, అక్కడ పడమటి వైపున రంగులు పూసిన ఒక కట్టు పాతి వుంటుంది. నీవు గత జన్మలో దానిక్రింద చాలా ధనం దాచి వుంచావు. దానిని బయటకు తీసి ఇతనికి ఇచ్చేసి తిరిగి ఇక్కడకు రా!" అన్నారు. ఆమె తన భర్తతోసహా పూర్వజన్మలోని వారితో కలసి ఆ ఇంటికి వెళ్ళి అక్కడ పాతిపెట్టిన ధనం అంతా తీసి వారికి ఇచ్చినది. తిరిగి అందరు శ్రీస్వామి సన్నిధికి చేరినారు. శ్రీస్వామికి తాము చెప్పినట్లు చేశామని ఈ దంపతులు విన్నవించుకున్నారు. నూనె వర్తకునికి, వాని పిల్లలకు ధనము దొరికినది. వారి దారిద్ర్యము తీరినదని సంతసంతో శ్రీస్వామికి పాదాభివందనం చేసినారు. శ్రీస్వామి మహిమతో వారికి పూర్వస్మృతి పోయింది. అంతట శ్రీస్వామి ఆ దంపతులను చూచి "ఇక మీకు పిల్లలు పుడతారు, మీ గ్రామం వెళ్లండి!" అని ఆశీర్వదించినారు. వారు వారి గ్రామం చేరినారు. కొంతకాలానికి వారికి పిల్లలు కలిగినారు. వారు శ్రీస్వామిని నిత్యము స్మరించుకుంటూ వుండేవారు.

ఆ నూనె వర్తకుడు, వారి పిల్లలు నిత్యం శ్రీస్వామిని దర్శించుకొనుచు సుఖముగా జీవించసాగిరి.

నలదుర్గంలో శ్రీస్వామివారి భక్తుడు ఒకడు తహసీల్దారు ఆఫీసులో గుమాస్తాగా పనిచేస్తుండేవాడు. అతని పైఅధికారి తాసిల్దారు బైరాంజీ పార్శీ మతస్థుడు. అతను ఈ గుమాస్తా ద్వారా శ్రీస్వామివారి లీలలను తెలుసుకొని, శ్రీస్వామిని విమర్శించసాగినాడు. ఒకసారి ఈ గుమాస్తా శ్రీస్వామివారి దర్శనార్థము వెళ్ళాలంటే అతనికి సెలవు మంజూరు చెయ్యలేదు. మరుసటి రోజున శ్రీస్వామి స్వయంగా నలదుర్గం వచ్చారని తెలిసి గుమాస్తా శ్రీస్వామిని



దర్శించుకొచ్చాడు. తర్వాత ఆఫీసుకు వెళ్ళినాడు. అతను ఆఫీసుకు ఆలస్యంగా రావటం గురించి తాసిల్దారు కారణం అడిగినాడు. శ్రీస్వామి సమర్థులు నలదుర్గం వచ్చినారని, వారి దర్శనార్థం వెళ్ళి వస్తున్నానని, అందువలన కొద్దిగా ఆలస్యం అయినదని, క్షమించమనినాడు. ఆ తాసిల్దారు మహాకోపముతో శ్రీస్వామిని తీవ్రముగా విమర్శింపసాగెను. అందులకు గుమాస్తా కోపంతో "నేను ఉద్యోగమైనా వదిలివేస్తానుగాని, మీరు శ్రీస్వామిని విమర్శించితే సహించను. ముందు మీరు ఒక్కసారి శ్రీస్వామిని దర్శించండి. మళ్ళీ యిలా మాట్లాడరు" అన్నాడు. ఆ తాసిల్దారు కొంచెం నిదానించి, ఆలోచించి "సరే అలాగే వెళదాము. రా!" అని వానిని వెంట తీసుకొని శ్రీస్వామి దర్శనానికి వచ్చినాడు. శ్రీస్వామి అతనిని చూస్తూనే అతను చేసిన తప్పుడు పనులన్నీ ఏకరువుపెట్టి, నీ మతం యివ్వన్నీ చెయ్యమని చెబుతుందా? అని అడిగినారు! తాసిల్దారు బైరాంజీ శ్రీస్వామి సర్వజ్ఞత్వమునకు ఆశ్చర్యపడి, తన తప్పులు తెలుసుకుని, శ్రీస్వామిని క్షమాపణలు వేడినాడు. అతడు శ్రీస్వామిని నలదుర్గంలో వున్నన్నిరోజులు ఆఫీసు మూసివేసి అహర్నిశలు శ్రీస్వామి సంకీర్తనలో నిమగ్నమైనాడు. క్రమంగా శ్రీస్వామికి అత్యంత ప్రీతికరమైన భక్తుడైనాడు.

విద్యాసాగరా!

శ్రీస్వామి సమర్థులను ప్రత్యక్షముగా చేరి, సేవించినవారేకాక, పరోక్షముగా వారి చిత్రపటమును భక్తి శ్రద్ధలతో పూజించి సేవించి శ్రీస్వామివారి అనుగ్రహమునకు పాత్రులైనవారును కలరు. దీనిద్వారా శ్రీస్వామివారు తమకున్నూ, తమ చిత్రపటమునకున్నూ భేదములేదని భక్తులయందు విశ్వాసము కలిగించినారు. డాక్టర్ వామనగోపాల్ బొంబాయిలో నివసిస్తుండేవారు. ఆయన మూలికావైద్యం కూడా చేసేవారు. ఔషధముల గుణ, దోషాలు బాగుగ తెలిసినవాడు. ఆయన 'సర్పగంధి' అనే వనమూలికతో 'సరసపరిల్లా' అనే ఔషధాన్ని స్వయంగా తయారు చేసినాడు. దీనిని రక్తపోటు తగ్గించడానికి నేటికీ వాడుచున్నారు. డాక్టర్ వామనగోపాల్ శ్రీస్వామి సమర్థుల లీలలను గురించి విని, వారియందు విశ్వాసము కలిగి శ్రీస్వామివారి చిత్రపటమును తన పూజామందిరమున పెట్టుకొని అత్యంత భక్తిశ్రద్ధలతో నిత్యము పూజిస్తుండేవారు. తన భక్తి గౌరవములను చూపుటకు, తన తృప్తికోసం ఆయాకాలాలలో లభించే రకరకములైన పండ్లను బంగీద్వారా శ్రీస్వామివారికి పంపుతుండేవాడు. ఒకసారి ఆయన దానిమ్మపండ్లు కొన్నింటిని పార్శిలు ద్వారా పంపినాడు. ఆ తరువాత మూడు రోజులకు ఆయన శ్రీస్వామివారిని ధ్యానించుచుండగా ఒక దృశ్యం కనబడినది. ఒక స్త్రీ పార్శిలు విప్పి అందుండి

దానిమ్మపండ్లు తీసి, ఒలిచి, శ్రీస్వామివారికి స్వయముగా తినిపించుచుండగా, శ్రీస్వామివారు వాటిని ఆనందముతో తినుచున్నట్లు దృశ్యము కన్పించెను. శ్రీస్వామివారు తాను పంపిన నైవేద్యమును స్వీకరించినట్లుగా ఆ డాక్టరుగారు మనస్సులో భావించి చాలా పరవశుడైనాడు. అప్పటినుండి శ్రీస్వామివారికి, వారి చిత్రపటమునకు భేదములేదని ఆయన గ్రహించి ఎంతో భక్తిశ్రద్ధలతో పూజించుచు, తన ధ్యానమును కొనసాగించు కొనుచు ఆధ్యాత్మికముగా ఎంతో అభివృద్ధి పొందెను.

ఒకనాడు సంతానము లేని ఒక స్త్రీ శ్రీస్వామివారిని దర్శించి సంతానము ప్రసాదించమని కోరినది. శ్రీస్వామివారామెను చూసి "నీ రాతలో బిడ్డలులేరు" అన్నారు. కాని ఆమె ఎంతో భక్తితో, ఆశ వదలక శ్రీస్వామిని సేవిస్తూ శ్రీస్వామివారి అనుగ్రహమునకై అక్కడే వున్నది. ఒకరోజున శ్రీస్వామివారు ఆమె శ్రద్ధ, విశ్వాసములకు చాలా ఆనందించి, "నేను సత్యలోకానికి వెళ్ళి బ్రహ్మదేవునితో తగవులాడియైనా సరే నీకు బిడ్డలిప్పిస్తాను" అని రెండు కర్జూరకాయలు యిచ్చి ఆమెను భోజనానంతరం తినమన్నారు. ఆమె ఎంతో సంతోషించి యింటికెళ్ళి ఆ రెండు ఖర్జూరాలను గూట్లోపెట్టి స్నానం చేసిన పిదప వాటిసంగతి మరచిపోయెను ఆ మరుసటి దినమున గుర్తుకువచ్చి వాటికోసం వెదుకగా ఆ గూట్లో రెండు కోడి గ్రుడ్లు వున్నవి. తన పొరపాటుకు ఎంతో విచారించి, వాటిని తీసుకుని శ్రీస్వామిని దర్శించి తనను క్షమింపమని వేడుకొన్నది. శ్రీస్వామి "నీకు పూర్ణాయువుగల యిద్దరు బిడ్డలనిచ్చాను. నన్నింక బాధించకు" అని కోపముగా పలికిరి. ఆ మాటలకు ఆమె ఒక్కసారిగా కుప్పకూలి పడిపోయినది. అప్పుడు శ్రీస్వామి తమ అమృత దృష్టిని ప్రసరింపజేసి ఆమెకు మళ్ళీ ప్రసాదంయిచ్చి వెంటనే తినమన్నారు. కొంతకాలమునకు ఆమెకు ఒక పుత్రుడు జన్మించెను. ఆమె జీవితమంతా శ్రీస్వామిని అత్యంత భక్తిశ్రద్ధలతో పూజించెడిది. శ్రీస్వామి సమర్థులు కరుణా సముద్రులు. తన భక్తులు చేసిన పొరపాట్లను తిరిగి తానే క్షమించి అనుగ్రహించే దయామయులు.

**"స్వామి సమర్థ - స్వామి సమర్థ**
**అక్కల్‌కోట వాసా - స్వామి సమర్థ"**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**
**ముప్పది ఆరవ అధ్యాయము** సంపూర్ణము





ఓం శ్రీ సాయిరాం

ఓం శ్రీ గం గణేశాయ నమః

ఓం శ్రీ శారదాయ నమః

జయజయ రఘువీర సమర్థ

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది ఏడవ అధ్యాయము

విద్యాసాగరా! శ్రీస్వామి దత్తవతారులనీ, సర్వదేవతా స్వరూపులనీ అనేకమందికి అనుభూతులనిచ్చారు. ఈ సద్గురు దేవుడు ఎవరు ఏ రూపములో తమను సేవించినా, ఆయా రూపాలలో దర్శనమిచ్చి వారిని అనుగ్రహిస్తుంటారు.

ఒకానొకరోజు అక్కల్‌కోటలో శ్రీస్వామి సమర్థులవారిని దర్శించేందుకు ఒక సాధువు వచ్చెను. ఆయనకు చాలాకాలం నుండి 'జలోదరం' అనే వ్యాధి వున్నది. ఆ వ్యాధి తీవ్రత వలన తాను చనిపోయేలోపల ఒక్కసారి ద్వారకకు వెళ్ళి బాలకృష్ణుని దర్శించుకోవాలనే కోరిక కలిగినది. కాని ఆ జబ్బువలన అది తీరలేదు. ఈలోపు అతడు శ్రీస్వామి సమర్థుల లీలలు విని శ్రీస్వామిని దర్శించుకుందామని వచ్చాడు. అతను రాగానే శ్రీస్వామి అతనిని దగ్గరకు పిలిచి "నీ కోరిక నెరవేరుతుంది!" అన్నారు. శ్రీస్వామిని దర్శించగానే వీరు సాక్షాత్తు శ్రీదత్తావతారులై యుంటారని తన మనస్సులో భావించాడు. వెంటనే అతని మనోభావము గ్రహించి శ్రీస్వామి "నేనెవరైతే నీకెందుకు? వెళ్ళి ఆ వేపచెట్టు ఆకులు తిను" అన్నారు. ఆ సాధువు వెంటనే వేపచెట్టు ఆకులు కోసి తిన్నారు. అవి చాలా చేదుగా వున్నవి. శ్రీస్వామివారు తన సహజధోరణిలో పొట్టను రెండు చేతులతో పట్టుకొని పకపక నవ్వి మరో కొమ్మ చూపించి ఆ యాకులు తినమన్నారు. సాధువు అవి తిని చూడగా చాలా తియ్యగా వున్నాయి. అతని ఆశ్చర్యానికి అంతులేదు. అతని మాటలు విని అక్కడున్న భక్తులు కూడా ఆ వేపకొమ్మ ఆకులు తిని చూడగా అవి వారికి కూడా తియ్యగా వున్నవి. అందరూ శ్రీస్వామి లీలకు చాలా ఆశ్చర్యచకితులైనారు. ఆ సాధువుకు మూడు

రోజులకు 'జలోదరం' వ్యాధినుండి స్వస్థత లభించినది. ఆ సంతోషముతో సాధువు నాలుగవ రోజున శ్రీస్వామివారి దర్శనార్థం వెళ్ళినపుడు శ్రీస్వామివారికి బదులుగా చతుర్భుజుడైన ద్వారకా కృష్ణుడు దర్శనమిచ్చాడు. ఆ సాధువు తన్మయుడై సాష్టాంగవందనం చేసి లేచేసరికి, తిరిగి ఆ ప్రదేశంలో చిరునవ్వు నవ్వుతూ శ్రీస్వామి కూర్చుని వున్నారు. అది తనకు కలిగిన భ్రమ ఏమోనని ఆ సాధువు తలచెను. కాని విచిత్రముగా దానిని భ్రమకాదని నిరూపిస్తున్నట్లుగ శ్రీస్వామివారి చెవులకున్న బంగారు కుండలాలు రాతికుండలాలుగా మారిపోయినవి. అవి చాలా బరువుగా వున్నందున వెంటనే భక్తులు వాటిని తీసివేసినారు. ఆ సాధువు చాలాకాలము అక్కల్‌కోటలోనే వుండినారు.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులవారి కీర్తిప్రతిష్ఠలు దేశములోని అన్నివైపుల వ్యాపించినవి. అన్ని ప్రాంతముల నుండి భక్తులు వేలాదిగా రాసాగిరి. అక్కల్‌కోట ఒక పెద్ద పవిత్ర పుణ్యక్షేత్రంగా మారిపోయినది. దర్శనమునకు భక్తులు తెల్లవారుజామునుండి బారులు తీరి నిలబడి వుండేవారు. శ్రీసమర్థులవారి దర్శనమునకు ఎంతో కష్టపడవలసి వచ్చేది. ఆ విధంగా అర్ధరాత్రివరకు సాగేది. సేవకులు బలవంతముగా అర్ధరాత్రి దర్శనమును ఆపుచేసేవారు. అంత సమయము దర్శనమిచ్చినా యింకా కొంతమంది మిగిలిపోయేవారు. రానురాను శ్రీస్వామివారికి విశ్రాంతి లోపించినది. అందువలన శ్రీస్వామి ముసుగు పెట్టుకొని, మంచంమీద పడుకొని, తమ పాదాలను మాత్రమే భక్తులు నమస్కరించేందుకు వీలుగా బయటకు చాచేవారు. అయినా వారలా పడుకునివున్నా ఎవరి మనసులోనైనా సందేహాలుగాని, అపవిత్రమైన భావాలుకాని వచ్చినప్పుడు, కష్టాలలో ఆపదలలో వున్నాము రక్షించమని వేడుకొన్నపుడు ఆయన తక్షణమే లేచి తగురీతిన సమాధానము చెప్పి మరలా పడుకునేవారు.

విద్యాసాగరా! అంతేకాదు, శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్‌వారు గ్రామములో సంచరించుచున్నపుడు కూడ రాజలాంఛనాలతో, బాజా భజంత్రీలతో, భజనలతో, వందిమాగధుల జయ జయనాదాలతో సేవకులు, శిష్యులు, భక్తబృందాలు ఆయన వెంట తిరుగుతుండేవారు. అది చూచేవారికి మహదానందముగా వుండేది. అంతేకాదు, ఆ సమయంలో కోలాహలముతో గానముచేసే రకరకాల పక్షుల సమూహములకు ఆశ్రయమైన మహా



వటవృక్షములాగా శ్రీస్వామి సమర్థులు గోచరించేవారు. శ్రీస్వామివారు ఎక్కడైనా ఆగిపోయినపుడు అది రహదారైనా, చిన్న సందైనా, శుభ్రతలేని స్థలమైనా జనులందరు శ్రీస్వామిచుట్టూ చేరి కూర్చునేవారు. వారందరు "అఖండకోటి బ్రహ్మాండనాయకా! రాజాధిరాజ యోగిరాజా! పరబ్రహ్మా! సచ్చిదానంద సద్గురు శ్రీస్వామి సమర్థ! అక్కల్‌కోట మహరాజ్‌కీ జై" అని ముక్తకంఠంతో జయజయ ఘోషలు చేసేవారు. పాఠకులారా! మనముకూడా శ్రీస్వామివారి సన్నిధిలో వున్నామని భావించుకొని, ఆ జయఘోషలలో పాల్గొని ఆనందించెదము. శ్రీస్వామివారు ఇంతమంది యిన్నివిధాలుగా సేవిస్తున్నా, తాము నిశ్చలులై వుండేవారు. తమకు బుద్ధిపుట్టినట్లు చిన్నపిల్లల్లాగ ఆడుకుంటూ, చెట్లవంక, ఆకాశంలోనికి చూస్తూ ఎవరితోనో మాట్లాడుతున్నట్లు తమలోతాము ఏవేవో మాట్లాడుకుంటూ తమ ఆనందంలో తాము మునిగి వుండేవారు. ప్రత్యక్షంగా వస్తున్న వారిని అనుగ్రహిస్తున్నా ఆనాటికి 'కొడక్ ఇండియా లిమిటెడ్' వారు తీసిన ఫొటోలను కొని తమ ఇళ్ళలో పెట్టుకుని పూజించేవారినందరినీ కూడా కష్టాలనుండి బాధల నుండి విముక్తుల్ని చేసేవారు.

విద్యాసాగరా! శ్రీ దత్తాత్రేయస్వామిని ఆశ్రయించిన భక్తులు శ్రీస్వామి వారిని చేరి అనుగ్రహము పొందినవారి కథలు చెబుతాను వినమని చెప్పసాగిరి.

శ్రీదత్తాత్రేయ భక్తుడైన ఒక బ్రాహ్మణుడుండేవాడు. ఒకసారి అతనికి కుష్ఠువ్యాధి వచ్చినది. ఎన్నోరకాల వైద్యం చేశాడు. కాని అతని వ్యాధి నివారణ కాలేదు. అతనికి మిత్రులు నీవు దత్తభక్తుడివిగదా! శ్రీగాణుగాపురం వెళ్ళు అని సలహాయిచ్చారు. ఆ బ్రాహ్మణుడు వెంటనే గాణుగాపురం వెళ్ళి శ్రీదత్త పాదుకలను సేవిస్తూ నిత్యము శ్రీగురుచరిత్ర పారాయణ చేయటం ప్రారంభించాడు. తన రోగ నివారణ చేయమని శ్రీదత్తుని చాలా ఆర్తితో ప్రార్థిస్తున్నాడు. ఒకరోజు రాత్రి దత్తమూర్తి కలలో దర్శనమిచ్చి అక్కల్‌కోట వెళ్ళి అక్కడ శ్రీస్వామి సమర్థులను దర్శించమని ఆదేశించినారు. శ్రీదత్తుని ఆదేశానుసారం అతను అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థులను దర్శించి, వారిని సేవిస్తూ చాలాకాలము అక్కడే వుండిపోయాడు. ఆ వ్యాధి తీవ్రమై రోగ బాధను భరించలేక ఒకరోజున శ్రీస్వామివారితో "స్వామీ! నాకు ఓర్పు నశించినది. మీ పాదాలచెంత మరణించినాసరే! నన్ను ఈ బాధనుండి విముక్తుణ్ణి చేయండి, నన్ను అనుగ్రహించండి" అని అతి దీనంగా ప్రార్థించినాడు. శ్రీస్వామివారు అతనిని

విదిలిస్తూ 'మలము పూసుకో' అన్నారు. అతను వేరుదారిలేక మలాన్ని సేకరించుదామని వెళ్తూ, ఇతరుల మలముకంటే శ్రీస్వామివారి మలమే పూసు కోవటం ఎంతో ఉత్తమమని ఆలోచించి అలాగే చేశాడు. అతని దృఢ భక్తివలన మలము చందనంవలె మారింది. క్రమముగా అతని వంటిమీదున్న కుష్ఠువ్యాధి మానటం మొదలై, పాతచర్మం రాలిపోయి శరీరం వింతకాంతితో, ఆరోగ్యవంతంగా మారినది. అతడు శ్రీస్వామివారి అనుగ్రహమునకు ఎంతో ఆనందించి, శ్రీసమర్థులవారిని పూజించి తన ఊరికివెళ్ళి జీవితాంతమూ శ్రీస్వామికి అత్యంత భక్తుడైనాడు. శ్రీస్వామిని శ్రీదత్తస్వరూపునిగా ఆరాధించేవాడు.

విద్యాసాగరా! శ్రీధర్ అనే బ్రాహ్మణుడు కన్నడ ప్రాంతంలో వుండేవాడు. అతడు శ్రీదత్తుని తన యిష్టదైవంగా ఆరాధించేవాడు. కొంతకాలంగా అతడు తీవ్రమైన కడుపునొప్పితో బాధపడుతున్నాడు. ఆ బాధను భరించలేక అతను గాణుగాపురం వెళ్ళి అక్కడ రోగ నివారణకోసం శ్రీదత్తాత్రేయుని అత్యంత భక్తిశ్రద్ధలతో సేవించాడు. ఒకరాత్రి స్వప్నంలో అతనికి శ్రీదత్తదేవుడు దర్శనమిచ్చి "శ్రీపురి వృక్షం ఆకులరసం, శొంఠిపొడి, సైంధవలవణం కలిపి కొన్ని రోజులు త్రాగితే నీ రోగం తగ్గుతుంది" అని చెప్పారు. నిద్రలేచిన తరువాత అతనికి ఆ స్వప్నం చక్కగా జ్ఞాపకం వున్నది. కాని అతనికి శ్రీపురి వృక్షమంటే ఎలా వుంటుందో, ఏమిటో తెలియక ఎంతమందిని అడిగినా ఎవ్వరికీ తెలియలేదు. అతడు చాలా నిరాశపడ్డాడు. కాని మరునాటి రాత్రి శ్రీదత్తుడు మళ్ళీ స్వప్నంలో కనిపించి "అక్కల్‌కోటలోని పరమహంస శ్రీపురి వృక్షం గురించి తెలుపగలడు. నీవు వెంటనే అక్కల్‌కోట వెళ్ళు" అన్నారు. శ్రీధర్ తెల్లవారగానే బయలుదేరి అక్కల్‌కోట చేరాడు. అప్పుడు శ్రీస్వామి సమర్థులు ఆంజనేయస్వామి ఆలయంలో కూర్చొని వున్నారు. శ్రీధర్ అక్కడి వారిని విచారించి శ్రీస్వామివారి దర్శనానికి వెళ్ళి నమస్కరించి, నిలబడి వుండగా శ్రీ అక్కల్‌కోట శ్రీస్వామివారు "వేపచెట్టును శ్రీపురి వృక్షం అంటారు. వేపాకు రసంతో శొంఠిపొడి, సైంధవలవణం కలిపి మూడురోజులు త్రాగు, నీ జబ్బు పూర్తిగా నయమవుతుంది" అన్నారు. అతడు మిక్కిలి ఆశ్చర్యపడి, శ్రీస్వామిని సాక్షాత్తు శ్రీగురు దత్తాత్రేయ అవతారమని మనసులో భావించి ఆయన చెప్పినట్లే చేయగా కడుపునొప్పి తగ్గి, రోగరహితుడైనాడు. శ్రీధర్ శ్రీస్వామిని సేవించి, తన గ్రామం వెళ్ళి జీవితాంతము శ్రీస్వామివారి భక్తుడై పూజించుకున్నాడు.



## శ్రీ గోవిందజీమాధవజీ

బొంబాయిలో గోవిందజీమాధవజీ అనే ధనవంతుడుండేవాడు. అతను వ్యాపారము చేసేవాడు. ఆయన గొప్ప ధార్మికుడు. నిత్యం పూజానుష్ఠానములు చేసుకొనేవాడు. లక్ష్మణ్ పండిట్ అనే పూజారి తరచుగా వీరింటిలో పూజలు చేయించడానికి వచ్చేవాడు. అతని సలహాపై గోవిందజీ 1868వ సంవత్సరములో తమ వంట బ్రాహ్మణుడైన కానోజీని తీసుకొని గాణుగాపురం వెళ్ళి అక్కడ శ్రీదత్త పాదుకలను సేవిస్తూ కొద్దిరోజులున్నాడు. ఒకనాటి రాత్రి అతనికి స్వప్నంలో శ్రీనరసింహ సరస్వతి దర్శనమిచ్చి "నేను యిప్పుడు అక్కల్‌కోటలో వున్నాను. అక్కడికి వచ్చి దర్శించుకో" అన్నారు. వెంటనే వారు అక్కల్‌కోట చేరి శ్రీస్వామి సమర్థులను దర్శించారు. ఆయన దివ్యమంగళ రూపమును చూచి, వారి లీలలను గురించి విని, ఎంతో ప్రీతిచెంది కొంతకాలం అక్కడే వుండాలనుకొంటూ తాము స్వయంగా వండి తెచ్చిన పాయసం, గారెలు శ్రీస్వామికి నివేదించగా శ్రీస్వామి "వీటిని తీసుకెళ్ళి ఊరిబయట షేక్ నూరుద్దీన్ దర్గా దగ్గర వున్న ఫకీరుకు, ఆయన కుక్కకు పెట్టండి" అన్నారు. శ్రీస్వామివారి ఆదేశానుసారం వారు వెళ్ళి చూడగా నిజంగా అక్కడ పకీరు, కుక్క కనిపించారు. ఆ రెండు గిన్నెలూ వారి ముందు నైవేద్యంగా పెట్టారు. ఆ ఫకీరు కొంత, కుక్క కొంత తినగా గిన్నెలలో ఒక గారెముక్క, కొద్దిగా పాయసం మిగిలినవి. వాటిని తీసుకొని గోవిందజీ, కానోజీ తిరిగి శ్రీస్వామి సన్నిధికి వచ్చారు. శ్రీస్వామి "ఇవి మీరు ప్రసాదంగా తినండి" అన్నారు. కాని గోవిందజీ అవి తినటానికి యిష్టపడలేదు. కానోజీ మాత్రం సందేహిస్తూనే కొద్దిగా నోట్లో వేసుకున్నాడు. అంతట శ్రీస్వామి సమర్థులు కోపంగాచూస్తూ "నీ భక్తి యింకా పరిపూర్ణం కాలేదు. గురువాజ్ఞ పాటించడానికి సందేహిస్తున్నావు" అని గోవిందజీతో అన్నారు. అయినా మళ్ళీ అతనిని ఆశీర్వదించి భక్తిశ్రద్ధలు కలగడానికి తమ పాదుకలిచ్చి పూజించుకోమన్నారు. కానోజీని చూచి నీకు బొంబాయిలో పదివేల రూపాయలు దొరుకుతాయని ఆశీర్వదించిరి. అతనికి ధనాశ ఎక్కువ.

తిరిగి వచ్చిన పిదప గోవిందజీ శ్రీస్వామి ప్రసాదించిన పాదుకలను పూజలో వుంచుకొని నిత్యం భక్తి శ్రద్ధలతో పూజించసాగారు. తనకు పదివేల




రూపాయలు ఎక్కడ దొరుకుతాయా అనుకొంటూ శ్రీస్వామివారి మాటలకు ఆశ్చర్యపడి, ఆలస్యం భరించలేక కానోజీ పిచ్చివాడిలా ఆ డబ్బుకోసం ప్రతి చెత్తకుండీలోను వెదకటం ప్రారంభించి బొంబాయి అంతా తిరుగుతున్నాడు. శ్రీస్వామి మాట జరిగి తీరుతుందన్న గుడ్డి నమ్మకం తప్ప వేరేమీ అతనికి తెలియదు. ఒకరోజున చెత్తకుప్పలో వెదకుచుండగా, ఆ ప్రక్క ఇంట్లో నుండి ఒక స్త్రీ వచ్చి పదివేల రూపాయలను కట్టకట్టి అతనికిచ్చింది. ఆమె భర్త చనిపోయినాడు. తన భర్తకు సద్గతి కలగాలని ఆశిస్తూ ఆ ధనం ఉదయం ఎవరు ముందుగా కనిపిస్తే వారికి 'గుప్తదానం' యిస్తానని అనుకొన్నదట. మహారాష్ట్రలో ఇది సాంప్రదాయంగా వుండేది. ఈ సంగతి శ్రీస్వామి సమర్థులకు ముందే తెలుసునని దీనివలన తెలియుచున్నది. శ్రీస్వామి సమర్థుల వాక్కు వేదవాక్కు, భూత, భవిష్యద్వర్తమానములు మూడు తెలిసిన మహానుభావుడు శ్రీస్వామి సమర్థులు.

***ఓం గురునాథా - శ్రీగురునాథా !***

***దత్త గురునాథా - శ్రీ సాయినాథా !***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*

*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*

***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*

***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***

***ముప్పది ఏడవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"హరే రామ హరే రామ  రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ  కృష్ణ కృష్ణ హరే హరే"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది ఎనిమిదవ అధ్యాయము

విద్యాసాగరా!

సద్గురువును అనన్యభావంతో సేవించేవారికి ఆయనను ప్రసన్నుడిని చేసుకోవడానికి అనేక మార్గాలున్నవి. వాటన్నింటిలో నిరంతర స్మరణయనేది ప్రధానమైనది. ఆ స్మరణకు మూలం దైన్యం, దంబం, ఆర్తి, ఆనందం, బాంధవ్యం, వైరానుబంధం, రాగం, ద్వేషం – ఏదైనా కావచ్చు. ఎవరేవిధంగా సేవించుచున్నా ఆయన తప్పక వారిని అనుగ్రహించి తీరుతారు. కాని వారు స్మరించే పద్ధతి ననుసరించే అనుగ్రహ విధానం వుంటుంది. ఆయన లీలా విశేషాలను అర్థం చేసుకోవడం సామాన్యులకు సాధ్యంకాదు. పరిశుద్ధ హృదయులు, పరిణత మనస్కులు, పవిత్ర జీవులు మాత్రమే దీనిని అవగాహన చేసుకోవడానికి అర్హులౌతారు. సద్గురువును మధురమూర్తిగా భావించుకోగలిగినవారు, ఆయనను ఆశ్రయించినవారు, పూర్ణమైన భావంతో ఆయననే అర్చించేవారు, ఆయనపట్ల కలిగిన భక్తితో, ప్రేమతో ఉన్మాదులు కాగలిగినవారు ఆయన కృపారసముచే వర్షించే ప్రేమామృతాన్ని ఆస్వాదించి అనితర దుర్లభమైన ఆనందాన్ని పొందగల్గినవారు మాత్రమే ఆ లోకేశుని లీలలను పూర్తిగా అర్థం చేసుకోగలుగుతారు.

విద్యాసాగరా! శ్రీస్వామి భక్తులలో ఒక నిరుపేద బ్రాహ్మణుడు వుండేవాడు. అతనికి అతని కుటుంబానికి రోజూ కడుపునిండా అన్నం దొరికేదికాదు. అతడు సమయం దొరికినప్పుడల్లా శ్రీస్వామి సమక్షంలో చేతులు జోడించి మౌనంగా నిల్చుని తన దృష్టిని ఆ సద్గురుదేవుని పాదాలమీదే నిల్పేవాడు. శ్రీస్వామి ఒకసారి హరిజనవాడలో కూర్చున్న సమయంలో అదేవిధంగా

శ్రీస్వామి ఎదుట నిలబడినాడు. శ్రీస్వామి అకస్మాత్తుగా అతని ప్రక్కనున్న ఎముకల ప్రోగును చూపిస్తూ "ఆ ఎముకలు ఏరుకొని తీసుకొనిపో!" అన్నారు. ఆ భక్తునికి ఆ ఎముకలు ఏరుకోవడానికి కాస్త సంకోచం కలిగింది. అయినా సద్గురుమౌళి, దేవదేవుడైన శ్రీస్వామి వారి ఆజ్ఞను ధిక్కరించడానికి మనస్కరించ లేదు. గురువాజ్ఞ ఎట్టిదైనా ఆచరించడమే ఉత్తమమని వెళ్ళి ఆ ఎముకలను తన పై కండువాలో మూటకట్టి దగ్గరలోవున్న గూటిలోపెట్టి మళ్ళీ శ్రీస్వామివారి ముందు అట్లే చేతులు జోడించి నిల్చాడు. శ్రీస్వామి అతనిని చూచి "పో! ఇంకా ఎందుకిక్కడ నిలబడ్డావు?" అని గద్దించారు. ఆ పేద బ్రాహ్మణుడు తత్తరపాటుతో ఆ మూటను చేతిలోకి తీసుకున్నాడు. వెంటనే అవి ఎముకలు కావని అతనికి అర్థమైంది. వెంటనే మూట విప్పి చూచాడు. అన్నీ బంగారపు కడ్డీలే. వాని ఆశ్చర్యానందాలకు అంతులేదు. వెంటనే పాదాభివందనం చేశాడు. అక్కడున్న భక్తులంతా ఆ వింతను కళ్ళారా చూచారు. ఘటనాఘటన సమర్థులు శ్రీస్వామి అని పలుమార్లు స్తుతించారు. ఆ బ్రాహ్మణుడు తన జీవితాంతము శ్రీస్వామిని భక్తితో ఆరాధించేవాడు. శ్రీస్వామి మరియొకనాడు హరిజనవాడలో కూర్చొనియున్న సమయంలో సుదూర ప్రాంతమునుండి ఒక సంపన్న కుటుంబీకురాలు, అగ్రవర్ణమునకు చెందినటువంటి స్త్రీ దర్శనార్థం వచ్చినది. శ్రీస్వామివారి వద్దకు వచ్చి "శ్రీస్వామీ! నాకు సంతానం లేదు. తమరు కటాక్షించితే నేను సంతానవతి నౌతానని ఆశతో వచ్చానని మొరపెట్టుకొంది. శ్రీస్వామి ఉన్నట్లుండి "ఇదిగో! నీకు సంతానం తీసుకో!" అంటూ ప్రక్కనున్న ఎముకనొకదానిని చేతితో తీసి యిచ్చారు. ఆమె అది చూచి ఒక్కడుగు వెనక్కి వెళ్ళింది. ఆ ఎముక సంతానమంటారేమిటీ? అనిపించిందామెకు. దగ్గరలోనున్న వేరొక హరిజన స్త్రీ చివాలున లేచి కొంగుపట్టి "స్వామీ! ప్రసాదించండి" అంది. శ్రీస్వామి ఆ ఎముకను ఆమె కొంగులో వేశారు. సంవత్సరం తిరిగేసరికి దబ్బపండు లాంటి మగబిడ్డ కలిగాడామెకు. వెనక్కి వెళ్ళిన స్త్రీ తర్వాత ఎన్నిసార్లు ప్రయత్నించినా శ్రీస్వామి దగ్గరకు రానీయలేదు. మహాత్ముల దగ్గరదాకా వెళ్ళినా, వారి అనుగ్రహాన్ని పొందాలంటే చాలా ధైర్యం కావాలి. లేకుంటే ఇలాగే చేయిజారిపోతుంది.

పూణాలో శ్రీనందరాంసుందరజీ షావుకారు అనే ఆయన వుండేవారు. ఆయన పెద్ద కంట్రాక్టరు. పండరీపురంలోని పుండరీక మందిరపు సభా మండపమును, పూణాలోని తులసీబాగ్ రామమందిరమును కట్టించిన మహాభక్తుడు. ఈయనకు ఆసనద్వారము గ్రంథి వాయుటచేత చాలా బాధపడుతుండేవాడు. అతను ఎంతో ధనమును ఖర్చుచేసి అనేకమంది వైద్యులను



సంప్రదించి, వారు చెప్పిన వైద్యములన్నియు చేసినాడు. కాని ప్రయోజనము కనిపించలేదు. ఒకరోజు అక్కల్‌కోట నుండి పండిత్ బాలకృష్ణ భట్ అను జ్యోతిష్కుడు నందరాంసుందరజీగారి ఇంటికి వచ్చినాడు. నందరాంసుందరజీ అతనితో తన వ్యాధి గురించి దానివలన తనకు కలుగు బాధలను గురించి చెప్పుకొనినాడు. బాలకృష్ణ భట్ వాని జాతకమును పరిశీలించి ఒక పూర్ణపురుషుని దర్శనమే ఈ వ్యాధి నివారణోపాయమని, వేరు మార్గము లేదని స్పష్టముగా చెప్పెను. అందులకాతడు "అట్టి మహాపురుషుని ఎక్కడ వెతికి పట్టుకొనేది" అన్నాడు. అప్పుడు బాలకృష్ణభట్ అక్కల్‌కోటలో వున్న శ్రీస్వామి సమర్థుల గురించి వివరించిరి. ఆయన దర్శనం చేసుకొని, ఆయన దయకు పాత్రుడైతే వ్యాధి నిర్మూలన జరుగుతుంది. శ్రీస్వామి సమర్థులను ఆశ్రయించి, మానసిక, శారీరక రుగ్మతలను పోగొట్టుకొన్నవారెందరో గలరు. కావున నీవు త్వరగా వెళ్ళి వారినాశ్రయించుమని సలహాయిచ్చి, శ్రీస్వామివారి నామమును జపించుచు అక్కల్‌కోట నుంచి తెచ్చిన విభూతిని ప్రసాదముగా యిచ్చెను. ఎంత ఆశ్చర్యము! అది సేవించగానే నందరామ్ బాధ తీవ్రత తగ్గెను. క్రమముగా ఎనిమిది రోజులలో వ్యాధి పూర్తిగా నివారింపబడెను. అంత నందరామ్ షాహుకారుకు అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామివారిని దర్శించవలెనని ఆత్రుత కలిగెను. వెంటనే బయలుదేరి అక్కల్‌కోటకు చేరెను. శ్రీస్వామి సమర్థులను దర్శించి పాదాభివందనము చేసెను. అచ్చటి భక్తులకు, బ్రాహ్మణులకు, సేవకులకు గొప్ప విందు చేసెను. బీదలకు దానములు, యితరులకు దక్షిణలు, కొందరికి బట్టలు పంచెను.

నందరామ్ సుందరజీ షాహుకారు గొప్ప శివభక్తుడు. ఒక సోమవారం నాడు అతడు మల్లికార్జునస్వామి ఆలయానికి వెళ్ళినాడు. అక్కడ కూర్చునివున్న శ్రీస్వామి సమర్థులకు ప్రణామం చేశాడు. శ్రీస్వామి అతనితో "నేను నీ యిష్టదైవమైన మల్లికార్జునస్వామిని కాను.ఆయన లోపల శివలింగంలో వున్నారు. వెళ్ళి దానిని పూజించుకో!" అన్నారు. నందరామ్ గుడి లోపలకు వెళ్ళి విభ్రాంతుడైనాడు. ఆ గర్భగుడిలో శివలింగమే లేదు. బయటకు వచ్చి అక్కడున్న వారందరికీ ఆ విషయం తెలిపాడు. అంతట వారందరూ లోనికి వెళ్ళి చూచారు. శివలింగము వుండే స్థానంలో శ్రీస్వామివారు కూర్చుని వున్నారు. బయట వరండాలో శ్రీస్వామి కూర్చునియే వున్నారు. బయట, లోపల ఒకే సమయంలో అందరకు శ్రీస్వామి సమర్థులే కనిపిస్తున్నారు. విస్మయం చెంది ఆనంద పారవశ్యులై శ్రీస్వామియే మల్లిఖార్జునుడని అందరూ గ్రహించారు. "హర హర మహాదేవ శంభో" అని జయ జయ నాదములు చేసినారు.

విద్యాసాగరా! మనము కూడా శ్రీస్వామికి జయ జయ నాదములు చేద్దామని "హర హర మహాదేవ శంభో" అని పలికిరి. పాఠకులారా! మనం కూడా మనసారా ఆ సన్నివేశంలో భాగం పంచుకున్నట్లుగా భావించి ఆ జయ జయ నాదములను చేద్దాం.

శ్రీ నిత్యానందులు తిరిగి పై విషయముల నిట్లు చెప్పసాగిరి. ఆ తరువాత నందరామ్‌ను శ్రీస్వామి ఆశీర్వదించి తమ పాదుకలను అనుగ్రహించినారు. నందరామ్ పూనా తిరిగివచ్చి శ్రీస్వామివారి పాదుకలను సేవిస్తూ, అతిథి – అభ్యాగతులను పూజిస్తూ, దానధర్మాలుచేస్తూ – సాధు – సంతులను గౌరవిస్తూ తన శేషజీవితాన్ని గడిపి ధన్యుడైనాడు.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు భక్తులకు లౌకికమైన కోరికలు, సంతానము, ఆరోగ్యము, సిరిసంపదలు ప్రసాదించి అనేకులను సంతోష పెట్టినారు. అంతేగాక తమను దర్శించిన సాధకుల చిక్కులు తీర్చి, సాధనలో పైస్థాయిల నందించారు. అంతేకాదు, ఎక్కడో గుజరాత్ రాష్ట్రములోని పవిత్రమైన గిర్నార్ పర్వత గుహలలో శ్రీదత్తాత్రేయస్వామి అనుగ్రహం కొరకు సాధన చేస్తున్న శ్రీకృష్ణగిరి, శ్రీ భారతీబువా, శ్రీ రామపురి బువా అనే ముగ్గురు సాధకులకు బౌతికంగా దర్శనమిచ్చి అనుగ్రహించారు. అంతేకాదు, మంగళ్‌వేడాలో మరొక సన్యాసికి దర్శనమిచ్చి "ద్వారకకు వెళ్ళి అక్కడి తడిమట్టితో పైసా అచ్చులు తయారుచెయ్యి. నీకు విఠలుడు దర్శనమిస్తాడు" అని ఆదేశించారు. ఆ సాధువలాగే శ్రీస్వామి చెప్పినట్లుగా ద్వారకకు వెళ్ళి ఏమరుపాటు లేకుండా విఠలనామ జపం స్మరణచేస్తూ శ్రీస్వామి ఆదేశాన్ని పాటించాడు. అతనికి పండరినాథుడు మూడుసార్లు దర్శనమిచ్చాడు ప్రతిసారి మరుక్షణంలోనే శ్రీస్వామి దర్శనం కూడా అయినది. అయితే ఇందులకు విచిత్రమేమంటే విద్యాసాగరా! ఇన్ని సందర్భాలలోను శ్రీస్వామి అక్కల్‌కోటలోనే వున్నారు.

***హర హర శంకర నమామి శంకర***
***శ్రీస్వామి సమర్థా శివ శివ శంకర***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పది ఎనిమిదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## ముప్పది తొమ్మిదవ అధ్యాయము

గురుదేవా! శ్రీస్వామి సమర్థులు అనేకమందికి వారి వారి సాధనలలోని లోపాలను తొలగించి గురువులకే గురువైనారని చెప్పుకొంటారుగదా! అలా వారిని సేవించి యోగులుగా, మహాత్ములుగా అయినవారి కథలను తెల్పండి అని విద్యాసాగరుడు ప్రార్థించగా శ్రీ నిత్యానందయోగి మందహాసముచేసి "విద్యాసాగరా! ఇప్పటివరకు శ్రీస్వామి అనుగ్రహమును పొందిన రాజులు, సాధారణ భక్తులు, పండితులు, కీర్తనకారులు, జంతువులు మున్నగువారి కథలను చెప్పుకొన్నాము. ఇక యోగులు, మహాత్ములు శ్రీస్వామి కరుణకు పాత్రులై వారి శిష్య పరమాణువులైన వారిని గురించి తెలుపుతాను వినుము, అని శ్రీస్వామి సమర్థులను మనసున తలచి,

దేవాదిదేవా! సద్గురుమౌళీ! నీ లీలలు అనంతములు. నీవు స్వయం ప్రకాశకుడవై ఈ ప్రపంచాన్ని సృష్టిస్తూ, పాలిస్తూ, సంహరిస్తూ వుంటావు. అనేక కార్యములకు కారకుడవైన నీవు ఆయా కార్యములను చేయునప్పుడు ఆయా పేర్లతో వ్యవహరించబడుచూ వుంటావు. అజ్ఞానులైనవారు నిన్ను బ్రహ్మయని, విష్ణువనీ, రుద్రుడనీ వేరువేరుగా గుర్తిస్తుంటారు. కాని, మహానుభావా! శరీరమున కర, చరణాలు వేరుకానట్లు ఈ భూతజాలమంతా నీవే! గురుడవు నీవే, శిష్యుడవు నీవే. గురువుగా అజ్ఞాన లక్షణములను పారద్రోలి జ్ఞానాన్ని ప్రబోధం చేసేది నీవే. అజ్ఞానమును వదలి జ్ఞానమును పొందు శిష్యుడవు నీవే. గురువు వేరనీ, శిష్యుడు వేరనీ భావించడం అజ్ఞాన లక్షణం. అనేక

 

జన్మల పుణ్యఫలం వలన గురువు లభించినా భేద బుద్ధివలన తన గురువు వేరని, ఈ గురువు వేరనీ భావిస్తుంటారు. ఆ గురువుల ఆకారాలు ఎన్నివున్నా అందులో పనిచేయు సద్గురుడవు నీవేనని గుర్తించరు. కర్మతంత్రంపట్ల అభిమానముగలవారు అఖిలాండేశ్వరుడైన నీ తత్త్వాన్ని గ్రహించలేరు. నిష్కాములైనవారు మాత్రమే నిన్నాశ్రయించి, నీ పాదముల నర్చించి, సేవించి నీ నిజతత్త్వాన్ని అవగతం చేసుకోగల్గుతారు. పంచభూతాత్మకమైన జీవిలాగా కన్పించడమే నీ మాయా విలాసం. మమ్ముల నుద్ధరించడానికే జననము, మరణము లేని నీవు ఈ మానుష శరీరాన్ని ధరించినావు. ఓ దత్తావతారా! సచ్చిదానంద స్వరూపా! సద్గురుదేవా! శ్రీస్వామీ సమర్థా! మమ్ము కరుణించి నీ తత్త్వమును, నీ లీలలోని మర్మాన్ని స్ఫురణకు తెచ్చి అనుగ్రహింపుము" –

అని కన్నులు మూసుకొని శ్రీస్వామిని ప్రార్థించగా శ్రీస్వామి సమర్థులు అఖండమైన తమ దివ్య స్వరూపాన్ని దర్శింపజేసి ఆశీర్వదించారు. శ్రీస్వామి అనుగ్రహించిన దర్శనములో వారిచే అనుగ్రహింపబడిన యోగులందరితోసహా కన్పించిరి. శ్రీ నిత్యానందుడు విశ్వరూపమువంటి ఆ దృశ్యమునూ, దానిలోని విశేషములను మననంచేస్తూ చాలాసేపు వుండిపోయారు. విద్యాసాగరుడు నిత్యానందుని ముఖవర్చస్సులో మారుచున్న కళలను చూచి వారికి శ్రీస్వామి దర్శనమైనదని గ్రహించెను. తిరిగి కొంత సమయం గడిచాక నిత్యానందులు తమలో తాము మందహాసం చేయుచుండగా చూచి "శ్రీస్వామీ! గురుదేవా!" అని చేతులు జోడించెను. నిత్యానందుడా పిలుపువిని, కన్నులు తెరచి, వానివైపు చూచి శ్రీస్వామివారి లీలను ఇంకనూ వినాలనే కుతూహలం అతనిలో గమనించి "వత్సా! శ్రీస్వామిచే అనుగ్రహింపబడిన మహాత్ములు, యోగులు అనేకులు గలరు. వారు చూపిన లీలలు, అనుగ్రహములను చెప్పుకొంటే ఒక్కొక్కరిది ఒక్కొక్క మహోన్నత గ్రంథమౌతుంది. అందువలన లఘువుగా వారందరి విషయములనూ తెలుపుతాను గ్రహించుము. లోకములో ఇనుమును బంగారముగా మార్చుశక్తి పరుసవేధికి వుంది. కాని అలా బంగారుగా మారిన ఇనుపముక్క తాను స్వయముగా ఇనుమును బంగారముగా మార్చలేదు. ఒక జ్యోతినుండి అనేక జ్యోతులను వెలిగించవచ్చు. అలా వెలిగిన జ్యోతులన్నీ ఒకేలాంటి ప్రకాశమును యిస్తుంటాయి. అలాగే గురువు తనను పూర్తిగా ఆశ్రయించిన శిష్యుణ్ణి తనంతవానిగ చేయగలడు. వారినే తత్త్వదర్శులని



అంటారు. శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణ పరమాత్మ అర్జునునికి మోక్షకాములైన వారు ఇట్టి తత్త్వ దర్శియైన గురువును సేవించమనే చెప్పియున్నారు.

## ఆళంది శ్రీనరసింహ సరస్వతీస్వామి

పండరిపురంలో విఠల్‌స్వామియని ప్రసిద్ధిచెందిన గొప్ప వేద పండితుడుండేవాడు. అతడు నిరంతరము యోగసాధనలో అనేక సంవత్సరములు గడిపాడు. ఈ యోగసాధన ద్వారా అతడు కొన్ని దివ్య సిద్ధులను పొందినాడు. ప్రజలు వీరిని గొప్ప యోగి పుంగవునిగా గౌరవించి పూజించేవారు. అతడు చక్కటి కీర్తనాకారుడు కూడా. అనేక వేదాంత విషయములను కీర్తనల ద్వారా, ఉపన్యాసముల ద్వారా సరళమైన భాషలో చెప్పుచుండేవాడు. అతని ఆరాధ్యదైవం శ్రీదత్తాత్రేయస్వామి. పాండురంగని నిత్యమూ సేవించుచున్నా, వారిలో శ్రీదత్తాత్రేయస్వామినే దర్శించేవాడు. అతడు హఠయోగ సాధన చేస్తూ అందులో ఆజ్ఞాచక్రవమువరకు వెళ్ళి ఆగిపోయేవాడు. అతడికి ఆ చక్రవిషయం పూర్తిగా బోధపడలేదు. చాలాకాలం ప్రయత్నించి విఫలుడై ఎవరైనా సద్గురువుద్వారా ఈ అవరోధమును తొలగించుకోవలెనని నిశ్చయించుకొని, అట్టి గురువుకై అన్వేషణ చేయసాగెను. ఆ సమయములో ఆయనకు శ్రీస్వామి సమర్థుల గురించి తెలియవచ్చింది. పండరిపురంలో భీమానది ఉధృతంగా ప్రవహిస్తున్న సమయమున శ్రీస్వామి నదిపైన నడచిన విషయము, మంగళవేడాలో, మహోల్, సోలాపూర్‌లలో చూపిన లీలల గురించి తెలిసినది. వారు ప్రస్తుతం అక్కల్‌కోటలో వున్నారని తెలిసి అష్టసిద్ధులకంటే అతీతమైన వారి శక్తిని గుర్తించి అట్టివారే తన అవరోధమును తొలగింప సమర్థులని విశ్వసించి అక్కల్‌కోటకు బయలుదేరెను.

విఠల్‌స్వామి పండరిపురం నుండి పాదచారియై అక్కల్‌కోటకు వచ్చుచు శ్రీస్వామిని మనసులో మరీ మరీ తలచుకొంటూ వారి అనుగ్రహంతో నా సాధన పరిపక్వం కావాలని కోరుకుంటూ నామసంకీర్తన చేస్తూ రాసాగెను. అక్కల్‌కోటలో శ్రీస్వామి సమర్థులు, పండరిపురంలో విఠల్‌స్వామి తనను విశ్వసించిన క్షణములోనే వీరి మనోభావమును గ్రహించినారు. వారు అక్కల్‌కోట వచ్చుచున్న వార్త ఇచ్చుటకు చేరకమునుపే భండారా (భోజనశాల) వద్దనున్న శ్రీస్వామివారు రాజామాలోజీరావుతో ఒక జింకచర్మము తెప్పించి తమకెదురుగా రోడ్డుపైన వేయించమని ఒక యోగి తమ దర్శనార్థం వచ్చుచున్నారని తెలిపిరి.




రాజావారు ఒక నౌకరుద్వారా ఒక జింకచర్మమును తెప్పించి రోడ్డుపైన పరపించిరి. మిట్టమధ్యాహ్నం వేళకు విఠల్‌స్వామి అక్కల్‌కోటకు చేరి శ్రీస్వామివారు భండారావద్దనున్న విషయం గ్రహించి నేరుగా అక్కడకు వెళ్ళెను. దూరమునుండియే శ్రీస్వామి సమర్థులను చూచి అచ్చటనే సాష్టాంగ దండప్రణామములాచరించెను. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి రోడ్డు మధ్యలోనున్న జింకచర్మమును చూపిరి. వినయముతోను, భక్తితోను వీరు దత్తావతారులేనని విశ్వసించి వారు చూపిన ఆసనముపై కూర్చుండెను. అట్లు కూర్చున్న విఠల్‌స్వామిని తన కృపా దృష్టితో చూస్తూ శ్రీస్వామి సమర్థులీ క్రింది శ్లోకమును పఠించారు.

*"షష్ఠం భ్రూమధ్యచక్రం తత్ర అంగుష్ఠమాత్రం జ్ఞాననేత్రం*
*దీప శిఖాకారం ధ్యాయేత్ వాచా సిద్ధిర్భవతి"*

ఆ శ్లోకం వింటూండగానే విఠల్‌స్వామికి ఆజ్ఞాచక్రస్థితి జాగరితమై కుండలినీ శక్తి సహస్రారమును చేరినది. అట్లు చేరి ఆనందానుభూతిలో సమాధిస్థితినొందినాడు. రెండు గంటలసేపు ఆ స్థితిలో అలాగే వుండిపోయాడు. తర్వాత శ్రీస్వామి సమర్థులు తిరిగి తమ కృపాదృష్టిని ప్రసరింప చేసినారు. అప్పుడు విఠల్‌స్వామి మరల మామూలు లౌకిక స్థితికి వచ్చినారు.

శ్రీస్వామివారు విఠల్‌స్వామిని సంత్ శిరోమణి శ్రీ జ్ఞానేశ్వర్ మహరాజ్ జీవసమాధి వున్న అళంది పట్టణంచేరి అక్కడ నివసింపుమని ఆజ్ఞాపించిరి. శ్రీ నరసింహ సరస్వతి అనే దీక్షానామంతో సన్యాసదీక్ష తీసుకొని ఆళంది గ్రామం చేరిరి. అది పరమ పవిత్రమైన క్షేత్రమని, తన ఆధ్యాత్మిక జీవితమునకు అనువుగా వుండునని తలంచి శ్రీస్వామివారి ఆజ్ఞతో శాశ్వత నివాసమేర్పరచు కోవాలని వచ్చిరి. కాని వారు ఆ ప్రదేశములో చేరునాటికి ఉన్న వాతావరణమును చూచి చాలా నిరుత్సాహపడిరి. పూర్వము అచటి బ్రాహ్మణులు వేదపఠనము, ప్రస్థానత్రయము, సంత్‌జ్ఞానేశ్వరుల వారి భగవద్గీత వ్యాఖ్యానము 'జ్ఞానేశ్వరి'లను పూర్తిగా పఠించుచు ఆచారవంతులై జీవించేవారు. కాని ఆ సమయంలో కలి ప్రభావంతో అనాచారపరులై వేదాధ్యయనము చేయక 'జ్ఞానేశ్వరి'ని, ప్రస్థాన త్రయమును వదలివేసి అసభ్యకరమైన పనులకు లోనైయున్నారు. వారిలో పూర్తిగా నాస్తికత్వము ప్రబలిపోయింది. సాధుసంత్ శిరోమణి నివసించి, జీవ సమాధి పొందిన ఆ గ్రామములో సాధుసంతులను గౌరవించువారు కరువైనారు. శ్రీనరసింహ సరస్వతి అచ్చట పరిస్థితి అంతా గ్రహించి ఎంతో ఉదాసీను డయ్యెను.



పరమ పవిత్రమైన ఆ స్థానమునకు తిరిగి పూర్వపు వైభవమును, పవిత్రతను ఎలాగైనా కలిగించాలని మనస్సులో దృఢమైన సంకల్పం శ్రీనరసింహ సరస్వతికి ఏర్పడినది. ఆయన కనులముందు "వెళ్ళి ఆళందిలో నివాసమేర్పరచుకో!" అని ఆశీర్వదించిన శ్రీస్వామి సమర్థులు దర్శనమిచ్చారు. అప్పుడు నరసింహ సరస్వతికి శ్రీస్వామి ఆళంది వెళ్ళమన్న మాటలకు అర్థం తెలిసినది. ఆ కార్యక్రమమును నిర్వర్తించుటకై జనులను ఆకర్షించి మంచి మార్గములో పెట్టుటకుగాను మొట్టమొదట ఆ బ్రాహ్మణులందరినీ పిలిచి తన దివ్యశక్తితో వారికి షడ్రసోపేతమైన విందును యిచ్చారు. దానికి చాలా ఆనందపారవశ్యులైన ఆ బ్రాహ్మణులు వారి దివ్యశక్తికి ఆకర్షితులై వారియందు సదభిప్రాయమును ఏర్పరచుకొనిరి. భోజనానంతరము శ్రీనరసింహ సరస్వతి వారందరినీ సమావేశపరచి "ఆర్యులారా! ఇది అతి పవిత్రమైన క్షేత్రము, శ్రీ కృష్ణావతారులైన శ్రీ జ్ఞానేశ్వర మహరాజ్ జీవించి 'జీవసమాధి' పొందిన ప్రదేశము. మీ పూర్వీకులు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠులై వారిని సేవించి, ప్రఖ్యాతి పొందినారు. అటువంటి వారికి వారసులైన మీరు అనాచారవంతులై జీవించుట తగదు. మీరు ప్రతినిత్యము యిటువంటి విందు పొందాలనుకొంటే, నిత్యం, 'జ్ఞానేశ్వరి', 'ప్రస్థానత్రయము' వేదమంత్రములను వల్లెవేయవలెను అని వారందరికి హితబోధ చేసి ఆశచూపెను. క్రమక్రమముగా వారందరూ ఆ విందు భోజనములకై స్వామి చెప్పినట్లు చేయసాగారు. శ్రీనరసింహ సరస్వతి వారితో నామ సంకీర్తనలు, అఖండనామ జపయజ్ఞములు చేయించసాగిరి. అంతేకాదు చక్కగా చేసినవారికి అనేకమైన ఆకర్షణీయమైన వస్తువులను తమ యోగశక్తితో సృష్టించి యివ్వసాగిరి.

ఈ విధముగా ఆకర్షితులైన గ్రామంలోని బ్రాహ్మణులు మొదట శ్రీ నరసింహ సరస్వతి స్వామివారి సంతృప్తికోసం మాత్రమే పవిత్ర గ్రంథ పఠనము, వేద మంత్రములు వల్లించుట, నామ సంకీర్తనములు చేసినా, శ్రీస్వామి సమర్థుల ఆశీర్వచనంచేత, నరసింహసరస్వతి సంకల్పబలంచేత, పవిత్ర గ్రంథముల పఠనంచేత, వారిలో క్రమక్రమంగా భక్తిబీజములు నాటుకొని సాంప్రదాయబద్ధులైరి. తిరిగి ఆ క్షేత్రమునకు, బ్రాహ్మణులకు పూర్వవైభవము కలిగినది. అది ఆళంది చరిత్రలోనే గొప్ప ఘట్టము.

శ్రీనరసింహ సరస్వతి కొంతకాలమునకు ఆళంది గ్రామమున అందరూ సనాతన ధర్మపరులైన తరువాత తిరిగి అక్కల్‌కోటకు శ్రీస్వామి సమర్థుల

దర్శనార్థము వెళ్ళిరి. ఆ సమయములో శ్రీస్వామి సమర్థులు రామాలయములో తమ శిష్యులతోను, భక్తులతోను కూర్చొని వున్నారు. అక్కల్‌కోట పొలిమేరలో శ్రీనరసింహసరస్వతి వుండగనే యిచ్చట శ్రీస్వామి ఎటో చూస్తూ ఎవరినో ఉద్దేశించి మాట్లాడినట్లు గట్టిగా "ఏమిటి? నీవు ఇంకా ఆ టక్కులాడిని వదలలేదా?" అన్నారు. అచ్చటవున్నవారికి ఆ మాటలు ఎవరిని ఉద్దేశించి అన్నారో అర్థంకాలేదు. కొద్దిసేపటికి శ్రీనరసింహ సరస్వతి స్వామివారి సమక్షములోనికి వస్తూనే నమస్కారంచేస్తూ "మహారాజా! సద్గురుమౌళీ! నేనందుకు సిద్ధంగానే వున్నాను. కాని అందులకు మీ కరుణా కటాక్షం అవసరం. ఆ సిద్ధులను ఈ క్షణంలోనే వదిలివేస్తాను" అన్నారు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి, ఆశీర్వదించిరి. సేవకులతో నేలమీద ఒక పులిచర్మము పరచమని ఆజ్ఞాపించారు. శ్రీ నరసింహ సరస్వతిని దానిమీద ఆశీనులు కమ్మనిరి. శ్రీ నరసింహ సరస్వతి అచ్చట ఆశీనులై శ్రీస్వామితో అనేక ఆధ్యాత్మిక చర్చలను చేసి తన సందేహములను తీర్చుకొనినారు. చాలా సమయము శ్రీస్వామి సన్నిధిలో గడిపి శ్రీస్వామి ఆశీర్వచనములను తీసుకొని తిరిగి ఆళందికి చేరిరి.

ఆళందిలో ప్రతిరోజు ఇంద్రాణీ నదిలో స్నానంచేసి, అనుష్ఠానమును చేసుకొని మధ్యాహ్నం గ్రామములో భిక్షచేసి, నిరంతరం శ్రీస్వామి నామజపముతో గడిపేవారు. వారు తీవ్రమైన సాధనతో సిద్ధులను ప్రదర్శించటం మాని మహోన్నతమైన శక్తిని పొంది గొప్ప యోగీశ్వరులైనారు. వారు వేదాంతపరమైన ఉపన్యాసము చేయువారు. అచట ఎన్నియో ధర్మశాలలు కట్టించినారు. విరివిగా అన్నదానము చేసేవారు. వారిని సేవించి వారికి శిష్యులై ప్రసిద్ధిచెందినవారు ఎందరో కలరు. అందులో మహర్షి అన్నాసాహెబ్ పట్వర్థన్ ఒకరు. వారిని శ్రీస్వామి సమర్థులే స్వయంగా నరసింహ సరస్వతిని సేవించుమని పంపిరి. మరియు శ్రీ మాధవనాథ మహరాజ్, శ్రీ పాలేకర్ (అప్రబుధ్) మున్నగువారు కలరు. విద్యాసాగరా! ఒకనాడు ఆళందిలో శ్రీ నరసింహ సరస్వతి అర్జునుని అవతారంగా చెప్పుకొనే సంఘటన జరిగినది. ఆళందిలో ప్రతి సంవత్సరం జ్ఞానేశ్వర మహరాజ్‌వారి రథోత్సవం జరుగుతుంది. ఆ రథాన్ని శ్రీనరసింహ సరస్వతులే తయారు చేయించారు. అయితే ఒకసారి రథోత్సవంలో ఆ రథం కదలలేదు. భక్తుందరూ ఎంత ప్రయత్నంచేసినా రథం కదలలేదు. ప్రజలు ఆందోళన చెందుచుండగా ఆ సమయంలో శ్రీ నరసింహ సరస్వతి



ధ్యానంలో వున్నారు. ఆయన ఈ విషయం గ్రహించి "ఓ కృష్ణా! ఒకప్పుడు నీవు నా రథం తోలావు. ఈనాడు నన్ను నీ రథం తోలమంటావా?" అని లేచివచ్చి రథంపై కూర్చొనగానే రథం సాగిపోయినది. ప్రజలు ఆనందోత్సాహాలతో వేడుక చేసుకున్నారు. జ్ఞానేశ్వర మహారాజ్ శ్రీకృష్ణుని అంశ అయితే, శ్రీ నరసింహ సరస్వతి అర్జునుడి అవతారంగా గుర్తించి ప్రజలు సేవించసాగినారు. నరనారాయణులు ద్వాపరయుగంలో శ్రీకృష్ణార్జునులై అవతరించారని, వారే తిరిగి జ్ఞానేశ్వరుడిగా, నరసింహ సరస్వతిగా ఈ యుగములో అవతరించారని భక్తులు విశ్వసించేవారు. ఆళందిలో శ్రీ నరసింహ సరస్వతి 12 సంవత్సరములు జీవించి సమాధి పొందిరి. ఆళందిలో నేటికీ శ్రీ నరసింహ సరస్వతి మఠం కలదు. వారి జీవసమాధికూడ అక్కడే వున్నది. వారికి నేటికినీ అనేకమంది శిష్యులు కలరు. ప్రతి సంవత్సరము వారు శ్రీనరసింహ సరస్వతి పుణ్యతిథిని అత్యంత వైభవముగా జరుపుచున్నారు.

విద్యాసాగరా! శ్రీ నరసింహ సరస్వతి అంతగొప్ప యోగిగా మలచబడుటకు శ్రీస్వామి సమర్థుల కరుణాకటాక్షమే కారణము. తొలుత చెప్పుకొన్నట్లుగా ఒక పరంజ్యోతి మరొక జ్యోతిని వెలిగించును. అదియు మరియొక జ్యోతిని వెలిగించును. ఇది సహజసిద్ధమైన సామర్థ్యము. అటులనే ఈ గురుశిష్య పరంపర సాగిపోవుచుండును అని నిత్యానందులు తెలిపి, నాయనా! ఇట్లు శ్రీస్వామి వెలిగించిన మరొక జ్యోతిని గురించి చెప్పుకొందాం! అని చెప్పసాగిరి.

***గోవింద గోపాల! రాధే నందలాలా!***
***రాధే నందలాలా! రాధే నందలాలా!***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ముప్పది తొమ్మిదవ అధ్యాయము*** *సంపూర్ణము*






ఓం శ్రీ సాయిరాం
వినాయకా వినాయకా
విఘ్న వినాశక వినాయకా!

# శ్రీ అక్కల్‌కోట
# స్వామి సమర్థ లీలామృతము

## నలుబదియవ అధ్యాయము

### శ్రీ రామానంద బీడ్కర్ మహరాజ్

విద్యాసాగరా!

పరమానందానుభూతిని వాంఛించేవారు ప్రప్రథమంగా ఐహిక వాంఛలను త్యజించాలి. సిరిసంపదలమీద, పేరు ప్రతిష్ఠలమీద తనకున్న వ్యామోహాన్ని విసర్జించాలి. ప్రాపంచిక విషయ వాసనాదులకు దూరంకావాలి. పరమాత్ముని ప్రేమించి, సేవించి ఆయన వాత్సల్యామృతాన్ని రుచి చూచినవారికి ఈ ప్రపంచముతో ఏ విధమైన సంబంధము వుండదు. వారు ప్రపంచానికి, దూరంగా వుంటారు. ప్రపంచము వారికి దూరంగా వుంటుంది. వారిని ఈ ప్రపంచం ఉన్మాదులను చూసినట్లు చూస్తుంది. భగవద్భక్తిని మించిన మరో మత్తుపదార్థము ఈ ప్రపంచంలో లేనేలేదు. పరమాత్మను ప్రేమించిన వారికి ఆయన తప్ప వేరే ఏదీ కనిపించదు. ఈ ప్రపంచమంతా వారికి భగవన్మయముగా కన్పిస్తుంది. చివరకు వారుకూడా భగవంతునిగా మారిపోతారు. దీనినే ఆధ్యాత్మిక పరిభాషలో భ్రమర కీటక న్యాయం అంటారు. కీటకము భ్రమరమును చూచి భ్రమించి తాను భ్రమరముగా మారినట్లు, యిది భక్తిలో పరిశుద్ధము, పరిపూర్ణము అయిన పరిణత స్థితి. దానిని పొందడమే మానవుడియొక్క లక్ష్యం.

శ్రీస్వామి వెలిగించిన ఆధ్యాత్మిక జ్యోతిని మరొకదానిని గురించి చెబుతాను వినుము.

శ్రీరామానంద బీడ్కర్ 1838లో ఒక విశ్వబ్రాహ్మణ కుటుంబములో జన్మించెను. అతని చిన్న వయస్సులోనే తండ్రి మరణించెను. అతని కుటుంబము ఆధ్యాత్మిక చింతన కలది. తండ్రి చనిపోయిన తరువాత ఆధ్యాత్మిక చింతనవలన



తాత్కాలిక వైరాగ్యమున ఇల్లువిడచి వెళ్ళి పండరీపురము, సప్తశృంగి మొదలైన పుణ్యక్షేత్రాలను దర్శించి చివరికి పూనా చేరుకొన్నాడు. వారసత్వముగా వచ్చిన బంగారునగలు చేయుటయందు కొద్దిపాటి అనుభవము వలన ఒక షరాబువద్ద చేరినాడు. క్రమక్రమంగా బంగారు, వెండి నగల తయారీలో చక్కటి నిపుణతను సంపాదించెను. పూనాలోనే తాను స్వంతంగా నగలు తయారుచేస్తూ, పెద్ద నగల వర్తకునిగా పేరుగాంచినాడు. వివాహంకూడా చేసుకున్నాడు. చందనపు చెక్కలతో అత్తరు, సుగంధ పరిమళ ద్రవ్యములు తయారుచేయుటలో కూడా నేర్పు సంపాదించి ఆ వ్యాపారము కూడా చేయసాగాడు. చాలా గొప్ప ధనవంతుడైనాడు. అయినా అతనికి ధనకాంక్ష తీరలేదు. బాల్యమునుండి పట్టుదల గలవాడు కావున ఎంతో శ్రమించి రసవిద్యను నేర్చుకొని, బంగారమును తయారుచేయసాగాడు. ధనము పెరగడంతో బీడ్కర్ చెడు సహవాసములుబట్టి దురలవాట్లకు బానిస అయినాడు. వ్యాపారరీత్యా గ్వాలియర్ వెళ్ళి వస్తూ అక్కడ ఒక పతిత సాంగత్యములోపడి ఆమెకు దాసుడైనాడు. అలా కొన్నిరోజులు సాగాక ఆమెను జీవితాంతము పోషించడానికి, వివాహము చేసుకోవటానికి సిద్ధపడినాడు. కాని అంతలో ఆమె చనిపోయినది. అయినా స్త్రీ వ్యామోహము తీరక మరో స్త్రీని ఆశ్రయించాడు.

బీడ్కర్ మనస్తత్వము ఏదైనా అతిగా చేయటం అలవాటు. ఇంత పతనావస్థలోనున్నా అతడు తన నిత్య కార్యక్రమములో పూజ, అనుష్ఠానములు మానలేదు. కామము అనే భూతము ఆవహించిన వాడికి సంతృప్తి ఎన్నటికీ కలుగదు. అతను ధనవంతుడై వుండికూడ ఎప్పుడూ అశాంతితో బాధపడేవాడు. ఇట్లుండగా ఒకనాడు అతని అదృష్టవశమున ఒక సాధువు దర్శనం కలిగినది. బీడ్కర్ ఆయనను చూడగానే ఒక అవ్యక్తానుభూతికి లోనైనాడు. తాను చేసిన అవినీతి పనులు అతని కళ్ళముందర మెదలినవి. అతనిలో పశ్చాత్తాపము కలిగినది. ఆ సాధువు దగ్గరగా వెళ్ళి వారికి నమస్కరించి, కూర్చుని తాను చిన్నతనము నుండి చేయుచున్న భగవదారాధన గురించి తెలిపి, తన బలహీనతలను కూడ చెప్పుకున్నాడు. తనకు చిన్నతనము నుండి యోగ మార్గమునందు అభిలాష కలదని, దుష్టజన సాంగత్యము వలన తాను ఈ పతన జీవితమునకు లోబడినట్లు తెలిపి, తనకు తరణోపాయము చూపమని ప్రాధేయపడినాడు. అప్పుడా సాధువు బీడ్కర్‌తో "యోగవిద్య విరాగులకు,




సన్యాసులకు లభించునదేగాని నీవంటి విషయ భోగలాలసులకు, ధనకాంక్ష వదలలేని వానికి ఎన్ని జన్మలకైనా లభించదు” అని పరుష వాక్కులతో అతని చర్యలను ఖండించి పొమ్మనెను. ఆ సాధువు మాటలు బీడ్కర్ హృదయములో బాగుగ నాటుకొనెను. తాను పశ్చాత్తాపాగ్నిలో దగ్ధమగుచు గతించిన పతన జీవితమును విడచి, ముందున్న జీవితమును నూతన మార్గమున గడుపవలెనని దృఢ నిశ్చయమును చేసుకొనెను. గట్టి పట్టుదలతో సన్మార్గమున పయనించ దలచినాడు. ఆనాటి నుండి ప్రతిరోజు మారుతి మందిరమునకు వెళ్ళి హనుమత్కవచమును పఠించుట ప్రారంభించినాడు. ఆంజనేయుడు జితేంద్రియుడు, ఆత్మసంయమనమునకు, నిశ్చలభక్తికి ప్రతిరూపము కనుక మనసును కాంతా – కనకముల నుండి మరల్చి భక్తి మార్గమున నడిపించగలడని అతడు గట్టిగా విశ్వసించినాడు. క్రమముగా తన బలహీనతల నుండి దూరమై, నిజమైన పశ్చాత్తాపమును కలిగి దైవముచే క్షమింపబడినాడు.

ఒకనాటి రాత్రి స్వప్నములో అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థులను దర్శించమని సూచన యివ్వబడినది. ఆ మరుసటిరోజునే బయలుదేరి బీడ్కర్ అక్కల్‌కోట చేరినాడు. అక్కడ శ్రీస్వామి సమర్థులను గురించి అడుగగా శ్రీస్వామివారు రాజభవనములో వున్నారని తెలిసెను. అందువలన శ్రీసమర్థుల దర్శనం అతనికి వెంటనే దొరకలేదు. బీడ్కర్‌కు మొదట నిరుత్సాహం కలిగినను, శ్రీస్వామిని దర్శించకుండా అక్కల్‌కోట వదలి వెళ్ళకూడదని కృతనిశ్చయుడైనాడు. అంతేకాక దర్శనము అయ్యేవరకు అన్న పానీయములు ముట్టనని ప్రతిజ్ఞచేసి, రాజభవనమున కెదురుగా కూర్చుని, శ్రీస్వామివారి నామ జపమును నిరంతరము చేయుచుండెను. ఆ విధముగా రెండు రోజులు గడచినవి. రాజభవనములోనున్నను శ్రీస్వామి సమర్థులకు బీడ్కర్ విషయమంతయు పూర్తిగా తెలియును. బీడ్కర్ పట్టిన శపథము కూడా తెలియును. ఆయన పెడదారిన పడిన తన బిడ్డ మరలి, సన్మార్గమునకు వచ్చినందుకు లోలోన చాలా సంతోషించినారు. అంతవరకు అతని భక్తిని, ఓర్పును పరీక్షించిన శ్రీస్వామి మూడవ దినమున రాజభవనము నుండి హఠాత్తుగా బీడ్కర్ ఎదుట సాక్షాత్కరించిరి. బీడ్కర్ పట్టరాని ఆనందముతో వెళ్ళి సాష్టాంగపడి శ్రీస్వామివారి పాదములను గట్టిగా పట్టుకున్నాడు. శ్రీస్వామి “నా పాదములింత గట్టిగా ఎందుకు పట్టుకున్నావు?” అనిరి. బీడ్కర్ “హే సద్గురుమౌళీ! నా ఉద్ధారకులు మీరే!



నా ఆధ్యాత్మిక జీవితమునకు మీరే గట్టి పునాది వేయాలని యింత గట్టిగా పట్టుకున్నాను" అన్నాడు. వెంటనే శ్రీసమర్థులు "అటుచూడు" అని ఒక జింక చర్మమును చూపిరి. బీడ్కర్ అది చూచి "ఏమీ అర్థంకాలేదు స్వామీ!" అన్నాడు. విచిత్రంగా శ్రీస్వామి వెంటనే మారిపోయి కోపముతో "ఎంతటి అజ్ఞానం?" అని తిట్టుట మొదలిడిరి. శ్రీస్వామివారి కోపమును చూసి చోళప్ప, సుందరాబాయి మొదలగు సేవకులు బీడ్కర్‌తో "శ్రీస్వామివారు కోపంలో ఏమైనా చేస్తారు. యిక్కడనుండి దూరంగా వెళ్ళిపో!" అనిరి. బీడ్కర్‌ను ఎందుకు తిట్టుచున్నారో ఎవరికీ అర్థంగాకపోయినా, అతనికి మాత్రం గతంలోని తన ప్రవర్తనకు ఇంతకంటే పెద్ద శిక్షవేసినా చాలదనిపించెను. అందువలన శ్రీస్వామివారి తిట్లను ఆశీస్సులుగా భావించినాడు. ధైర్యంచేసి "శ్రీస్వామీ! దయామయా! మీరు నన్ను చంపినాసరే, నేను మీ పాదాలను విడువను" అన్నాడు. అందరూ ఈ వింత దృశ్యమును అత్యంత కుతూహలముగా చూచుచుండిరి. శ్రీస్వామి తన కోపం తగ్గించుకొని "నీవు వచ్చిన పని అయినది, పో! యిక్కడ నుంచి" అంటూ తన యోగ దృష్టితో శక్తిపాతము చేసిరి. బీడ్కర్ హృదయమునందు శ్రీస్వామి చూపులతో అవ్యక్తానందము కలిగినది. శరీరము రోమాంచితమైనది. ఆనంద బాష్పములు ధారగా కారినవి. దీనితో బీడ్కర్‌లో కుండలిని చైతన్యము పొందినది. శ్రీస్వామియందు గట్టి విశ్వాసముతో పూనా తిరిగి వెళ్ళినాడు.

గురువుయొక్క ఆగ్రహజ్వాలలో తన గత పాపజీవితమంతయు భస్మమైనదని బీడ్కర్ భావించెను. నిత్యము శ్రీస్వామివారి నామజపము చేస్తూ శ్రీస్వామిని తన ఆరాధ్యదైవముగా చేసుకొన్నాడు.

ఒక సంవత్సరము గడచిన తరువాత శ్రీస్వామిని దర్శించుటకై బీడ్కర్ అక్కల్‌కోట వచ్చినాడు, అది మాఘపూర్ణిమ రోజు. బీడ్కర్ శ్రీస్వామిని దర్శించి నమస్కరించినాడు. శ్రీస్వామి "ఈ మామిడికాయ సగం పండినది" అన్నారు. ఆ మాటతో బీడ్కర్ ఎంతో సంతోషించి, తన సాధన చక్కని మార్గములో సాగుచున్నదని శ్రీస్వామి మాటలలోని అర్థమని గ్రహించి తిరిగి పూనా చేరినాడు. బీడ్కర్‌కు కొద్దికాలములో తిరిగి శ్రీస్వామివారిని దర్శించి, అక్కడ వుండి శ్రీస్వామివారి సేవచేయవలెనని అనుకొన్నాడు. ఆ మరుసటి సంవత్సరమే అతడు అక్కల్‌కోట చేరినాడు. అతనికి శ్రీస్వామి సేవచేసుకొనే భాగ్యం దక్కినది.

ఒకనాటి రాత్రి శ్రీస్వామివారి పాదములు వత్తుచుండెను. ఎంతసేపటికి శ్రీస్వామి 'చాలు!' అనలేదు. అందువలన శ్రీస్వామి నిద్రించుచున్నను అర్ధరాత్రి వరకు అతడు పాదసేవ మానలేదు. ఇంతలో ఒక నాగుపాము బుసలు కొట్టుచు అక్కడికి వచ్చినది. అయినాసరే బీడ్కర్ కదలక, గురుసేవలో చనిపోవడం కూడా తన అదృష్టమేనని భావించాడు. వెంటనే శ్రీస్వామి దిగ్గునలేచి "నువ్వు మొండివాడివి, రాక్షసుడా! పో బయటకు!" బీడ్కర్ చెంపపై గట్టిగా కొట్టిరి. ఆ స్పర్శతో బీడ్కర్‌కు స్పృహతప్పి సమాధిలోనికి వెళ్ళాడు. ఆ మరునాడు మామూలు స్థితికి వచ్చిన బీడ్కర్ శ్రీసమర్థ గురుదేవులను దర్శించి, నమస్కరించి, ఆశీస్సులు పొంది పరిపక్వ స్థితిలో మధురానుభూతులతో పూనా తిరిగి వెళ్ళాడు. అప్పటినుండి అప్పుడప్పుడు అక్కల్‌కోటకు వచ్చుచుండెడివాడు.

ఒకసారి బీడ్కర్‌ను చూచి శ్రీస్వామి "నీ పెద్దలకు యింకా బాకీ వున్నావా? నీవు భోజనం ఎప్పుడు పెడతావు?" అని అడిగిరి. శ్రీస్వామి మాటలను బీడ్కర్ గ్రహించి పూనా వెళ్ళి 1000 మందికి అన్నదానము చేయుటకు కావలసిన పదార్థములు, ధనము శ్రీగురుదేవునికి సమర్పించుటకై ఖరీదైన అత్తరులను తీసుకొని, గుఱ్ఱముపై అక్కల్‌కోటకు బయలుదేరాడు. దారిలో గుఱ్ఱము బెదిరి పరుగెత్తుటచేత ఆ అత్తరు సీసాలన్నీ క్రిందపడి పగిలిపోయినవి. బీడ్కర్ ఎటులనో అక్కల్‌కోట చేరి ఘనముగా అన్నసమారాధన చేసినాడు. శ్రీస్వామి సమర్థులు కూడా అక్కడకు వచ్చి అతని భిక్షను స్వీకరించి "నాకు భోజనం పెట్టినావు, కాని దక్షిణ ఏది? తగినంత యివ్వగలవా?" అన్నారు. "మహరాజ్ మీరు ఏది కోరిన అది యివ్వగలను" అని బీడ్కర్ అన్నాడు. శ్రీస్వామి నవ్వుచూ "నీవు యివ్వలేవు" అన్నారు. కాని బీడ్కర్ ఓ సద్గురునాథా! శ్రీస్వామి సమర్థా! మీరు అడిగినంత యిచ్చెదను. అడగండి స్వామీ!" అనెను. "అయితే యిక మీదట బంగారము తయారుచేయు రసవిద్యను మానివేయవలెను. అదే నాకు తగిన గురుదక్షిణ!" అని శ్రీస్వామి నవ్వుచూ తన కోరికను వెలిబుచ్చిరి. శ్రీస్వామి భావమును గ్రహించిన బీడ్కర్ "అలాగేస్వామీ! ఈ క్షణం నుండే మానివేస్తున్నాను!" అని ప్రమాణం చేసినాడు కాంతా – కనకములు సాధకుని ఆధ్యాత్మిక జీవితము అను అగ్నిని ఆర్పే నీరు వంటివి. వాటిపై మనస్సులో ఏ కొంచెం కోరిక మిగిలియున్నను పతనమునకు దారితీయును. శ్రీస్వామి బీడ్కర్ మనస్సును పూర్తిగా పరిశుద్ధ మొనర్చి, చిత్తశుద్ధినింపి, ఆధ్యాత్మిక చింతనయందు



నిజమైన పురోభివృద్ధిని సాధించుటకు తగిన సూచనలిచ్చిరి. దుష్టచేష్టల బారినుండి తల్లి తన బిడ్డలను దండించునట్లు శ్రీస్వామి బీడ్కర్‌ను సంస్కరించిరి.

మరియొకసారి బీడ్కర్ శ్రీస్వామిని దర్శించుటకై వెళ్ళగా "నీవు యికమీదట నా దగ్గరకు రానక్కరలేదు. నర్మదానది ప్రదక్షిణము చేయి!" అని ఆజ్ఞాపించి, "నా కరుణాకటాక్షములు ఎల్లప్పుడూ నీకుంటాయి!"అని ఆశీర్వదించిరి.

నర్మదానది ప్రదక్షిణము చాలా కష్టతరమైనది. ఆ నది ఎత్తైన కొండలతో, లోతైన లోయలతో కౄరమృగములతో నిండిన దట్టమైన అడవులతో చుట్టబడి వున్నది. ఆ నదీ ప్రదక్షిణమునకు యింద్రియ నిగ్రహము, ఆత్మస్థైర్యము ఎంతో అవసరము. అయినప్పటికీ శ్రీగురుదేవుల ఆజ్ఞను శిరసావహించి అతను నర్మదా ప్రదక్షిణమునకు బయలుదేరినాడు. దారిలో అతనికి పులులు, సింహాలు, పాములు మొదలైన వాటి బారినుండి ఎన్నో గండములు ఎదురైనవి. కాని వాటినన్నింటిని శ్రీస్వామివారి అనుగ్రహమువలన తప్పించుకున్నాడు. ఈ యాత్రలో అతడు 'మహేశ్వర్'లో నుండగా శ్రీస్వామి సమర్థుల మహాసమాధి వార్త తెలిసినది. ఎంతో దుఃఖితుడై మధ్యలో ఆపివేసి పసిబాలునివలె శోకిస్తూ అక్కల్‌కోట చేరుటకై వెనుకకు మరలినాడు. కాని ఆ రాత్రి అతనికి స్వప్నములో శ్రీస్వామి సమర్థులు దర్శనమిచ్చి 'నేను ఎల్లప్పుడు సజీవుడనే! నాకు మరణమనునది లేదు. నీవెంటే వున్నాను. నా భక్తులు పిలిచినపుడెల్ల పలుకుతాను. నీవు దుఃఖించకు, యాత్రను పూర్తిచేయుము. నా ఆశీస్సులేకాక నర్మదాతల్లి అనుగ్రహము కూడా నీకు వున్నది" అని పలికిరి. ఈ స్వప్న సందేశమునే గురువాజ్ఞగా భావించి బీడ్కర్ తిరిగి యాత్రను చేయుచున్నాడు. ఒకరోజున నర్మదాదేవి అతని భక్తికి సంతోషించి తన స్వస్వరూపమున ఒక దేవతామూర్తిగా ప్రత్యక్షమై దీవించినది. బీడ్కర్ యాత్రను జయప్రదముగా పూర్తిచేసుకొని ఓంకారేశ్వర్‌కు చేరినాడు. భర్త జాడ తెలియక అతని భార్య కూడా తీర్థయాత్ర చేయుచు, ఓంకారేశ్వర్‌లో అతనిని కలుసుకొన్నది. నర్మదా నదీమతల్లి శ్రీ వాసుదేవానంద సరస్వతిని, శ్రీసచ్చిదానంద స్వామిని బీడ్కర్‌కు దర్శనమివ్వమని ఆదేశించినది. తరువాత కాలములో బీడ్కర్‌కు వారిరువురును దర్శనమిచ్చి అతనిని ఆశీర్వదించిరి. బీడ్కర్ కాశీ, ప్రయోగ, ఔదుంబర్, నరసింహవాడి, దేహు, ఆళంది మొదలగు పుణ్యక్షేత్రములు కూడా దర్శించి

పూనా తిరిగి వచ్చినాడు. సద్గురుని అనుగ్రహమువలన అసాధ్యములుకూడా సుసాధ్యమగును.

పూనాలో బీడ్కర్ ఒక మఠమును నిర్మించుకొని, సన్యాసము స్వీకరించి బీడ్కర్ మహరాజ్‌గా ప్రసిద్ధిగాంచినారు. ఆయన ఎందరికో ఆత్మోద్ధరణకు సహాయపడినారు. బాబా సహస్రబుద్ధే ఆయన శిష్యులలో ఉన్నత ఆధ్యాత్మిక స్థితిని పొందినవారిలో ప్రముఖుడు.

సాగరా! వింటివా! రసవిద్యతో మూలలోహములను కాకుండా యితర ముడిపదార్థముల నుపయోగించి బంగారమును తయారు చేయ నేర్చిన బీడ్కర్, శ్రీస్వామి సమర్థుల కృపవలన తానే బంగారముగా మారినాడు. జడ పదార్థములలో మార్పు తెచ్చుట విశేషము కాదు. ఇచ్చట శ్రీస్వామివారి సామర్థ్యమున జంతువు మానవుడుగా, మానవుడు మహనీయుడుగా, దైవముగా పరిణామము చెందుటయే గొప్ప విశేషము. శ్రీ బీడ్కర్ మహరాజ్ 4-4-1913వ తేదీన పూనాలో సమాధి పొందినాడు.

***"సద్గురు మౌళీ - స్వామిసమర్థా!***
***సచ్చిదానందా - సద్గురురాయా!"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబదియవ అధ్యాయము*** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం
ఆనందం బ్రహ్మానందం
సద్గురు నామమే ఆనందం!

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది ఒకటవ అధ్యాయము

### శ్రీ ఆనంద భారతి

విద్యాసాగరా!

శ్రీస్వామి సమర్థుల కటాక్షానికి అవధులు లేవు. వారిని దర్శించే అన్ని కులాల, మతాలవారిని ఆదరించేవారు, అనుగ్రహించేవారు. వారిని దర్శించే వారిలో అన్ని కుల, మతాలవారు వుండేవారు. శ్రీస్వామికి పెద్ద-చిన్న, ఉన్నతుడు-లేనివాడు అనే భేదభావం వుండేదికాదు. వారు ఎవ్వరిని వారి కులగోత్రాదులను ప్రశ్నించలేదు. వారి ఆచార వ్యవహారములను చక్కగా తీర్చిదిద్దేవారు.

శ్రీ ఆనందభారతి అనే సన్యాసి పూర్వాశ్రమంలో లక్ష్మణ్ అనే జాలరి. ఇతను సముద్రముమీద పడవలపై వెళ్ళి చేపలను పట్టి, అమ్ముకొని జీవించేవాడు. అప్పుడప్పుడు శ్రీస్వామి సమర్థుల దర్శనానికి అక్కల్‌కోట వచ్చేవాడు. అతనికి శ్రీస్వామివారిపై అమితమైన భక్తి, శ్రద్ధ, ప్రేమ ఏర్పడినవి. వారి నామమును నిరంతరము జపించుచుండేవాడు. ఒకసారి అతను చేపలు పట్టేందుకు సముద్రం మీదకు వెళ్ళినాడు. ఆ సమయంలో సముద్రములో తీవ్రమైన పెనుతుఫాను చెలరేగినది. పడవ మునిగిపోయే పరిస్థితి ఏర్పడినది. లక్ష్మణ్ భయపడి పడవ మునిగిపోకుండా కాపాడి రక్షించమని శ్రీస్వామి సమర్థులను తలచుకొని నిరంతర నామమును జపించసాగాడు. అప్పుడు అక్కల్‌కోటలో శ్రీస్వామివారు రాజప్రాసాదములో భక్తులతో చదరంగం ఆడుచున్నారు. లక్ష్మణుని ఆర్తనాదం శ్రీస్వామికి చేరినది. వెంటనే శ్రీస్వామి “అయ్యో! లక్ష్మణ్ నీటిలో మునిగి పోతున్నాడు!” అంటూ చేతులను క్రిందకు వంచి ఎవ్వరినో పైకి లాగుతున్నట్లు

అభినయం చేశారు. విచిత్రం!! వారి చేతులు పూర్తిగా తడిసిపోయినవి. వారి చేతినుండి ఉప్పునీరు బొట్టు బొట్టుగా కారినది. అక్కడున్న భక్తులందరికీ ఆశ్చర్యం కలిగినది. కాని విషయం ఏమిటో ఎవరికీ అర్థం కాలేదు. కొన్ని రోజులకు లక్ష్మణ్ అక్కల్‌కోటకు వచ్చి శ్రీస్వామివారి పాదములపైబడి "సద్గురుమౌళీ! దీనబంధో! ఆపద్బాంధవా! నా ప్రాణాలు కాపాడి నాకు పునర్జన్మనిచ్చారు. మీరు రక్షించకపోయినచో నేను ఆ సమయంలో సముద్రంలో మునిగి మరణించి వుండేవాడిని. ఆ క్షణం నుండి ఈ శరీరం, ఈ ప్రాణం నాదికాదు, మీదే! దీనిని మీకు అర్పించుచున్నాననుచు యిక సంసారములో వుండాలనే కోరికలేదు. నిరంతరము మీ పాదాలను సేవించుకుంటాను. నన్ను అనుగ్రహించండి!" అంటూ భక్త్యావేశములతో పలికాడు. శ్రీస్వామివారు చిరునవ్వుతో అతనిని ఆశీర్వదించినారు. లక్ష్మణ్ అన్నమాటలను నిలబెట్టుకొన్నాడు. అతను శ్రీస్వామివద్దనే వుండిపోయాడు. నిత్యం ఆనందంతో వుండటం వలన అతనిని ఆనంద భారతి అని పిలువసాగిరి. ఆ పేరుతో ప్రసిద్ధిచెందిన యోగిగా అతడు పేరుపొందాడు. ఆయన సమాధి బొంబాయి దగ్గర ఠాణేలో వున్న దత్తమందిరం దగ్గర వున్నది. విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు వెలిగించిన మరొక ఆధ్యాత్మిక జ్యోతి శ్రీ రంగోలి మహరాజ్! వారి లీలలను తెలుసుకొందాము" అని శ్రీ నిత్యానందులు చెప్పసాగిరి.

## శ్రీ రంగోలి మహరాజ్

శివరామ్ బావడేకర్ కొల్హాపూర్‌లోని ఒక విశ్వబ్రాహ్మణ కుటుంబములో జన్మించినాడు. అతని తండ్రి రాజుగారి ఆస్థానంలో పనిచేస్తుండేవాడు. అతను ఎనిమిది సంవత్సరాల వయస్సులో తన మేనత్తగారి వెంట అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థులను దర్శించాడు. శ్రీస్వామివారు ఆ బాలుని చూడగానే "ఈ పిల్లవాణ్ణి నాకు యిస్తావా?" అని అడిగినారు. అతని మేనత్త సమాధానం చెప్పేలోపునే ఆ బాలుని తన ఒడిలో కూర్చోబెట్టుకుని "రంగోలి మహరాజ్" అని అతనిని సంభోధిస్తూ కుమ్మరి (కుంభార్) వీథిలో వున్న కుంభార స్వామిని సేవిస్తూ, ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపొమ్మన్నారు. ఆసేతు హిమాచల పర్యంతం దేశసంచారం చేయమని ఆ బాలునికి చెప్పి కాషాయ వస్త్రం అతని భుజం పైన కప్పినారు. ఆ బాలునిలో పూర్వజన్మ సంస్కారం మేల్కొని, సరిగ్గా శ్రీస్వామి ఆదేశించినట్లుగా చేసి గొప్ప దివ్యశక్తులను సంపాదించాడు. కాని నివురుగప్పిన



నిప్పులాగా తన మహత్తును ఎవరికీ తెలియనివ్వక తనలోనే దాచుకున్నారు. ఆయన ఎక్కువగా టీ, బీడీలు త్రాగేవారు. కాని వాటికోసం ఎవరినీ డబ్బు అడిగి తీసుకునేవారు కారు. అయాచితంగా వచ్చినదానినే వాడుకొనేవారు. ఆయన 1924వ సంవత్సరములో షిరోడా వెళ్ళినపుడు అతనిని గూఢచారి అనుమానించారు. ప్రభు అస్ గోంకర్ అనే వర్తకుడు తన బట్టల దుకాణంలో ఆయనకు వసతి ఏర్పాటు చేసినాడు. ఆయనకు బీడీ త్రాగాక దానిని ఆర్పకుండానే పారేసే వింత అలవాటు వుండేది. ఆ బట్టల వర్తకుడు ఒకసారి ఆయనను బీడీ ఆర్పివేయమని గట్టిగా చెప్పాడు. దానికి శ్రీ రంగోలి మహరాజ్ "రామా! ఆంజనేయుడు నిన్ను మంచి దెబ్బ కొడతాడు. నీ దుకాణం లేకుండా పోతుంది. తెలుసుకో!" అని అతనితో అన్నారు. అలాగే ఒక సంవత్సరములో అతను వర్తకంలో బాగా దివాలా తీసి తన దుకాణం మూసివేయవలసిన స్థితికి వెళ్ళాడు. శ్రీ రంగోలి బాబాకు ముగ్గులు వేయడంలో మంచి ప్రావీణ్యమున్నది. చక్కగా జీవకళ ఉట్టిపడేట్లుగా, ఈశ్వరభావం కనబడేట్లు చాలా అందంగా వేసేవారు. ప్రజలు మంత్రముగ్ధులై చూస్తూ వుండిపోయేవారు. శ్రీస్వామి సమర్థుల అనుగ్రహంతో, శ్రీ రంగోలి మహరాజ్ తన జీవితమును ధన్యత నొందించుకొన్నారు.

విద్యాసాగరా! సద్గురుమూర్తి శ్రీస్వామి సమర్థుల అనుగ్రహంతో పూర్ణపురుషులైన వారు ఎందరో గలరు. ప్రత్యక్షంగా పరోక్షంగా వారు సాధారణ మానవులను - సాధకులను మహనీయులుగా తీర్చిదిద్దారు. మరియొకరి కథ తెలుసుకుందాం అని నిత్యానందుడు జయ జయ శ్రీస్వామి సమర్థా! అక్కల్‌కోట స్వామి జై అను జయజయ నాదములు చేసి ప్రారంభించినారు.

## శ్రీ సీతారామ్ మహరాజ్

"విద్యాసాగరా! సూర్యభగవానుని వలన చంద్రుడు, భూమి, అనేక నక్షత్రములు ప్రకాశించుచున్నవికదా! అదే విధముగా శ్రీస్వామి సమర్థులు కోటి సూర్యప్రకాశము కలిగిన పరిపూర్ణ దత్తావతారులు. కావుననే వీరి దివ్యమైన ఆధ్యాత్మిక జ్ఞాన ప్రకాశము వలన ఎందరో ప్రభావితులైనారు. సమస్యలతోను, అశాంతితోను, ఆధ్యాత్మిక అవరోధములతోను శ్రీస్వామిని దర్శించిన సాధకులెందరికో ఉత్తమ స్థితి లభించినది. ఇంకెందరో నైతికముగాను, మతపరముగాను ప్రగతిని పొంది జీవితములను సార్థకము చేసుకొనిరి. అందరికీ

ఒకేవిధమైన ఆశీస్సులు శ్రీస్వామి యిచ్చినను, వారిలోని లోపాలను సవరించుటయే వారి పని. శ్రీస్వామిని దర్శించి వారి కృపకు పాత్రులైన శ్రీసీతారామ్ మహరాజ్ అనువారిని గురించి తెలుపుతాను. శ్రద్ధాళుడవై వినుమని" శ్రీ నిత్యానందులు చెప్పసాగిరి.

సతారాలో బాపూరావు వినాయక్ అను సుబేదారు కలడు. ఆయన కుమారుడు సీతారామ్. చిన్న వయసునందే సీతారామ్‌కు తల్లి మరణించినది. అతని తండ్రి పునర్వివాహము చేసుకొన్నాడు. సవతి తల్లి సీతారామ్‌ను చాలా హింసలుపెట్టి, కష్టతరమైన పనులు చెప్పేది. ఆ బాధలను తట్టుకొనలేక సీతారామ్ తన పన్నెండవ ఏట యిల్లు వదిలి పారిపోయి అక్కల్‌కోట చేరినాడు. అక్కడ శ్రీస్వామి సమర్థులను దర్శించి భక్తిభావముతో నమస్కరించాడు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వి ఆ బాలుని తలపై ప్రేమగా నిమిరారు. దానికే అతను చాలా పరవశించి, మరణించిన తన తల్లిని శ్రీస్వామిలో దర్శించినాడు. శ్రీస్వామిని ఆనాటినుండి చాలా భక్తిశ్రద్ధలతో సేవిస్తూ, కొంత కాలమునకు గొప్ప సిద్ధుడైనాడు.

ఒకనాడు శ్రీస్వామి అతనిని చూచి "మంగళవేడా వెళ్ళి, అక్కడ నివశించు" అని ఆజ్ఞాపించారు. అంతట శ్రీ సీతారామ్ శ్రీస్వామివారి ఆజ్ఞను శిరసావహించి మంగళవేడా వెళ్ళినాడు. అక్కడ 40 సంవత్సరములు నివసించి గొప్ప సంత్‌గా పేరుపొందినాడు. భక్తులు అందరూ అతనిని శ్రీ సీతారామ్ మహరాజ్ అని పిలిచేవారు. వారిని ఎవరు దర్శించినను "శ్రీరాముని మరువవద్దు" అని చెప్పసాగిరి. ఆయన నిత్యము మధ్యాహ్నం "కరతలభిక్ష" చేసేవారు. ఎవరు, ఎక్కడ, ఏమి పెడితే అది. అక్కడే చేతిలో పెట్టించుకుని తినేవారు. భిక్ష పూర్తి అయినాక వారు స్మశానమునకు వెళ్ళి ధ్యానం చేసుకొనేవారు.

ఆయన గొప్ప యోగి అయినను చంటిపిల్లవానివలె ప్రవర్తించేవారు. ఆయన గురించి తెలియనివారు పిచ్చివాడనుకొని, 'పిచ్చి సీతారామ్' అని పిలువసాగిరి. ఒకసారి బజారులో మామిడిపండ్లతో వున్న బుట్టను చూచిరి. అవి అమ్ముకొనుచున్న స్త్రీ ఆ బుట్టను వదలి పనిమీద ప్రక్కకు వెళ్ళినది. ఆయన బుట్టదగ్గరకెళ్ళి అందులో ఒక మామిడిపండును తీసుకొని తినుచుండిరి. ఇంతలో ఆ స్త్రీ వచ్చి సీతారామ్‌ను కఠినముగా తిట్టుచూ కర్ర తీసుకొని కొట్టుచుండెను. శ్రీ సీతారామ్ తనలోతాను "మామిడిపండ్లు కోరితినిగాని



దెబ్బలను కోరలేదుకదా!” అని అనుకొనుచున్నాడు. అటుగా వెళ్ళుచున్న ఒక పోలీసు ఆ దృశ్యమును చూచినాడు. అతనికి సీతారామ్ యెడల గురుభావము కలదు. వారి దగ్గరకెళ్ళి, ఆ స్త్రీని వారించి, లాఠీతో ఆమెను దబాయించ బోయినాడు. అతనిని వారించి శ్రీసీతారామ్ “నీవు నాయందు భక్తిగలవాడవైనచో వెళ్ళి ఒక చీర, రవిక తీసుకురా!” అన్నారు. ఆ పోలీసు శ్రీ సీతారామ్‌నందున్న అభిమానంతో వెంటనే వెళ్ళి ఒక చక్కటి చీర, రవిక తెచ్చినాడు. అవి తీసుకుని శ్రీ సీతారామ్ “నీ ప్రియ పుత్రుడు యిస్తున్నాడు, వీటిని తీసుకో!” అని ఆ స్త్రీకి యిచ్చినారు. అంతట ఆమె శ్రీ సీతారామ్ యొక్క ప్రేమాభిమానములకు, ఓర్పునకు ఎంతో పొంగిపోయినది. ఆమెలో ఎంతో మార్పువచ్చి, క్షమించమని వారి పాదములపై పడినది. అప్పటినుండి ఆమె శ్రీ సీతారామ్ మహరాజ్‌కు మంచి భక్తురాలు అయినది. శ్రీ సీతారామ్ మహరాజ్‌కు చదువులేదు. అయినను ఆయన దగ్గరకు వచ్చిన వారందరికి “శ్రీరాముని మరువకండి. నిత్యము ఆయనను తలచుచు ఆత్మజ్ఞానులు కండి. జ్ఞానము లేనిచో మీ జీవితము పూర్తిగా వ్యర్థము. శ్రీరాముడు ఈ విశ్వమంతట నిండివున్నాడు. నిత్యం రామనామం జపించండి. సంకీర్తనలు చెయ్యండి, పాండిత్యం కోసం ప్రాకులాడకండి” అని చెప్పేవారు. శ్రీ సీతారామ్ మహరాజ్‌కు తన నిర్యాణం గురించి కూడా ముందే తెలుసు. తన భక్తులతో “పిచ్చి సీతారామ్ నీవు యింక వెళ్ళాలి” అని చెప్పారు. పండరీపురమునకు 9 మైళ్ళ దూరంలోనున్న కరడి అనే గ్రామం చేరారు. అక్కడే ఆయన సమాధియైనారు. ఇది పండరీపురము నుండి మీరజ్‌కు వెళ్ళు దారిలో వున్నది. నేటికీ ఎందరో శ్రీసీతారామ్ మహరాజ్ సమాధిని దర్శించి, ఆయన కృపను పొందుచున్నారు. శ్రీస్వామి సమర్థుని కృపాకటాక్షము వలన ఒక సాధారణ మానవుడు కూడా మహాయోగి అయినాడు.

***“దశరథ నందన శ్రీరామా – దశముఖ మర్దన రఘురామా***
***ఆపద్బాంధవ శ్రీరామ – అనాథ రక్షక జయరామ”***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది ఒకటవ అధ్యాయము*** సంపూర్ణము






ఓం శ్రీ సాయిరాం
ఈశ్వర అల్లా తేరేనామ్!
సబ్ కో సన్మతి దే భగవాన్!!

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది రెండవ అధ్యాయము

విద్యాసాగరా!

సంసార మన్నది దారీతెన్నూలేని మహారణ్యము వంటిది. భార్యాబిడ్డలు, బంధుమిత్రులు అందరూ అందులో వుండే క్రూరమృగాలవంటివారు. ఇంద్రియాలు అడవిలో వుండే దొంగలవంటివి. దొంగలు ఆస్తిని మాత్రమే హరిస్తారు, కాని ఈ యింద్రియాలు మనలోని దైవత్వాన్ని కూడా హరించివేస్తాయి. అజ్ఞానులైనవారు సంసారమనే ఈ మహారణ్యమునే స్వర్గముగా భావించి దిక్కుతోచక తిరుగుతూకూడా ఒకవిధమైన ఆనందాన్ని అనుభవిస్తుంటారు. అగ్నిని కోరినవాడు అడవిలో కొరివిదయ్యాన్ని చూసి దానివెంటపడినట్లుగా, బంగారాన్ని ఆశించినవాడు కలవారి యిళ్ళచుట్టూ తిరుగుతూ వుంటాడు. ధన సంపాదనాపరుడు దాన్ని ఆర్జించుటకై ఎండమావులను చూచి మృగము పరుగెత్తినట్లుగా పరుగులు తీస్తుంటారు. ఆత్మజ్ఞానం అనేది పొందేవరకూ మానవులందరూ ఈ సంసారచక్రంలో తిరుగుతూనే వుంటారు. 'పునరపి మరణం-పునరపి జననం'. 'తానితాని ప్రణశ్యంతి ప్రదక్షిణం పదేపదే' అను ప్రబోధంలాగ - ముక్తసంగుడు కాగోరిన మానవుడు మనో విజయాన్ని సాధించేవరకు దానిని పొందలేడు. సుఖ దుఃఖాలకు, భ్రమ-ప్రమాదాలకు, రాగ-ద్వేషాలకు, కామ-క్రోధాలవంటి ద్వంద్వాలన్నిటికి మనస్సే ప్రధానం.

ఆ మనస్సును నిగ్రహించడానికి విజ్ఞానం అవసరం. ఆ విజ్ఞానాన్ని పొందాలంటే సద్గురు భక్తి కావాలి. విద్యాసాగరా నీవు దానిని అలవరచుకొని ఆత్మజ్ఞానాన్ని పొందుము.



# పీరూ సాహెబ్ మహరాజ్

అక్కల్‌కోటకు దగ్గరగా మైకెదర్గా అను ఊరిలో జమేదారు అనే ముస్లిం వ్యక్తి ఒకరు వుండేవారు. ఆయన ఖైదీలను పర్యవేక్షించే జైలర్‌గా ఉద్యోగంచేస్తూ వుండేవారు. శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థుల మహిమలు, దివ్యశక్తుల గురించి వినియున్నారు. వారిని శరణుబొంది అనేక సమస్యల నుండి, బాధలనుండి విముక్తులైనవారిని గురించిగూడ తెలుసుకొనియున్నవాడు. అందుచే శ్రీస్వామి సమర్థులయందు సంపూర్ణ విశ్వాసము, భక్తి అతని మనసంతయూ నిండియుండును. నిజాయితీగా తన ఉద్యోగమును నిర్వహించుచుండెడివాడు.

అతడు నిత్యము ఖైదీలచేత కొన్ని పనులు చేయించుచుండువాడు. తరువాత వారిని బంధించుచుండెను. ఒకనాడు అట్లు ఆరుబయట పనిచేయించు సమయమున ఒక ఖైదీ ఎట్లో తప్పించుకొని పారిపోయినాడు. ఇంతకాలము జమేదారు తన విధిలో ఎప్పుడు పొరపాటుపడలేదు. కాని ఇప్పుడా ఖైదీ దొరకకున్నచో తన ఉద్యోగమునకు హాని. అంతేకాక తనకు అపవాదు కళంకములేగాక శిక్షకూడ అనుభవింపవలసి వచ్చునని ఆలోచన కలిగెను. వెంటనే శ్రీస్వామి సమర్థులు జ్ఞప్తికి వచ్చిరి. ఆయనకు తన మనసులోనే ఇట్లని మొరపెట్టుకొనెను. "ఓ శ్రీస్వామి సమర్థా! ఆ ఖైదీ తిరిగి దొరికేటట్లయితే నేను నా ఉద్యోగం వదలి నా జీవితాంతం నీ సేవలోనే గడుపుతాను" అని ప్రమాణం చేసుకొన్నాడు. ఆ మరుసటిరోజు ఉదయమే ఒక కానిస్టేబుల్ ఆ ఖైదీని గుఱ్ఱముపై నెక్కించుకొనివచ్చి అప్పగించాడు. ఎక్కడకు పోయినావని వానిని అడుగగా వాడిట్లు చెప్పెను. "అయ్యా! నేను పారిపోయి ఒక మార్గమున వెళ్ళుచుండగా ఎవరో మనుష్యులు వచ్చుచున్నట్లు అలికిడి అయినది. ఒక గోతిలో దిగి దాగి వుంటిని. మరల పైకివచ్చి పారిపోవాలని ఎంత ప్రయత్నం చేసినా ఒక సన్యాసి అడ్డుగనిల్చి పారిపోనివ్వలేదు. ఆ కారణముగా నేను మరల పట్టుబడితిని" అని చెప్పెను. జమేదారుకు భక్తితో కన్నులానందబాష్పములు స్రవించెను. శ్రీస్వామి సమర్థులకు మనసులోనే అనేక ధన్యవాదములర్పించెను. వెంటనే అక్కల్‌కోటకు చేరి శ్రీస్వామికి నమస్కరించెను. ఉద్యోగమును వదలి తనమాట నిలబెట్టుకొందుననీ, భారము శ్రీస్వామిదేనని పలికెను. శ్రీస్వామి అతనిని ఆశీర్వదించి రోజూ రెండు రొట్టెలిచ్చుటకై చోళప్పను ఆదేశించెను. ఎనిమిది రోజులు గడిచిన తర్వాత శ్రీస్వామి అతనికి తన పాదుకలిచ్చి వాటిని




పూజించుకొమ్మని, తన కృప ఎప్పుడూ ఉండునని ఇంటికి పంపిరి. ఆయన ఇంటికివచ్చి ఆస్వామి పాదుకలు పూజించుచుండగా ఇంటిలోని వారందరూ వ్యతిరేకించిరి. ఇంటినైనా విడిచెదనుగాని శ్రీస్వామి పాదుకలను విడువనని అతడు ఊరివెలుపల పాడుబడిన ఒక ఇంటిని శుభ్రంచేసి అచ్చట పాదుకలుంచి పూజించసాగినాడు.

కొంతకాలము విచిత్రముగా ఎవరో ఆయనకు భోజనము వేళకు తెచ్చి ఇచ్చుచుండేవారు. అట్లు క్రమముగా ఆ పాదుకల మహిమ అందరికీ తెలియవచ్చెను. ప్రజలు తమ బాధలు, సమస్యల పరిష్కారమునకై ఆ పాదుకలకే మ్రొక్కుకొనుచుండిరి. వారి బాధలు తీరి మ్రొక్కు చెల్లించుకొనుచుండిరి. అందరు ఆయనను పీరుసాహెబ్ అనీ, హవలియా (సిద్ధపురుషుడు) అని పిలుచుచుండిరి. అక్కడనే అట్లు పేరుపొందిన తర్వాత అతని కుటుంబసభ్యులు వచ్చి ఇంటికి రమ్మని ప్రాధేయపడిరి. వారిని మన్నించి ఇంటికి తిరిగివెళ్ళి అచ్చట శ్రీస్వామి పాదుకలు ప్రతిష్ఠించి పూజించుచు తన జీవితమును గడిపిరి. శ్రీస్వామి సమర్థుల కృపా కటాక్షంవలన ఒక సామాన్య జమేదారు గొప్ప పీరూసాహెబ్ మహరాజ్‌గా పేరుపొందెను. మహాత్ములకు అసాధ్యమైన కార్యమేమున్నది.

## వింతయోగి అవధూత

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థుల లీలలను వర్ణించడం ఎవరితరం? మనం ఎంత చెప్పుకొన్నా జరిగిన దానిలో ఒక అంశం మాత్రమే అవుతుంది. ఆ స్వామి కృపవలన స్ఫూర్తిని పొందిన ఒక యోగి కథ చెపుతాను వినుము. ఇప్పుడు మైకెదర్గా ఊరిలోని జైలరుగురించి చెప్పుకొన్నాముగదా! అదే ఊరిలో ఒక కుటుంబములోని వారందరు తెలివితక్కువ వారుగను, అమాయకులుగను, పిచ్చివారుగను వుండేవారు. అది వారియొక్క పూర్వజన్మ కర్మల ఫలమని వారిని చూడగనే తెలియుచుండును. కొన్ని రోజులకు ఆ ఇంటిలోని వారందరు కాలక్రమమున చనిపోయిరి. ఒక్కడు మాత్రమే మిగిలియుండెను. అతడును పిచ్చివానివలె ఎవరైనా ఏదైనా పెట్టిన తినువాడు, లేకున్న ఊరకుండువాడు. అతని దీనస్థితిని చూచి ఆ ఊరిలో నివసించు శ్రీస్వామి సమర్థుల భక్తుడొకడు జాలిపడెను. అతనిని అక్కల్‌కోటకు తీసుకొనివెళ్ళి శ్రీస్వామివారి సన్నిధిలో కూర్చుండజేసెను. వారి కుటుంబము యొక్క సంగతి చెప్పి ఇతనిని కరుణించి మంచివానిని చేయమని ఆ భక్తుడు శ్రీస్వామివారిని ప్రార్థించెను. శ్రీస్వామివారి



ఏమియూ చెప్పక ఊరకే అతనిపై దృష్టిని సారించిరి. అట్లు పదిహేను రోజులు గడిచెను. పదహారవ రోజున శ్రీస్వామి అతనిని ఊరికి తీసుకొని పొమ్మనిరి. చాలా విచిత్రము. అతని పరిస్థితి మారిపోయెను. అతడొక యోగిగా మారెను. అతనికి వాక్శుద్ధి లభించెను. అతని నోటివెంట ఏదైనా మాట వచ్చిన యెడల అది తప్పక జరుగుచుండెను. శ్రీస్వామి అనుగ్రహం అతనిలో ఈ రీతిగా పనిచేయుచుండెను. చాలామంది ఆయనవద్దకు వచ్చి తమ బాధలు, సమస్యలు చెప్పుకొనేవారు. ఆయన వాక్కు తమకు వేదవాక్కుగా భావించేవారు. ఒకసారి ఎంత బ్రతిమాలినా ఒకని విషయంలో ఆయన "ఔను"ని అనలేదు. దానితో విసిగిపోయి ఆ వ్యక్తి "ఏమయ్యా! ఔనంటే నీ సొమ్మేమి పోతుంది. ఇంత బ్రతిమాలించుకుంటున్నావు?" అని కోపంగా అన్నాడు. దానికి ఆ యోగి ఇట్లు బదులిచ్చెను. "ఇందు నా ఇష్టమేమీ లేదు. నేను నీవు చెప్పమన్నట్లు చెప్పను. శ్రీస్వామి చెప్పమనినట్లు చెప్పెదను. ఇప్పుడు నేను 'ఔన'ని చెప్పిన యెడల శ్రీస్వామి సమర్థులు నా చర్మం వలిచేస్తారని చెప్పాడు. గురువు అనుగ్రహాన్ని పొందిన ప్రతివారు గురువాజ్ఞను శిరసావహించియే జీవించాలి. వారి ఆదేశాల మేరకు నడుచుకోవాలి. స్వతంత్రించి వ్యవహరించడానికి వీలులేదు. కొందరు పూర్వజన్మలో యోగులై వుండికూడ కొన్ని చిన్న చిన్న పొరపాట్లవల్ల మరల జన్మించి లౌకిక బంధాలయందు ఆసక్తిలేక పిచ్చివారివలె నివసించుచు పూర్వకర్మలను పరిహరించుకొందురు. వారిని సద్గురువే తమ కరుణాకటాక్షాలతో అనుగ్రహించి మరలా నిజస్థితియందు నిలుపుటకు సమర్థులు. శ్రీస్వామివారు దీనజనాదరణ, శరణాగత రక్షణ, దుష్టగుణ పరివర్తనయను కార్య నిర్వహణకై అవతరించినారు.

## శ్రీ ఠాకూర్ దాస్ బువా (ఉరఫ్ కృష్ణ బువా)

బొంబాయిలో ప్రఖ్యాత కీర్తనకారుడు (హరిదాసు) ఠాకూర్‌దాస్ అను గొప్ప దత్తభక్తుడు వుండేవాడు. అతడు చిన్నతనము నుండే గాణుగాపురము, నరసింహవాడి మున్నగు దత్తాత్రేయ క్షేత్రములను దర్శించి ఆధ్యాత్మిక చింతనను అలవరచుకొన్నాడు. అతని భార్యపేరు రాధాబాయి. అతనికి ఒక కుమార్తె కూడా వున్నది. అతను అనేక ప్రాంతములు తిరిగి కీర్తనలు చేస్తూ ధర్మప్రచారం చేస్తుండేవాడు. దత్తోపాసన చేస్తూ శ్రీ దత్తుని గురించి తీవ్రముగా ధ్యానము చేస్తుండేవాడు. కొంతకాలానికి దురదృష్టవశాత్తు అతని శరీరంమీద తెల్లని




మచ్చలు కనబడి కొద్దిరోజులలోనే శరీరమంతా వ్యాపించి అతని ఆకారం వికృతంగా తయారైంది. అందువలన అతడు నలుగురిలోనికి రావటానికి సిగ్గుపడేవాడు. అతడు ఒకసారి గాణుగాపురం వెళ్ళి దత్త పాదుకలను దర్శించి అచ్చట భక్తిపారవశ్యముతో కీర్తన చేశాడు. శ్రీ దత్తాత్రేయస్వామి దర్శనమిచ్చి అక్కల్‌కోట వెళ్ళమని ఆదేశమిచ్చారు. అతను వేకువనే లేచి కాలినడకన అక్కల్‌కోట చేరుకున్నాడు. శ్రీస్వామి సమర్థుల బసకు వెళ్ళి శ్రీస్వామివారిని గురించి విచారించగా శ్రీస్వామి ఒక వేశ్య ఆహ్వానముపై ఆమె ఇంటికి ఆశీర్వదించుటకై శిష్యసమేతంగా వెళ్ళివున్నారని తెలిసింది. ఆ సమయంలో శ్రీస్వామివారివెంట చాలామంది పిల్లలు కూడా వున్నారని తెలిసింది. ఠాకూర్‌దాసు కూడ సరాసరి ఆమె ఇంటికి వెళ్ళి శ్రీస్వామిని దర్శించి వారికి సాష్టాంగ నమస్కారము చేసినాడు. శ్రీస్వామివారు అతనికేసి ప్రేమగా చూసి "నాకోసం కస్తూరి తెచ్చావు కదా! అది ఏదీ? సమర్పింపలేదేమి? యివ్వు!" అని చేయిచాపారు. అతని ఆశ్చర్యానికి అంతులేదు. గాణుగాపురంలో శ్రీ దత్తపాదుకలకు సమర్పించటానికి తనతో కస్తూరి తెచ్చుకున్నాడేగాని అది అక్కడ యివ్వటం మర్చిపోయాడు. అతను ఆనందముతో తన సంచినుంచి కస్తూరిని తీసి శ్రీస్వామికి సమర్పించాడు. చాలా ఖరీదైన ఆ సుగంధ ద్రవ్యాన్ని శ్రీస్వామి అందుకొని అక్కడ వున్న పిల్లలందరికీ పూసారు. శ్రీస్వామియే శ్రీ దత్తాత్రేయ స్వామియని తన్మయత్వం చెందాడు. ఆ దత్తమూర్తి తన ఎదుటనున్న చిన్న పిల్లలందరూ తన రూపాలేనని వారికి కస్తూరిని సమర్పించారు. అది చూచి గాణుగాపురంలోని దత్త పాదుకలు, దత్తాత్రేయమూర్తి, శ్రీస్వామి అంతా ఒక్కరేననే దృఢమైనభావం ఏర్పడింది. అతడు అక్కల్‌కోటలోనే వుండి శ్రీస్వామిని సేవించసాగాడు. రాత్రులు అద్భుతంగా కీర్తనలు చేసేవాడు. ఒకరోజున శ్రీస్వామి ఠాకూర్‌దాసు పైకి ఒక కాలిన కట్టెపుల్లను విసిరారు. అతడు దానిని శ్రీస్వామి యొక్క ఆశీర్వచనంగా తలచి, దానిని మెత్తగా పొడిచేసి, గాణుగాపురం నుండి తెచ్చిన విబూతి కలిపి వంటికి పూసుకున్నాడు. కొలది రోజులలోనే అతని వంటిమీద వున్న తెల్లని మచ్చలు అన్నీ మాయమైపోయి, పూర్తిగా మామూలు చర్మం వచ్చింది. అతను శ్రీస్వామి సమర్థుల ఆశీస్సులు పొంది తన గృహమునకు వెళ్ళినాడు.



మరియొకసారి ఠాకూర్‌దాసు తన భార్య రాధాబాయి, కుమార్తెతో కలసి శ్రీస్వామిని దర్శించినారు. రాధాబాయి తనకొక్కతే కుమార్తెయని, ఒక కుమారుడు కావాలని శ్రీస్వామిని ప్రార్థించినది. శ్రీస్వామివారు తమ తలపైనున్న జరీ కుచ్చుటోపీని తీసి ఆమె ఒడిలోకి విసిరి అనుగ్రహించారు. ఆ తరువాత ఆమెకు ఒక కుమారుడు జన్మించాడు. అతనికి 'గురునాథ్' అని పేరుపెట్టారు. అతను పెరిగి పెద్దవాడై శ్రీస్వామి సమర్థులకు గొప్ప భక్తుడైనాడు.

మరొకసారి ఠాకూర్‌దాసు తన కుటుంబముతో శ్రీస్వామిని దర్శించినపుడు శ్రీస్వామి తన పాదుకలను ప్రసాదించి వాటిని కొంతకాలము పూజించి శ్రీ రఘునాథ మందిరములో ప్రతిష్ఠించు. అక్కడ నేను కూడా ఆనంద తాండవము చేసేందుకు కొంత స్థలాన్ని కేటాయించమని ఆదేశించినారు. ఠాకూర్‌దాస్ ఉరఫ్ కృష్ణబువా బొంబాయిలోని ఠాకూర్‌ద్వార్ వద్దనున్న రఘునాథ మందిరములో సభామండపములో కుడిభాగములో ఆ పాదుకలను ప్రతిష్ఠించి, దానిపైన చిన్న మందిరమును నిర్మించి, శ్రీస్వామివారి చిత్రపటమును పెట్టి పూజంచసాగెను. శాస్త్రసమ్మతముగా ఆ పాదుకలను నిత్యము పూజచేసేవాడు. నాడూ, నేడూ అనేక వేలమంది భక్తులు ఆ పాదుకలను దర్శించి శ్రీస్వామి సమర్థుల ప్రత్యక్షానుభవమును పొందుచున్నారు. శ్రీ ఠాకూర్‌దాస్ బువా ప్రతి 'గురుపౌర్ణమి' రోజున అక్కల్‌కోట వచ్చి కీర్తనలు చేసేవాడు. అతను నిశ్చలమైన భక్తితో శ్రీస్వామిని సేవించి తరించాడు.

***విఠల విఠల పాండురంగా!***
***పుండరీక విఠలా పాండురంగా!!***
***ఆనంద విఠలా పాండురంగా!***
***బ్రహ్మానంద విఠలా పాండురంగా!!***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది రెండవ అధ్యాయము*** *సంపూర్ణము*








ఓం శ్రీ సాయిరాం

"ఓం గురు - శ్రీ గురు

సచ్చిదానంద గురు - శ్రీస్వామి సమర్థా"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది మూడవ అధ్యాయము

నిత్యానందుడు ఠాకూర్‌దాస్ బువా కథను చెప్పి విఠల నామముతో ఆనంద పరవశుడై యుండగా విద్యాసాగరుడు గురుదేవా! శ్రీస్వామి సమర్థులు వెలిగించిన జ్యోతులలో అనేకమంది యోగులుగా మారారని చెపుతున్నారుకదా! అందులో ఎవరైనా శ్రీస్వామి సమర్థుల వలెనే పూర్ణస్వరూపులుగా అయినారా? అలాంటి వారెవరైనా వుంటే వారి చరిత్రను తెలుపండి అని ప్రార్థించాడు. ఓ జిజ్ఞాసీ! నదులన్నీ తప్పక సాగరుని చేరినవిధంగా, భక్తులు ఎక్కడెక్కడ తిరిగినా సచ్చిదానంద స్వరూపుడైన సద్గురుని చేరక తప్పదు. నదులలో పెద్దవి, చిన్నవి ఉన్నట్లు భక్తులలో శిష్యులు, సేవకులు కూడా వుంటారు. వారి వారి ఆర్జిత పుణ్యాన్ని అనుసరించి వారు యోగులుగా, మహాయోగులుగా మారుతారు. అందువలన శ్రీస్వామి సమర్థులను ఆశ్రయించినవారిలో అనేకమంది యోగులు, యోగీశ్వర చక్రవర్తులుకూడ కలరు. అందులో కొల్హాపూర్ నివాసియైన శ్రీకృష్ణ సరస్వతి అలాంటివారే. వారిని, వారి లీలలను శ్రీస్వామి అనుగ్రహంతో వారు యోగేశ్వరులుగా రూపొందిన విధానమును తెలుసుకుందాము రా! అని శ్రీ నిత్యానందులు చెప్పసాగిరి.

### శ్రీ అవధూత కృష్ణ సరస్వతి

అప్పాభట్, అన్నపూర్ణబాయి అనే బీద బ్రాహ్మణ దంపతులుండేవారు. వారికి చాలాకాలం వరకు పిల్లలు లేరు. వారు శ్రీ దత్తాత్రేయస్వామి భక్తులు. సంతానం కోసం చాలాకాలం శ్రీదత్తస్వామిని కొలిచారు. వారి భక్తికిమెచ్చి శ్రీ దత్తాత్రేయస్వామి వారే ఒకనాటి రాత్రి కలలో కనబడి, నేను స్వయంగా మీ గర్భములో జన్మిస్తాను అని అనుగ్రహించారు. కొద్దికాలం తరువాత మాఘ కృష్ణ పంచమినాడు వారికి ఒక కుమారుడు జన్మించాడు. అతను తేజోవంతము



గాను, అందరికి మహాపురుషుడిలా గోచరించాడు. అతనే ముందు ముందు జీవన్ముక్తుడుగా ప్రసిద్ధిచెందిన మహనీయుడు, శ్రీ అవధూత కృష్ణసరస్వతి ఉరఫ్ కుమారస్వామి. ఇతను జన్మతః యోగి. తండ్రివద్ద విద్యాభ్యాసము కొనసాగించాడు. మంత్రములు, ఉపనిషత్తులు నేర్చుకుని, సంస్కృతంలో మంచి ప్రావీణ్యం సంపాదించాడు.

ఒకసారి వారి తల్లిదండ్రులు ఆ బాలుని తీసుకొని శ్రీస్వామి సమర్థుల వారి దర్శనార్థమై అక్కల్‌కోట వచ్చినాడు. ఆ బాలుని చూడగానే శ్రీస్వామి సమర్థులవారు ఆసనం నుండి లేచి, ముందుకెళ్ళి, ఆ బాలుని చెయ్యిపట్టుకుని, దగ్గరలోనున్న చిట్టడవికి తీసుకెళ్ళారు. సేవకులు శ్రీస్వామివారి తత్త్వం తెలుసుకొని ఎవ్వరినీ వెళ్ళనివ్వలేదు. అడవిలో శ్రీస్వామివారు ఒక రాతిబండ మీద, బాలుడు శ్రీస్వామి పాదాలచెంత కూర్చున్నాడు. ఆ బాలుడు శ్రీస్వామి వారిని స్తుతించుచు ఒక స్తోత్రం చదివాడు. శ్రీస్వామి ఆ బాలుని దీవించి "నీవు నా అంశానివి. మనమిరువురమూ వేరుకాదు. నీవు కారణ జన్ముడవు. ఇతరులకు హితం చెయ్యటానికి జన్మించావు. అది దివ్యకార్యము, దానిని నిర్వర్తించుము"అని చెప్పి ఆ బాలుని శిరస్సుపై చేయినుంచారు. ఆ స్పర్శ ఆ బాలుని అతీంద్రియ స్థితికి తీసుకొని వెళ్ళినది. అతను సమాధిస్థితిలో ఏడు గంటలున్నాడు. ఆ తరువాత తిరిగి సామాన్య మానసిక స్థితిని పొందెను. ఇరువురు తిరిగి మఠమునకు చేరుకొనిరి. ఆ బాలుడు కొంతకాలం అక్కల్‌కోటలోనే శ్రీస్వామిని సేవిస్తూ వుండిపోయాడు.

కొంతకాలమునకు శ్రీస్వామి కృష్ణ సరస్వతిని "కొల్హాపూర్ వెళ్ళి బాల ఉన్మత్త పిశాచవృత్తి నవలంబించి అవధూతగా జీవించు, అక్కడనుండి నీ అవతార కార్యమును ప్రారంభించి, దివ్యజ్ఞానముతో చరించు" అని పంపిరి.

ఒకసారి శ్రీస్వామి "మన బ్రాహ్మణుడింకా రాలేదేమి?" అని అడిగిరి. ఆ మాటలలోని భావమేమిటో, అది ఎవరిని ఉద్దేశించి అన్నారో ఎవరికీ అర్థంకాలేదు. కొంతసేపటికి ఒక కుష్ఠురోగియైన బ్రాహ్మణుడు శ్రీస్వామి దర్శనానికి వచ్చాడు. ఆయన మొదట గాణుగాపురం వెళ్ళి దత్తపాదుకలను సేవించాడు. అక్కడ స్వప్నంలో శ్రీ దత్తాత్రేయస్వామి కనిపించి అక్కల్‌కోట వెళ్ళమని చెప్పారు. అందువలన అతడిప్పుడు అక్కల్‌కోట వచ్చాడు. శ్రీస్వామిని తన రోగం పోగొట్టమని, ఆరోగ్యాన్ని ప్రసాదించమని ప్రార్థించాడు. శ్రీస్వామి అతనిని కొల్హాపూరు వెళ్ళి శ్రీకృష్ణ సరస్వతిని సేవించమని ఆజ్ఞాపించారు.

వారి ఆదేశం ప్రకారం అతను కొల్హాపూర్ వెళ్ళి శ్రీకృష్ణ సరస్వతిని సేవించాడు. శ్రీకృష్ణ సరస్వతికి శరణువేడితే అతనిపై దయకలిగి అతని రోగాన్ని తగ్గించి, ఆరోగ్యం ప్రసాదించారు.

శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ మహాసమాధి అయిన తరువాత, ఒక బ్రాహ్మణ భక్తుడు చాలా విచారించుచుండెను. ఒకనాటి రాత్రి అతనికి స్వప్నంలో శ్రీస్వామివారు దర్శనమిచ్చి "నీవు దుఃఖింపకుము. ప్రస్తుతము నా అంశము కొల్హాపూర్‌లో శ్రీకృష్ణ సరస్వతి రూపములో నున్నది. నీవు వెళ్ళి ఆయన దర్శనం చేసుకొని పూజించుకో!" అన్నారు. ఆ బ్రాహ్మణుడు వెంటనే కోల్హాపూర్ వెళ్ళి శ్రీస్వామివారి ఆదేశానుసారం శ్రీకృష్ణ సరస్వతిని దర్శించి పూజించినాడు. అప్పుడు అతనికి శ్రీకృష్ణ సరస్వతిలో శ్రీ అక్కల్‌కోట స్వామివారి రూపం దర్శనమైనది. ఆ బ్రాహ్మణుడు ఆనందముతో శ్రీస్వామిని సేవించి ధన్యుడైనాడు.

శ్రీకృష్ణ సరస్వతిస్వామి జీవన్ముక్తుడు. శ్రీదత్తాంశమును కలిగిన మహానుభావుడు. శ్రీస్వామి సమర్థుల ప్రతిరూపమే ఆయన అని, వారిరువురికీ భేదమేమీ లేదని భక్తులందరూ భావించేవారు. శ్రీ అక్కల్‌కోట స్వామి మహరాజ్ వారికి మొక్కుకున్న మొక్కులు, శ్రీకృష్ణ సరస్వతికి చెల్లించేవారు. అవి శ్రీస్వామి సమర్థులకు చెందుతాయని భక్తులందరూ విశ్వసించుతారు. వీరు శక్తి - సామర్థ్యములలోను, మాట, నడక అన్ని పోలికలలోను శ్రీస్వామి సమర్థులను పోలివుండేవారు. శ్రీస్వామి చెప్పినట్లుగా వీరు సాక్షాత్తూ శ్రీస్వామివారి అంశయే.

ఒకసారి ఒక బ్రాహ్మణుడు తనకు సంతానం కలిగితే శ్రీస్వామి సమర్థులకు పాలకోవా సమర్పించుతానని మొక్కుకున్నాడు. సంతానం కలిగిన తరువాత విషయం పూర్తిగా మరచిపోయినాడు. శ్రీస్వామి సమర్థులు నిర్యాణం చెందిన తరువాత ఆ విషయం జ్ఞాపకం వచ్చింది. స్వయంగా శ్రీస్వామి నోటికి పాలకోవా అందించలేక పోయినందుకు అతడు ఎంతో పశ్చాత్తాపము చెంది, రోజూ ఆ విషయం తలచుకొని శ్రీస్వామిని స్మరించేవాడు. ఒకరోజు రాత్రి స్వప్నంలో శ్రీ అక్కల్‌కోట మహరాజ్ కనపడి "నేను కొల్హాపూర్‌లో కుంభారగల్లీలో శ్రీకృష్ణ సరస్వతి అనే పేరుతో వున్నాను. నీవు అక్కడికి వెళ్ళి నీ మొక్కు చెల్లించుకో!" అన్నాడు. ఆ బ్రాహ్మణుడు అలాగే వెళ్ళి శ్రీకృష్ణ సరస్వతికి పాలకోవా తినిపించి తన మొక్కు చెల్లించుకున్నాడు. శ్రీ అవధూత కృష్ణసరస్వతిని సేవించి వారి అనుగ్రహమును పొందిన యోగులుగా మారినవారు ఎందరో కలరు. వీరు 1900లో సమాధి పొందినారు.

***"జై జై దత్తావతార శ్రీకృష్ణ సరస్వతి మహరాజ్‌కీ జై"***



# శ్రీ ప్రీతినంద్‌స్వామి కుమార్

గోపాల్ రామచంద్ర కేల్కార్ రాజాపూర్‌లో 1847లో జన్మించాడు. వీరి తల్లిదండ్రులు చాలా బీదవారు. అందువలన కేల్కర్ మూడవ తరగతి వరకు చదువుకొని ఆపైన మానివేయవలసి వచ్చినది. జీవనభృతికై రైల్వేలో ఒక చిన్న ఉద్యోగంలో చేరాడు. క్రమముగా స్వయంకృషితో అతను రైల్వే స్టేషన్ మాస్టర్ అయ్యాడు. ఇతను శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ లీలల వలన ప్రభావితుడై శ్రీస్వామివారియందు భక్తి, విశ్వాసము కలిగివున్నాడు. ఒకసారి అతనికి తీవ్రమైన కడుపునొప్పి వచ్చినది. ఆ బాధతో అతను తన విధి నిర్వహణను కూడా శ్రద్ధగా చేయలేకపోయాడు. ఎన్నో మందులు వాడినాడు. కాని ఆ బాధనుండి ఉపశమనం దొరకలేదు. చివరకు అతను చాలా విసుగుచెంది "దేవుడే నిజంగా వుంటే నా బాధలు ఎనిమిది రోజులలో నయంకావాలి. అలా జరిగితే నా ఉద్యోగానికి రాజీనామాచేసి దైవసేవలో జీవిస్తాను" అని శపథం చేశాడు. ఆ క్షణం నుండి బాధ తగ్గటం మొదలుపెట్టి, ఆశ్చర్యంగా ఎనిమిది రోజులలోపే కడుపునొప్పి పూర్తిగా తగ్గినది. కేల్కర్ మహా సంతోషముతో అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థులను దర్శించి, పూజించాడు. తన ప్రతిజ్ఞ ప్రకారము తన ఉద్యోగానికి రాజీనామా చేసి శ్రీస్వామివారి సేవలో రెండు సంవత్సరములున్నాడు. శ్రీస్వామి అతనికి 'ప్రీతినంద స్వామికుమార్' అని పేరుపెట్టారు. అతనితో "బొంబాయి వెళ్ళి అచ్చట శ్రీస్వామి సుతను సేవించుకో!" అని ఆజ్ఞాపించిరి. శ్రీస్వామి సమర్థుల ఆదేశం ప్రకారం బొంబాయి వెళ్ళి, శ్రీస్వామి సుతను నాలుగు నెలలు సేవించారు.

శ్రీస్వామి సుత శిష్యుడు బ్రహ్మచారి బువా ఒకసారి చలువరాతి పాదుకలను చిప్లం గ్రామానికి తీసుకుని వచ్చాడు. ఒక చిన్న గుడిశెలో వాటిని పెట్టి ఒక ఉపాధ్యాయుని వాటి పూజకై నియమించి వీటిని సేవించేవారు. వచ్చునంతవరకు జాగ్రత్తగా కాపాడుమని చెప్పి వెళ్ళిపోయాడు. సరిగా అదేసమయంలో శ్రీస్వామి సుత, కేల్కర్‌ను చిప్లం గ్రామం వెళ్ళి, అక్కడ ఒక మఠం నిర్మించి పాదుకలను ప్రతిష్ఠించి అక్కడే జీవించమని ఆదేశించారు. కేల్కర్ అనబడే ఈ ప్రీతినంద్ చిప్లం వెళ్ళేముందు శ్రీస్వామి సమర్థులను దర్శించటానికి అక్కల్‌కోట వచ్చారు. శ్రీస్వామి అతనిని ఆశీర్వదించి చిన్న వెండిపాదుకలను, దండమును ప్రసాదించి ప్రతి గురువారము భిక్ష చేయటం ద్వారా జీవించమని, దానివల్ల ఏ కొరతా వుండదని ఆదేశించి, ఒక జోలెను కూడా యిచ్చి పంపాడు. వీరు చిప్లం గ్రామంచేరి బ్రహ్మచారి బువా యిచ్చివెళ్ళిన పాదుకలకు ఒక మఠం నిర్మించి అక్కడే జీవించసాగిరి. అక్కడ జనులు వీరిని గోపాల బువ అని కూడ పిలిచేవారు.

1878లో శ్రీస్వామి సమర్థులు సమాధి అయినారనే వార్త అతనికి టెలిగ్రాము ద్వారా తెలిసినది. ఆయన హృదయము కదలిపోయి, ఆ వార్తను సహించలేకపోయినారు. తీవ్రమైన దుఃఖముతో "సద్గురువులేని జీవితము ఈ భూమిపై వ్యర్థము, గాఢాంధకారము, నిర్వీర్యము. ఇంక మరణించుటయే మేలు!" అని తలచి, అన్న పానీయములు మాని నిరాహారదీక్ష మొదలుపెట్టిరి. మూడవరోజున శ్రీస్వామి సమర్థులు సశరీరులుగా దర్శనమిచ్చి "నాకు మరణములేదు, నా భక్తులు పిలిచినప్పుడెల్లా నేను పలుకుతాను. వారి యోగక్షేమములు చూడటం నా బాధ్యత. నీవంటి యోగి యిలా దుఃఖములో మునిగి ఆత్మత్యాగం చేయబూనుట భావ్యంకాదు. భగవత్ప్రసాదితమైన శరీరము దానంత అది నశించు వరకు దైవసేవలో అత్యంత భక్తి శ్రద్ధలతో జీవించవలెను. దీనిని బలవన్మరణం పాలు చేయుట మహాపాపము" అని అతనిని ఒప్పించిరి. శ్రీస్వామివారి దర్శనమునకు ఆనందించి, గోపాల్‌బువా, తన నిరాహారదీక్షను విరమించుకొని, పూర్వముకంటే అధికమైన ఉత్సాహముతో, ఎక్కువ భక్తిశ్రద్ధలతో శ్రీస్వామివారి పాదుకలను పూజించుచు మఠములో సేవ చేయుచుండెను. ప్రతిగురువారము శ్రీ దత్తాత్రేయుని సాంప్రదాయము ననుసరించి, శ్రీ సమర్థుల ఆదేశానుసారము భిక్షకు వెళ్ళెడివారు. ఈయన 1919లో చిప్లంలోనే సమాధి పొందినారు. ఈనాటికీ చిప్లంలోని శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ వారి మఠంలో ఆయన ప్రసాదించిన పాదుకలు, దండము, భక్తులు దర్శించి, సేవించి తరించుచున్నారు. గోపాల బువా సమాధిచెందిన తదుపరి, వీరి మనుమడు ఆ మఠములో పూజాది కార్యక్రమము లను నిర్వహించుచు, అత్యంత భక్తిశ్రద్ధలతో జాగ్రత్తగా చూచుచున్నాడు.

## శ్రీ పరమహంస సద్గురు స్వామి సంపూర్ణానంద

నాథ సాంప్రదాయమునకు చెందిన శ్రీ పరమహంస సద్గురుస్వామి సంపూర్ణానంద ఆత్మసాక్షాత్కారము పొందిన గొప్పయోగి. ఈయన శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్‌వారి లీలలను విని ఆయనయందు భక్తి, విశ్వాసము, గౌరవము కలిగి వుండేవాడు. శ్రీస్వామి సమర్థులు యోగులందరిలోకి మణివంటివాడని, సాక్షాత్తు పరబ్రహ్మ స్వరూపుడని అంటుండేవారు. శ్రీస్వామి సమర్థుల చిత్రపటమును తనముందు ఎప్పుడూ వుంచుకొనేవారు. భక్తులందరూ శ్రీసంపూర్ణానందులకు, శ్రీస్వామి సమర్థులకు భేదమేమీ లేదనీ, వీరిరువురూ ఒకే రూపమనీ విశ్వసించి పూజించేవారు. అలాంటివే ఎన్నో అనుభవాలు భక్తులకు కలిగినాయి.



## శ్రీ సత్యదేవానంద సరస్వతి

ఆళందిలో శ్రీ సత్యదేవానంద సరస్వతి అనే యోగి వుండేవారు. ఆయన ఒకసారి శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ వారి పాదుకలను దర్శించి, సేవించాలని అక్కల్‌కోట వచ్చినారు. శ్రీస్వామివారి పాదుకలను పూజించుకున్న పిదప ఒకనాటి రాత్రి శ్రీస్వామి స్వప్న దర్శనమిచ్చి ఆయనను పావాస్‌లోగల శ్రీ స్వరూపానంద పరమహంస దర్శనము చేసుకోమని ఆదేశించారు. ఆయన అలాగే వెళ్ళి ఆ పరమహంసను దర్శించి తరించినారు.

విద్యాసాగరా! శ్రీస్వామి సమర్థులు అక్కల్‌కోట రాకముందు ఆసేతు హిమాచల పర్యంతం, దేశమంతటా సంచారము చేసినారుకదా! ఆ పర్యటనలో ఒకసారి శ్రీస్వామివారు గంగాసాగర సంగమం వద్దకు వెళ్ళినారు. అప్పుడు అక్కడ 'శ్రీ రామకృష్ణ పరమహంస'ను కలుసుకున్నారు. ఆ సందర్భంలో శ్రీరామకృష్ణ పరమహంస శ్రీస్వామిని చూచి ఎంతో సంతోషించి, "అలక్ నిరంజన్! మీ దర్శనముతో నా జన్మ ధన్యమైనది" అన్నారు. విద్యాసాగరా! యోగులంతా ఒక్కటే. వారి ఆంతర్యములలో ఏ భేదము లేదు. వారి నామరూపాలు వేరువేరైనా, వారు వేరువేరు ప్రదేశములను తమ తపోభూములుగా ఎంచుకున్నా వారందరి కార్యక్రమం ఒక్కటే. సాధకులకును, గురుశిష్యులకును ఆత్మ సాక్షాత్కారమును కలిగించి జీవన్ముక్తులను చేయుట, దుష్ట సహవాసము చేసి వ్యసనములకు లోనైన వారిని సన్మార్గులుగా మార్చుటయే వారి కార్యక్రమము. యుగయుగాల నుంచి అనేక అవతారులు, మహర్షులు, యోగులు, జీవన్ముక్తులు, అవధూతలు జన్మించి నడయాడిన భూమి కావుననే ఈ భారతభూమి యోగభూమిగా పేరొందినది.

***నందకుమారా - నవనీతచోరా - యశోదబాలా గోపాలా***
***బృందావన సంచారా ధీరా - రాధికాలోలా గోపాలా!***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది మూడవ అధ్యాయము*** *సంపూర్ణము*






ఓం శ్రీ సాయిరాం

"స్వామి సమర్థా - స్వామి సమర్థా
అక్కల్‌కోట వాస - సమర్థా"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది నాలుగవ అధ్యాయము

విద్యాసాగరా! సర్వేశ్వరుడు సర్వ శబ్ద స్వరూపుడు, జ్ఞానప్రదుడు అని ఆయన స్వరూప గుణ వైభవాలను వేదాలు మహాద్భుతంగా ప్రతిపాదించినాయి. మునులు, మహర్షులు, వేదాంతులు, పౌరాణికులు ఆ తత్త్వాన్ని లోకమంతా వెదజల్లినారు. కాని కాలక్రమాన ఈ పరంపరలో కలి ప్రభావముచేత ఈ విశ్వవ్యాపక తత్త్వచింతన లోపించినది. శ్రీస్వామి సమర్థుల సువిశాలమైన అవతార కార్యక్రమం భారతదేశమంతా సంచరించి ఈ తత్త్వాన్ని పునర్జాగృతం చేయుటయే. వారు తమ దరిచేరిన విశిష్ట జీవులందరినీ, ఈ కార్యక్రమమునకై నిర్మాణము చేసుకున్నారు. అలా వారిచేత మలచబడినవారే ఈ యోగులందరూ. విద్యాసాగరా! శ్రీస్వామి లీల అంతేకదా! నీవు అక్కల్‌కోట చేరటం, నాచేత ఈ పలుకులు పలికించటం, విశ్వోద్ధారక తత్త్వంలోని భాగమేకదా! రా! మరి కొందరు దిగంబరులైన మహాత్ముల గురించి తెలుసుకుందాం అని చెప్పసాగిరి.

### దిగంబరస్వామి - ఆనందనాథ్ మహరాజ్

ఈయన పూర్వాశ్రమంలో ఆయుర్వేద వైద్యులకొరకు వనమూలికలు సేకరించి వారికి అమ్ముచుండేవారు. ఒకసారి బొంబాయిలో భెండి దుకాణములో నుండగా శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్‌వారి గురించి అక్కడివారు మాట్లాడుకొనుచుండగా విన్నాడు. ఆ సంభాషణ అతనికి చాలా ఆసక్తికరంగా అనిపించింది. శ్రీస్వామివారి మహత్తును గురించి తరచి తరచి అడిగి వివరంగా తెలుసుకొన్నాడు. శ్రీస్వామి దర్శనం చేసుకోవాలనే కుతూహలం అతనిలో పెరిగింది. నేరుగా బొంబాయి నుండి అక్కల్‌కోటకు ప్రయాణమైనాడు.



ప్రయాణపు అలసట, దప్పిక తీర్చుకొనుటకై దగ్గరలో చెరువువద్దకు వెళ్ళాడు. ఆ సమయంలో ఆ ఒడ్డునే వున్న మర్రిచెట్టుపై నుండి ఒక సన్నని కొమ్మ విరిగి తలపై పడినది. చెట్టువైపు తలెత్తి చూచాడు. ఒక అద్భుత దృశ్యం కనిపించింది. దివ్యమైన కాంతితో బంగారువన్నె శరీరంతో, జ్యోతులవలె ప్రకాశాన్ని కలిగివున్న కళ్ళు, చల్లని వెన్నెలవంటి చూపుతో చిరునవ్వు నవ్వుతూన్న శ్రీస్వామి దర్శనమిచ్చారు. ఆనందనాథుడు గబగబా పైకివెళ్ళి శ్రీస్వామికి పాదాభివందనం చేశాడు. శ్రీస్వామి మందహాసంతో ఆయన తలపై ఒక చేతినుంచి ఆశీర్వదించారు. తక్షణం ఆనందనాథునిలో విచిత్రమైన మార్పు వచ్చింది. తనువు పులకించింది. కన్నులు ఆనందాశ్రువులతో నిండినవి. అవ్యక్తానందానుభూతి కలిగినది. అతని హృదయంలో తీవ్రమైన వైరాగ్యం చెలరేగింది. అతను ఆనాటినుండి అక్కల్‌కోటలో దిగంబరుడై తిరుగుచూ తరచూ శ్రీస్వామి సమర్థుల సమక్షములో భజనలు చేస్తూ ఆరు సంవత్సరములు గడిపెను.

అతను గొప్ప కవి అయినాడు. శ్రీస్వామి సమర్థుల గొప్పతనమును శ్లాఘిస్తూ అనేక భక్తిగీతములు రచించెను. అభంగములను, హారతి పాటలనుకూడా వ్రాసియుండెను. అవియన్నియూ ఎంతో ప్రసిద్ధి చెందినవి. అతను ఎప్పుడూ ఆనందానుభూతిలో లయమై వుండేవాడు. ఎల్లవేళలా సద్గురు పరబ్రహ్మ స్వరూపమును ధ్యానించుచూ శరీర స్పృహలేక అర్థనగ్నుడై జీవించాడు. భక్తి సంకీర్తనలన్నింటిని శ్రీస్వామి ఎదుట ఎంతో పారవశ్యంతో పాడుచుండేవాడు. అతనికి ఆహారవిషయంలోగూడ ఎక్కువ ధ్యాస వుండేదికాదు. అందువల్ల అతనిని అందరూ దిగంబర బువా అని పిలచేవారు. అతను రచించిన పాటలన్నీ భక్తులు పాడుచూ మైమరుస్తారు. ఒకనాడు శ్రీస్వామి అతనిని ఆశీర్వదించి అంగుష్ఠ పరిణామమైన పంచలోహ పాదుకలను ప్రసాదించారు. అతనిని కొంకణదేశ ప్రాంతమందు జీవించమని ఆదేశించినారు. శ్రీస్వామి ఆజ్ఞప్రకారం ఆనందనాథ్ (దిగంబర బువా) వెళ్ళి ఆ ప్రాంతమున దత్త భక్తిప్రచారం చేశారు.

అతను కొంకణ ప్రాంతములో యేవలా, హోడావాడే దావడే అనుచోట్ల మఠములను నిర్మింపజేసి శ్రీస్వామి భక్తిని ప్రచారంచేశారు. శ్రీస్వామి ప్రసాదించిన పాదుకలను దావడే మఠంలో ప్రతిష్ఠించారు. ఈ దిగంబరబువా, ఆనందనాథ్ మహరాజ్‌గా ప్రసిద్ధి చెందినారు.

ఈయన 1904లో వెంగుర్లా అనేచోట సమాధి చెందిరి. అక్కడి మఠంలో ఈ మహారాజ్ వారి పాదుకలను ప్రతిష్ఠించి, పూజించి, భక్తులు వారి వారి అభీష్టములు నెరవేర్చుకొనుచున్నారు. శ్రీస్వామి సమర్థుల శిష్యులలో చాలా విలువైన పేరెన్నికగన్న శిష్యరత్న ఆనందనాథ్ మహారాజ్.

## శ్రీ తాతా మహరాజ్

బొంబాయిలో రామచంద్ర వెంకటేష్ బరాడ్కర్ అనే గౌడ బ్రాహ్మణుడు వుండేవాడు. అతను చిన్నతనము నుండి శివభక్తి గలవాడు. అతని నివాసము బొంబాయిలోని దోభీతలాబ్. అతను బొంబాయిలో మూలికలు, ఔషధాలు అమ్ముకొని వ్యాపారము చేసేవాడు. ప్రతిరోజూ బొంబాయిలో 'బాబుల్‌నాథ్' శివాలయానికి వెళ్ళి ఆయనను సేవించుకొనేవాడు. ఒకనాడు అతనికి స్వప్నంలో 'పరమశివుడు' కనిపించి "నేను అక్కల్‌కోటలో సశరీరుడనై శ్రీస్వామి సమర్థ రూపములో వున్నాను. నీవు అక్కడికి వచ్చి దర్శించుకో" అని చెప్పాడు. కొంతకాలానికి అతను అక్కల్‌కోటకు శ్రీస్వామి దర్శనమునకు వచ్చాడు. అక్కడ శ్రీస్వామిని దర్శించి తన స్వప్నమును గురించి వివరించాడు. మరుక్షణం శ్రీస్వామి స్థానంలో కండ్లు మిరిమిట్లు గొలిపే కాంతితో మెరిసి తేజోమయమైన రూపముతో పరమశివుడు సాక్షాత్కరించాడు. ఆ దివ్య రూపమును చూచి బరాడ్కర్ కనులు చీకట్లు క్రమ్మి, భయంతో చెమటలు పట్టినవి.

ఆ దివ్యమైన ప్రకాశవంతమైన దృశ్యమును అతని చర్మచక్షువులు చూడలేకపోయినవి. శ్రీస్వామి దయతలచి మహోన్నతమైన తన రుద్ర స్వరూపమును మార్చి తేజోవంతమైన, మధురమైన విష్ణురూపముతో దర్శన మిచ్చారు. సమస్త ఆయుధములతో ధగధగ మెరిసిపోవుచున్న ఆ శ్రీమన్నారాయణుని చూచి అతనికి మహానందమైనది. వెంటనే నిశ్చల స్వరూపుడైన బ్రహ్మగా శ్రీస్వామి దర్శనమిచ్చిరి. ఇలా త్రిమూర్త్యాత్మకముగా శ్రీస్వామి దర్శనమివ్వడం చూచి ఆ దివ్యకాంతికి తట్టుకొనలేక బరాడ్కర్ "స్వామీ! మీ సామాన్య రూపమును మాత్రమే ఈ కనులు తట్టుకొనగలవు. ఆ రూపములోనే మిమ్ములను సేవించి తరించే భాగ్యం నాకు ప్రసాదించండి. నా పూర్వీకుల పుణ్యఫలంచేత, నా తల్లిదండ్రుల అనుగ్రహంవలన, జన్మజన్మలుగా నేను చేసుకొన్న సత్కర్మలవలన ఇట్టి మహత్తరము, దుర్లభము అయిన దివ్యదర్శనము లభించినది. తండ్రీ! ఓ స్వామి సమర్థా! నీవు అవ్యాజ కరుణామూర్తివి. నన్ను

 

అనుగ్రహించి నీ సన్నిధికి రప్పించుకున్నావు. ఈ దయను నాపై వుంచండి" అంటూ ప్రార్థించినాడు. వెంటనే తిరిగి శ్రీస్వామి సమర్థులు శాంతముగా కనబడి చిరునవ్వుతో "నేను ఎప్పుడూ నీతోనే వుంటాను. నా ఆశీస్సులు నీకు ఎల్లప్పుడూ వుంటాయి" అని తమ అభయహస్తంతో అతని శిరస్సును స్పృశించి దీవించారు. వారి స్పర్శతో అతడు తన్మయత్వములోనికి వెళ్ళి చాలాసేపు దివ్యమైన సమాధిస్థితిలో వుండిపోయినాడు. అక్కల్‌కోటలో కొన్నిరోజులు వుండి, శ్రీస్వామిని సేవించి వారి ఆశీర్వచనం తీసుకొని బొంబాయి తిరిగి వెళ్ళెను.

రామచంద్ర వెంకటేశ బరాడ్కర్ చాలాకాలము యోగసాధన చేసి అనేకమైన దివ్యసిద్ధులను సంపాదించినాడు. ఆయనను దర్శించుకొనేవారికి ఈతిబాధలు, అనారోగ్యములు నివారణమయ్యేవి. తనను దర్శించువారిని ఆయన చేయు ప్రక్రియ చాలా చిత్రాచిత్రంగా వుండేది. ఆర్తులచేతిలో నీరుపోసి తిరిగి ఆ నీరు తాను తీసుకొని ఆచమనం చేసేవారు. వారి కర్మలలోనున్న దోషాలను, రుగ్మతలను ఆ ప్రక్రియ ద్వారా తాను తీసుకొని వారిని ప్రక్షాళనం చేసేవారు. ప్రజలు ఆయనను తాతామహరాజ్ అని పిలవసాగిరి. ఈయనను దర్శించువారిలో కూడ అనేకులు పండితులు, పామరులు వుండేవారు. ఒకసారి బాలకృష్ణ సూరత్కర్ అనునతను శ్రీ తాతా మహరాజ్‌గారిని దర్శించటానికి వచ్చినాడు. అతను శ్రీస్వామి దయానందుని ఉపన్యాసమువలన ప్రభావితమైనవాడు. మత సాంప్రదాయములందు, విగ్రహారాధనమునందు విశ్వాసము లేనివాడు. అయినా శ్రీ తాతా మహరాజ్ ద్వారా శ్రీస్వామి సమర్థుల లీలలను గురించి విని, తాతామహరాజ్‌వారి అనుభవములను తెలుసుకొని చాలా ఆశ్చర్యచకితుడైనాడు. అతని ధోరణిలో చాలా మార్పు వచ్చినది. శ్రీ తాతామహరాజ్ అతనిని తాకగానే ఆయన సమాధి స్థితిలోనికి వెళ్ళినాడు. ఆ తన్మయత్వంలో ఎనిమిది రోజులుండినాడు. దీనివలన అతను పూర్తిగా మారిపోయి, దైవయోగసాధన ప్రారంభించి, శ్రీ తాతామహరాజ్‌వారి కృపాకటాక్షములతో గొప్ప యోగిగా పేరు పొందినాడు.

విద్యాసాగరా! వింటివా! శ్రీస్వామి సమర్థులను దర్శించినవారు యోగులుగా మారుటయేకాదు, ఆయన అనుగ్రహము పొందినవారిని దర్శించి, సేవించినవారు కూడ తిరిగి గొప్ప యోగులుగా రూపొందినారు. శ్రీస్వామి సమర్థుల అనుగ్రహము, అంతటి మహోన్నతమైనది.

# శ్రీ గోండవాలేకర్ మహరాజ్

శ్రీ గోండవాలేకర్ బాల్యము నుండి ఆధ్యాత్మిక దృష్టి గలవారు. ఈయనకు మతాభిమానము ఎక్కువగా వుండేది. తన 12వ సంవత్సరములో యిల్లువిడచి పారిపోయి, సద్గురువును అన్వేషించుచు తిరుగుచుండెను. తల్లిదండ్రులు పిల్లవానికొరకు ఎన్నో ప్రాంతములు వెదికిరి. చివరికి కోల్హాపురములో బాలుని జాడ కనుగొని, వెళ్ళి యింటికి తీసుకుని వచ్చిరి. ఈయన దృష్టిని మరల్చుటకై బాల్యములోనే తల్లిదండ్రులు వివాహము చేసిరి. కాని ఆ బాలునిలో ఏ విధమైన మార్పు రాలేదు. తన ధోరణిని మార్చుకొనలేదు. ఆధ్యాత్మిక తృష్ణ తీరక, “నేను సద్గురువును అన్వేషిస్తూ వెళుతున్నాను. ఎట్టి పరిస్థితులలోను యింటికి తిరిగి రాను. నాకోసం వెదకు ప్రయత్నం చేయవద్దు” అని తల్లికి లేఖవ్రాసి యిల్లు విడిచి మళ్ళీ వెళ్ళిపోయినాడు. అంతేగాక “నన్ను పూర్తిగా మీరంతా మరచిపొండి!” అని కూడ వ్రాసినారు.

సద్గురువును వెదుకుచూ శ్రీ గోండవాలేకర్ ఎన్నో ప్రదేశములు తిరిగినాడు. తనకు ఎవరు గురూపదేశమిచ్చుదురాయని తహతహలాడినారు. ఒకసారి ఆయన మీరజ్ వెళ్ళినారు. అక్కడ శ్రీ అన్నబువా అను మహాత్ముని దర్శించగా, ఆయన ఆశీర్వదించి “నీకు నేను గురువుగా తగను. నాకంటే శక్తిమంతుడు, మహాజ్ఞానియైన సద్గురువు నీకు లభించును” అని పలికినారు. కావున అతనిని పూర్ణ సద్గురుని అన్వేషించుచూ తన సంచారము సాగించుమనిరి. ఆయన ఆదేశానుసారం గౌండవాలేకర్ పర్యటిస్తూ నాసిక చేరిరి. అక్కడ శ్రీ యశ్వంతరావుదేవ్ మహరాజ్‌ను కలిసికొని, తనను శిష్యునిగా స్వీకరించమని వేడుకొన్నారు. కాని శ్రీదేవు మహరాజ్‌కూడా ఆయనను దీవిస్తూ, తనకంటే గొప్ప మహాపురుషుడు గురువుగా లభించునని పలికిరి. శ్రీ గోండవాలేకర్‌నకు తమ గురుదేవులను గురించి తెలిపిరి. వారు తెలిపిన విషయములను శ్రీ గోండవాలేకర్ తిరిగి తన పర్యటన కొనసాగిస్తూ, అక్కల్‌కోట చేరినాడు.

శ్రీస్వామి సమర్థులకు యితని ఆగమనమును గురించి ముందుగానే తెలియును. అచ్చటి సేవకులతో, భక్తులతో “ఒక గొప్ప సత్యాన్వేషి, మేలురకమైన ఆధ్యాత్మిక సాధకుడు, మిక్కిలి సమర్థుడు వస్తున్నాడు. మీరు అతనిని చాలా గౌరవముతో చూచి, తగిన రీతిని ఆదరించండి” అని పలికిరి. ఆ మాటలు అనిన పిదప కొద్దిసేపటిలోనే శ్రీ గోండవాలేకర్ అచ్చటికి వచ్చిరి. శ్రీస్వామి సమర్థులను దర్శించగనే అతని శరీరమునందు గగుర్పాటు కలిగి,



ఆనందోత్సాహములతో శ్రీస్వామివారి పాదములపై పడినారు. తాను యిన్నిరోజులుగా అన్వేషించినది ఈయన కొరకేననిపించి హృదయము భక్తితో నిండి, మధురమైన అనుభూతి కలిగి శ్రీస్వామి సమర్థులను అనేక విధములుగా స్తుతించిరి. “ఓ సద్గురు మౌళీ! సచ్చిదానందా! పరమ పావనమూర్తీ! నన్ను శిష్యునిగా స్వీకరించి, అనుగ్రహించండి!” అని ప్రార్థించెను. శ్రీ గోండవాలేకర్ జన్మతః యోగి. కాని ఆయనలోని దివ్యశక్తులను వెలికి తీసుకురాగల శక్తివంతమైన గురువు అత్యవసరము. రాజాధిరాజు, యోగిరాజు, స్వాములకు స్వామి అయిన శ్రీస్వామి సమర్థుల దృష్టిపాతముతోనే వానిలోని దివ్యశక్తులు మేల్కొని ఉత్తేజము పొందినవి. శ్రీస్వామి ఆయన శిరముపై చేయినుంచి, “నీలోని చైతన్య ప్రవంతి నిరంతరాయముగా సాగుచుండును. నీకు తగిన సద్గురువు, తగిన సమయములో తనకు తానేవచ్చి అనుగ్రహించును. కావున నీవు సాధన చేయుచు, సద్గురుని రాకకై నిరీక్షించుచుండుము అని దీవించి, ఒక దానిమ్మ పండును ప్రసాదముగా యిచ్చిరి.

శ్రీ గోండవాలేకర్ ద్విగుణీకృత ఉత్సాహముతో శ్రీస్వామి సమర్థుల ఆదేశానుసారము ఎంతో తపనతో, భక్తి-శ్రద్ధలతో ఆధ్యాత్మిక యోగసాధన చేయుచు సద్గురుని అనుగ్రహమునకై నిరీక్షించుచుండెను. శ్రీస్వామివారి సత్యవాక్కులు అమోఘములు. కొలది కాలములో శ్రీ తుకారామ్ చైతన్య అను మహాత్ముడు గోండవాలేకర్‌ను తమంతట తామే వచ్చి శిష్యునిగా స్వీకరించి, సద్గురువుగా అతనకి ఆత్మసాక్షాత్కారమును పొందుటకు కావలసిన పరిపూర్ణ ఆధ్యాత్మిక పరిణతిని చేకూర్చినారు. అతనికి బ్రహ్మచైతన్య గోండవాలేకర్ మహరాజ్ అని దీక్షానామమును ఒసగిరి. శ్రీ బ్రహ్మచైతన్య గోండవాలేకర్ మహరాజ్ ఎంత గొప్ప పేరు, ప్రఖ్యాతులు పొందినారు. ఎందరో భక్తులను అనుగ్రహించిరి. విద్యాసాగరా! మరికొందరు యోగులను గురించి రాబోవు అధ్యాయములో చెప్పుకుందాము.

***సాంబ సదాశివ - సాంబ సదాశివ***
***సాంబ సదాశివ - సాంబ సదాశివ***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది నాలుగవ అధ్యాయము*** *సంపూర్ణము*



ఓం శ్రీ సాయిరాం

"సర్వలోక నాయక త్రిమూర్తిరూపా

స్వామి సమర్థా - అనసూయ నందన"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది ఐదవ అధ్యాయము

విద్యాసాగరా! భగవంతుని స్మరించే భాగ్యం అందరికీ లభించదు. లభించిన వారు భగవంతుని భక్తులై ఉత్తమ భాగవతులౌతారు. వారే మహాత్ములు. వారు ఈ ప్రపంచముతో సంబంధము కలిగించుకోరు. వారు ప్రపంచముతో సంబంధమున్నట్లుగా కనిపిస్తారు. గృహాలను త్యాగంచేస్తారు. సాధువులతో కలసి జీవిస్తారు. ఏ కార్యంలో లయమైవున్నా భగవంతుని నామాన్నే జపిస్తుంటారు. సర్వవేళలలో లోకేశ్వరుని చరణాలనే సేవిస్తూ, ఆయన దివ్య లీలలను, విశేషాలను ఆకర్ణిస్తూ, గానంచేస్తూ కాలాన్ని వెళ్ళబుచ్చుతారు. వారే జనన మరణాలను జయించి, సంసార సాగరాన్ని దాటుతారు. విద్యార్థీ! మనం కూడ శ్రీస్వామి సమర్థుల అనుగ్రహంతో భవసాగరాన్ని దాటుదాం అని చేతులు జోడించి యిరువురూ శ్రీస్వామి సమర్థులను ప్రార్థించసాగారు.

హే పరబ్రహ్మ స్వరూపా! నీవు మహానుభావుడవు. నీ లీలలను తెలుసుకోవటం నీ మాయను తరించటం, మావంటివారికి సాధ్యముకాదు. తండ్రీ! దీనదయాళో! నీ అనుగ్రహంవల్ల మాకు అతి దుర్లభమైన నీ దర్శనం, నీ లీలలను చెప్పుకునే భాగ్యం కలిగినది. మేము ధన్యాతి ధన్యులమైనాము. ఓ సద్గురుమూర్తీ! మీ చరణాలను ఆశ్రయించటం ద్వారా బ్రహ్మరుద్రాదులకంటే అదృష్టవంతులమని యిప్పటికి గ్రహించాము. ఓ దత్త స్వరూపా! నీవు భక్తవత్సలుడవు. ఎల్లవేళలా నీ కథలను వింటూ, నిన్ను కీర్తిస్తూ, నిన్ను అర్చిస్తూ, నిన్ను అభినందిస్తూ, నీ రూపాన్ని చూస్తూ వుండే భక్తుల హృదయాంతరాళాలలో నీవెప్పుడూ ప్రకాశిస్తూ వుంటావు. సర్వ హృదయుడవై యుండికూడ నిన్ను భజించని వారికి దూరంగా వుంటావు. భక్తులకు పూర్ణస్వరూపంగా గోచరిస్తావు. హే గురుమూర్తీ! మమ్ములను అనుగ్రహించు అని ప్రార్థించి నిత్యానందుడు ఆ యోగుల కథలను చెప్పసాగినాడు.



## శ్రీస్వామి మయూరానంద సరస్వతి (మోరేశ్వరరావు జోషి)

మోరేశ్వరరావు జోషి అనునతడు సోపార అనే గ్రామములో వుండేవాడు. అతను శాస్త్ర, పురాణ అధ్యయనం చేసిన గొప్ప పండితుడు. సంగీతములో కూడ అతనికి ప్రావీణ్యము కలదు. చాలా అద్భుతంగా కీర్తనలు, సంకీర్తనము చేసేవాడు. చక్కటి ఉపన్యాసకుడు. చిన్నతనము నుండి జపతపాదులను అనుష్ఠానము చేయుచున్న ఉత్తమ బ్రాహ్మణుడు. శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ వారిని గురించి వారి లీలలను గురించి పూర్తిగా విని ఆయన దర్శనం చేసుకోవాలనే కోరికతో వున్నాడు. క్రమక్రమంగా అతని అనుష్ఠానములో కూడ పూర్తిగా శ్రీస్వామియే ప్రవేశించారు.

ఒకసారి శ్రీ అక్కల్‌కోట శ్రీస్వామి యితనిని అనుగ్రహించి స్వప్నములో దర్శనమిచ్చారు. ఆ దివ్య మంగళమైన తేజోమూర్తి దర్శనమైన క్షణం నుండి అతని మనస్సులో అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామిని దర్శించాలనే కోరిక అధికమైనది. రెండవరోజున ఎలాగైనాసరే శ్రీస్వామిని దర్శించాలని, దర్శనం అయ్యేవరకూ భోజనం చెయ్యనని, తన భార్య గోపికాబాయితో చెప్పి అక్కల్‌కోటకు బయలుదేరినాడు. అది మండువేసవి. భోజనం లేకుండా చాలా వ్యయప్రయాసల కోర్చి అక్కల్‌కోటకు చేరాడు. శ్రీస్వామి ఆ సమయంలో దగ్గరలోనున్న ఒక కొండపైన తన శిష్యులతో, భక్తులతో కూర్చుని వున్నారు. మఠంలో విచారించి శ్రీస్వామివారు కొండపైన ఉన్నారని తెలిసి జోషి అక్కడకు బయలుదేరాడు. శ్రీస్వామి జోషి రాకను గ్రహించి ప్రక్కన వున్నవారితో “ఇతనెంత వెర్రివాడు. మొన్నటిరాత్రి నేనతనికి దర్శనమిచ్చినా తృప్తిచెందక, సోపారా నుండి ఆహార పానీయములు లేకుండా నా దర్శనమునకు వచ్చుచున్నాడు. ఇంతదూరం రావడం ఎందుకు?” అన్నారు. అక్కడున్న వారికి శ్రీస్వామి ఎవరిని గురించి అలా అంటున్నారో అర్థంకావడంలేదు. ఈలోగా జోషి అమితమైన దాహం వేసినా, శ్రీస్వామి దర్శనం అయ్యేవరకు నీళ్ళు కూడ త్రాగవద్దని నిర్ణయించుకుని అలాగే కొండపైకి రాసాగాడు. అతనిని చూపి శ్రీస్వామి “అదుగో! ఆ పిచ్చివాడు వస్తున్నాడు” అన్నారు. కొద్దిసేపటికి జోషి శ్రీస్వామి వద్దకు వచ్చాడు. తాను స్వప్నంలో దర్శించిన ఆ దివ్యమూర్తిని భౌతికంగా చూచి, తృప్తిచెంది, ఆనంద పారవశ్యముతో శ్రీస్వామికి పాదాభివందనం చేశాడు. “ఓ జోషీ! ఎంతటి పిచ్చివాడవయ్యా! నీవు యింత శ్రమ పడకుండా నేనే మొన్న నీ వద్దకు వచ్చి దర్శనమిచ్చానుకదా! స్వయంగా చూడాలని వచ్చావా! సరే చాలా సంతోషం. ఇంక వెంటనే ఇంటికి వెళ్ళు. నీవు తిరిగి వచ్చేంతవరకూ అన్నపానీయాలు




ముట్టకూడదని నీ భార్యకూడా పూజాగృహం ముందు కూర్చొని వుంది. నీవు తక్షణమే తిరిగి వెళ్ళకుంటే ఆమె పరిస్థితి చెడుతుంది" అని శ్రీస్వామి అన్నారు. శ్రీస్వామి కృపకు, దర్శనానికి సంతోషించినా, వెంటనే ఇంటికి తిరిగి వెళ్ళవలసి వచ్చినందుకు బాధపడి, తాను తెచ్చిన వస్తువులతో శ్రీస్వామికి పాదపూజచేసి, తీర్థమును పుచ్చుకొని శ్రీస్వామిని శెలవు కోరాడు. శ్రీస్వామి అనుమతినిచ్చి అతను వెనుకకు తిరగగా "ఒక్క క్షణం ఆగు!" అని రెండు జతల పాదుకలు ప్రసాదించింది. వాటిలో ఒక జత ఇత్తడిది, రెండవ జత రాతిది. "నీవు అదృష్టవంతుడవు. నీ కుటుంబము సౌఖ్యముతో వుంటుంది. ఈ పాదుకలను జాగ్రత్తగా దాచుకో! ఇందులో రాతిపాదుకలను నీ సమాధిపైన ప్రతిష్ఠించవలెను. శ్రద్ధగా హరినామ సంకీర్తనము గావించవలెను. అది ఆపకుము. నీ వంశములో యిది తరతరములుగా సాంప్రదాయముగా వుండిపోవును. నీవు నీ ఆఖరి జీవితంలో ఆశ్రమ జీవితం గడిపెదవు" అన్నారు. జోషి శ్రీస్వామి ఆజ్ఞప్రకారం ఇంటికి తిరిగి వెళ్ళాడు. ఆ మహాపురుషుడి దర్శనంతో, కృపతో తన భర్త యింటికి తిరిగి వచ్చినందుకు ఆనందముతో తన ఉపవాసమును విరమించినది. ఆయన ప్రతిదినము భక్తి, శ్రద్ధ, విశ్వాసములతో ఆ పాదుకలను పూజించి, నిరంతరము హరి కీర్తనలు చేయుచు గొప్ప ఆధ్యాత్మిక సాధకుడుగా మారినాడు. చాలాకాలము తరువాత యితని భార్య చనిపోయినది. జోషి శ్రీస్వామివారి ఆజ్ఞానుసారం సన్యాసాశ్రమం స్వీకరించి, శ్రీస్వామి మయూరానంద సరస్వతి అనే పేరుతో ప్రసిద్ధి పొందినాడు. తన 75వ ఏట ఒకరోజు అర్ధరాత్రి పద్మాసనములో కూర్చొని, శ్రీస్వామి సమర్థులను ధ్యానిస్తూ సమాధి చెందినారు. అతని సమాధిపైన ఈ రాతిపాదుకలు ప్రతిష్ఠింపబడినవి. ఇత్తడి పాదుకలు అతని వంశములో నిరంతరము పూజింపబడుచున్నవి. అతని వంశములోని వారందరు కీర్తనకారులైరి. శ్రీస్వామి సమర్థుల మాట నిత్యము, సత్యము, నిత్య శాసనము. జోషి వంశములో నేటికీ కీర్తనా సాంప్రదాయకము కొనసాగుచున్నది. అతని సమాధి ఒక పుణ్య తీర్థమైనది. అనేకమంది భక్తులు నిత్యము దర్శించి ఆనందించుచున్నారు.

## శ్రీ నానారేఖే జోషి

శ్రీ నానారేఖేజోషి అనువారు అహమ్మద్ నగర్ నివాసి. అతను శ్రీస్వామి సమర్థులకు అత్యంత ప్రియమైన భక్తుడు. ఒకసారి ఆయన కోరికపై శ్రీస్వామి సమర్థులు స్వయంగా అహమ్మద్‌నగర్ వెళ్ళి అక్కడ ఒక పీఠం స్థాపించారు. జోషి గొప్ప జ్యోతిష పండితుడు. ఆయనకు పింగళపక్షి భాష తెలుసునని



జనులు అనుకోసాగారు. ఆ భాష తెలిసినవారు భవిష్యత్ చక్కగా చెప్పగలరని ఒక విశ్వాసము. భక్తివలన అతను శ్రీస్వామి సమర్థుల జాతకచక్రం తయారుచేసిరి. దానిని తీసుకొని అక్కల్‌కోటకు వెళ్ళి శ్రీస్వామికి సమర్పించెను. శ్రీస్వామి దానివైపు చూడలేదు. కాని జోషి తీసుకున్న శ్రద్ధకు, శ్రమకు సంతోషించిరి. జనన మరణాలకు అతీతుడైన మహాయోగి సద్గురు మౌళికి జాతకముతో పనిఏమి? శ్రీస్వామి జోషిని ఆశీర్వదించి తమ ఆత్మస్వరూప పాదుకలను ప్రసాదించిరి. జోషి వానిని తీసుకొని ఆనంద పారవశ్యముతో శ్రీస్వామికి పాదాభివందనం చేసి అహమ్మద్‌నగర్ చేరి ఆ పాదుకలను మఠమునందు స్థాపించి వాటిని పూజించి తరించెను. నేటికీ అహ్మద్‌నగర్‌లో ఆ పాదుకలను దర్శించి అనేకమంది తరించుచున్నాడు.

## శ్రీ అవధూత కాలాబువ

పండరీపురములో శ్రీ విష్ణునారాయణ్ ఉరఫ్ కాలాబువ అని పిలువబడే గొప్ప పుణ్యపురుషుడు, అవధూత వుండేవారు. అతను నిరంతరము ప్రపంచము నుండి విముక్తుడై ఏకాంతముగా దైవసాధన చేస్తుండేవాడు. అతను అప్పుడప్పుడు బాలునివలె, ఉన్మత్తునివలె యితరులకు అర్థంకాని వింతచేష్టలు చేస్తుండేవాడు. చూచువారికి ఆయన ప్రవర్తన బహువిచిత్రముగా కనిపించేది. అందువలన అతనిని సామాన్య జనులంతా పిచ్చివాడనుకొనేవారు. భక్తి సాంప్రదాయము తెలిసినవారు అవధూత అనుకునేవారు. అతనిపై శ్రద్ధ కలిగినవారు పలుకరించినప్పుడు, కాలము పరమదైవమని, దానికున్న శక్తి చాలా గొప్పదని, కాలము దుఃఖకరము, ఆనందకరము అయిన సమస్త కారణములను తనలో దాచుకొని మానవునికి ఎల్లప్పుడూ నూతన ఉత్తేజాన్ని కలిగిస్తుందని చెబుతుండేవారు. అందుకే అతనిని అందరూ కాలాబువా అని పిలిచేవారు.

ఒకసారి ఆయన ఇద్దరు బ్రాహ్మణ బాలురను అకారణముగా ముఖముమీద కొట్టినారు. వారికి చాలా దెబ్బ తగిలినది. ఆ పిల్లల తండ్రి మమలతదారు రానడేకు కాలాబువాపై ఫిర్యాదు చేసినాడు. రానడే ఆ ఫిర్యాదును పురస్కరించుకుని కాలాబువాను పిలిపించి సంజాయిషీ కోరినాడు. దానికి కాలాబువా “కాలము పరమ దైవము. సర్వమునూ కాలము మ్రింగివేయును, సర్వమునూ దహించును” అన్నాడు. అంతట రానడే యితడు నిజముగా పిచ్చివాడేనని భావించి పూణాలోని ససూన్ హాస్పిటల్‌కు వైద్యమునకై పంపినాడు. అక్కడ బ్రహ్మనిష్ఠాపరుడైన వామనబువ ఈయనను చూచెను. వీరిలోని దివ్యతేజస్సునుచూచి వీరు సామాన్యులు కారని, గొప్ప పుణ్యపురుషులని గ్రహించెను. తన పలుకుబడిని ఉపయోగించి వారిని విడుదల చేయించినారు.

హాస్పిటల్ నుండి విడుదలైన వెంటనే శ్రీ వామనబువా కాలాబువాను "మహాత్మా! మీరు యోగపురుషునివలె వున్నారు, కాని మీ చేష్టలు వింతగా వున్నవి. తాము ఏ సాంప్రదాయమునకు చెందినవారు?" అని వినయముగా అడిగిరి. అందుకు కాలాబువ చిరునవ్వు నవ్వి "నేను దత్త సాంప్రదాయకుడను. మీరుకూడా అదే సాంప్రదాయములోనివారుకదా!" అనిరి. శ్రీ వామనబువా వారికి అన్నపానీయములను సమకూర్చి, ప్రయాణమునకు ఏర్పాట్లు చేసి పండరీపురమునకు పంపిరి. అదే సమయములో కాలాబువాపై పండరీపురములో మమలతదారునికి ఫిర్యాదు చేసిన బ్రాహ్మణుడు, శ్రీస్వామి సమర్థులను దర్శించుటకై అక్కల్‌కోటకు చేరినాడు. శ్రీస్వామి సమర్థులను దర్శించి, పాదాభివందనము చేయుగనే శ్రీస్వామివారు ఆ బ్రాహ్మణుని చూచి "ఎందుకయ్యా, నీకు మామీద యింత కక్ష" అన్నారు. అతనికి తాను కాలాబువాపై చేసిన నేరారోపణ గుర్తుకు వచ్చినది. దానినే శ్రీస్వామి హెచ్చరించినారని గ్రహించి, తన తప్పును తెలుసుకుని, వారు వీరూ ఒక్కరేనని తలచి "స్వామీ! నా తప్పును క్షమించండి, మీకు యిబ్బంది కలిగించాను" అని ప్రార్థించాడు. అతను శ్రీస్వామి ఆశీస్సులను తీసుకుని పండరీపురమునకు వెళ్ళిపోయినాడు. కాలాబువా వంటి మహాత్ములు ఎవరికి ఏమి చేసినా వారి మేలుకోసమే. ఆ పిల్లలను కొట్టడంవలన గొప్ప ఆపద తొలగెను. తద్వారా కొట్టడం కూడా వారి మంచికోసమేకాని వేరేమికాదు అని తెలిసెను. శ్రీస్వామి సమర్థులను సేవించి వచ్చిన బ్రాహ్మణుడు శ్రీ కాలాబువాను గౌరవముగ చూచుచుండెను.

విద్యాసాగరా! శ్రీస్వామి అనేక చిత్ర విచిత్రములైన అనుభవాలను కలిగిస్తుంటారు. రాబోవు అధ్యాయములలో మరికొందరు మహాత్ముల గురించి చెప్పుకొందాం.

***ప్రేమ స్వరూపా! స్వామి సమర్థా***
***పూర్ణావతారా ! సద్గురు మౌళీ***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది ఐదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"జయగురు జయగురు

సచ్చిదానంద-సచ్చిదానంద-స్వామి సమర్థా"

# శ్రీ అక్కల్‌కోట

# స్వామి సమర్థ లీలామృతము

## నలుబది ఆరవ అధ్యాయము

### బ్రహ్మచారి వామనబువా

విద్యాసాగరా!

దేహధారులెల్లప్పుడు స్వతంత్రులు కారు. వారు దేవదేవుడైన ఆ పరమేశ్వరునకు అధీనులు. పరమేశ్వరుడు వారిని తన ఇష్టము వచ్చినట్లు ఆడిస్తాడు. సుఖసంతోషాలు కలిగిస్తూ ఉప్పొంగిపోయేలా చేస్తాడు. దుఃఖాలు కల్పించి కృంగదీస్తుంటాడు. అయితే దేహి ఎల్లవేళలా దేవదేవునిలో లయమైయుంటే వీటిని అధిగమించి నిశ్చలస్థితి నొందగలడు. ఈ స్థితిని పొందటానికి సద్గురు ప్రబోధము, అనుగ్రహము కావలసియున్నది. దానిని పొందడమే మానవ జీవిత పరమావధి. దానికై జీవించాలి - తపించాలి - తరించాలి అని శ్రీ నిత్యానందయోగి వామనబువా వృత్తాంతమును చెప్పసాగిరి.

విద్యాసాగరా! శ్రీస్వామి సంచారము చేయుచు ద్వారకకు వెళ్ళినారు కదా! అక్కడ రావూజీవైద్యను అనుగ్రహించినారు. అతను అహ్మద్‌నగర్‌జిల్లా వంబూరి గ్రామనివాసి. అతనికి రామ్‌వైద్య, విశ్వనాథ్‌వైద్య అను యిద్దరు కుమారులు కలరు. వీరంతా దత్తోపాసకులు. వీరి ఇలవేల్పు సప్తశృంగిమాత. మహాత్ములయందు, వారి లీలలయందు విశ్వాసము కలిగినవారు. వారి వంశములో వైద్యము పరంపరగా వచ్చుచున్నది. వీరు నియమ నిష్ఠలు కలిగిన ఆచారవంతులు. ఈ విశ్వనాథ వైద్యకే మాణిక్యనగర్‌లో శ్రీస్వామి సమర్థుల దర్శనము కలిగినది. శ్రీ మాణిక్య ప్రభువులు స్వయంగా వీరికి శ్రీస్వామి దర్శనం చేయించారు. వీరి సోదరుడైన రామ్‌వైద్య కుమారుడే వామనవైద్య. ఇతనుకూడ గొప్ప దత్తాత్రేయ భక్తుడు. ఆయన వివిధ రకములైన ఉద్యోగములను

చేయుచు, చాలా గ్రామాలు తిరిగినాడు. ఆయా సందర్భములలో అనేక సాధువులను, ఫకీర్లను కలుసుకుని, వారితో వేదాంత విషయ చర్చలు చేసేవాడు. ఆ చర్చలవలన ఆయనకు సంతృప్తి కలుగలేదు. ఒకప్పుడు తన తల్లితో కలిసి పూణేలో వుండగా, ఒక బ్రాహ్మణుడు వామన వైద్యతో "సద్గురు కృపలేని జీవితం వ్యర్థం" అన్నాడు. వెంటనే వామన్ "అలాంటి సద్గురువు నాకెక్కడ లభ్యమగునో దయచేసి తెలుపుమ"ని కోరెను. ఆ బ్రాహ్మణుడు అక్కల్‌కోట శ్రీస్వామి సమర్థులను గురించి కొంతవరకు తెలిపి "ఆయనను దర్శించి ఆ సద్గురు కృపకు పాత్రుడవైనచో నీ జన్మ తరించు"నని చెప్పెను. అంతేకాదు, ఆయన సాక్షాత్తు నీ ఆరాధ్యదైవమైన శ్రీ దత్తాత్రేయుని అవతారమే అన్నాడు. వామన్ మనస్సుకు ఆ మాటలు ఎంతో ఆనందం కలిగించినవి. వెంటనే అతని మనస్సునకు తన పినతండ్రి ఎప్పుడో చెప్పిన శ్రీస్వామి విషయములు గుర్తుకు వచ్చినవి. వెంటనే శ్రీస్వామిని దర్శించుకోవాలని నిశ్చయించుకుని అక్కల్‌కోట బయలుదేరినాడు.

1872వ సంవత్సరములో యిది జరిగినది. వామన్ వైద్య అక్కల్‌కోట చేరుసరికి, శ్రీస్వామి అచ్చట లేరు. విచారించగా సమీప గ్రామమైన "హోండే"కు వెళ్ళినారని తెలిసినది. అక్కడికి వెళ్ళాలని వామన్ బయలుదేరగా ఆ గ్రామము వెలుపలనున్న నదికి వరదవచ్చి, నదిని దాటు మార్గములేక చాలా నిరాశకు గురియైనాడు. కాని నదికి అవతల ఒడ్డున శ్రీస్వామివారి దివ్యమంగళ రూపము కనిపిస్తుండగా, వామనబువ నది యివతలనుండే ఆయనకు నమస్కరిస్తూ నిలుచున్నాడు. విచిత్రముగా శ్రీస్వామి ఆ నది నీటిపైన నడచివచ్చి వామనబువ ఎదుట సాక్షాత్కరించిరి. వామనబువ పట్టరాని ఆనందముతో శ్రీస్వామివారికి పాదాభివందనం చేసినాడు. శ్రీస్వామి అతనిని దీవించి "నీవు నా బిడ్డవి! నా దగ్గర వుండి నన్ను సేవించుకో! అన్ని బంధములు వదలుకుని సన్యాసం స్వీకరించు. నా ఆశీస్సులు నీకెల్లవేళలా వుంటాయి. నీకు తప్పక బ్రహ్మనిష్ఠ లభిస్తుంది" అన్నారు. వెంటనే వామనబువా తన దగ్గరగల వస్తువులు, వస్త్రములు పారవైచి చిన్న కౌపీనము ధరించి శ్రీస్వామికి నమస్కరించినాడు. శ్రీస్వామి అతనికి దీక్షనిచ్చినట్లు గుర్తుగా తమ కమండలము యిచ్చి ఆశీర్వదించిరి.

వామనబువా శ్రీస్వామి సమర్థులను భక్తిశ్రద్ధలతో సేవించుచుండెను. ప్రతి సంవత్సరము రెండు మూడు పర్యాయములు అక్కల్‌కోట వచ్చెడివాడు.



1873లో వామనబువా నాసిక్ వెళ్ళినాడు. విద్యాసాగరా! అప్పుడు స్వర్ణయోగ సన్యాసికథలో వారికీ వీరికీ ఘోలాప్ శ్రీస్వామి సమక్షంలో జరిగిన చర్చను తెలుసుకున్నావు కదా! అక్కడి నుండి త్ర్యంబకం వెళ్ళి అక్కడ నుండి తమ యిలవేల్పు సప్తశృంగి దేవతను పూజించటానికి 'వాణి'కి వెళ్ళాడు. అక్కడ అమ్మవారిని పూజించుకుని ప్రసాదముగా అమ్మవారి నోటిలో నుంచబడిన తాంబూలము నిమ్మని కోరగా, ఆలయ పూజారులు అది ఆచారం కాదని నిరాకరించిరి. అప్పుడు వామనబువా "అమ్మా! సప్త శృంగిమాతా! నీవు మా ఇలవేల్పువు! నాపైన నీకు దయయున్నచో నాకు నీ నోటిలోని తాంబూలమును ప్రసాదించుము!" అని ప్రార్థించినాడు. అందరూ ఆశ్చర్యముగా చూచుచుండగా ఆ తాంబూలము వచ్చి వామనబువా చేతిలో పడినది. వామనబువా అమ్మవారి కరుణా కటాక్షమునకు అమితానంద పరవశుడైనాడు. అక్కడనుండి తిరిగి నాసిక్ వచ్చాడు. మంగళవేడాలో శ్రీస్వామిచేత అనుగ్రహించబడిన యశ్వంతరావు అప్పటికే అక్కడ శ్రీదేవ్ మహరాజ్‌గా ప్రసిద్ధిచెంది వున్నారు. వామనబువా ఈసారి వారిని దర్శించి, వారిని శ్రీస్వామి అనుగ్రహించిన లీలలను తెలుసుకుని, తాను పొందిన అనుభవమును తెలుపుకుని తాను పండరీపురం మీదుగా అక్కల్‌కోట వెళ్ళుచున్నట్లు తెలిపినారు. అప్పుడు శ్రీదేవ్ మహరాజ్ తన విషయములను శ్రీస్వామికి విన్నవించుకోవాలని ఒక ఉత్తరము వ్రాసి, వారికి తన పాదాభివందనములు కూడ తెలుపమని పంపినారు. దానిని తీసుకుని, గోదావరి జలములను తీసుకుని శ్రీ వామనబువా పండరిచేరి, ఆ జలములతో పాండురంగని పాదాలను అభిషేకించినాడు. అప్పుడు అతనికి పాండురంగనిలో శ్రీస్వామి సమర్థులు దర్శనమిచ్చారు. అతను ఆనంద పారవశ్యముతో శ్రీస్వామి సమర్థుల నామం చేసుకుంటూ అక్కల్‌కోటకు చేరినాడు. శ్రీస్వామికి పాదాభివందనం చేశాడు. శ్రీస్వామి అతనిని చూస్తూనే "నీవు సప్తశృంగి దేవతవద్ద తాంబూలము కొరకు మొండిపట్టు పట్టినావు. నేను అక్కడికొచ్చి నీకు తాంబూలము నివ్వవలసి వచ్చినది. పండరిలో గోదావరి జలములను స్వీకరించితిని. "కుండ యింకా పచ్చిగనే వున్నది". బాగుగా కాల్చవలెను. తీర్థయాత్ర నిమిత్తం ఎన్ని ఊళ్ళు తిరిగినా నీకేమి ఫలితం! ఒకేచోట వుండి స్థిరంగా, నిశ్చల మనస్కుడవై నీలోని అంతరాత్మను దర్శించు, నీలోనే సర్వ పుణ్య, తీర్థ క్షేత్రము, సకల దేవతలు గలరు" అని బోధించిరి.




శ్రీస్వామి సలహాపై వామనబువా చాలాకాలము అక్కల్‌కోటలోనే వుండి, తీవ్రమైన ధ్యానము, జపము, ఆధ్యాత్మిక సాధన చేసినాడు. పిమ్మట శ్రీస్వామివారి అనుమతి తీసుకొని అక్కల్‌కోట నుండి వెళ్ళినాడు. 1876లో వామనబువా ఆరోగ్యం క్షీణించినది. ఎన్నో వ్యాధులు, బాధలు కలిగినవి. అవి భరించలేక తనను రోగవిముక్తుని చేయమని ప్రార్థిస్తూ శ్రీస్వామికి లేఖ వ్రాసి పంపినాడు. శ్రీస్వామినుండి ఏ విధమైన సందేశము రాలేదు. తన ఆరోగ్యంలో కించిత్తైనా మెరుగు కనిపించలేదు. ఇంక తట్టుకోలేక ఆత్మహత్య ఒక్కటే శరణ్యమని నిశ్చయించుకుని 'సురసాగర్' అనే చెరువులో దూకటానికి వెళ్ళినాడు. అతను చెరువులో దూకుచుండగా హఠాత్తుగా శ్రీస్వామి ప్రత్యక్షమై అతనిని చేయిపట్టుకుని ఆపి, చెంపపై గట్టిగా కొట్టినారు. "నీ అప్పులు తీర్చకుండా తప్పించుకుందామనుకున్నావా? క్రిందటి జన్మలో నీవు చేసుకున్న కర్మల పలితమే ఈ జన్మలో నీవనుభవిస్తున్న ఈ కష్టసుఖాలు. క్రిందటి జన్మలో వేసికొన్న విత్తనముల పంట యిప్పుడు కోసుకొనవలయును. మహాపురుషులకు కూడ దేహ ప్రారబ్ధ కర్మలను అనుభవించక తప్పదు. ఆ అప్పులు తీర్చవలసినదే. ఆత్మహత్య చేసికొనుట మహాపాపము. అందువలన ఆ పూర్వకర్మ నశింపదు. నీ ఖాతాలో అలాగే వుంటుంది. రాబోవు జన్మలో మరింత పాపఫలితం ఎక్కువ అనుభవించవలసి యుండును. కావున నీవు ఓర్పుతో, దైవముపట్ల విశ్వాసముతో, ఆత్మస్థైర్యముతో ఆ రోగబాధలను అనుభవించుము. నీ జీవిత లక్ష్యం ఆత్మసాక్షాత్కారమేగాని, ఆత్మహత్యగాదు. నిప్పులో వేసి పుటముపెట్టి, సుత్తిదెబ్బలు కొట్టినగాని బంగారములోని మాలిన్యము పోయి అది కాంతివంతముగా ప్రకాశింపదు. నిన్ను నీవు తెలుసుకొని, జ్ఞానివై, నీలో దాగియున్న చైతన్యమును, దివ్యత్వముగ పరిపక్వత నొందించుకుని, నీవు దైవకుమారునిగా పిలువబడు అర్హత సంపాదించుకొనుము. నీ బాధలను గురించి నాకు తెలియదనుకొంటివేమి? మానవుడు ఎదుర్కొను కష్టనష్టములు సమ్మెట దెబ్బలవంటివి. కనుక చిత్తశుద్ధి కలిగి నీ సాధనను కొనసాగించు" అని ఆశీర్వదించిరి. అప్పుడు వామనబువా శ్రీస్వామి పాదములపైబడి, కన్నీటితో ఆ పాదములు కడిగినారు. శ్రీస్వామి వామనబువా వద్దనుండి అదృశ్యమైరి. వారి వాక్కులు వామనబువాకు ఎంతో ధైర్యమును, ఉత్సాహమును, ఆనందమును కలిగించినవి. అతను తిరిగి యింటికి వెళ్ళినాడు. క్రమముగా అతని ఆరోగ్యం మెరుగై, పూర్తిగా రోగవిముక్తుడైనాడు. అప్పుడు శ్రీస్వామికి తన కృతజ్ఞతలు తెలుపుటకై అక్కల్‌కోట వెళ్ళినాడు. ఇప్పుడు వామనబువా పుటము పెట్టిన



మేలిమి బంగారమువలె, పరిపక్వత నొందిన మహాజ్ఞాని. తన శారీరక బాధలనేకాక, ఆత్మప్రక్షాళనము కూడా చేసి శ్రీస్వామిని దర్శించి, సేవించి తరించినాడు.

వామనబువా చక్కటి కవి. శ్రీస్వామి లీలలను, మహిమలను అనేకము స్వయముగా రచించినవాడు. గణేశ్ అనే అంధబాలునకు శ్రీస్వామి నేత్రప్రదానము చేయడం, ఆ బాలుడు బ్రాహ్మణ పండితుల ప్రశ్నలు – వానికి సమాధానములు శ్రీస్వామి అనుగ్రహముతో చెప్పిన వింతైన సందర్భములో వామనబువా అచ్చటనే యున్నాడు. అంతేకాక 'రాధ' యను వేశ్య శ్రీస్వామిని పరీక్షించుటకై వచ్చిన ఘట్టములో వీరచ్చటే వున్నారు. తోటి మహాత్ములతోను, భక్తులతోనూ సంప్రదించి వారి వారి అనుభవములను తెలిసికొని, శ్రీస్వామివారి అనుగ్రహంతో మరాఠీలో శ్రీస్వామి సమర్థుల చరిత్రను "శ్రీగురు లీలామృతము" అను పేర 56 అధ్యాయముల గ్రంథమును రచించెను.

ఆ గ్రంథమును వేలాది భక్తులు నిత్యపారాయణ చేయుచున్నారు. ఈ విధముగా శ్రీ వామనబువా శ్రీస్వామి సేవయేకాక, భక్తులకు కూడ ఘనమైన మేలు చేసినారు. వామనబువా శేష జీవితమంతయూ ధ్యానములో గడిపి, తుదకు ఆత్మసాక్షాత్కారమును పొందినారు. భక్తులందరు ఆయనను 'బ్రహ్మనిష్ఠ వామనబువా బ్రహ్మచారి" అని పిలచెదరు. శ్రీస్వామి సమర్థులు స్వయముగా తీర్చిదిద్దిన మహాపురుషుడు శ్రీ వామనబువా. ఈయన 1901లో సమాధి చెందినారు అని నిత్యానందయోగి తెలిపి మిగిలిన లీలలను చెప్పసాగినాడు.

***అంబ పరమేశ్వరి – అఖిలాండేశ్వరి***
***ఆది పరాశక్తి – పాలయమాం***
***శ్రీ భువనేశ్వరి – రాజరాజేశ్వరి***
***ఆనంద రూపిణి – పాలయమాం***

*ఇది విద్యాసాగర – శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది ఆరవ అధ్యాయము*** *సంపూర్ణము*



 



ఓం శ్రీ సాయిరాం

ఓం శ్రీస్వామి సమర్థాయ నమః

ఓం శ్రీ సద్గురు శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది ఏడవ అధ్యాయము

### శ్రీ స్వామి సుత

శ్రీ స్వామిసుత పూర్వాశ్రమములో పేరు శ్రీహరిభావు. రత్నగిరిజిల్లాలోని రాజపూరు తాలూకా 'ఇటియా' గ్రామములో 'శ్రీ దజిబా, శ్రీమతి కాకుబాయి' అను పుణ్యదంపతులు కలరు. వారు మరాఠ వంశీకులు. మంచి గౌరవ సాంప్రదాయముగల భూస్వామి. వారికి ఏడుగురు కుమారులు, నలుగురు కుమార్తెలు. వారిలో హరిభావు ఒకరు. వీరు ఎనిమిది సంవత్సరముల బాల్యములోనే చదువుకొరకు బొంబాయి వెళ్ళి బంధువుల ఇంటిలో వుండి చదువుకొనినారు. చదువు పూర్తి అయిన పిమ్మట వారికి బొంబాయి మునిసిపల్ కార్పొరేషన్ ఆఫీసులో ఉద్యోగము లభించినది.

ఉద్యోగము చేయుచుండగనే హరిభావు తన సహోద్యోగి, స్నేహితుడు శ్రీ గజానన్ కతారి సాహసించి ఉమ్మడిగా షేర్ వ్యాపారము చేయుట ప్రారంభించిరి. కొంతకాలము గడచిన పిమ్మట ఆ వ్యాపారములో గొప్ప నష్టము వచ్చినది. దానికై కొన్ని అప్పులుగూడ చేయవలసి వచ్చినది. ఆ అప్పులు తీర్చలేకపోవటంచేత, అప్పులవాళ్ళు వత్తిడి చేయసాగారు. వారు తమ మిత్రుడు, తోటి వ్యాపారి అయిన లక్ష్మణ్ పండిట్ అనువాని సహాయము కోరినారు. ఆ సమయంలో లక్ష్మణ్ పండిట్‌కు కొన్ని ఆర్థిక ఇబ్బందులుండెను. అందువలన అతను బాధపడి "నేనే కొన్ని యిబ్బందులలో వున్నాను. లేకుంటే తప్పక సహాయం చేసేవాడిని. అన్యదా భావించవద్దు" అన్నాడు. వారు తమ వ్యాపారములో కలిగిన నష్టం గురించి వివరంగా తెలిపి, ఏ విధంగా యీ ఆర్థిక యిబ్బందుల నుండి బయటపడాలో తెలియటంలేదు అన్నారు. అప్పుడు లక్ష్మణ్ పండిట్



వారికి శ్రీస్వామి సమర్థుల లీల గురించి తెలుపుతూ "నేను గోవిందజీ మాధవజీ వారి యింటివద్ద పూజాది కార్యక్రమములు చేయిస్తుంటాను. వారు ఒకసారి అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థులను దర్శించి వారి అనుగ్రహమును పొందినారు. వీరికి శ్రీస్వామి తమ పాదుకలు ప్రసాదించినారు. అంతేకాక వారి యింట్లో వంటపనిచేసే కానోజి అను బ్రాహ్మణునికి పదివేల రూపాయలు లభిస్తాయని ఆశీర్వదించినారు. అతనికి అలాగే ఆ ధనం లభించినది. ఆ మహాత్ముని వాక్కులు, లీలలు అమోఘములు. కనుక మీరుకూడ ఒకసారి అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థులను దర్శించినచో మీరు ఈ సమస్యలన్నింటి నుండి బయటపడగలరని నా విశ్వాసము. నేనుకూడ వెళ్ళి వారిని దర్శించాలని, తగిన సమయం కోసం ఎదురు చూస్తున్నాను" అని చెప్పినాడు. "లక్ష్మణ్‌జీ మీరు వెళ్ళేటప్పుడు, మీవెంట మమ్ములనుకూడ తీసుకు వెళ్ళండి" అని చెప్పి హరిభావు, కతారి శెలవు తీసుకుని వెళ్ళారు.

కొన్ని రోజుల తరువాత అదృష్టవశాత్తు లక్ష్మణ్ పండిట్‌కు షేర్ బజారులో ఒకే పాటలో రెండు వేల రూపాయలు లాభం దొరికినది. ఆ తరువాత వెంటనే అక్కల్‌కోట వెళ్ళవలెనని నిర్ణయించుకొనెను. ఆ విషయము హరిభావునకు తెలిపెను. ముగ్గురు కలసి బయలుదేరి అక్కల్‌కోట చేరిరి. వీరు వెళ్ళుసరికి శ్రీస్వామి సమర్థులు రాజప్రసాదములో నుండిరి. ఆయన అప్పుడే భోజనం ముగించి విశ్రాంతి తీసుకొనుచుండిరి. శ్రీస్వామి భుక్తశేషమును ప్రసాదముగా భక్తులెవరికైనా పంచుటకు చోళప్ప, ఆయన అల్లుడు శ్రీపాదభట్ బయటకు తెచ్చి చూస్తున్న సమయంలో ముందుగా హరిభావు అక్కడకు చేరినాడు. శ్రీస్వామివారి ప్రసాదము ఆయనకు లభించినది. ఆయన ఎంతో అదృష్టవంతుడు. ఆ తరువాత గజానన్ కతారి, లక్ష్మణ్ పండిట్‌కూడా అక్కడకు చేరిరి. పిదప వారు ముగ్గురు కలసి శ్రీస్వామివారిని దర్శించిరి. హరిభావునకు ఆయనను దర్శించిన వెంటనే ఒళ్ళంతా గగుర్పాటు కలిగెను. అదియొక మధురమైన అనుభూతి. అతని శరీరములో అణువణువు చైతన్యవంతమైనది. కనులవెంట ఆనందబాష్పాలు కారినవి. అతని జీవితములో యిలాంటి దివ్యమైన అనుభూతి మునుపెన్నడూ కలుగలేదు. శ్రీస్వామి వారి ముగ్గురినీ చూచి "ఓ స్టాకు బ్రోకరులారా! వేలం పాటదారులారా! ఓహో వచ్చారా! చాలా సంతోషం" అనిరి. వారు ముగ్గురూ ఎంతో ఆశ్చర్యపడి, శ్రీస్వామివారు సర్వజ్ఞులని తెలుసుకొని భక్తితో, పరిపూర్ణ విశ్వాసముతో పాదాభివందనం చేసిరి.

తరువాత శ్రీస్వామి వారితో ఒక్కొక్కరితో మాట్లాడి వారిని దీవించిరి. హరిభావుతో "ఓ కుమారుడా! నీ ఉద్యోగ వ్యవహారములన్నీ వదలి యిక్కడకు వచ్చి నాతో వుండుము. వచ్చునప్పుడు నీవద్దనున్న వెండి సామాగ్రిని కూడా తీసుకుని రా!" అన్నారు. ఆ మాటలు హరిభావునకు అర్థమైనవి. కాని వానికి శ్రీస్వామి చెప్పిన మిగతా విషయములపై ఆందోళన కలిగినది. అంతటి మహోన్నతుడైన శ్రీస్వామి తనను కుమారా! అని సంబోధించినందుకు అమితానందము కలిగినది. కాని శ్రీస్వామి చెప్పినట్లు ఉద్యోగమును, ఆస్థిని, కుటుంబమును శాశ్వతముగా వదలి వచ్చుటయా, మానుటయా? ఏమీ పాలుపోలేదు. ఆ దినము పరమ పవిత్రమైన ఏకాదశి. మరుసటిరోజు ద్వాదశి. ఏకాదశి ఉపవాసమును విసర్జించి ప్రసాదము తీసుకొను రోజు నైవేద్యము, హారతి జరిగినవి. పిమ్మట ఈ ముప్వురికి మహోన్నతమైన అదృష్టము పట్టినది. సద్గురు దేవుడైన శ్రీస్వామి సమర్థులవారే స్వయముగా హరిభావునకు అన్నము ముద్దలు అందించిరి. బేసిన్ లడ్డులను కతారికిచ్చిరి. బంగాళదుంప బజ్జీలను లక్ష్మణ్ పండితునకిచ్చిరి. ఆ తరువాత విశ్రాంతిగా కూర్చున్నపుడు వారి ముగ్గురినీ దగ్గర కూర్చుండబెట్టుకుని లక్ష్మణ పండితుని పిలచి, గోడమీద వున్న మూడు బొమ్మలను చూపించి అవి ఎవరెవరివి అని అడిగిరి. అందులకు లక్ష్మణ పండిట్ "స్వామీ! సద్గురు మౌళీ! మొదటిది మారుతిది, రెండవది శివుడు, మూడవది శ్రీరాముడిది!" అన్నాడు. "ఓ! లక్ష్మణ్ పండిట్ ఈ హరిభావు మారుతి అంశ గలవాడు. కతారి శివుని అంశ కలవాడు, నీవు శ్రీరాముని అంశ గలవాడివి. అందువలన మీరు ముప్వురు ఆ ముగ్గురు దేవతలను ధ్యానించవలెను" అని శ్రీస్వామి ఆ ముగ్గురు దేవతలమీద మూడు శ్లోకములను చెప్పిరి. ఆ తరువాత వారు తాము ఎంతో ధన్యులమని తలచి, శ్రీస్వామివద్ద శెలవు తీసుకుని బొంబాయి తిరిగి వెళ్ళిరి.

బొంబాయిలో తమ కార్యక్రమములలో నిమగ్నమైరి. కొంతకాలమునకు హరిభావు జీవితము పూర్తిగా మారిపోయినది. నిత్యజీవితముపై విరక్తి కలిగినది. సాంసారిక విషయవాసనలపై ఆసక్తి నశించినది. తిరిగి శ్రీస్వామిని దర్శించుటకు శ్రీస్వామివారు చెప్పినట్లుగా వెండి పాదుకలు చేయించుకొని అక్కల్‌కోట చేరినాడు. శ్రీస్వామి ఆప్యాయంగా ఆహ్వానించి, ఆ పాదుకలు స్వీకరించి ధరించిరి. చాలా అందముగా శ్రీస్వామివారి పాదాలలోని



చిహ్నములతోనున్న ఆ పాదుకలను ఎందరో శిష్యులు, సేవకులు ఆశించి, కోరిరి. కాని శ్రీస్వామి వాటిని ఎవ్వరికీ యివ్వలేదు. పదిహేను రోజులు వాటిని ధరించి, హరిభావును పిలచి "గత జీవితమును విసర్జించుము. ఉద్యోగమును వదిలివేయుము. అతిపెద్ద ధ్వజస్థంభముతో, బొంబాయిలో సముద్రతీరమున ఒక ఆశ్రమమును స్థాపించి తగిన భవన నిర్మాణము కావించుము" అని అతనిని కౌగలించుకొని, తండ్రివలె ఒళ్ళంతా నిమిరిరి. తన స్పర్శతో మహిమ పరచిన పవిత్ర వెండి పాదుకలను వానికిచ్చిరి. "ఈ పాదుకలను మఠములో ప్రతిష్ఠించుము. ఇవి నా ఆత్మలింగ స్వరూపము. వీనిలో దివ్యమైన ఆత్మశక్తి ప్రతిష్ఠింపబడియున్నది" అని చెప్పిరి. ఈ సంఘటన జరుగునాటి ముందురోజు రాత్రి ఒక విచిత్రమైన సంఘటన జరిగినది. అర్ధరాత్రి అందరూ నిద్రించుచుండగా శ్రీస్వామి ప్రక్కమీదనుండి లేచి బయటకు వచ్చి, హరిభావు నిద్రించుచున్న చెట్టుదగ్గరకొచ్చి "నా బాలగోవిందుడిక్కడ నిద్రపోవుచున్నాడు. ఇక్కడ నుంచి లే" అనిరి. ఆ చెట్టు గడగడ వణికినది. ఆ చెట్టులోనుండి బంతివలెనున్న ఒక వెలుగు ఆకాశములోని కెగిరిపోయెను. ఆ కలవరమునకు అక్కడ నిద్రించుచున్న హరిభావు లేచి శ్రీస్వామి పాదములపై పడినాడు. తండ్రీ కుమారులిద్దరూ చాలాసేపు మాట్లాడుకొనిరి. అంత శ్రీస్వామి తన కౌపీనము, అంగీని ఆయనకిచ్చిరి. హరిభావును "రేపు నీవు యింటికి వెళ్ళవచ్చు. నేను చెప్పినట్లు నీ క్రొత్త జీవితమును ప్రారంభించుము. నా పాదుకలు అండగా వుండి నీకు ఉన్నత జీవితమునకు మార్గదర్శకమగును. అవి నీకు రక్ష యిచ్చి మహాశక్తిని కలుగజేయును" అని దీవించి యిరువురును విశ్రమించిరి.

హరిభావు శ్రీస్వామి సమర్థులిచ్చిన పాదుకలు స్వీకరించి, తనవద్దనున్న 80 తులాల బంగారమును అమ్మి బ్రాహ్మణులకు, యితరులకు దానధర్మములు చేసి కాషాయ వస్త్రములు ధరించి ఆశ్రమ స్వీకారము చేసెను. అతనిని భక్తులందరు 'శ్రీస్వామి సుత' అని పిలువసాగిరి. ఆ పాదుకలు తీసుకొని బొంబాయి చేరినాడు. శ్రీస్వామి ఆదేశానుసారము తన భార్య మెడలోని మంగళసూత్రములతోసహా యావదాస్తినీ అమ్మివేసి దానధర్మములు చేసినాడు. తంబురా ధరించి, శ్రీస్వామివారిపై భక్తితో తాను స్వయంగా వ్రాసిన సంకీర్తనలు గానము చేయుచూ, మధురమైన తన్మయత్వంలో మునిగిపోతుండేవాడు. తన భార్య తారాబాయికి శ్వేతవస్త్రములిచ్చి ఆమెనుకూడ తనకు అనుకూలముగా




మెలగవలసినదని కోరినాడు. కాని ఆమె యింకా 20 సంవత్సరములైనా నిండని యువతి కనుక భర్తలోని ఈ హఠాత్పరిణామానికి తట్టుకొనలేకపోయినది. హరిభావు వయస్సు అప్పటికి కేవలం 25 సంవత్సరాలు. కాని గత్యంతరం లేక తారాబాయికూడ నెమ్మదిగా భర్త మార్గములోనికి వచ్చి ఒక భక్తురాలిగా మారినది. భర్తయొక్క మొండితనము వలన ఆమెలోని ఆశలు, తన భర్తను మార్చలేకపోయినవి. హరిభావు బొంబాయిలోని కామాటిపురలో ఒక మఠమును నిర్మించి, అందులో శ్రీస్వామివారి పాదుకలు ప్రతిష్ఠించినాడు. శ్రీస్వామిసుత తరచుగా అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామిని దర్శించుకుంటుండేవారు. శ్రీస్వామి వీరిని మురళీధరుని మందిరములో వుండమనేవారు. అక్కడ శ్రీస్వామిసుత ధ్యానం చేసుకుంటూ సమాధిస్థితిని పొందేవారు.

ధ్వారకానాథ్ అప్పాజీ అనే వకీలు సంతానముకొరకై శ్రీస్వామి దర్శనానికి వెళ్ళి నిద్రిస్తున్న స్వామికి హారతినివ్వగా, శ్రీస్వామి సమర్థులు అతనితో "మురళీధరుని మందిరములోనున్న హనుమంతుని పూజించకుండా, నా దగ్గరకు వచ్చావే" అని తరిమేశారు. అప్పుడు ద్వారకనాథ్ పరుగున మురళీధరుని ఆలయమునకు వెళ్ళగా అక్కడ శ్రీస్వామిసుత వున్నారు. ఆయన శ్రీస్వామిసుతను పూజించి పిదప శ్రీస్వామి సమర్థులను దర్శించిరి. ఆ వకీలు అటుపైన ఎప్పుడూ అక్కల్‌కోట వచ్చినా ముందు మురళీధరుని మందిరములో వున్న శ్రీస్వామిసుతను సేవించిన తరువాతనే శ్రీస్వామి సమర్థులను సేవించేవాడు. కొద్దికాలంలోనే ద్వారకనాథ్‌నకు పుత్ర సంతానము కలిగినది.

కొన్ని సంవత్సరముల తరువాత ఒకసారి శ్రీస్వామిసుత అక్కల్‌కోట వచ్చినప్పుడు శ్రీస్వామి సమర్థులు "నేను త్వరలో వెళ్ళిపోవుచున్నాను. తదుపరి నా బాధ్యతలు అన్నీ నీవు నిర్వహించవలెను" అన్నారు. శ్రీస్వామిసుతుడు యిది విని చాలా ఆశ్చర్యమును, విచారమును పొందెను. శ్రీస్వామి లేని లోకమును ఊహించలేక, సర్వము శూన్యమని అది చాలా భయంకర పరిస్థితి అని తలచెను. తనలో ధైర్యము విలోలంబయ్యెను. ఆ దిగులుతోనే తిరిగి బొంబాయి చేరినాడు. ఆ దిగులుతోనే అతను తీవ్రమైన అనారోగ్యం పాలైనాడు. ఈ విషయము తెలిసి శ్రీస్వామి సమర్థులు తన భక్తులైన శ్రీపాదభట్టును, కృష్ణప్పను పంపి అతనిని అక్కల్‌కోటకు తీసుకుని రమ్మనిరి. కాని శ్రీస్వామి సుతులు మొండివాడుకదా! రానని భీష్మించుకునిరి. ఇది తెలిసి శ్రీస్వామి "ఇతను ఎంత



బలహీనుడు, నా దగ్గర ఫిరంగులున్నవి. అతని ఇల్లు నాశనము చేసెదను" అని కోపముగా అరచిరి. శ్రావణ బహుళ పాడ్యమినాడు శ్రీస్వామిసుతులు సమాధి చెందిరి. ఈ విషయములు కూడా శ్రీస్వామి సమర్థులకు ముందే తెలియును. ఆ సమయములో శ్రీస్వామిసుత తల్లి కాకుబాయి అక్కల్‌కోటలోనే వున్నది. ఆమెతో "నీవు దుఃఖించకు. అతను నాకుకూడ కొడుకే! నాలోనే నీ కుమారుని చూచుకొనుము. అతడు లేని కొరత నేను తీర్చెదను, అతడు సద్గతిని పొందినాడు. ఈ సంగతి నీకు తెలియదు" అని శ్రీస్వామి సమర్థులు ఓదార్చిరి.

విద్యాసాగరా! శ్రీస్వామి సుతవలె అన్నింటిని త్యాగముచేసిన త్యాగధనుడు, దయాళుడు, రంతిదేవుడు అనువారి కథను తెలుసుకుందాము.

ఈ భరతఖండము నేలిన చంద్రవంశపు రాజులలో రంతిదేవుడు ఒక గొప్ప త్యాగశీలియైన మహారాజు. ఆయన తన సర్వసంపదలూ అడిగినవారికి లేదనకుండా దానధర్మాలు చేసి చివరికి రాజ్యంకూడ దానంచేసి అడవిలో ఒక కుటీరం ఏర్పరచుకుని నివసిస్తున్నాడు. తనకు ఎప్పటికేది లభించినా అది దైవప్రసాదంగా భావిస్తూ కాలం గడుపుతుండగా, తీవ్రమైన కరువు – కాటకం వచ్చినది. నలభై ఎనిమిది రోజులపాటు ఏమీ లభించక పస్తులుండవలసి వచ్చింది. అతని భార్యాబిడ్డలుకూడ అతనికి అన్నివిధాల సహకరిస్తూ వున్నారు. నలభై తొమ్మిదవ రోజున ఆయనకు ఆయాచితంగా పాయసం, నెయ్యి, నీరూ లభించినవి. వాటిని దైవప్రసాదంగా, తనవారితో కలసి స్వీకరించి ప్రాణాలు నిలుపుకోవాలనుకుంటుండగా, ఒక అతిథి ఆకలితో వారింటికి వచ్చి తన క్షుద్బాధ తీర్చుమని కోరాడు. అప్పుడాయన ఆ పాయసంలో సగం ఆ అతిథికి ఆహారంగా యిచ్చి, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే ఆ రూపంలో వచ్చినాడని భావించి ఎంతో సంతోషించాడు. మిగిలిన పాయసం భుజించబోయేలోపల ఒక శూద్రుడు వారింటికొచ్చి తన ఆకలిబాధను తీర్చి, తన ప్రాణాలు కాపాడమని ప్రాధేయపడినాడు. ఆ మిగిలిన ఆహారంలో సగం వానికిచ్చి, అతనిని సంతృప్తి పరచినాడు రంతిదేవుడు. ఇంక కొద్ది ఆహారము మాత్రమే మిగిలినది. దానినైన తిని తను, తన కుటుంబము ప్రాణాలు నిలుపుకుందామని సమాయత్తమగు చుండగా ఒకడు కొన్ని కుక్కలను వెంటబెట్టుకుని వచ్చి, మాకు ఆకలి బాగా వేస్తున్నది. మా ఆకలి తీర్చుమని కోరగా, రంతిదేవుడు తనవద్దగల పాయసం వారికిచ్చి, వారుకూడ శ్రీహరి స్వరూపులుగా భావించి, మిగిలిన మంచినీరు

త్రాగి ప్రాణాలు నిలుపుకుందామనుకుంటుండగా ఒక చండాలుడు, వారి వద్దకొచ్చి "అయ్యా! ఆకలితో, దాహంతో నాకు ప్రాణం పోయేట్లుంది, నన్నెలాగైనా రక్షించండి" అన్నాడు. అప్పుడు రంతిదేవుడు ఎంతో జాలిపొంది తనవద్ద తినుటకేమీ లేదని, కేవలం నీరుమాత్రమే కలదని, వాటిని అతనిచేత త్రాగించి, ఆనంద పారవశ్యంలో మునిగినాడు. ఇంతలో బ్రహ్మాది దేవతలు అతని యెదుట ప్రత్యక్షమైనారు. రంతిదేవుడు వారికి ప్రణమిల్లి వారిని అనేక విధాలుగా స్తుతించాడు. ఎంతటి కష్టకాలంలో కూడ తనకు స్వార్థం, మోహం కలుగనీయక తన భక్తిని నిశ్చలంగా వుండేట్లు చేసిన ఆ బ్రహ్మాది దేవతలకు కృతజ్ఞతలు తెలుపుకున్నాడు. అప్పుడు బ్రహ్మాది దేవతలు "రంతిదేవా! నీ మనోధైర్యాన్ని, స్వార్థ త్యాగాన్ని పరీక్షించుటకై మేము కల్పించిన మాయనుకూడ నీవు అధిగమించినావు. నీకు, నిన్ననుసరించినవారికి పరమపదాన్ని ప్రసాదిస్తున్నాము" అని ఆశీర్వదించి అదృశ్యమైనారు.

"విద్యాసాగరా! రంతిదేవునిలాగా శ్రీస్వామిసుత కూడ అంతటి త్యాగమునుచేసి, సర్వస్వమునూ దానం చేసినారు. అతనుకూడ పరమపదమును పొందినారు. శ్రీస్వామిసుత నిర్మించిన మఠమును అతని తరువాత వారి సోదరుడు ఆ కార్యాన్ని నిర్వర్తించినారు. ఆయనను శ్రీస్వామి పీఠాధిపతిగా అభిషేకించినారు. ఈ కథ తెలుపుతాను వినుము" అని శ్రీ నిత్యానందయోగి తరువాత కథను తెలుపసాగినారు.

**ప్రేమస్వరూపా - స్వామి సమర్థా**
**దత్తావతారా - స్వామి సమర్థా**
**యోగ స్వరూపా - స్వామి సమర్థా**
**యోగ యోగేశ్వరా - స్వామి సమర్థా**

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
**శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**
**నలుబది ఏడవ అధ్యాయము** సంపూర్ణము







ఓం శ్రీ సాయిరాం

ఓం గురునాథ - ఓం గురునాథా!

ఓం గురునాథ - శ్రీ దత్తాత్రేయ!

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది ఎనిమిదవ అధ్యాయము

విద్యాసాగరా!

సూర్యకాంతివలన ప్రపంచములో సర్వజీవులకు ఆహారము, ఆరోగ్యము కలుగుతుంది. అందుకే సూర్యుడిని అన్నప్రదాత అనీ లోకబాంధవుడనీ, ప్రత్యక్ష దైవమనీ పిలుస్తారు. అలాగే శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్ వారికి కూడా ఈ నామములన్నీ వర్తిస్తాయి. వారిని ఆశ్రయించి సేవించినవారికి, భుక్తి, భక్తి, ముక్తి ప్రసాదించినారు. వారి ధర్మ పరిరక్షణ కార్యం అక్కల్‌కోటను కేంద్రంగా చేసుకొని అన్ని ప్రాంతములకు వ్యాపించినది. ఈనాడు మనకు శ్రీస్వామి వారి పాదుకా మఠములు పలుచోట్ల గోచరిస్తున్నాయి. ఆనాడు శ్రీస్వామి వాటిని నిర్మించడానికి అనుగ్రహించబడిన భక్తులు, వారి శిష్య పరంపర నేటికీ ఆయా మఠములలో అత్యంత వైభవముగా పూజాది కార్యక్రమములు నిర్వహిస్తున్నారు. నేటికినీ వేలాదిమంది భక్తులు వాటిని దర్శించి తమ ఈతి బాధలను పోగొట్టుకొని, ఆధ్యాత్మిక జీవనం కొనసాగిస్తున్నారు. సంఘములో శ్రీస్వామి ప్రబోధాలను ప్రచారంచేస్తూ, ధర్మ పరిరక్షణ చేస్తూ ఆ మఠాలు తమ ధర్మాన్ని నిర్వర్తిస్తున్నాయి. విద్యాసాగరా! శ్రీస్వామిసుత సమాధిపొందిన తరువాత అతని సోదరుడు మఠానికి అధిపతి అయ్యాడు. అది ఒక విచిత్రమైన ఘట్టం దానిని ఇప్పుడు చెప్పుకుందాం అని నిత్యానందులు శ్రీస్వామిని మనసున తలంచి...

"ఓ సద్గురు మౌళీ! శ్రీ స్వామి సమర్థా! ప్రజ్ఞాపుర నివాసా! శ్రీ దత్తాత్రేయ స్వరూపా! నీవు మానవ శరీరంలోని సప్త చక్రములయందు, సప్తదేవతా

రూపములలో వుండి, కుండలిని జాగరణ చేయుచుందువు. ప్రథమ చక్రమైన మూలాధారమున గణపతివై నెలకొని వున్నావు. ద్వితీయమైన స్వాధిష్ఠాన చక్రమున బ్రహ్మవై, తృతీయమైన మణిపూరకమున విష్ణురూపమున వున్నావు. చతుర్థ చక్రమైన అనాహతమునందు రుద్రరూపుడవై, పంచమమైన విశుద్ధి చక్రమున జీవ స్వరూపుడవై యున్నావు. షష్ఠమమైన ఆజ్ఞాచక్రమునందు సదాశివుడవై, సప్తమమైన సహస్రార చక్రమునందు పరబ్రహ్మవై, పరమ గురుడవై వెలుగుచున్నావు. బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి అను మూడు పురములకు నిలయుడవు నీవే. త్రిపురాధిపతివై త్రిపుర రహస్యమను పేరిట పరశురామునకు తత్త్వమును ప్రబోధించిన దత్తస్వరూపుడవు నీవే! ఇడ–పింగళ అను నాడులయందు సూర్యుడవై, చంద్రుడవై సంచరించునది నీవే! సుషుమ్నద్వారా కుండలిని సహస్రారమువరకు చేర్చునది నీవే! అక్షర స్వరూపా! ఒక్కొక్క చక్రదళముల రూపమున వున్న అక్షరాధిపతివి నీవే. వాని త్తత్వము కార్యరూపము నీవే! శరీరంలోని అణువణువు నీవై నిండివున్నావు. నిన్ను తెలుసుకోవటం చాలా కష్టం. నీ తత్త్వము అతి రహస్యము. ఈ విషయమెరిగి నీలోకి చేర ప్రయత్నించే యోగులకు, సాధకులకు ఈ నిజ తత్త్వముతో గోచరిస్తావు. పంచ తత్త్వములు, పంచకోశములు, దశేంద్రియములు – సప్త ధాతువులు – దశ దుష్టగుణములు – అష్ట సత్త్వ గుణములు నీవే. నీవు కానిదేదీ యిందులో లేదు. సర్వదేహ స్వరూపా నీవు మమ్ముల ననుగ్రహించి, నీ తత్త్వదర్శనం కలిగించు. నీకు యివే నా శతకోటి దండ ప్రణామములు. అందుకోవయ్యా శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజా!” అని ప్రార్థించినారు.

## శ్రీ సచ్చిదానందస్వామి కుమార్

శ్రీస్వామిసుత సమాధి అనంతరం ఆయన తమ్ముడు దాదాను మఠాధిపతిగా నియమించాలని శ్రీస్వామి సమర్థులు సంకల్పించారు. సంకల్పంవల్లనే తల్లి కాకుబాయి చిన్నకుమారుడు దాదా తల్లిని చూడటానికి కొంకణ నుండి అక్కల్‌కోట వచ్చాడు. అతని వయస్సు ఎనిమిది సంవత్సరాలు. కాకుబాయి శ్రీస్వామి దర్శనమునకు అతనిని తీసుకుని వచ్చినది. దాదాను చూస్తూనే శ్రీస్వామి ఆనంద పారవశ్యముతో అతని ఒళ్ళంతా నిమిరి తన ఒడిలో కూర్చుండబెట్టుకొన్నారు. ఆ పిల్లవాడితో ప్రేమగా సంభాషించసాగారు. అదే సమయంలో నానా సాహెబ్ కేజ్‌కర్ శ్రీస్వామి సమర్థ దర్శనానికి వచ్చాడు. అతనికి పూర్వము శ్రీస్వామి ‘కేజ్’నందు ఒక మఠమును స్థాపించమని ఆదేశించియున్నారు. కేజ్‌కర్ మఠ నిర్మాణము కావించి, దాని ప్రతిష్ఠా కార్యక్రమమునకు శ్రీస్వామి ఆశీస్సులు పొందుటకు వచ్చినాడు. శ్రీస్వామి




అతనిని ఆశీర్వదించి, దాదాను అతనివెంట తీసుకెళ్ళి ఆ ప్రతిష్ఠా కార్యక్రమం పూర్తిచేసుకొని రమ్మని ఆదేశించినారు. నానాసాహెబ్ కేజ్‌కర్ తన వెంట దాదాను తీసుకెళ్ళి కేజ్‌నందు ప్రతిష్ఠా కార్యక్రమం పూర్తిచేసుకొని, దాదాను తీసుకుని తిరిగి శ్రీస్వామివద్దకు వచ్చినాడు. దాదాను బొంబాయి తీసుకెళ్ళి స్వామిసుత మఠానికి వారసునిగా చేయమని, దండమును, రుద్రాక్షమాల, కౌపీనము దాదాకు ప్రసాదించిరి. అప్పుడు కాకూబాయి తన కొడుకు సన్యాసదీక్ష తీసుకొనుటకు యిష్టపడక, శ్రీస్వామివద్దకు వెళ్ళి ఏడ్వసాగినది. శ్రీస్వామి ఆమెను పట్టించుకొనక "ఆమెతో మనకు పనిలేదు. ఆమె అధికంగా గోల చేసినచో నేను బంధించెదను. మీరు దాదాను తీసుకుని బొంబాయి వెళ్ళండి!" అని ఆజ్ఞాపించిరి. కేజ్‌కర్, బొంబాయి నుండి వచ్చిన భక్తులు దాదాను తీసుకుని బొంబాయి వెళ్ళిరి. కాని, అక్కట మఠాధిపతిగా వుండుటకు దాదా యిష్టపడక, తనను తల్లి దగ్గరకు తీసుకెళ్ళమని ఏడ్చుచూ గోలచేసినాడు. అప్పుడు వారు దాదాను తీసుకుని తిరిగి అక్కల్‌కోట చేరినారు.

వెంటనే తల్లి దగ్గరకెళ్ళి దాదా ఏడుస్తూ కూర్చున్నాడు. అందరూ శ్రీస్వామి సంకల్పం విఫలమైనదా, ఏమిటి? అని ఆశ్చర్యపడినారు. శ్రీస్వామి ఉగ్రులై అక్కడవున్న వారితో "పులిచర్మం పరవండి" అని ఆజ్ఞాపించిరి. వారు పులిచర్మం పరచగా శ్రీస్వామి ఆ బాలుని తీసుకెళ్ళి దానిమీద నిలబెట్టండి అని ఆదేశించారు. శ్రీపాదభట్‌ను పిలిచి ఈ పూలమాలను ఆ బాలునిమెడలో వేయమనిరి. చోళప్ప కొడుకు కృష్ణప్పను, శ్రీస్వామి పాదుకలు తీసుకెళ్ళి దాదా తలపైనపెట్టమనిరి. కృష్ణప్ప, శ్రీపాదభట్‌లు వేదమంత్రాలు చదువుచుండగా శ్రీస్వామి స్వయంగా, నెమలి ఈకల విసనకర్ర తీసుకుని, దాదాకు విసరసాగిరి. ఈ విధంగా దాదాను క్రొత్త మఠాధిపతిగా అభిషేకించి, అతనికి 'సచ్చిదానంద స్వామి కుమార్' అని దీక్షానామము యిచ్చిరి. భక్తులందరు శ్రీస్వామి సమర్థులకు, శ్రీస్వామి కుమార్‌కు జయ జయ నాదములు చేసిరి. ఆ దృశ్యమును చూచి కాకుబాయి తన కొడుకు మఠాధిపతి అయినందుకు అతనికే కాక తనకు ఎంతో గర్వకారణమని ఆనందముతో ఉప్పొంగిపోయినది. దాదాలో కూడా కొంచెం మార్పు వచ్చినది. విద్యాసాగరా! ఆహా, ఏమి అదృష్టము! అతని జీవితము ధన్యమైనది. దైవమే సాక్షాత్తుగా అతని ఆధ్యాత్మిక జీవితమునకు నాంది పలికినది. అతను మహాత్ముడే అని అందరికి తెలియజేయుటకు, తానే స్వయంగా విసనకఱ్ఱతో విసురుట ద్వారా తెలియజేసిరి. కాని అతని తల్లి కాకుబాయికి అంతలోనే మళ్ళీ దుఃఖము వచ్చెను. ఆమె పెద్దగా ఏడ్చుచూ తిరిగి గోల చేయసాగినది. సేవకులను

పిలచి ఆమెను గదిలో పెట్టమని శ్రీస్వామి శాసించిరి. శ్రీస్వామి ఆ బాలుని మఠాధిపతిగా నియమించాము. నా నిర్ణయానికి తిరుగులేదు. ఇది శిలాశాసనము. దీనిని ఎవరూ అధిగమించలేరు అంటూ ఆ బాలుని తన తొడపై కూర్చుండబెట్టుకుని ప్రేమతో తలపై నిమిరి యిలా అన్నారు.

"దాదా! కాకుబాయి నీ తల్లి అనుకున్నావు. అది నీ భ్రమ. తల్లి ఎవరు? కొడుకు ఎవరు? ఇదంతా బాహ్య బంధుత్వం. ఇంతకు ముందు నీవెన్నో జన్మలెత్తినావు. నీకెంతోమంది తల్లులూ, తండ్రులూ అయ్యారు. అనిత్యమైన ఈ విషయాల జోలికి వెళ్ళకు. సృష్టి అంతటికీ తల్లి ఆ విశ్వమాతయే. ఆ లోకమాతయే నీ తల్లి, తండ్రి సర్వస్వము అని జగజ్జననిని సేవించి ఆమెను చేరుకునే ప్రయత్నం చెయ్. క్షణికమైన ఈ ప్రాపంచిక బంధాలకు లోనుగాకు. ఇవి నీటి బుడగ వంటివి. అవి ఏ క్షణంలోనైనా వదిలిపోవును. అందువలన శాశ్వతమైన పరమాత్మ తత్త్వమును తెలుసుకొనుటకు కృషిచేయుము. పురుషార్థములలో ధర్మము, అర్థము, కామము ప్రేయస్సులు. ఇవి తాత్కాలిక ఆనందాన్ని మాత్రమే కలిగిస్తాయి. మోక్షమొక్కటే శ్రేయస్సు. దానిని పొందుటయే ఉత్తమమైన మార్గము. దానిని పొందటానికి ప్రయత్నం చేయుము" అని ఆశీర్వదించిరి. శ్రీస్వామియొక్క అమృత వచనములను, సలహాలను విన్న బాలుడు ఆనందముతో శరీరముప్పొంగ తన్మయత్వము చెంది శ్రీస్వామి ఆజ్ఞను పాటించి బొంబాయిచేరి, మఠాధిపతిగా తన కార్యక్రమమును కొనసాగించి విరివిగా శ్రీదత్త ప్రచారమును గావించినాడు. శ్రీస్వామి చెప్పినట్లుగా తాను సర్వవేళలా విశ్వమాత ఒడిలోనే వున్నట్లు భావించేవాడు. శ్రీస్వామి పాదుకలను పూజిస్తూ గొప్ప ఆధ్యాత్మిక యోగిగా మారాడు. ఆయన చాలాకాలం ఈ సాంప్రదాయాన్ని కొనసాగించి సిద్ధిపొందెను. విద్యాసాగరా! వీరి పరంపరలోని మహాయోగిని, శ్రీస్వామి సుతుల కుమార్తె సిద్ధాబాయిని గురించి చెప్పుకొందాం.

***"సద్గురో స్వామి సమర్థా - జగద్గురో స్వామి సమర్థా!***
***దత్తావధూతా స్వామి సమర్థా - సచ్చిదానందా స్వామి సమర్థా***
***నిత్యస్వరూపా స్వామి సమర్థా - సత్యస్వరూపా స్వామి సమర్థా***
***శాంతస్వరూపా స్వామి సమర్థా - ప్రేమ స్వరూపా స్వామి సమర్థా"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది ఎనిమిదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

ఓం నమః ప్రణవార్థాయ
శుద్ధ జ్ఞానైక మూర్తయే
నిర్మలాయ ప్రశాంతాయ
దక్షిణామూర్తయే నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## నలుబది తొమ్మిదవ అధ్యాయము

సాధకులారా!

శ్రీ దత్తాత్రేయ సాంప్రదాయంలోని గురువులు, మహాత్ములు అందరూ ఒక విధముగా చిత్ర విచిత్రమైన రీతులలో శిష్యులను పరీక్షించుచుంటారు. శిష్యులు, ఓర్పుతోను – శ్రద్ధతోను వారిని సేవిస్తే ఆ మహాపురుషుల దర్శనం –అనుగ్రహం సంపూర్ణంగా లభించుతాయి. పరీక్షకు నిలువలేకపోయినా– ఓర్పును కోల్పోయినా – శ్రద్ధ లోపించినా, వారి అనుగ్రహం దొరకడం దుర్లభం. వారిని ఆరాధించే భక్తులు – శిష్యులు– తమ సర్వస్వమును త్యాగము చేసి, వారి సన్నిధిలో వినయంతోను – భక్తితోను – ప్రేమతోను నివాసం చేయాలి. సర్వజీవుల యందు ప్రేమాభిమానములను, దయను కలిగియుండాలి. గురువుల శరీర స్పర్శ ద్వారా, వాక్కులతోను చేయు అనుగ్రహం శక్తిపాతమై భక్తుల –శిష్యుల శారీరక మానసిక సమస్యలను నివారించి రాబోవు కాలములోని విపత్తులను తొలగించుతాయి. ఈ సాంప్రదాయంలో శిష్యులుగా చేరడం ఎన్నో జన్మలలో చేసుకున్న పుణ్యఫలము వలననే లభిస్తుంది. ఎందుకంటే ఈ సాంప్ర దాయంలో శిష్యులను ఆర్థికంగా – ఆధి భౌతికంగా – ఆధ్యాత్మికంగా తీర్చిదిద్ది – వారిని ముక్తసంగులను చేస్తారు. జన్మ జన్మలకు వీరే గురువులుగా లభ్యమవు తుంటారు. కావున శ్రద్ధతో – ఓర్పుతో, శ్రీస్వామి సమర్థులను ధ్యానించి వారి లీలలను పారాయణచేసి సత్ఫలితాలను పొందండి. సద్గురు అనుగ్రహం పొందండి. ముక్తికాంతను పొందండి. జై శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట స్వామీజీకి జై!

విద్యాసాగరా! దత్తాత్రేయ సాంప్రదాయంలో శిష్యులను గురువు అనుగ్రహించు విధానములో చిత్రమైన విశిష్టత కలదు. దీనిని శక్తిపాతమంటారు. సాధారణంగా అన్ని సాంప్రదాయములలో ఆధ్యాత్మిక చింతన కలిగిన శిష్యునకు, గురువు మొదట మంత్రోపదేశమును, తర్వాత తత్త్వోపదేశమును, మహావాక్యములు – అనగా "ప్రజ్ఞానం బ్రహ్మ", "అహం బ్రహ్మాస్మి", "అయమాత్మా బ్రహ్మ", "తత్త్వమసి" వీని వివరములను, తత్ జ్ఞానమును ప్రబోధించి, తనంతవానిగా తీర్చిదిద్దుతారు. శిష్యుడు గురు ప్రబోధితమైన ఒక్కొక్క మార్గాన్ని నిరంతర సాధనచేత, తపస్సుచేత సాధించుతాడు. అలా ఒక్కొక్క స్థానాన్ని దాటిన శిష్యులకే గురువు ఈ మహావాక్యములను, ప్రబోధంచేసి గురుస్థానాన్ని అలంకరింపజేసి, అధికార పట్టాన్ని యిస్తారు. తిరిగి వీరు ఇదేవిధంగా తమను చేరిన శిష్యులనుద్ధరిస్తారు. ఈ క్రమములో శిష్యుడు ముక్తసంగుడుగా మారుటకు సుదీర్ఘకాలము పట్టవచ్చు. లేక అనేక జన్మలు మారవచ్చు. జన్మ జన్మాంతర యోగసాధన కలిగినవాడు అతి స్వల్పకాలంలోనే ఈ స్థితికి అర్హుడు కావచ్చు.

విద్యాసాగరా! అయితే దత్త సాంప్రదాయంతో శిష్యుడు శుద్ధ భక్తితో నిర్మల మనస్కుడై, గురువువైపు ఒక్క అడుగువేస్తే చాలు. ఆ గురువులెవరైనా కావచ్చు, వానివైపు తొమ్మిదడుగులు వేస్తారు. శక్తిపాతం ద్వారా శిష్యుని అంతరంగంలో నిద్రావస్థలోనున్న శక్తిని జాగృతం చేస్తారు. వీని జ్ఞానాన్ని చైతన్యవంతం చేసి వానిని పరమోత్తమమైన జ్ఞానిగా తీర్చిదిద్దుతారు. తద్వారా శిష్యుని తనంతవానిగా, ఒక్కొక్కసారి తనకంటే గొప్పవానిగను చేయగలరు. సాధారణంగా ప్రతి సాధకునకు నిరంతరమైన కృషిచేత కుండలినీ శక్తి జాగృతమౌతుంటుంది. అయితే అది అనాహత చక్రమును చేరి అనాహత నాదములో లయమై అక్కడే ఆగిపోతుంది. కొందరికి మాత్రం సహస్రారం వరకు చేరి సిద్ధి లభిస్తూ వుంటుంది. దత్త సాంప్రదాయ పూర్ణ పురుషులు తమను చేరిన చైతన్యవంతులైన శిష్యులకు తమ స్పర్శద్వారా, దృష్టిద్వారా, సంకల్పం ద్వారా, మంత్రబలం ద్వారా, మూలాధారం నుండి కుండలినీ శక్తిని చైతన్యపరచి ఊర్ధ్వముఖంగా సుషుమ్న నాడిద్వారా, షట్చక్రములను దర్శనం చేయించి, సహస్రారమునకు చేర్చి సద్గురు స్వరూపంతో లయము చేయించెదరు. అక్కడ జీవుడు, పరమాత్మతో లయమై సమాధి పొందును. దీనినే పరంజ్యోతి దర్శనమని, సిద్ధ సమాధియని అంటారు. ఈ సాంప్రదాయములో జన్మ



జన్మాంతరములలో యోగసాధన ఆగిపోయినవారు ఏ దత్తావతారులను దర్శించినా, వారు పై క్రియల ద్వారా, వాని యోగాన్ని, ఆత్మజ్యోతిని ప్రదీప్తం చేస్తారు. ఈ స్థితినే సిద్ధిపొందుట అంటారు. ఇటువంటి సాధకునికి అష్టసిద్ధులు వశమౌతాయి. కాని గురు ప్రసాదితమైన ఆ సిద్ధులను ప్రదర్శించి గుర్తు పొందాలని ప్రయత్నించకూడదు. వానినన్నింటిని తనలో ఇముడ్చుకొని పరిపూర్ణమైన సిద్ధసమాధినే పొందాలి.

విద్యాసాగరా! అయితే సద్గురుడు ఈ శక్తిపాతమును సర్వసామాన్యమైన అందరు భక్తులకు అనుగ్రహించరు. ఇటువంటి అనుగ్రహాన్ని పొందే శిష్యులు మొదటి కలయికలోగాని, రెండు మూడు కలయికలలోగాని ఆ గురువు పరీక్షలకు నిలచి దానిలో ఉత్తీర్ణులౌతారు.

సద్గురుడు తన శిష్యులందరిని సమానంగా అనుగ్రహించడానికి ప్రయత్నిస్తారు. అయితే శిష్యులు గురువుయొక్క ప్రేమను వారి పరీక్షలను సద్బుద్ధితో స్వీకరించితే శక్తిపాతమునకు అర్హతను పొందుతారు. లేక వారి చేష్టలను, అనుగ్రహమును పరీక్షలను భేదబుద్ధితో పరిశీలించితే విపరీత ధోరణులను కలిగి అనుగ్రహస్థాయికి చేరికూడ విముఖులై దూరమౌతారు. వారే గురువును ద్వేషించి జన్మజనాంతరాలకు గురు-శిష్య సాంప్రదాయానికే దూరమౌతారు. మళ్ళీ తిరిగి ఆ స్థాయిని చేరటానికి ఎన్ని లక్షల జన్మలైనా పట్టవచ్చును. గురువును శిష్యుడు సాక్షాత్ నారాయణ స్వరూపుడుగాను, శిష్యుడిని గురువు వాసుదేవునిగాను భావించి యిరువురు కలసి ఆ పరబ్రహ్మను ధ్యానించి లయం పొందాలి. ఇదే వేద ప్రబోధం, ఉపనిషత్తుల శాంతి మంత్రం 'సహనావతు' అను మంత్ర శ్లోకభావం కూడా ఇదే.

సాధారణ మానవుడు గురు అనుగ్రహం పొందడానికి శ్రద్ధతో ఈ దత్తావతారుల్ని ఎవరిని ఆరాధించినా, వారి చరిత్రలను పారాయణ చేసినా స్వప్న దర్శనం ద్వారా గురువును పొందగలరు. లేక ఈ భక్తుల స్థాయిననుసరించి ఆ యవతారులే స్వప్నములోనో లేక స్వయముగానో మంత్రదీక్షనిచ్చి అనుగ్రహిస్తారు. శిష్యుడు సమర్థవంతుడైతే సద్గురువే వానిని వెదుక్కుంటూ వస్తారు. లేక తానెక్కడ వున్నా ఆ సద్గురునిచేత ఆకర్షింపబడి వారిని వెతుక్కుంటూ వారి సన్నిధికి చేరతాడు.

విద్యాసాగరా! ఈ యుగంలో కలి ప్రభావమెక్కువ. కలి తొలుత బ్రహ్మ ఆదేశానుసారం గురు–శిష్యుల మధ్యలో మాత్రమే జొరబడడు. గురు–శిష్యులొకరితో నొకరు అన్యోన్యమైన ప్రేమానుబంధముతో వున్నప్పుడే అది సాధ్యం. లేనిచో శిష్యునిలో ఏ ఒక్క క్షణమైనా వ్యతిరేక బుద్ధి కలిగితే కలి ఆ అవకాశాన్ని వినియోగించుకొని తన ప్రభావానికి లోనుచేస్తాడు. అప్పటిదాకా దేవుడుగా కన్పించిన గురువు దెయ్యంలా గోచరిస్తాడు. వారి చర్యలన్నీ వికృతంగాను, విపరీతంగాను గోచరిస్తాయి. కలి క్రమక్రమంగా వానిని పూర్తిగా తన దాసునిగా చేసుకుంటాడు. అయితే శ్రీగురుడు మరల మరల వానిని రక్షించడానికే ప్రయత్నిస్తూ వుంటాడు. ఆ శిష్యునికి ఏ ఒక్క క్షణమైనా గురు సాన్నిధ్యానుభవ ఆనందం స్ఫురణకు వస్తే వాని మనస్సు అటువైపు తిరిగితే చాలు, కలి దూరమౌతాడు. ఇటువంటి పరిణామము కలి ప్రభావానికి లోనైన శిష్యునిలో రాకపోతే గురు అనుగ్రహం దుర్లభమౌతుంది. దీనినే “యద్భావం – తద్భవతి” అంటారు.

కావున విద్యాసాగరా! ఈ కలి విషయంలో ప్రతిక్షణం శిష్యుడు జాగరూకతతో మెలగాలి. ఈ గురుశిష్య సాంప్రదాయం ఎంత సులభమైనదిగా గోచరిస్తుందో అంత కఠినమైనది. పదునైన కత్తులమీద సామువంటిది. నీవు జాగ్రత్తగా సాధనచేసి సద్గురు సామ్రాజ్యాన్ని చేరవలెను.

శక్తిపాతం ప్రసాదించు నాలుగు విధానములు :

1. స్పర్శదీక్ష – స్పర్శతో ఉపదేశమిచ్చుట.
2. దృక్ దీక్ష – చూపుతో ఉపదేశమిచ్చుట.
3. వేధ దీక్ష – సంకల్ప బలముతో ఉపదేశమిచ్చుట.
4. శబ్ద దీక్ష – మంత్ర బలముతో ఉపదేశమిచ్చుట.

**స్పర్శ దీక్ష :** కోడి తన గుడ్లను పొదిగినట్లు గురువు తన శిష్యులలో జ్ఞాన చక్ర స్పర్శతో శక్తిపాతము నొసగును.

**దృక్ దీక్ష :** తాబేలు తన గుడ్లను కంటి చూపుతో చూచి పొదిగినట్లు గురువు తన చూపును శిష్యుని చూపులతో కలిపి శక్తిపాతము నొసగుట.

**వేధ దీక్ష :** చేపలు సంకల్ప బలమున తన గుడ్లను పొదిగిన విధముగ గురువు తన సంకల్ప బలముతో శిష్యునిలో శక్తిపాతమున చైతన్యము నిచ్చుట.



**శబ్ద దీక్ష** : సప్తర్షులు రత్నాకరుని (బోయవానిని) వాల్మీకిగా మార్చినట్లుగా, వేద విజ్ఞాన బోధవలన, మంత్రమహిమ వలన శక్తిపాతము నొసగి ప్రజ్ఞను చైతన్యపరుచుట.

శక్తిపాతం పొందిన సాధకుడు స్పృహ కోల్పోవుటగాని, శరీరము కంపించుటగాని, అమితమైన ఆనందముతోగాని, శరీరము గగుర్పాటు పొందుటగాని, విపరీతమైన చెమటలు పట్టుటగాని శరీరం అమితోత్సాహము కలుగుట వలన తాను శక్తిపాతము పొందుచున్నట్లు అనుభవమును పొందును. మనో, వాక్కాయ కర్మ విషయములన్నీ శూన్యమగును. సాధకుడు నిశ్చలస్థితిని పొందును. అంతరంగములో దివ్యానుభూతులు పొందును. ధ్యానములో అనేకమైన జ్యోతుల రూపములో యోగులు, మహాత్ములు దర్శనమిచ్చెదరు. అగ్నిజ్వాలలు అనేక నక్షత్ర మండలములు దర్శనమిస్తాయి. అనాహతనాదము వినిపించును. దశనాదములు వినిపించును. సప్తచక్రాది దేవతానుగ్రహం పొందుతాడు. ఇడ, పింగళలలో సూర్య, చంద్ర సంచారం పూర్తిగా అవగతమౌతుంది. సుషుమ్నలలో త్రిశక్తి స్వరూపిణియైన లక్ష్మి గోచరిస్తుంది. క్రమంగా ఈ సాధన నిశ్చలమై అష్టసిద్ధులను పొందుట, పరిపూర్ణమైన సిద్ధిని పొందుట జరుగును. కొందరికి శరీరము భూమిపై నుంచి లేచి గాలిలో నిలబడుట, నాడీ కేంద్రములన్నియు ఉత్తేజమును పొందుట, ఏదో శక్తి తమలో పారుచున్నదని తెలిసి ఆధ్యాత్మిక చైతన్యము పొందెదరు.

గురుకృపవలన ఈ శక్తిపాతముతో యోగశక్తి జాగరణ కలిగినప్పుడు హఠయోగాది సాధనలు అవసరముండవు. ఈ శక్తివలననే సప్తచక్రములను దర్శించి పరిపూర్ణ యోగస్థితిని పొందుతాడు. అయితే శిష్యునకు ఆ సమయములో ఆత్మవిశ్వాసము, అనంత గురుభక్తి, మానసిక సమస్థితి, క్రమశిక్షణ కలిగిన పవిత్ర జీవన విధానము, గురువుపైన పరిపూర్ణమైన విశ్వాసము కలిగియుండాలి. ఈ శక్తిని సంపాదించిన శిష్యుడు తాను గురుడై తన శిష్యులకు ఈ విధంగానే అనుగ్రహించే శక్తి పొందగలడు. గురుడు తానై, తాను గురుడైన సమభావమును పొంది గురువుతో పూర్తిగా లయమైనప్పుడే ఇది సాధ్యము. కావున విద్యాసాగరా! ఉత్తమ సాధకుడవైన నీవు శ్రీస్వామి సమర్థుల అనుగ్రహంతో ఈ స్థితిని పొందుము. శ్రీస్వామి సమర్థులు ఈ శక్తిపాతమును ద్వారా తమంతవారిగా చేసేవారు. అలాగే ఈ సాంప్రదాయములోని గురువులు

నేటికిగూడ ఈ విధమైన విధానములతో శిష్యులను అనుగ్రహిస్తూ వున్నారు. మనం ఈ అధ్యాయంలో శ్రీస్వామిసుత కుమార్తె సిద్ధాబాయిని గురించి తెలుసుకుందాము అని ఇట్లు చెప్పసాగిరి.

## శ్రీ యోగిని సిద్ధాబాయి

ఈమె హరిభావు, తారాబాయిల కుమార్తె. హరిభావు శ్రీస్వామి సుతగామారి, తారాబాయితో కలసి వానప్రస్థాశ్రమ జీవితం గడుపుచుండగా వారి దగ్గరే పెరుగుతున్న ఈ సిద్ధాబాయి గొప్ప యోగినిగా రూపొందినది. ఈమె చిన్నతనములో శ్రీస్వామి దగ్గరే, వారి సేవలో చాలాకాలం గడిపినది. అక్కడ మఠములో శ్రీపాదభట్, కృష్ణప్పలతో కలసి వేదాలను, ఉపనిషత్తులను తెలుసుకుంది. జ్ఞానేశ్వరి భగవద్గీతను నిత్యమూ పారాయణ చేసేది. అనుక్షణము శ్రీస్వామివారి వెంటనే వుండేది. వారు ఎక్కడకు వెళితే అక్కడకు వెళ్ళేది. శ్రీస్వామివారు కూడా అతి గారాబముచేసి ప్రేమతో చూసేవారు. 'యోగినీమా' అని పిలచేవారు. రాత్రులు వాళ్ళ నానమ్మ కాకుబాయి దగ్గర పడుకునేది. తరచు వీరి తల్లి తారాబాయి అక్కల్‌కోట వచ్చి ఈమెను చూసి వెళ్తుండేది. ఈమె తండ్రి, సోదరులు, మేనత్తలు అందరూ శ్రీస్వామి దర్శనార్థమై అక్కల్‌కోట వచ్చి వీరిదగ్గర వుండి వెళ్ళేవారు. బంధువులు, శ్రీస్వామి శిష్యులు, సేవకులు, భక్తులు అందరూ ఈమెను ప్రేమతోను, గౌరవముగాను చూచేవారు.

అక్కల్‌కోట మహారాణి ఈమెను అప్పుడప్పుడు అంతఃపురములోనికి తీసుకెళ్ళి చక్కటి కీర్తనలు పాడించుకునేది. సిద్ధాబాయి శ్రీస్వామిపై వ్రాసిన కీర్తనలు, అభంగాలు చాలా చక్కగా పాడేది. సిద్ధాబాయి శ్రీస్వామి సమాధి పొందిన తరువాత బొంబాయి వెళ్ళి కామాటిపురలోని మఠంలో వుండి అక్కడి పాదుకలను సేవించుచుండెడిది. ఈమె శ్రీస్వామి సమర్థుల నుండి సర్వశక్తిని, కృపను పొంది, సాధనచేత గొప్ప యోగినిగా మారింది. శ్రీ సచ్చిదానందస్వామి కుమార్ సమాధి తరువాత సిద్ధాబాయికి శ్రీస్వామి సమర్థులు దర్శనమిచ్చి కామాటిపుర నుండి బొంబాయిలోని చెంబూరునకు మఠమును మార్చమని ఆదేశించిరి. వారి ఆజ్ఞానుసారం ఆమె ఆ మఠమును చెంబూరుకు మార్చినది. ఆమె మఠ కార్యక్రమములను అత్యంత శ్రద్ధగా నిర్వహించి సద్గతి పొందినది. వారి వారసులు 'హరిభావుశంకర్ నలవాడే', మనవరాలు 'హరిబాయి' అత్యంత శ్రద్ధతో మఠంలో కార్యక్రమములను నిర్వహిస్తున్నారు. హరిబాయి తన



జీవితమును మఠమునకు అర్పించెను. నేటికీ ఆ మఠంలోని శ్రీస్వామి పాదుకలు వేలాదిమంది భక్తులను ఆకర్షిస్తున్నాయి. ఆ పాదుకలను దర్శించి, నమస్కరిస్తేచాలు, సమస్యలన్నీ తీరిపోయి వారికి శాంతి లభిస్తుంది. చెంబూరు మఠంలో శ్రీదత్త జయంతి, గురుపౌర్ణమి, శ్రీస్వామివారి పుణ్యతిథి చాలా ఘనంగా జరుపుతారు. ఆ రోజులలో జరిగే పాదుకాపూజ, పల్లకీ ఉత్సవం భండారా (అన్నదానం) లలో వేలాదిగా భక్తులు అత్యంత ఉత్సాహముగా పాల్గొంటారు. నేటికీ ఆ మఠంలో శ్రీస్వామిసుత వంశస్థులు భక్తిశ్రద్ధలతో అన్ని కార్యక్రమములు జరుపుచున్నారు.

విద్యాసాగరా! రాబోవు అధ్యాయములో చోళప్పను గురించి మరికొన్ని విషయములను తెలుసుకుందాం!

***"దత్తం భజే - గురు దత్తం భజే***
***దత్తం భజే - గురు దత్తం భజే***
***దత్త ప్రేమ - గురు దత్తం భజే***
***అనసూయ నందన - గురు దత్తం భజే!"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***నలుబది తొమ్మిదవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం
ఓం గురు ఓం గురు ఓంకారా ఓంకారా
శ్రీస్వామి సమర్థా!

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## యాభైయ్యవ అధ్యాయము

సాధకులారా!

భక్తులు వివిధ రకాలుగా వుంటారు. వారిలో చోళప్ప, సుందరబాయి, రాజామాలోజీరావు, రాజా మల్లారావు, బాలప్ప, విష్ణుబువా ఒక్కొక్కరు ఒక్కొక్క విధమైన మనస్తత్వం గలవారు. ఇలాంటి మనస్తత్వంగల వారెందరో భక్తులలో నేటికీ వున్నారు. వారందరూ పైవారి చరిత్రలను చదివి తమ లోపాలను సరిచేసుకుని, సద్గురువు అనుగ్రహం పొందటానికి ప్రయత్నించాలి. ఈ చరిత్రలో స్థూలంగా చూచువారికి చోళప్ప ఆశకు లొంగినవాడిగా కనిపించినా, అది సదుద్దేశంతో కలిగినదే. అయినా ఆశను ఆశ్రయించటం ప్రమాదమని, ఆధ్యాత్మిక మార్గమునకు అవరోధమని, జగత్తులోని కోట్లాది జనులకు కనువిప్పుచేసి హితము కలిగించుటకు సద్గురుడే ఈ లీలలను సృష్టించినారు. తన లీలావిలాసంతో జన్మజన్మల బంధువైన చోళప్ప శరీరము వదిలితే, దానిని చూచి ఆ మహోన్నతమైన విశ్వతత్త్వము అంతిమదశలో ఆ భక్తునికేర్పడిన అపారమైన భక్తికి చలించినది. కావున ఈ చరిత్రలోని పాత్రలను ఎవరికి వారు, వారి గుణములతో సరిచూచి పోల్చుకుని మార్పుచెంది ఆ సద్గురుని అనుగ్రహమునకు పాత్రులగుదురుగాక!

### భక్త చోళప్ప

విద్యాసాగరా! నిత్యమైనదేదీ ఈ ప్రపంచంలో లేదు. అసలు జీవితమే అనిత్యము. బంధువులు, మిత్రులు, భార్యా–పిల్లలు, కీర్తి–ప్రతిష్ఠలు, ఐశ్వర్యాలు–భోగాలు అన్నీ అశాశ్వతాలే. ఇవన్నీ ఒక స్వప్నం లాంటివి. అయినా జీవకోటి వీటిపైన మమకారాన్ని కలిగించుకుని, పెంచుకుంటుంది. వాటన్నిటికీ



మూలమైనది మాయ. ఆ మాయను సాధారణ జనులెవ్వరూ జయించలేరు. దానివల్లనే సుఖాలూ-దుఃఖాలూ కలుగుతుంటాయి. అవికూడా అనిత్యమైనవే. ఈ విషయాలవల్లనే మాయకులోనైన మానవులు, ఆశలకు లోనై కోరికలనే వటవృక్షాన్ని పెంచుకుంటారు. ఇది అసత్యమని తెలిసికూడా మరికొందరు దానికి లోనౌతుంటారు. అది వారి అజ్ఞాన లక్షణము. కాని ఈ జగత్తులో నిత్యమైనది ఆత్మ. దానినే జీవుడని అంటారు. ఆ జీవుడు దేహంలో ఎంతవరకు వుంటాడో, అంతవరకు వానిలో మమతానురాగాలు కలుగుతుంటాయి. దేహాన్ని వదలిన తరువాత దేహంమీదకాని, దానిననుసరించి వున్న ఏ యితర విషయాల మీదకాని అభిమానముండదు. జననము, మరణములేని స్వయం ప్రకాశుడైన జీవునకు, పరమాత్మకు భేదం లేదు. ఈ విశ్వాన్ని సృష్టించి, పోషించి, సంహరించే పరమాత్మను ఏకాగ్రచిత్తంతో ధ్యానించేవారికి ఏ విధమైన విచారం వుండదు. వారి ప్రతిరూపమైన సద్గురువులను ఆశ్రయించి, సేవించేవారికి పరమశాంతి లభించి, మాయ ఆవరణం విచ్ఛిన్నమవుతుంది. అయినా ఆ మాయనుండి బయటపడాలనే తీవ్రమైన వాంఛ, దానికి తగ్గ సాధన సాధకుడికి లేకపోతే, సద్గురువు దగ్గరవున్నా వారి ప్రబోధాన్ని, వారి లీలలను అర్థం చేసుకోనప్పుడు అది వీడదు. బంగారము అగ్నితో కాల్చబడి ఎలా ప్రకాశవంతమగునో సద్గురువుతో సమ్మేళనమైనవాడు అలా పరమయోగి అవుతాడు. అగ్ని, బంగారం రెండు ప్రక్కప్రక్కనే వున్నా దానికి ప్రకాశం రాదు. అలాగే సద్గురువుతో సమ్మేళనం కాకుండా శిష్యుడు వారివెంట వున్నా యోగ్యుడు కాలేడు" అని నిత్యానందులు తెలిపి, విద్యాసాగరా! నీవు ఆ సద్గురుని లీలలోనే లయమగుదువుగాక అన్నారు. 22వ అధ్యాయంలో చోళప్ప ఇంటిలో శ్రీస్వామి చేసిన లీలలను చెప్పుకున్నాంగదా! చోళప్పను గురించి మరికొన్ని వివరములు, వారి నిర్యాణమును గురించి చెప్పుకుందాం, అని యిలా చెప్పసాగిరి. చోళప్ప జీవితంలో గొప్ప అవకాశం కలిగినది. అదీ అతని పూర్వజన్మ పుణ్యఫలమే. శ్రీస్వామి అక్కల్‌కోటకు చేరిన వెంటనే రామచంద్రరంగారి అనువాడు శ్రీస్వామిని చూచి మహాత్మా! ఈ ఊర్లో మీకెవరైనా బంధువులు వున్నారా అని అడిగితే శ్రీస్వామి "ఆ! ఉన్నారు" అంటారు. అట్లే చోళప్ప కనిపించగానే "ఏమిరా, చోళా! నన్ను గుర్తుపట్టావా? పూర్వజన్మలో నీవు రామచంద్ర షరాబువు. నా భక్తుడవు!" అంటారు. దీనినిబట్టి అతనిది, శ్రీస్వామిది జన్మజన్మల బంధమని




తెలియుచున్నది. శ్రీస్వామి చోళప్పను పరీక్షించుటకై ఎన్నో వింతచేష్టలు చేశారుకదా! ఆఖరుకు యింటినుంచి వెళ్ళిపోతామని వెందుతుంటే, చోళప్ప కన్నీటితో వారిని ఇంటికి తిరిగి తీసుకొచ్చాడు కదా! ఇన్ని పరీక్షలనూ జయించిన చోళప్ప, ఆఖరికి ధనాశకు లొంగినాడు. అయినా ఆనాటికి శ్రీస్వామి అనుగ్రహంతో, రాజామాలోజీరావు సహాయంతో, అతనికి తినటానికి, కట్టుకోడానికి ఏలోటూ లేకుండా సాగిపోసాగింది. చోళప్ప అమాయకుడైన బ్రాహ్మణుడు.

సర్వ తీర్థాలకు నిలయమైన శ్రీస్వామి తన ఇంట్లో వుంటే, తాను శ్రీస్వామి సేవలను తన పిల్లలకు, మిత్రులకు వదిలి తీర్థయాత్రలకు వెళ్ళుచుండేవాడు. ఆయన తీర్థయాత్రలకు వెళ్ళినప్పుడల్లా శ్రీస్వామికి చెప్పి వెళ్ళేవాడు. శ్రీస్వామి చిరునవ్వు నవ్వుకుని ఊరుకునేవారు. శ్రీస్వామి అనుగ్రహంతోనే అతని కుమారుడు కృష్ణప్పకు వివాహం జరిగినది. అది బీదవాడైన చోళప్ప కుమారుని పెళ్ళిలా కాకుండా శ్రీస్వామి మహరాజ్ మనుమడి పెండ్లిలాగా అత్యంత వైభవముగా జరిగినది.

అలాగే అతని కుమార్తె వివాహం కూడా శ్రీస్వామి అనుగ్రహంతోనే జరిగినది. జమాఖిండి సంస్థానములో ప్రధాన పూజారిగా ఆనందభట్ అనునతనుండేవాడు. అతని కుమారుడు శ్రీపాదభట్. ఇతనికి ఉపనయనం అయ్యాక, విద్యాభ్యాసం పూర్తిచేసుకుని శ్రీస్వామి సమర్థుల దర్శనానికై అక్కల్‌కోట వచ్చాడు. శ్రీస్వామి అతనిని ఆశీర్వదించి తమ సేవలోనే వుంచుకున్నారు. శ్రీపాదభట్ కృష్ణప్పతో కలసి శ్రీస్వామికి పూజ, హారతి మొదలగు కార్యక్రమములు నిర్వర్తిస్తూ అక్కడే జప-తపాదులు చేసుకుంటుండే వాడు. శ్రీస్వామి ఈయనను 'అట్టేశ్వర్' అని పిలిచేవారు. ఇతనికి శ్రీస్వామి చోళప్ప కూతురితో వివాహం చేయించారు. ఇతను ఎల్లప్పుడూ శ్రీస్వామి వెంట వుండి వారి ఆదేశానుసారం సేవలు చేస్తుండేవాడు. ఇలా శ్రీస్వామి చోళప్ప యొక్క బాధ్యతలను కూడా పూర్తిచేశారు. అయినా బరోడా సంస్థానము నుండి వచ్చిన తాత్యాసాహెబ్ చూపిన ధనాశకు లొంగినాడు, ఆశపడ్డాడు. అయినా ఆ ఆశలోకూడా ధనము, మాన్యాలు వస్తే మఠానికి, శ్రీస్వామి దర్శనార్థం వచ్చే భక్తులకు ఎక్కువ వసతులు చేయవచ్చుగదాయని అతని ఆశ. కాని అంతకు పూర్వం శ్రీస్వామి స్వయంగా తీసుకోమంటేనేగాని, భక్తులిచ్చిన కానుకలుగూడ స్వీకరించేవాడు కాదు.



మొట్టమొదట శ్రీస్వామికి వసతి, భోజనం ఏర్పాటు చేసినప్పుడు మహమ్మద్ ఆలీఖాన్ ఆ ఖర్చులు యిస్తానంటే అతి బీదవాడు కనుక దానికి అనుమతించాడు. ఇందులో మాత్రమే శ్రీస్వామి ప్రమేయం లేదు. రాజా మాలోజీరావు పప్పుధాన్యాలు, ఐదు రూపాయలు నెలసరి ఖర్చు యిస్తానంటే శ్రీస్వామి అనుమతితోనే అంగీకరించాడు. ఇలా ఇన్ని సమయాలలో జాగ్రత్తగా వ్యవహరించిన చోళప్ప బరోడా రాజు చూపించిన ప్రలోభాలకు లొంగిపోవడం చాలా విచిత్రం! అది మంచి ఉద్దేశ్యముతో కలిగిన ఆశ అయినా కుట్రలూ, కుతంత్రాలు చేసేవాడు, భక్తిలేని వాడైన బరోడా రాజు ఇచ్చే ధనమును ఆశించటం శ్రీస్వామికి యిష్టం లేకపోయింది. చోళప్ప శ్రీస్వామిని బరోడా వెళ్ళమని అడిగినప్పుడు "వారికి భక్తిలేదురా!" అని ఒకేమాటలో సమాధానం చెప్పారు. అయినా చోళప్పకు అది అవగాహన కాలేదు. చోళప్ప ఆనాటినుండి క్రమంగా శ్రీస్వామికి, శ్రీస్వామి సేవలకు దూరం కాసాగాడు. ఆ స్థానాన్ని సుందరబాయి క్రమంగా ఆక్రమించుకోసాగింది. అప్పుడు కూడ శ్రీస్వామి యితనిపైగల అపారమైన ప్రేమతో హెచ్చరిస్తూనే వచ్చారు. అతని కుమారుడు, అల్లుడు మాత్రం శ్రీస్వామి సేవలో కొనసాగుతూనే వున్నారు. క్రమంగా శ్రీస్వామి దర్శనం కూడ చోళప్పకు కరువైంది. కేవలం శ్రీస్వామి పాద తీర్థంతోనే తృప్తిపడేవాడు. ప్రతివారినీ తన జీవితంలో దైవమార్గం నుండి వంచితుణ్ణి చేసేందుకు, ఈ ప్రకృతి ఏదో ఒక దౌర్భల్యాన్ని తోడు చేసుకుని తనపని కొనసాగించుకుంటుందనేది పరమసత్యం. ఇది చోళప్పతోపాటు, మనందరికీ దైవం నేర్పించదలచిన గుణపాఠం అని తెలుసుకోవాలి. యోగులు, అవధూతలు సంపూర్ణ జ్ఞానస్వరూపులు. వారు తమకు సేవచేసే అవకాశం ఎవరికి అనుగ్రహిస్తారో అది వారి భక్తి, పూర్వజన్మ సుకృతం మాత్రమే. అలాంటి అవకాశం పొందిన భక్తులు, సేవకులు వారి సాంగత్యము వలన క్రమక్రమంగా తమ భక్తి శ్రద్ధలను వృద్ధిచేసుకోగలగాలి. 'శ్రద్ధావాన్ లభతే జ్ఞానమ్' అను గీతావాక్యం వలన 'జ్ఞానం లభించాలంటే తగిన శ్రద్ధ అవసర'మని తెలుస్తుంది. జ్ఞాన స్వరూపులైన యోగులు భక్తుల ఐహిక వాంఛలు తీర్చుటకై తమ మహిమలు మొదట్లో ఉపయోగించినా, ఏదోవిధంగా క్రమక్రమంగా వారిలో జ్ఞానాన్ని ప్రతిష్ఠింప చూస్తారు. కాని తమను సేవించినందుకు ప్రతిఫలంగా పుణ్యాన్ని మాత్రమే కలిగించి వదలరు. పాప పుణ్యాలు ద్వంద్వాలు కనుక, పాపఫలం




అనుభవించి నశింపజేసినట్లు, జీవి పుణ్యాన్ని కూడ భోగించి నశింపచేసుకుంటాడేగాని పూర్తిగా నిలువచేసుకోలేడు. కాని జ్ఞానధనం సంపాదించే సాధకులకు అంతా నిలువచేసుకోవటమేగాని, ఖర్చుకావటం వుండదు. అలాంటి తరగని జ్ఞానాన్ని తమను ఆశ్రయించిన వారికి యోగులు యివ్వటానికి ప్రయత్నిస్తారు. ఈ విశేషాన్ని తెలుసుకుని ఎవరు తమయొక్క భక్తిని మానసిక శ్రద్ధగా మార్చుకుని, మహాత్ముల సాంగత్యాన్ని జ్ఞానసంపాదనకు ఉపయోగించుకోగలుగుతారో వారు ధన్యులు.

చోళప్ప హృదయపూర్తిగా శ్రీస్వామిని ఆరాధించి తన ఇంటిలో నిలుపుకొనెను. తాను శ్రీస్వామి హృదయమునందు చోటు చేసుకొనెను. కావుననే తన ఇంటిలోనుండి తన భార్యను వెడలగొట్టినా శ్రీస్వామిని బ్రతిమాలి తన ఇల్లు, తన పరివారము శ్రీస్వామివారమేనని సమర్పణ చేసియుండెను. అదే యిచ్ఛతో శ్రీస్వామివారి సమాధి మందిరంగా తన ఇల్లు రాబోవు కాలంలో శ్రీస్వామి భక్తుల నిలయంగా మారాలని ఒక కోరిక కలిగినది. అందుచేత శ్రీస్వామి సమాధికై తన ఇంటిలో ఒక గొయ్యి త్రవ్వించి, గది కట్టించి వుంచెను. ఇందు అతని స్వార్థమేమియు లేదు. శ్రీస్వామి పేరుతోబాటు తన పేరు చిరస్థాయిగ నిలిచియుండుమాట వాస్తవము. ఈ కోరిక శ్రీస్వామివారికి అంతఃస్ఫూర్తితో తెలిసియున్నదే. ఒకనాడు శ్రీస్వామి చోళప్ప యింటిముందుగా నడుచుచుండిరి. చోళప్ప వారి వెనుకనే వుండెను. "ఓ చోళప్పా! నిన్నే ముందుగ ఆ గోతిలో పెట్టెదను. ఆ తరువాతగాని నేను పోను!" అన్నారు. ఈ సంభాషణ పరిహాసమున కనియుందురని భావించిరి. కాని కొన్ని నెలలు గడిచిన తరువాత చోళప్పకు కలరావచ్చి బాధపడుచున్నప్పుడు తోటి భక్తుడు శ్రీస్వామి పాదతీర్థం తెచ్చి అతనికిచ్చిరి. శ్రీస్వామి సమర్థుల నామోచ్చారణచేయుచూ ప్రాణములు విడిచెను.

అది 1877వ సంవత్సరం. చోళప్ప భక్తి సామాన్య గృహస్థుకుండవలసిన ఓర్పు, నేర్పులకు శ్రీస్వామి ఎంతో సంతోషించేవారు. శ్రీస్వామి హృదయంలో అతి ఉన్నత స్థానమును చోళప్ప సంపాదించినవాడు కాబట్టే, చోళప్ప మరణించినప్పుడు అంతటి మహాయోగియైన శ్రీస్వామికూడా సామాన్యునివలె దుఃఖముతో కదిలిపోయినారు. ఇది భక్తులందరూ గమనించిన విషయం. శ్రీస్వామి పదేపదే "చోళప్ప లేకపోయిన తర్వాత నా లీలలెవరికి చూపను?



చోళప్ప రక్షణ లేనిదే నేను బయటికి ఎలా వెళ్ళను?" అంటుంటే అక్కడివారంతా ఎంతో బాధను పొందేవారు. ఇట్లనుటలో తనకింకా అచ్చట వుండాలని లేదన్న భావనను శ్రీస్వామి వారి మాటలలో వ్యక్తం చేస్తుండేవారు. ఇది తన అంతిమదశ సమీపించుచున్నట్లు భక్తులకు తెలియజేయుచున్నట్లు కొందరు భావించిరి అని శ్రీ నిత్యానందులు తెలిపి, విద్యాసాగరా రాబోవు అధ్యాయములలో శ్రీస్వామి మహాసమాధి చెందిన ఘట్టాన్ని చెప్పుకుందాము.

***"గురు పాదంబుల పూజించు - దుర్గుణ జాలంబును ఛేదించు***
***స్వామి సమర్థుని సేవించు - పరమార్థంబదియని గ్రహియించు***
***దత్త దత్తయని స్మరియించు - ఆ దత్తాత్రేయుని మదినెంచు***
***చిత్తములోన శ్రీస్వామిని నిల్పి - సద్గురు జ్యోతిని దర్శించు!"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***యాభైయ్యవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"ఓం గురు - జయ గురు జగద్గురు

జగద్గురు - శ్రీస్వామి సమర్థా"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## యాభై ఒకటవ అధ్యాయము

సాధకులారా!

మానవజన్మ చాలా విలువైనది. యోగసాధనకు అనువైనది. అనేక జన్మల పుణ్యఫలం వలన అది లభించినది. అందువలన ఈ మానవ శరీరమును జాగ్రత్తగా కాపాడుకొని దీనిద్వారా మోక్షమును పొందాలి. వేరే మార్గమే లేదు. అలాగని దీనిపైన అమితమైన ప్రేమను పెంచుకొనగూడదు. ఇది నీచమైనదనీ, చీము రక్తములతో నిండినదనీ, రోగము మరణము పొందునదనీ నిర్లక్ష్యము చేయకూడదు. సద్గురుని చేరి వారిద్వారా తత్త్వమును తెలుసుకొని ఈ శరీరమును సాధనంగా ఉపయోగించుకొని మోక్షమును పొందాలి. యోగులు శరీరతత్త్వము తెలిసిగూడ ఇది యోగ సాధనకు ఉపయోగపడును కావున దీనిని వందలాది సంవత్సరముల వరకు తమ కార్యసాధన కొరకు ఉపయోగించుచుందురు. అలా జీవించిన యోగుల మహిమవల్లనే ఎంత పాపం పెరిగినా ఈ భూమాత ఓర్పు వహించి వున్నది. వీరి తపస్సు, సాధనలే జగత్తుకు రక్షా కవచంలాగ పనిచేస్తున్నది. ఇదే జగన్నిర్మాణ కార్యం. కాశీలో మణికర్ణికా ఘట్టంలో నివసించిన యోగి పుంగవులు శ్రీ త్రైలింగస్వామి సుమారు రెండు వందల సంవత్సరాలు జీవించి, యోగులను, భక్తులను అనుగ్రహించిరి. అలాగే శ్రీస్వామి సమర్థులు నాలుగు వందల సంవత్సరములు పైననే జీవించి భక్తులను అనుగ్రహించినారు. అందువలన శరీరం ముఖ్యమైనదే. కాని దీనిపైన అమితమైన మోహము వుండరాదు. 'అతి సర్వత్రా వర్జయేత్' అని శ్రీకృష్ణ భగవానుని ప్రబోధమును గుర్తుంచుకోవాలి.



# జగద్గురు శ్రీశ్రీశ్రీ స్వామి సమర్థ అక్కల్‌కోట మహారాజ్‌వారి మహా సమాధి

విద్యాసాగరా!

శ్రీస్వామి సమర్థులు నూరు సంవత్సరముల పర్యటన పూర్తిచేసుకొని 1856 సంవత్సరంలో అక్కల్‌కోటకు చేరినారు. వారిని ఎవరూ శాసించలేరు. వారే ఈ జగత్తుకు శాసకులు. శ్రీస్వామివారిని ఇరువది రెండు సంవత్సరములు ఆ గ్రామములో నిలుపుకొన్న ఆ గ్రామ ప్రజల భక్తి శ్లాఘనీయము. శ్రీస్వామి ఆ చుట్టుపట్లనున్న గ్రామములకెప్పుడైనా వెళ్ళినా తిరిగి ఆ గ్రామమునకే వచ్చిరి. అచ్చటి మట్టి వారి పాదస్పర్శతో పునీతమైనది. క్రమముగా గొప్ప యాత్రాస్థలముగా ప్రసిద్ధికెక్కినది. గాణుగాపురము దర్శించిన భక్తులకు అక్కల్‌కోట దర్శించమని ఆదేశము. స్వప్నములోగాని, ఎవరైనా సాధువుల మాటద్వారాగాని అంది, వెంటనే వారు అక్కల్‌కోటకు వచ్చి శ్రీస్వామిని దర్శించుకునేవారు. గాణుగాపురము నుద్ధరించిన మహాపురుషుడే శ్రీస్వామి సమర్థులని అనేకమందికి స్పష్టమైన ఋజువు లభించినది. వార్కారి పాండురంగ భక్తులకు పండరీపురము, ఆళంది పుణ్యక్షేత్రములు గొప్ప దర్శనీయ క్షేత్రములు. అట్లే దత్త భక్తులకు శ్రీ గాణుగాపురమును, అక్కల్‌కోటయున్నూ దర్శనీయ క్షేత్రములు. శ్రీస్వామి సమర్థుల మహిమవలన ఆయన దర్శనార్థము ప్రతిదినము రెండు మూడు వేల మంది జనులు అక్కల్‌కోటకు వచ్చిపోవుచుండెడివారు. శ్రీస్వామి ఎల్లప్పుడూ భక్తుల మధ్య సందడిగా, కోలాహలంగా వుండేవారు. ఆఖరిదశలో ఎక్కువ సమయం కంబళిని కప్పుకొని పాదములను బయటకుండులాగున ప్రక్కమీద జారగిలపడుకొనేవారు. భక్తులు ఎప్పుడు వచ్చినా పాదనమస్కారములు చేసికొనుటకు వీలుగా వుండేవారు.

శ్రీస్వామి మహావటవృక్షమైతే భక్తులు ఆ వటవృక్షముయొక్క కొమ్మలపై విశ్రాంతి తీసుకొనే పక్షులవంటివారు. ఆ వటవృక్షపు నీడన అనేకమంది అలసిపోయిన బాటసారులవలె శ్రీస్వామి అండన అనేకమంది భక్తులు తమ అలసటను, బాధలను తీర్చుకొనేవారు. ఎప్పుడైనా శ్రీస్వామి సమర్థులు బయటకు బయల్దేరినప్పుడు గురువులకు గురువైన జగద్గురు చిహ్నములను తీసుకొని జయజయ నాదములు చేయుచు, వారి ఘనతను కీర్తించే భజన పాటలు పాడుచూ వారివెంట భక్తులు కోలాహలంతో సాగిపోవుచుండెడివారు.

చోళప్ప నిర్యాణానంతరం శ్రీస్వామి అప్పుడప్పుడు తమ దేహయాత్ర పూర్తికానున్నదని చెప్పుచుండేవారు. వారి చర్యలద్వారా చాలా సూచనలు చేసిరి. శ్రీస్వామివారు తాము పడుకొనే పరుపును చుట్టించి దగ్గరనున్న చెట్టుకొమ్మకు వ్రేలాడదీయమన్నారు. ఒక్కొక్కసారి భక్తులు పంచహారతి చేయు సమయంలో స్వయంగా వచ్చి ఆ హారతిని బోర్లించేవారు. ఈ సూచనలనుబట్టి శ్రీస్వామి చేష్టలు గమనిస్తూ భక్తులు లోలోన బాధపడసాగిరి అని చెప్పి నిత్యానందుడు శ్రీస్వామి నిర్యాణ ఘట్టాన్ని మనసులో దర్శిస్తూ బాధను తట్టుకోలేక కన్నులనుండి అశ్రువులు స్రవిస్తుండగా కొంత సమయం మౌనంగా వుండిపోయారు. విద్యాసాగరుడుకూడ ఇదే స్థితిలో వుండిపోయాడు. కొంతసేపటికి తెప్పరిల్లి గద్గద స్వరంతో నాయనా! విద్యాసాగరా! సద్గురు తన శరీరాన్ని విసర్జించి తిరిగి తన విశ్వశక్తిలోనికి లయమయ్యే సమయం ఆసన్నమైనది. వీరు శరీరాన్ని విసర్జించి విశ్వవ్యాపకంగా సర్వజీవులకూ తమను తాము సంపూర్ణంగా దత్తం చేసుకోబోవుచున్నారు.

కొన్నిరోజుల తర్వాత శ్రీస్వామి సమర్థులు దగ్గరలోనున్న 'సాలగర్'అను గ్రామమునకు నడచి వెళ్ళిరి. భక్తులు వారిని అనుసరించిరి. అక్కడ అడవిలోనికి వెళ్ళి శ్రీస్వామి ఇక్కడనే వుంటాననిరి. భక్తులు అష్టకష్టములు పడుచూ వారిచుట్టూ చేరియుండిరి. భక్తులు ఎంత కష్టపడి అచ్చటికి రాగలిగారో శ్రీస్వామికి చెప్పుకొనగా విని పెద్దగా నవ్వేవారు.

ఒకరోజు శ్రీస్వామి సమర్థులు "బాలప్పా! మేము సుదీర్ఘ ప్రయాణము చేయబోవుచున్నాము, మాతో రాగలవా?" అనిరి. శ్రీస్వామివారి మాటలలోని ద్వంద్వార్థమును గుర్తించి బాలప్ప ఇంతకంటె మహాభాగ్యమేమున్నదని మనసున తలచి "శ్రీస్వామీ! మీరు తోడుగనున్నప్పుడు ఎచ్చటికైనా వచ్చెద"నని వారి పాదములపై తలయుంచి సమాధానమిచ్చెను.

హఠాత్తుగా శ్రీస్వామివారు 'సాలగర్' నుండి తిరిగి అక్కల్‌కోటకు చేరిరి. అక్కడ వున్న జంగాల మఠమువద్ద శ్రీస్వామి నిలబడి భక్తుడైన భావడేకర్‌ను పిలిచి ఐదువందల పిడకలు తెమ్మనిరి. వానిని అక్కడ మఠములోనున్న శివలింగము చుట్టును, పైనను పేర్చుమని ఆజ్ఞాపించిరి. తర్వాత దానికి స్వయముగా శ్రీస్వామి నిప్పు అంటించిరి. అందులో హోమములోవలె ఐదుశేర్ల



కర్జూరకాయలు, పండ్లు, బియ్యము, కొబ్బరికాయలు, తాంబూలము, ఆవునెయ్యి మొదలగు ఆహుతులు వేయించిరి. ఈ వార్త ఊరందరికి తెలిసెను. జంగాలు పరుగు పరుగున పట్టలేని కోపముతో వచ్చిరి. కాని ఆ జగద్గురుని కార్యమును ఖండించలేక బాధతో అట్లే చూచుచుండిరి. మర్నాడు శ్రీస్వామి సమర్థులు ఆ బూడిదనంతయు తొలగించమనగా భక్తులు తొలగించిరి. ఆశ్చర్యము! శివలింగముగాని, పానువట్టముగాని చెక్కుచెదరలేదు. మునుపటికంటే చాలా తేజస్సుతో వెలుగుచుండెను. జంగములకు ఈ వింత చూచి నోట మాటరాలేదు. శ్రీస్వామి పాదములకు నమస్కరించి వెడలిపోయిరి.

మహాత్ముల చర్యలు బహు నిగూఢములుగ వుండి సాధారణ మనసున కందవు. ఒకనాడు శ్రీస్వామి సమర్థులు తాత్యా సుబేదారు ఇంటికి వెళ్లిరి. శ్రీస్వామి భక్తులలో నొకరిని పిలచి అక్కడనున్న తులసికోటను మురళీధరుని ఆలయంవద్దనున్న కోనేరులో పడవేయవలెనని ఆజ్ఞాపించిరి. ఆ తులసికోట ఒకరికి ఎత్తలేనంత బరువైనది. భక్తులు శ్రీస్వామి ఆజ్ఞను కాదనలేక దానిని కదిలించి మోసుకొని వెళ్ళిరి. శ్రీస్వామి దగ్గరుండి తానుకూడ చేతితో పట్టుకొని నీళ్ళలోనికి వదిలిరి. అది బరువుగా అడుగున చేరుచుండగా, అందరిని "భమ్! భమ్!!" అని గట్టిగా అరవమనిరి.

ఆ ప్రాంతమున అది అశుభశూచకమని అందరకూ తెలియును. అయినా శ్రీస్వామి చెప్పినట్లు చేసిరి. అది తన దేహయాత్ర పూర్తిగావచ్చినదని సూచన కావచ్చును. శ్రీస్వామి సమర్థులు ఒకనాడు 'నంగన్ హాళ్ళి' గ్రామమునకు వెళ్ళిరి. ఆ గ్రామస్థులతో అదే ఆఖరు దర్శనమని సంకేతము నిచ్చిరి.

శ్రీస్వామి సహజముగా భజన చేయుచున్నప్పుడు పాటపాడేవారు కాదు. కాని చేతులతో తాళం వేయుటయో, చిన్న పిల్లవానివలె ఒకచోట ఆడుకొనుచుండుటయో చేయువారు. అట్లుగాక –

***"శివహర శంకర – నమామి శంకర – శివశంకర శంభో***
***హే గిరిజాపతి – భవాని శంకర – శివశంకర శంభో"***

అని స్వయముగా పాట పాడుచు అట్లే భజన చేయమనిరి.

ఆ నామమును ఉత్సాహముతో ఉచ్చైస్వరమున అందరూ పలికిరి. అప్పుడప్పుడు శ్రీస్వామి చిన్నచిన్న రాళ్ళతో సమాధులవలె కట్టుచుండేవారు.

ఈ సంకేతాలు కొంతవరకూ అర్థమైన భక్తులందరూ శ్రీస్వామి త్వరలోనే శరీరం విడువబోవుచున్నారేమోనని ఆందోళన చెందసాగిరి.

విద్యాసాగరా! మహనీయులు సర్వస్వతంత్రులు. వారిని వారే నియమించుకొందురు. వారు ఎవ్వరి ఆధీనంలోను వుండరు. కాలము, ప్రకృతి అంతా వారి ఆధీనంలో వుంటుంది. వారు సంకల్ప సిద్ధులు. అక్కల్‌కోటలోని శ్రీస్వామి భక్తులు, సేవకులు దుఃఖపడినా అదృష్టవంతులుగానే భావించ బడినారు. ఇకముందు కథ చెప్తాను వినుము.

***"ఓం త్ర్యంబకం యజామహే***
***సుగంధిం పుష్టి వర్ధనం***
***ఉర్వారు కమివ బంధనాత్***
***మృత్యోర్ ముక్షీయ మామృతాత్"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్** (శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***ఏబది ఒకటవ అధ్యాయము** సంపూర్ణము*







ఓం శ్రీ సాయిరాం

"ఓం గురుర్బ్రహ్మ - గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ - తస్మై శ్రీ గురువేనమః"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## యాభై రెండవ అధ్యాయము

సాధకులారా!

సముద్ర స్నానమువలన మానవులకు సకల తీర్థములందు, సకల నదులందు స్నానముచేసిన పుణ్యఫలం కలుగును. అట్లే అతి విస్తారము, అనంతమూ అయిన ఈ సద్గురు చరిత్ర అనేక ధర్మాలను ఇముడ్చుకొన్న మహాసాగరం వంటిది. ఇందు స్నానమాడుట అనగా ఈ చరిత్రపారాయణ చేయుట. ఇది అంతులేని సత్ఫలితాలనిస్తుంది. సద్గురు పాదోదకం ఎట్టి పాపములనైనా పరిహరిస్తుందన్న విశ్వాసముతో పారాయణ చేయాలి. ఇదే దివ్యలీలామృతం. రండి, పానము చేసి తరించండి. శ్రీస్వామి దర్శనాశీస్సులు పొందండి. వారి పరిరక్షణలో ఈ ధోరణిలో అసాధ్యమైనదేదీ లేదు.

*జై శ్రీ స్వామి సమర్థ*
*జై శ్రీ సాయిబాబా*
*జై శ్రీ దత్తావతారా*

శ్రీస్వామి నిత్యానందులిట్లు చెప్పసాగిరి. విద్యాసాగరా! ఈ అధ్యాయములో శ్రీస్వామి మహాసమాధిని పొందిన లీలలను తెలుసుకొందాం.

ఒకరోజు తాత్యా సుబేదారు ఇంటిలో జరిగిన సంఘటన తర్వాత శ్రీస్వామివారికి జ్వరం తగిలింది. రెండు రోజుల విశ్రాంతి తర్వాత కోలుకున్నారు. భక్తులు సంతోషించారు. మరల కొద్దిరోజులకు జ్వరం వచ్చింది. తీవ్రత హెచ్చింది. శ్రీస్వామి అప్పుడు ఒక మామిడి తోపులో వున్నారు. జ్వరము

తగ్గుముఖము పట్టకపోవుటవల్ల, భోజనము చేయకపోవుటవల్ల భక్తుల ఆందోళన హెచ్చినది.

సఖారాంలోఖండే అనే భక్తుడు శ్రీస్వామివద్దకు చేరి వారికి ప్రియమైన వటవృక్షము వద్దకు తీసుకొని వెళ్ళుటకై శ్రీస్వామి అనుమతి కోరెను. శ్రీస్వామి అంగీకారముగ తలను ఊపినారు. భక్తులు శ్రీస్వామిని అక్కడికి చేర్చిరి. అప్పటినుండి వారి పరిస్థితి క్షీణించుచున్నట్లు కనిపించుచుండెను. అయినా శ్రీస్వామి నిత్యము ఆరోగ్యవంతునివలె స్నానము మొదలగు పనులు చేసుకొనుచుండిరి. వారు ఎంత నీరసముగానున్నా ఏమీ లేనట్లు నవ్వుతూ కన్పించేవారు. ఎంతో అవసరమైతేగాని ఎవ్వరినీ దగ్గరకు రానీయడం లేదు. కనీసం రెండు ముద్దలైనా ఆహారం తినుటలేదని భక్తులు, సన్నిహితులైన శిష్యులు బాధపడిరి. సుందరాబాయి బలవంతముచేసి రెండు చెంచాలు ద్రవాహారము ఇవ్వగా స్వీకరించిరి. ప్రేమపూర్వకమైన భక్తితో సుందరాబాయి "శ్రీస్వామి మహరాజ్! తమ ఆరోగ్యం ఎప్పుడు కుదుటపడుతుంది?" అని అడిగింది. శ్రీస్వామి ప్రేమతో చూస్తూ "ఆమాట తలపెట్టవద్దు! మేము మా స్వస్థానమునకు పోవాలి!" అన్నారు ముక్తసరిగా.

ఆ మాటవిని భక్తులు బెంబేలు పడినారు. ఎన్నో ప్రార్థనలు చేసినారు. ఘన వైద్యులను పిలిపించిరి. కాని శ్రీస్వామి మందులు వేసుకొన నిరాకరించిరి. మరీమరీ భక్తులు వేడుకొనగా ఒకసారి మందు మ్రింగి వాంతి చేసికొనిరి. ఆపైన ఇక ఎవ్వరికీ ధైర్యము లేకపోయెను. ఆయన ఎందరినో చావునుండి కాపాడిరి. ఇప్పుడు వారి సంకల్పమువల్లనే ఈ శరీరమును విడువబోవుచున్నారని తెలుసుకొనిరి.

నెమ్మదిగా సుందరాబాయి మరల "శ్రీస్వామీ! ఎప్పుడు మామూలుగ తిరిగేది?" అని అడిగినది. శ్రీస్వామి "పెద్దపెద్ద పర్వతాలు నన్ను పిలిచినప్పుడు!" అనిరి. అంటే యోగులు, సాధకులు తనను ఆహ్వానించినప్పుడు మరల జన్మయెత్తి వచ్చెదమన్న భావన కావచ్చును.

మరల ఒకసారి శ్రీపాదభట్ అదేవిధంగా ప్రశ్నింపగా శ్రీస్వామి "పండరి దగ్ధమైనప్పుడు"అని సమాధానమిచ్చారు. అంటే ధర్మం పూర్తిగా తగలబడినప్పుడనే భావం కావచ్చును. కన్నీరు కార్చుచు బరువెక్కిన హృదయములతో



అక్కడి భక్తులు, సేవకులు ఎంతో ఆందోళనపడుచున్న విషయం శ్రీస్వామి ఎరుగుదురు. అందుకే వారు ఎప్పుడూ చిరునవ్వు నవ్వుచూ దర్శనమిస్తున్నారు. వారినుత్సాహపరచుటకై భజనలు చేయించుచుండిరి. తమ ప్రియతమ మంగలి గోపాలుని పిలిపించి క్షౌరము చేయించుకొని, స్నానము చేయించుకొనిరి. సేవకులు హారతినిచ్చిరి. శ్రీస్వామి తన చుట్టూవున్న వారినందరిని ప్రేమపూరిత చూపులతో పలుకరించిరి. చాలా ఉత్సాహముగ నున్నట్లు శ్రీస్వామి కనిపించిరి. శ్రీపాదభట్‌ను మట్టిచెట్టు మొదళ్ళు త్రవ్వమనిరి. అనగా మట్టిచెట్టు క్రింద సాధన కొనసాగించమని భావన.

గణపతిరావును దగ్గరకు పిలచి దేవాలయమే నీ ఇల్లుగ వుండమని చెప్పారు. అనగా, నిత్యము దేవాలయములలో నిత్యకర్మలు విధిగా చేయమని బోధించిరి. బాలప్పను "నీవు అక్కల్‌కోటలోనే వుండు!" అని ఆజ్ఞాపించిరి. చివరకు అందరకూ ఒకటే సలహాగా భగవద్గీతలోని 9వ అధ్యాయంలోని ఇరువది రెండవ శ్లోకమును చెప్పిరి.

***"అనన్యా శ్చింతయంతో మాంయేజనాః పర్యుపాసతే***
***తేషాం నిత్యాభియుక్తానాం - యోగక్షేమం వహామ్యహమ్"***

*"నన్నే తలచిన భక్తులకు - ఇతరము నెరుగని వ్యక్తులకు*
*సర్వము నేనే యొసగెదను - అందరి రక్షణ నాయందే"*

ఎవరు పూర్ణంగా శారీరకముగ, మానసికముగా ఆత్మను నాకే అర్పించుకొందురో వారు ఇహమందు సకల సౌఖ్యములు, ఆపైన ముక్తిని పొందెదరు. దైవములో లీనమగుటకిదే మార్గం. మానవ జన్మకిదే సార్థకత అని చెప్పిరి.

శ్రీస్వామి సమర్థులు భక్తుల సంతోషముకొరకై, వారియొక్క తృప్తికై కొద్దిగా ద్రవాహారము తీసుకొనిరి. భక్తితో బాలప్ప తాంబూలము సమర్పించెను. ప్రేమతో దానిని వేసుకొనిరి. ఆయన కూర్చొనెదననగా లేపి కూర్చొనబెట్టిరి. శ్రీస్వామి ముఖము నిర్మలముగాను, దివ్య వర్చస్సుగల్గి ప్రకాశవంతముగా నుండెను. అందరు దుఃఖపడక ధైర్యముతో నుండుడని చెప్పిరి. అందరికీ జ్ఞాన సూర్యుడస్తమించబోవుచున్నాడని తెలిసినది. లోకము చీకటిమయము కాబోవుచున్నదని భక్తుల హృదయాలలో విషాదచ్ఛాయలు అలుముకొనెను. అందరి ముఖములు వ్రేలాడబడుచుండెను.

ఒక భక్తుడు శ్రీస్వామిని "అనుష్ఠానము చేయమందురా!" అని అడిగెను. అక్కరలేదని శ్రీస్వామి బదులు చెప్పిరి. శ్రీస్వామి ఆవును దూడను విడిచిపెట్టమని ఆదేశించిరి. శిష్యులు వెళ్ళి అట్లే చేసిరి. ఆవు, దూడ రెండును పరుగున వచ్చి శ్రీస్వామివారి చుట్టును ముమ్మారు తిరిగి, వారి పాదములవద్ద తమ తల నుంచెను. తర్వాత తిరిగి చూచుచు నెమ్మదిగా వెళ్ళిపోయినవి. వాటికి అక్కడ నుండి వెళ్ళుటకు యిష్టం లేనట్లుండెను.

నా రాశి మీనరాశి అని శ్రీస్వామివారు చెప్పిరి. ప్రస్తుతం శని ఆ రాశిలో సంచరించుచున్నాడు. ఆ సమయంకొరకు వేచివున్నట్లు కనిపించిరి. ఆ సమయంలో ఒక భక్తుడు శ్రీస్వామీ! ఏమైనా దానమిచ్చెదరా అని అడిగెను. అందులకు శ్రీస్వామి "మీకిష్టమైనచో చేయుదని నావద్ద ఏమున్నది గోచీ తప్ప అదియును కొంచెము వ్యవధిలో విడువవలసి యున్నదని" సమాధానమిచ్చిరి. అంతకు ముందురోజున అనుకోకుండా రు.350/-లు పెట్టి శ్రీస్వామి ఒక శాలువను తెప్పించి పండిట్ రామశాస్త్రి అవధాని అను బ్రాహ్మణునకు దానమిచ్చిరి.

శ్రీస్వామిని ఒక భక్తుడు "బయట చాలా చల్లగానున్నది. లోనికి తీసుకు వెళ్ళమందురా?" అనిరి. దానికి శ్రీస్వామి "వద్దు. నేనిప్పుడు ఈ చెట్టులో కలిసిపోవాలి" అన్నారు. ఎవరైనా శ్రీస్వామిని మీ ఊరేమి, పేరేమియని అడిగినప్పుడు శ్రీస్వామి మాది దత్తనగరము. నా తల్లిదండ్రులు ఆ మట్టిచెట్టే అని చెప్పేవారు.

ఆ సమయములో 'రాణిసాహెబా' శ్రీస్వామివారిని చూచుటకై వచ్చినది. ఆయన ఆనందముగా కనిపించుటచేత శ్రీస్వామి ఆరోగ్యము బాగుపడుచున్నదని చూచి వెడలిపోయెను.

అప్పుడు శ్రీస్వామి సమర్థులు పద్మాసనములో కూర్చుండిరి. భక్తులకిట్లనిరి : "ఎవరూ దుఃఖపడరాదు. నేను సర్వత్ర, అన్ని స్థానములలో వున్నాను. నా భక్తుల పిలుపునకందుబాటులోనే వుంటాను!" అని ఆఖరి సందేశమిచ్చి కన్నులు మూసుకొనిరి. ఆయన ముఖపద్మములో శాంతి ప్రస్ఫుటముగా కనబడుచుండెను. వారి నోటినుండి తెల్లటి వెలుగు మూడుసార్లు మెరిసినది. భక్తులు మరల శ్రీస్వామి కన్నులు తెరచి మాటలు చెప్పుదురేమోనని ఇంకను ఆశతో వారివంక చూచుచునే యుండిరి. కాని శ్రీస్వామి సంకల్ప



సిద్ధులు. కావున వారు నిశ్చయించుకొన్నట్లు అనంతములో కలసిపోయిరి. భక్తులపాలిట దుఃఖము మిగిలెను. శ్రీస్వామి ఎన్నోమార్లు దుఃఖించవద్దని ఆదేశించినా అందరికి దుఃఖము కట్టలు తెంచుకొని ప్రవహించెను. కొందరు వెక్కి వెక్కి ఏడ్వగా, కొందరు గుండెలు బాదుకొని ఏడ్చిరి. మరికొందరు మూర్ఛిల్లిరి. మావలన ఏమి అపరాధము జరిగి శ్రీస్వామి మమ్ము విడిచి వెళ్ళినావు! అని కొందరు క్రిందపడి దొర్లి ఏడ్చిరి. నీ పరిరక్షణలో మా జీవితములు పునీతము లైనవని, ఇప్పుడు మా బ్రతుకు శూన్యముగా కనిపించుచున్నదని కొందరు రోదించిరి. నీవే తల్లివి, తండ్రివి, గురువు, దైవమని భావించితిమే! మమ్ము అనాధలనుచేసి వెళ్ళితివా స్వామీ! అని మరికొందరు దుఃఖించిరి. ఇప్పుడు మాకు దిక్కెవ్వరు, మా గోడు ఎవరికి చెప్పుకొనేదని కొందరేడ్చిరి. ఎవ్వరేమన్నను దైవనిర్ణయం జరిగిపోయినది. శ్రీస్వామి చెప్పినట్లు నడుచుటయే మన కర్తవ్యము అని ఒకరినొకరు ఓదార్చుకొనిరి. శ్రీస్వామి మహా నిర్యాణవార్త చుట్టుప్రక్కల గ్రామములకు నిముషములలో అగ్నివలె వ్యాపించెను. ఆ జగద్గురుని ఆఖరు దర్శనమునకై ప్రజలు వటవృక్షము క్రిందకు చేరుకొనిరి. గుండెలు బాదుకొని ఏడ్చువారిని అంతకుముందు ఏడ్చి ఓదార్పు పొందినవారు ఓదార్చిరి. ఇట్లు వారి లీలలను చెప్పుకొనుచు దుఃఖించు సమయముననే సన్నాయి, డోలు వాయిద్యములు మ్రోగించబడుచుండెను. ఊరట చెందిన భక్తులు శ్రీస్వామి ఆఖరున చెప్పిన మాటలు జ్ఞప్తికి తెచ్చుకొని "హరహర మహాదేవ్" అని నినాదములు చేయుచుండిరి. కొందరు భజన కీర్తనములు పాడిరి. కొందరు పెద్దలు దుఃఖమునుండి తేరుకొని ప్రస్తుత కర్తవ్యము ఆలోచింపవలెననిరి. సద్గురు మహాసమాధికేర్పాట్లు చేయుచుండిరి.

పూలతో అలంకరించబడిన ఒక విమానమును తయారుచేయించిరి. అందులో శ్రీస్వామి సమర్థుల భౌతికకాయమును ఎత్తి కూర్చొనబెట్టిరి. అక్కల్‌కోట రాజా సంస్థానము వారు రాజులకు రాజైన శ్రీస్వామి సమర్థుల అంతిమయాత్రకు రాజగౌరవము పాటించవలయుననియు, బాగుగా అలంకరింపబడిన ఏనుగులు, గుర్రములు, సైనిక బ్యాండుతో పదాతి దళమును ఊరేగింపునకు ముందు-వెనుక వచ్చునట్లేర్పాటు చేసిరి. రాజదీవితో

మహోత్సవమువలె జరిగిన శ్రీస్వామి మహానిర్యాణోత్సవంలో కంట తడిపెట్టనివారే లేరు.

ఆ ఉత్సవము చివరకు చోళప్ప ఇంటివద్దకు చేరి ఆగెను. శ్రీస్వామి సమర్థుల ఆదేశము, చోళప్ప కోరిక అందరికి తెలిసిన విషయమే. అందుచేత శ్రీస్వామి భౌతిక కాయమును చోళప్ప ఇంటి ఆవరణలో అంతకుముందే ఏర్పాటు చేసియుంచిన చోటున సమాధి చేయుటకై అందరు నిశ్చయించిరి. యధావిధిగా ఆ ఉపాధికి పూజలు చేసిరి. సాంబ్రాణి ధూపము, అగరువత్తుల ధూపము వేసి, కర్పూర హారతి యిచ్చిరి. మంచి గంధముపూసి, కస్తూరి, అత్తరు జల్లిరి. జీరపోయిన స్వరముతోనే హారతిపాటలు పాడిరి. బాలప్ప మహరాజ్, నానాసాహెబ్ బార్వే, కర్భారి, బాబురావు మోఘే. మమల్తదారు పద్మాసనములో కూర్చునియున్న శ్రీస్వామి ఉపాధిని మెల్లగా ఆ సమాధిలోనుంచిరి. అందరు దగ్గరగా శ్రీస్వామి దర్శనము చేసుకొని బరువెక్కిన హృదయాలతో కన్నులు తుడుచుకొనిరి. తర్వాత ఆ సమాధిపై శిలాఫలకమును వేసిరి. వేదమంత్ర పఠనము, పూజాది క్రమము చోళప్ప కుమారుడైన కృష్ణప్ప, చోళప్ప అల్లుడైన శ్రీపాదభట్ ఘనముగా చేసిరి. వేలకొలది కంఠస్వరములతో ఒక్కసారిగా –

***"అనంతకోటి బ్రహ్మాండనాయక, రాజాధిరాజ, యోగిరాజ శ్రీస్వామి సమర్థ అక్కల్‌కోట మహరాజ్‌కీ జై!"***

అనుచు దిక్కులు పిక్కటిల్లునట్లు జయఘోష చేసి ఆ సమాధిని శాశ్వతముగా మూసివేసిరి. క్రమముగా వాతావరణము శాంతించినది. కాని విషాద ఛాయలు మేఘమువలె క్రమ్మియుండెను. ఆ లోపమును ఎవ్వరును తీర్చలేరు.

శాలివాహన శకము 1800 చైత్ర శుద్ధ త్రయోదశి క్రీ॥శ॥ 1878వ సంవత్సరము మంగళవారం సాయంకాలం 4 గంటలకు శ్రీ దత్తాత్రేయుని నాలుగవ అవతారముగా కొనియాడబడిన శ్రీస్వామి సమర్థుల యాత్ర ఈ భూమిపై ముగిసినది. వారు అమృత స్వరూపులు. సమాధి అనంతరం మహా దుఃఖితుడైన బాలప్ప తానుకూడ జీవనయాత్ర ముగించవలెనని తలంచెను.



ఇతరులు ఎంత చెప్పినా వినక అన్న - పానీయములు మానివేసెను. అట్లు మూడురోజులుండెను. మూడవరోజు శ్రీస్వామి సమర్థులు స్వయముగా బాలప్పకు దర్శనమిచ్చిరి. బాలప్ప వంగి సద్గురు పాదములకు నమస్కరించగా, శ్రీస్వామి తన చేతులతో లేవనెత్తి పరమప్రేమతో విశ్వమాతవలె "నాయనా! దుఃఖించవద్దు. నేను ప్రసాదించిన పాదుకల రూపంలో నేను నీవద్ద వున్నాను. నీ పూజలందుకొనుచునే యున్నాను. ధీరుడవై నా భౌతిక రూపమును, దానికంటే విశిష్టమైన పూర్ణస్వరూపమును గ్రహించు. సర్వవ్యాప్తమైన పరిపూర్ణ చైతన్యస్థితియందు ధారణచేయుమని ఆశీర్వదించి అదృశ్యులైరి. వారికి శరీరముతో పనిలేదు. సర్వత్ర-వారు వుందురని భక్తులకిచ్చిన మాట ఇప్పటికినీ సత్యమగుచున్నది. ఎందరికో సజీవదర్శనమిచ్చుచున్నారు. భక్తుల కోరికలు నెరవేర్చుచున్నారు. ప్రమాదములను తప్పించి, వారి కష్టములను తీర్చి కాపాడుచున్నారు. దృఢభక్తితో, ఆర్తితో ప్రార్థనచేసి ఎవరు పూర్ణ విశ్వాసము, ఓర్పు, శ్రద్ధ నిర్మలమైన మనసుతో ఆయనకు శరణాగతి చేస్తున్నారో వారిపై శ్రీస్వామి అమోఘమైన కరుణ ప్రసరింప చేస్తున్నారు, శాంతిని ప్రసాదిస్తున్నారు.

***ఓం స్వామి సమర్థా! మహరాజ స్వామీ!***
***ఓం స్వామి సమర్థా! మహరాజ! పాహి!***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
**శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము**
**ఏబది రెండవ అధ్యాయము** సంపూర్ణము





ఓం శ్రీ సాయిరాం

ఓం గురునాథా - శ్రీ గురునాథా

ఓం గురునాథా - శ్రీ దత్తాత్రేయ

శ్రీ దత్తాత్రేయాయ నమః

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## యాభై మూడవ అధ్యాయము

సాధకులారా!

మహాసమాధి అంటే అవ్యక్తరూపమును పొందుట. మహాత్ములు చూపే అనేక లీలలలో ఇదికూడా ఒక భాగము. మొదట దివ్యశక్తి అవ్యక్తంగా వుండి అవతారముగా వ్యక్తమగుచున్నది. అది తిరిగి నిజస్థితికి, పూర్వస్థితికి చేరుచున్నది. మహాత్ముల భావనలో ఇది జీర్ణవస్త్ర విసర్జనవంటి అతి తేలికైన పని. అయినా వారు అవ్యక్తరూపులుగానే వుంటూ అవసరమైనప్పుడు భక్తులకు స్వప్నంలో సందేశాలిస్తుంటారు. ఇంకా అవసరమైతే, ఇతర అవతార పురుషులను దర్శనం చేసుకొని శాంతిని పొందమని చెప్పిన లీలలు అనేకం. ఇది వారికి సహజము, సాధారణము.

విద్యాసాగరా! శ్రీస్వామి మహాసమాధి పొందిన పిదప కొందరు భక్తులకు భౌతిక దర్శనభాగ్యం కలిగించారు. కొందరికి తమ అవతారం షిరిడిలో వున్నదని అక్కడకు వెళ్ళి సేవించుకొమ్మని ఆదేశించారు. ఈ కథలను చెప్పుకొందాము రా!

విద్యాసాగరా! శ్రీస్వామికి సన్నిహితంగా వుంటూ నిత్యమూ సేవచేసిన బాలప్ప శ్రీస్వామి మహాసమాధి పొందుటను, వారి ఆజ్ఞను తలచి, తలచి దుఃఖాక్రాంతుడైనాడు. లోకమంతా చీకటియైనట్లు ఇక తానెవరికొరకు బ్రతకాలో తెలియని అయోమయస్థితిలో పడినాడు. అతను శ్రీస్వామినే తల్లి, తండ్రి, గురువు, దైవముగా భావించి ఆరాధించినవాడు. తలచుకొన్న కొద్దీ దుఃఖమే ఆవరిస్తున్నది. తన గురువు దూరమైన ఆ జీవితం తనకక్కరలేదనే భావించాడు. శ్రీస్వామి తాను సుదీర్ఘ ప్రయాణమునకు సిద్ధమగుచున్నాను, నీవు నాతో



రాగలవా? అని అడిగినప్పుడు మీరు అండగా వున్నపుడు ఎక్కడికైనా రాగలనన్నాడు గదా! ఇప్పుడు శ్రీస్వామి వెళ్ళిన చోటికి తాను వెళ్ళలేకపోయినానే అని ఇక తాను అన్న-పానీయాలు మానివేసి ఈ శరీరాన్ని వదలుటకై నిశ్చయించుకున్నాడు. అలా మూడురోజులు గడిచాయి. ఎవరెంత హితవచనాలు చెప్పినా వినలేదు. మూడవరోజున శ్రీస్వామి సమర్థులు బాలప్పకు సాక్షాత్కరించారు. చేతిలో కమండలంతో దివ్య వర్చస్సుతో వెలిగిపోతున్న శ్రీస్వామికి బాలప్ప పాదాలు పట్టి సాష్టాంగ వందనం చేశాడు. శ్రీస్వామి వంగి బాలప్పను ప్రేమతో లేవనెత్తి "వత్సా! దుఃఖమెందులకు అది నీకు తగదు. ధీరుడవై వర్థిల్లు! నీకు నేను యిచ్చిన పాదుకలు నా రూపం కదా! వానికి చేసే పూజలు, సేవలు నేను స్వీకరిస్తాను. నేనెల్లవేళల నీవద్దనున్నట్లే భావించుకో! నేను లేనిచోటు లేదు. నీలోను నీ చుట్టూనూ వున్నాను. ఈ విశ్వమంతయూ నిండి ఇంకనూ శేషించియున్న నా తత్త్వమును అవగతం చేసుకో. నా ఆశీస్సులు నీకెప్పుడూ వుంటాయి!" అంటూ శ్రీస్వామి బాలప్పను ఆశీర్వదిస్తూ అదృశ్యమైనారు. అప్పటికి బాలప్ప దుఃఖము ఉపశమించి ఆ పాదుకలను సాక్షాత్తు శ్రీస్వామియనే భావంతో పూజించుకున్నాడు. శ్రీస్వామి సమర్థులకు అసాధ్యమైనదేమున్నది?

## శ్రీస్వామి సమర్థాయ నమః

నీలెగాం అను గ్రామములో భావుసాహెబ్ అను జాగీర్దారు ఒకరు వుండేవారు. వారు శ్రీస్వామివారి యందు మిక్కుటమైన భక్తి కలిగినవారు. శ్రీస్వామి ఒకసారి వారి ఇంటికి వెళ్ళినారు. భావు సాహెబ్ శ్రీస్వామివారికి పాదపూజలు చేసెను. నుదుట తిలకముంచి అక్షింతలు దానికి అంటించెను. ఆ అక్షింతలు క్రింద రాలుచుండగా శ్రీస్వామి వాటిని తమ చేతిలో వుంచి భావుసాహెబ్ భార్య చేతిలో ప్రసాదముగా వుంచి మీకు సంతానము కలుగునని దీవించినారు (అప్పటివరకు వారికి బిడ్డలు లేరు). శ్రీస్వామి కృపతో ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు కలిగిరి. శ్రీస్వామి దర్శనార్థము ఒక దత్తజయంతినాడు భావుసాహెబ్ అక్కల్‌కోటకు వచ్చెను. శ్రీస్వామిని ప్రార్థించి "తమరు మరల నీలెగాం వచ్చి మా ఇంటిని పావనం చేయమని" కోరెను. శ్రీస్వామి ఆశీర్వదించి తప్పక నీ కోరిక నెరవేరుస్తానని అభయమిచ్చిరి.

కొలది మాసములకే శ్రీస్వామివారు మహాసమాధి పొందిరి. భావు సాహెబ్‌కు ఈ వార్త అందలేదు. శ్రీస్వామి సమాధి చెందిన 5వ దినమున ఒక వింత జరిగెను. నీలెగాం ఊళ్ళోకి శ్రీస్వామి సమర్థులు వచ్చినారని వార్త ఊరంతా

వ్యాపించెను. ఊరి వారందరు శ్రీస్వామి దర్శనము చేసుకొనుచుండగా భావు సాహెబ్‌కూడ వెళ్ళి దర్శనం చేసుకున్నాడు. శ్రీస్వామిని తమ ఇంటికి వచ్చి ఆతిథ్యము స్వీకరించమని వేడుకొన్నాడు. రేపు తప్పక వచ్చెదనని శ్రీస్వామి మాట యిచ్చిరి. మరుసటిరోజు శ్రీస్వామివారిని తీసుకొని వచ్చుటకై ఆ ప్రదేశమునకు భావు సాహెబ్ వెళ్ళినాడు. అచ్చట ఎవ్వరునూ లేరు. వెంటనే అక్కల్‌కోటకు ఒక వ్యక్తిని పంపెను. ఆ వ్యక్తి రాక పూర్వమే శ్రీస్వామివారు భావుసాహెబ్ ఇంటికి వచ్చిరి. ఆ సమయమున భావు సాహెబ్ భోజనమునకై కూర్చుండెను. శ్రీస్వామి వచ్చినది గమనించి అతను భోజనము నుండి లేచివచ్చి భక్తిపూర్వకముగా శ్రీస్వామివారిని లోనికి ఆహ్వానించి కూర్చుండబెట్టి వారి భోజనమునకు ఏర్పాట్లు చేయుచుండెను. అంతలో శ్రీస్వామి అంతర్ధానమైరి. శ్రీస్వామి సమర్థులు ఇంతలోనే ఎట్లు అదృశ్యమైనారని చింతించుచుండగా తాను అక్కల్‌కోటకు పంపిన వ్యక్తి తిరిగివచ్చి శ్రీస్వామి సమర్థులు మహాసమాధియై ఐదురోజులైనదని విన్నవించినాడు. భావు సాహెబ్ ఆ వార్తవిని నిశ్చేష్టుడైనాడు. ఆయనకు దుఃఖించాలో – సంతోషించాలో తెలియని పరిస్థితి ఏర్పడెను. శ్రీస్వామియొక్క భౌతికదర్శనము, స్పర్శ తనకు బాగా గుర్తున్నది. శ్రీస్వామి అక్కల్‌కోటలో అదృశ్యముగా వుండియే యున్నారని, వారు సర్వత్రా నిండి వున్నారని ఈ లీలవల్ల అందరికీ వెల్లడియైనది. శ్రీస్వామివారు భావు సాహెబ్ ఇంటికి వస్తానని ఇచ్చిన మాట తప్పలేదు. ఆయన సత్యసంధుడు, సత్య స్వరూపుడు, సత్యవ్రతుడు, సత్యసంకల్పుడు, సద్గురువులు ఎప్పుడూ మాటతప్పరు.

అదే సమయములో బీడ్కరు మహరాజ్ నర్మదానది ప్రదక్షిణ చేస్తూ వున్నారు. శ్రీస్వామి మహాసమాధి వార్త ఆయనకు అక్కడకు తెలిసినది. తీవ్రమైన దుఃఖము, శోకములకు లోనై తన ప్రదక్షిణ కార్యక్రమం విరమించి అక్కల్‌కోటకు చేరాలని నిశ్చయించుకున్నారు. కాని ఆ సమయంలోనే శ్రీస్వామి సమర్థులు బీడ్కరు మహారాజ్‌కు దర్శనమిచ్చి నేను సర్వత్రా వున్నాను. ఇప్పుడు నీ ప్రదక్షిణ విరమించకూడదు. నా ఆశీస్సులు, నర్మదామాత ఆశీస్సులు నీవెంట వున్నాయి. ముందుకు వెళ్ళి ప్రదక్షిణ పూర్తిచేయమని ఆదేశించారు. ఆ దర్శనంతో బీడ్కర్ మహరాజ్ పులకించిపోయినారు. శ్రీస్వామి ఆజ్ఞను శిరసావహించి ముందుకు సాగిపోయినారు.

శ్రీస్వామి సమర్థుల సూచనలవల్ల, శ్రీస్వామి పరమపదిస్తారని గ్రహించి కేశవ్‌నాయక్ అను భక్తుడు కంటతడిపెట్టి "శ్రీస్వామీ! మీరు వెళ్ళిపోతా నంటున్నారు. మీరు లేకుంటే మేము నీరెండిపోయిన చెరువులోని చేపలవలె



విలవిలలాడి బ్రతకలేము. ఇక మాకు దిక్కెవ్వరు. మా బాధలు ఎవరికి చెప్పుకొందుము. ఇంతకాలము నుండి మమ్ములను మార్జాల కిశోర న్యాయముగా రక్షిస్తూ వచ్చారు. మీ వియోగం మేము సహించలేము" అని పరిపరి విధముల ప్రార్థన చేశాడు. శ్రీస్వామివారు చిరునవ్వు నవ్వుచూ అతనికి తన పాదుకలను ప్రసాదించారు. ఆశీర్వదిస్తూ "నా అవతారం షిరిడిలో వున్నది. అక్కడకు వెళుతూ వుండు. నేను లేని కొరత నీకుండదు" అన్నారు. అతడు కొంతవరకూ శాంతించాడు. శ్రీస్వామి మహాసమాధి తర్వాత కొంతకాలానికి కేశవనాయక్ తన కుమారుని తీసుకొని షిరిడికి బయలుదేరినాడు. దారిలో ఇద్దరు బ్రాహ్మణులు షిరిడిలో వున్న సాయిబాబా ముస్లిం అనీ, తమవంటి పవిత్రులాయనను దర్శించకూడదనీ చెప్పిరి. అయిననూ కేశవనాయక్ తాను ఆయన దర్శనార్థం వెళ్ళుచున్నాననీ, తమ సద్గురువుయొక్క ఆదేశమే తమకు శిరోధార్యమని చెప్పెను. అప్పుడా కర్మిష్టులైన బ్రాహ్మణులుగూడ ఆ పిచ్చి ఫకీరునే చూచెదమని కేశవ్‌నాయక్ వెంట షిరిడీకి వచ్చిరి.

అందరూ మసీదువద్దకు చేరగనే శ్రీసాయి వారిని చూస్తూనే కేశవ్ నాయక్‌తో "నీవు, నీ కుమారుడు నా వద్దకు రావచ్చుగాని ఆ కర్మిష్టులైన బ్రాహ్మణులకు ప్రవేశం లేదు!" అనెను. ఆ మాట వింటూనే వారు ఆశ్చర్యంతో తమ భావాలను సాయిబాబా గుర్తించినారని తమ ఆక్షేపణ సత్యమైనదికాదని తెలిసికొనిరి. శ్రీసాయిబాబా నాయక్‌చేత కొన్ని వేపాకులు తెప్పించి వాటిని నలుగురికి పంచిరి. వాని రుచి ఎలా వున్నదో తిని చెప్పమన్నారు. కేశవ్ నాయక్‌న్నూ అతని కుమారుడునూ ఆ వేపాకులు తియ్యగా వున్నవనిరి. ఆ బ్రాహ్మణులిరువురు మాత్రం వేపాకులు చేదుగా వున్నవికావున తినలేమన్నారు. సద్గురు భక్తులకు దుఃఖభూయిష్టమైన ఈ సంసారం బాధాకరంగా వుండదని ఇందుమూలంగా నిరూపించినారు.

విద్యాసాగరా! ఆకారాలు వేరైనా సద్గురువుయొక్క సర్వవ్యాపకత్వమును గుర్తెరుంగవలెను. శ్రీస్వామి సమర్థులు వారి మహాసమాధి అనంతరము సమర్థుల రూపంగా ఎన్నో లీలలు ప్రకటిస్తూ వున్నప్పటికీ ఇంకా ఇతర సాధువుల రూపాలలో గూడా తామే యున్నామని నిరూపించినారు.

1878 తర్వాత గూడభాయి కృష్ణాజీ శ్రీస్వామి సమాధిపై ప్రతిష్ఠించబడిన సమర్థ పాదుకలను తరచుగా దర్శించుచుండేవాడు. ఒకసారి అతను అలా అక్కల్‌కోట బయలుదేరగా, ఆ ముందటి రాత్రి శ్రీస్వామి అతనికి స్వప్న దర్శనమిచ్చి "నేనిపుడు షిరిడీలో వున్నాను. నీవు అక్కడికి వచ్చి నన్ను సేవించుకో!" అన్నారు. అతడు శ్రీస్వామి ఆదేశానుసారం షిరిడి వెళ్ళి,



శ్రీసాయిబాబాను ఆరుమాసాలు సేవించాడు. తన అలవాటు ప్రకారం అక్కల్‌కోటలోని పాదుకలను దర్శించటానికి శ్రీసాయిని అనుమతి కోరగా ఆ సద్గురు సామ్రాట్ "ఇప్పుడక్కడెవరున్నారు? ఆయన యిప్పుడిక్కడే నా రూపంలో వున్నారు. అక్కడికి పోవటం దేనికి?" అన్నారు. భాయికృష్ణాజీ తనకు వచ్చిన స్వప్న సందేశం ధృవపడినదనీ, శ్రీస్వామి సమర్థులు శ్రీషిరిడి సాయిబాబా అభిన్నులనీ తెలుసుకుని ఎంతో ఆనందించినాడు.

తానే నివాసియైన బార్కర్ జబ్బుపడినాడు. ఆ సమయంలో ఒక స్నేహితుడు వచ్చి శ్రీసాయి పటాన్ని, విభూతిని ఇచ్చాడు. త్వరలో బార్కర్ స్వస్థుడైనాడు. కాని సాయివంటి ముస్లిం సాధువు పటాన్ని మహాత్ములైన అక్కల్‌కోట శ్రీస్వామి సమర్థుల చిత్రపటం ప్రక్కనే పూజలో వుంచుటకు యిష్టములేదు. కాని ఆరాత్రి స్వప్నంలో శ్రీసాయి అతనింటికి వస్తే సగౌరవంగా లోనికి ఆహ్వానించాడు ప్రక్కనే వున్న అతని మిత్రుడు "శ్రీసాయి – శ్రీ సమర్థులు వేరుకాదు!" అన్నాడు. మర్నాడు అతడు నిస్సంకోచంగా శ్రీసాయి పటాన్ని పూజలో పెట్టుకొన్నాడు.

బాపూసాహెబ్ జోగు శ్రీస్వామి సమర్థులను దర్శించి సేవించేవాడు. ఇతను శ్రీస్వామి సమాధి అనంతరం షిరిడి వెళ్ళి శ్రీసాయిని పూజిస్తుండేవాడు. ఇతను మసీదులో ప్రతిరోజూ శ్రీసాయికి హారతి యిచ్చేవాడు. సాటి భక్తులు శ్రీషిరిడిసాయి, శ్రీస్వామి సమర్థులు ఒక్కరేనని, వారిరువురూ రూపాలు వేరేగాని, ఒకే శ్రీదత్త అవతారం అని చెప్పుకోవటం విన్నాడు. తాను శ్రీస్వామి సమర్థులని, సాయిని యిద్దరినీ సేవించినవాడు కనుక ఒకరోజు తనకు శ్రీసాయి, శ్రీస్వామి సమర్థులుగా దర్శనమిస్తేగాని ఈరోజు హారతి యివ్వనని మొండి పంతంపట్టి కూర్చున్నాడు. నాటి హారతి సమయంలో జోగ్‌కు శ్రీసాయి స్థానంలో శ్రీస్వామి సమర్థులు కూర్చుని దర్శనమిచ్చినారు. అప్పుడు బాపూసాహెబ్ జోగు శ్రీసాయి, శ్రీస్వామి ఒక్కరేనని విశ్వసించి అమితానందపడినాడు. నాటినుండే శ్రీసాయి మహాసమాధి పర్యంతము మసీదులో జోగ్ హారతులు యిస్తూ సేవించాడు. ఇలాగే యింకెందరో శ్రీస్వామి సమర్థుల శిష్యులు, భక్తులు శ్రీ షిరిడి సాయిని దర్శించి, వారిలో శ్రీస్వామి సమర్థులను దర్శించి, సేవించినారు.

హరిశ్చంద్ర పితళే యనునతడు బొంబాయిలో వుండేవాడు. అతని కొడుకు మూర్ఛరోగముతో బాధపడుచుండెను. ఇంగ్లీషు మందులు, ఆయుర్వేద మందులు ఎన్నో వాడిరి. కాని జబ్బు కుదరలేదు. ఒకరోజు పితళే దాసగణు నామ సంకీర్తనమునకు వెళ్ళగా, అచ్చట శ్రీసాయిబాబాను గురించి దాసగణు కీర్తనలలో వినెను. శ్రీబాబా తన దృష్టిచేతను, తాకుటచేతను, ఊధీచేతను



బాగుకానట్టి దీర్ఘరోగములను సైతము నయము చేయునని తెలిసెను. సాయిబాబాను చూచుటకు నిశ్చయించుకుని, బహుమతులను, పండ్ల బుట్టలను తీసుకొని, భార్యాబిడ్డలతో కలసి షిరిడికి వెళ్ళెను. ద్వారకామాయి మసీదుకు వెళ్ళి, బాబాకు సాష్టాంగ వందనముచేసి, తన రోగిష్టి కొడుకును శ్రీసాయిబాబా పాదములపై పడవేసిరి. శ్రీసాయిబాబా ఆ పిల్లవానివైపు చూడగానే వింతగా కండ్లు గిర్రున త్రిప్పి, చైతన్యము దప్పి, నేలపైబడినాడు. నోట చొంగకారగా, చచ్చినవానివలె పడినాడు. అతని తల్లి అమితముగా బాధపడుచు, రోదించుచుండెను. అప్పుడు శ్రీసాయి "ఇటులేడ్వవలదు. కొంతసేపాగుము, ఓపికతో నుండుము. కుర్రవానిని బసకు తీసుకుపొమ్ము. అర్ధగంటలో వానికి చైతన్యము వచ్చున"నిరి. బాబా చెప్పినట్లు వారు బసకుపోగా, అర్ధగంటలో ఆ పిల్లవానికి చైతన్యము వచ్చినది. పితళే కుటుంబమంతయు ఎంతో ఆనందించిరి. తిరిగి ఆ బాలునికి మూర్ఛలు రాలేదు. ఆ సంతోషముతో వారు అందరికీ మిఠాయిలు పంచిరి. బాబా చిరునవ్వుతో "నీ యాలోచనలు, సంశయములు, భయోత్పాతములు, ఇప్పుడు చల్లబడినవా? ఎవరికైతే నమ్మకము, ఓపిక కలదో వారిని తప్పక భగవంతుడు రక్షించును" అనిరి.

పితళే దంపతులు కొలది రోజులుండి తిరిగి ఇంటికి పోవ నిశ్చయించుకొనిరి. శ్రీసాయిబాబా పితళేను దగ్గరకు పిలిచి "బాపూ అంతకుముందు రెండు రూపాయలిచ్చియుంటివి. ఇప్పుడు మూడు రూపాయలిచ్చుచున్నాను. వీనిని నీ పూజా మందిరములో పెట్టుకొని పూజించుకో! నీవు మేలు పొందెదవు" అనిరి. పితళే వానిని ప్రసాదముగా స్వీకరించి ఇంటికి చేరినాడు. కాని అతడు షిరిడి పోవుట అదే మొదటిసారి. బాబా తనకు ముందు రెండు రూపాయలిచ్చితినని చెప్పుటలోని అర్థము నతడు గ్రహింపలేక తన తల్లిని అడిగినాడు. ఆమె "నీవు యిప్పుడు నీ కుమారుని తీసుకుని షిరిడి వెళ్ళినట్లు, నీ తండ్రి నిన్ను చిన్నతనములో శ్రీ అక్కల్‌కోట మహారాజ్‌వారి దగ్గరకు తీసుకెళ్ళినాడు. ఆయన సిద్ధపురుషుడు, జ్ఞాని, పూర్ణయోగి, సర్వజ్ఞుడు, దయాళువు. నీ తండ్రి నిర్మల భక్తుడు కనుక ఆయన పూజను శ్రీస్వామి అంగీకరించి, నీ తండ్రికి రెండు రూపాయలిచ్చి మందిరములో పెట్టి పూజింపమనిరి. మీ తండ్రి వున్నంతవరకు పూజ జరిగినది. పిమ్మట అవి పోయినవి, వాటి సంగతి మరచితిమి. నీ అదృష్టవశమున శ్రీ అక్కల్‌కోట మహరాజ్ శ్రీసాయి రూపములో కనిపించి నీ కర్తవ్యమును జ్ఞప్తికి తెచ్చి, నీ కష్టములను తప్పింప చూచుచున్నారు. కావున నీ సంశయములను వీడి, దురాలోచనలను మాని, మీ తాత ముత్తాతల యాచారము ప్రకారము నడువుము. సత్ప్రవర్తనము నవలంభించుచు, కుటుంబ

దైవములను పూజింపుమనెను. యోగుల ఆశీర్వచనము దొరికినందుకు గర్వించుము అని చెప్పినది.

శ్రీదత్తస్వామి అవతారంగా ప్రసిద్ధిచెందిన శ్రీవాసుదేవానంద సరస్వతి స్వామి మన దేశమంతటా పర్యటించి, అనేక చాతుర్మాస్యాలు చేశారు. 1904లో వారు బ్రహ్మదత్తంలో తమ 14వ చాతుర్మాస్యం పూర్తిచేసి, మీరజ్‌మీదుగా పండరిపురం వెళుతూ, దారిలో కమలాపురం అనే గ్రామంలో విడిది చేశారు. ఆనాటి రాత్రి ఆయనకు స్వప్నంలో ఒక ఆజానుబాహువు దర్శనమిచ్చి "నీవు దేశమంతా పర్యటిస్తున్నావు, స్తోత్రాలు వ్రాస్తున్నావు. నన్ను గుర్తించలేకున్నావేమి?" అన్నారు. శ్రీ వాసుదేవానందులకు వెంటనే మెలకువరాగా, తనకు స్వప్నదర్శనమిచ్చిన దెవరో తెలియక, వారి వివరములు తెలుపుమని మరల శ్రీదత్తస్వామినే ప్రార్థించి నిద్రపోయినారు. ఈసారి కలలో దత్తమూర్తి దర్శనమిచ్చి "ఇంతకుముందు నీకు దర్శనమిచ్చినది అక్కల్‌కోట నివాసియైన శ్రీస్వామి సమర్థులు. నీవు వారిని దర్శించాలి. వారిని గురించి శ్లోకాలుకూడా వ్రాయాలి" అని అన్నారు. అప్పుడు వాసుదేవానందులు "నా వాక్కును మీ స్తోత్రానికే అంకితం చేశాను కదా! మీరు ఆజ్ఞాపిస్తే తప్ప వారినిగూర్చి వ్రాసేది ఎలా?" అన్నారు. శ్రీదత్తస్వామి చిరునవ్వుతో అదృశ్యమైనారు. అప్పుడు వాసుదేవానందులు పండరీపురం వెళ్ళకనే అక్కల్‌కోట వెళ్ళాలని నిశ్చయించుకుని బయలుదేరినాడు. కాని దారిలో వారిని అతిసారం బాధించింది. అయినా వారు అక్కల్‌కోట వెళ్ళి శ్రీస్వామి సమర్థుల సమాధిని దర్శించిన తరువాతనే గాణుగాపురం చేరారు.

***"శ్రీస్వామి సమర్థ జైజై స్వామి సమర్థ***
***శ్రీస్వామి సమర్థ జైజై స్వామి సమర్థ"***
***"ఓం సాయి శ్రీసాయి జయ జయ సాయి***
***ఓం సాయి శ్రీసాయి జయ జయ సాయి"***

*ఇది విద్యాసాగర - శ్రీ నిత్యానందయోగి సంవాద రూపమున*
*శ్రీ దత్తాత్రేయ సంప్రదాయ శిష్యపరంపరలోని*
***శ్రీశ్రీశ్రీ స్వామి విఠలానంద సరస్వతీ మహరాజ్*** *(శ్రీ విఠల్ బాబాజీ) విరచిత*
***శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము***
***యాభై మూడవ అధ్యాయము*** *సంపూర్ణము*





ఓం శ్రీ సాయిరాం

"ఓం గురుర్బ్రహ్మ - గురుర్విష్ణుః
గురుర్దేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ - తస్మై శ్రీ గురువేనమః"

# శ్రీ అక్కల్‌కోట స్వామి సమర్థ లీలామృతము

## యాభై నాలుగవ అధ్యాయము

**ఓస్వామి సమర్థా!**

నీవు సాక్షాత్తు దత్తాత్రేయ స్వరూపుడవు. సృష్టిలో వున్న జీవరాశికంతటికి నీవే మూలకారకుడవు. మాయామోహితులైన జీవులు నీ తత్త్వాన్ని గుర్తించలేరు. మహాయోగులు నిన్ను మహాపురుషునిగా గుర్తించి సేవిస్తారు. కర్మిష్టులు యజ్ఞ యాగాదుల ద్వారా, పూజల ద్వారా నిన్ను ఆరాధిస్తారు. జ్ఞానులు తాము చేసే సర్వకర్మలను నీయందే లయింపచేసి జ్ఞానస్వరూపుడవైన నిన్ను ధ్యానమార్గం ద్వారా ధ్యానిస్తారు. వివిధ సాంప్రదాయముల లోని శిష్యులు ఆయా సాంప్రదాయ గురుస్వరూపములను ధ్యానించినా, సర్వగురుస్వరూపుడవైన నీకే అవన్నీ చెందుతాయి.

తండ్రీ నీవు విశ్వవిరాట్పురుషుడవు, సర్వసాక్షివి. నీ లీలావిలాసం కోసం నీవే వివిధ రూపాలు ధరిస్తుంటావు. శ్రీదత్తుడవై అత్రి-అనసూయలకు జన్మించి అనుగ్రహించినది నీవే! ప్రహ్లాదునికి అవధూత తత్త్వాన్ని తెలిపిన అవధూతవు నీవే! కార్త వీర్యార్జునుని అనుగ్రహించి యోగశక్తిని ప్రసాదించిన యోగేశ్వరుడవు నీవే! అలర్కునకు జ్ఞానాన్ని ప్రసాదించిన జ్ఞానస్వరూపుడవు నీవే! బ్రహ్మకు వేదాలను స్ఫురింపజేసిన వేదస్వరూపుడవు నీవే! ఇంద్రునికి జంభాసురుని వలన కలిగిన ఆపదలను తొలగించిన ఆపద్బాంధవుడవు నీవే! భార్గవరామునికి త్రిపురా రహస్యమును బోధించిన త్రిశక్తి స్వరూపుడవు నీవే! విష్ణుదత్తునకు మంత్రోపదేశము చేసిన మంత్ర స్వరూపుడవు నీవే!

తిరిగి కలియుగంలో మానవులను రక్షించుటకై శ్రీపాద శ్రీవల్లభునిగ జన్మించినది నీవే! రజకునకు రాజ్యాన్ని ప్రసాదించిన యోగేశ్వర చక్రవర్తివి



నీవే! శ్రీ నరసింహ సరస్వతివై జన్మించి అంబను అనుగ్రహించినది నీవే! శ్రీ నరసింహ సరస్వతిగా అనేక చిత్రవిచిత్రమైన లీలలు చూపించి శ్రీగురుతత్వాన్ని ప్రబోధించిన సద్గురుమూర్తివి నీవే! దీనులను రక్షించిన దీనదయాళుడవు నీవే. ఆర్తులను కాపాడిన ఆర్తత్రాణ పరాయణుడవు నీవే. తిరిగి మమ్మలను అనుగ్రహించటానికి శ్రీస్వామి సమర్థుడవై అక్కల్‌కోటలో నివాసము చేసినావు. ఓ కరుణా స్వరూపా! నీకివే మా శతకోటి వందనములు అని చేతులు జోడించి ప్రార్థించి శ్రీస్వామి స్వరూపమును మననం చేస్తూ ధ్యానంలో నిమగ్నమైనారు.

సాధకులారా! ఆ గురుశిష్యులిద్దరూ విశ్వనిర్మాణకారకులైన శ్రీస్వామి సమర్థ విశ్వరూపాన్ని దర్శిస్తూ ఆనందపారవశ్యులై అప్పటివరకు తాము చెప్పుకున్న శ్రీస్వామి లీలామృతమును ఆద్యంతమూ దర్శింపసాగినారు. శ్రీ గురుదత్తస్వామి శ్రీపాద శ్రీవల్లభస్వామిగా అవతరించి కురువపురంలో కృష్ణానదిలో శరీరం విసర్జించి, శ్రీ నరసింహ సరస్వతిగా అనేక లీలలను చూపి గాణుగాపురంలో నిర్గుణపాదుకలను ప్రతిష్ఠించి శ్రీశైలంలోని పాతాళగంగద్వారా కదళిఫల వనముకు 1456వ సంవత్సరములో వెళ్ళినారు. వారే హిమాలయ పర్వతాలలో 300 సంవత్సరాలు తపస్సుచేసి, కట్టెలు కొట్టువానిచేత పొరపాటున గొడ్డలిదెబ్బ తగిలిన తరువాత తపస్సు నుండి లేచి, పర్యటన ప్రారంభించినారు. వీరు 1756వ సంవత్సరంలో బయలుదేరి రెండు సంవత్సరములు హిమాలయములలో పర్యటించి సాధకులకు, యోగులకు సాధనలో లోపాలను సరిచేసి, సమస్యలకు సమాధానములిచ్చి 1758వ సంవత్సరములో జనపదాలకు వచ్చినారు. పూరి, హరిద్వార్, ద్వారక, గిర్‌నార్, కంచి, అంబాజోగై మొదలైన క్షేత్రాలు పర్యటించి అక్కడి భక్తులను అనుగ్రహించిరి. హరిద్వార్‌లో గోహత్యచేసిన బ్రాహ్మణ పండాలను మందలించి, ఆ గోవును బ్రతికించి వారిలో పశ్చాత్తాపమును కలిగించిరి, పండరిలో భీమానదిపై నుండి నడచివెళ్ళి, అక్కడనుండి మంగళవేడా చేరిరి. మంగళవేడాలో బాలకృష్ణబువాను అనుగ్రహించిరి. కృష్ణాజిపంతు, గీతాబాయిల ఇంట్లో నాలుగు సంవత్సరములుగా కట్టని ఆవునకు పాలు ఇవ్వమని ఆదేశించి వారిని అనుగ్రహించినారు. బసప్ప తేలీ అను శ్రీస్వామి సేవకునికి, ఒక పామును తీసుకొమ్మనిరి. అది ఇంటికిపోయి చూడగా బంగారు కడ్డీగా మారి, అతని దారిద్ర్యబాధ తొలగినది. బాబాజీభట్ ఇంట్లో ఎండిపోయిన బావివద్ద మూత్ర విసర్జనచేసి, దానిలో మంచినీరు నిండునట్లు అనుగ్రహించిరి. ఒక అంధబాలునికి చూపునిచ్చిరి. సంతానములేని పేద దంపతులకు సంతానమును అనుగ్రహించిరి. జనాబాయి అను వృద్ధ భక్తురాలు పండరి యాత్రకు బయలుదేరి, దారిలో ప్రయాణించలేక ప్రార్థించగా



శ్రీస్వామి పాండురంగ విఠలునిగా దర్శనమిచ్చి అనుగ్రహించిరి. ఒకరోజున శ్రీ దత్తస్వామి, శ్రీపాదవల్లభులు యిద్దరు తేజోమయ రూపములో రాగా, ముగ్గురూ కలసి ఈ అవతార కార్యక్రమమును గురించి చర్చించుకొనిరి! యశ్వంత మహదేవ్ అను మమలతదారుడు, కరువుప్రాంత ప్రజలకు ధాన్యం పంచగా, రాజ దండన నుండి అతనిని రక్షించినారు. అంతేగాక యశ్వంత్‌కు పాదుకలు ప్రసాదించి అతనిని దేవ్‌మహరాజ్ అను మహాత్మునిగా రూపొందించి నాసిక్‌లో ప్రసిద్ధి చెందించినారు. సిద్ధేశ్వరం మందిరంవద్ద ఎండిపోయిన చెరువులో నీరు రప్పించి, ముకుంద బ్రహ్మచారిని అనుగ్రహించారు. మోహల్‌లో గణేశ్‌శోని లోని అధికార గర్వం తొలగించిరి. బ్రహ్మవిద్యను కోరిన సాలెవానికి తగురీతిలో బుద్ధిచెప్పిరి. షోలాపూర్‌లో ఒక స్త్రీకి శ్రీదత్తునిగా దర్శనమిచ్చారు. చింతోపంత్‌తోల్ అను భక్తుడు శ్రీస్వామిని చూసి మహాత్మునిగా గుర్తించి తన ఇంటికి ఆతిథ్యానికి ఆహ్వానించి, స్నేహితుల మాటపై శ్రీస్వామికి వేరుగా భోజనం పెట్ట సంకల్పించ వాని మనసులోని కల్మషమును పోగొట్టి వాని భిక్షను స్వీకరించిరి. మరియొకసారి ఆలస్యము చేసి భిక్ష స్వీకరించి కూడ వాని కుమారుడు దాజీబాపంతు ఆలస్యముగా ఆఫీసుకు వెళ్ళగా శ్రీస్వామి లీలవలన అతని సంతకం హాజరుపట్టీలో చేసివున్నది.

అక్కడినుండి అక్కల్‌కోట చేరినారు. మొదటిరోజున పశువుల కాపరుల యింట విందు స్వీకరించి, రెండవరోజున పాండురంగ పౌరాణిక్ ఇంట్లో భిక్ష స్వీకరించిరి. మూడవరోజున రాజ్‌పురోహిత ఇంటిలో భిక్షను స్వీకరించిరి. అదేరోజు మహమ్మద్ అలేఖాన్ ద్వారా చోళప్ప ఇంటికి చేరిరి. అదేరోజు సాయంత్రం అక్కల్‌కోట సంస్థానపు రాజు రాజామాలోజీరావును అనుగ్రహించి, అప్పటినుండి తరచుగా రాజభవనములో వుండసాగిరి. రాజామాలోజీరావు చోళప్పను శ్రీస్వామి సేవకునిగా అధికారికంగా నియమించిరి. శ్రీస్వామి చిన్న పుల్లలకు దారాలు కట్టి సైన్యం తయారు చేస్తున్నానంటూ ఆటలాడేవారు. చోళప్ప ఇంట్లో చిన్నపిల్లవానివలె అల్లరి చేష్టలు చేసి యశోబాయిని చాలా ఏడిపించేవారు. యాదవ్‌ను మరణం నుండి తప్పించిరి. రామన్నను పాముకాటు విషం నుండి కాపాడిరి. బాసల్‌గాం వెళ్ళి ఒక దర్జీవానిని దుష్టగ్రహపీడ నుండి విముక్తుని చేసినారు. ఒక అల్లరి కోతిని, ఏనుగును తమ చూపుతోనే సాధు జంతువులుగా మార్చిరి. శివుబాయి అను స్త్రీయొక్క అంధపుత్రుడు గణేశునకు చూపునిచ్చి వానిచే 5గురు బ్రాహ్మణ అహంకార పండితుల ప్రశ్నలను, వాటి జవాబులను చెప్పించి వారి గర్వమణచినారు. ఐరోపా దేశపు ఇంజనీరుకు సంతానం ప్రసాదించి, యూదు డాక్టరు అహంకారం తగ్గించి ఆశీర్వదించిరి.




బాబుసాహెబ్ అనువానిని తిట్టుట ద్వారా అతనిలో పరివర్తన తెచ్చిరి. బొంబాయికి చెందిన వ్యాపారికి గాణుగాపురంలోని దత్తపాదుకల అనుగ్రహంతో సంతానం కలిగిన పిదప దివాళాతీసి మరణించెను. అతని భార్యవద్ద అడిగి భోజనం పెట్టించుకుని 1000 మందికి భోజనం ముట్టినదని వారి మొక్కును చెల్లింపజేసిరి. యశోబాయిని ప్రసవ సమయంలో మరణ గండం నుండి తప్పించిరి. ఆమెను తేలుకాటు విషబాధ నుండి తొలగించిరి. పొలంలో కలబంద పొదలపై నడచి, చోళప్పను కూడా తమ అనుగ్రహముతో నడిపించిరి.

రాజామాలోజీరావు తమ పుట్టినరోజున సకల రాజలాంఛనాలతో రాగా, అతనిని చెంపదెబ్బ కొట్టి మందలించిరి. వారి పూజామందిరములో చచ్చిన ఎలుకను బ్రతికించిరి. సాంగ్లీ సంస్థానపు రాజు పాలకోవాలో వజ్రాలుపెట్టి బహూకరించగా, వాటిని కనిపెట్టి తిరస్కరించిరి. దాదాసాహెబ్ వించూర్కర్ నుండి వజ్రపు ఉంగరం స్వీకరించి అతని చర్మవ్యాధిని పోగొట్టిరి. ఆ ఉంగరం చోళప్పకు ప్రసాదించి అతని కుమారుని వివాహానికి, ఇంటి మరమ్మత్తులకు సాయంచేసిరి. వేణీమాధవ వైద్య ద్వారా హరివంశం చదువుమని బాపూసాహెబ్ ఘోర్పడేకు తెలిపి సంతానం అనుగ్రహించిరి. ఎక్కువగా పోట్లాడేవాని చేతిలో చీమనుపెట్టి హితబోధ చేసిరి. దొంగ సాధువును మాట్లాడకుండానే వింత భంగిమలతో మందలించిరి.

పట్టుపరుపు, బండరాయి ఒక్కటేనని అనుభవపూర్వకముగా పాండురంగ పౌరాణిక్‌కు తెలిపిరి. సుందరబాయి సేవలను స్వీకరించి ఆమెలోని ధనకాంక్షను, దురాశను నివారించక, ఆమెను తమ మహిమకు దిష్టిబొమ్మగా వుంచిరి. చోళప్పను తొలగించి, రాజు సుందరబాయి చాడీలను నమ్మి, ఆమెను శ్రీస్వామి సేవకు నియమించిరి. శ్రీస్వామి ఆ విషయం చోళప్పను హెచ్చరించినా అతను పట్టించుకోలేదు. చివరికి సుందరబాయి విషయము తెలిసి, ఆమెను శిక్షించి, బాలప్పను స్వామి సేవకు నియమించిరి. శ్రీస్వామి అనుమతి లేకుండా తీసిన ఫొటోలు రాలేదు. ఆయన అనుమతించిన పిదప తీసిన ఫొటోలు చక్కగా వచ్చాయి. శంకరరావురాజేను బ్రహ్మరాక్షసి బారినుండి రక్షించి, అతనిచేత రాజేరాయన్ మఠం నిర్మింపచేసిరి. అప్పాసాహెబ్ మాణిక్ కుమార్తె వివాహం ఖండేరావు గైక్వాడ్‌తో జరుగునట్లు ఆశీర్వదించిరి. మొరాబా కులకర్ణి భార్య రోగబాధను తట్టుకోలేక బావిలో దూకబోగా, భజరంగ్ అను భక్తుని పంపి ఆమెను కాపాడిరి. గోవిందశాస్త్రి అను పేద భక్తుడు ఆశ్రయించగా, ఆయన దొడ్లోని చెట్టుక్రింద నిధిని గురించి తెలిపి అతనిని కాపాడినారు. శ్రీదత్తునికి



మొక్కిన పాలకోవాను ఆ భక్తుని అడిగి తీసుకుని తామే దత్తుడని తెలిపినారు.

బరోడా మహారాజు మల్లారావు గైక్వాడ్ శ్రీస్వామిని బరోడా తీసుకెళ్ళడానికి తాత్యాసాహెబ్, యశ్వంతరావుల ద్వారా ఎన్ని ప్రయత్నాలు చేసినా అతనివద్ద భక్తిలేదని తిరస్కరించిరి. బాలప్ప సేవలను గైకొని, అతనిని సంపూర్ణంగా అనుగ్రహించి, బాలప్ప మహరాజ్‌గా మఠం ఏర్పాటు చేయించిరి. చింతోపంతుతోల్ తలపెట్టిన కోటి తులసిపూజలను స్వీకరించి, అతనికి పీటపై తమ పాదముద్రలు అనుగ్రహించిరి. బావడేకర్, శాస్త్రి సాంగత్యములో సందిగ్ధంలో పడగా అతనికి దర్శనమిచ్చి అనుగ్రహించిరి. రాధ అను వేశ్య పరీక్షింపరాగా ఆమె గర్వమణిచిరి. వర్షంలో పల్లకీ ప్రయాణంచేసి ఎంతో ఆనందించిరి. ఒక బజ్జీ మిగిలివున్నదని అడిగి తీసుకుని తృప్తిపడిరి. జానకీబాయి మడితో వండి తెచ్చిన భోజనం తిరస్కరించిరి. రామశాస్త్రి డొంగ్రేకు కార్తికస్వామిగా దర్శనమిచ్చిరి. శంఖేశ్వర పీఠాధిపతితో కలసి భోజనం చేసి తమ మహిమను చూపిరి. స్వర్ణయోగ సన్యాసి గర్వం పోగొట్టిరి. జోషి ఇంట్లోని సత్సంగంలో వచ్చే సందేహం నివృత్తిచేసిరి. రాజభవనంలో వుండి వచ్చిన భక్తులకు రాజభవనపు బాల్కనీ నుండి దర్శనమిచ్చేవారు.

సమీప గ్రామమైన వారసంగ్‌లో శివునికి శనగలు పెట్టి వర్షం కురిపించిరి. నామ సంకీర్తన చేస్తూ పర్యటనలో కొద్ది ఆహారం తాను స్వీకరించి, అన్నపూర్ణాదేవి ప్రసాదం అందరికీ ప్రసాదించిరి. చనిపోయిన బాలుని నేలపై విసిరికొట్టి బ్రతికించిరి. కొంకణి నుండి వచ్చిన సంతానంలేని దంపతులకు పూర్వజన్మ స్ఫురణకు తెచ్చి, సంతానం ప్రసాదించిరి. నలదుర్గంలో తహసీల్దారు మనసుమార్చి తమ భక్తునిగా స్వీకరించిరి. డాక్టర్ వామనగోపాల్ పంపిన దానిమ్మపండ్లు స్వీకరించినట్లు స్వప్న దర్శనమిచ్చిరి. శ్రీస్వామి మలం పూసుకోవటం ద్వారా ఒకనికి కుష్ఠువ్యాధిని నివారించిరి. శ్రీధర బ్రాహ్మణునికి శ్రీపురి వృక్షం జాడతెలిపి అతని రోగం తగ్గించిరి. గోవిందజీ, మాధవజీ సమర్పించిన గారెలు, పాయసం, ఫకీరుకు సమర్పించమని, భుక్తశేషం అతనికిచ్చి అనుగ్రహించిరి. వంటవాడు కానోజీకి పదివేల రూపాయలు లభ్యమగునట్లు దీవించిరి. ఒక బీద బ్రాహ్మణునికి ఎముకలు ఏరుకోమని, తద్వారా బంగారం ప్రసాదించిరి. ఒక ఎముకను సంతానార్థియైన బ్రాహ్మణ స్త్రీ స్వీకరించుటకు వెనుకాడగా, కడజాతి స్త్రీ స్వీకరించి సంతానం పొందినది. నందరామ్ సుందరజీ వ్యాధిని ఊదీతోనే తొలగించిరి. ఆయనకు శివాలయంలోని శివలింగంలోనూ, బయట శ్రీస్వామి దర్శనమిచ్చిరి.

శ్రీ నరసింహ సరస్వతి స్వామిని శక్తిపాతం ద్వారా ఆశీర్వదించి, అతనిని




అళందికి పంపిరి. పిమ్మట వాని సిద్ధుల ప్రదర్శనను నిలిపివేసి ఒక గొప్ప మహాత్మునిగా తీర్చిదిద్దినారు. ఆయనను తమంతటివానిగా చేసిరి. శ్రీ రామానంద బీడ్కర్‌కున్న ధనకాంక్ష, స్త్రీ వ్యామోహములను తొలగించి అతనిని బీడ్కర్ మహరాజ్‌గా ఖ్యాతికెక్కించిరి. అతని నుండి గురుదక్షిణగా స్వర్ణయోగ విద్యను ఆపివేయించిరి. అతనిచేత నర్మద ప్రదక్షిణము చేయించిరి. లక్ష్మణ్ అను జాలరి సముద్రములో ఒక తుఫాను తాకిడి నుండి రక్షించి, అతనిని ఆశీర్వదించి, శ్రీ ఆనందభారతి అను మహాత్మునిగా తీర్చిదిద్దిరి. సవతితల్లి పెట్టు బాధలను తట్టుకోలేక ఇల్లువిడిచి వచ్చిన సీతారామ్‌ను చక్కటి యోగిగా తయారుచేసి శ్రీ సీతారామ్ మహరాజ్‌గా ప్రసిద్ధి పొందించిరి. ఈయన మంగళవేడాలో నలభై సంవత్సరములుండి, పండరి సమీపంలోని కరడి గ్రామములో సిద్ధి పొందిరి. శివరామ బావడేకర్ అను విశ్వబ్రాహ్మణ బాలుని యోగిగా తయారుచేసి రంగోలీ మహరాజ్ అని పేరిడినారు. ఈ రంగోలీ మహరాజు కుంభార గల్లీలోని కుంభారస్వామిని సేవించి గొప్ప మహాత్ముడైనాడు. జమాదార్ అను జైలర్‌కు జైలు నుండి తప్పిపోయిన ఖైదీని దొరికించి కాపాడినారు. చివరికి జమాదర్‌ను అనుగ్రహించి, తమ పాదుకలు ప్రసాదించినారు. ఆయన యోగ సాధనతో మైకేదర్గా యోగిగా ప్రసిద్ధి పొందినారు. ఆ పాదుకలు దర్శించిన వారికి నేటికీ తమ కోర్కెలు నెరవేరుట శ్రీస్వామివారి లీలయే.

ఒక కుటుంబంలోని వారందరు పిచ్చివారై చనిపోగా మిగిలిన ఒక్కడూ శ్రీస్వామి హస్తమస్తక సంయోగము ద్వారా గొప్ప మహాత్మునిగా రూపుదాల్చినారు. ఆయన వింతయోగిగా ప్రసిద్ధి పొందినారు. ఆయన నోటివెంట వచ్చిన మాటలు జరిగితీరేవి. ఠాకూర్‌దాస్‌కు పుత్రసంతానం అనుగ్రహించి, తమ పాదుకలు యిచ్చి శ్రీ రఘునాథ మందిరంలో ప్రతిష్ఠింపజేసిరి. ఆ పాదుకలు సేవించినవారికి శ్రీస్వామివారి సన్నిధి అనుభవమగుచున్నది. ఒక దంపతులకు శ్రీదత్తాత్రేయ స్వామి తానే వారికి పుత్రునిగా జన్మిస్తానని స్వప్నంలో చెప్పిరి. ఆ బిడ్డను తీసుకుని తల్లిదండ్రులు శ్రీస్వామిని దర్శించగా, శ్రీస్వామి అతనికి దీక్షనిచ్చి శ్రీకృష్ణ సరస్వతి అని పేరుపెట్టి, గొప్ప మహాత్మునిగా రూపొందించినారు. ఈయనకు శ్రీస్వామి సమర్థులకు భేదంలేదని భక్తుల విశ్వాసం. రామచంద్ర కేల్కర్ అను రైల్వే ఉద్యోగికి కడుపునొప్పి తగ్గించి, ఆశీర్వదించి ఒక యోగిగా తయారుచేసినారు. ఆయనకు ప్రీతినందస్వామి కుమార్ అని పేరుపెట్టినారు. నాథసంప్రదాయానకి చెందిన శ్రీ సంపూర్ణానంద సరస్వతీ శ్రీస్వామి సమర్థుల ఫొటోను ఎప్పుడూ తమ యెదుట పెట్టుకునేవారు. ఆళంది నుండి వచ్చిన



శ్రీ సత్యదేవానంద సరస్వతి స్వామిని పావాస్‌లోనున్న శ్రీ స్వరూపానంద పరమహంస దర్శనానికి పంపిరి.

ఆనందనాథ్ అను ఆయుర్వేద మందుల వ్యాపారికి, దారిలోనే మర్రిచెట్టుపై దర్శనమిచ్చిరి. అతనికి సంపూర్ణ విశ్వాసం ఏర్పరచి, అతని ఆనందనాథ్ మహరాజ్ అనే పేరిట వినుతికెక్కించినారు. అతను యవలా, హోడవాడే, ధావడే అనుచోట్ల మఠనిర్మాణములు గావించి, శ్రీస్వామి పాదుకలు ప్రతిష్ఠించి, సేవించినారు. రామచంద్ర వెంకటేశ బరాడ్కర్ అను శివభక్తుడైన (మూలికలు, ఔషధాల) వ్యాపారికి స్వప్న దర్శనమిచ్చి అక్కల్‌కోట రమ్మని చెప్పినారు. అతనికి త్రిమూర్తుల దర్శనమును గ్రహించి, సమాధి స్థితిని ప్రసాదించిరి. యోగసాధన చేసి ఆయన శ్రీ తాతా మహరాజ్‌గా పేరుపొంది ఎందరో భక్తులను అనుగ్రహించిరి. చిన్నతనంలోనే ఆధ్యాత్మిక చింతనలో భార్యను, ఇంటిని వదలి అక్కల్‌కోట చేరిన గొండవాలేకర్‌కు శక్తిప్రసారం చేసి ఆశీర్వదించినారు. శ్రీ తుకారాం చైతన్య సద్గురువుకు శిష్యునిగా చేసి గోండవాలేకర్ మహరాజ్‌గా రూపొందించినారు. మోరేశ్వరరావు జోషి అను పురాణ పండితునికి దర్శనమిచ్చి రెండు జతల పాదుకలు ప్రసాదించిరి. జోషి ఆ పాదుకలను సేవించి చాలాకాలం హరి సంకీర్తనలతో మంచి సాధకుడై, యోగియై శ్రీ మయూరానంద సరస్వతి అను పేర ఖ్యాతి గావించినారు. పింగళ పక్షిభాష తెలిసిన పండితుడు నానారేఖేజోషి శ్రీస్వామి జాతకచక్రం వేసినాడు. అతనికి తన ఆత్మస్వరూప పాదుకలు ప్రసాదించి, అహమ్మద్‌నగర్‌లోని మఠంలో ప్రతిష్ఠింప చేసిరి. ఆ పాదుకలు సేవించి ఎందరో తరించినారు. పండరిపురంలోని విష్ణునారాయణ అనే మహాత్ముని అందరూ పిచ్చివానిగా తలచి ఆసుపత్రిలో చేర్చగా, వామనబువా అతనిని విడిపించిరి. అతనిని శ్రీ అవధూత కాలబువ అని అందరూ పిలిచేవారు. శ్రీ వామన వైద్యకు నదిపై నడచివచ్చి దర్శనభాగ్యం కలిగించిరి. అతనికి సప్తశృంగిలో అమ్మవారి తాంబూలం యిప్పించి, పండరిలో గంగా జలముల అభిషేకం స్వీకరించిరి. అతనిని ఆత్మహత్యా ప్రయత్నం నుండి ఆపి, రోగబాధ తగ్గించినారు. శ్రీ వామనబువా శ్రీస్వామివారి లీలలెన్నో ప్రత్యక్షంగా చూసి, భక్తుల నుండి సేకరించి, శ్రీస్వామి చరిత్రను 'శ్రీగురు లీలామృతమ'ను పేర మరాఠీలో రచించినాడు.

హరిభావును కుమారా అని పిలచి, ఒక యోగిగా మార్చిరి. హరిభావు తన సర్వస్వమును దానధర్మములు చేసి, అతి చిన్నవయసులోనే సన్యసించి, తన భార్యనుగూడ ఆధ్యాత్మిక చింతనలోనే ఉంచగలిగినాడు, ఈయనను అంతా

శ్రీస్వామిసుత అని పిలిచేవారు. శ్రీస్వామి సుత సమాధి అనంతరం అతని తమ్ముడు బాబు (దాదా)ను మఠాధిపతిగా స్వయంగా శ్రీస్వామి సమర్థులే అభిషేకించిరి. దాదా శ్రీసచ్చిదానందస్వామి కుమార్‌గా గొప్ప మహాత్ముడైనాడు. ఈయన అనంతరం శ్రీస్వామిసుత కూతురు సిద్ధాబాయిని శ్రీస్వామి ఆదేశానుసారం కామాటిపురంలోని మఠాన్ని చెంబూరుకు మార్చి, ఆ బాధ్యతలు చక్కగా నిర్వహించినది. ఆమె గొప్ప యోగినిగా పేరుపొందినది.

చోళప్ప శ్రీస్వామిపైగల భక్తివలన తన ఇల్లు శ్రీస్వామి సమాధి మందిరంగా వుంటే బాగుండునని, తన ఇంటిలో ఒక గోతిని త్రవ్వినాడు. శ్రీస్వామి చోళప్పను ముందు నిన్నే ఆ గోతిలో పెడతాననిరి. అట్లే చోళప్ప ముందు సమాధియైనారు. అప్పుడు శ్రీస్వామి ఎంతో వ్యధచెందిరి. శ్రీస్వామి తన నిర్యాణం గురించి ముందే భక్తులకు సూచనల ద్వారా తెలిపిరి. శ్రీస్వామి సమాధి పొందినపుడు రాజామాలోజీరావు సకల రాజ లాంఛనాలతో శ్రీస్వామిని ఊరేగించి, చోళప్ప ఇంటి ఆవరణలోనే సమాధి నిర్మించిరి. శ్రీస్వామి సమాధి అనంతరంగూడ బాలప్పకు, నీలోగాంలోను యింకా అనేమంది భక్తులకు ప్రత్యక్ష దర్శనమనుగ్రహించి, తాము నిత్య సజీవులమనీ, తమకు మరణంలేదనీ, తనను భక్తులు ఎప్పుడు, ఎక్కడ పిలిస్తే అప్పుడు పలుకుతామనీ తామిచ్చిన వాగ్దానాలు నిరూపించిరి. కొందరు భక్తులకు స్వప్నదర్శనమిచ్చి తన అవతారం యిప్పుడు షిరిడీలో శ్రీసాయిబాబా రూపంలో కలదని, తాము సకల సాధు స్వరూపులమని నిర్దేశించిరి. ఈ విధంగా శ్రీనిత్యానందయోగి, విద్యాసాగరు లిరువురూ సంపూర్ణ దర్శనము చేసుకుని యిరువురూ కలిసి శ్రీస్వామి సమాధి మందిరమునకేగి వారిని ప్రార్థించి, వటవృక్ష స్వామి మహరాజ్ మందిరమునకు చేరుకొని, వారిని మనసారా ప్రార్థించి, హే సద్గురుమౌళీ! మీ కృపాకటాక్షము వలన అనంతములైన మీ లీలలను తెలుసుకున్నాము. మీ లీలలను పరస్పరం చెప్పుకొనువారికి, గానం చేయువారికి నిరంతరం స్మరించువారికి నీవు సత్ఫలితముల ప్రసాదించి వారినందరిని అనంతమైన నీ కరుణతో అనుగ్రహించుము. మాకు సదా నీయందు బుద్ధిని నిల్పుము అని ప్రార్థించి ఇరువురును తమ స్థానములకు వెళ్ళి, సాధనలో నిమగ్నులైరి. విద్యాసాగరుడు అనంతరం గొప్ప యోగిగా మారినాడు.

***జై సమర్థ సద్గురు అక్కల్‌కోట స్వామి మహరాజ్‌కీ జై!***

 

